# మనవి



భారతీయ సనాతన ధర్మ మహాసౌధానికి మూలస్థంభాలు మూడు. అవి ప్రస్థాన త్రయంగా పేర్కొనే ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలు, భగవద్గీత. అందుకనే త్రిమతాచార్యులు ఈ మూడింటిపై తమ వ్యాఖ్యలను అందించారు. ఇంకా అనేకులైన పండిత ప్రకాండులు, యతివరేణ్యులు, బుధజనులు ఈ మూలగ్రంథాలపై వ్యాఖ్యానించి వాటి అవగాహనను సులభతరం చేయటమే కాక ఆర్షధర్మాన్ని ఇంకా సుసంపన్నం చేశారు. నిగూఢం, దురధిగమం, గహనం, గభీరమైన విషయాలను సూత్రరూపంలో వ్యక్తంచేయటం భారతీయ సంప్రదాయంలోనే ఉంది. అంటే వీటిని ఈ విధంగా వ్యక్తంచేసి వాటిని సామాన్యులు అర్థంచేసుకోకుండా ఉండాలన్నది వారి ఉద్దేశ్యం కాదు. విషయం సూక్ష్మమైనది కావున నిశిత బుద్ధికలిగిన వారే వీటిని అర్థంచేసుకోవడానికి అర్హులని తెలియజేయడం వారి అభిమతం. అలా ధీశక్తిని వికసింపజేసుకొన్న వారికి సూత్రాలలోని అంతరార్థం చక్కగా అవగతమవుతుంది. అలా కాకుండా మహోన్నత సత్యాలను సూత్రరూపంలోనో, శ్లోకరూపంలోనో కాక పైపై భాషలో వ్యక్తంచేసిన మానసిక పవిత్రతలేని వారందరూ చదివి అర్థంచేసుకోకుండా అపహాస్యం చేసిన పుస్తకంలోని విషయం పరబ్రహ్మం కావునా ఆ దైవనింద దోషము కృతికర్తకు కూడా అంటుకునే ప్రమాదం ఉన్నదని గ్రహించి వేదవ్యాస మహర్షి స్థూలబుద్ధికి దుస్తరమైన విషయాన్ని ఈ విధంగా సూత్రీకరించి ఉండవచ్చును. ఐననూ రానున్నది కలియుగమని గ్రహించి అధిక సంఖ్యాకులు మందబుద్ధులుగా ఉంటారని తెలిసి విష్ణురూపుడైన మహర్షి ఇతిహాస

పురాణాల ద్వారా ఆ సత్యాలను మళ్లీ పునః ఆవిష్కరించారు. వాటిలోని కథలలో, పాత్రలలో అంతర్లీనంగా ఉన్న వేదాంత సత్యాలన్నీ బ్రహ్మసూత్రాలు, ఉపనిషత్తులోనివే. మహాభారత అంతర్భాగమైన భగవద్గీతలో ఈ విజ్ఞానమంతా సామాన్యజనులకు కూడా అర్థమయ్యేరీతిలో తేటతెల్లం చేయబడింది. కానీ ఆ జ్ఞానానికి మూలగ్రంథాలు ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రాలే.

నిజానికి ప్రస్థానత్రయాన్ని భాష్యంతో సహా అనుభవజ్ఞుడైన గురువు దగ్గర అభ్యసించిన గాని వేదాంత జ్ఞానము పరిపూర్ణము కాదు. మూడింటిలోనూ చర్చించిన విషయం బ్రహ్మవస్తువు ఐనప్పటికీ భగవద్గీతను ఉపనిషత్తుల కన్నా, ఉపనిషత్తులను బ్రహ్మసూత్రాల కన్నా తేలికగా అభ్యసింప వచ్చును. అంటే బ్రహ్మసూత్రాలు మూడింటిలోకీ దురవగాహము. సూత్రమంటే అల్పాక్షరం, అసందిగ్ధం, సారభూతం... అని నిర్వచనం. అంటే ఈ బ్రహ్మసూత్రాలలో వ్యక్తంచేయబడిన వేదాంత జ్ఞానం నిబిడము, నీరంధ్రమూ, మేదురమూ అనమాట. 555 సూత్రాలుగల ఈ వేదాంతజ్ఞాన రాశి 'అథాతో బ్రహ్మజిజ్ఞాసా' యను సూత్రముతో ప్రారంభించి 'అనావృత్తిః శబ్దాదనావృత్తిః శబ్దాత్' అను సూత్రముతో అంతమవుతుంది. వేదవ్యాస మహర్షి అనేక దృష్టాంతాలతో, ఉపాఖ్యానాలతో బ్రహ్మపదార్థమ యొక్క స్వరూప, స్వభావ, విస్తృతులను మనకు తెలియబరుస్తారు. ఈ గ్రంథంపై ఇప్పటివరకూ రచింపబడిన భాష్యలన్నింటిలోకీ శ్రీ శంకర భగవత్పాదుల అద్వైత ప్రతిపాదికమైన భాష్యం ప్రామాణికమైనదని తత్త్వశాస్త్ర కోవిదుల, విద్వజ్జనుల, వరిష్ఠ యతుల అభిప్రాయము.

ఈ పుస్తకాన్ని తెలుగులో రచించిన శ్రీ శ్యామశాస్త్రి తమ వ్యాఖ్యానంలో శంకరుల భాష్యంనే ప్రధానంగా చేసికొన్నారు. వారు తాము అర్థంచేసికొని తమకు కలిగిన అవగాహనను ఇతరులతో పంచుకోవాలన్న తపనతో ఈ పుస్తకాన్ని రచించారు. ఒక సామాన్య పాఠకుడు కూడా శ్రద్ధాళువు అయివుండి

భక్తితో ఈ గ్రంథాన్ని పఠిస్తే తప్పక గ్రంథంలోని విషయాన్ని అర్థంచేసికొనగలడు అనుటలో కించిత్ అతిశయోక్తి లేదు. అలా కొద్దిపాటి ప్రయత్నంతో విషయాన్ని అర్థంచేసికొని ప్రయోజనాన్ని పొందాలని మా ఆకాంక్ష, అభిమతమూనూ. ఈ గ్రంథం పండితులకు ఉద్దేశింపబడింది కాదు. ఎంతోమంది సామాన్య పాఠకులు బ్రహ్మసూత్రాలను గురువు ముఖతః చదివి అర్థం చేసుకోవాలని ఉవ్విళ్ళూరుతున్నారు. అలా కోరుకునే వారందరికీ సద్గురువు చరణాల వద్ద విద్యనభ్యసించే అవకాశం రాదు కాబట్టి వారికి ఈ పుస్తకం ఒక కరదీపికగా ఉపయక్తమవగలదని భావించి ముద్రణకు గ్రహించటం జరిగింది. నిజానికి మాకు ఆంగ్లంలో శంకరుల భాష్యకు యథాతథ అనువాదాన్ని సమకూర్చిన రామకృష్ణ మఠ పదకొండవ సర్వాధ్యక్షులు స్వామి గంభీరానందజీ పుస్తకాన్ని (అద్వైతాశ్రమ ప్రచురణ) అనువదించి ప్రచురించాలన్న సంకల్పం ఉండేది. ఐతే ఆంగ్లంలో నుంచి తెలుగులోకి అనువదించడం వలన విషయం ఇంకా జఠిలమయ్యే అవకాశం ఉన్నదని ఆ ప్రయత్నం నుంచి విరమించి సంస్కృతం నుంచి తెలుగులోకి అనుసృజన చేయబడ్డ ఈ కృతిని మీ ముందుంచుచున్నాము. కాలానుగుణంగా భాషలో వస్తున్న మార్పులను గమనించి అత్యంత సరళభాషలో ఆధునిక పాఠకుడికి అర్థమయ్యేరీతిలో గ్రంథాన్ని అనుసృజన చేశారు శ్రీ శ్యామశాస్త్రి గారు. వారి కృషిని అభినందించే సంకల్పమే మీచేతులో ఉన్న పుస్తకంగా రూపుదిద్దుకున్నది. పుస్తకాన్ని వెలువరించటంలో వివిధ దశలలో, వివిధ రకాలుగా మాకు సహకరించిన, బ్ర.హేమంత్ కుమార్ కు, బ్ర.సూర్యభాస్కర్‌కు, శ్రీశ్రీ వాస్తవ గార్కి మా కృతజ్ఞతలు. ఈ పుస్తకం జిజ్ఞాసువులకు, ముముక్షుమార్గాభిలాషులకు, కైవల్యానురక్తులకు, నిర్వాణసౌఖ్యాభిలాషులకు నిత్యోపకారిగా భాసించగలదని భావిస్తూ, మీ ఆదరాభిమానాలను కాంక్షిస్తున్నాం.

**——ప్రకాశకులు**

# బ్రహ్మసూత్రములు పఠించేముందు చదివే శాంతి మంత్రములు



ఓం శం నో మిత్రః శం వరుణః. శం నో భవత్వర్యమా. శం న ఇంద్రో బృహస్పతిః. శం నో విష్ణురురుక్రమః. నమో బ్రహ్మణే. నమస్తే వాయో. త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి. త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి. ఋతం వదిష్యామి. సత్యం వదిష్యామి. తన్మామవతు. తద్వక్తారమవతు. అవతుమామ్. అవతు వక్తారమ్. ఓం శాంతిః శాంతిః శాంతిః ॥

సహ నావవతు, సహ నౌ భునక్తు, సహ వీర్యం కరవావహై, తేజస్వి నావధీతమస్తు, మా విద్విషావహై. ఓం శాంతిః శాంతిః శాంతిః ॥

యశ్ఛందసామృషభో విశ్వరూపః. ఛందోభ్యో-ధ్యమృతాత్సంబభూవ. స మేంద్రో మేధయా స్పృణోతు. అమృతస్య దేవధారణో భూయాసమ్. శరీరం మే విచర్షణమ్. జిహ్వా మే మధుమత్తమా. కర్ణాభ్యాం భూరి విశ్రువమ్. బ్రహ్మణః కోశో-సి మేధయా పిహితః. శ్రుతం మే గోపాయ. ఓం శాంతిః శాంతిః శాంతిః ॥

అహం వృక్షస్యరేరివా. కీర్తిః పృష్ఠం గిరేరివ. ఊర్ధ్వ పవిత్రో వాజినీవ స్వమృత మస్మి. ద్రవిణగ్ం సవర్చసమ్. సుమేధా అమృతో-క్షితః. ఇతి త్రిశంకోర్వేదాను వచనమ్. ఓం శాంతిః శాంతిః శాంతిః ॥

ఓం భద్రం కర్ణేభిః శృణుయామ దేవాః. భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః. స్థిరైరంగై స్తుష్టువాగ్ంసస్తనూభిః. వ్యశేమ దేవహితం యదాయుః. స్వస్తి న ఇంద్రో వృద్ధశ్రవాః. స్వస్తి నః పూషా విశ్వవేదాః. స్వస్తినస్తార్క్ష్యోఅరిష్టనేమిః. స్వస్తి నో బృహస్పతిర్దధాతు. ఓం శాంతిః శాంతిః శాంతిః ॥

ఓం పూర్ణ మదః పూర్ణమిదం పూర్ణాత్పూర్ణముదచ్యతే. పూర్ణస్య పూర్ణ మాదాయ పూర్ణమేవావశిష్యతే. ఓం శాంతిః శాంతిః శాంతిః ॥

ఓం ఆప్యాయంతు మమాంగాని వాక్ప్రాణశ్చక్షుః శ్రోత్రమథో బలమింద్రియాణి చ సర్వాణి. సర్వం బ్రహ్మౌపనిషదం మాహం బ్రహ్మనిరాకుర్యామ్ మా మా బ్రహ్మ నిరాకరోత్ అనిరాకరణమస్తు అనిరాకరణం మే–స్తు. తదాత్మని నిరతే య ఉపనిషత్సు ధర్మాస్తే మయి సంతు తే మయి సంతు. ఓం శాంతిః శాంతిః శాంతిః ॥

ఓం వాఙ్మే మనసి ప్రతిష్ఠితా మనోమేవాచి ప్రతిష్ఠితమ్. ఆవిరావీర్మ ఏధి. వేదస్య మ ఆణీస్థః శ్రుతం మే మా ప్రహాసీః అనేనాధితేన అహోరాత్రాన్ సంధథామి. ఋతం వదిష్యామి. సత్యం వదిష్యామి తన్మామవతు. తద్వక్తార మవతు. అవతు మామ్. అవతు వక్తారమ్. ఓం శాంతిః శాంతిః శాంతిః ॥

ఓం భద్రం నో–పి వాతయ మనః. ఓం శాంతిః శాంతిః శాంతిః ॥

యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై, తగ్ం హ దేవమాత్మబుద్ధిప్రకాశం, ముముక్షుర్వై శరణ మహం ప్రపద్యే. ఓం శాంతిః శాంతిః శాంతిః ॥

ఓం నమో బ్రహ్మాదిభ్యో బ్రహ్మవిద్యాసంప్రదాయకర్తృభ్యో వంశఋషిభ్యః పరమ ఋషిభ్యో మహద్భ్యో గురుభ్యః ॥ సర్వోపప్లవ రహితః ప్రజ్ఞానఘనః ప్రత్యగర్థో బ్రహ్మైవాహమస్మి. బ్రహ్మైవాహమస్మి. అధీహి భో భగవః ॥

నారాయణం పద్మభువం వసిష్ఠం శక్తిం చ తత్పుత్ర పరాశరం చ । వ్యాసం శుకం గౌడపదం మహాంతం గోవిందయోగీంద్ర మథాస్య శిష్యమ్ ॥

శ్రీ శంకరాచార్య మథాస్య పద్మపాదం చ హస్తామలకం చ శిష్యమ్ । తం త్రోటకం వార్తికకారం అన్యానస్మద్గురూన్ సంతతమానతోఽస్మి ॥

శ్రుతిస్మృతిపురాణానామాలయం కరుణాలయమ్ ।
నమామి భగవత్పాదం శంకరం లోకశంకరమ్ ॥

యదవిద్యావిలాసేన భూతభౌతికసృష్టయః ।
తం నౌమి పరమాత్మానం సచ్చిదానందవిగ్రహమ్ ॥

శంకరం శంకరాచార్యం కేశవం బాదరాయణమ్ ।

సూత్రభాష్యకృతౌ వందే భగవంతౌ పునః పునః ॥

ఈశ్వరో గురురాత్మేతి మూర్తిభేదవిభాగినే ।
వ్యోమవద్వ్యాప్తదేహాయ దక్షిణామూర్తయే నమః ॥

ఈ శాంతి మంత్రములతో పాటు, శ్రీ దక్షిణామూర్తి స్తోత్రములో మొదటి ఐదు శ్లోకములు పాఠారంభములోను, మిగతా ఐదు (6 నుండి 10) పాఠాంతరములోను చదవటం సంప్రదాయము.

# శ్రీ దక్షిణామూర్తి స్తోత్రము



ఓం. మౌనవ్యాఖ్యా ప్రకటిత పరబ్రహ్మతత్త్వం యువానం
వర్షిష్ఠాంతేవసదృషి గణైరావృతం బ్రహ్మనిష్ఠైః ।
ఆచార్యేంద్రం కరకలిత చిన్ముద్రమానందమూర్తిం
స్వాత్మారామం ముదిత వదనం దక్షిణామూర్తి మీడే ॥

1. విశ్వం దర్పణదృశ్యమాననగరీతుల్యం నిజాంతర్గతం
పశ్యన్నాత్మని మాయయా బహిరివోద్భూతం యథా నిద్రయా ।
యస్సాక్షాత్కురుతే ప్రబోధ సమయే స్వాత్మానమేవాద్వయం
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥

2. బీజస్యాంతరివాంకురో జగదిదం ప్రాఙ్నిర్వికల్పం పునః
మాయాకల్పిత దేశకాలకలనావైచిత్ర్య చిత్రీకృతమ్ ।
మాయావీవ విజృంభయత్యపి మహాయోగీవ యః స్వేచ్ఛయా
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥

3. యస్యైవ స్ఫురణం సదాత్మకమసత్కల్పార్థగం భాసతే
సాక్షాత్ తత్త్వమసీతి వేదవచసా యో బోధయత్యాశ్రితాన్ ।
యస్సాక్షాత్కరణాద్భవేన్న పునరావృత్తిః భవాంభోనిధౌ
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥

4. నానా ఛిద్రఘటోదరస్థిత మహాదీపప్రభాభాస్వరం
జ్ఞానం యస్యతు చక్షురాదికరణ ద్వారా బహిః స్పందతే ।
జనామీతి తమేవ భాంత మనుభాత్యేతత్ సమస్తం జగత్

తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥

5. దేహం ప్రాణ మపీంద్రియాణ్యపి చలాం బుద్ధిం చ శూన్యం విదుః
స్త్రీ బాలాంధ జడోపమాస్త్వహమితి భ్రాంతా భృశం వాదినః ।
మాయాశక్తివిలాసకల్పిత మహావ్యామోహ సంహారిణే
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥

6. రాహుగ్రస్త దివాకరేందుసదృశో మాయా సమాచ్ఛాదనాత్
సన్మాత్రః కరణోపసంహరణతో యోఽభూత్ సుషుప్తః పుమాన్ ।
ప్రాగస్వాప్సమితి ప్రబోధసమయే యః ప్రత్యభిజ్ఞాయతే
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥

7. బాల్యాదిష్వపి జాగ్రదాదిషు తథా సర్వాస్వవస్థాస్వపి
వ్యావృత్తా స్వనువర్తమానమహమిత్యంతఃస్ఫురంతం సదా ।
స్వాత్మానం ప్రకటీకరోతి భజతాం యో ముద్రయా భద్రయా
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥

8. విశ్వం పశ్యతి కార్యకారణతయా స్వస్వామిసంబంధతః
శిష్యాచార్యతయా తథైవ పితృపుత్రాద్యాత్మనా భేదతః ।
స్వప్నే జాగ్రతి వా య ఏష పురుషో మాయా పరిభ్రామితః
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥

9. భూరంభాంస్యనలో–నిలోఽంబర మహర్నాథో హియాంశుః పుమా
నిత్యాభాతి చరాచరాత్మకమిదం యస్యైవ మూర్త్యష్టకమ్ ।
నాన్యత్కించన విద్యతే విమృశతాం యస్మాత్ పరస్మాద్విభోః
తస్మై శ్రీగురుమూర్తయే నమ ఇదం శ్రీదక్షిణామూర్తయే ॥

10. సర్వాత్మత్వమితి స్ఫుటీకృతమిదం యస్మాదముష్మిన్ స్తవే
తేనాస్య శ్రవణా త్తదర్థమననాద్ధ్యానాచ్చ సంకీర్తనాత్ ।
సర్వాత్మత్వమహావిభూతిసహితం స్యాదీశ్వరత్వం స్వతః

సిద్ధ్యేత్ తత్పునరష్టధా పరిణతం చైశ్వర్య మవ్యాహతమ్ ॥

# సంక్షిప్తపదసూచిక



ఈ.ఉ. ఈశావాస్యోపనిషత్

ఐ.ఉ. ఐతరేయోపనిషత్

ఋ.స. ఋగ్వేదసంహితమ్

క.ఉ. కఠోపనిషత్

కే.ఉ. కేనోపనిషత్

కౌ.ఉ. కౌషీతకి బ్రాహ్మణోపనిషత్

ఛా.ఉ. ఛాందోగ్యోపనిషత్

జా.ఉ. జాబాలోపనిషత్

తై.ఉ. తైత్తిరీయోపనిషత్

ప్ర.ఉ. ప్రశ్నోపనిషత్

బృ.ఉ. బృహదారణ్యకోపనిషత్

మ.నా. మహానారాయణోపనిషత్

మా.ఉ. మాండూక్యోపనిషత్

ము.ఉ. ముండకోపనిషత్

శ.బ్రా. శతపథబ్రాహ్మణమ్

శ్వే.ఉ. శ్వేతాశ్వతరోపనిషత్

యజు. యజుర్వేదం

భ.గీ. భగవద్గీత

# ఉపోద్ఘాతము



"వేదాః అనంతాః" వేద వాఙ్మయము అపారము. అపౌరుషేయములుగా భారతీయులు శ్రద్ధాభక్తులతో యుగయుగాల నుండి కాపాడుకుంటున్న అమూల్య సంపద. వేదములు నిత్యములు. వేదవాక్కులు తేజోమయములు. కాలగర్భంలో కలిసిపోకుండా నాశరహితముగా ఉన్న సత్యస్రవంతులు. వేదములలోని పూర్వమంత్ర భాగమును సంహితలుగాను, చివర భాగములను ఆరణ్యకములు (ఉపనిషత్తులు) గాను సామాన్యంగా పరిగణిస్తారు. అయితే, కొన్ని సంహితాభాగాలు కూడా ఉపనిషత్తులుగా వ్యాప్తిలోకి వచ్చాయి (ఉదాహరణకు ఈశావాస్యోపనిషత్తు). సంహితా భాగాలు కర్మకాండకు విధివిధానములు నిర్దేశించగా, అంత్యభాగములు గుహ్యమైన వేదాంతబోధకు ప్రత్యేకింపబడినవి.

శ్రుతి వాక్యములు ధర్మార్థకామమోక్షములను పురుషార్థములుగా నిర్దేశించి; ప్రవృత్తిమార్గము, నివృత్తి మార్గము – అను రెండు వేరు వేరు మార్గాలను జీవనయాత్ర కొనసాగించుకోటానికి ఉపయుక్తములుగా సూచించినవి. ప్రవృత్తి మార్గాన్ని ధర్మార్థకామాపేక్షలున్న వారికి అనుగుణ్యమని సూచిస్తూ, ఐహిక, స్వర్గభోగాలకు, శాస్త్ర సమ్మతమైన కర్మాచరణకు, నిత్యనైమిత్తిక కర్మలను, ఇష్టాపూర్తాది సత్కార్యములను ఎన్నో, ఎన్నెన్నో పేర్కొనడమైనది. వీటి విషయమై సంహితా భాగాలపై ఆధారితమైన పూర్వమీమాంసా ధర్మశాస్త్రాలలో విస్తృతంగా ప్రస్తావించటం జరిగింది.

ఇకపోతే, పరమోత్కృష్ట మార్గంగా బోధింపబడినది మోక్షమార్గము. "జ్ఞానాదేవ తు కైవల్యం" అని సంసారబంధ విముక్తికి, జనన–మరణ

దుఃఖము లేని బ్రహ్మప్రాప్తికి జ్ఞానము అనివార్యమని ఉపనిషత్తులు వక్కాణించాయి. పరావిద్యగా ప్రస్తావించిన ఈ జ్ఞానమార్గము, ఆత్మ–పరమాత్మ సంబంధిత బోధనకు నిర్దేశింప బడినది. ఉపనిషత్తుల్లో ప్రస్తావించిన ఈ బ్రహ్మవిద్య విస్తృతంగా ఉత్తరమీమాంసా – వేదాంతగ్రంథాలలో చర్చింపబడింది.

పూర్వమీమాంసా గ్రంథాలలో అతి ప్రాచీనమైనదిగా జైమిన్యాచార్యుల వారి ధర్మసూత్రములు పరిగణింపబడుతుంది. వేదోక్త యజ్ఞ యాగాది క్రతువుల నిర్వహణకు, శిష్టుల ఆచార వ్యవహార క్రమబద్ధీకరణకు ఈ ధర్మసూత్రములు ప్రామాణ్యములుగా నిలిచినవి. తదనంతరము వేదవాఙ్మయములో అతివిశిష్టస్థానము పొందినది బాదరాయణులవారి 'బ్రహ్మసూత్రములు'. ఈ గ్రంథకర్త, వేదవిభజన తత్ప్రక్షిప్తము చేసిన వేదవ్యాస మహర్షిగా ఖ్యాతికెక్కిన బాదరాయణులవారు – ఒక్కరే.

ఆదిలో కొన్ని వృత్తులు, వ్యాఖ్యానాలు బాదరాయణ విరచితమైన బ్రహ్మ సూత్రములపై వచ్చి ఉండవచ్చు. కాని, అవి ఆదిశంకరుల వారి 'శారీరిక మీమాంసా' అనే పేరుతో ఆవిర్భవించిన బ్రహ్మసూత్రభాష్యముతో కనుమరుగు అయిపోయాయి. శంకరభగవత్పాదులవారు విస్తృత శ్రుతి–స్మృతి వచనాల ప్రామాణ్యంతో వారి అద్వైతసిద్ధాంతాన్ని మేళవిస్తూ ఈ భాష్యగ్రంథాన్ని రూపొందించారు.

బ్రహ్మసూత్ర భాష్యానికి ముందుగా శంకరులవారు 'అధ్యాస భాష్యాన్ని' పొందుపరిచారు. ఈ ప్రకరణంలో క్లిష్టమైన పరమేశ్వర–పరమాత్మ తత్త్వాన్ని అర్థం చేసుకోవటానికి ముఖ్యమైన శారీరుడు–శరీరము–శరీరీ* అనబడే మూడింటి ధర్మాలను, వాటి అవగాహనలో జరిగే భ్రమ–అపోహలను దూరం చేసికోవలసిన అవసరం ఉంటుందని ఈ ప్రస్తావన ఆరంభించారు. అధ్యాస ప్రక్రియను, తల్లక్షణాలను వివరించటానికి

ముందుగా సామాన్యంగా ప్రతీవ్యక్తి (శారీరుడు) నేను—నాది, నువ్వు—నీది అనే వ్యవహారం తన శరీరధర్మాలపై ఆరోపించుకొని ఎలా కొనసాగిస్తూ ఉంటాడో వివరించడమైనది.

## అధ్యాస ప్రక్రియ :

ఒక వస్తువుపై మరొక ఇతర వస్తువు యొక్క ధర్మాలను ఆరోపించుకొని వ్యవహరించటమే 'అధ్యాస' అని చెప్పడమైనది. చీకట్లో ఒక తాడును చూసి అది పాము అని అపోహ పడడం జరుగుతుంది. రజ్జువుసర్ప భ్రాంతిలాటిదే శుక్తి (ముత్యపు చిప్ప)లో మెరసే వస్తువుని రజతము(వెండి) అని, మరుభూమి(మృగతృష్ణ)లో ఉండేది నీరు అని అపోహ పడడం వంటివి ఉదాహరణకు పేర్కొనబడ్డాయి. ఎప్పుడైతే రజ్జువు సర్పము కాదని, శుక్తిలో మెరసే పదార్థం రజతము కాదని, మృగతృష్ణలో వాస్తవంగా నీరు లేదని అవగతం అవుతుంతో – అప్పుడే మిథ్యాజ్ఞాన నివృత్తి జరుగుతుంది. అంతవరకు భయభ్రాంతులు పోవు, ప్రవృత్తిలో మార్పురాదు.

అధ్యాస జరిగే విధానాన్ని, దానికి వ్యక్తి యొక్క మనోభావనకు ఉన్న సంబంధముపై దార్శనికులు వారివారి మతానుసారంగా వివిధరకాలుగా విశ్లేషించినా, అధ్యాసప్రక్రియ నిత్య జీవితంలో అసలు జరిగేది కాదని ఎవరూ ఖండించలేదు. అయితే, అధ్యాస అనేది దేని విషయంలోనైతే భ్రాంతి వలన కలిగిందో, ఆ విషయము యొక్క పూర్వజ్ఞానం కొంతైనా ఉండాలి. సర్పాన్ని అసలు చూడని వారు, దాని వల్ల కలిగే అపాయం తెలియనివాళ్లు రజ్జువును చూసి సర్పమని, సర్పాన్ని చూసి రజ్జువని భ్రాంతిపడే అవకాశం ఉండదని కొందరి అభిప్రాయం. 'భ్రమ' కు వ్యతిరేకమైనది 'ప్రమా'. అనగా ఉన్నది ఉన్నట్లు యదార్థ జ్ఞానంతో గ్రహించటము. లేని దానిని ఉన్నట్లుగా భావించటం 'భ్రమ'. సమ్యక్ జ్ఞానం వల్ల భ్రమ తొలగి ప్రమా కలుగుతుంది. మిథ్యాజ్ఞానం వల్ల భ్రమ ఉత్పన్నమవుతుంది. అయితే, క్లిష్టమైన బ్రహ్మతత్త్వ

అవగాహనకు అధ్యాసకు ఏమి సంబంధము అనే సంశయం కలగడం సహజం. దానిని దూరం చెయ్యటానికి శంకరులవారు ఇలా ప్రస్తావించారు:

అహం (నేను) మమేదం ఇది (నాది) అనే ప్రవర్తన, నువ్వు—నీది అని గ్రహించి ప్రవర్తించే విధానానికి విరుద్ధంగా ఉండాలి. తత్త్వతః నేను—నేనే, నువ్వు—నువ్వే అవ్వాలి. 'అహం' ఎన్నడూ 'త్వం' కానట్లే (నేను—నువ్వు కానట్లే) వాస్తవంలో నువ్వు—నేను కాజాలను. నా శరీరం, దానిలోని ఇంద్రియాదులు, మనస్సు, బుద్ధి ఇత్యాదులు నాతోనే ఉంటాయి. నీ శరీరం, దానిలోని ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి నీ దగ్గరే ఉంటాయి. ఈ స్వకీయ—పరకీయ (నాది—నీది) అనే భావన దేని వలన జరుగుతుందో తెలియక అధ్యాస ప్రక్రియ నిత్యం జరుగుతుంది.

శరీర వ్యాపారం, దాని పరిమితి; అంతఃకరణ వ్యాపారం, దాని పరిమితి; జీవాత్మ (చిదాభాసుడు), దాని ప్రభావము - అవగతం కాక ఈ శరీరమే నేను అనే దేహాభిమానంతో అధ్యాస జరుగుతుంటుంది. నేను తెల్లగా ఉన్నాను, నేను నల్లగా ఉన్నాను, నేను అంధుణ్ణి, నాకు జ్వరంగా ఉంది అని చెప్తూ ఉంటాం. అయితే నలుపు, తెలుపు, అంధత్వం, జ్వరం ఇవన్నీ దేహధర్మాలు. 'నేను' అనే ప్రత్యయానికి భిన్నమైనవి. 'నేను' అనే వ్యక్తీకరణ అంతఃకరణకు సంబంధించినది. మనో బుద్ధి అహంకారాలు అంతఃకరణ ధర్మాలు. అహంభావమే నేను—నాదిగా ప్రకటింప బడుతుంది. కోరికలు, ఇచ్ఛ, సంకల్పం, నిశ్చయం ఇవన్నీ కనబడకుండా అంతః కరణలో జరిగే వ్యాపారాలే. నేను—నాది అనే అభిమానం నావారు—నా ఆత్మీయులు అనే మోహం, నా భార్య, నా పుత్రులు, నా రక్తసంబంధీకులు, వారి సుఖ దుఃఖాలు నావే... అనే భావనతో మనఃక్లేశం అనుభవించటం అంతఃకరణలో జరిగేది. అంతః కరణ వృత్తి ధర్మాలు అని తెలియక, అన్నీ నావిగా స్వఆత్మపై ఆరోపించుకోవటం జరుగుతుంది. అంతరింద్రియాలకు, బాహ్యేంద్రియాలకు కూడా భిన్నమైనది కూటస్థమైన ఆత్మ. దీనినే జీవాత్మ (శరీరీ) అని కూడా

అంటారు. సూక్ష్మాతి సూక్ష్మమైనది, అగోచరమైనది. దాని శక్తివల్లే బాహ్యేంద్రియాలు, అంతరింద్రియాలు వాటివాటి పనులు చేసుకునే సామర్థ్యాన్ని పొందుతాయి. స్థూలదేహానికి భోగ సాధనముగా నిర్లిప్తంగా కార్యకలాపాలను జరిపేది జీవాత్మయే. ఈ కూటస్థ ఆత్మ, స్వయం ప్రకాశ ధర్మం గల సత్‌పదార్థము. ఇది నిత్యమైనది. శరీరేంద్రియాలకుండే షడ్భావ వికారములు (జాయతే, అస్తి, విపరిణమతే, వర్ధతే, అపక్షీయతే, వినశ్యతి అనే ఆరు వికారాలు) ఆత్మకు వర్తించవు. ఆత్మాభాసంతో పనిచేసే అంతఃకరణ భాగమైన అహంకారం ఆజన్మాంతం మారదు. నేను నేనుగానే వ్యక్తమవుతుంది. నేను అనే భావనకు అవస్థాభేదం ఉండదు. అంటే, అది వయస్సుతో మారేదికాదు.

ఆత్మధర్మాలను, ఆత్మేతర పదార్థాల గుణధర్మాలను పూర్తిగా అర్థం చేసుకోటానికి 'విషయీ' – 'విషయాః' అనేవి పరస్పర భిన్నధర్మములు కలవి (ఇతరేతర వస్తువులు) అని తెలుసుకోవాలి. విషయీ (లేక దృక్) సత్పదార్థము, స్వయం ప్రకాశముతో జ్ఞాతకు జ్ఞానమునిచ్చేది. చేతన ధర్మము కలది. దీనికి భిన్నంగా విషయాః (విషయములు) దృశ్యపదార్థములు. బాహ్యమైన అనాత్మకములు. ఆత్మేతర పదార్థము లన్నీ జడములే, అనిత్యములే, అసద్వస్తువులే. దేహముతో పాటు అందులోనున్న ఇంద్రియములన్నీ నశించే ధర్మము కలవే. చైతన్యవంతమైన విషయీ (శరీరీ లేక ఆత్మ) అనే దానిని జడములైన విషయ–దేహాదుల నుండి వేరు చెయ్యవలసి ఉంటుంది.

కర్తృత్వ–భోక్తృత్వాదులు జీవాత్మకు సంబంధించినవి. ఆత్మకు కర్తృత్వ– భోక్తృత్వాదులు ఉండవు. జ్ఞాన కర్మేంద్రియాల యొక్క కార్యకలాపాలకు సాక్షిగా మాత్రమే వ్యవహరించే ప్రత్యగాత్మ (చిదాత్మ) దేహసంబంధమైన అనుభూతులకు, సుఖదుఃఖాలకు అతీతమైనది. అయినా, నేను–నాది అనే భావనతో జీవుడు అంతః కరణ వ్యాపారానికి సాక్షి మాత్రమే

అయిన ప్రత్యగాత్మపై అంతఃకరణ ధర్మాలను, మిగతా ఇంద్రియధర్మాలను ఆరోపించి వ్యవహరిస్తూ ఉంటాడు. అందువల్ల జీవాత్మయే కర్త, భోక్త అవుతున్నాడు.

జీవాత్మ ఇంద్రియాదులకు అగోచరము కదా! దానిపై దేహాది కార్యకలాపం యొక్క అధ్యాస ఎలా జరుగుతుంది? – అనే సందేహం వస్తుంది. ఈ సందర్భంలోనే విద్య—అవిద్య ప్రస్తావన అనివార్యమౌతుంది. శూన్యంగా అగుపించే ఆకాశం నిర్మలమైనది. దానికి ఏ రంగూ రూపమూ ఉండదు. కాని, చిత్ర విచిత్ర రంగుల్లో కనబడే ఆకాశాన్ని చూసి ఏవేవో భావనలతో ఊహించుకోవటం జరుగుతూ ఉంటుంది. అలాగే కనబడని చిదాత్మపై దేహాదుల యొక్క సుఖదుఃఖాల అధ్యాస జరుగుతుంది. వాస్తవాన్ని తెలుసుకోవటానికి సమ్యక్ జ్ఞానం అవసరం. అది విద్యాప్రాప్తి, జ్ఞానార్జన వలన సాధింపబడుతుంది.

కర్తృత్వ—భోక్తృత్వ అభిమాని 'ప్రమాత'. ఇతడు ఇంద్రియాదుల ద్వారా అనుభూతులను పొందే ఉత్సుకత ఉన్నటువంటి 'నేను' అనే అహంకార శబ్దవాచ్యుడు. అంతఃకరణ ధర్మాలను ఆత్మధర్మాలపై ఆరోపించుకుంటూ 'ఈ దేహమే నేను' అని విశ్వసించే దేహాభిమాని.

అధ్యాస ప్రక్రియ నిజజీవితంలో నిత్యమూ జరిగేదే! అయితే పండిత—పామరులకు కూడా ఇది సమానంగా వర్తిస్తుందా? – అనే ఆశంక కలుగుతుంది. పశువులు కఱ్ఱ చేతిలో ఉన్న వ్యక్తిని చూసి పారిపోతాయి; వాటికి ప్రీతికరమైన తృణాది భక్షణాదులుంటే ఆ వ్యక్తికి చేరువుగా వస్తాయి. పశుప్రవృత్తి దేహ వాంఛలను శ్రోత్రాది ఇంద్రియముల ద్వారా నివృత్తి చేసుకోవటం ఎలా ఉంటుందో, పండిత పామరులలో ఇంద్రియ భోగప్రవృత్తి ఉన్నంత వరకూ అధ్యాస ప్రక్రియలో వ్యత్యాసం ఉండదు. ఆత్మసంబంధమైన విచక్షణా జ్ఞానం కలిగే వరకు అధ్యాసాధారిత స్వభావం మారదు.

*"జ్ఞానాదేవ తు కైవల్యం"* జ్ఞానం వల్లనే మోక్షప్రాప్తి. ఆత్మజ్ఞానమే పరమాత్మ దర్శనం. అందువల్ల ముముక్షువులకు (మోక్ష కాంక్ష గలవారికి) వేదపఠనము, వేదోక్త కర్మాచరణము అవసరం అని శ్రుతి–స్మృతులు ఎక్కడా చెప్పలేదు. అయితే, శమదమాది సాధనసంపత్తి, నిత్యానిత్య వివేకము ఆత్మానాత్మ విషయపరిజ్ఞానం, ఆత్మ–పరమాత్మ తత్త్వాలను అవగాహన చేసుకోటానికి ఉపకరిస్తాయి అని స్పష్టం చెయ్యబడింది.

*'జీవో బ్రహ్మైవ న అపరః'* జీవాత్మయే పరమాత్మ అందువల్ల శారీరుడు తనలోని జీవాత్మను కూలంకషంగా అర్థం చేసుకొని, తత్ జ్ఞానంతో పరమాత్మను పొందవచ్చును అనేదే బ్రహ్మసూత్ర భాష్యం యొక్క మూల ప్రతిపాదన. ఈ సిద్ధాంతమే ఇకపైన విస్తారంగా శ్రుతి–స్మృతి ప్రమాణాలతో చర్చించడమైనది.

# 1.

# సమన్వయాధ్యాయము : ప్రథమపాదము



## 1. జిజ్ఞాసాధికరణమ్

### సూ: 1.1.1 అథాతో బ్రహ్మజిజ్ఞాసా

**పూర్వపక్షి సంశయం:**

విధిపరమైన వేదభాగాలన్నీ పూర్వమీమాంసా శాస్త్రంలో పరిశీలించబడ్డాయి కదా! ఆ శాస్త్రానికి, ఉత్తరమీమాంసా శాస్త్రానికి ఎటువంటి భేదముంది?

**సమాధానం:**

పూర్వమీమాంసా శాస్త్రము కర్మాచరణకు విధిరూపమైన వేదభాగాన్నే విచారించింది కాని, నిత్యసిద్ధమైన బ్రహ్మతత్త్వాన్ని విచారణ చేయలేదు. పూర్వ మీమాంసా శాస్త్రం ధర్మాధర్మాల విచారణకు పరిమితం. ఉపనిషద్వాక్యాలను పరమాత్మయైన నిర్గుణబ్రహ్మను సమన్వయించుకొని అర్థంచేసుకోవాలి. *"సర్వేషాం వేదాంత వాక్యానాం అద్వితీయే బ్రహ్మణి నిర్విశేషే తాత్పర్యమితి"* అనేదే ఉత్తరమీమాంసా శాస్త్రము యొక్క ముఖ్య లక్ష్యము.

**సంశయం:**

జైమిన్యాచార్యులవారి ధర్మసూత్రాలు *"అథాతో ధర్మ జిజ్ఞాసా"* అనే సూత్రంతో మొదలయ్యాయి. అక్కడ 'అథ' – 'అతః' అనే పదాలకు వేదాధ్యయనము పూర్తిచేసుకొన్న తరవాత ధర్మజిజ్ఞాసా అని అర్థం చెప్పారు. వేదాధ్యయనం, కర్మవిధి తెలిసికొన్న తరవాతనే బ్రహ్మజిజ్ఞాస ప్రారంభించాలనే నిర్దేశము ఏమైనా ఉందా?

**సమాధానం:**

బ్రహ్మసూత్రములు బ్రహ్మపదార్థము, పరమాత్మ యొక్క జిజ్ఞాసలనుద్దేశించి ప్రతిపాదింపబడినవి. వేదాంతములలో చెప్పబడిన బ్రహ్మతత్త్వము, తత్ జ్ఞానప్రాప్తికి సంబంధించిన విద్యావిషయములు, కర్మకాండకు సంబంధించిన వేదము యొక్క పూర్వభాగములో లేవు. అందువల్ల వేదాధ్యయనము, కర్మ సంబంధిత అవగాహన ఉంటేనే కాని బ్రహ్మజిజ్ఞాస చేసుకోబడదు అనేవాదన సమంజసము కాదు.

*"అథాతో బ్రహ్మజిజ్ఞాసా"* అనే సూత్రంలో ఉన్నటువంటి 'అథ' శబ్దాన్ని, మంగళ వాచకంగా అన్వయించుకోవాలి. *"ఓంకారశ్చ అథశబ్దశ్చ ద్వావేతౌ బ్రహ్మణః పురా కంఠం భిత్వా వినిర్యాతౌ తస్మాన్మాంగలికావుభౌ"* (ఓంకారము, అథ శబ్దము బ్రహ్మదేవుని నోటి నుండి ముందుగా వెలువడినవి. అందువల్ల ఆ రెండు పదములు సహజంగా మంగళదాయకములు). సరియైన అధికారం ఉన్న వ్యక్తికి కర్మజిజ్ఞాస లేకుండానే బ్రహ్మజిజ్ఞాస, మోక్షేచ్ఛ కలగవచ్చు.

**సంశయం:**

యథాశాస్త్రం వేదపఠనం చేసి, వివాహం చేసుకొని, శక్త్యానుసారం యజ్ఞ యాగాలు చేసిన తరవాతనే నివృత్తి మార్గంలో మనస్సును లగ్నం చేసుకొని మోక్ష మార్గంలో, బుద్ధిని స్థిరీకరించుకోవాలని స్మృతులు వక్కాణిస్తున్నాయి. అదీకాక *"బ్రహ్మచర్యం సమాప్య గృహీ భవేత్, గృహాత్ వనీభూత్వా ప్రవ్రజేత్"* (బ్రహ్మచర్యావస్థ పూర్తి చేసుకొని, గృహస్థుడై ఆ తరవాత వానప్రస్థాశ్రమం స్వీకరించి, తదనంతరము సన్యాసాశ్రమము) అనేది శ్రుతి వచనం. స్మృతి వచనానుసారం

యథాశాస్త్రంగా వేదాధ్యయనం చేసి, ధర్మాన్ని పాటిస్తూ పుత్రులను కని, శక్తికి తగిన యజ్ఞయాగాదులు చేసిన తరవాత మనస్సును మోక్షమార్గంలో నిలుపుకోవాలి. *("అధీత్య విధివద్వేదాన్ పుత్రాంశ్చోత్పాద్య ధర్మతః ఇష్ట్వా చ శక్తితో యజ్ఞైర్మనో మోక్షే నివేశయేత్").*

ఈ విధంగా స్మృతి వచనాలు వినబడుతున్నప్పుడు నిర్దిష్టక్రమంలో బ్రహ్మ జిజ్ఞాస ప్రారంభించటం యుక్తం కదా?

**సమాధానం:**

బ్రహ్మజిజ్ఞాసకు ఎట్టి అవస్థాక్రమ నిర్ణయము లేదు. చిత్తశుద్ధి ఉన్న వానికి కర్మల ప్రమేయమే లేదు. *"బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేత్"* (బ్రహ్మచర్యాశ్రమం నుంచే సన్న్యాసాశ్రమానికి వెళ్లవచ్చును). అలాగే శ్రుతిలో *"యదహరేవ విరజేత్ తదహరేవ ప్రవ్రజేత్"* (వైరాగ్య భావన వచ్చిననాడే సన్యసించ వచ్చును) అని చెప్పబడింది.

*"యత్ కృతకం తదనిత్యమ్", "తద్యదిహ కర్మచితో లోకః క్షీయతే ఏవమేవా ముత్ర పుణ్యచితో లోకః క్షీయతే" (ఛా.ఉ. 8.16.).* ఇటువంటి శ్రుతి వాక్యాలు ఇహపర మైన సుఖప్రాప్తి, యజ్ఞయాగాది క్రతువులను చేసి సంపాదించిన స్వర్గభోగము కూడా అనిత్యములని బోధిస్తున్నాయి. ఇహజన్మ శాశ్వతము కానట్లే స్వర్గవాసమూ శాశ్వతము కాదు. కొన్నిరోజుల ముచ్చటే. బ్రహ్మమును తెలుసుకున్నవారే అమరత్వం పొందుతారు. బ్రహ్మమును తెలుసుకోవాలనే ఇచ్ఛ గల ముముక్షువునకు కర్మవిధి అవశ్యము కాదు. *"బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి"* (బ్రహ్మజ్ఞాని బ్రహ్మ స్వరూపుడౌతాడు –ము.ఉ. 3–2–9), *"బ్రహ్మవిత్ ఆప్నోతిపరమ్"* (ఆత్మ జ్ఞానంతో బ్రహ్మైక్యత్వం సాధించటమే అమర త్వము – తై.ఉ. 2–1) అని ఇటువంటి శ్రుతివచనాలు స్పష్టంగా పలుకుతున్నాయి.

**సంశయం:**

బ్రహ్మ జిజ్ఞాసకు ఎవరు అర్హులు? అట్టి అధికారికి ఉండాల్సిన లక్షణాలేవి? ఆత్మజ్ఞానము, బ్రహ్మజ్ఞానము అనగా ఒకటేనా? బ్రహ్మజిజ్ఞాస వలన వచ్చే ఫలమేది?

**సమాధానం:**

నిత్యానిత్య వివేకం, అంటే ఏది నిత్యము? ఏది అనిత్యము అనే జ్ఞానం. ఇహపర సుఖాలు అనిత్యమైనవి; అమరత్వం నిత్యమైనది. అమరత్వం లేదా మోక్షప్రాప్తి జన్మరాహిత్యం వల్ల మాత్రమే సిద్ధిస్తుందనే స్పష్టమైన భావన రావాలి. అప్పుడే బ్రహ్మజిజ్ఞాస మీద అచంచలమైన మనోవాంఛ కల్గుతుంది.

గమ్యం మోక్షం. అందువల్ల బ్రహ్మను తెలుసుకోవాలనే కోరిక గమ్యమైన మోక్షసాధన కోసం కలుగుతుంది. సాధకుని లక్ష్యం బ్రహ్మజిజ్ఞాసను ప్రేరేపిస్తుంది.

శమదమాది సాధన సంపత్తులు సాధకునికి అవసరమని ఈ సందర్భంలో పేర్కొనడమైనది. మనోనిగ్రహం (శమం), బాహ్యేంద్రియ నిగ్రహం (దమం), ఓర్మి, శాంతస్వభావం, కోరికలను వదులుకోవటం, శ్రద్ధ, ఆత్మతత్వం మీద నిశ్చలమైన మనోభావం – ఇలా ఆరు గుణాలను సాధనసంపత్తులుగా వివరిస్తారు. ముముక్షువులు ఈ సాధన సామగ్రిని సమకూర్చుకోవాలి.

*"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ"* అనే శ్రుతి వచనంలో బ్రహ్మము సత్ పదార్థము, జ్ఞానమయము, అనంతము అని చెప్పబడింది. 'బృహి వృద్ధౌ' అనే ధాతువు నుండి బ్రహ్మ శబ్దం వచ్చిందని వ్యాకరణ శాస్త్రజ్ఞుల నిర్ణయం. బ్రహ్మపదార్థము ఎంత? దాని పరిణామమును ఏవిధంగా కొలవగలము? అంటే అది పరిమాణ శక్యము కానిది, దాని వృద్ధి నిరవధికము, నిత్యమూ ఉండేది కాబట్టి కాలాతీతము అనంతము. బ్రహ్మకు జ్ఞానపరిమితి కూడా చెప్పబడదు. అందువల్ల సర్వజ్ఞం, తెలియనిదంటూ ఏమీ ఉండనిది. అవిద్యాదోషం ఎక్కడా కానరానిది. సర్వాత్మకమైన (అందరి ఆత్మలో ఉన్న) పదార్థం.

*"జీవోబ్రహ్మైవ"* (జీవుడే ఆత్మ కాబట్టి జీవుడే బ్రహ్మ) అని చెప్పటం వలన *"ఆత్మత్వాత్ బ్రహ్మవిత్"* ఆత్మజ్ఞానంతో బ్రహ్మమును తెలుసుకోవచ్చును. బ్రహ్మమును తెలుసుకున్నవారు ఆత్మైక్యం పొంది బ్రహ్మస్వరూపులౌతారు. ఇదే అద్వైత

సిద్ధాంత మూల ప్రాతిపదిక. ఆత్మ ఏకత్వ సాధనయే మోక్షసాధన. అదే జ్ఞేయము, గమ్యమైన అమృతత్త్వము.

# 2. జన్మాద్యధికరణమ్

## సూ: 1.1.2 జన్మాద్యస్య యతః

(సృష్టి–స్థితి–లయం దేని వల్ల కలుగుతున్నాయో అదే బ్రహ్మమని సూత్రార్థం)

**పూర్వపక్షి:**

*"యతోవా ఇమాని భూతాని జాయంతే" (తై.ఉ 3.1)* అనే శ్రుతి వాక్యాలు మరో శారీరుడు (సంసారే) సృష్టికి కారణమని ప్రభోదిస్తున్నాయి. హిరణ్యగర్భుడు జగత్సృష్టికి కారణభూతమని కదా ప్రతీతి? వాస్తవంగా బ్రహ్మము అంటే ఎవరు? బ్రహ్మలక్షణాలు ఏవి? ఎట్టి ప్రమాణాలతో బ్రహ్మమును ఋజువు చెయ్యగలము?

**సిద్ధాంతం:**

వరుణుడి యొక్క కుమారుడైన భృగువు తన తండ్రిని సమీపించి, తండ్రీ! నాకు బ్రహ్మము గురించి ఉపదేశము చెయ్యండి అని ప్రార్థిస్తాడు. వరుణుడు దానికి సమాధానంగా *"యతో వా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవంతి, యత్ప్రయం త్యభిసం విశంతీతి"* అని చెప్పి, ఆ తర్వాత బ్రహ్మను గురించి తపస్సు చేసి పూర్తిగా తెలుసుకో అని ఉపదేశించినట్లు తైత్తిరీయోపనిషత్తులో వివరించబడింది (తై.ఉ 3.6).

జగత్తులో సర్వ భూతములు–ప్రాణులు యొక్క సృష్టికి–స్థితికి–ప్రళయానికి కూడా బ్రహ్మమే (పరమాత్మయే) కారణమని ఈ శ్రుతి వల్ల తెలుస్తున్నది. సృష్టికి కారణభూతమైన బ్రహ్మము యందే సర్వం నిలుస్తున్నది. అంతమందు దాని యందే లీనమవుతున్నది. పరమేశ్వరుని యందు సర్వశక్తి, సర్వజ్ఞత ఉండబట్టే నామరూపాలతో ప్రాణులన్నీ వ్యాకృతమై, జగద్వ్యాపార సర్వస్వమూ నిర్ణీత పద్ధతిలో జరుగుతున్నది.

**సంశయం:**

సృష్టి–స్థితి–లయములకే బ్రహ్మము కారణమని చెప్పబడింది. మరి మిగతా వికారాలు – విపరిణమతే, వర్ధతే, అపక్షీయతే అనే వాటికి బ్రహ్మము కారణంకాదా?

**సమాధానం:**

సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు అయిన పరమేశ్వరుడే జగత్సృష్టిలో కనబడే అన్ని భూతములకు, కార్యప్రపంచము యొక్క షడ్భావ వికారాదులకు కూడా కారణమని ఈ శ్రుతి వాక్యాలను అర్థం చేసుకోవాలి. జగత్ వ్యాపారమంతా ఒక స్థిరమైన పద్ధతిలో తత్ పరబ్రహ్మ కారణంగానే జరుగుతుంది. ఇటువంటి బృహత్ కార్యము మరో శారీరుని వల్ల, సంసారి వల్ల సాధ్యమయే పని కాదు. పరమేశ్వరుడు అనే ప్రయోగాన్ని భూమా (మహత్తు గలది) అని సమన్వయించుకోవాలి, కాని పురుష వచనంతో అర్థం చేసుకోకూడదు.

ఆత్మ అనే శబ్దాన్ని శ్రుతివచనాల్లో మూడు స్థానాలలో 'పురుషః' అనే పదానికి బదులుగా సమన్వయించుకుంటే ఈ సమస్య ఉండదు. శారీరుడిలో జీవాత్మ (కూటస్థంగా ఉపాధి చేసుకొని ఆ ప్రాణికి చేతనత్వం కల్పించే శక్తి) 'పురుషః' అనే పదంతోనే కొన్ని సందర్భాలలో వినబడుతుంది. ఈశ్వరుడు (హిరణ్యగర్భుడుగా జగత్కార్యకలాపాలను నిర్వహించే కార్యబ్రహ్మ), సగుణ బ్రహ్మను, 'పురుషః' అనే పదంతో వ్యక్తం చెయ్యడమైంది. అదే విధంగా పరమేశ్వరః – పరబ్రహ్మ – కారణబ్రహ్మ అని నిర్గుణబ్రహ్మమును కూడా 'పురుషః' అనే శబ్దంతో చెప్పడమైనది. ఈ మూడు స్థానాలలోను 'తత్' అనే నపుంసక శబ్దవాచ్యంతో ఆత్మశబ్దాన్ని అన్ని ఉపనిషత్ వాక్యాలలోను జీవాత్మ పరంగాను, విజ్ఞానాత్మ పరంగాను, ప్రాజ్ఞాత్మ పరంగాను సమన్వయించుకోవటం యుక్తం. అప్పుడు *"సర్వేషాం వేదాంతవాక్యానాం అద్వితీయే బ్రహ్మణి నిర్విశేషే తాత్పర్యమ్"* అనే సంప్రదాయానికి భంగం ఉండదు.

**సంశయం:**

*'ఆత్మా శ్రోతవ్యో, మంతవ్యః'* అని పల్కుతున్న శ్రుతే (బృ.ఉ 2.4.5) మరో సందర్భంలో తెలియని విషయాన్ని అడిగి తెలుసుకోవచ్చు అన్ని చెప్తున్నది. "పండితో మేధావీ గాంధారానేవ ఉపసంపద్యేత, ఏవమేవ ఇహ ఆచార్యవాన్ పురుషో వేద" (ఛా.ఉ 6.14.3). ఇది వైరుధ్యం కాదా?

**సమాధానం:**

బ్రహ్మజ్ఞానానికి పరమప్రయోజనం (అంత్యఫలం) బ్రహ్మసాక్షాత్కారమే. ఈ జ్ఞానాన్ని ఉపనిషద్వాక్యాల శ్రవణ మననాదుల ద్వారా గాని, స్మృతి వచనాల శ్రవణ మననాదుల ద్వారా గాని, స్వానుభవంతో గాని సాధించవచ్చు. మార్గమేదైనా గమ్యమొక్కటే అవుతుంది. తదేక లక్ష్యం ఉండాలి.

**సంశయం:**

బ్రహ్మ ఎల్లప్పుడు స్థిరంగా ఉండే నిత్య వస్తువు. కాబట్టి, భూతవస్తువును తెలుసుకోవటానికి వేదాంత వాక్య విచారణ వ్యర్థం కాదా?

**సమాధానం:**

జగత్తుకు—బ్రహ్మకు ఉన్న సంబంధం ఇంద్రియాల వల్ల గ్రహించేదికాదు. ఇంద్రియ గ్రాహ్యంతో అది వీలుపడితే జగద్రూపమైన కార్యమంతా బ్రహ్మకారణంగా జరిగిందా అనే సందేహమే కలగదు. అందువల్ల శ్రుతి ప్రామాణ్యంతో నిరూపించ టానికే వేదాంత వాక్య విచారణ జరిగింది. *"యతో వా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవంతి, యత్ప్రయంత్యభిసంవిశంతి తత్ విజిజ్ఞాసస్వ, తత్ బ్రహ్మేతి"* (తై.ఉ 3.1), *"యః సర్వజ్ఞః"* (ము.ఉ 1.1.10), *"తస్మాత్ ఏతత్ బ్రహ్మ నామ రూప మన్నంచ జాయతే"* (ము.ఉ 1.1.10), *"విజ్ఞాన మానందం బ్రహ్మ"* (బృ.ఉ 3.9.28), ఇటువంటి కొన్ని ఉపనిషద్వాక్యాలను శ్రుతి ప్రామాణ్యంగా ఉదహరించటమైనది.

ఈ విషయాలనే రాబోవు సూత్రాలలో విశేషంగా చెప్పటం జరిగింది. జగజ్జన్మాది కారణం బ్రహ్మ యొక్క తటస్థ లక్షణంగాను, "సత్యం జ్ఞానమనంతం" అనేవి బ్రహ్మస్వరూప లక్షణాలుగాను నిర్దేశించి ఈ అధికరణ సమాప్తం చెయ్యబడింది.

# 3. శాస్త్రయోనిత్వాధికరణమ్

## సూ: 1.1.3 శాస్త్రయోనిత్వాత్

*'జన్మాద్యస్యయతః'* అనే ముందు సూత్రంలో కార్యరూపమైన జగత్తుకి కారణం ఏమై ఉంటుంది, అంటే జన్మాదికం అని అనుమానించటం యుక్తమని సూచింపబడింది. ఈ సూత్రంలో అదే విషయాన్ని ధృవీకరిస్తూ వేదాదిశాస్త్రాలకు బ్రహ్మము కారణం; అందువల్ల బ్రహ్మ యథార్థ తత్త్వాన్ని తెలుసుకోటానికి శ్రుతి, శాస్త్రాధారిత స్మృతి వాక్యాలు తప్ప మరో ప్రామాణ్యం లేదు అని సమర్థించటమైనది.

**సంశయం:**

వేదములు నిత్యమైనవి, అపౌరుషేయములు. వాటికి సృష్టి–స్థితి–లయాది కారణ ధర్మములు వర్తింపవు కదా? పునః పునః లయమయి ఉద్భవిస్తూ ఉంటే శ్రుతి అప్రమాణ్యము కాదా?

**సమాధానం:**

కారణస్వరూపుడైన బ్రహ్మమే ఋగ్వేదాది నాలుగు వేదాలకు, ఆరు (శీక్షా–వ్యాకరణ–చ్ఛందో–నిరుక్త–జ్యోతిష–కల్ప అనే) వేదాంగాలకు, పురాణాలకు, న్యాయ, మీమాంసా ధర్మశాస్త్రాలకు మూలం అని అంగీకరించాలి. "అస్యమహతో భూతస్య నిఃశ్వసితమేతత్ యత్ ఋగ్వేదో, యజుర్వేదః సామవేదో–ధర్వాంగిరసః" (బృ.ఉ 2.4.10). పరమేశ్వరుని యొక్క అప్రయత్న లీలా నిశ్వాసంలో ఋగ్వేదాదికం ప్రాప్తమైనవి. సర్వజ్ఞుడైన బ్రహ్మమే వేదాదులకు కారణము. జగత్తులోనున్న చతుర్దశ భువనాలలో బ్రహ్మకు అవిదితమైనది ఏదీ ఉండదు. దీపం వలే అన్ని విద్యాస్థానాలను ప్రకాశింపజేసే సర్వజ్ఞుడైన పరమాత్మయే వేదావిష్కరణకు జగత్ సృష్టికి మూలము.

## 4. సమన్వయాధికరణమ్

## సూ: 1.1.4 తత్తు సమన్వయాత్

(తత్+తు సమన్వయాత్)

**పూర్వపక్షి:**

జైమిన్యాచార్యులవారు ఏ కర్మనూ బోధించని వేదభాగాలు ప్రయోజనం లేనివని సూత్రీకరించారు: "ఆమ్నాయస్య క్రియార్థ త్వాదానర్థక్యమతదర్థానామ్" (జై.సూ 1.2.1). వేదాంత వాక్యాలు ఎటువంటి కర్మనూ విధించలేదు కాబట్టి అవి వ్యర్థమే. బ్రహ్మము సిద్ధవస్తువు. దానిని ప్రతిపాదించే అవసరమే లేదు. సిద్ధవస్తువు త్యజించ వలసిందీ (హేయమూ) కాదు, పొందవలసిందీ (ఉపాదేయమూ) కాదు. అటువంటి దానిని ప్రతిపాదించటంలో పురుషార్థం ఉండదు కదా?

**సిద్ధాంతం:**

వేదాల్లో అన్ని మంత్రాలు కర్మను విధిస్తూ చెప్పలేదు. కొన్ని మంత్రానికి సంబంధించిన అర్థాన్నే బోధిస్తాయి. వాటిని క్రియాసంబంధమైన అర్థవాదములుగా ప్రామాణ్యానికి స్వీకరిస్తారు. బ్రహ్మము శాస్త్రానికి మూలం అని చెప్పిన ముందు సూత్రం (బ్ర.సూ 1.1.3..) కేవలం అనుమానాధారితమే అని పూర్వపక్షి చేసిన ఆరోపణను ఈ సూత్రంలో 'తు' ప్రత్యయంతో నిరాకరణ చేస్తూ బ్రహ్మను (తత్ పదార్థాన్ని) వేదాంత వాక్యాల సమన్వయంతో జగత్కార్యానికి కర్తగా చెప్పవచ్చును అని ముందు చెప్పిన విషయాన్ని దృఢీకరించటం జరిగింది. అందుకు నాలుగు వేదాలకు చెందిన ఉపనిషత్తుల నుండి కొన్ని వాక్యాలను ఉదహరించటమైనది.

*"సదేవ సోమ్య ఇదమగ్ర ఆసీత్"* (ఓ సౌమ్యుడా! సృష్టికి పూర్వము కేవలము సద్రూపమైన బ్రహ్మమే ఉండేది); "ఏకమేవాద్వితీయమ్" (బ్రహ్మమొక్కటే దానితో పాటు రెండవదేదీ లేదు – ఛా.ఉ 6.2.1.); *"ఆత్మా వా ఇదమేక ఏవాగ్ర ఆసీత్"* (సృష్టి ప్రారంభంలో ఆత్మ ఒక్కటే ఉండేది – ఐ.ఉ 1.1.1.); *"అయమాత్మా బ్రహ్మ సర్వానుభూః"* (ఈ ఆత్మయే బ్రహ్మము సర్వమూ తెలుసుకొనేది – బృ.ఉ 2.5.19.); *"తత్త్వమసి"* (ఆ పరబ్రహ్మమే నువ్వు – ఛా.ఉ 6.8.7.)... ఇటువంటి శ్రుతి వాక్యాలు బ్రహ్మ స్వరూపాన్ని నిర్దేశిస్తూ చెప్పినవి. అందుచేత బ్రహ్మము శాస్త్ర ప్రమాణకము. వేదాంత వాక్యాలు బ్రహ్మమునే ప్రతిపాదిస్తున్నవని గ్రహించాలి.

**సంశయం:**

కొన్ని వేదాంత వాక్యాలు ఉపాసనా విధులను బోధించటానికే ఉపయుక్త మైనవి. తక్కిన దేవతాత్మల వలె బ్రహ్మము కూడ ఉపాసనా విధికి అంగమా?

**సమాధానం:**

ఉపనిషత్తుల్లో వినబడుతున్న పంచాగ్ని విద్య, ప్రాణోపాసన మొదలైనవి ఆయా దేవతలనుద్దేశించి చెప్పినవే కాని బ్రహ్మము ఏ ఉపాసనా విధికి అంగమని చెప్పటం సమంజసము కాదు. అట్టి భావన అద్వితీయమైన బ్రహ్మముకు, ద్వైత భావాన్ని ఆరోపించి చెప్పినట్లవుతుంది. స్వర్గాదులు కావాలనే కోరిక ఉన్నవారికి ఎలాగైతే అగ్నిహోత్రాది కర్మానుష్ఠానం విధించబడిందో, అదే విధంగా మోక్ష కాంక్ష ఉన్నవారికి ఆత్మజ్ఞానం అనివార్యము.

**సంశయం:**

బ్రహ్మము శాస్త్రం చేత బోధింపబడుతున్నది అని అంగీకరించినా, ఆ శాస్త్రం జ్ఞానవిధికి కర్మను బోధిస్తున్నది అని భావించవచ్చును కదా?

**సమాధానం:**

ఆత్మజిజ్ఞాస, ఫల పర్యంతము జరగాలి. ఆత్మజ్ఞానం కలిగిన తరవాత మరి ఎటువంటి క్రియాప్రసక్తిలేదు. నేనే బ్రహ్మను ( *“సోఽహం”, “అహం బ్రహ్మాస్మి”* ) అనే అద్వితీయ ఆత్మజ్ఞానంతో మోక్షరూపమైన ఫలం లభిస్తుంది.

**సంశయం:**

వేదాంతాలు బ్రహ్మమును తెలుసుకోవాలి అని బోధిస్తున్నాయి, కాని బ్రహ్మ స్వరూప సాక్షాత్కారమును ప్రతిపాదించలేదు. *“ఆత్మావా అరే! ద్రష్టవ్యః”* (బృ.ఉ 2.4.5.), *“య ఆత్మా అపహతపాప్మా సోఽన్వేష్టవ్యః, స విజ్ఞాసితవ్యః”* (ఛా.ఉ 8.7.1.), *“ఆత్మేత్యేవోపాసీత”* (బృ.ఉ 1.4.7.), *“ఆత్మానమేవ లోక ముపాసీత”* (బృ.ఉ 1.4.15.), *“బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి”* (ము.ఉ 3.2.9.).

**సమాధానం:**

కర్మ ఫలానికి, బ్రహ్మవిద్యా ఫలానికి చాలా భేదం ఉంది. *“శ్రోతవ్యః, మంతవ్యః, నిదిధ్యాసితవ్యః”* అనే శ్రుతి ఆత్మను తెలుసుకోటానికి వినుట, మనన నిదిధ్యాసలను ఉపయుక్తంగా సూచిస్తున్నది. జ్ఞానరూపమైన కార్యానికి సంబంధించినదిగానే బ్రహ్మ ప్రతిపాదింపబడింది.

శరీరం ఉన్నంత వరకు ప్రియం–అప్రియం అనే భావనలు పోవు. అందువల్ల జనన–మరణాలు లేని అశరీరత్వం మోక్షం వల్లే ప్రాప్తించబడుతుందని శ్రుతులు పలుకుతున్నాయి. మోక్షము కర్మఫలం కంటే విలక్షణమైనది. అమృతత్వము శాశ్వతమైనది.

**సంశయం:**

శ్రుతిలో వినబడుతున్న అశరీరత్వం కూడా ధర్మకార్యం వల్ల లభించేది కావచ్చు. ధర్మఫలం అందరికీ ఒకేలా ప్రాప్తించదు. కొన్ని విధాలైన ధర్మకార్యాల వల్ల సుఖం కలిగినట్లే, అంతకంటే గొప్పదైన (మహత్తరమైన) ధర్మం వలన అశరీరతత్వం (మోక్షం) లభించవచ్చు అనే సంశయం కలుగుతున్నది.

**సమాధానం:**

పరబ్రహ్మము ఆకాశంలా సర్వత్ర వ్యాపించి ఉంది. ఎటువంటి వికారములు లేనిది. కూటస్థమైనది. ఎల్లప్పుడు తృప్తిగా ఆనందంగా ఉండేది. ధర్మాధర్మాలు, వాటి సంబంధిత కార్యాలతో ఉత్తేజితం కానిది. బ్రహ్మతత్త్వాన్ని తెలుసుకున్న వానికి మోహం, శోకం ఉండవు. *“తత్ర కో మోహః కః శోకః ఏకత్వమనుపశ్యతః”* (ఈ.ఉ– 7) అని శ్రుతి పలుకుతున్నది. ఆత్మజ్ఞానంతో నేనే బ్రహ్మమును అని ఏకత్వ దృష్టితో బ్రహ్మస్వరూపాన్ని దర్శించుకున్నవాడు దేని నుండి భయపడడు. *“ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కుతశ్చన”* (తై.ఉ 2.9).

**సంశయం:**

ఉపనిషత్తులో ఉదహరించిన బ్రహ్మాత్మైకత్వ జ్ఞానం కేవలం ఉపాసన కోసమే చెప్పబడినట్లు అర్థమవుతున్నది. అది భ్రాంతి జ్ఞానమే కాని, యదార్థ జ్ఞానం ఎలా అవుతుంది?

**సమాధానం:**

*“మనో బ్రహ్మేత్యుపాసీత”* (ఛా.ఉ 3.18.1), *“ఆదిత్యో బ్రహ్మేతి ఆదేశః”* (ఛా.ఉ 3.19.1) – ఇటువంటివి అధ్యస్త దృష్టి కోసం చెప్పినవి. కాని *‘అహం బ్రహ్మాస్మి’* అనే ఆత్మజ్ఞానం అధ్యాస కాదు. మిథ్యాజ్ఞానం బ్రహ్మాత్మైకత్వ జ్ఞానం వల్లనే నశిస్తుంది. తత్త్వజ్ఞానమంటే బ్రహ్మాత్మైకత్వ జ్ఞానమనే అద్వైత సిద్ధాంత సారాంశము.

**సంశయం:**

శాస్త్రయోని అంటే శాస్త్రం చేతనే బోధింపబడేది. బ్రహ్మము శాస్త్ర విషయం అని ఒకప్రక్క, ఇతర శాస్త్రోక్త కర్మలతో సంబంధం లేనిది అని మరోప్రక్క చెప్తున్నారు. ఇతర క్రియలతో సంబంధంలేని పక్షంలో బ్రహ్మము శాస్త్రానికి మూలకారణం

ఎలా అవుతుంది?

**సమాధానం:**

శాస్త్రం అవిద్యాకల్పితమైన సంసారిత్వాన్ని నిర్మూలించి నిత్యముక్తమైన ఆత్మస్వరూపాన్ని ప్రసాదించటానికి ఉద్దేశింపబడింది. మోక్షఫలము నిత్యమైనది. ఆత్మయందు ఎట్టిక్రియ జరగదు. క్రియకు ఆత్మకు ఎట్టి సంబంధము లేదు. 'నేను' అనే అహంకార భావంతో ఉండే శారీరుడే కర్మఫలం అనుభవించే భోగి. *'ఆత్మేంద్రియ మనోయుక్తం భోక్తేత్యాహుర్మనీషిణః"* (దేహ–ఇంద్రియ–మనస్సులతో కూడిన వానినే భోక్తగా బుద్ధిమంతులు చెప్తారు – క.ఉ 1.3.4.). ఆత్మ సర్వ వికారములకు అతీతమైనది. *"అవికార్యోఽయ ముచ్యతే"* అని చెప్పబడింది. అందువల్ల బ్రహ్మవిషయంలో ఒక్క జ్ఞానం తప్ప మరే క్రియకు, కర్మకు ఈషన్మాత్రం కూడా సంబంధం లేదనిగ్రహించాలి.

**సంశయం:**

కొందరు మీమాంసకులు అసలు బ్రహ్మమనే అగోచరమైనదీ, మరోవిధమైన ప్రమాణాలతో ఋజువు చెయ్యబడని పదార్థమే లేదు అని ప్రతిపాదించారు కదా?

**సమాధానం:**

ఉపనిషత్తులలో ప్రతిపాదించిన పురుషుడు – బ్రహ్మ మరొక పదార్థానికి అంగము కాదు. *"స ఏష నేతి నేతి ఆత్మా"* (ఇదికాదు, ఇదికాదు అని దృశ్యమైన వాటిన్నింటిని నిషేధించి ఏది చెప్పబడిందో అదే ఆత్మ – బ్రహ్మము). కూటస్థుడు లేదని కాని, తెలియబడటం లేదని కాని ఎవరు వాదిస్తూ నిరాకరిస్తున్నాడో, వానికి చేతనత్వం ఉంటే అదే ఆత్మ అని సమాధానం చెప్పాలి. ఆత్మ నిరాకరింపబడేదికాదు. సమస్త భూతాలలోను ఉన్నవాడు అద్వితీయుడు అయిన బ్రహ్మము అందరిలోను ఆత్మగా భాసిస్తూ ఉంటాడు. *"పురుషాన్న పరం కించిత్ సా కాష్ఠా స పరా గతిః"* (కూటస్థ నిత్యుడూ, నాశరహితుడూ, సర్వవ్యాపి అయిన పురుషుని కంటే పరమైనది మరొకటి లేదు. ఆ పురుషుడే పరాకాష్ఠ, అత్యుత్తమగతి – క.ఉ 1.3.11.).

**సంశయం:**

ఆత్మకు క్రియతో సంబంధము లేకపోయినా శరీరంలో శారీరుణ్ణి ఆశ్రయించి ఉండటం వల్ల యజమానిత్వం ఉంటుందని చెప్పటం యుక్తము కాదా?

**సమాధానం:**

దేహాదులందు భ్రాంతి, కల్పితమైన ఆత్మాభిమానం ఉన్నంత వరకే యజమానిత్వం ఉంటుంది. దేహాభిమానం పోతే యజమానిత్వం ఉండదు. తన కుబుసంపై (పాముపొరపై) సర్పానికి 'ఇది నా శరీరం' అని మోహం ఎలా ఉండదో, అట్లే జ్ఞానికి ఈ శరీరానికి నేను యజమానిని, ఇది నాది అనే అభిమానం నశిస్తుంది.

**సంశయం:**

దేహాదుల కంటె భిన్నమైన ఆత్మకు, తనకు సంబంధించిన దేహాదులతోనే నేను–నాది అనే అభిమానం మిథ్య ఎలా అవుతుంది? దాని గౌణము (చిహ్నము) అని గ్రహించవలసి ఉంటుంది కదా?

**సమాధానం:**

స్థితప్రజ్ఞుడైన విద్వాంసునికి లౌకికములైన ఎట్టి వ్యాపారముతోను సంబంధం ఉండదని స్మృతి(భగవద్గీత) కూడా *"స్థిత ప్రజ్ఞస్య కా భాషా"* (భ.గీ 2.54) అనేశ్లోకంలో వివరించింది. బ్రహ్మ (ఆత్మ) భావం ఉన్న వ్యక్తికి యథాపూర్వంగా సంసారిత్వం, ప్రాపంచిక విషయాలపై ఆసక్తి ఉండదు. ఎవనికైతే దేహాభిమానం, మరియు ప్రాపంచిక విషయాలపై మోహం పోదో – వానికి బ్రహ్మాత్మభావం కలగలేదనే గ్రహించాలి.

నాలో ఉన్న చైతన్యం, తేజస్సు బ్రహ్మ అస్తిత్వాన్ని నాకు నిరూపిస్తున్నాయి. అందువల్ల *"అహం బ్రహ్మాస్మి"* (నా ఆత్మే

బ్రహ్మము), “సోఽహం” (ఆ బ్రహ్మమే నేను) అనే జ్ఞాన ప్రాప్తికే ఆత్మాన్వేషణ, జ్ఞానసాధన. “జ్ఞానాదేవ తు కైవల్యమ్” (జ్ఞానం వలనే మోక్షప్రాప్తి) అనే వేదాంత వాక్యాల ఉపదేశమే ముఖ్యప్రాతిపదిక. శ్రుతి ప్రామాణ్యంతో బ్రహ్మమును స్వతంత్రరూపంలో ప్రతిపాదిస్తున్న వేదాంత వాక్యాలను సమన్వయించుకొని, ఆత్మదర్శనము చేసుకున్న పురుషుడు అమృతత్వం పొందుతాడు.

**ఇతి చతుస్సూత్రీ సమాప్తమ్**

# 5. ఈక్షత్యధికరణమ్

సాంఖ్య మతానికి చెందినవారు ఈశ్వరుడు జగత్ సృష్టికి కారణమని నమ్మరు. వారి మతానుసారము సత్త్వ–రజస్–తమో గుణాల కలయిక (త్రిగుణాత్మక మైనది) 'ప్రధానము' అనే పదార్థము. ఆ పదార్థమే జగత్కారణమని వారు విశ్వసిస్తారు. కొన్ని శ్రుతి–స్మృతి వచనాలను వారి మతానుకూలముగా అన్వయించుకుంటూ ప్రధానమే జగత్కారణమని వాదిస్తారు. అయితే వేదాంతులు, ప్రధానము అచేతనమైన అసద్వస్తువు, అందువలన దాని ప్రభావము వలన జగత్‌సృష్టి జరిగే ప్రసక్తే లేదు అని సాంఖ్యమత అనీశ్వరవాదాన్ని నిరాకరిస్తారు. కాని, 'సత్' అనేది త్రిగుణాలలో ఒక భాగంగా ప్రధానములోనూ ఉంది కాబట్టి, అది జగదావిర్భావానికి కారణమని అన్వయించుకోవచ్చునని "సత్త్వాత్ సంజాయతే జ్ఞానమ్ " (భ.గీ 14.17) అనే స్మృతి వాక్యం ప్రామాణ్యంగా చూపుతారు.

బ్రహ్మవాదులు ప్రధానము జడపదార్థము, చైతన్యస్వభావము లేనిది కాబట్టి వేదాంత నిర్దేశితమైన ఆత్మ–ఈశ్వరుడు–పరమాత్మ అనే సద్రూపాలకే జ్ఞానం ఉంటుంది, అందువల్ల జగత్తులో కనబడే సర్వప్రాణుల సృష్టి–స్థితి–లయములకు జగత్ కార్యసాధనకు బ్రహ్మయొక్క సర్వజ్ఞత, చేతనత్వము కారణము అని నిర్ధారిస్తారు.

## సూ: 1.1.5 ఈక్షతేర్నాశబ్దమ్

**పూర్వపక్షి:**

దేహేంద్రియాలు లేనిది, నిర్గుణ స్వరూపము అయిన బ్రహ్మము ఏ విధంగా సర్వజ్ఞః అని చెప్పబడుతుంది? బుద్ధ్యాదులు శరీరవిహీనులకు ఎలా ఉంటాయి?

**సమాధానం:**

ప్రధానమనే పదార్థం సృష్టికి మూలం అని ఏ శ్రుతి వాక్యములోను వినబడదు. జగత్తులో నామ–రూపాలతో పరిచ్ఛిన్నమైన ప్రాణులు, తదితరములు బ్రహ్మ కారణంగానే సంభవించాయని శ్రుతులు పలుకుతున్నాయి. "తదైక్షత" (ఛాం.ఉ 6-2-3.) అనే శ్రుతి బ్రహ్మపరంగానే చెప్పబడింది. ఆ శబ్దం ప్రధానమునకు వర్తిస్తుందని చెప్పబడదు.

**సంశయం:**

సృష్టికార్యం, మహదాదుల ఉత్పత్తికి కారణం సాంఖ్యప్రతిపాదిత ప్రధానము ఎందుకు కాకూడదు?

**సమాధానం:**

సృష్టికి పూర్వం సన్మాత్రం అవ్యాకృతమై ఉండేది. ఆ సద్రూపం ఆలోచించి నా శక్తితో లోకాలను సృజిస్తాను అని సృష్టి కార్యానికి ఉపక్రమించినట్లు శ్రుతి ఇలా వచిస్తున్నది: *"ఆత్మావా ఇదమేక ఏవాగ్ర ఆసీత్, నాన్యత్ కించన మిషత్, స ఈక్షత లోకాన్ను సృజా ఇతి, స ఇమాన్ లోకాన్ ఆసృజత"* (ఐ.ఉ 1.1.1.). *"యః సర్వజ్ఞః సర్వ విద్యస్య జ్ఞానమయం తపః తస్మాత్ ఏతత్ బ్రహ్మ నామ రూప మన్నం చ జాయతే"* (ఏ పరమాత్మ యొక్క తపస్సు జ్ఞానమయమైనదో, ఆ సర్వజ్ఞుడు కారణభూతమై నామ–రూపములను, అన్నమును సృష్టించెను - ము.ఉ 1.19).

*"తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి, తత్తేజో–సృజత"* (ఛా.ఉ 6.2.1.) అని మరో శ్రుతి వినిపిస్తున్నది. జ్ఞాన విషయమైన ఆలోచన కర్మరూపంలో ఎలా అంగీకరించబడుతుంది అని పూర్వపక్షి సంశయం వ్యక్తం చేస్తే, బ్రహ్మ విషయంలో జ్ఞానానికి కర్మనిర్దేశం లేకపోయినా 'తదైక్షత' అని కర్తృత్వం చెప్పటం జరిగింది. కాబట్టి, జగదావిర్భావం బ్రహ్మ ఆలోచించి చెయ్యటం వలన కార్యరూపం దాల్చింది అని అన్వయించుకోవటం యుక్తము.

**సంశయం:**

సంసారికి మాత్రమే జ్ఞానప్రక్రియకు శరీరాదుల అపేక్ష (ఆవశ్యకత) ఉంటుంది, అది పరమేశ్వరుడికి ఉండదని ఎలా

నిర్ణయించటం కుదురుతుంది?

**సమాధానం:**

శరీరాదులు ఉంటేనే ఈక్షితృత్వం, జ్ఞానం ఉండి ఆలోచించే శక్తి ఉంటుం దనుకోవటం భ్రమ మాత్రమే. ఆకాశం యొక్క అవగాహనలో, ఘటాది ఉపాధుల్లో ఉండే ఆకాశం, సూది రంధ్రంలో ఉండే ఆకాశాన్ని మిథ్యా జ్ఞానంతో, 'ఈ పరిమిత మైన ఆకాశం మహదాకాశం కన్న భిన్నమైనది' అని ఎలా భ్రాంతి కల్గుతుందో; అదే విధంగా శరీరంలో ఉపాధిగా ఉండే ఆత్మ, పరమాత్మ వేరు అనే భిన్న భావన ఉంటేనే ఈ సందేహం వస్తుంది. పరమాత్మ శక్తి అనిర్వచనీయము, అపారము అని గ్రహించాలి. "న తస్య కార్యం కరణం చ విద్యతే న తత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే, పరాస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబల క్రియా చ" (ఈశ్వరునికి శరీరము ఇంద్రియాదులు లేవు. అతనితో సమానుడు కాని, అధికుడు కాని లేరు. అతని శక్తి చాలా గొప్పది. ఎన్నో విధాలైన రూపాలలోను ఉన్నట్లు శ్రుతులు చాటుతున్నాయి – శ్వే.ఉ 6.8). సర్వేశ్వరుడికి చేతులు కాని, కాళ్లు కాని లేవు. అతడు పరిగెత్తి వెళ్లగలడు, పట్టుకోగలడు. కళ్లు లేవు, కాని చూడగలడు. చెవులు లేవు, కాని వినగలడు. ఏది తెలుసుకోవాలో దానిని తెలుసుకుంటాడు. అతడు సర్వవ్యాపి, ఆది పురుషుడు అని మరో శ్రుతిలో ఇలా చెప్పబడుతున్నది: "అపాణిపాదో జవనోగ్రహీతా పశ్యత్యచక్షుః స శృణోత్యకర్ణః స వేత్తి వేద్యం న చ తస్యాస్తి వేత్తా తమాహురగ్ర్యం పురుషం మహాంతమ్" (శ్వే.ఉ 3.19).

## సూ: 1.1.6 గౌణశ్చేన్నాత్మశబ్దాత్

కొన్ని సందర్భాలలో 'తా ఆప ఐక్షంత' (నీరు ఆలోచిస్తున్నది), 'కూలం పిపతిషతి' (నది ఒడ్డు కూలిపోతాననుకుంటున్నది) – అనే వాక్య ప్రయోగాలు వాడుకలో ఉన్నాయి. జల, తేజస్సులలో చెప్పినట్లు ప్రధానము జడమైనా ఐక్షత అని ఔపచారికంగా గౌణార్థంలో అన్వయించుకోబడుతుంది కదా అని పూర్వపక్షి ప్రశ్నిస్తున్నాడు. దానికి సమాధానం ఇలా ఇవ్వబడింది: *"సేయం దేవతా ఐక్షత, హంత అహ మిమాం త్రిస్రోదేవతా అనేన జీవేనాత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి"* (సన్మాత్రమైన తత్ ఆ బ్రహ్మ తేజస్సును సృజించి తేజో–బన్నాదులను మూడు దేవతా మూర్తులుగా నిర్దేశిస్తూ, నేను ఈ దేవతలను నా ఈ ఆత్మతోనే ప్రవేశించి, నామ రూపాలను విభజిస్తాను అనే ఆలోచన చేసెను –ఛా.ఉ 6.3.2.) అని శ్రుతి. అందువల్ల అప్, తేజస్సులకు కూడా సత్‌ను ఆశ్రయించుకోవటం వల్ల ఈక్షితృత్వం కలిగినట్లు 'తా ఐక్షంత' అని చెప్పబడింది.

*"సదేవ సోమ్య! ఇదమగ్ర ఆసీత్"* అని ప్రారంభించి *"తదైక్షత తత్తేజోఽసృజత"* (ఛా.ఉ 6.2.2.3.) అని శ్రుతిలో వినబడుతున్నది. ప్రాణధారి అయిన జీవుడు, అచేతనమైన ప్రధానమును 'నా ఈ ఆత్మ' అని చెప్పటం కుదరదు. అందువల్ల ఈక్షణం (ఆలోచన) చేసింది చేతనమైన బ్రహ్మ అని సమన్వయించుకుంటేనే, తచ్ఛక్తియే ప్రాణధారి అయిన జీవుడి యందు ప్రవేశించి చైతన్యమును ప్రసాదించెను అని గ్రహించవచ్చు.

## సూ: 1.1.7 తన్నిష్ఠస్య మోక్షోపదేశాత్

ప్రధానమును గౌణార్థంలో కాకుండా ముఖ్యార్థంలో తీసుకున్నా సృష్టికి కారణంగా ఆ పదార్థాన్ని స్వీకరించవచ్చు అని పూర్వపక్షి మళ్లీ తన వాదనను కొనసాగిస్తున్నాడు. దానిని ఇలా సమర్థిస్తున్నాడు: సేనాని అయిన భద్రసేనుణ్ణి ఒక రాజు ఇతడే నా ఆత్మ (మమాత్మా) అని సంబోధించటం లోక వ్యవహారంలో ఉంది. అదీకాక భూతాత్మ, ఇంద్రియాత్మ అనే ప్రయోగాలు పురాణాలలో కనబడతాయి. కాబట్టి భోగ–మోక్షాదులను సమకూర్చిపెట్టడంలో ఉపయుక్తమైనది అనే భావనలోనైనా ప్రధానమును ముఖ్యార్థంలో గ్రహించటానికి అవకాశం ఉంది.

**సమాధానం:**

"తత్త్వమసి" అనే ఉపదేశం ఏ సందర్భంలో జరిగిందో దానిని సరిగ్గా అర్థం చేసుకోవలసి ఉంది. ఉద్దాలకుడు

పుత్రుడైన శ్వేతకేతునకు మోక్షప్రాప్తికి మార్గాన్ని ఉపదేశిస్తూ 'తత్ త్వం' అని (అదే నువ్వు—ఆ ఆత్మ స్వరూపమే నువ్వు) అని బోధించటం తొమ్మిది పర్యాయాలు వివిధ దృష్టాంతాలతో ప్రదర్శిస్తూ జరిగింది. శ్వేతకేతువు చేతనుడైన వ్యక్తి. అతనికి అచేతనము—సన్మాత్రమూ కాని ప్రధానాన్ని 'తత్—త్వమసి' అని ఏవిధంగా బోధింపబడుతుంది? జీవో బ్రహ్మైవ అనే బ్రహ్మ – ఆత్మ ఏకత్వాన్ని బోధించటానికే ఆ బ్రహ్మమే నువ్వు అని చెప్పటం న్యాయం కాని, నువ్వు అచేతనుడవు అని బోధించటం అన్యాయం అవుతుంది.

స్వర్గాదులపై అపేక్ష ఉన్నవారికి యథార్థమైన అగ్నిహోత్రాన్ని సాధనగా ఉపదేశించినట్లే ముముక్షువునకు యథార్థమైన సదాత్మనే "తత్వమసి" అని బోధించటము సమంజసము.

## సూ: 1.1.8 హేయత్వావచనాచ్చ

మరే ఇతర కారణాల వలన ప్రధానమును సచ్ఛబ్ద వాచ్యముగా అంగీకరించలేము అని పూర్వపక్షి సందేహం వ్యక్తం చేయగా దానికి సమాధానంగా నాలుగు సూత్రాలు (1.1.8 – 1.1.11.) చెప్పబడ్డాయి.

అరుంధతీ నక్షత్రాన్ని చూపడానికి దగ్గరలోనున్న కాంతివంతమైన పెద్ద నక్షత్రాన్ని ముందు చూపించి దాని నుంచి దృష్టి మళ్లించి నిజమైన అరుంధతీ నక్షత్రాన్ని చూపించటం లోక పరిపాటి. ఈ దృష్టాంతంలో హేయమైన వస్తువుని తిరస్కరించాలని ఎలా బోధించటం జరుగుతుంతో చెప్పబడింది. శ్వేతకేతువుకు ఆత్మోపదేశంలో ఎట్టి హేయవచన ప్రయోగం లేదు. చాలా స్పష్టంగా *"స ఆత్మా తత్వమసి"* అని చెప్పబడింది. అందువలన ఆత్మ చేతన స్వభావము గల బ్రహ్మమే. *"యథా సోమ్య ఏకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాత్ వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్ ఏవం సోమ్య స ఆదేశో భవతి"* (– ఛా.ఉ 6.1.4.) (మృత్పిండము కారణ రూపం. మృత్‌ను తెలుసుకుంటే మట్టితో చేసిన ఘట శరావాది వస్తు సముదాయమంతా మృణ్మయమే అని తెలుస్తుంది. అన్నీ ఆ మట్టి యొక్క కార్యరూపములే అని తెలుసుకోవచ్చు. వాక్కు చేత పోల్చుకోటానికి నామ—రూపాలు వేరు వేరుగా ఉంటాయి కాని, వాటన్నింటికి మూల వస్తువు ఒకటే. ఇవన్నీ మృత్ – కారణం యొక్క వికారాలు మాత్రమే, అలాగే శ్వేతకేతూ! నువ్వు కూడా ఈ బ్రహ్మము యొక్క స్వరూపమే అని తెలుసుకో).

ప్రధానము జడపదార్థము కాబట్టి, అది అనుభవయోగ్యమైన భోగ పదార్థాలకు మాత్రమే కారణం కాగలదు. ప్రధానాన్ని సచ్ఛబ్ద వాచ్యంగా గుర్తిస్తే, చేతన ప్రవృత్తులు గల జీవాదులు దాని వల్ల ఉద్భవించినట్లు చెప్పవలసి ఉంటుంది. ప్రాణధారణ చేసే జీవసముదాయం భోక్తృవర్గానికి చెందుతుంది. అందువల్ల అచేతనమైన ప్రధానం కారణంగా భోక్తృవర్గం కార్యరూపం దాల్చబడదు.

## సూ: 1.1.9 స్వాప్యయాత్

*"యత్రైతత్ పురుషః స్వపితి నామ సతా సోమ్య తదా సంపన్నో భవతి"* (ఛా.ఉ 6.8.1.). సుషుప్తి(గాఢనిద్ర)లో ఉన్న జీవుణ్ణి స్వపితి అంటారు. అనగా ఆ జీవుడు తన ఆత్మలో తనే లీనమైపోయి సమస్త ప్రాపంచిక విషయాలకు దూరమై పోతాడు. ఒక్క ప్రాణమే చలిస్తూ ఉంటుంది. స్వప్నాలు కూడా రావు. జీవుడి ఆత్మ హృదయంలో ఉంటుంది. హృది + అయమ్ అన్నదే నిర్వచనం *"సవా ఏష హృది తస్యై తదేవనిరుక్తం హృదయమితి. తస్మాత్ హృదయమ్"* (ఛా.ఉ 8.3.3.). ప్రధానము అచేతనమైనది. అందువల్ల చేతనమైన ఆత్మతో అచేతనమైనది లీనమవుతుందని చెప్పబడదు. అంతేకాదు మరోశ్రుతి *"ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్తో న బాహ్యం కించన వేదనాంతరమ్"* (ప్రాజ్ఞుడైన ఆత్మతో కలసిపోయి బాహ్యవిషయాలు, అంతర విషయాలూ ఏవీ తెలుసుకోలేని పరిస్థితిలో జీవుడు ఉంటాడు – బృ.ఉ 4.3.1.) అని కూడా వినబడుతున్నది.

## సూ: 1.1.10 గతిసామాన్యాత్

ఉపనిషద్వాక్యాలు అన్నీ జ్ఞానం విషయంలో ఒకే గతిని ప్రస్తావించి, సర్వజ్ఞుడైన బ్రహ్మము జగత్కారణమని రూఢి చేస్తున్నాయి. *"యథాగ్నేర్జ్వలతః సర్వాదిశో విస్ఫులింగాః విప్రతిష్ఠేరన్ ఏవమేవ ఏతస్మాదాత్మనః సర్వేప్రాణా యథాయతనం విప్రతిష్ఠంతే ప్రాణేభ్యో దేవా దేవేభ్యో లోకాః"* (మండుతున్న అగ్నికణాలు నలుదిక్కులా ఎలా ఎగురుతుంటాయో అదేవిధంగా ఆత్మ నుండి తేజోకణాలుగా ప్రాణాలు, ఇంద్రియాలు తమతమ స్థానాల గోళాలలోనికి ప్రవేశిస్తాయి. అక్కడ నుంచి వాటిని నియంత్రించే సూర్యాది యజమాన దేవతలూ, అలాగే లోకాలు, మిగతావన్నీ పరమాత్మ వల్ల భాసిస్తాయి – కౌ.ఉ 3.3). జగత్ సృష్టికి పరమాత్మయే కారణమని చెప్పే శ్రుతి వాక్యాల గతి ఒకే విధంగా ఉంది. భేదము కనబడదు. *"తస్మాద్వా ఏతస్మాత్ ఆత్మన ఆకాశః సంభూతః"* (తై.ఉ 2.9), *"ఆత్మత ఏ వేదం సర్వం"* (ఛా.ఉ 7.26.1), *"ఆత్మన ఏష ప్రాణో జాయతే"* (ప్ర.ఉ 3.3.)... ఈ విధంగా సామాన్యగతితో వేదాంత వాక్యాలన్నీ ఆత్మ చేతనమైనది అని, జగత్కారణం బ్రహ్మమే అని ఉద్ఘోషిస్తున్నాయి. అందువల్ల, చేతన స్వభావము లేని ప్రధానము జగత్కారణం అని అంగీకరించబడదు.

## సూ: 1.1.11 శ్రుతత్వాచ్చ

అచేతనమైన ప్రధానము గాని, మరే పదార్థము గాని జగత్కారణము కానేరదు. బ్రహ్మ సర్వవిత్, అంతా తెలిసిన సర్వజ్ఞుడు. శ్రుతిలో ఇలా స్పష్టంగా విన్పిస్తున్నది *"న తస్య కశ్చిత్ పతిరస్తి లోకే న చ ఈశితా, నైవ చ తస్య లింగమ్, స కారణం కరణాధిపాధిపో న చాస్య కశ్చిజ్జనితా న చాధిపః"* (పరమాత్మ తప్ప మరే ఇతరము గాని, తత్సమానమైనది గాని లేదు. ఈ లోకంలో ఈశ్వరునికి ప్రభువు లేదు. అతనిపై అధికారం చేసేవాడు లేదు. అతనికి ఏ సంజ్ఞ (లింగము) లేదు. అతనిని పుట్టించినవాడు గాని అధికుడు గాని లేదు – శ్వే.ఉ 6.9) అని సర్వేశ్వరుని గురించి పైన ఉదహరించిన శ్రుతి నిర్దిష్టంగా పలుకుతున్నది.

జగత్కారణం పరబ్రహ్మ తప్ప ప్రధానాదులు కావు – అని ఈ ప్రకరణంలో ప్రస్తావించిన శ్రుతి వాక్యాలు నిస్సందేహంగా సూచిస్తున్నవి.

# 6. ఆనందమయాధికరణమ్

జగత్కారణమైన బ్రహ్మము అద్వితీయం, చరాచర భూతాధిపతి, స్వయంభూ. *"తమేవ భాంత మనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి"* అని పరమాత్మను 'తత్' వాచ్య ప్రయోగంతో నిర్దేశించినా, వేదాంతాలు అదే బ్రహ్మమును రెండు విధాలుగా ప్రస్తావించటం జరిగింది: 'సగుణబ్రహ్మము', 'నిర్గుణబ్రహ్మము' అని రెండు శబ్ద ప్రయోగాలు శ్రుతిలో వినబడుతున్నాయి.

'సగుణబ్రహ్మము' ను – అపరాత్మగాను, ధ్యానబ్రహ్మగాను, కార్యబ్రహ్మగాను, అపరబ్రహ్మగాను, హిరణ్యగర్భుడుగాను, ఈశ్వరుడు గాను – 'సః' అనే పుల్లింగ శబ్ద ప్రయోగంతో చెప్పటం జరిగింది. అదే ఉపనిషత్తులు 'నిర్గుణబ్రహ్మము' ను జ్ఞేయబ్రహ్మ అని, కారణ బ్రహ్మ అని, పరబ్రహ్మ అని, పరమాత్మ అని – 'తత్' అనే నపుంసక శబ్ద ప్రయోగంతో నిష్కలం, నిష్క్రియం, నిరవద్యం, నిరంజనం అనే గుణాలతో వర్ణించాయి. ఎందువల్ల ఈ రెండు విధాలైన ప్రస్తావన? బ్రహ్మము రెండు రూపాలతో వ్యక్తమౌతుందా?

*"అస్థూలం, అనణు, అప్రాణం అనంతరం, అబాహ్యం, అవ్యక్తః అజః"* అని రూపాది గుణములు లేని పరమాత్మను రెండు విధాలుగా చెప్పటం సమంజసమేనా అనే సందేహం కలుగుతుంది. ఈ సందేహ నివృత్తికే శంకర భగవత్పాదులవారు, ఈ అధికరణ ప్రారంభంలో సగుణ–నిర్గుణ బ్రహ్మ శబ్దప్రయోగాలకు హేతువులు నిర్దేశించారు.

ఏదో ఒక ఉపాధితో కూడిన ఆత్మను సగుణబ్రహ్మ రూపంగాను, ఉపాధి రహితమైన ఆత్మను నిర్గుణ బ్రహ్మముగాను నిర్వచించారు. సగుణబ్రహ్మ మాయతో ఆవరింపబడిన పరమేశ్వరుడని, కార్య నిర్వహణకు పరమాత్మ ఆ రూపంలో వ్యక్తం అవుతుందని అభిప్రాయపడ్డారు. అంతేకాదు, ఉపాసన విద్యలకు, యశస్సు, కీర్తి, లోకప్రీతి ఇత్యాది కోరికలున్న సంసారులకు ఆయా ఫలసిద్ధిని సగుణ బ్రహ్మ, పరబ్రహ్మ యొక్క ప్రతీకగా ప్రసాదించటం జరుగుతుందని సూచించారు. ఉపాసనా విధులు, వాటి ఫలం, ఏ యే దేవతల సాంగత్యం కోరుతూ చేసిన ధ్యాన కర్మలు – ఎంతవరకు ముక్తిమార్గ గమనంలో ఉపకరిస్తాయనే అంశాలపై ప్రస్తావన రానున్న (అధ్యాయం 3–4) భాగాలలో చర్చించటం జరిగింది.

## సూ: 1.1.12 ఆనందమయోఽభ్యాసాత్

**పూర్వపక్షి:**

తైత్తిరీయోపనిషత్తులో "అన్నమయః, మనోమయః, జ్ఞానమయః" అని జీవుణ్ణి ప్రతిపాదిస్తూ 'ఆనందమయః' అనే మరో ఆత్మ శారీరుడిలో ఉందని చెప్పడమైంది. అయితే, ఈ ఆనందమయమైనది ఏది? *"సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ"* అని చెప్పిన పరమాత్మా లేక సంసారి అయిన జీవుడా?

**సిద్ధాంతము:**

ఇక్కడ 'ఆనందమయః' అని చెప్పినది పరమాత్మకే వర్తిస్తుంది. బ్రహ్మనే పలు పర్యాయములు ఆనంద శబ్దంతో వర్ణించడమైనది. *"ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్"* (తై.ఉ 3.6), *"విజ్ఞాన మానందం బ్రహ్మ"* (బృ.ఉ 3–9–28.), *"ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కుతశ్చన"* (తై.ఉ 2–8–9.)... ఇలా ఆనంద శబ్ద ప్రయోగంతో బ్రహ్మ విశేషణాలు చెప్పడమైనది. అయితే, ఆనందమయ కోశంలో ఉన్న శారీరుడికి ప్రియమే శిరస్సు (*తస్య ప్రియమేవ శిరః*) అనే వాక్యం శరీరోపాధికి సంబంధించి వచ్చిన క్రమంలోనే వ్యక్తం చేయబడ్డది. అందువల్ల 'ఆనందమయః' అంటే పరమాత్మే కాని జీవుడు కాదు.

## సూ: 1.1.13 వికారశబ్దాన్నేతి చేన్న ప్రాచుర్యాత్

**సంశయం:**

ఆనందమయ శబ్దానికి ఆనందవికారం కలది అనే అర్థంతో గ్రహిస్తే అది ఆకార–వికారాదులు లేని బ్రహ్మనిర్దేశం ఎలా అవుతుంది?

**సమాధానం:**

మయట్ ప్రత్యయం (మయం) అనేది వికారార్థంలోనే కాదు ప్రాచుర్యార్థంలో కూడా ప్రయోగించబడుతుంది. గంధర్వులు, దేవతలు, ఇంద్రుడు, బృహస్పతి, ప్రజాపతి మెదలైనవారికి ఉండే ఆనందం, జీవుడి ఆనందానికి శత–సహస్రాధికంగా ఉంటుందని ఇదే శ్రుతి (తై.ఉ 2.8) లో వినబడుతున్నది. అందువల్ల ఆనందమయః అంటే ప్రాచుర్యార్థంలో బ్రహ్మమునే గ్రహించాలి.

## సూ: 1.1.14 తద్ధేతు వ్యపదేశాచ్చ

బ్రహ్మ ఆనందానికి నిలయమే కాదు, హేతువు అని కూడా గ్రహించాలి "ఏష హ్యేవ ఆనందయాతి" (బ్రహ్మమే ఆనందమును ప్రసాదిస్తున్నది). ఎవరు ఆనందమయులో వారే మరొకరిని ఆనందింప చేయగలరని ఈ వచనం దృఢీకరిస్తున్నది. అందువల్ల ఆనందమయమైనది పరమాత్మయే.

## సూ: 1.1.15 మాంత్రవర్ణికమేవ చ గీయతే

తైత్తిరీయోపనిషత్ భృగువల్లీలో వరుణుడు తన కుమారునకు చేసిన 'వారుణీ–భార్గవీ' విద్య బ్రహ్మోపదేశంగా పరిగణింపబడుతుంది. అంతకు ముందు అదే ఉపనిషత్ బ్రహ్మానందవల్లిలో 'బ్రహ్మవిదాప్నోతి పరమ్' (బ్రహ్మజ్ఞాని పరమాత్మను పొందుతాడు) అనే విషయాన్ని చెప్తూ 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ' అని పరమాత్మ యొక్క గుణధర్మాలను వివరించడమైనది. సృష్టిక్రమాన్ని ప్రస్తావిస్తూ జీవుడి హృదయ కోశాలు అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయమని ఒకదాని లోపల మరొకటి ఉంటాయని చెప్పడమైనది. ఈ క్రమంలో 'ఆనందమయ మాత్మా' అని దాని లోపల మరోకోశము ఉన్నట్లు చెప్పలేదు. అందువల్ల హృదయాంత రాలలో ఉన్న ఆనందమయ ఆత్మ అంటే పరమాత్మ రూపమని, అన్నమయ –ప్రాణమయ ఆత్మలు అనేవి జీవుడికి సంబంధించినవని అర్థం చేసుకోవాలి.

మంత్రమునకు తత్సంబంధ వ్యాఖ్యానమైన బ్రాహ్మణ భాగమునకు ఎట్టి వ్యత్యాసము లేదు. అందువల్ల, ఆనందమయమైనది *"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ"* అని వర్ణించిన పరమాత్మ అని అన్వయించుకోవటమే యుక్తము.

## సూ: 1.1.16 నేతరోఽనుపపత్తేః

ఈశ్వరుని కన్న అన్యుడు ఇతరుడౌతాడని విశదీకరించి, ఆ అన్యరూపమైన సంసారిని (శారీరుని) ఆనందమయునిగా వర్ణించటం కుదరదు. *"సోఽకామయత"* అనేక రూపాలలో ఈ జగత్తులో వ్యక్తమౌతాను (ఆవిర్భవిస్తాను) అని సంకల్పించి తత్ బ్రహ్మ సృష్టికి నాంది పలికినట్లు శ్రుతిలో వినబడుతున్నది. *"సోఽకామయత బహుస్యాం ప్రజాయే యేతి, స తపోఽతప్యత, స తపస్తప్త్వా ఇదం సర్వ మసృజత, యదిదం కించ"* (తై.ఉ 2.6). ప్రపంచంలో ఉద్భవించిన స్థావర–జంగము లన్నింటికి కారణం పరమాత్మయే అగును. మరే సంసారికి (జీవుడికి) ఇది సాధ్యము కాదు.

## సూ: 1.1.17 భేదవ్యపదేశాచ్చ

జీవుడు–పరమేశ్వరుడు వేరు వేరు అన్నట్లు కొన్ని శ్రుతుల్లో వినబడుతున్నది. జీవుడికి ఆత్మ తనతోటే ఉండేదే కదా? మరి అన్వేషించటం దేనికి? ఈ ప్రశ్నకు సమాధానంగా లోక వ్యవహారంలో ఐంద్రజాలికుడు ఆకాశంలోకి ఒక తాడు సహాయంతో ఎక్కి, అక్కడ శూన్యంలో యుద్ధం చేసి తిరిగి వచ్చినట్లు చూపరులలో భ్రాంతిని కలిగిస్తాడు. అట్లాంటి భ్రాంతి భావనే మహదాకాశం వేరు, ఘటాకాశం వేరు అనిపిస్తుంది. ఉపాధిభేదం వల్ల ఈ భిన్న భావం కలుగుతుంది. జీవాత్మ–

పరమాత్మలకు ఎట్టి భేదము లేదు.

## సూ: 1.1.18 కామాచ్చ నామమానాపేక్షా

సాంఖ్య మతస్థులు చేసిన ఆరోపణలు (సోఽకామయత అనే విషయంలో) గత అధికరణంలో *"ఈక్షతేర్నాశబ్దమ్"* అనే సూత్ర వివరణ సందర్భంగా తిరస్కరించట మైనది. ఆనందమయః అనే సందర్భంలో అటువంటి ఆక్షేపణే రాగా, దానిని తిరస్కరించటానికే ఈ సూత్రం చెప్పబడింది. ఆనందమయుడు ఆలోచనా శక్తి కలిగి ఉన్న పరమాత్మయే. దీనికి కారణంగా ప్రధానము యొక్క అపేక్ష, ఏ విధంగానూ ఉండదు అని మరోమారు చెప్పడమైనది.

## సూ: 1.1.19 అస్మిన్నస్య చ తద్యోగం శాస్తి

జీవుడికి ఆనందమయుడైన పరమాత్మకి తాదాత్మ్యం ఉంది. అందువల్లే శ్రుతి ఇలా నిర్ధారించింది: *"యదా హ్యే వైష ఏతస్మిన్ అదృశ్యే, అనాత్మ్యే, అనిరుక్తే ఽనిలయనేఽభయం ప్రతిష్ఠాం విందతే అథ సోఽభయం గతో భవతి"* (శరీర రహితము, ఆకార రహితము, వాక్కు చేత చెప్పడానికి సాధ్యపడనిది, వికారము–మాయ లేనిది అయిన బ్రహ్మము విషయంలో భయం లేని జీవుడు అభయం పొందుతాడు – తై.ఉ 2.7).

ఆనందమయమైన పరమాత్మయందు జీవుడు తాదాత్మ్య భావనతో స్థిరబుద్ధితో ఉన్నప్పుడు దుఃఖహేతువుల నుండి విముక్తుడై అభయం పొందుతాడు అని స్పష్టం చేయబడింది. ఆనందమయమనే శబ్ద నిర్దేశము పరమాత్మకే కాని ఏవిధంగానూ సాంఖ్యుల ప్రతిపాదితమైన ప్రధానమునకు వర్తించదు.

## 7. అంతరధికరణమ్

### సూ: 1.1.20 అంతస్తద్ధర్మోపదేశాత్

ఛాందోగ్యోపనిషత్తులో 'అధిదైవతమ్' అని ఆదిత్య దేవతాపురుషుని, 'అధ్యాత్మమ్' అని అక్షిపురుషుని ప్రస్తావన జరిగింది. ఈ అధికరణంలో దాని ఆధారంగా ఉపాసన విద్యతో సగుణ బ్రహ్మమును చేరే మార్గము వివరించబడింది. తదనంతరము సగుణ–నిర్గుణ బ్రహ్మముల ధర్మాలను విశదీకరిస్తూ, సంసారులకు వారి వారి సాధన ఎలా ఉంటే అలా ఫలితం లభిస్తుందని చెప్పబడింది.

**పూర్వపక్షి:**

ఆధిదైవత విభాగంలో ఆదిత్యుని ఉపాసన గురించి చెప్పిన సందర్భంలో సూర్యదేవతా వర్ణన ఇలా జరిగింది: *"అథ య ఏషో–న్తరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే హిరణ్యశ్మశ్రుః హిరణ్యకేశ, ఆప్రణఖాత్సర్వ ఏవ సువర్ణః, తస్య యథాకప్యాసం పుండరీక మేవ మక్షిణీ, తస్యోదితి నామ, స ఏష సర్వేభ్యః పాప్మభ్య ఉదిత, ఉదేతి హవై సర్వేభ్యః పాప్మభ్యో, య ఏవం వేద"* (ఆదిత్యుని లోపల ఏ పురుషుడు గడ్డమూ, వెంట్రుకలు సమస్త దేహమూ బంగారు వర్ణం కలిగి, ఎర్రని కళ్లతో ఉన్నాడో అతని పేరు ఉత్. అతను అన్ని పాపములకు అతీతుడు. ఈ విధంగా ఆదిత్యదేవతను తెలుసుకున్న సంసారి పాపరహితుడు అవుతాడు – ఛా.ఉ 1.6.7–8.). ఆ పైన అధ్యాత్మ విషయంగా *"అథ ఏషోఽన్తరక్షిణి పురుషో దృశ్యతే"* (ఈ కంటి లోపల ఏ పురుషుడు చూడబడుతున్నాడో – ఛా.ఉ 1.7.15) అని చెప్పబడింది. ఇక్కడ సందేహము కలుగుతున్నది. ఉపాస్యుడు ఎవరు? పరమేశ్వరుడు కాడనే చెప్పటం ఉచితమని తోస్తున్నది. కారణం ఏమంటే, పరమాత్మకు గడ్డమూ, దేహమూ ఇత్యాది రూపమునకు సంబంధించినవి ఉండవు కదా! అతనిని *"అశబ్దమస్పర్శ మరూప మవ్యయమ్"*, *"ఆకాశవత్ సర్వగతశ్చ నిత్యః"* (ఏ రూపమూ లేనివాడు, అవ్యయ ధర్మాలతో ఆకాశం వలె సర్వత్ర వ్యాపించి ఉన్న నిత్యమైనవాడు) అని శ్రుతిలో వినబడుతున్నది. అంతేకాదు, ఆదిత్యమండలంలో ఉన్న పురుషుని యొక్క ఐశ్వర్య పరిమితి *"స ఏష యేచ అముష్మాత్ పరాంచో లోకా స్తేషాం చేష్టే దేవకామానాం చ"* (ఈ ఆదిత్య మండలం పైన ఏ ఏ లోకాలు ఉన్నాయో వాటి విషయంలోను దేవతల భోగాల విషయంలోను ఆదిత్యపురుషునికి అధికారం ఉంటుంది అని చెప్తూ, ఆక్షి పురుషుని యొక్క ఐశ్వర్య శక్తి పరిమితి చాలా తక్కువ అని కూడా శ్రుతివాక్యాలు వినబడుతున్నాయి. *"స ఏష యే చ ఏతస్మాత్ అర్వాంచో లోకాస్తేషాం చేష్టే మనుష్య కామానాం చ"* (అక్షిపురుషుడు క్రిందనున్న లోకాలకు, మనుష్యపరమైన భోగాలకు మాత్రమే అధికారి – ఛా.ఉ 1.6.8.). ఈ విధంగా నియమిత పరిధులుండే పురుషుడు పరమాత్మ, సర్వేశ్వరుడని ఎలా చెప్పగలము? పరమేశ్వరుడు పరిధులు లేని శక్తి స్వరూపము కదా?

**సిద్ధాంతము:**

*'య ఏషోఽన్తరాదిత్యే'*, *'య ఏషో–న్తరక్షిణి'* అని ఆదిత్య మండల అంతర్భాగంలోను, జీవుడి నేత్రాంతర్భాగంలోను సూచించబడిన పురుషుడు పరమేశ్వరుడే కాని మరెవ్వరూ కాదు. ఇక్కడ పరమేశ్వరధర్మాలు స్పష్టంగా శ్రుతిలో వినబడుతున్నాయి. *"తస్యోదితినామ"* ఉదితః అనే పేరు గల ఆ పురుషుడు అన్ని పాపములకు పైన ఉన్నవాడు. అతనికి పాపములేవి అంటవు. అతనిని తెలుసుకున్న వారు పాప విముక్తులవుతారు. ఆ పురుషుడు నాలుగు వేదములకు కారణమైన బ్రహ్మము *"స ఏవర్క్ తత్సామతదుక్థం తత్ యజుః తత్ బ్రహ్మ"* అని శ్రుతి వచనాలు.

ఆదిత్యపురుషుని లక్షణాలే మళ్లీ అక్షిపురుషుని వర్ణనలోను చెప్పబడ్డాయి. అంతేకాదు, స్మృతిలో *"యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జిత మేవ వా, తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోఽంశ సంభవమ్"* (ఏ యే ప్రాణిలో శక్తి కలదో బలం, సంపద కలవో అన్నీ నా యొక్క తేజస్సు యొక్క అంశము నుండి కలిగినవని ఓ అర్జునా! తెలుసుకో – భ.గీ 10.41).

పరమేశ్వరుడు అశరీరుడు, రూపరహితుడు, కాని 'హిరణ్మయశ్మశ్రుః' ఇత్యాది పదాలతో ఆదిత్యపురుషుణ్ణి కేవలం

ఉపాసన సాధనకు ఒక రూపాన్ని నిర్మించుకొని ధ్యాన మననాలు చేసుకోటానికే వర్ణించారు. ఇది సగుణ బ్రహ్మమును పొందటానికి ఉపకరిస్తుంది. అయితే, సగుణ బ్రహ్మము పరమేశ్వరుని (నిర్గుణ బ్రహ్మము యొక్క) మాయా స్వరూపము మాత్రమే. పరమేశ్వరుడు కేవలం జ్ఞానసాధనతో పొంద బడతాడు. ఈశ్వరుడు (సగుణ బ్రహ్మము) ఉపాసన ద్వారా సంసారికి లభ్యమవుతాడు అని గ్రహించాలి.

సాధకుల అనుగ్రహార్థం ఈ మాయారూప ధారణ అని స్మృతిలో కూడా చెప్పబడింది. *"మాయా హ్యేషా మయా సృష్టా యన్మాం పశ్యసి నారద! సర్వభూత గుణైర్యుక్తం న ఏవం మాం జ్ఞాతుమర్హసి"* (నారదా! ఇలా నన్ను చూస్తున్నది నా మాయా కల్పిత రూపాన్ని మాత్రమే. ఇది నా పరమార్థము కాదు– మ.భా.శాం 339.45). పరమాత్మ సృష్టికి మూల కారణం. కనుకనే, "సర్వకర్మా, సర్వ కామః సర్వగంధఃసర్వరసః" (ఛా.ఉ 3.14.2) అని శ్రుతిలో చెప్పబడింది. అంతేకాని కార్య రూపంలో వికార ధర్మాలు పరమేశ్వరుడికి వర్తించవు అని భావించటం, "అశబ్ద మస్పర్శ మరూప మవ్యయమ్" అనే శ్రుతికి విరుద్ధమని ఆక్షేపించటం తగదు.

## సూ: 1.1.21 భేదవ్యపదేశాచ్చాన్యః

జనక మహారాజు ఒక గొప్ప యజ్ఞం చేసిన సందర్భంలో యాజ్ఞవల్క్య ఋషికి కొందరి ఋత్విక్కులకు సంవాదం జరుగుతుంది. ఆ వాదనలో ఆరుణి పరమాత్మ గురించి నీకు ఏం తెలుసు అని యాజ్ఞవల్క్యుణ్ణి ప్రశ్నించగా దానికి సమాధానంగా, యాజ్ఞవల్క్యుడు "అంతర్యామి అయిన పరమేశ్వరుడు పంచ మహా భూతాలనే కాదు, ఆదిత్యాది దేవతలను, సమస్త లోకాలను, సర్వప్రాణులను నియంత్రి స్తాడు. అట్టి అంతర్యామి అయిన ఆత్మ నాశరహితమైన" దని జవాబు ఇచ్చాడు. *"య ఆదిత్యే తిష్ఠన్ ఆదిత్యాదంతరో యం ఆదిత్యో న వేద యస్యాదిత్యః శరీరం య ఆదిత్యమంతరో యమియతి, ఏష ఉ అంతర్యామీ అమృతః"* (ఏ పురుషుడు ఆదిత్యునిలో ఉంటూ, ఎవనికి ఆదిత్యుడు శరీరమో (ఉపాధియో), ఎవరు ఆదిత్యుణ్ణి నియంత్రి స్తాడో, ఆ పురుషుడే నీ ఆత్మ, నీ అంతర్యామీ, అది నాశరహితము – బృ.ఉ 3.7.9.). ఈ శ్రుతిలో *"ఆదిత్యాదంతరో యమాదిత్యోనవేద"* అని ఆదిత్య పురుషుని లోపల అంతర్యామిగా వ్యవహరిస్తున్నది పరమేశ్వరుడే (పరమాత్మయే) అని స్పష్టంగా చెప్పబడింది.

## 8. ఆకాశాధికరణమ్

## సూ: 1.1.22 ఆకాశాస్తల్లిఙ్గాత్

**పూర్వపక్షి:**

సామవేదీయ ఉద్గీథవిద్య సాధకులైన దాల్భ్యుడు, శాలావత్యుడు, జైవలి అనే ముగ్గురు ఉద్గీథానికి ఉత్కృష్ట స్థానము (పరాయణమ్) అనే విషయంపై చర్చ చేశారు. దాల్భ్యుడు స్వర్గం అని ప్రతిపాదించగా, స్వర్గానికి తనంతటతాను నిలచే శక్తి లేనందు వల్ల, కర్మ ద్వారా స్వర్గాన్ని నిలపగలిగే శక్తి కలది ఇహలోకమే కాబట్టి, ఈ లోకమే ఉద్గీథకు పరమాగతి అని వాదించాడు. అయితే, ఉద్గీథకు ఇహలోకమే పరిధి అని చెప్పటం కుదరదు కాబట్టి ఆకాశమే ఉద్గీథకు ఉత్కృష్టస్థానము అని ప్రతిపాదిస్తాడు. ఈ సందర్భంలో శ్రుతి ఇలా వినిపిస్తున్నది: *"అస్య లోకస్య కా గతిరితి, ఆకాశ ఇతిహోవాచ, సర్వాణి హవా ఇమాని భూతాని ఆకాశాదేవ సముత్పద్యంతే, ఆకాశం ప్రత్యస్తం యంతి, ఆకాశో హ్యేవైభ్యో జ్యాయానాకాశ: పరాయణమ్"* (ఈ లోకానికి చివరి గతి ఏది?... ఆకాశం. ఎందువల్ల ననగా సర్వభూతాలు (ప్రాణులు) ఆకాశం వల్లనే (వర్ష కారణంగా) పుడుతున్నవి. ఆకాశం లోనే లయమవుతున్నవి. అకాశమే పరమగమ్యం – ఛా.ఉ 1.9.1.). ఇచ్చట 'పరాయణమ్' అని చెప్తున్నది భూతాకాశమేనా (పంచ భూతాలలో ఒకటైన ఆకాశమేనా) లేక ఈ ఆకాశ శబ్దం సర్వవ్యాపి అయిన బ్రహ్మమును నిర్దేశిస్తున్నదా అనే సందేహం కలుగుతున్నది.

**సిద్ధాంతం:**

ఇచ్చట ఆకాశ శబ్దంతో చెప్పబడింది భూతాకాశము కాదు. పరమాగతి (పరాయణమ్) అన్నది బ్రహ్మమునకే వర్తిస్తుంది. అన్ని ప్రాణుల జనన మరణాదుల గురించి చెప్తున్న *"ఆకాశాదేవ సముత్పద్యంతే, ఆకాశం ప్రత్యస్తం"* అనే వాక్యాలు పరబ్రహ్మమునకే చెందుతాయి. ఇంకా ఆకాశం లోకాల కన్నా చాలపెద్దది అంటూ *"జ్యాయాన్ పృథివ్యా, జ్యాయాన్ అంతరిక్షా జ్యాయాన్ దివో జ్యాయానేభ్యో లోకేభ్యః"* (ఛా.ఉ 3.14.3) అని ఆకాశం గురించి చెప్పబడింది. మరో శ్రుతిలో 'పరాయణమ్' అని ప్రతిపాదిస్తూ *"విజ్ఞాన మానందం బ్రహ్మ రాతేర్ధాతుః పరాయణమ్"* (విజ్ఞానానికి ఆనందానికి రూపమైన బ్రహ్మ, ధనదాతకు పరమాగతి – బృ.ఉ 3.9.28.) అని చెప్పబడింది. అంతేకాదు, *"స ఏషో పరోవరీయాన్ ఉద్గీథః, స ఏషోఽనంతః"* (ఈ ఉద్గీథం చాలా శ్రేష్ఠమైనది. అది పరిధులు లేని అనంతము).

ఉద్గీథ శబ్దము ఓంకార శబ్దంలాగ సామవేదంలో పవిత్రమైనదిగా చెప్ప బడింది. అందువల్ల *"స ఏషోఽనంతః"* అని విశేష ధర్మాలతో ప్రతిపాదించిన ఆకాశ శబ్దం పరబ్రహ్మకే వర్తిస్తుంది కాని భూతాకాశానికి కాదు.

ఆకాశ శబ్దం దాని పర్యాయపదాలతో మరికొన్ని శ్రుతి వాక్యాలు బ్రహ్మను ఉద్దేశిస్తూ ప్రయోగింపబడ్డాయి. *"ఓం కం బ్రహ్మ, ఖం బ్రహ్మ"* (ఛా.ఉ 4.10.5), *"ఖం పురాణమ్"* (బృ.ఉ 5.1), *"సైషా భార్గవీ వారుణీ విద్యా పరమే వ్యోమన్ ప్రతిష్ఠితా"* (తై.ఉ 3.6)... వీటి ఆధారంగా ఆకాశ శబ్దం బ్రహ్మనే పరమాత్మ లింగాలతో బోధిస్తున్నది అని నిర్ణయించడమైనది.

## 9. ప్రాణాధికరణమ్

## సూ: 1.1.23 – అత ఏవ ప్రాణః

**పూర్వపక్షి:**

క్రిందటి అధికరణములో బ్రహ్మము యొక్క లింగాలతో ఆకాశము చెప్ప బడినట్లే, ఈ అధికరణంలో ప్రాణము చెప్పబడింది. ఛాందోగ్యోపనిషత్తులో ఉషస్తి అనే గొప్ప సామవేద పండితుడు, ఒకానొక రాజు యజ్ఞం చేస్తుంటే కాస్త ధనసంపాదన కోసం వెళ్తాడు. యజ్ఞవేదికలో ఋత్విక్కులు మంత్రార్థ జ్ఞానం లేకుండా మంత్రపఠనం చేస్తున్నట్లు గ్రహించి, వారిని ఏ దేవతలను ఆహ్వానిస్తూ మీరు ఈ హోమాలు చేస్తు న్నారో తెలియకపోతే మీ తలలు తెగి పడిపోతాయి అని హెచ్చరిస్తాడు. ఆ సందర్భంలో ప్రస్తావ ఋత్విక్కు (ప్రస్తోత)ను మీరే దేవతను గురించి ఈ సామగానం చేస్తున్నారు అని ప్రశ్నించగా, అతను నాకు ఆ విషయం తెలియదు అని అంగీకరించగా, ఈ శ్రుతిని ఉషస్తి వినిపిస్తాడు: *"కతమా సా దేవతేతి, ప్రాణ ఇతి హోవాచ, సర్వాణి హవా ఇమాని భూతాని ప్రాణమేవాభివసంతి, ప్రాణ మభ్యుజ్జిహతే, సైషా దేవతా ప్రస్తావమన్వాయత్తా"* (ఇచ్చట ప్రాణదేవత ఆహ్వానింపబడుతున్నది. కారణం ప్రాణమే సమస్త భూతముల జనన–మరణములకు ఆధారము – ఛా.ఉ 1.11.5). మరో సందర్భంలో *"ప్రాణ బంధనం హి సోమ్య! మనః"* (మనస్సు, ఉపాధిగా గల జీవునకు బంధనము – ఛా.ఉ 6.8.2). బృహదారణ్యకంలో *"ప్రాణస్య ప్రాణః"* (ప్రాణములకు ప్రాణము–బృ.ఉ 4–4–8). మరో శ్రుతిలో *"యదావై పురుషః స్వపితి, ప్రాణం తర్హి వాగప్యేతి, ప్రాణం చక్షుః ప్రాణం శ్రోత్రం, ప్రాణం మనః, స యదా ప్రబుధ్యతే ప్రాణాదేవ అధిపునర్జాయంతే"* (సుషుప్తిలో పురుషుని వాక్కు ప్రాణంలో లీనమవు తుంది. నేత్రము, శ్రోత్రము, మనస్సు అన్నీ ప్రాణంలో లీనమై, తిరిగి మేల్కొనగానే ప్రాణం వలననే ఇంద్రియాలన్నీ తిరిగి యధావిధిగా వచ్చేస్తాయి – శ.బ్రా 10.3.3.6). ఇక్కడ ఉదహరించిన శ్రుతి వాక్యాలలో ప్రస్తావింపబడ్డ ప్రాణ శబ్దం దేనిని సూచిస్తున్నది.

**సిద్ధాంతం:**

భూతములన్నీ పరబ్రహ్మము నుండే పుట్టాయని చెప్పే వేదాంత మర్యాదను అనుసరించి *"సర్వాణి హవా ఇమాని భూతాని ప్రాణ మేవాభిసంవిశంతి, ప్రాణమభ్యుజ్జిహతే"* అని చెప్పటం వల్ల, ప్రాణ శబ్దము బ్రహ్మమనే ఈ సూత్రంలో నిర్దేశింపబడింది. స్వప్న–జాగ్రదవస్థలలో ప్రాణధారితమైన ఇంద్రియాలు (చక్షు, శ్రోత్రాదులు) సంవేశన–ఉద్గమన (రావటం, పోవటం అనే) ధర్మాలు నిర్వర్తిస్తాయి గాని, సమస్త భూతాలు కాదు. శ్రుతిలో స్పష్టంగా *"సర్వాణి భూతాని"* (ఛా.ఉ 1.11.5) అని విన్పిస్తున్నది. అందువల్ల ప్రస్తావదేవతగా ఆహ్వానించబడ్డ ప్రాణం బ్రహ్మమునే సూచిస్తున్నది.

ప్రాణ అపానాది పంచ వాయువుల్లో ప్రాణం ఒక అంశ (వికారము) మాత్రమే. అదీకాక సుషుప్తిలో ఇంద్రియాలన్నీ ప్రాణంలో లీనమవుతాయి అనే శ్రుతిలో, *"యథా సుప్తః, స్వప్నం న కంచనపశ్యతి అథాస్మిన్ ప్రాణ ఏవ ఏకధా భవతి, తదైనం వాక్, సర్వైః నామభిః సహాప్యేతి"* (కౌ.ఉ 6.3.3). నిద్రపోతున్న జీవుడు ఏ ప్రాణంలో లీనమవుతున్నాడో ఆ ప్రాణం బ్రహ్మ అంశమనే గ్రహించాలి.

*"ప్రాణస్య ప్రాణమ్"* శబ్దం యొక్క భేదాన్ని అనగా 'ప్రాణస్య' అని షష్ఠీ విభక్తిలో చెప్పిన ప్రాణం 'వేరైనది' అని సూచిస్తున్నది. అందువల్ల అది పరమాత్మ నిర్దేశమని గ్రహించాలి. అలాగే *"ప్రాణ బంధనం హి సోమ్య మనః"* అనే శ్రుతిలో సామాన్యంగా పంచవాయువులలో చెప్పే ప్రాణవాయువని గ్రహించకుండా, ప్రకరణాన్ని బట్టి పరమాత్మ (బ్రహ్మము) అనే అన్వయించుకోవాలి.

## 10. జ్యోతిశ్చరణాధికరణమ్

### సూ: 1.1.24 జ్యోతిశ్చరణాభిధానాత్

**పూర్వపక్షి:**

ఛాందోగ్యోపనిషత్తులో హృదయ నాడుల గురించి ప్రస్తావిస్తూ *"అథ యత్ అతః పరో దివో జ్యోతిః దీప్యతే విశ్వతః పృష్ఠేషు, సర్వతః పృష్ఠేషు, అనుత్తమేషు ఉత్తమేషు లోకేషు, ఇదం వావ తద్యత్ ఇదం అస్మిన్ అంతః పురుషే జ్యోతిః"* (ఈ ద్యులోకానికి, పైన సమస్త ప్రాణులకు పైన, పృథివ్యాది లోకాలకు పైన, ఉత్తమోత్తమ లోకాలలో ఏ తేజస్సు ప్రకాశిస్తున్నదో, అదే ప్రాణుల హృదయంలో ఉన్న తేజస్సు –ఛా.ఉ 3.13.7). ఇచ్చట ప్రతిపాదించిన తేజస్సును ఆదిత్యుని యొక్క తేజస్సుగానే గ్రహించాలని తోస్తున్నది. ఇక్కడ బ్రహ్మము యొక్క లింగమేదీ వ్యక్తం చెయ్యబడలేదు. రూపరహితమైన బ్రహ్మము 'దీప్యతే' అని చెప్పటం సరికాదు. అంతేకాక ద్యులోకం పైన అని ఒక హద్దు – పరిమితి చెప్పబడింది. సర్వాత్మకమైన బ్రహ్మ సర్వత్ర ప్రకాశిస్తూ ఉండాలి కదా? ఈ జ్యోతిని పంచభూతాల త్రివృత్కరణ ప్రక్రియ పూర్వం, అగ్నిగా గ్రహించాలన్నా, ఆ రూపంలో అగ్ని ద్యులోకాలపైనే ఉంటుందని మరెక్కడా ప్రస్తావింపబడలేదు.

కుక్షిలోనున్న జఠరాగ్ని రూపంలో కూడా గ్రహించటం సమంజసం కాదన్నట్లు తోస్తున్నది. కారణం ఆ ఉష్ణత చేతితో తాకితే తెలుస్తుంది, దాని ఘోష చెవికి వినబడుతుంది అని కూడా చెప్పబడింది. *"తస్యైషా దృష్టిః తస్యైషా శ్రుతిః" (ఛా.ఉ 3.13.7).* ఈ విధంగా తెలుసుకొని ఆ జ్యోతిని ఉపాసన చెయ్యాలి: *"తదేతత్ దృష్టం చ శ్రుతం చ ఇత్యుపాసీత, చక్షుష్యః శ్రుతో భవతి, య ఏవం వేద"* (ఛా.ఉ 3.13.18). అయితే, ఈ ఉపాసన ఫలాపేక్ష గలది. కాబట్టి, ఆ భోగఫలమ. అనిత్యము. ఆ జ్యోతి, దృష్టము, శ్రుతము అని చెప్పడం వలన అది జడపదార్థమనే భావించాలి. ఇక దీని ముందు చెప్పబడిన శ్రుతి వాక్యము కూడా బ్రహ్మలింగము కాదు. ఇది గాయత్రీ ఛందస్సునకు సంబంధించినది *"గాయత్రీ వా ఇదం సర్వమ్"*. ఈ జ్యోతిస్సు మూడు వంతుల భాగం స్వర్గలోకంలోనే ఉంది. "త్రిపాదస్యాం అమృతం దివి" (ఛా.ఉ 3.12.6) అని కూడా వినబడుతున్నది. ఇక్కడ పేర్కొన్న శ్రుతి వచనాలు అన్నీ కార్యరూపమైన జ్యోతినే కాని పరబ్రహ్మను వ్యక్తం చేస్తున్నట్లు లేవు.

**సిద్ధాంతం:**

ఇందు చెప్పిన 'జ్యోతిః' శబ్దము బ్రహ్మమునే నిర్దేశము చేస్తున్నది. శ్రుతి వాక్యాల సమన్వయం అదే సూచిస్తున్నది. "*ఏ తావానస్య మహిమా తతో జ్యాయాంశ్చ పురుషః, పాదో–స్య విశ్వా భూతాని త్రిపాదస్యాంమృతం దివి"* (ఈ కార్యప్రపంచము, గాయత్రీ మంత్ర సంబంధమైనదిగా చెప్పబడినదంతా బ్రహ్మ యొక్క మహిమయే. పూర్ణ బ్రహ్మరూపుడైన పురుషుడు (పరమాత్మ) ఈ ప్రపంచము కన్నా పెద్దవాడు (జ్యాయాన్). సమస్త భూతములు కలిసి ఈ పరబ్రహ్మ నాల్గవ భాగమే (ఒక పాదం) అవుతుంది. మిగతా మూడు భాగాలు వినాశరహితమైన సద్రూపం (అమృత రూపం) దివిలోనే ఉన్నది – ఛా.ఉ 3.12.6). కల్పితరూపమైన జగత్తు కంటె బ్రహ్మరూపము అనంతమైనది. పరంజ్యోతి మూడు భాగాలు ధ్యానం కొరకు ద్యులోకంలో ఉన్నది, ఆ జ్యోతిస్సు ఇక్కడ నిర్దేశింపబడింది. గాయత్రి తరవాత ఉపదేశింపబడిన శాండిల్య విద్యలో బ్రహ్మోపదేశమే జరిగింది.

'జ్యోతిః' శబ్దాన్ని వివరిస్తూ మరికొన్ని శ్రుతివచనాలు ఈ విధంగా ఉన్నాయి: *"యేన సూర్య స్తపతి తేజ సేద్ధః"* (ఏ తేజస్సు చేత ఈ సూర్యుడు ప్రకాశిస్తున్నాడో, ఆ పరమాత్మ – తై.బ్రా 3.12.9.7). *"తమేవ భాంత మనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి"* (ఆ పరమాత్మ యొక్క కారణం చేతనే ఈ తేజస్సమూహమంతా విశేషంగా భాసిస్తున్నది – క.ఉ 5.15). *"తద్దేవా జ్యోతిషాం జ్యోతిరాయుర్హో పాసతేమృతమ్"* (ఆ జ్యోతిః శక్తే ఆయుస్సు, అమృతమని దేవతలు ఉపాసిస్తారు – బృ.ఉ 4.4.16). ఇటువంటి శ్రుతి ప్రమాణాల ఆధారంగా జ్యోతిః శబ్దం బ్రహ్మవిషయికముగా నిర్ధారింపబడింది.

నిర్గుణబ్రహ్మము అద్వితీయమని ఎక్కడ చెప్పబడిందో, దానికి మోక్షమే ఫలసిద్ధి. ఎక్కడ గుణవిశేషాలతో (సగుణ బ్రహ్మముగా) చెప్పబడిందో అక్కడ ప్రతీక ధర్మాలతో సంసారికి (జీవుడికి) వివిధ ఇహ–పర భోగాల ఫలం లభిస్తుందని

గ్రహించాలి.

## సూ: 1.1.25 ఛందోభిధానాన్నేతి చేన్న తథా చేతోర్పణనిగదాత్తథా హి దర్శనమ్

(ఛందోభిధానాత్ నేతి చేత్ న తథా చేతోర్పణ నిగదాత్ తథాహి దర్శనమ్)

ముందు చెప్పిన సూత్ర వివరణ సందర్భంలో పూర్వపక్షి గాయత్రీ ఛందస్సును పురస్కరించుకొని చెప్పిన ఛాందోగ్యోపనిషత్ మంత్రంలో, బ్రహ్మ ప్రస్తావింపబడలేదని ఆక్షేపణ చేయటం జరిగింది. అటువంటి ఆక్షేపణలు ఈ సూత్రం ద్వారా తిరస్కరించబడుతున్నాయి. గాయత్రీ ఛందస్సును చెప్పటం వల్ల బ్రహ్మపరంగా చెప్పలేదు అన్నది సరికాదు. ఛందస్సుకు సంబంధించిన బ్రహ్మము యందు మనస్సుని నిలుపుకోవాలని చెప్పడం వలన, ఛందోరూపంలో బ్రహ్మము నిర్దేశించబడింది అన్నది సూత్రార్థం.

**పూర్వపక్షి:**

*"గాయత్రీ వా ఇదగ్ం సర్వం భూతం యదిదం కించ వాగ్వై గాయత్రీ వాగ్వా ఇదగ్ం సర్వంభూతం, గాయతి చ త్రాయతే చ"* అనేది మంత్ర వివరణ – బ్రాహ్మణం (ఛా.ఉ 3.12.1). ఛందస్సుకి ఆరు భేదాలు – భూత, పృథివీ, శరీర, హృదయ, వాక్, ప్రాణం అని చెప్పబడ్డాయి. గాయత్రీ నాలుగు పాదాలు కలది. *"ఏతావానస్య మహిమా"* అనే ఋక్కులో ఇదియే చెప్పబడింది. ఈ కారణంగా ప్రస్తుత సందర్భంలో గాయత్రీ ఒక చందస్సు రూపమనే కాని బ్రహ్మ యొక్క లింగంగా అంగీకరింపబడదు.

**సిద్ధాంతం:**

గాయత్రీ ఛందస్సు అక్షరాల కూర్పు మాత్రమే. దానిని సూత్రాత్మకం అని సర్వత్ర చెప్పబడదు. కాని, ఈ సందర్భంలో జగత్కారణమైన ఏ బ్రహ్మము గాయత్రీ అనే పేరుతో ప్రసిద్ధి అయిందో ఆ బ్రహ్మ 'సర్వం' అనే శబ్దంతో వ్యక్తం చెయ్యబడింది. *"సర్వం ఖల్విదం బ్రహ్మ"* అనేది శ్రుతి వాక్యం. అంతేకాదు, గాయత్రిని ఋగ్వేదీయులు శస్త్రంలోను, యజుర్వేదీయులు అగ్నిలోను, సామవేదీయులు క్రతు రూపంలోను బ్రహ్మోపాసన చేస్తున్నారు. అందువల్ల గాయత్రీ పదం ఒక ఛందస్సు (అక్షరాల కూర్పు) అనే ముఖ్యార్థంలో కాకుండా, గౌణార్థంలో చతుష్పాద బ్రహ్మమును నిర్దేశిస్తున్నట్లు ఈ సందర్భంలో గ్రహించాలి.

## సూ: 1.1.26 భూతాది పాదవ్యపదేశోపపత్తే శ్చైవమ్

(భూతాది పాదవ్యపదేశ ఉపపత్తేశ్చ ఏవమ్)

గాయత్రికి భూతాదులు పాదాలు (భాగాలు) అని శ్రుతి పలుకుతున్న కారణంగా పూర్వ వాక్యంలోను బ్రహ్మ నిర్దేశము ఉన్నదనే సూచింపబడుతున్నది. *"సైషా చతుష్పదా షడ్విధా గాయత్రీ"* అనే శ్రుతిలో కూడా బ్రహ్మలింగము వ్యక్తమవు తున్నదని సమన్వయించుకోవాలి. లేకపోతే భూతాదుల్లో దాని భాగాలు ఏవిధంగా ఉంటాయి? బ్రహ్మాశ్రయం లేకపోతే, *"తావానస్య మహిమా"* అనే మంత్రానికి ఎటువంటి సంబంధమూ లేకుండా పోతుంది. *"పాదోఽస్య సర్వా భూతాని త్రిపాదస్యామృతం దివి"* అని పురుషసూక్త ఋక్కు కూడా బ్రహ్మను నిర్దేశిస్తునే చెప్పబడింది.

*"తావా ఏతే పంచ బ్రహ్మపురుషాః"* (ఛా.ఉ 3.13.6) అని హృదయ కవటాలు ఐదింటిని బ్రహ్మకు ఆయతనమని, వాటి ద్వారాల దగ్గర ద్వారపాలకులుగా బ్రహ్మ పురుషులుంటారనీ, ఈ బ్రహ్మపురుషుల యొక్క ఉపాసన జీవుడు(సంసారి) చెయ్యాలని శ్రుతిలో వినిపిస్తున్నది. హృదయస్థానంలో ఉన్నది బ్రహ్మము కాబట్టే ద్వారపాలకులు బ్రహ్మపురుషులుగా చెప్పబడ్డారు.

## సూ: 1.1.27 ఉపదేశభేదాన్నేతి చేన్నోభయస్మిన్నప్యవిరోధాత్

(ఉపదేశ భేదాత్ నేతిచేత్ న ఉభయస్మిన్నపి అవిరోధాత్)

*"త్రిపాదస్యామృతం దివి"* అనే శ్రుతి వాక్యంలో ఒక విభక్తి – సప్తమీ, మరో శ్రుతిలో "అథ యదతః పరో దివః" అని మరో విభక్తి—పంచమీ లోను ఉంది. అందువల్ల భేదోపదేశం వినబడుతున్నదని పూర్వపక్షి ఆక్షేపణ చెయ్యటం జరిగింది. ఈ సూత్రంలో అలా చెప్పటంలో దోషం లేదని ఆక్షేపణ తిరస్కరించబడింది. 'ద్యులోకంలో' అన్నా, 'ద్యులోకం పైన' అన్నా బ్రహ్మ నిర్దేశమనే గ్రహించాలి. సామాన్య వ్యవహారంలో 'ఆ డేగ చెట్టుచివర ఉంది' అన్నా, 'చెట్టుకొన అవతల ఉంది' అన్నా ఒకే విషయాన్ని సూచిస్తాయి.

పూర్వపక్షి ఆక్షేపణలన్నీ తిరస్కరిస్తూ ఈ అధికరణలో జ్యోతిః అనే శబ్దం పరబ్రహ్మనే నిర్దేశిస్తుందని నిర్ధారణ చెయ్యబడింది.

# 11. ప్రతర్దనాధికరణమ్

## సూ: 1.1.28 ప్రాణస్తథానుగమాత్

కాశీ రాజైన దివోదాసుని కుమారుడు ప్రతర్దనుడు బలశాలి పరాక్రమ వంతుడు. తన శత్రువులను యుద్ధములో జయించి ఇంద్రుణ్ణి దర్శించుకోగా, ఇంద్రుడు ఏదైనా వరాన్ని కోరుకో అంటాడు. ప్రతర్దనుడు, మానవమాత్రుడైన నాకు ఏది హితకరమో, శ్రేయస్కరమో మీరే నిర్ణయించి ప్రసాదించండి అని వరంగా కోరుకున్నట్లు కౌషీతక బ్రాహ్మణోపనిషత్తులో ఒక ఆఖ్యాయిక ఉంది. ఈ కథను పురస్కరించుకొని, పూర్వపక్షి ప్రాణము – దైవము – బ్రహ్మ అనే అంశాలపై ప్రశ్నిస్తున్నాడు.

**పూర్వపక్షి:**

శ్రుతిలో ప్రతర్దనుడు ఇంద్రుని వద్దకు వెళ్లినప్పుడు వారి సంభాషణ ప్రస్తావిస్తూ ఇలా వినబడుతున్నది: *"ప్రతర్దనో హ వై దైవోదాసిః, ఇంద్రస్య ప్రియంథామ ఉపజగామ యుద్ధేన చ పౌరుషేణచ"* . తదనంతరం ఇంద్రుడు ఇలా చెప్తున్నాడు: *"స హోవాచ, ప్రాణోఽస్మి ప్రజ్ఞాత్మ తం మాం ఆయురమృత మిత్యుపాసీత"* (నేను ప్రజ్ఞాత్మ అయిన ప్రాణమును, అటువంటి నన్ను ఆయుషు, అమృతమని ఉపాసించు). ఆ పైన *"అథఖలు ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మా ఇదం శరీరం పరిగృహ్య ఉత్థాపయతి"* (ప్రజ్ఞాత్మ అయిన ప్రాణమే ఈ శరీరాన్ని పట్టుకొని నిలబెడుతున్నది). *"న వాచం విజిజ్ఞాసీత వక్తారం విద్యాత్"* (వాక్కును తెలుసుకోవాలనే కోరిక (ఇచ్ఛ) కన్న, మాట్లాడే వానిని తెలుసుకో). చివరగా *"స ఏష ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మానందోఽజరోఽమృతః"* (ప్రజ్ఞాత్మ అయిన ఈ ప్రాణమే ఆనంద స్వరూపము, జరామరణములు లేనిది – కౌ. 3.8).

ఈ శ్రుతి వాక్యాలలో చెప్పబడిన 'ప్రాణ' శబ్దము నిర్దేశిస్తున్నది - వాయువునా లేక దేవతాత్మనా, లేక జీవుడినా, లేక పరమాత్మనా? ఈ సందర్భంలో 'నన్నే తెలుసుకో' అని ఇంద్రుడు అంటున్నాడు. కాబట్టి దేవతాత్మగా గ్రహించినా, 'ఈ శరీరమును లేపి నిలబెట్టుతున్నది' అంటే శరీరము గల పురుషుడి ప్రాణలింగం అని, అలాగే మాట్లాడే వాడిని తెలుసుకో అంటే జీవుడి ప్రాణలింగమని అర్థం చేసుకోవాలి. కాని, చివరన 'అజరోఽమృతః' (జరామరణములు లేనిది) అని చెప్పడం వల్ల బ్రహ్మమును నిర్దేశిస్తున్నట్లు వినబడుతున్నది. ఒకే సందర్భంలో జీవ–దేవత–బ్రహ్మ లింగాలతో ప్రాణ శబ్దం వినబడటం వలన ఈ సందేహం కలుగుతున్నది.

**సిద్ధాంతం:**

ఇక్కడ ప్రాణ శబ్దాన్ని బ్రహ్మపరంగానే అన్వయించుకోవాలి. ప్రతర్దనుడు ఇంద్రునితో *"త్వమేవ మే వృణీష్వ యం త్వం మనుష్యాయ హితతమం మన్యసే"* (మానవునకు అత్యంత హితమైన వరం ఏదో అదే నాకు ప్రసాదించు) అనే వాక్యం ప్రకారం పురుషార్థములలో అతిశ్రేయస్కరమైనది మోక్షమని చెప్పబడింది, కాబట్టి దానినే ఇంద్రుడు ప్రతర్దనుడికి చెప్పాడు అని నిర్ణయించు కోవాలి. మానవుడికి అత్యంత హితమైనది ఇంకేం ఉంటుంది? బ్రహ్మజ్ఞానాన్ని పురస్కరించుకొని కొన్ని శ్రుతివాక్యాలు ఈ విధంగా ఉదహరింపబడ్డాయి:

*"తమేవ విదిత్వా అతిమృత్యుమేతి, నాన్యః పంథా విద్యతేఽయనాయ"* (ఆ పరమాత్మను తెలుసుకొని మృత్యువుని అధిగమిస్తాడు. మృత్యువుని అధిగమించ టానికి మరో మార్గము లేదు – శ్వే.ఉ 3.8). *"స యో మాం వేద, న హ వై తస్య కేనచన కర్మణా లోకో మీయతే న స్తేయేన, న భ్రూణహత్యయా"* (ఎవడు నన్ను పరమాత్మగా తెలుసుకుంటాడో ఆ జీవుడు దొంగతనం భ్రూణ హత్యాది పాపకర్మల నుండి కూడా విముక్తుడౌతాడు – కౌ.ఉ 3.1). అలాగే *"క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే"* (ఆ పరమాత్మ సాక్షాత్కారమైన పిదప అన్ని కర్మలూ నశిస్తాయి – ము.ఉ. 2–28). ఇలా వినిపిస్తున్న శ్రుతి వాక్యాలన్నీ బ్రహ్మమునే పరమావధిగా నిర్దేశిస్తున్నాయి.

ప్రతర్దనుడికి ఇంద్రుడు ఎలాగైతే ప్రాణాన్ని బ్రహ్మముగా నిర్దేశిస్తూ *"ఆనందో ఽజరోఽమృతః"* అని చెప్పేడో, అదే విషయాన్ని సూచిస్తూ ఆ పరమాత్మ కారణం గానే ఈ ప్రపంచంలో అన్ని కార్యాలూ జరుగుతుంటాయని మరో సందర్భంలో అదే ఉపనిషత్తులో చెప్పబడింది. *"స న సాధునా కర్మణా భూయాన్ భవతి నో ఏవ అసాధునా కర్మణా కనీయాన్, ఏష హ్యేవ*

*సాధుకర్మ కారయతి, తం యం ఏభ్యో లోకేభ్య ఉన్నినీషతే ఏష ఉ ఏవ అసాధు కర్మ కారయతి తం యం ఏభ్యో లోకేభ్య. ఉధో నినీషతే"* (బ్రహ్మజ్ఞాని మంచి కర్మల చేత పెద్దవాడూ కాదు, చెడ్డకర్మల చేత చిన్నవాడూ కాదు. ఆ పరమాత్మ ఎవనిని ఈ లోకాల నుండి పై లోకాలకు తీసుకొని పోవాలని తల్చితే వాని చేత మంచి పనులు చెయ్యబడతాయి. ఎవనిని అధోలోకాలకు పంపించాలని తలిస్తే వాని చేత చెడ్డపనులు చేయించబడతాయి – కౌ.ఉ 3.8). *"ఏష లోకాధిపతిః ఏష లోకేశః"* (ఆ పరబ్రహ్మమే ఈ లోకాలకు అధిపతి, అతడే నియంత – కౌ.ఉ 3.8).

ఇక్కడ ప్రాణ శబ్దంతో పరబ్రహ్మము యొక్క ఉపదేశమే కాని జీవాత్మను, లేదా దేవతాత్మను బోధించలేదు.

## సూ: 1.1.29 నవక్తురాత్మోపదేశాదితి చేదధ్యాత్మసంబంధభూమా హ్యస్మిన్

(వక్తుః ఆత్మోపదేశాత్ న ఇతిచేత్ అధ్యాత్మ సంబంధ భూమాహి అస్మిన్)

**పూర్వపక్షి:**

ఈ సందర్భంలో వక్త ఇంద్రుడు. అహంకారంతో తనను గూర్చి 'నన్ను తెలుసుకో' *(మా మేవ విజానీహి)*, *"ప్రాణో-స్మి ప్రజ్ఞాతా"* (నేనే ప్రజ్ఞాత్మ అయిన ప్రాణాన్ని) అని గొప్పకు చెప్పుకున్నాడు. బ్రహ్మ, వాక్, మనస్సు లేనిది (అవాక్, అమనాః). అంతేకాదు, దేవేంద్రుడు నేను త్రిశీర్షుణ్ణి సంహరించాను, ఇట్లాంటి హింసాత్మక పనులు కూడా చేసేనని చెప్తాడు. ఇవన్నీ బ్రహ్మకు తగవు కదా! *"ప్రాణోవై బలమ్"* ఇత్యాది శ్రుతులు బలవంతుడైన ఇంద్రునికి దేవతాత్మ, ప్రజ్ఞాత్మ అని అన్వయించుకుంటే కుదరవచ్చును కాని బ్రహ్మపరంగా అన్వయించుకోవటం కుదరదు.

**సిద్ధాంతం:**

ఈ అధ్యాయంలో ప్రత్యగాత్మ ధర్మాలే విశేషంగా చెప్పబడ్డాయి. *"యావద్ధ్య స్మిన్ శరీరే ప్రాణో వసతి తావదాయుః"* (ఈ శరీరంలో ప్రాణమున్నంత వరకే ఆయుస్సు). "తద్యథా రథస్య ఆరేషు నేమి రర్పితా, నాభావరా అర్పితా ఏవమేవ ఏతా భూతమాత్రాః ప్రజ్ఞామాత్రా స్వర్పితాః, ప్రజ్ఞామాత్రాః ప్రాణేష్వర్పితాః స ఏష ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మాఽనందోఽజరోఽమృతః" (భూతమాత్రలు ప్రజ్ఞా మాత్రలు మీద రథము యొక్క ఆరాల మీద నేమి అమర్చబడినట్లు, అమర్చ బడ్డాయి. ప్రజ్ఞా మాత్రలు రథ నాభి యందు అమర్చబడినట్లు ప్రాణం మీద అమర్చబడ్డాయి. ఆ ప్రాణమే నా స్వరూపము, అది ఆనందం, అజరం, అమృతము – కౌ 3.3) ఈ విధంగా ప్రత్యగాత్మయే ఇక్కడ చెప్పబడినట్లు తెలుస్తున్నది.

*"స మ ఆత్మేతి విద్యాత్"* (అదే నా ఆత్మ అని తెలుసుకో), *"అయమాత్మా సర్వానుభూః"* (ఈ ప్రత్యగాత్మయే సర్వాత్మయైన బ్రహ్మ) - ఈ వచనాలన్నీ అధ్యాత్మ సంబంధమైనవి. *"అయమాత్మా బ్రహ్మ"* అని బృహదారణ్యకోపనిషత్తులో ప్రత్యగాత్మయే పరమాత్మగా చెప్పబడింది. అందువల్ల ప్రాణం, ప్రత్యగాత్మ, పరమాత్మ అన్నీ ఒకే భావాన్ని నిర్దేశిస్తాయని గ్రహించాలి.

## సూ: 1.1.30 శాస్త్ర దృష్ట్యాతూపదేశో వామదేవవత్

వక్తగా ఇంద్రుడు తనను గురించి చెప్పుకుంటూ చెప్పిన ఉపదేశం శాస్త్ర దృష్ట్యా సమంజసంగానే ఉంది. ఇదేవిధంగా ఋషి వామదేవుడు తల్లి గర్భంలో ఉండగానే ఇలా అన్నాడని శ్రుతి వచనం: *"తద్ధైతత్ పశ్యన్ ఋషిః వామదేవః ప్రతిపేదే ఽహం మనురభవం సూర్యశ్చ"* (నేను మనువుగాను సూర్యునిగాను అయేను – బృ.ఉ 1.4.10). అదే మంత్రంలో *"తద్యో యో దేవానాం ప్రత్యబుధ్యత స ఏవ తత్ అభవత్"* (దేవతలలో ఎవరెవరు ఆ బ్రహ్మను తెలుసుకున్నారో వారు ఆ బ్రహ్మమే అయ్యారు). పూర్వజన్మలో ప్రాప్తించిన జ్ఞానం వల్ల ప్రస్తుత జన్మలో స్వభావసిద్ధంగా ప్రాప్తించిన ఫలం ఆర్షదర్శనం. ఇట్టి ఆర్షదర్శనం ఋషులకు, మనుష్యులకు కూడా లభ్యమవుతుంది.

ఇంద్రుడు త్వాష్ట్ర వధానంతరము *"తస్య మే తత్ర లోమచ న మీయతే స యో మాం వేద న హ వై తస్య కేన చ కర్మణా లోకో మీయతే"* (నేను అలాంటి పనులు చేసినా నా వెంట్రుక కూడా ఊడలేదు, నన్ను ఎవడైతే తెలుసుకుంటాడో వాడికి

కూడా ఎట్టి కర్మ వల్ల హాని కలగదు). ఇటువంటి వాక్యాలు ఇంద్రుడు తనే బ్రహ్మమునే జ్ఞానంతో పలికినట్లు గుర్తించాలి. అందువల్ల *"ప్రాణోఽస్మి ప్రజ్ఞాతా"* అనేది ఇంద్రుడు వాక్యంగా కాకుండా బ్రహ్మవాక్యంగానే సమన్వయించుకోవాలి.

## సూ: 1.1.31 జీవ ముఖ్య ప్రాణలింగాన్నేతి చేన్నోపాసా త్రైవిధ్యాదాశ్రితత్వాదిహ తద్యోగాత్

(జీవముఖ్యప్రాణలింగాత్ నేతి చేత్ న ఉపాసా త్రైవిధ్యాత్ ఆశ్రితత్వాత్ ఇహ తద్యోగాత్)

**పూర్వపక్షి:**

జీవలింగం, ముఖ్యప్రాణ లింగం ఉండటం వలన ఇందులో బ్రహ్మ నిర్దేశం లేదు. వాగింద్రియం మొదలగు పదాలతో ఈ శ్రుతిలో *"న వాచం విజ్ఞాసీత వక్తారం విద్యాత్' అలాగే అథ ఖలు ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మేదం శరీరం పరిగృహ్యోత్థాపయతి"* అని శరీరమున్న జీవుడు చెప్పబడుతున్నాడు. అదీకాక ప్రాణము-ఇంద్రియాలు జరిపిన సంవాదంలో *"తాన్ వరిష్ఠః ప్రాణ ఉవాచ మా మోహ మాపద్యథ అహమేవ ఏతత్ పంచధాత్మానం ప్రవిభజ్య ఏతత్ బాణ మవష్టభ్య విధారయామి"* (ఆ ముఖ్య ప్రాణం వాగాదులతో ఇలా అన్నది: మీరు భ్రమపడకండి. నేను నా స్వరూపాన్ని ప్రాణాపానాది ఐదు రూపాలలో విభజించి, ఈ శరీరాన్ని పట్టుకొని ధరిస్తున్నాను –ప్ర.ఉ 2.3).

ఏది ప్రాణమో అదే ప్రజ్ఞ, ఏది ప్రజ్ఞయో అదే ప్రాణం. అంటే రెండు వేరు వేరు పదార్థాలుగా చెప్పినట్లేనా? లేక అభేదమా? రెండూ కలసి నివసిస్తాయి. రెండూ కలసి మరణ సమయంలో లేచిపోతాయి అని చెప్పిన వాక్యాలు బ్రహ్మమునకు వర్తించవని తోస్తున్నది.

**సిద్ధాంతం:**

జీవోపాసనం–ముఖ్యప్రాణోపాసనం–బ్రహ్మోపాసనం అని మూడు ఉపాసనలు (ఉపాసా త్రైవిధ్యాత్) అని బోధించినట్లు అవుతుంది. ఉపక్రమ, ఉపసంహారాలను అనుసరించి ఈ ప్రకరణంలో ఒకే ముఖ్యాంశాన్ని ప్రతిపాదించి నట్లు చెప్పుకోవాలి – ప్రాణోపాసన అదే బ్రహ్మోపాసన. మరోశ్రుతి ఈ విషయాన్ని నిర్ధారణ చేస్తున్నది *"న ప్రాణేన న అపానేన మర్త్యో జీవతి కశ్చన, ఇతరేణ తు జీవంతి యస్మిన్నేతావుపాశ్రితౌ"* (ఏ మానవుడు ప్రాణవాయువు వలన కాని అపాన వాయువు వలన కాని జీవించడు. ఈ రెండూ ఏ పరమాత్మపై ఆధారపడి ఉన్నాయో, ఆ పరమాత్మ వలనే మనుష్యులు జీవిస్తున్నారు - క.ఉ 2–5).

*'తత్త్వమసి', 'అహం బ్రహ్మాస్మి'* అనే మహా వాక్యాలు బ్రహ్మ కన్నా భిన్నమైన జీవుడు లేడనే బోధిస్తున్నాయి. అందువల్ల ప్రత్యగాత్మను ఉద్దేశించే *"న వాచం విజిజ్ఞాసీత, వక్తారం విద్యాత్"* అని ఏది చెప్పబడిందో, దానిని జీవలింగంగా అర్థం చేసుకోకూడదు. అదే బ్రహ్మలింగాన్ని సూచిస్తున్నది. వచనాది క్రియలు జరిపిస్తున్నది బ్రహ్మమే దీనిని నిర్ధారించే శ్రుతి వాక్యాలు కొన్ని ఇలా వినబడుతున్నాయి: *"యద్వాచానభ్యుదితం యేన వాగభ్యుద్యతే తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదం ఉపాసతే"* (ఏది వాక్కు చేత ప్రకాశింపబడదో, దేని చేత వాక్కు ప్రకాశింపబడుతుందో, అదే బ్రహ్మము అని తెలుసుకో – కేన.ఉ 1.4).

ఉపాధిభేదం చేత ఘటాకాశం, మహదాకాశం వేరు వేరు అని భ్రాంతి కలిగినట్లే; ప్రాణ–ప్రజ్ఞాత్మలు వేరు అని భావించవచ్చు. కాని ప్రత్యగాత్మ స్వరూపం చేత ఒక్కటే కాబట్టి *"ప్రాణ ఏవ ప్రజ్ఞాత్మ"* అని ఏకీకరణ చేసి అదే–ఇది అని చెప్పబడింది.

(కొంతమంది వ్యాఖ్యాతలు ఈ ప్రకరణంలో సగుణబ్రహ్మము ఉపాస్యంగా చెప్పబడిందని ప్రస్తావించారు. కాని శంకరులవారు దానిని తిరస్కరిస్తూ ఈ ప్రకరణంలో నిర్గుణ–నిర్విశేష బ్రహ్మమే ప్రతిపాదించబడిందని నిర్ణయించారు. అందువల్ల ఇతరుల వ్యాఖ్యానాలను ఇచ్చట చర్చించలేదు.)

# 1. సమన్వయాధ్యాయం – ద్వితీయపాదము



## 1. సర్వత్ర ప్రసిద్ధ్యాధికరణమ్

ఈ పాదంలో చాలా వరకు సగుణ బ్రహ్మోపాసనకు సంబంధించిన బోధన వాక్యాలు ప్రతిపాదింపబడ్డాయి. బ్రహ్మమును నిర్దేశించే లింగాలు కూడా స్పష్టంగా కాకుండా సందేహాస్పదంగా పరోక్షంగానే చెప్పబడ్డా, అవీ బ్రహ్మనే సూచిస్తున్నాయి అని నిర్ణయించబడింది.

## సూ: 1.2.1 సర్వత్ర ప్రసిద్ధోపదేశాత్

**పూర్వపక్షి:**

ఛాందోగ్యోపనిషత్తులో శాండిల్యవిద్యా ప్రకరణంలో బ్రహ్మోపాసన గురించి చెప్పిన శ్రుతి ఇలా ఉంది: *"సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలానితి శాంత ఉపాసీత అథ ఖలు క్రతుమయ: పురుషో యథా క్రతురస్మిన్ లోకే పురుషో భవతి తథేతః ప్రేత్య భవతి. స క్రతుం కుర్వీత మనోమయః ప్రాణశరీరో భారూపః"* [సమస్త ప్రపంచమూ సృష్టికాలములో బ్రహ్మస్వరూపమందే పుట్టినది. ఆ బ్రహ్మయందే అంతా లీన మవుతున్నది. జీవించియున్న స్థితి సమయములో దాని శక్తి చేతనే నడుపబడుచున్నది. అందువల్ల బ్రహ్మమును శాంతముతో (శమదమాది సంపత్తులతో) ఉపాసించవలెను. జీవుడు (పురుషుడు) సంకల్ప స్వభావుడు. ఈ లోకంలో ఎలాటి సంకల్పం (కోరిక) ఉన్నవాడో పరలోకానికి వెళ్లిన తరువాత కూడా అట్టి సంకల్పం కలవాడే అవుతాడు. అందువల్ల ఆ బ్రహ్మను మనోమయమని, ముఖ్యప్రాణమే శరీరముగా కలిగినదని, స్వయం ప్రకాశరూపమని మనస్సులో ధ్యానించాలి – ఛా.ఉ 3.14.2 ఈ శ్రుతిల. శరీరుడుకి సంబంధించిన లింగాలు చాలా కనబడుతున్నయి. సంకల్పం, మనోమయత్వాది ధర్మాలు ఉండటం వల్ల జీవాత్మ చెప్పబడుతున్నట్లు వ్యక్తమౌతున్నది. అంతేకాదు *"ఏష మ అంతర్హృదయేఽణీయాన్ వ్రీహేర్వా, యవాద్వా"* (శరీరుడి హృదయంలో ఉన్న జీవాత్మ సూక్ష్మాతి సూక్ష్మమైనది, చిన్న విత్తనం గింజలా పరిమిత మైనది) అని చెప్పడం వల్ల ఇక్కడ జీవాత్మ ఉపాసనయే చెప్పబడుతున్నది.

**సిద్ధాంతం:**

*"సర్వం ఖల్విదం బ్రహ్మ"* అనేది అన్ని వేదాంతాలలో ప్రసిద్ధమైన జగత్కారణ రూపమైన బ్రహ్మమునే నిర్దేశిస్తున్నది. మనోమయత్వాది ధర్మాలు, బ్రహ్మ ఉపాసన కొరకు వివరించబడ్డాయి. జగత్కర్త అయిన బ్రహ్మము *"మనోమయః, ప్రాణశరీరః, భారూపః"* అని చెప్పబడింది. సత్యసంకల్పం అనే గుణము బ్రహ్మముకు తప్ప జీవుడికి కుదరదు.

## సూ: 1.2.2 వివక్షితగుణోపపత్తేశ్చ

ఒక వ్యక్తి తను చెప్పినది వినేవారు గ్రహించాలి అని భావిస్తే అది వివక్షితం (వక్తు మిష్టాః వివక్షితాః) అని చెప్పవచ్చు. కాని, వేదం అపౌరుషేయం (వక్త లేనిది), కాబట్టి వివక్షితం ఉండదు. కాని వేద వాక్యాలలో కొన్ని ఉపాదేయం, గ్రహించాలి అనే భావనతో చెప్పినవి. వాటిని వివక్షితంగా స్వీకరిస్తూ, ఏవి అవివక్షితమో (గ్రహించకుండా వదిలేయ బడేవి), వాటిని తాత్పర్యం లేనివాటిగా భావించి, ప్రక్కన పెట్టటం జరుగుతుంది.

ఈ ప్రకరణంలో 'సత్యసంకల్పః' అనేది బ్రహ్మోపాసనకు ఉపాదేయంగానే చెప్పబడింది. బ్రహ్మమునకే సంకల్పించిందల్లా సత్ అవడం కుదురుతుంది. *"య అపహతపాప్మా"* (దోషరహితుడు), *"జ్యాయాన్ పృథివీ"* (పృథివి కన్నా పెద్దవాడు), *"ఆకాశ ఆత్మా"* (ఆకాశంలా సర్వవ్యాపి) ఇట్లాంటి విశిష్ట గుణాలు వివక్షితములు. అవి బ్రహ్మమునకే వర్తిస్తాయి.

*"మనోమయ ప్రాణశరీరః"* అనేది జీవలింగాన్నే సూచిస్తున్నట్లు ఆక్షేపింప బడింది. బ్రహ్మము సర్వాత్మకం కాబట్టి జీవగుణాలు చెప్పినా తప్పులేదు. ఉపనిషత్ వాక్యాలు ఇలా చెప్పటాన్ని సమర్థిస్తున్నాయి. *"త్వం స్త్రీ త్వం పూమానసి, త్వం కుమార ఉత కుమారీ, త్వం జీర్ణో దండేన వంచసి, త్వం జాతో భవసి, విశ్వతోముఖః"* (నువ్వు స్త్రీవి, నువ్వు పురుషుడవు, నువ్వు బాలుడవు, నువ్వు బాలికవు, ముసలివై కర్రపట్టుకొని నడుస్తున్నావు, నువ్వు అన్ని వైపుల ముఖాలు కలవాడవు –శ్వే.ఉ 4.13). ఇదే విషయం స్మృతిలో కూడా చెప్పబడింది: *"సర్వతః పాణిపాదం తత్సర్వతో–క్షిశిరో ముఖమ్, సర్వతః శ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి"* (భ.గీ 13.13). ఇకపోతే, *"అప్రాణో హ్యమనాః శుభ్రః"* అనే శ్రుతి నిర్గుణ బ్రహ్మ గుణాలను బోధిస్తున్నది. మనోమయాది గుణాలు సగుణ బ్రహ్మోపాసనకు చెప్పబడినవి.

## సూ: 1.2.3 అనుపపత్తేస్తు న శారీరః

శరీరంలో ఉపాధిగా ఉన్న శారీరుడు (జీవాత్మ) సత్య సంకల్పాది గుణాలతో *"ఆకాశాత్మా"* , *"అవాకీ, అనాదరః జ్యాయాన్ పృథివ్యా"* (ఇంద్రియములు లేనిది, దేని యందూ కోరిక లేనిది, పృథివి కన్నా పెద్దది) అని చెప్పబడదు. ఈ ధర్మాలు బ్రహ్మమునకే చెందుతాయి.

జీవుడు భోగాధిష్ఠానమైన శరీరేంద్రియాలతోనే ఉంటాడు. శరీరం కన్నా భిన్నమైన దానితో ప్రవర్తించే ఆస్కారమే లేదు.

## సూ: 1.2.4 కర్మకర్తృవ్యపదేశాచ్చ

మనోమయాది గుణములు బ్రహ్మ సూచకములే అని నిర్ణయించటానికి మరో నిదర్శనం కూడా ఉంది. *"ఏతమితః ప్రేత్యాభిసంభవితాస్మి"* (మరణానంతరము నేను దీనిని పొందగలను) అనే శ్రుతి ఈ సందర్భంలోనే, చెప్పబడింది. ఇక్కడ 'ఏతం' అని బ్రహ్మమును కర్మవాచ్యంగాను, 'సంభవితాస్మి' అనేది కర్తృవాచ్యంగాను చెప్పబడింది; అందువల్ల ఉపాసకుడు జీవుడు(కర్త), ఉపాస్యం బ్రహ్మము(కర్మ)గాను నిర్ణయించుకోవాలి.

## సూ: 1.2.5 శబ్దవిశేషాత్

ఇక్కడ ఉపయోగించిన శబ్దాలు (విభక్తులు) వేరువేరుగా ఉండటం వల్ల వాటి అర్థాలు భిన్నంగా చెప్పుకోవాలి. *"యథా వ్రీహిర్వా, యవో వా, శ్యామాకో వా, శ్యామాక తండులో వా ఏవం అయం అంతరాత్మన్ పురుషో హిరణ్మయః"* (వడ్లగింజ, యవగింజ, శ్యామాకం, బియ్యపుగింజలో ఉన్నట్లే ఆత్మ లోపల ఈ హిరణ్మయ పురుషుడు ఉన్నాడు – శ.బ్రా 10.6.3.2). జీవాత్మను నిర్దేశించే అంతరాత్మన్. సప్తమీ అంతంలో ఉండగా, 'హిరణ్మయః పురుషః' అనేది ప్రథమా విభక్తిలో ఉంది. అందువల్ల అంతరాత్మ వేరు, దానిలో ఉండే పురుషుడు వేరు అని ఉపాసకునకు చెప్పినట్లు అర్థమవుతున్నది.

## సూ: 1.2.6 స్మృతేశ్చ

భగవద్గీత కూడా జీవ–పరమాత్మ విభాగాన్ని బోధిస్తున్నది. *"ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశే–ర్జున తిష్ఠతి భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా"* (అర్జునా! ఈశ్వరుడు సర్వభూతముల హృదయమునందే ఉంటారు. మాయతో అన్ని భూతాలను యంత్రమునెక్కించి తిప్పుతున్నట్లు భ్రమకలుగజేస్తాడు –భ.గీ 18–61). *"క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత"* (అర్జునా! అన్ని దేహాలలో ఉన్న జీవుణ్ణిగా నన్ను తెలుసుకో – భ.గీ 13.2). అయితే పరమాత్మ కన్నా భిన్నమైన జీవాత్మ వాస్తవంగా లేదు. *"నాన్యో–తో–స్తి ద్రష్టా నాన్యో–తో–స్తి శ్రోతా"* (పరమాత్మ కన్నా వేరుగా మరో చూచేవాడూ, వినేవాడు లేదు – బృ.ఉ 3.7–23.). అయినా ఉపాధి వల్ల పరిమిత రూపం దాల్చిన (పరిచ్ఛిన్న) పరమాత్మయే ఈ జీవుడు. అజ్ఞానం చేత దేహము–ఇంద్రియములు–మనోబుద్ధి అహంకారముల వల్ల మనలోనున్న జీవాత్మ వేరు, పరమాత్మ వేరు అని భావింపబడుతుంది. జీవ, పరమాత్మల ఏకీభావం జ్ఞానార్జనతో

కలుగుతుంది. ఆ జ్ఞానం కలగటమే మోక్షప్రాప్తి.

## సూ: 1.2.7 అర్భకౌకస్త్వాత్తద్వ్యపదేశాచ్చ నేతి చేన్న నిచాయ్యత్వాదేవం వ్యోమవచ్చ

(అర్భక ఓకస్త్వాత్ తత్ వ్యపదేశాచ్చ నేతి చేన్న నిచాయ్యత్వాత్ ఏవం వ్యోమవత్ చ)

హృదయంలో పరిమితంగా, సూక్ష్మంగా వ్రీహిలాగ అని చెప్పిన వాక్యాలు జీవుడుకే గాని పరమాత్మకు ఎలా సాధ్యం? పరమాత్మ ఆకాశంలా సర్వవ్యాపి అని ఆశంక వ్యక్తం చేయబడిన దానికి ఈ సూత్రంలో సమాధానం చెప్పబడింది. సర్వగతుడైన పరమాత్మ హృదయంలో పరిమిత రూపంలో చూడగలిగినవాడు. పరమేశ్వరుడు కోసం ఎక్కడో ఉన్నాడని అన్వేషించకుండా హృదయస్థానంలోనే ఉన్నట్లు ధ్యానం చెయ్యాలని దీని భావన. ఆకాశం అంతులేనిది కాని సూది రంధ్రంలోనూ వ్యక్తమౌతున్నది. హృదయాలు ప్రతీ శరీరంలో వేరు వేరుగా ఉన్నాయి. ఈ శరీరంలో ఉన్న ఆత్మ వేరు, మరో శరీరంలో ఉన్న ఆత్మ వేరు అని చెప్పబడదు. కారణం, వేరు వేరు గూళ్లలో నివసించే చిలకల్లా అందరి దేహాదుల్లో ప్రకాశిస్తున్న ఆత్మ (సన్మాత్ర) ఒకటే.

## సూ: 1.2.8 సంభోగప్రాప్తిరితి చేన్న వైశేష్యాత్

జీవుడు–పరమాత్మ ఒకటే అంటే పరమాత్మ శరీరుడి సుఖదుఃఖాలకు భోక్త అవుతాడుకదా? బ్రహ్మకు సుఖదుఃఖ సంబంధం ఉండదు. కారణం శరీర సంబంధమైనదే భోగం. ఆత్మ నిర్లిప్తమైనది. కర్తృ–భోక్తృత్వాలు లేనిది. అదే విశేషం (వైశేష్యాత్) అని ఈ సూత్రంలో చెప్పబడింది. ఒక జీవి అనుభవించే సుఖదుఃఖాలు మరో జీవికి ఉండవు. ఎవరి భోజనం–తృప్తి–ఆనందం వారిదే. జీవుని భోగంతో పరమాత్మకు సంస్పర్శ ఉండదు. ఆకాశంలో మలినత్వం, అజ్ఞానంతో ఆరోపింప బడినట్లే ఈశ్వరుడు సంసారి యొక్క సుఖదుఃఖాలకు హేతువని భావించబడుతుంది. ఈ అపోహ సమ్యక్ జ్ఞానంతో పోతుంది. ఒక జీవునికి నిర్దిష్టమైన ఒక దేహంలోనే కర్మాదివశం చేత సుఖదుఃఖాలు కలుగుతాయి అనేదే కర్మసిద్ధాంతం.

## 2. అత్త్రధికరణమ్

### సూ: 1.2.9 అత్తా చరాచరగ్రహణాత్

కఠోపనిషత్తులో శ్రుతి ఇలా వినబడుతున్నది: *"యస్య బ్రహ్మ చ క్షత్రం చ ఉభే భవత ఓదనః మృత్యుర్యస్య ఉపసేచనం క ఇత్థా వేద యత్ర సః"* [బ్రాహ్మణ క్షత్రియాదులతో కూడుకున్న ఈ జగత్తంతా మృత్యుదేవత ముఖ్య ఆహారమైతే, ఆ మృత్యువునే ఉపసేచనంగా (అన్నంలో కలుపుకొని తినే కూర, పచ్చడి వంటి పదార్థం) తినేవాడు అత్తా (పరబ్రహ్మము). అయితే, ఈ పరబ్రహ్మము ఏవిధంగా ఉంటాడో ఎవనికి తెలుసు? – క.ఠ 1.2.24 ] ఈ సందర్భంలో తినేవాళ్లు ముగ్గురుగా కనబడు తున్నారు. జీవుడు, అగ్ని, బ్రహ్మము. అయితే, వారి ముగ్గురిలో ఎవరిని 'అత్తా' అని నిర్దిష్టంగా చెప్పవచ్చును. *"అగ్ని రన్నాదః"* (అగ్ని తినేవాడు) అని బృహదారణ్యకంలో చెప్పబడింది (బృ.ఉ 1.4.6). అందువల్ల, అగ్నిదేవతే అని భావించాలి. కాని మరో శ్రుతిలో *"తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి అనశ్నన్ అన్యో–భిచాకశీతి"* (ఆ ఇద్దరిలో ఒకడు మధురమైన కర్మఫలం తింటుంటే మరొకడు తినకుండా చూస్తూ ఉన్నాడు –ము.ఉ 3.2). ఒకడైతే సంసారి అని తెలుస్తున్నది. రెండవవాడు భోక్తృత్వం లేని పరబ్రహ్మము అని అనడం కుదరదు కదా? అందుకే ఈ సందేహం.

**సిద్ధాంతం :**

ఇక్కడ 'అత్తా' గా చెప్పబడుతున్నది పరబ్రహ్మమే అని గ్రహించాలి. బ్రహ్మ కారణంగానే జననమరణాలు (సృష్టి–స్థితి–లయం) జరుగుతున్నాయని శ్రుతి ప్రమాణాలతో ముందు చెప్పబడింది. పరమాత్మకే చరాచర జగత్తంతా ఉపసేచనం అని చెప్పడం యుక్తం. మరో జీవికి సంభవమే కాదు. మృత్యువే బ్రహ్మమునకు ఉపసేచనం అంటే మృత్యువు కూడా బ్రహ్మవశంలో ఉన్నాడని గ్రహించాలి. కర్మోపభోగం జీవుడిదే. ఆ భోగానికి పరమాత్మ సాక్షి మాత్రమే. దీనినే సూచిస్తూ *"అనశ్నన్ అన్యో–భిచాకశీతి"* అని చెప్పబడింది.

### సూ: 1.2.10 ప్రకరణాచ్చ

కఠవల్లీ ప్రకరణంలో భాగంగానే *"న జాయతే మ్రియతే వా విపశ్చిత్"* (ఆత్మజ్ఞానం కలిగినవాడు పుట్టడు చనిపోడు) అని బ్రహ్మోపదేశం చెయ్యబడింది. మోక్షప్రాప్తి కలిగిన వానికే కదా జనన మరణ బంధ విముక్తి *"క ఇత్థావేద యత్ర సః"* [అతనిని ఈ విధంగా (అత్తాగా) తెలుసుకున్నవాడు ఎవడు?] అనే వాక్యం కూడా బ్రహ్మలింగాన్నే నిర్దేశిస్తున్నది.

## 3. గుహాప్రవిష్టాధికరణమ్

## సూ: 1.2.11 గుహాంప్రవిష్టావాత్మనౌ హి తద్దర్శనాత్

**పూర్వపక్షి :**

కఠవల్లీలో శ్రుతి : *"ఋతం పిబంతౌ సుకృతస్య లోకే గుహాం ప్రవిష్టౌ పరమేపరార్ధ్యే, ఛాయాతపౌ బ్రహ్మవిదో వదంతిపంచాగ్నయో యే చ త్రిణాచికేతాః"* (కర్మ యొక్క ఫలమైన ఈ శరీరమందు, పరస్పర భిన్నగుణములు, వెలుగు–నీడల్లా ఉన్న ఇరువురు, హృదయాకాశమందు, బుద్ధిగుహలోను ప్రవేశించి ఉంటున్నారని బ్రహ్మవేత్తలూ ఇంకా అగ్నిచయనాది కర్మలు చేసే సంసారులూ చెప్తున్నారు – క.ఠ 1.3.1).

అయితే ఇక్కడ ఇరువురు అంటే ఎవరు? బుద్ధి, జీవి – అని గ్రహించాలా? జీవాత్మ, పరమాత్మ – అని గ్రహించాలా లేక; క్షేత్రజ్ఞుడు, బుద్ధి – అనిగ్రహించాలా? బుద్ధి అనేది జడపదార్థం, అచేతనమైనది. దానిని జీవుడు అంటూ మరో చేతనమైన ఇతరుడు అని ఎలా గ్రహించడం వీలౌతుంది?

అదే ఉపనిషత్తులో అంతకు ముందు, నచికేతుడు మృత్యువును (యమ ధర్మరాజును) మూడవ వరంగా అడిగినట్లు ఇలా శ్రుతిలో చెప్పబడింది: *"యే యం ప్రేతే విచికిత్సా మనుష్యే–స్తీత్యేకే నాయమస్తీతి చైకే, ఏతత్ విద్యా మనుశిష్ట స్త్వయా–హం వరాణామేష వరస్తృతీయః"* (మనిషి, మరణించిన తరువాత కూడా అతడు ఉంటాడు అనికొందరు, ఉండదు అని మరికొందరు అంటారు. ఆ సంశయము నివృత్తి చెయ్యమని నా మూడవ వరముగా కోరుకుంటున్నాను – కఠ 1.1.20). ఇక్కడ మానవుడు వరం అడుగుతున్నాడు. అడిగిందీ జీవుని విషయమే కదా? ఇక్కడ భగవంతుని ప్రస్తావన లేదు. అయితే, అదే సందర్భంలో *"అన్యత్ర ధర్మాత్ అన్యత్ర అధర్మాత్, అన్యత్ర అస్మాత్ కృతాకృతాత్, అన్యత్ర భూతాచ్చ భవ్యాచ్చ యత్ పశ్యసి తద్వద"* [ధర్మాధర్మాలకు భిన్నమైనది, కార్య కారణాల కంటె వేరైనది, భూత భవిష్యత్తులకు అన్నింటికి అతీతమైనది దేనిని నువ్వు చూస్తున్నావో (సాక్షాత్కరించు కున్నావో) దాని గురించి చెప్పుము – కఠ 1.2.14 ] అని నచికేతుడు మృత్యువుని కోరినట్లు శ్రుతిలో వినపడుతున్నది.

మరో ఆక్షేపణకు కూడా సమాధానం చెప్పవలసి ఉంది. *"సుకృతస్య లోకే"* అని కర్మ వలన ప్రాప్తించిన దేహం, అనే లింగం ఉండటం వల్ల అది జీవునికే వర్తిస్తుంది. అయితే *"ఋతం పిబంతౌ"* అనే ద్వివచన ప్రయోగం 'ఇద్దరు' అనుభవిస్తున్నారు అని చెప్పినట్లైతే, దానిని కర్మఫలం జీవుడు అనుభవిస్తున్నాడు, ఈశ్వరుడు అనుభవింపజేస్తున్నాడు అని అన్వయించుకోవాలా? పరమాత్మకు కర్మానుభవం లేశ మాత్రం కూడా ఉండదు అని నిర్ధారించి చెప్పిన శ్రుతి వాక్యాలు ఇంతకుముందు ఉదహరింపబడ్డాయి.

**సిద్ధాంతం :**

ఇక్కడ చెప్పబడుతున్నది జీవ–పరమాత్మలే. కర్మఫలం అనుభవించేది జీవుడు (సంసారి). ఇకపోతే, రెండవవాడు ఎవరు అని నిశ్చయించుకోటానికి సమాన స్వభావం కలవానినే అన్వేషించుకోవాలి. చేతన స్వభావం గల పరమాత్మ, హృదయ గుహలో ఉంటాడు అని చెబుతున్న శ్రుతులు చాలా ఉన్నాయి. *"గుహాహితం గహ్వరేష్ఠంపురాణమ్"* , *"యో వేదనిహితం గుహాయాం పరమే వ్యోమన్"* (తై.ఉ. 2.1), *"ఆత్మాన మన్విచ్ఛ గుహాం ప్రవిష్టమ్"* (గుహలో నున్న పరమాత్మను అన్వేషించుము). చేతనుడైన జీవుడి హృదయగుహ (హృదయాకాశంలో) ఉన్నది భారూపమైన పరమాత్మయే అని చెప్పబడింది. బ్రహ్మము సర్వగతుడైనప్పటికీ ఉపాసకుని సాక్షాత్కారం కోసం, హృదయస్థానంలో ఉంటున్న ఆ బ్రహ్మమును ధ్యానం చేసుకోవాలి అని ఇంతకుముందు కూడా సూచింపబడింది.

శరీరంలో ఉన్నది ఒకే ఆత్మ, అయినా సామాన్య వ్యవహారంలో చెప్పుకున్నట్లు జీవ–పరమాత్మలు ఇరువురు (ఉభయులు), అని చెప్పుకున్నా దోషం లేదు. అలాగే సంసారిత్వం–అసంసారిత్వం అనేవి వెలుగు–నీడల్లా వేరు వేరుగా గోచరించేవే. సంసారిత్వం మిథ్యాజ్ఞానంతో సంసారి కల్పించుకొన్నది. అసంసారిత్వం పరమాత్మ యొక్క సహజగుణం.

అందువల్ల, ఈ సందర్భంలో హృదయస్థానంలో ఉంటున్నట్లు నిర్దేశించబడినవి విజ్ఞానాత్మ-పరమాత్మ అనే గ్రహించాలి.

ఇంకా ఏ కారణంచేత విజ్ఞానాత్మ–పరమాత్మలనే గ్రహించాలి అనే ప్రశ్నకు ఈ క్రింది సూత్రం చెప్పబడింది.

## సూ: 1.2.12 విశేషణాచ్చ

ఈ ప్రకరణ సందర్భంలో చెప్పిన మిగతా విశేషములు కూడా విజ్ఞానాత్మ– పరమాత్మలనే నిర్దేశిస్తున్నాయి. శరీరాన్ని ఒక రథంగా, విజ్ఞానాత్మను ఒక రథికునిగా రూపకల్పన చేస్తూ చెప్పిన శ్రుతి ఇలా ఉంది: *"ఆత్మానం రథినం విద్ధి శరీరం రథ మేవ తు"* (ఈ శరీరం ఒక రథం, విజ్ఞానాత్మ రథికుడు అని తెలుసుకో–కఠ 1.3.3).

మోక్షమార్గమును అనుసరించే సంసారి పరమాగతిని చేరుకుంటాడు. *"సో ఒధ్వనః పరమాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్"* (శరీరమనే ఈ రథాన్ని ఆరోహించి అతడు పరమాత్మ యొక్క స్థానమైన పరమావధి యొక్క అంతమును పొందుతాడు – కఠ 1.3.9). అలాగే, మరోశ్రుతి *"తం దుర్దర్శ గూఢమనుప్రవిష్టం గుహాహితం గహ్వరేష్ఠం పురాణమ్. అధ్యాత్మ యోగాధిగమేన దేవం మత్వా ధీరో హర్షశోకౌ జహాతి"* [బుద్ధిమంతుడైన సాధకుడు (ఉపాసకుడు) ప్రత్యగాత్మపై మనస్సు లగ్నం చేసుకొని మాయ చేత ఆవరింపబడిన వాడూ, రహస్యస్థానంలో గుహలో ఉన్నటువంటి అనాది స్వరూపుడూ అయిన ఆ పరమేశ్వరుణ్ణి తెలుసుకొని హర్. శోకాలను విడచిపెడతాడు – క.ఠ 1.2.12 ]. ఈ ప్రకరణలో నచికేతుడికి పరమాత్మను గురించిన ఉపదేశమే జరిగింది. అందువల్ల *"బ్రహ్మవిదో వదంతి"* (బ్రహ్మమును తెలుసుకున్నవారు చెబుతున్నారు), అని ప్రారంభించి జీవాత్మను ధ్యానం చేసేవాడు (మంత) గాను, పరమాత్మ మంతవ్యుడు (ధ్యానం చేయదగినవాడు) అని విశేషంగాను చెప్పబడింది.

అదేవిధంగా *"ద్వాసుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వ జాతే"* [స్నేహంతో కలసి ఉండే రెండు పక్షులు (అవి సాధారణ పక్షులు కావు విజ్ఞానాత్మ– పరమాత్మ అని గ్రహించాలి) ఒకే చెట్టు కొమ్మపై ఉన్నాయి – ము.ఉ 3.1.1 ] *"తయో రన్యః పిప్పలంస్వాద్వత్తి, అనశ్నన్ అన్యో-భిచాకశీతి"* [ఒకటి (విజ్ఞానాత్మ) మధురమైన పిప్పలం (కర్మఫలం) అనుభవిస్తున్నది; రెండవది (పరమాత్మ) తినకుండా చూస్తూ ఉంది]. ఆ తరవాత ఇలా చెప్పబడింది: *"సమానే వృక్షే పురుషో నిమగ్నో-నీశయా శోచతి ముహ్యమానః జుష్టం తదా పశ్యతి అన్యం ఈశం అస్య మహిమాన మితి వీతశోకః"* (శరీరమనే సమాన వృక్షం పై ఉన్నా, ఒకడు ఈశ్వరత్వం లేక పోవటం వలన దుఃఖాన్ని మోహం వల్ల అనుభవిస్తున్నాడు. ధ్యానంతో ఈశ్వరుణ్ణి యథార్థస్వరూపంలో దర్శించుకున్నవాడు సుఖదుఃఖాలను నాశనం చేసుకొని ముక్తిపొందుతున్నాడు – ము.ఉ 3.1.2)

# 4. అంతరాధికరణమ్

## సూ: 1.2.13 అంతర ఉపపత్తేః

**పూర్వపక్షి :**

జాబాల సత్యకాముడు శిష్యుడైన ఉపకోసలునికి బ్రహ్మోపదేశం చేసిన సందర్భంలో శ్రుతి ఇలా వినిపిస్తున్నది: *"య ఏషో-క్షిణి పురుషో దృశ్యతే ఏష ఆత్మేతి హోవాచ, ఏతదమృతం అభయం ఏతత్ బ్రహ్మేతి, తత్ యద్యపి అస్మిన్ సర్పిః ఉదకం వా సించతి వర్త్మనీ ఏవ గచ్ఛతి"* (నేత్రములో ఏ పురుషుడు కనబడు తున్నాడో అతడే ఆత్మ. నాశరహితము, భయము లేనిది ఈ బ్రహ్మము. అందుచేతనే కంటిలో నెయ్యిగాని, నీరుకాని పోసినప్పుడు ప్రక్కలకే జారి పడిపోతుంది – ఛా.ఉ 4.15.1).

ఇక్కడ నేత్రము లోపల కనబడుతున్నది ఏది? జీవుడి ప్రతిబింబ స్వరూపమా? నేత్రానికి అధిష్ఠాన దేవతా? లేక పరమాత్మా? లోక ప్రసిద్ధంగా ఐతే ప్రతిబింబమైన ఛాయాత్మ అనే చెప్పాలి. కాకపోతే, ఆదిత్యుడని చెప్పుకోవాలి, కారణం *"రశ్మిభిః ఏషో-స్మిన్ ప్రతిష్ఠితః"* (ఈ ఆదిత్యుని కిరణాల ద్వారా నేత్రమందు ఉంటాడు – బృ.ఉ 5.5.2) అన్న శ్రుతి ఉంది. దేవతాత్మకు కూడా అమృతత్వాది గుణాలు చెప్పవచ్చు. శరీరంలో ఉన్న నేత్రస్థానమును నిర్దేశించటం వలన పరమాత్మ అని గ్రహించటం కుదరదు.

**సిద్ధాంతం :**

'నేత్రంలో ఉన్న పురుషుడు' అనే శబ్దం పరమాత్మనే నిర్దేశిస్తున్నది. ఇక్కడ 'ఆత్మేతి' అనే కాకుండా 'ఏతత్ బ్రహ్మేతి' అని ఉపదేశించబడింది. అమృతం, అభయం అనే గుణాలే కాకుండా పరమాత్మకు ఎట్టి దోషాలు అంటవు (వర్త్మనీ ఏవ గచ్ఛతి) అనే వాక్యంలో వివరింపబడింది. ఛాందోగ్యంలో అదే ప్రకరణంలో *"ఏతం సంయద్వామ ఇత్యాచక్షతే, ఏతం హి సర్వాణి వామాన్యభిసంయంతి, ఏష ఉ ఏవ వామానీః, ఏషహి సర్వాణి వామాని నయతి ఏష ఉ ఏవ భామినీః ఏష హి సర్వేషు లోకేషు భాతి"* (ఈ అక్షిపురుషుడే సర్వ కర్మఫలములకు కారణము, ఆ పరమేశ్వరుడే అన్ని శుభములకు ఆశ్రయము. అతడే సమస్త లోకములను ప్రకాశింపజేస్తున్న పురుషుడు – ఛా.ఉ 4.15.2, 3, 4).

## సూ: 1.2.14 స్థానాదివ్యపదేశాచ్చ

బ్రహ్మము ఆకాశం వలె సర్వగతమైనా, నేత్రాది స్థానాల్లో *(యం పృధివ్యా తిష్ఠన్, యశ్చక్షుషి తిష్ఠన్)* ప్రదేశ నిర్దేశం చెప్పటం దోషం కాదు. సాలగ్రామం విష్ణువు యొక్క స్థానమని వ్యవహారంలో అంగీకరింపబడుతున్నది కదా! ఉపాసనకు వీలుగా సగుణ బ్రహ్మమును నామరూపాలతో నిర్దేశించటం జరుగుతుంది. కాని నిర్గుణ బ్రహ్మోపదేశం నామరూపాలతో జరగదని ఇంతకుముందు కూడా స్పష్టమయ్యింది.

## సూ: 1.2.15 సుఖవిశిష్టాభిధానాదేవ చ

ఉపకోసలుడికి ఆత్మవిద్యా బోధన చేసిన గార్హపత్యాది అగ్నిదేవతలు ఇలా చెప్పినట్లు శ్రుతిలో వినబడుతున్నది: *"ప్రాణో బ్రహ్మ కం బ్రహ్మ ఖం బ్రహ్మ"* (ప్రాణమే బ్రహ్మము, సుఖమే బ్రహ్మము, ఆకాశమే బ్రహ్మము). ఈ ఉపదేశం విన్న ఉపకోసలుడు *"విజానామ్యహం యాత్ప్రాణో బ్రహ్మ కం చ తు ఖంచ న విజానామి"* (ప్రాణం బ్రహ్మమనే విషయం నాకు తెలుసు కాని; కం, ఖం అనేవి నాకు తెలియవు).దానికి సమాధానంగా *"యద్వావ కం తదేవ ఖం యదేవ ఖం తదేవ కం"* అని చెప్పబడింది (ఏది సుఖమో అదే ఆకాశము, ఏది ఆకాశమో అదే సుఖము – ఛా.ఉ 4.10.5).

'కం' శబ్దం ఇంద్రియసంబంధమైన సుఖాన్నే సూచిస్తుంది. కాబట్టి, దానిని విశేషంగా 'ఖం' శబ్దం చేత జోడించి సుఖాత్మకమైన బ్రహ్మమును, సర్వవ్యాపకమైన బ్రహ్మమును ఉపదేశించినట్లు; ఈ ఉపదేశం సగుణ బ్రహ్మోపాసన కొరకు

చేసినట్లు గుర్తించాలి. ఆ పైన, *"ఆచార్యస్తు తే గతిం వక్తా"* (నీకు మీ ఆచార్యుడు బ్రహ్మమును పొందే మార్గం గురించి బోధిస్తాడు) అని అగ్నిదేవతలు చెప్పటం వల్ల నిర్గుణ బ్రహ్మోపదేశం గురుముఖంగా పొందదగినది అని సూచించినట్లు గ్రహించాలి.

## సూ: 1.2.16 శ్రుతోపనిషత్కగత్యభిధానాచ్చ

అక్షిస్థానంలో ఉన్న పురుషుడు పరమేశ్వరుడే అని నిర్ణయించడానికి బ్రహ్మవేత్త మరణానంతర గతిని నిర్దేశిస్తూ చెప్పిన శ్రుతి, స్మృతి వచనాలు చెప్ప బడ్డాయి. *"అథోత్తరేణ తపసా బ్రహ్మచర్యేణ శ్రద్ధయా విద్యయా ఆత్మాన మన్విష్య ఆదిత్యమభి యజంతే"* (తపస్సు చేత, బ్రహ్మచర్యంతోను, శ్రద్ధతో, విద్యాప్రాప్తి పొంది, ఆత్మను అన్వేషించుకొని ఉత్తరమార్గంలో ఆదిత్యుని చేరుకుంటారు). స్మృతిలో కూడా ఉత్తర మార్గమనే జ్యోతిర్మయ మార్గము గురించి ఈ విధంగా చెప్పబడింది: *"అగ్నిర్జ్యోతి రహః శుక్లః షణ్మాసా ఉత్తరాయణమ్, తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ, బ్రహ్మవిదోజనాః"* (బ్రహ్మవేత్తలు జ్యోతిర్మయ మార్గము ద్వారా బ్రహ్మపద ప్రాప్తిని పొందుదురు. ఈ జ్యోతిర్మయ మార్గమునకు అధిదేవత అగ్ని. బ్రహ్మవేత్తలను దేహత్యాగానంతరము ఈ మార్గమందే దినము–శుక్లపక్ష–ఉత్తరాయణ అభిమానదేవతలు అదే క్రమంలో అగ్నిదేవతను చేర్చుదురు – భ.గీ 8.24). *"అథ యదుచైవ అస్మిన్ శవ్యం కుర్వంతి యది చ నార్చిషమేవాభిసంభవంతి"* [ఉపాసకులు మరణించినప్పుడు పుత్రాదులు సంస్కారం చేసినా చెయ్యకపోయినా వారు అర్చిరాది (ఉత్తరమార్గంలోనే) దేవ మార్గంలో వెళతారు]. దేవమార్గం గురించి వివరిస్తూ ఇలా చెప్పబడింది: *"ఆదిత్యాత్ చంద్రమసం చంద్రమసో విద్యుతం తత్పురుషో–మానవః, స ఏనాన్ బ్రహ్మగమయతి, ఏష దేవపథో బ్రహ్మపథ ఏతేన ప్రతిపద్యమానా ఇమం మానవం ఆవర్తం న ఆవర్తంతే".* [ఆదిత్యుని నుండి చంద్రుణ్ణి, చంద్రుని నుండి విద్యుత్‌ను చేరతారు. అక్కడ నుండి ఒక దివ్య పురుషుడు వీళ్లను సగుణ బ్రహ్మ వద్దకు తీసికొని వెళ్తాడు. అదే దేవమార్గం, బ్రహ్మమార్గం. ఈ మార్గం ద్వారా వెళ్లినవాళ్లు మనుష్యలోకానికి (జనన మరణ రూపం ఉన్న సంసార ప్రపంచం) లోకి తిరిగి రారు.– ఛా.ఉ 4.15.5 ]

సగుణబ్రహ్మము, నిర్గుణబ్రహ్మమును చేరే ప్రయాణ మార్గాలను (గతిని) సూచించే వివరాలు నాల్గవ అధ్యాయంలో చెప్పబడ్డాయి. ప్రస్తుత విషయంగా గ్రహించ వలసినది: బ్రహ్మవేత్తకు ప్రసిద్ధమైన గతినిర్దేశం ఉన్న కారణంగా అక్షిపురుషుడు పరబ్రహ్మమే గాని జీవుడు, దేవతాత్మ కాదు.

## సూ: 1.2.17 అనవస్థితేరసంభవాచ్చ నేతరః

అక్షిస్థానంలో ప్రతిబింబము (ఛాయాత్మ) నిత్యమూ ఉండేదికాదు. ఎవరైనా, ఏదైనా వస్తువు కంటి దగ్గరగా ఉంటే, ఆ బింబం కొంతసేపు ఉంటుంది; ఆ మనిషో, వస్తువో దూరమైపోతే ఆ రూపం పోతుంది. అదీకాక, ఉపాసకునికి తన రూపం తన కంటిలో ప్రతిబింబంగా చూసుకోవటం కుదరదు కదా! ఈ శరీర పతనంతోనే ఛాయాత్మ కూడా పోతుంది. అందువల్ల, ఛాయాత్మలో నిత్యత్వం, అమృతత్వం వంటి గుణాలు లేని కారణంగా ఛాయాత్మను పరమాత్మగా గ్రహించలేము.

సర్వవ్యాపి అయిన బ్రహ్మమును, ఉపాసన కోసం హృదయ స్థానంలో నిర్దేశిస్తే కుదురుతుంది, మరెవరిని స్థానపరిమితితో నిర్దేశించబడదు. విజ్ఞానాత్మకు అవిద్య, కామం, సంకల్పం, కర్మ ఇత్యాది దోషాలతో సంబంధం ఉంటుంది కాబట్టి, అమృతత్వాది గుణాలతో బ్రహ్మము అని చెప్పబడదు.

నేత్రము యొక్క అధిష్ఠానదేవత ఆదిత్యుడు. ఆదిత్యుని విభూతి (శక్తి, లేదా ఐశ్వర్యం) పరమాత్మ మీదే ఆధారపడి ఉంది. *"భీషాస్మాద్వాతః పవతే, భీషోదేతి సూర్యః భీషాస్మా దగ్నిశ్చేన్ద్రశ్చ, మృత్యుర్ధావతి పంచమః"* (పరమేశ్వరుడికి భయపడి వాయువు వీస్తున్నది. పరమేశ్వరుని భయంతోనే సూర్యుడు ఉదయిస్తున్నాడు. అగ్ని, ఇంద్రుడు ఆ పరమాత్మ భయంతోనే పని చేస్తున్నారు. ఐదవదైన మృత్యువు పరమేశ్వరుడి భయంతోనే చంపదగిన వారి వద్దకు పరిగెట్టి పోతున్నాడు – తై.ఉ 2.8). ఇలా శ్రుతిలో దేవతల నియంత పరమాత్మ అని వారికి స్వతస్సిద్ధమైన ఐశ్వర్య విశేషాలు లేవని చెప్పబడింది. అందువల్ల అక్షిస్థానంలో చెప్పబడిన పురుషుడు పరమాత్మే అని గ్రహించాలి.

# 5. అంతర్యామ్యధికరణమ్

## సూ: 1.2.18 అంతర్యామ్యధిదైవాదిషు తద్ధర్మవ్యపదేశాత్

**పూర్వపక్షి :**

బృహదారణ్యకోపనిషత్తులో ఆరుణి ప్రశ్నలకు యాజ్ఞవల్క్యఋషి, అంతర్యామి ప్రతిపాదనతో ఒక మహాశక్తి విభూతి వివరిస్తాడు. ఆ సందర్భంలో శ్రుతి ఇలా ఉంది: *"య ఇమం చ లోకం పరం చ లోకం సర్వాణి చ భూతాని యో-న్తరో యమయతి"* (ఎవడు ఇహపరలోకాలను, సమస్త భూతాలలోను ఉంటూ నియంత్రిస్తూ ఉన్నాడో) అని ఆరంభించి, *"యః పృథివ్యాం తిష్ఠన్ పృథివ్యా అంతరో యం పృథివీ న వేద, యస్య పృథివీ శరీరం యః పృథివీ మంతరో యమయతి, ఏషత ఆత్మా అంతర్యామ్యమృతః"* (ఎవడు పృథివిలో ఉంటున్నాడో, తన లోలోపల ఉన్నాడని పృథివి ఎరుగదో, ఎవనికి పృథివి శరీరమో, ఎవడు పృథివిని నియంత్రిస్తు న్నాడో, అతడు అమృతగుణమున్న నాశరహితుడు – బృ.ఉ 3–7.12). అదే సందర్భంలో అంతర్యామిగా అతడు సర్వత్ర – అధిలోకమందు, అధిదైవమందు, అధివేదమందు, అధియజ్ఞమందు, అధిభూతమందు, ఆధ్యాత్మమునందు కూడా, ప్రవర్తిస్తుంటాడని వివరించబడింది. ఇలా అంతర్యామి అన్న పదంతో చెప్పబడుతున్నది ఎవరని సందేహం, ఒక దేవతా రూపమా? అణిమాది అష్ట సిద్ధులున్న యోగి పురుషుడా? పరమాత్మయా లేక మరేమైనా అవ్యక్త పదార్థమా? దేహేంద్రియాలు కూడా ఉన్నట్లు చెప్పటం వల్ల పరమాత్మ అని గ్రహించబడదు. ఇకపోతే, ఏదో దేవతాత్మ కావచ్చును అని తోస్తున్నది. కారణం *"పృథివ్యేన యస్యాయతన మగ్నిర్లోకో మనో జ్యోతిః"* అనే శ్రుతి ఉంది (పృధివి శరీరము, అగ్నియే నేత్రము, మనస్సు జ్యోతిస్సుగా కలవాడు – బృ.ఉ 3.9.10). *'స్థానాది వ్యపదేశాచ్చ'* అనే సూత్రంలో (1.2.14) అంతర్యామిగా పరమాత్మ చెప్పబడ్డాడు అని సూచించినా మళ్లీ మరోవిధంగా ఈ ప్రశ్న రావటం వల్ల, ఈ అధికరణంలో అంతర్యామి పదం వివరించబడింది.

**సిద్ధాంతం :**

*'యః పృథివ్యాం', 'యః సర్వేషు లోకేషు', 'యః సర్వేషు భూతేషు'* ఇత్యాది వాక్యాలలో సర్వత్ర అంతర్యామిగా నిర్దేశిస్తూ చెప్పినది పరమాత్మకే వర్తిస్తుంది కాని మరో దేవతను, యోగిపురుషుని, పదార్థాన్ని సూచిస్తూ చెప్పినది కాదు. పృథివ్యాది పంచభూతాలను, సమస్త కార్యసముదాయాన్ని నియమించే సామర్థ్యం (శక్తి), ఆ పరమాత్మకే ఉన్నవి. జగత్కారణంగా బ్రహ్మను స్వీకరించటం వల్ల అన్ని శక్తులూ బ్రహ్మపరమైనవే అని గ్రహించాలి. అమృతత్వాది గుణాలే కాకుండా పరబ్రహ్మకు 'అదృష్టః', 'అశ్రుతః' అనే రూపవిహీన విశేషాలు చెప్పబడ్డాయి. అందువల్ల అంతర్యామి పరమాత్మయే.

## సూ: 1.2.19 నచ స్మార్తమతద్ధర్మాభిలాపాత్

సాంఖ్య మీమాంసకులు త్రిగుణాత్మకమైన ప్రధాన పదార్థం జగత్కారణంగా ప్రతిపాదించిన దానిని, ముందు తిరస్కరించటం జరిగింది. అయినా మరోమారు, అగోచరమైన ప్రధానాన్ని అంతర్యామిగా ఎందుకు స్వీకరించకూడదు అని పూర్వపక్షి ప్రశ్నించటం వల్ల ఈ సూత్రంలో సమాధానం చెప్పబడింది. *"అప్రతర్క్యం అవిజ్ఞేయం ప్రసుప్తమివ సర్వతః"* (ప్రధానం ఊహించబడనిది, తెలియబడనిది, సర్వత్ర నిద్ర పోతున్నట్లు ఉంటుంది – మనుస్మృతి 1.5). *'ఈక్షతేర్నాశబ్దం'* అనే సూత్రంలో (1.1.5.) స్మృతికల్పిత ప్రధానం అగోచరాది ధర్మాలు కలది కాబట్టి దానినీ అంతర్యామిగా గ్రహించవచ్చు అనే వాదన తిరస్కరించబడింది. బృహదారణ్యక శ్రుతి, వాక్యశేషంలో స్పష్టంగా *"అదృష్టో ద్రష్టాఽశ్రుతః శ్రోతాఽమతో మంతాఽవిజ్ఞాతో విజ్ఞాతా"* (చూడబడనిది చూస్తుంది, వినబడనిది వింటుంది, ఊహించబడనిది ఊహిస్తుంది, తెలియబడనిది తెలుసుకొంటుంది – బృ.ఉ 3.7.28). ఇటువంటి ధర్మాలు స్వయంప్రకాశమైన సన్మాత్ర పరమాత్మకే తగును. ప్రధానము జడపదార్థము. భోక్తృత్వాది గుణములున్న శరీరుడు కూడా అంతర్యామిగా గ్రహింపబడదు అని ఈ క్రింది సూత్రంలో చెప్పబడింది.

## సూ: 1.2.20 శారిరశ్చోభయెఒపి హి భెదెనైనమధియతె

ఉపాధి కారణంగా శారీరుడు పరిచ్ఛిన్న (పరిమిత) గుణం కలవాడు. అందువల్ల చూడటానికి వినటానికి ఇంద్రియాదులు ఉన్నా సమస్తభూతాలలో అంతర్యామిగా వ్యవహరించే అవకాశం లేదు. కాణ్వ–మధ్యందిన మతస్థులు శారీరుణ్ణి అంతర్యామి కన్నా భిన్నగుణములున్న వానిగా పరిగణిస్తారు. కాణ్వులు *“యో విజ్ఞానే తిష్ఠన్”* అని, మాధ్యందినులు *“య ఆత్మని తిష్ఠన్”* అని చెబుతూ అంతర్యామి, జీవాత్మ కార్యకలాపాలను నియంత్రిస్తుందని నమ్ముతారు.

శారీరుణ్ణి–అంతర్యామిని వేరు వేరుగా వ్యక్తం చెయ్యడం ఉపాధి సంబంధ మైన భేదం వల్లనే అని గ్రహించాలి. పారమార్థికంగా ఈ భేదవ్యపదేశం అంగీకరించ లేము. కారణం, ప్రత్యగాత్మ శరీరంలో ఒకటే ఉంటుంది. ముందు సూత్రాలను ప్రస్తావించిన సందర్భంలో ఈ భేదం ఘటాకాశం–మహాకాశం వంటిదని స్పష్టం చెయ్యబడింది. *“యత్రహి ద్వైతమివ భవతి తదితర ఇతరం పశ్యతి”* (ఎక్కడ భేదభావం ఉన్నట్లు కనబడుతుందో అక్కడ ఒకడు మరొకరిని చూడడం అనేది జరుగుతుంది. సమస్తము పరమాత్మ యొక్క ప్రభావమే అని తెలుసుకున్న వ్యక్తికి *“యత్ర తు అస్య సర్వమాత్మైవాభూత్ తత్కేన కం పశ్యేత్”* (సర్వమూ ఇతనికి ఆత్మ అయినప్పుడు దేనిని దేనితో చూస్తాడు). భేద వ్యవహారినికి అవిద్యయే మూలకారణమని ఇంతకు ముందు చెప్పబడింది. విద్యాప్రాప్తితో ద్వైతభావన పోయి ఆత్మైకత్వ భావన కలుగుతుంది అని నిర్ణయించడమైనది.

# 6. అదృశ్యత్వాద్యధికరణమ్

## సూ: 1.2.21 అదృశ్యత్వాదిగుణకో ధర్మోక్తేః

**పూర్వపక్షి :**

అపర–పరా విద్యల వివరణ సందర్భంగా క్షయరహితుడైన అక్షరుని యొక్క గుణాలు చెబుతూ ముండకోపనిషత్తులో శ్రుతి ఇలా వినబడుతున్నది: *“అథ పరా యయా తదక్షర మధిగమ్యతే”* , *“యత్తత్ అద్రేశ్య మగ్రాహ్య మగోత్ర మవర్ణ మచక్షుః శ్రోత్రం తదపాణి పాదం నిత్యం విభుం సర్వగతం సుసూక్ష్మం తదవ్యయం యద్భూత యోనిం పరిపశ్యంతి ధీరాః”* [ఇహలోకంలో కర్మలకు సంబంధించిన అపరా విద్యకు భిన్నంగా పరావిద్య చెప్పబడింది. ఈ పరావిద్యలో – ఏది అక్షరమో (క్షయములేనిదో), ఏది జ్ఞానేంద్రియముల చేత, కర్మేంద్రియముల చేత గ్రహింప బడదో, అదృశ్యమో, దేనికి కళ్లూ, చెవులూ లేవో, దేనికి హస్త, పాదాలు లేవో, దేనికి గోత్రాదులు లేవో, ఏది నిత్యమో, విభువో, సర్వవ్యాప్తమో, సూక్ష్మాతిసూక్ష్మమో, నాశరహితమో, ఏది సర్వ భూతములకు మూలమో – అట్టి దానిని పండితులు దర్శించుకుంటున్నారు – ము.ఉ 1.1.5, 1.1.6 ]. ఇచ్చట అదృశ్యాది గుణములతో నిర్దేశించబడినది భూతకారణమైన ప్రధానమా, జీవుడా, పరమాత్మయా అనేదే సంశయము.

అయితే అదృశ్యాదిగుణాలతో వివరించిన శ్రుతిననుసరించి చెప్పినది ఇలా వినిపిస్తున్నది: *“యథోర్ణనాభిః సృజతే గృహ్ణతే చ యథా పృథివ్యాం ఓషధయః సంభవంతి, యథా సతః పురుషాత్ కేశలోమాని తథా అక్షరాత్ సంభవతీహ విశ్వమ్”* (సాలె పురుగు తాను సృంజిచిన దారపు గూడును తిరిగి తనలోకే ఎలా తీసు కుంటుందో, ఈ భూమి మీద ఓషధుల్లాటి చెట్లు ఎలా ఉద్భవిస్తున్నాయో, ప్రాణమున్న వ్యక్తిలో కేశరోమాలు ఎలా పుడుతున్నాయో, అలాగే ఈ అక్షరుడి నుండి విశ్వసృష్టి జరుగుతున్నది – ము.ఉ 1.1.6). ఈ శ్రుతి వల్ల అచేతనములైన శరీరముల నుండే, సాలెపురుగు సృజించే దారము, వ్యక్తి కేశరోమాలు పుడుతున్నాయి అని తోస్తున్నది. అలాగే క్రిందటి అధికరణలో సాంఖ్యవాదుల ప్రధానము కని వినే శక్తి లేనిది అని తిరస్కరించబడింది. ఇక్కడైతే అదృష్టాది గుణములు అక్షరునికి చెప్పబడ్డాయి కాబట్టి ప్రధానము భూతసృష్టికి కారణమయే అవకాశం ఉంది. అదీకాక, *“అక్షరాత్ పరతః పరః”* (అక్షరుని కంటె విలక్షణమైనది శ్రేష్ఠమైనది) అనే మరోపురుషుని నిర్దేశం జరిగింది. అతనిని ‘సర్వజ్ఞుడు, సర్వవేత్త అని వాక్యశేషంలో ఉన్న పదాలను బట్టి అన్వయించుకున్నా, ప్రస్తుతం ఉదహరించిన శ్రుతి ప్రకారము, శారీరుణ్ణి, ప్రధానమును, అక్షరములని గ్రహించే అవకాశం ఉంది.

**సిద్ధాంతం :**

అదృశ్యాది గుణములతో ‘భూతయోని’ అని నిర్దేశింపబడిన అక్షరుడు పరమేశ్వరుడు తప్ప మరే పురుషుడూ, ఏ పదార్థము కాజాలదు. వాక్యశేషంలో స్పష్టంగా బ్రహ్మధర్మాలు ‘యః సర్వజ్ఞః సర్వవిత్’ అని చెప్పబడ్డాయి. ఉపాధి పరిచ్ఛిన్నుడైన శారీరుడు కాని, జడమైన ప్రధానము కాని ‘సర్వవిత్’ అని చెప్పబడవు. *“అక్షరాత్ సంభవ తీహ విశ్వమ్”* అని ప్రస్తావించిన తరవాతనే ఇలా చెప్పబడింది: *“యః సర్వజ్ఞః సర్వవిత్ యస్య జ్ఞానమయం తపః తస్మాదేతత్ బ్రహ్మ నామ రూప మన్నంచ జాయతే”* [ఎవడు సర్వజ్ఞుడో, సర్వమూ తెలుసుకొన్నవాడో, ఎవని తపస్సు జ్ఞానమయమో; వాని కారణంగానే, కార్యబ్రహ్మ (హిరణ్యగర్భుడు), నామరూపములు గల ప్రాణులు అన్నమూ పుట్టుచున్నవి – ము.ఉ 1.1.9 ] సర్వజ్ఞః–సర్వవిత్ అనే విశేషములు సమస్తమునకు కారణమైన పరబ్రహ్మమునే నిర్దేశిస్తున్నాయి. *“అక్షరాత్ పరతః పరః”* అని చెబుతున్నది కూడా కారణ బ్రహ్మయే. ఈ ప్రకరణంలోనే *“యేనాక్షరం పురుషం వేద సత్యం ప్రోవాచ, తాం తత్త్వతో బ్రహ్మవిద్యాం”* [నాశ రహితము, సత్యము అయిన పురుషుణ్ణి తెలిసికొనటానికి ఉపయుక్తం గా బ్రహ్మవిద్యను యథాతథంగా (తత్త్వతః) చెప్పెను – ము.ఉ 1.2.13 ].

అంగిరసఋషి శిష్యుడైన శౌనకునికి *“పరాచైవ అపరాచైవ”* అని రెండు విద్యలున్నాయి అంటూ బోధించిన

సందర్భంలో అపరావిద్యగా వేదములు, వేదాంగములు, ఇతిహాస పురాణములను పేర్కొని *"అథ పరా యయా తదక్షర మధిగమ్యతే"* అని చెబుతాడు. పరమేశ్వరుని కన్నా భిన్నమైన దానిని అక్షరుడుగా నిర్దేశిస్తే, అది మోక్షాన్ని ప్రసాదించే పరావిద్య ఎలా ఔతుంది? మోక్షమే పరావిద్య లక్ష్యం. ఇహ–పరలోక సంపద, అపరా విద్య సాధనతో పొందే ఫలము. *"కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి"* (ఓ పూజ్యుడా! దేనిని తెలుసుకుంటే సర్వమూ తెలుస్తుంది) అనే శిష్యుడి ప్రశ్నకు సర్వాత్మకమైన పరబ్రహ్మమును గూర్చి ఉపదేశించటంలో తాత్పర్యముంటుంది. అందువల్ల, అక్షరుడు అని శారీరుణ్ణి కాని, ప్రధానమును కాని ఉద్దేశించి చెప్పింది కానేరదు.

అంతేకాదు, *"స బ్రహ్మవిద్యాం సర్వ విద్యా ప్రతిష్ఠాం అథర్వాయ జ్యేష్ఠ పుత్రాయ ప్రాహ"* అని ఉపనిషత్తు మొదటి భాగంలో చెప్పబడింది. అపరావిద్య బోధించే వేదములు, వేదాంగములు అనిత్యఫలములే సమకూరుస్తాయి అని వివరిస్తూ ఇలా విన్పడుతుంది *"ప్లవా హ్యేతే అదృఢా యజ్ఞరూపా అష్టాదశోక్తమవరం తేషు కర్మ ఏవచ్ఛ్రేయో యో–భినందంతి మూఢా జరామృత్యుం తే పునరేవాపియంతి"* (ఋత్విక్కులు, యజమాని, పత్నీ అనే ఈ పద్దెనిమిది మంది, యజ్ఞ నిర్వాహకులు, తదితర యజ్ఞసామగ్రి క్షయమయిపోయినట్లే మూఢులు కర్మఫలములు శ్రేయస్కరమని నమ్మినవారు, జ్ఞానమార్గమును అవహేళన చేసేవారు జనన–మరణములను అనుభవిస్తుంటారు – ము.ఉ 1.2.7). సకల సంసార బంధముల నుండి విరక్తి చెందిన వారే పరావిద్యకు అధికారులని సూచిస్తూ ఇలా చెప్పబడింది: *"పరీక్ష్య లోకాన్ కర్మచితాన్ బ్రాహ్మణో నిర్వేదమాయా న్నాస్తి అకృతః కృతేన, తద్విజ్ఞానార్థం స గురు మేవాభిగచ్ఛేత్ సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్"* (కర్మ సంపాదితములైన లోకములు అనిత్యములు అని నిశ్చయించుకొని విరక్తితో నిత్యమైన ఆత్మతత్త్వము తెలిసికొనుటకు సమిధాదులతో శ్రోత్రియుడగు బ్రహ్మనిష్ఠుని ఆశ్రయించవలెను – ము.ఉ 1.2.12). అందువల్ల, అదృశ్యాది గుణములతో చేతన స్వరూపముతో సర్వ భూతముల ఉత్పత్తికి కారణమైన భూతయోనిగా చెప్పినది పరమేశ్వరుడనే గ్రహించాలి.

## సూ: 1.2.22 విశేషణభేదవ్యపదేశాభ్యాం చ నేతరౌ

విలక్షణ ధర్మాలతో భూతయోని అని చెప్పటం వల్ల ఇచ్చట పరమేశ్వరుని యొక్క నిర్దేశమే జరిగింది; శారీరుడు కాని ప్రధానము కాని గ్రహింపబడవు. *"దివ్యో హ్యమూర్తః పురుషః స బాహ్యాభ్యంతరో హ్యజః అప్రాణో హ్యమనాః శుభ్రః"* (ఆ పురుషుడు స్వయం ప్రకాశము గలవాడు. బాహ్యామైన స్థూలశరీరమూ, కనబడని సూక్ష్మశరీరమునకు అధిష్ఠాత; జన్మలేనివాడు, ప్రాణరహితుడు మనోవికారములు లేనివాడు, నిర్మలమైనవాడు – ము.ఉ 2.1.2). నామరూప పరిచ్ఛేదం చేత అహంకారాదులతో ప్రవర్తించే శారీరుడు దివ్యపురుషుడుగా చెప్పబడదు. అందువల్ల ఇక్కడ సర్వవేదాంత వాక్యాలను సమన్వయించుకొనే పరమాత్మనే *"అక్షరాత్ పరతః పరః"* అని చెప్పుకోవాలి. సమస్త కార్యప్రపంచము, వికారాది స్వభావముతో నామ –రూపాలతో వ్యక్తమయినదే. దాని కంటె పరమైనది, అవ్యాకృతమైన అవికారస్థితిలో సర్వజగత్తావిర్భావానికి మూలమైన పరమాత్మ. అదే హిరణ్యగర్భుని (ఈశ్వరుని) యందు విలీనమైయున్న పరమేశ్వరుని పూర్వావస్థ. అక్షరుని కంటె పరమైనది, భిన్నమైనది అని చెప్పటం కారణబ్రహ్మ–కార్యబ్రహ్మల నిర్దేశము కొరకే అని గ్రహించాలి. సాంఖ్యులు ప్రతిపాదించే ప్రధానము ఎంతమాత్రము అక్షరమని ఈశ్వర–పరమేశ్వర ధర్మాలతో బోధింపబడదు.

## సూ: 1.2.23 రూపోపన్యాసాచ్చ

భూతయోని యొక్క రూపాన్ని కూడా ఎన్నో విశేషణాలతో చెప్పినందువల్ల దానిని పరమేశ్వరుడుగానే గ్రహించాలి. *"అక్షరాత్పరతః పరః"* అని చెప్పిన వెంటనే దాని ఆకృతి–రూపం ఇలా చెప్పబడింది: *"ఏతస్మాజ్జాయతే ప్రాణః"* అని ప్రారంభించి, పంచభూతాలు మనసేంద్రియాలతో *"పృథివీ విశ్వస్యధారణీ"* అని వర్ణించి, విరాట్పురుషుని యొక్క ఆకృతి వర్ణన శ్రుతిలో ఇలా వినబడుతున్నది: *"అగ్నిః మూర్ధా చక్షుషీ చంద్రసూర్యౌ, దిశః శ్రోత్రే వాగ్వివృతాశ్చ వేదాః, వాయుః ప్రాణో, హృదయం విశ్వమస్య పద్భ్యాం పృథివీ హ్యేష సర్వభూతాంతరాత్మా"* (అగ్ని శిరస్సు, సూర్య చంద్రులు నేత్రాలు,

దిక్కులు చెవులు, వేదములు మాటలు, వాయువు ప్రాణం, విశ్వమే హృదయం, పృథివీ పాదాలు ఈ విధంగా అతడు సకల చరాచర భూతములకు అంతరాత్మ – ము.ఉ 2.1.4). అయితే, అదృశ్యత్వాది గుణములతో చెప్పబడిన అక్షరుడు ఎలా ఒక రూపంతో వ్యక్తీకరింపబడుతున్నాడు అనే సందేహం కలుగుతుంది. శారీరుడు రూపం ప్రాణాదులతో ఉన్నా, వానికున్న శక్తి (మహిమ) చాలా తక్కువ. పరమేశ్వరుణ్ణి విరాడ్రూపంతో ప్రతిపాదించటం జరిగింది. ఇది అక్షరుడి యొక్క మహిమ అనంతమని చెప్పటానికే ఉద్దేశింపబడింది. తైత్తిరీయోపనిషత్తులో *"అహమన్న మహమన్నాదః"* (అన్నాన్నీ నేనే, అన్నం తినేవాణ్ణీ నేనే, సృష్టికి కారణాన్ని నేనే, లయానికి కారణం నేనే) అని బ్రహ్మనుద్దేశించి చెప్పినట్లే, ఇక్కడా అన్వయించుకోవాలి.

కొంతమంది వ్యాఖ్యాతలు *"ఏతస్మాజ్జాయతే ప్రాణో మనః కర్మేంద్రియాణి చ"* అనే శ్రుతి వాక్యాలు, సృష్టికి సంబంధించినవా లేక భూతయోని యొక్క రూపాన్ని విశేషంగా చెప్పడానికి ఉద్దేశించినవా అనే సందేహం వ్యక్తపరిచారు. ఈ విషయాన్ని ఇక్కడ చర్చించలేదు.

అదృశ్యాది గుణాలతో పరమేశ్వరుడే నిర్దేశించబడ్డాడు కాని జీవుడు, ప్రధానము కాదు. ఇదే ఇచ్చట ప్రస్తావించిన ముఖ్యాంశము.

# 7. వైశ్వానరాధికరణమ్

## సూ: 1.2.24 వైశ్వానరః సాధారణశబ్దవిశేషాత్

ప్రాచీనశాలుడు, సత్యయజ్ఞుడు, ఇంద్రద్యుమ్నుడు, జనడు, బుడిలుడు అనే ఐదుగురు మిత్రులు వేదాధ్యయనం పూర్తిచేసుకొని ఆత్మచింతన యందు ఇచ్ఛ కలిగి ఉద్దాలకుడనే గురువు దగ్గరికి వెళ్లి అతనిని ఆత్మబోధన చెయ్యమని కోరగా, అతడు నాకు వేదాంత జ్ఞానము అంతగా లేదు, ఈ విషయంలో మంచి జ్ఞాని కేకేయిరాజు అయిన అశ్వపతి దగ్గరకు మిమ్మల్ని తీసుకొని వెళ్తాను అంటాడు. ఆ ప్రకారము వారు అశ్వపతి దర్శనం చేసుకొని వారి కోరిక విన్నవించుకొంటారు. అశ్వపతి వారిని మీరంతా శ్రోత్రియులు కొద్దిరోజులు మా ఆతిథ్యాన్ని స్వీకరించండి అని చెప్పి, ఒక రోజు మీరు ఉపాసిస్తున్న దేవతలు ఎవరో అది నాకు మొదట వినిపించండి అంటాడు. శిష్యులు ఐదుగురూ క్రమంగా ద్యులోకము, ఆదిత్యుడు, వాయువు, ఆకాశము, అప్ (ఉదకము) మా ఉపాస్య దేవతలని చెప్పగా; అశ్వపతి మీరు సర్వాత్మకమైన వైశ్వానరుణ్ణి భిన్నభిన్న రూపాలలో ఉపాసిస్తున్నారు. దాని వల్ల మీకు హాని కలుగుతుంది. అఖండ వైశ్వానరోపాసన యోగ్యమైనదని హితువు పలుకుతాడు. ఛాందోగ్యోపనిషత్తులో భాగమైన ఈ ఆఖ్యాయికను ఆధారం చేసుకొని పూర్వపక్షి ప్రశ్నిస్తున్నాడు:

**పూర్వపక్షి :**

*"కో న ఆత్మా కిం బ్రహ్మేతి?"* (మన ఆత్మ ఎవరు బ్రహ్మము ఏది?). మీరు ఉపాశించే వైశ్వానరుని మాకు ఉపదేశించండి అని శిష్యులు ఇలా కోరారు. *"ఆత్మాన మేవ ఇమం వైశ్వానరం సంప్రతి అధ్యేషి తమేవ నో బ్రూహి"* . *"యస్త్వేత మేవం ప్రాదేశమాత్ర మభివిమానమాత్మానం వైశ్వానర ముపాస్తే స సర్వేషు లోకేషు సర్వేషు భూతేషు సర్వేష్వాత్మస్వన్నమత్తి"* (సర్వాత్మక స్వరూపుడని ఎవడు వైశ్వానర ఉపాసన చేస్తాడో, వాడు ద్యులోకము మొదలు అగ్నిలోకములలోను, సమస్తభూతముల యందు, సమస్త భోగ్య విషయములను స్వాధీనము చేసుకొనును. భిన్నదృష్టితో కాకుండా అఖండ రూపముతో ఉపాసన చేసినవాడు, అన్నాది రూపములో ఉన్న సర్వసంపదను అనుభవించును) అని రాజు అంటాడు. తదనంతరము మీరు చెప్పిన ఉపాస్య దేవతలందరూ ఈ వైశ్వానరుని అంగములే అని ఇలా రాజు ప్రస్తావిస్తాడు: "తస్య హ వా ఏతస్యాత్మనో వైశ్వానరశ్చమూర్ధైవ సుతేజాః చక్షుః విశ్వరూపః ప్రాణః పృథగ్వర్త్మాత్మా, సందేహో బహులో బస్తి రేవరయిః పృథివ్యేవ పాదౌ, ఉర ఏవ వేదిర్లోమాని బర్హిః హృదయం గార్హపత్యో మనో–న్వాహార్య పచన ఆస్యం ఆవహనీయః" (అట్టి ఆత్మ అయిన వైశ్వానరునకు మంచి తేజస్సు గల ద్యులోకమే శిరస్సు, నానా విధములైన రూపములను గ్రహించే శక్తినిచ్చే సూర్యుడే నేత్రము, సర్వత్రగమనాలుకల వాయువే ప్రాణము, ఆకాశము దేహ మధ్యభాగము, ఉదకములు మూత్రపిండము, పృథివి పాదములు, వక్షస్థలం యజ్ఞవేది, రోమాలు బర్హిస్సు, హృదయము దక్షిణాగ్ని, మనస్సు అన్వాహారపచనాగ్ని, ముఖము ఆవహనీయాగ్ని – ఛా.ఉ 5.18.1, 2).

ఇక్కడ అశ్వపతిరాజు వైశ్వానరుడు ఆత్మగా ప్రస్తావించినది ఎవరినని పూర్వపక్షి ప్రశ్నిస్తున్నాడు: పంచ భూతాలలోని అగ్నియా, జఠరాగ్నియా, అగ్ని అభిమానదేవతా స్వరూపమా, జీవుడా లేక పరమాత్మా? ఈ శ్రుతిలో చెప్పిన వాక్యాలలో ఈ విషయం స్పష్టంగా చెప్పబడలేదు. సామాన్యంగా, జఠరాగ్ని, భూతాగ్నులే వైశ్వానరాగ్నిగా వ్యక్తం చేయబడతాయి. *"అయ మగ్నిః వైశ్వానరః యో–యమంతః పురుషే యేనేదం అన్నం పచ్యతే యదిద మద్యతే"* (తినేపదార్థాన్ని జీర్ణింపచేసే ఏ వైశ్వానరాగ్ని పురుషునిలో ఉన్నదో – బృ.ఉ 5.9.1) అనేది శారీరుడిలో ఉండే జఠరాగ్నికే వర్తిస్తుంది. కొన్ని సందర్భాలలో శ్రుతిలో వైశ్వానరుణ్ణి అగ్నిదేవతగా స్తుతించటం వినబడుతున్నది: *"విశ్వస్మా అగ్నిం భువనాయ దేవా వైశ్వానరం కేతు మహ్నామకృణ్వన్"* (దేవతలు వైశ్వానరాగ్నిని ఈ జగత్తులో సూర్యదేవత రూపంలో పగటికి ప్రతీకగా చేశారు – ఋ.స 10.88.12). అలాగే మరో శ్రుతి *"వైశ్వానరస్య సుమతౌ స్యామ రాజా హి కం భువనానామభిశ్రీః"* (సుఖప్రదుడు లోకాలకధిపతి అయిన వైశ్వానరుడికి లక్ష్మీదేవి అభిముఖంగా ఉంటుంది – ఋ.స 1.98.1).

**సిద్ధాంతం :**

ఇచ్చట ఉపయోగించిన ఆత్మ–వైశ్వానర శబ్దాలు సామాన్య శబ్దాలయినా *"తస్య హవా ఏతస్యాత్మనో వైశ్వానరస్య మూర్ధైవ సుతేజాః"* అని చెప్పడం వల్ల, ఇక్కడ పరమేశ్వరుని యొక్క నిర్దేశమే జరిగింది. అఖండ వైశ్వానరుడు ప్రత్యగాత్మగా ఉపాసన కోసం బోధింపబడ్డాడు. బ్రహ్మ జగత్కారణం కనుక ఏ రూపంలోనైనా ధ్యానించవచ్చు. అదీకాక, *"స సర్వేషు లోకేషు సర్వేషు భూతేషు సర్వేషు ఆత్మాసు అన్నమత్తి"* అని ప్రారంభంలో *"కో న ఆత్మా కిం బ్రహ్మ"* అని స్పష్టంగా బ్రహ్మలింగాలు చెప్పబడ్డాయి. అందువల్ల, వైశ్వానర శబ్దంతో పరమేశ్వర ప్రతిపాదనే జరిగింది.

## సూ: 1.2.25 స్మర్యమాణమనుమానం స్యాదితి

ప్రమాణాలలో శ్రుతికే అత్యధిక ప్రాధాన్యం. తరువాత క్రమంగా స్మృతి వచనాలు, స్తుతివాక్యాలు ప్రామాణ్యములని వేదాంతులు, తార్కికులు కూడా అంగీకరిస్తారు. ముఖ్య సూత్రంలో వైశ్వానర పదంతో పరమేశ్వరుడే చెప్పబడ్డాడు అని నిర్ధారించటానికి మరికొన్ని స్మృతి వాక్యాలు ఇలా ఉదహరింపబడ్డాయి. *"యస్యాగ్నిరాస్యం ద్యౌర్మూర్ధా ఖం నాభి శ్చరణౌక్షితిః సూర్యశ్చక్షుర్దిశః శ్రోత్రం తస్మై లోకాత్మనే నమః"* (అగ్ని ముఖమూ, ద్యులోకం శిరస్సూ, ఆకాశం నాభి, భూమి పాదాలు, సూర్యుడు నేత్రమూ, దిక్కులు శ్రోత్రములుగా గల లోక స్వరూపుడైన పరమేశ్వరుడికి నమస్కారము). *"ద్యాం మూర్ధానం యస్య విప్రా వదంతి ఖం వై నాభిం చంద్రాసూర్యౌ చ నేత్రే దిశః శ్రోత్రే విద్ధి పాదౌ క్షితిం చ సో–చింత్యాత్మా సర్వభూత ప్రణేతా"* (ద్యులోకం ఎవని శిరస్సు, ఆకాశం నాభి అని, సూర్యచంద్రులు నేత్రాలని, దిక్కులు చెవులని, భూమి పాదాలని, ఊహకందని విరాడ్రూపునిగా చెప్పడమయిందో; అతడే సమస్త భూతాలకు కారణమని తెలుసుకో).

## సూ: 1.2.26 శబ్దాదిభ్యో–న్తః ప్రతిష్ఠానాచ్చ నేతి చేన్న తథా దృష్ట్యుపదేశాదసంభవాత్పురుషమపి చైన మధీయతే

**పూర్వపక్షి :**

వైశ్వానరుడు జఠరాగ్నిగానే అర్థాంతరములో రూఢి చెయ్యబడుతున్నాడు. *"స ఏషోఽగ్నిః వైశ్వానరః"* అనేదే శ్రుతిలో వినబడుతున్నది. అదీకాక హృదయం గార్హపత్యః అని మరో మూడింటిని (త్రేతాగ్నిః, వైశ్వానరః, గార్హపత్యాగ్ని, అన్వాహారపచనం) చెప్పటం వలన కూడా పరమేశ్వర నిర్దేశం కుదరదు. అలాగే, *"పురుషోఽన్తః ప్రతిష్ఠితం వేద"* (పురుషుని లోపల ప్రతిష్ఠితమైనది) అనేది కూడా శారీరుడిలో ఉండే జఠరాగ్నికి కుదురుతుంది గాని, పరమేశ్వరుడిని ఉద్దేశించి చెప్పినట్లు లేదు. అలాగే, *"యో భానునా పృథివీం ద్యాం ఉత ఇమాం ఆతతాన రోదసీ అంతరిక్షమ్"* (ఏ భూతాగ్ని సూర్యుడు రూపంలో పృథివీ, ద్యులోకాల్లో కూడా వ్యాపించి ఉన్నదో – ఋ.స 10.88.3) అని సంహితా భాగంలో చెప్పబడింది. ఈ వర్ణన ఒక దేవత యొక్క ఐశ్వర్యమని చెప్పుకోవటం కుదురుతుంది గాని పరమాత్మగా గ్రహించబడదు.

**సిద్ధాంతం :**

శబ్దాదులను ఉదహరిస్తూ వైశ్వానర ప్రసంగం పరమేశ్వరుని యొక్క నిర్దేశం కాదు అనే వాదన అంగీకరింపబడదు. జఠరాగ్ని యందు పరమేశ్వరుని దృష్టి నిలిపి వైశ్వానరోపాసన చెయ్యమని ఇక్కడ నిర్దేశింపబడింది. అంటే పరమేశ్వరుడు జఠరాగ్నిలో ఉపాధిగా ఉన్నట్లు గ్రహించాలి. ఇంకా మరోశ్రుతిలో పరమేశ్వరుడే పురుష శబ్దంతో ఇలా చెప్పబడ్డాడు *"స ఏషోఽగ్నిః వైశ్వానరో యత్పురుషః స యో హ ఏతమేవం అగ్నిం వైశ్వానరం పురుషవిధం పురుషే అంతః ప్రతిష్ఠితం వేద"* (వైశ్వానరాగ్ని పురుషుడు విరాడ్రూపంలో శరీరమంతటా వ్యాపించి ఉంటుంది – శ.బ్ర 10.6.1.11). ఇటువంటి రూపకల్పన పరమేశ్వరునికే తగును కాని పరిమితస్థానంలో ఉండే జఠరాగ్నికి కుదరదు.

## సూ: 1.2.27 అత ఏవ న దేవతా భూతం చ

ముందు సూత్రంలో చెప్పిన కారణాల వల్లే వైశ్వానరుడు భూతాగ్ని కాని దేవతా రూపం కాని కాదు. ద్యులోకాదులకు ఐశ్వర్యం పరమేశ్వరుని వల్ల ప్రాప్తించినదే కాని, మరి ఏ దేవతా వికారము కాదు. ఆత్మ నిర్దేశము పరమేశ్వరునికే

కుదురుతుంది. జఠర–భూతాగ్ని–అభిమానదేవతాగ్ని అనే మూడింటికి కుదరదు. ఈ తరువాత చెప్పిన మూడు సూత్రాలు జైమిని–ఆశ్మరథుడు–బాదరి ఋషుల అభిప్రాయాల ఆధారంగా నిర్ణయించబడ్డాయి.

## సూ: 1.2.28 సాక్షాదప్యవిరోధం జైమినిః

జైమిన్యాచార్యులు జఠరాగ్నిని పరమేశ్వరుని యొక్క ప్రతీకగా తలచి ఉపాసన చేసుకొన్నా, ప్రత్యేక కల్పన లేకుండా, పరమేశ్వరస్థానంగా గ్రహించినా ఎటువంటి దోషము లేదని అభిప్రాయపడ్డారు. జఠరాగ్ని 'అంతస్థః' అంటే ఉదర భాగంలోనే కాకుండా శరీరమంతటా వ్యాపించి ఉండే అగ్ని అని, శారీరుడి యొక్క కర్మలన్నింటికి సాక్షి అయిన ప్రత్యగాత్మగా కాని అన్వయించుకోవచ్చు. వైశ్వానర పదానికి *'విశ్వస్య అయం నరః'* (సకల జీవుల స్వరూపము) లేదా *'విశ్వేనరాః'* (సమస్త మానవులు తన ఆత్మగా కలది అనిగాని వ్యుత్పత్యర్థం) చెప్పుకున్నా అది పరమాత్మకే వర్తిస్తుంది.

## సూ: 1.2.29 అభివ్యక్తేరిత్యాశ్మరథ్యః

అభివ్యక్తం అవటం అంటే సాక్షాత్కారమయ్యే రూపం అని ప్రస్తావించాడు అశ్మరథుడనే ఋషి. ఉపాసకులకు పరమేశ్వరుడు హృదయాది పరిమిత ప్రదేశాలలోనే సాక్షాత్కరిస్తాడు; పరమాత్మ మహాప్రమాణంతో సాక్షాత్కారానికి సంబంధం ఉండదు. అందువల్ల, పరిమిత ప్రదేశమాత్ర శ్రుతిలో నిర్దేశించబడింది పరమేశ్వరుడని అశ్మరథుడు అభిప్రాయం వ్యక్తం చేశాడు.

## సూ: 1.2.30 అనుస్మృతేర్బాదరిః

బాదరి అనే ఋషి మరో విధంగా ప్రతిపాదించాడు: పరమేశ్వరుడు ప్రదేశ మాత్రుడు (పరిచ్ఛిన్న రూపుడు) కాకపోయినా అతనిని మనస్సులో స్మరించటం (ధ్యానించటం) వల్ల శ్రుతిలో ఈ విధంగా ఉపాసన కోసం చెప్పబడింది. అనుస్మృతి వల్ల ఏర్పడిన ఈ రూపకల్పన పరమాత్మ తత్త్వాన్నే బోధిస్తున్నట్లు అంగీకరించాలి.

## సూ: 1.2.31 సంపత్తేరితి జైమినిస్తథా హి దర్శయతి

వైశ్వానర విద్యకు సంబంధించిన వివరణ సామవేదీయ ఛాందోగ్యోపనిషత్తు లోనే కాకుండా, వాజసనేయ బ్రాహ్మణంలో కొద్దిపాటి తేడాతో చెప్పబడింది. ఈ కారణంగా ప్రదేశ పరిమితితో వ్యక్తమైనా రెండుశాఖల లోను పరమేశ్వరుని యొక్క ఉపదేశ లక్ష్యంతోనే శ్రుతివాక్యాలు బోధిస్తున్నాయని అన్వయించుకోవాలి. శాఖా భేదాలను ప్రక్కనపెట్టి ప్రదేశమాత్ర శ్రుతి పరమేశ్వరుని ఐశ్వర్యం–సంపద్గుణాలను సూచిస్తున్నట్లు సమన్వయించుకోవాలని జైమిన్యాచార్యులు వారి అభిమతం. అధిదైవత ప్రస్తావనగా ద్యులోకం నుండి పృథివి వరకు, అధ్యాత్మకంగా ముఖప్రదేశంలో పరమేశ్వరుడి యొక్క ప్రదేశమాత్ర ఆరోపణతో అశ్వపతి రాజు తన శిష్యులకు అర్థమయ్యే రీతిలో తన ముఖావయవాలను చూపిస్తూ ఈ ఉపదేశం చేసినట్లు గ్రహించాలి.

## సూ: 1.2.32 ఆమనంతి చైనమస్మిన్

అవ్యక్తము–అనంతము అయిన ఆత్మ వరణా–నాశీల మధ్య ప్రతిష్ఠితమైనది. 'వరణా' అనగా సకల దుఃఖములను దాటించేది (సేతువు), ఇంద్రియాదుల వల్ల ప్రాప్తించిన పాపాలను నాశనము చేసేది 'నాశీ' అని వివరించిన తరువాత జాబాలో పనిషత్తులో ఇలా చెప్పబడింది: *"కతమచ్చాస్య స్థానం భవతీతి భ్రువోః ఘ్రాణస్యచ యః సంధిః, స ఏష ద్యులోకస్య పరస్య చ సంధిర్భవతీతి"* [ఈ పరమేశ్వరుడి స్థానమేది? కనుబొమలకు–నాశిక కు సంధి (భ్రుకుటి) ఏదో అదే ద్యులోకాన్ని– బ్రహ్మలోకాన్ని కలపే వారిధి – జా.బా: 2 ]. పరమాత్మ నిర్దేశానికి అంత–ఇంత అనే పరిమితి లేదు. సకల జగత్తంతా వ్యాపించి ఉన్న అవ్యక్తము. అందువల్ల ప్రదేశ పరిమితితో శిరస్సు–చుబుకాల మధ్య వైశ్వానరుడి రూపంలో

ఉన్నది పరమేశ్వరుడే అని చెప్పటం ఎంతమాత్రము శ్రుతి విరుద్ధము కాదు.

# 1. సమన్వయాధ్యాయము : తృతీయపాదము



## 1. ద్యుభ్వాద్యధికరణమ్

### సూ: 1.3.1 ద్యుభ్వాద్యాయతనం స్వశబ్దాత్

ఈ పాదంలో ముఖ్యంగా జ్ఞేయమైన నిర్గుణబ్రహ్మ ప్రతిపాదన చెయ్యబడింది. శౌనకుడు–ఆంగిరసునకు చేసిన పరావిద్యా బోధన ప్రకరణంలో శ్రుతి ఇలా వినబడుతున్నది. *"యస్మిన్ ద్యౌః పృథివీచ అంతరిక్షం ఓతం మనః సహ ప్రాణైశ్చ సర్వైః తమేవ ఏకం జానథ ఆత్మానం అన్యా వాచో విముంచథ అమృతస్య ఏష సేతుః"* [దేనియందు ద్యులోకం పృథివీ అంతరిక్షం సమస్త ప్రాణాలతో సహా మనస్సు పెనవేసికొని (అల్లుకొని) ఉన్నాయో అది ఒక్కటే ఆత్మ అని తెలుసుకోవాలి. మిగతా మాటలు అనవసరం. ఆత్మయే అమృతత్వానికి సేతువు – ము.ఉ 2.2–5 ].

**పూర్వపక్షి :**

ద్యులోకాదులు అల్లుకొని ఉన్నాయి అంటే వాటికి ఆయతనంగా (ముఖ్య స్థానం) మరొకటి ఏదో ఉందని, అనిపిస్తున్నది. అలాగే *"అమృతస్య ఏష సేతుః"* అంటే ఆ వారధికి అవతల ఒడ్డు ఉన్నట్లే కదా? బ్రహ్మ అనంతం (అపారం) అన్న శ్రుత్యనుసారం సేతువులా వ్యవహరించటానికి మరో ఒడ్డు చేరితే వేరొకటి ఉండరాదు. అందువల్ల ఇక్కడ చెబుతున్నది వాయువైనా కావాలి, లేకపోతే స్మృతిలో చెప్పబడిన ప్రధానమైనా కావాలి. *"వాయుర్వై గౌతమ తత్సూత్రం వాయునా వై గౌతమ సూత్రేణ అయం చ లోకః పరశ్చలోకః సర్వాణి భూతాని సంద్రుబ్ధాని భవంతి"* [ఓ గౌతమా! వాయువు చేతనే ఇహ–పరలోకములు, సమస్త భూతములు ఒకే దారంతో గ్రుచ్చబడిన మాలలాగ కట్టబడి (నిలబెట్టబడి) ఉన్నాయి – బృ.ఉ 3.7.2 ] అని ఇలా యాజ్ఞవల్క్య, ఆరుణి సంవాదంలో చెప్పబడింది. ఆయతనం జగత్తంతటికి ఒక్కటే అని సూచింప బడింది కాబట్టి, ఇక్కడ జీవుడి యొక్క అన్వయం కుదరవచ్చు అని కూడ తోస్తున్నది.

**సిద్ధాంతం :**

*"తమేవ ఏకం జానథ ఆత్మానమ్"* అని ఆత్మశబ్ద నిర్దేశం ఉండటం వల్ల పరమాత్మను ఉద్దేశించే ఇక్కడ ఉపదేశం జరిగింది అని వ్యక్తమౌతున్నది. *"సన్మూలాః సోమ్య ఇమాః ప్రజాః సదాయతనాః సత్ప్రతిష్ఠాః"* [యావన్మంది ప్రజలకు సత్ ఆయతనము (మూలము), సత్ వల్లే జీవిస్తున్నారు సత్ లోనే విలీనమౌతున్నారు – ఛా. ఉ 6.8.4 ] అని ఛాందోగ్యోపనిషత్తులో నిర్దిష్టంగా బ్రహ్మమును బోధించే సత్ శబ్దం ఆయతనంగా చెప్పబడింది. *"తమేవ ఏకం జానథ ఆత్మానమ్"* అనే శ్రుతికి ముందూ, తదనంతరము కూడా పరమాత్మ యొక్క ఉపదేశమే చేయబడింది. *"పురుష ఏ వేదం విశ్వం కర్మ తపో బ్రహ్మ పరామృతమ్"* (జ్ఞాన కర్మల ఫలరూపమైన ఈ జగత్తుకు కారణము ఆ పురుషుడే. అదే పరమూ, అమృతమైన బ్రహ్మము – ము.ఉ 2.1.10). *"బ్రహ్మ ఏవ ఇదం అమృతం పురస్తాత్, బ్రహ్మ పశ్చాత్, బ్రహ్మ దక్షిణశ్చ ఉత్తరేణ అధశ్చ ఉర్ధ్వం చ"* (అన్ని దిక్కులందు బ్రహ్మ వ్యాపించి ఉన్నాడు – ము.ఉ 2.2.11). అంతా బ్రహ్మమే అనే భావనతో చెప్పబడింది కాబట్టి, నిర్విశేష (నిర్గుణ) బ్రహ్మ నిర్దేశము జరిగినట్లు గ్రహించాలి.

ఏకరసమైనది, అద్వితీయమైన నిర్గుణ బ్రహ్మ ఉపదేశమే ఛాందోగ్యంలోను శ్వేతకేతువునకు ఉద్దాలకుడు చేశాడు. అందువల్ల *"తమేవ ఏకం జానథ ఆత్మానమ్"* అనే వాక్యంలో ఉన్నది నిర్విశేష బ్రహ్మ నిర్దేశమనే గ్రహించాలి. ఆత్మయందు నానాత్వం (భిన్న భావంతో) ఎవడు చూస్తాడో వాడు మృత్యువు నుండి – మృత్యువునే పొందును, వానికి జనన–మరణ వలయం నుండి విముక్తి ఉండదని కఠోపనిషత్తులో కూడా చెప్పబడింది. *"మృత్యోః స మృత్యు మాప్నోతి య ఇహ నానా ఇవ*

*పశ్యతి"* (కఠ 2.4.4). యాజ్ఞవల్క్యుడు, మైత్రేయికి ఆత్మబోధన చేసిన సందర్భంలో ఇలా అంటాడు: *"స యథా సైంధవఘనో–న్తరో–బాహ్యః కృత్స్నః రసఘన ఏవ, ఏవం వా అరే! ఆయమాత్మానన్తరో–బాహ్యః కృత్స్నః ప్రజ్ఞానఘన ఏవ"* [సైంధవ లవణ రాతిముక్క బయటా లోపల అంతా ఏకరసం (ఉప్పగా) ఉంటుందో, అలాగే ఈ ఆత్మ సర్వస్వము ప్రజ్ఞానఘనము – జ్ఞానపు ముద్ద, ఏకరసమైనది.– బృ.ఉ 4.5.13 ].

పూర్వపక్షి *'ఏష సేతుః'* అనే పదప్రయోగాన్ని *"ద్యౌః పృథివీ చాంతరిక్ష మోతం మనః"* అని ముందు ఉదహరించిన శ్రుతిలో చూపెడుతూ బ్రహ్మ కన్నా వేరొకటి ఉంటే కదా 'సేతుః' అని చెప్పబడుతుంది, అనే సందేహాన్ని వ్యక్తం చేశాడు. సేతు శబ్దం అడ్డుకోవటం–నిలపటం అనే అర్థంలోనే ఈ శ్రుతిలో వాడబడింది, అంతేకాని ఇటూ, ఆటూ రెండింటిని కలిపే వారధి అన్న ఉద్దేశంతో కాదు. అందువల్ల, ఈ సందర్భంలో ఒక్క అద్వితీయమైన బ్రహ్మమునే గ్రహించాలి.

## సూ: 1.3.2 ముక్తోపసృప్యవ్యపదేశాత్

జనన–మరణ బంధ విముక్తే లక్ష్యంగా ద్యుభ్వాద్యాయతనాన్ని ప్రస్తావించి పరమాత్మ అంతటికి మూలం అని చెప్పబడింది. అహంకార భావంతో దేహాదుల యందు జీవునికి మోహం కలుగుతుంది. అట్టి మోహ బంధం నుండి విముక్తి కొరకు ఆత్మోపదేశము. ముముక్షువులకు మోక్షమే పరమావధి.

*"భిద్యతే హృదయగ్రంధిః ఛిద్యంతే సర్వ సంశయాః, క్షీయంతే చాస్యకర్మాణి తస్మిన్ దృష్టే పరావరే"* [అవిద్యా వాసనామయమైన హృదయగ్రంథి పరమాత్మ దర్శనముతో తెగి నాశనమైపోతుంది. దానితో సంశయములన్ని పోయి, కర్మఫలము అంతమై జీవుడు (సంసారి) ముక్తుడు అవుతాడు – ము.ఉ 2.2.8 ]. *"యదా సర్వే ప్రముచ్యంతే కామాః యే–స్య హృదిశ్రితాః అథ మర్త్యో–మృతో భవతి అత్ర బ్రహ్మసమశ్నుతే"* (హృదయంలో ఉండే కోరికలు, సందేహాలు అంతమైన వెనువెంటనే ఆ సంసారి అమృతుడై ఇక్కడే బ్రహ్మప్రాప్తిని పొందుతాడు – బృ.ఉ 4.4.7). అలాగే బ్రహ్మ ప్రతిపాదన ముందు సూత్రంలో చెప్పిన శ్రుతిలో ఇలా ఉంది: *"తమేవ ఏకం జానథ ఆత్మానమన్యా వాచో విముంచథ"* (మాటలన్నిటిని విడచిపెట్టి పరమాత్మయే ద్యు–భూ మొదలగు వాటన్నింటికి ఆయతనమని తెలుసుకో) అలాగే మరో శ్రుతి *"తమేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః న అనుధ్యాయాత్ బహూన్ శబ్దాన్ వాచో విగ్లాపనం హి తత్"* (బ్రహ్మను తెలుసుకొన్న జ్ఞాని–పండితుడు ఎక్కువ శబ్దాలతో ధ్యానం చెయ్యకూడదు. అది వాక్ శక్తిని క్షీణింపజేస్తుంది – బృ.ఉ 4.4.21).

## సూ: 1.3.3 నానుమానమతచ్ఛబ్దాత్

సాంఖ్య స్మృతులలో ప్రతిపాదితమైన ప్రధానము ద్యు–పృథివ్యాది సమస్తము నకు ఆయతనమని అంగీకరించబడదు. అచేతనమైన ప్రధానము 'అతః' శబ్దంతో ప్రతిపాదింపబడదని సూత్రార్థము. 'యః సర్వజ్ఞః సర్వవిత్' అని చెప్పిన కారణంగా చేతనమయమైన పరమాత్మ సర్వానికి ఆయతనమని గ్రహించబడుతుంది. అచేతనమైన వాయువు కూడా ద్యు–పృథివ్యాదికి ఆయతనంగా పేర్కొనబడదు.

## సూ: 1.3.4 ప్రాణభృచ్చ

ప్రాణధారుడైన శారీరుడు (విజ్ఞానాత్మ) కూడా చేతనత్వం ఉన్నా, సమస్త లోకాలకు జీవులకు ఆయతనమని గ్రహించలేము. జీవుడు ఉపాధి పరిచ్ఛిన్న గుణములతో నామ–రూపములున్న వ్యక్తి. అతడు సర్వాత్మకుడు కాజాలడు.

మరే కారణాల వల్ల శారీరుణ్ణి ద్యుభ్వాద్యాయతనంగా పరిగణించలేమో వివరిస్తూ ఈ క్రింది మూడు సూత్రములు చెప్పబడ్డాయి.

## సూ: 1.3.5 భేదవ్యపదేశాత్

సంసారి (జీవుడు) మోక్షం కోరుకునే ముముక్షువు. జ్ఞానేచ్ఛ కలవాడు జ్ఞాతా. జ్ఞేయమైనది బ్రహ్మ (తల్లక్ష్యం). ఈ విభేదం దృష్ట్యా పరమాత్మను—జీవుణ్ణి సమానస్థాయిలో గ్రహించబడదు.

## సూ: 1.3.6 ప్రకరణాత్

ప్రకరణం మొదట్లో *"కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి"* అని శిష్యుడు అడిగిన ప్రశ్నకు స్వల్పజ్ఞానమున్న జీవుడు (కించిజ్ఞుడు) అని సమాధానం ఇవ్వబడదు. సర్వవిత్—సర్వజ్ఞః—ప్రజ్ఞానఘనుడైన పరమాత్మయే కార్య రూపంలో ఉన్న సర్వస్వానికి కారణం—ఆయతనమని చెప్పబడింది.

## సూ: 1.3.7 స్థిత్యదనాభ్యాం చ

ముండకోపనిషత్తులో *"ద్వా సుపర్ణా సయుజా సఖాయా"* అని ప్రారంభించి *"తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి, అనశ్నన్ అన్యో–భిచాకశీతి"* అని పరమాత్మ—జీవాత్మలు ఇద్దరూ మిత్రులుగా ఒకే శరీరంలో ఉంటున్నా శారీరుడ భోక్తగా వ్యవహరిస్తాడు, ఈశ్వరుడు సాక్షిగా చూస్తూ కర్మఫలంతో ప్రమేయం లేకుండా ఉంటాడని వివరించబడింది. అందువల్ల, జీవుడు కర్తగా—భోక్తగా ద్యుభ్వాదికి ఆయతనంగా ఉండే ప్రసక్తి లేదు. పరమాత్మ నిత్యమూ ఉండే నాశరహితుడు. అందువల్ల పరమాత్మనే సర్వాత్మకమని గ్రహించవలసి ఉంటుంది.

అదృశ్యత్వాధికరణంలో (సూ. 1.2.21) *"యస్మిన్ ద్యౌః పృథివీ చాంతరిక్షమ్"* అనే శ్రుతిని ఉదహరిస్తూ ద్యు—పృథివీ—అంతరిక్షాదులకు ఆయతనంగా పరమాత్మనే నిర్దేశిస్తూ చెప్పబడింది. అయినా, మళ్లీ ఈ అధికరణంలో ఆ విషయాన్నే పునః ప్రస్తావించి విశదీకరించినట్లు గ్రహించాలి.

## 2. భూమాధికరణమ్

### సూ: 1.3.8 భూమా సంప్రసాదాదధ్యుపదేశాత్

నారదుడు వేద–వేదాంగములు, ఇతిహాస పురాణాదులు అధ్యయనం చేసి సనత్కుమారుని వద్దకు జ్ఞానాభిలాషతో శుశ్రూషకై వెళ్లినట్లు ఛాందోగ్యోపనిషత్తులో ఒక ఆఖ్యాయిక ఉంది. దానిని ఆధారంగా పూర్వపక్షి ప్రశ్నిస్తున్నాడు.

**పూర్వపక్షి :**

*"భూమాత్వేవ విజిజ్ఞాసితవ్యః"* (చాల మహత్తైన భూమానము తెలిసికొన దగినది). *"భూమానం భగవో విజిజ్ఞాసే"* (ఆ భూమానం గురించి తెలియజేయమని పూజ్యులైన మిమ్మలను కోరుకుంటున్నాను). *"యత్ర నాన్యత్ పశ్యతి నాన్యత్ శృణోతి నాన్యత్ విజానాతి స భూమా, అథ యత్ర అన్యత్ పశ్యతి అన్యత్ శృణోతి అన్యత్ విజానాతి తదల్పమ్"* (ఎక్కడ మరో దానిని చూడడో, మరోదానిని వినడో, మరోదానిని తెలుసుకోడో - అదే భూమా. ఎక్కడ మరొక దానిని చూస్తాడో, మరొక దానిని వింటాడో, మరొక దానిని తెలుసుకుంటాడో - అది అల్పమైనది. – ఛా.ఉ 7.23.1, 7.24.2). ఇక్కడ భూమా అని దేనిని గురించి చెప్పడమైనది? ప్రాణమా? పరమాత్మా? ప్రాణమనే అనిపిస్తున్నది. *"ప్రాణోవా ఆశాయా భూమాన్"* (ప్రాణము ఆశ కంటె గొప్పదైనది) అని అంతకుముందు చెప్పబడింది. అయితే, *"శ్రుతం ఏవ మే భగవద్దృశేభ్యః తరతిశోకం ఆత్మవిత్ ఇతి సో-హం భగవః శోచామి తం మా భగవాన్ శోకస్య పరం పారం తారయతు"* (మీరు ఆత్మను తెలుసుకున్నవారు. ఆత్మను తెలుసుకున్న మీ వంటి వారు శోకమును అతిక్రమించెదరని విన్నాను. ద్వైతభావనతో ఉన్న నన్ను, పూజ్యులైన మీరు అనుగ్రహించి శోకము నుండి తరింప జేయవలసినదిగా కోరుతున్నాను – ఛా.ఉ 7.1.3). నారదుడు సనత్కుమారుని వద్దకు ఆత్మజ్ఞానాభిలాషతో వెళ్లినట్లు శ్రుతిలో వినబడటం వల్ల పరమాత్మనే ఇక్కడ భూమా అని వ్యక్తం చేసినట్లు కూడా తోస్తున్నది. అందువల్ల ప్రాణమా–పరమాత్మయా అనే సందేహం వచ్చింది.

వాక్కు, నామం కంటె గొప్పది, వాక్కు కంటె మనస్సు గొప్పది, మనస్సు కంటె ప్రాణం గొప్పది, అనే క్రమంలో ముందు సనత్కుమారుడు–నారదుడికి చెప్పాడు. జీవుడు సుషుప్త్యవస్థలో తక్కిన ఇంద్రియాలన్నీ పనిచేయకపోవటం వలన మరేమి చూడడు, వినడు, తెలుసుకోడు. శరీరంలో పంచాగ్నులు మాత్రమే వాటి వ్యాపారం చేస్తూ ఉంటాయి *"ప్రాణాగ్నయ ఏవైతస్మిన్ పురే జాగ్రతి"* అని చెబుతున్న శ్రుతి కూడా ఉంది (ప్ర.ఉ 4.2.3). అంతేకాదు, సుషుప్త్యవస్థలో చాలా సుఖమున్నట్లు కూడా చెప్పబడింది. *"యత్రైష దేవః స్వప్నాన్ న పశ్యతి అథ తత్ ఏతస్మిన్ శరీరే ఏతత్ సుఖం భవతి"* (ఈ జీవుడు ఎప్పుడు స్వప్నాలు చూడడో అప్పుడే శరీరంలో చాల సుఖం కలుగుతుంది – ప్ర.ఉ 4.6). అలాగే, *"ప్రాణో వా అమృతమ్"* (ప్రాణమే అమృతము – కౌ.ఉ 3.2), *"ప్రాణోపితా, ప్రాణోమాతా, ప్రాణోభ్రాతా ప్రాణః స్వసా ప్రాణ ఆచార్యః"* (ప్రాణమే తండ్రి, ప్రాణమే తల్లి, ప్రాణమే సోదరుడు, ప్రాణమే సోదరి, ప్రాణమే గురువు – ఛా.ఉ 7.15.1), *"యథావా ఆరా నాభౌ సమర్పితా, ఏవమస్మిన్ ప్రాణే సర్వం సమర్పితమ్"* (రథ నాభి యందు చక్రము అమర్చినట్లు ఈ ప్రాణములో అన్నీ ప్రతిష్ఠింపబడ్డాయి – ఛా.ఉ 7.15.2)... ఇలా ప్రాణం యొక్క మహత్వాన్ని విశేషంగా చెప్పడమైంది.

**సిద్ధాంతం :**

భూమాగా పరమాత్మ నిర్దేశమే చెయ్యబడింది. ప్రాణము కంటె మహత్తైనది పరమాత్మ అని గ్రహించాలి. సూత్రంలో *"సంప్రసాదాదధ్యుపదేశాత్"* అనే పదం సుషుప్తిస్థానాన్ని ప్రస్తావించి చెప్పినదే. సుషుప్తిలో బ్రహ్మలీనమయి జీవుడు ఆనందమయుడు (ప్రసన్న చిత్తుడు) అవుతాడు.

ప్రాణము కన్నా గొప్పది మరొకటి ఏదైనా ఉందా అని నారదుడు అడిగిన ప్రశ్నకు, ఉంది అని సమాధానమిస్తూ *"యః సత్యేన అతివదతి"* అని వివరించటం జరిగింది. సత్యమనే విశేషంతో చెప్పడం వల్ల *"సత్యం తు ఏవ విజిజ్ఞాసితవ్యమ్"* , అని నారదుడు మళ్లీ కోరటం వల్ల పరమాత్మనే ఇక్కడ ఉపదేశిస్తున్నట్లు గ్రహించాలి. *"సత్యం జ్ఞానమనంతమ్"* అని బ్రహ్మ యొక్క లక్షణాలు ముందు చెప్పడమయింది కదా! అందువల్ల ప్రాణము కన్నా అతి గొప్పదని 'భూమా' శబ్దంతో చెప్పబడినది

పరబ్రహ్మయే.

శ్రుత్యంతరంలో *"నాన్యః పంథా విద్యతే-యనాయ"* అని శోకనివృత్తికి పరమాత్మయే గతి అని చెప్పబడింది (శ్వే.ఉ 6.15). నారదుడు శోకము నుండి తరింపజేసే ఉపాయాన్ని అర్థిస్తూ సనత్కుమారుని వద్దకు వెళ్లినట్లు ఈ ప్రకరణం ఆరంభంలో ప్రస్తావించబడింది. *"తస్మై మృదిత కషాయాయ తమసః పారం దర్శయతి స సనత్కుమారః"* అని ప్రకరణాంతంలో ముగింపు జరిగింది. సనత్కుమారుడు రాగద్వేషాది మాలిన్యము పోగొట్టి అంతఃకరణ శుద్ధితో అవిద్యారూపమైన తమస్సు నుండి దాటే మార్గాన్ని నారదుడికి చూపెడతాడని ఈ శ్రుతి తాత్పర్యము. అంతేకాదు ఛాందోగ్యంలో *"ఆత్మనః ప్రాణః"* (ఆత్మ నుండి ప్రాణము పుట్టినది), *"స భగవః కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి, స్వేమహిమ్ని"* [పూజ్యుడా ఆత్మ దేనియందు ప్రతిష్ఠితమైనది. తనయొక్క (బ్రహ్మ యొక్క) మహిమనందే – ఛా.ఉ 7.24.1, 7.26.1 ]. ఈ విధంగా మరికొన్ని శ్రుతివాక్యాల్లో వినబడడం వల్ల పరమాత్మనే ప్రాణము కన్నా మించినదిగా, భూమాగా గ్రహించాలి.

## సూ: 1.3.9 ధర్మోపపత్తేశ్చ

పరమాత్మ యొక్క ధర్మాలన్నీ భూమా యందు ఉన్నట్లు గ్రహించాలి. *"యత్ర నాన్యత్ పశ్యతి నాన్యత్ శృణోతి నాన్యత్ విజానాతి స భూమా"* ఇవే ధర్మాలు పరమాత్మ పరంగాను చెప్పబడ్డాయి. అలాగే, *"యత్ర తు అస్య సర్వ మాత్మైవాభూత్ తత్ కేన కం పశ్యేత్"* సుషుప్తిలో ఉండే జీవుడు కూడా ఇదే పరిస్థితిలో ఉండటం వలన దేనినీ చూడడు, వినడు, తెలుసుకోలేదు అనే చెప్పడమయింది. *"ఏషో-స్య పరమ ఆనందః ఏతస్య ఏవ ఆనందస్య, అన్యాని భూతాని మాత్రాం ఉపజీవంతి"* (పరమానందం పరమాత్మ యొక్క లక్షణం. తక్కిన జీవులు ఆ పరమానందంలో అంశమాత్రాన్నే పొంది జీవిస్తున్నాయి – బృ.ఉ 4.3.32). అదేవిధంగా *"యోవై భూమా తత్సుఖం న అల్పే సుఖమస్తి, భూమా ఏవ సుఖమ్"* (భూమాయే సుఖమైనది. అల్పంలో సుఖము లేదు). భూమా ఆనందమయమైనది, దుఃఖ రహితమైనది. *"యో వై భూమా తదమృతం"* (ఛా.ఉ 7.24.1), *"ఆతో-న్య దార్తమ్"* (భూమా అమృతత్వము కలది. మిగతా కార్య ప్రపంచమంతా అనిత్యము నాశనమయేదే – బృ.ఉ 3.4.2). అందువల్ల, సత్యమూ–నిత్యత్వము–సర్వవ్యాప్తము అనే గుణములు గల నిర్విశేష బ్రహ్మయే 'భూమాగా' చెప్పబడింది.

# 3. అక్షరాధికరణమ్

## సూ: 1.3.10 అక్షరమంబరాంతధృతేః

**పూర్వపక్షి :**

యజ్ఞావల్క్య–గార్గి సంవాదంలో అక్షర ప్రస్తావన ఇలా ఉంది: *"కస్మిన్ను ఖలు ఆకాశ ఓతశ్చ ప్రోతశ్చ ఇతి? సహోవాచ ఏతద్వై తదక్షరం గార్గి బ్రాహ్మణా అభివదంతి అస్థూలం అనణు"* (ఆకాశం దేనిని పెనవేసుకొని ఓత–ప్రోతమై ఉన్నది? ఓ గార్గి! అదే అక్షరం. దానినే – స్థూలమైనదీకాదు, అణు మాత్రమూ కాదు – అని తెలిసిన వాళ్లు బ్రాహ్మణులు చెప్తుంటారు అని యాజ్ఞవల్క్యుడు సమాధానం చెప్పాడు – బృ.ఉ 5.8.7, 5.8.8).

ఈ సంవాదంలో అక్షరం అనే శబ్దంతో ఎవరిని ఉద్దేశించి యాజ్ఞవల్క్యుడు ప్రస్తావిస్తున్నాడు – అక్షరాలలో ఒక వర్ణమునా? లేక పరమేశ్వరుణ్ణా? – అని సందేహం కలుగుతున్నది. వర్ణమే అక్షరమని రూఢంగా సామాన్య వాడుకలో ప్రసిద్ధి. *"ఓంకార ఏవ ఇదం సర్వమ్"* (ఓంకారమే ఈ విశ్వమంతా – ఛా.ఉ 2.23.3) అని 'ఓం' అనే వర్ణమే సూచింపబడింది. ఇతరత్రా కూడా శ్రుతిలో 'ఓం' అనే ఏకాక్షరం ఉపాసన కొరకు చెప్పబడింది.

**సిద్ధాంతం :**

అక్షర శబ్దము పరమాత్మనే నిర్దేశిస్తున్నది. పృథివీ నుండి ఆకాశ పర్యంతమూ ఉండే శక్తి కలది, కార్య సముదాయాన్నంతటినీ నిలబెట్టి ఉంచుతున్నది కాబట్టి 'అంబరాంతధృతేః' అని సూత్రంలో చెప్పబడింది.

*"ఆకాశ ఏవ తత్ ఓతంచ–ప్రోతంచ"* (పృధ్వ్యాదులు ఆకాశం యందు ప్రతిష్ఠింపబడి ఉన్నాయి) అని చెప్పిన తరవాత *"కస్మిన్ను ఖలు ఆకాశ ఓతశ్చ ప్రోతశ్చ? ఏ తస్మిన్ను ఖలు అక్షరే గార్గి ఆకాశ ఓతశ్చ–ప్రోతశ్చ"* అని ప్రశ్న – సమాధానాలు శ్రుతిలో స్పష్టంగా వినబడుతున్నాయి. అందువల్ల, కారణబ్రహ్మమునే అక్షరమని అంబరాంతధృతి సామర్థ్యాన్ని సూచిస్తూ చెప్పబడింది.

నాశరహితమైనది గాన అక్షరం. నిత్యత్వం, సర్వవ్యాప్తిత్వం అనేవే కాకుండా 'అశ్నుతే ఇత్యక్షరం' అనే నిర్వచనం ప్రకారం ఇక్కడ పరమాత్మ అనే గ్రహించాలి. *"ఓంకార ఏవేదం సర్వమ్"* అనే శ్రుతిలో ఓంకారము పరమేశ్వరుని ధ్యానం కోసం ఏకాక్షరంగా చెప్పబడింది. ఓంకారము బ్రహ్మ ప్రతీక – ధ్యాన సాధనంగా ఏకాక్షర స్తుతి ఉత్కృష్టమైనదిగా ఉపదేశించబడింది.

## సూ: 1.3.11 సా చ ప్రశాసనాత్

అంబరాంతధృతితో పాటు ప్రశాసనం కూడా అని ఈ సూత్రార్థం. *"ఏతస్య వా అక్షరస్య ప్రశాసనేన గార్గి! సూర్య చంద్రమసౌ విధృతౌ తిష్ఠతః"* (ఈ అక్షరుని యొక్క ఆజ్ఞవలననే సూర్య–చంద్రులిద్దరూ ప్రతిష్ఠితమై ఉన్నారు – బృ.ఉ 3.8.9). ప్రశాసనం పరమేశ్వరుడి యొక్క అనంతశక్తిని, సామర్థ్యాన్ని చూపిస్తుంది. అచేతన మైన ప్రధానమునకు ఇట్టి కార్యనిర్వహణ కుదరదు.

## సూ: 1.3.12 అన్యభావవ్యావృత్తేశ్చ

జీవుడు అన్యుడు పరిచ్ఛిన్న ఉపాధికలవాడు. అందువల్ల శారీరుడు అక్షర శబ్దంతో చెప్పబడడు. *"తద్వా ఏతదక్షరం గార్గి! అదృష్టం ద్రష్టృ, అశ్రుతం శ్రోతృ, అమతం మంతృ, అవిజ్ఞాతం విజ్ఞాతృ"* (గార్గీ! ఈ అక్షరమే చూడబడనిది చూసేది, వినబడనిది వినేది, తెలుసుకోలేనిది తెలుసుకున్నది – బృ.ఉ 3.18.11). ఈ శ్రుతిలో అక్షరుడు విశేష గుణములుకల శక్తిమంతుడు అని వినిపిస్తున్నది. అలాగే *"నాన్య దతోఽస్తి ద్రష్టృ, నాన్యదతోఽస్తి శ్రోతృ, నాన్యదతోఽస్తి మంతృ,*

*నాన్యదతోఽస్తి విజ్ఞాతృ"* (దీని కన్నా వేరైనది మరేదీ చూచేది, వినేదీ, ఆలోచించేదీ, తెలుసుకొనేదీ లేదు – బృ.ఉ 3.8.11) అని చెప్పటం వల్ల జీవుడు దృష్ట్యాది కార్యకలాపాలను పరమేశ్వరానుగ్రహం వల్లే పొందినట్లు గ్రహించాలి.

రూపరహితమైన పరమాత్మకు చక్షురాది ఇంద్రియాలు లేవని కూడా *"అచక్షుష్క మశ్రోతం అవాక్ అమనః"* (బృ.ఉ 3.8.8) అని శ్రుతిలో చెప్పబడింది. ఈ కారణం వల్ల అక్షరమని నిర్దేశింపబడినది పరబ్రహ్మమే తప్ప, శారీరుడు గాని మరొక పదార్థము గాని కాదు.

## 4. ఈక్షతికర్మాధికరణమ్

### సూ: 1.3.13 ఈక్షతి కర్మవ్యపదేశాత్సః

ప్రశ్నోపనిషత్తులో సత్యకాముడనే శిష్యుడు పిప్పలాద ఋషిని మహాత్మా జీవితాంతము ఓంకారోపాసన చేసిన వ్యక్తికి పుణ్యలోకాలలో ఏ లోకము ప్రాప్తిస్తుంది అని ప్రశ్నిస్తాడు. ఆ సందర్భంలో ఇచ్చిన సమాధానాన్ని ఆధారం చేసుకొని పూర్వపక్షి సందేహాలు ప్రకటిస్తున్నాడు.

**పూర్వపక్షి :**

పిప్పలాద మహర్షి సత్యకాముడుకిచ్చిన సమాధానం శ్రుతిలో ఇలా విన బడుతున్నది: *"ఏతద్వై సత్యకామ! పరం చ అపరం చ బ్రహ్మ యదోంకారః తస్మాత్ విద్వాన్ ఏతేనైవ ఆయతనేన ఏకతరం అన్వేతి"* (ఓంకారమనేదే పరబ్రహ్మ–అపర బ్రహ్మస్వరూపము కూడా. అందువల్ల విద్వాంసుడు ఓంకారమే బ్రహ్మమని తెలుసుకొని పర–అపర బ్రహ్మములలో ఒకరిని పొందుతున్నాడు – ప్ర.ఉ 5.2). ఈ విధంగా ఉపదేశం ఆరంభించి ఓంకారములో 'అ' – 'ఉ' – 'మ' అనే మూడు మాత్రలు (అంగములు) ఉన్నాయి; ఒక్కొక్క మాత్రకు వేరు వేరు ఋషులు–దేవతలు–వేదములు ఉన్నాయి - అని వివరించి ఆ తరవాత, *"యః పునరేతం త్రిమాత్రేణ ఓమితి ఏతేనైవ అక్షరేణ పరం పురుషం అభిధ్యాయీత"* (ఎవడైతే ఇలా మూడు మాత్రలున్న ఓంకారముతో పరమ పురుషుని ధ్యానం చేస్తాడో – ప్ర.ఉ 5.5) అని అన్నాడు. ఈ వాక్యంలో ఎవనిని ధ్యానం చెయ్యాలన్నది స్పష్టంగా లేదు. పర (నిర్గుణ) బ్రహ్మమునా? అపర (సగుణ) బ్రహ్మమునా? ముందు వాక్యంలో *"ఓంకారోపాసనతో పరా–అపరా బ్రహ్మలలో ఒకరిని విద్వాంసుడు పొందుతాడు"* అని చెప్పటం వలన ఈ సంశయం కలుగుతున్నది.

వాక్యశేషంలో ఇలా ఉంది: *"స తేజసి సూర్యే సంపన్నః స సామభిః ఉన్నీయతే బ్రహ్మలోకమ్"* [ఆ ఉపాసకుడు సూర్యతేజస్సులో ఐక్యమై వేదపురుషుని చేత (సామతో) అక్కడ నుండి బ్రహ్మలోకమునకు తీసికొని వెళ్లబడును – ప్ర.ఉ 5.5 ]. 'పరం పురుషం' పరబ్రహ్మను ధ్యానం చేసిన వానికి అపరబ్రహ్మ ప్రాప్తి కాకూడదు కాదా! అందువల్ల అపరబ్రహ్మ కాకపోవొచ్చు పరబ్రహ్మయే కావొచ్చు అనే సందేహం కూడా వస్తున్నది.

**సిద్ధాంతం :**

ఇచ్చట పరబ్రహ్మమే ధ్యేయమని చెప్పబడుతున్నది. ఇదే మంత్రం వాక్య శేషంలో *"ఏ తస్మాత్ జీవఘనాత్ పరాత్పరం పురిశయం పరుషం ఈక్షతే"* (ఉపాసకుడు తన రూపంలోనే (హృదయంలో) ఈ జీవఘనం కంటె పరుడైన పరాత్పరం (నిర్గుణ బ్రహ్మమును) చూస్తాడు. జీవఘనం అనే పదానికి వివరణ ఇలా ఇవ్వబడింది: జీవ రూపమైనదే జీవఘనం. ఉపాధి సంబంధం వల్ల ఏకరసమైన పరమాత్మ జీవుని శరీరంలో జీవాత్మగా సూక్ష్మరూపంలో ఉంటుంది. అది విషయేంద్రియాల కన్నా పరమైనది (శ్రేష్ఠమైనది). దానినే ఇక్కడ పరమైన జీవఘనంగా చెప్పబడింది. కొంతమంది ఈ జీవఘనశబ్దం హిరణ్యగర్భుణ్ణి సూచిస్తుంది అని అభిప్రాయపడ్డారు.

*"పురుషాన్నపరం కించిత్ సా కాష్ఠా సా పరాగతిః"* (పురుషుని కంటె పరమైనది మరొకటి లేదు. ఆ పురుషుడే ఆఖరి హద్దు, పరమాగతి – క.ఠ 1.3.11.). ఇదే విధంగా ప్రశ్నోపనిషత్తులో ముందుచెప్పిన (ప్ర.ఉ 5.5) మంత్రము యొక్క వాక్యశేషంలో *"యథా పాదోదర స్త్వచా వినిర్ముచ్యతే ఏవం హ వై స పాప్మనా వినిర్ముచ్యతే"* (సర్పం ఏ విధంగా పొరను విడుస్తుందో అలాగే ఉపాసకుడు పాపముల చేత విముక్తుడౌతాడు). అందువల్ల ఓంకార ఉపాసకుడు పాపరహితుడై పరమాత్మనే చేరుకుంటాడని అన్వయించుకోవాలి. క్రమముక్తిలో మొదటిది హిరణ్యగర్భ లోకం, తరవాత బ్రహ్మలోక ప్రాప్తి అని చెప్పుకున్నా దోషం లేదు.

## 5. దహరాధికరణమ్

### సూ: 1.3.14 దహర ఉత్తరేభ్యః

నారదుడు సనత్కుమారుని వద్ద పరావిద్యాబోధన అనంతరము హృదయం లోపల ఉన్న సూక్ష్మాకాశం (దహరాకాశము) యొక్క ప్రస్తావన ఛాందోగ్యోపనిషత్తులో జరిగింది. ఈ సందర్భంలో వినబడుతున్న శ్రుతి వాక్యాలను పరిశీలిస్తూ, పూర్వపక్షికి కలిగిన సంశయాలను ఈ అధికరణంలో చర్చించడమైనది.

**పూర్వపక్షి :**

*"అథ యదిదం అస్మిన్ బ్రహ్మపురే దహరం పుండరీకం వేశ్మ దహరోఽస్మిన్ అంతరాకాశః తస్మిన్ యదంతః తదన్వేష్టవ్యం, తద్వావ విజిజ్ఞాసితవ్యమ్"* [ఈ శరీరంలో సూక్ష్మమైన హృదయకమలం (హృత్పద్మంలో) ఉన్న సూక్ష్మాకాశంలో ఏదైతే ఉందో దానినే అన్వేషించి తెలుసుకోవాలి –ఛా.ఉ 8.1.1 ]. ఈ శ్రుతిలో దహరాకాశంగా చెప్పబడింది భూతాకాశమా? పరమాత్మా? 'ఆకాశ' శబ్దం బ్రహ్మవాచకంగా అక్కడక్కడ శ్రుతుల్లో ఇంతకుముందు అధికరణములలో చెప్పబడింది. అలాగే, బ్రహ్మపురం అనగా ఒక వ్యక్తికి సంబంధించినదా? ఎట్టి రూపంలో ఉన్న సూక్ష్మాకాశం? శరీరుని యొక్క హృదయగుహలో ఉన్నదా? లేక బ్రహ్మగా చెప్పబడే పరమాత్మ యొక్క పురమా?

'ఆకాశం' అనే శబ్దం భూతాకాశముగానే సామాన్యవాడుకలో (రూఢి) ఉన్నది. దాని స్థానం చిన్నది కాబట్టి 'దహరాకాశం' అని చెప్పటం సబబుగా తోస్తున్నది. అవకాశం ఉన్నదే ఆకాశధర్మం. అందువల్ల, బాహ్యాకాశానికి హృదయంలో ఉండే దహరాకాశానికి భేదం లేదని ముందు చెప్పబడింది. *"యావాన్వా అయమాకాశః తావానేషో–న్తర్హృదయాకాశః"* (ఛా.ఉ 8.1.3).

గౌణార్థంలో జీవుడు బ్రహ్మముగా చెప్పడం కుదురుతుంది కాబట్టి, బ్రహ్మపుర శబ్దం 'జీవుని యొక్క పురము' (శరీరము) అని కూడా చెప్పబడుతుంది. జీవాత్మ, ఆరాగ్రం (సూదిమొన) అంత చిన్నది అని కూడా వర్ణించి చెప్పారు. కాబట్టి, జీవుణ్ణి దహరాకాశంలో ప్రస్తావిస్తున్నట్లు కూడా చెప్పవచ్చు.

**సిద్ధాంతం :**

ఇక్కడ 'దహరాకాశం' పరమేశ్వరుణ్ణే నిర్దేశిస్తున్నది. భూతాకాశం, జీవుడు అనే అన్వయం కుదరదు. వాక్యశేషంలో ఉన్న హేతువులను సూచిస్తూనే సూత్రం *"దహర ఉత్తరేభ్యః"* అని చెప్పబడింది. శ్రుతిలో ఈ ప్రస్తావన *"తం చేత్ బ్రూయుః"* అని ఆరంభించి *"కిం తత్ర విద్యతే యదన్వేష్టవ్యం యద్వావ విజిజ్ఞాసి తవ్యమ్"* (అక్కడ అన్వేషించదగినది తెలుసుకోదగినది ఏముంది అనేది ప్రశ్న అయితే ఏమని చెప్పాలి?) *"స బ్రూయాత్ యావాన్ వై అయం ఆకాశఃతావాన్ ఏషోఽన్తర్హృదయ ఆకాశ ఉభే అస్మిన్ ద్యావా పృథివీ అన్తరేవ సమాహితే"* (ఈ బాహ్యమైన ఆకాశం ఎంత ఉందో హృదయం లోపల ఆకాశం అంతే ఉంది. ఈ పృథివీ–స్వర్గం రెండూ దీని లోపలే ఇమిడి ఉన్నాయి –ఛా.ఉ 8.1.3) అని ఆచార్యుడు జవాబు చెప్పాలి. ఈ శ్రుతి, దహరాకాశం హృదయకమలం లోపల ఉండటం వల్ల ప్రమాణంలోచిన్నదే, భూతాకాశం కాదు అని కూడా విశదీకరిస్తున్నది. *"ఏష ఆత్మా అపహత పాప్మావిజరో, విమృత్యుః, విశోకో విజిఘత్సోఽపిపాసః, సత్యకామః, సత్యసంకల్పః"* (ఈ ఆత్మ ఎట్టి పాపములు లేనిది, జరామరణములు లేనిది, ఆకలి దప్పులు లేనిది, మంచి కోర్కెలతో సత్సంకల్పము కలది) అని పరమాత్మ ధర్మాలు చెప్పబడ్డాయి.

*"ఏతస్మాత్ జీవఘనాత్ పరాత్పరం పురిశయం పురుషం ఈక్షతే"* (ప్ర.ఉ 5.5), *"స వా అయం పురుషః సర్వాసు పూర్షు పురిశయః"* (బృ.ఉ 2.5.18). ఇలా ముందు ఉదహరించిన శ్రుతుల్లో సకల దేహములందు పరబ్రహ్మ రూపమే ఉన్నదని చెప్పబడింది. శరీరంలో ఉన్న హృదయమే బ్రహ్మ సాక్షాత్కారానికి అనువైన స్థానం కాబట్టి అది బ్రహ్మపరంగా నిర్దేశించబడింది. అంతేకాదు, ఇహపరలోకముల భోగము తప్ప కర్మఫలములు మోక్షసాధనములు కావు అని కూడ ఇంతకు ముందు స్పష్టం చెయ్యబడింది. దహరాకాశంలో ఉన్న ఆత్మను తెలుసుకొన్న జ్ఞానికి మోక్షప్రాప్తి కలుగుతుందని చెప్తున్న శ్రుతి

కూడా ఇదే ప్రకరణంలో ఉంది. *"అథ య ఇహ ఆత్మాన మనువిద్య వ్రజంతి ఏతాంశ్చ సత్యాన్ కామాంస్తేషాం సర్వేషు లోకేషు కామచారో భవతి"* (ఛా.ఉ 8.1.6). దహరాకాశంలో ఉన్న సూక్ష్మమైన దానిని తెలుసు కోవటం వలన పరమాత్మ దర్శనప్రాప్తి కలుగుతుందని చెప్పిన హేతువు వల్ల అది (దహరాకాశం) పరమాత్మ నిర్దేశమనే గ్రహించాలి.

## సూ: 1.3.15 గతిశబ్దాభ్యాం తథా హి దృష్టం లింగం చ

క్రిందటి సూత్రంలో ముందు చెప్పబోయే కారణాల వల్ల దహరశబ్దం పర మేశ్వరుణ్ణే ప్రతిపాదిస్తున్నది అని వ్యక్తం చెయ్యబడింది. ఈ సూత్రంలో ఆ కారణాలు విశదీకరింపబడుతున్నాయి. గతి శబ్దములతో వాక్యశేషంలో 'దహర' పదము బ్రహ్మమునే సూచిస్తున్నదని సూత్రార్థము. *"ఇమాః సర్వాః ప్రజా ఆహరహః గచ్ఛంత్యః ఏతం బ్రహ్మలోకం న విందంతి"* (ఈ ప్రజలందరూ బ్రహ్మలోకానికి నిత్యమూ వెళ్తున్నా ఆ విషయం తెలుసుకోలేరు). ఇలా వాక్యశేషంలో సుషుప్త్యవస్థలో జరిగే అనుభూతి గూర్చి చెప్పడమయింది (ఛా.ఉ 8.3.2). *"సతా సోమ్య తదా సంపన్నో భవతి"* అనే శ్రుతిలో కూడా సుషుప్తిలో జీవుడు సత్ (బ్రహ్మనే) చేరుకుంటాడు అని చెప్పడమైనది.

## సూ: 1.3.16 ధృతేశ్చ మహిమ్నో ఒస్యాస్మిన్నుపలబ్ధేః

స్వమహిమతో అన్ని లోకములను ఆకాశాదులను సూర్యచంద్రులను ప్రతిష్ఠించి ఉన్నట్లు – ధృతేశ్చ (ధరించినట్లు) చెప్పటం వల్ల కూడా పరమాత్మ నిర్దేశమని గ్రహించాలి. పూర్వం ఈ విషయాన్ని ప్రస్తావిస్తూ చెప్పిన శ్రుతులు ఇలా ఉన్నాయి: *"అథ య ఆత్మా స సేతుః విధృతిరేషాం లోకానాం అసంభేదాయ"* (ఛా.ఉ 8.1.1). *"ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి! సూర్యాచంద్రమసౌ విధృతౌ తిష్ఠతః"* , *"ఏష సర్వేశ్వర ఏష భూతపతిః ఏష భూతపాల ఏష సేతుర్విధారణ ఏషాం లోకానాం అసంభేదాయ"* (బృ.ఉ 4.4.22).

## సూ: 1.3.17 ప్రసిద్ధేశ్చ

ఆకాశమే బ్రహ్మ అని లోకంలో ప్రసిద్ధి. శ్రుతుల్లో పలుచోట్ల ఆకాశం బ్రహ్మ సూచకమని ప్రస్తావించబడింది. ఆకాశం ఈ భూతములన్నింటి జన్మకు కారణము. *"సర్వాణి హ వా ఇమాని భూతాని ఆకాశాదేవ సముత్పద్యంతే"* (ఛా.ఉ 1.9.1). *"ఆకాశో వై నామ నామరూప యోర్నిర్వహితా"* (ఛా. 8.14.1) అని శ్రుతిలోవిన్పిస్తున్నది.

## సూ: 1.3.18 ఇతర పరామర్శాత్స ఇతి చేన్నాసంభవాత్

దహర పుండరీకములో బ్రహ్మోపాసన గురించి చెప్పిన శ్రుతిలోనే ఇలా ఉంది: *"అథయ ఏష సంప్రసాదోఽస్మాత్ శరీరాత్ సముత్థాయ పరంజ్యోతి రుపసంపద్య స్వేనరూపేణ అభినిష్పద్యత ఏష ఆత్మేతి హోవాచ"* (ఏ జీవుడు ఈ శరీరం నుంచి లేచి వెళ్లి పరమేశ్వర రూపమైన జ్యోతిని దర్శించుకొని బ్రహ్మలో ఐక్యమౌతాడో అదే ఆత్మ అని ఆచార్యుడు చెప్పెను – ఛా.ఉ 8.3.4). సుషుప్త్యవస్థలో బ్రహ్మగమనాన్ని గురించి చెప్పిన ఈ సందర్భంలో కూడా వాక్యశేషంలో జీవుడి ప్రస్తావన ఉంది. అందువల్ల *"దహరోఽస్మిన్ అంతరాకాశః"* అనే వాక్యంలో కూడా శారీరుడి యొక్క దహరాకాశము అని ఎందుకు కుదరదని పూర్వపక్షి ప్రశ్న. దానికి సమాధానంగా శారీరుడు ఉపాధి వల్ల పరిచ్ఛిన్నుడు. అందువల్ల పరిమిత నామ రూపాలున్న వ్యక్తిలో, సర్వవ్యాప్తమైన ఆకాశ ధర్మాలతో పోల్చటం, పరమాత్మ మిగతా ధర్మాలను సమన్వయించు కోవటం కుదరదు. ఈ ప్రశ్నకు విస్తరంగా క్రింది రెండు సూత్రాలలోను చర్చించడమైనది.

## సూ: 1.3.19 ఉత్తరాచ్చేదావిర్భూత స్వరూపస్తు

దేవతలకు రాజైన ఇంద్రుడు, రాక్షసులకు రాజైన విరోచనుడు తండ్రి ప్రజాపతి వద్దకు వచ్చి ఆత్మ గురించి బోధించమని వేడుకున్నట్లు ఛాందోగ్యో పనిషత్తులో ఒక అఖ్యాయిక ఉంది. విరోచనుడు శరీరమే ఆత్మ అని విశ్వసించి

వెనుదిరిగి అదే రాక్షసులకు బోధిస్తాడు. ఇంద్రుడు మళ్ళీ మళ్ళీ శుశ్రూష చేసి ఆత్మ తత్త్వాన్ని తెలుసుకుంటాడు. ఈ సూత్రంలో ప్రజాపతి చేసిన ఆత్మోపదేశ ఉపక్రమాన్ని ఆధారం చేసుకొని చెప్పబడింది.

ప్రజాపతి ఇంద్రుడికి ఆత్మ విశిష్టధర్మాలైన 'అపహతపాప్మా' (పాపములు లేని నిర్మలత్వము) ఇత్యాది చెప్పి, జాగ్రదవస్థలో పురుషుణ్ణి చూపుతూ ఇలా అంటాడు: *"య ఏషోఽక్షిణి పురుషో దృశ్యతే ఏష ఆత్మా"* (ఈ కంట్లో చూస్తున్న ప్రతిబింబమే ఆత్మ). ఈ విషయమే నీకు మళ్ళీ చెప్తాను అని ప్రతిజ్ఞ చేసి, జీవుడు స్వప్నావస్థలో చూచే దృశ్యాలను ప్రసంగిస్తాడు. స్వప్నంలో చూచినదంతా అసత్యానుభవమే – మిథ్యారూపము, ఇంద్రియానుభూతితో కలిగిన వాసనాపరంపర. అందువల్ల దేహ సంబంధమైనదే. ఇక సుషుప్తిలో నున్న జీవుడు సుఖమయుడు, ప్రసన్నుడు అనడానికి కారణం ఇంద్రియాదుల వ్యాపారం నుండి బయట పడడమే. దీర్ఘనిద్రలో ఉన్నంతసేపు పరమసుఖాన్ని అనుభవించి, భయంలేనివాడు, అమృతమయుడు అవుతాడని చెప్తాడు. ఈ బోధనలో గ్రహించవలసినది: శరీర సంబంధం వేరు చేసుకొని విహరిస్తూ వచ్చేదే ఆత్మ, తక్కిన ఇంద్రియాదులు, ప్రాణము, శరీరాన్ని విడచి వెళ్లటం శాశ్వత నిద్ర – మృత్యువులోనే, జరుగుతుంది.

సూత్రంలో 'తు' ప్రయోగంతో (*ఆవిర్భూత స్వరూపః తు*) పూర్వపక్షి వాదన ఖండించడమైంది. శరీరము ఆత్మ కాదు అని స్పష్టంగా బోధించటం కోసమే, *"పరం జ్యోతి రూప సంపద్య స్వేన రూపేణ అభినిష్పద్యతే"* అని ప్రజాపతి చెప్పినట్లుశ్రుతి. సుషుప్తిలో బ్రహ్మగమనాన్ని సూచించడం జీవుణ్ణి పారమార్థిక రూపంలో వ్యక్తం చెయ్యడానికని గ్రహించాలి. ఉపాధి కల్పితమైన శరీరరూపం అనిత్యమైనది. జ్ఞానంతో స్వస్వరూపమును తెలుసుకున్న పురుషుడు దేహేంద్రియమనోబుద్ధులకు అతీతుడు అవుతాడు. అప్పుడే సంసారం నుండి బంధ విముక్తుడూ అవుతాడు. *"స యో హ వై తత్పరమం బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి"* (బ్రహ్మను తెలుసుకున్నవాడు బ్రహ్మయే అవుతాడు – ము.ఉ 3.2.9).

చూడడం, వినడం, తెలుసుకోవటం ఇవన్నీ జీవుడి సహజ లక్షణాలు. శరీరం ఉన్నంత వరకూ లక్షణాలు వ్యక్తమౌతూ ఉంటాయి. సూర్యప్రకాశం ఉన్నంత వరకూ నక్షత్రాలు కనబడవు. కాని అవి స్వస్థానంలోనే ఉంటాయి. అలాగే అజ్ఞానం వల్ల జీవుడి తేజోరూపం, శరీర ఇంద్రియాలు, మనోబుద్ధి అహంకారాదుల వల్ల మూసుకుపోతుంది. జ్ఞానం కలిగినప్పుడు ఈ అడ్డం తొలగిపోతుంది, స్వస్వరూపం (తేజోరూపం) ప్రకటితమవుతుంది. జ్ఞాన ప్రాప్తితో వచ్చేది శరీర సముత్థానం. అప్పుడు శరీరంతో ఉన్నా కర్తృత్వ–భోక్తృత్వాదులుండవు. *"శరీరస్థోపి కౌంతేయ! న కరోతి న లిప్యతే"* (భ.గీ 13.31), *"అశరీరం శరీరేషు"* (కౌ.ఉ 1.2.22). శరీరాలలో ఉన్నా శరీరం లేని వాడు – పరమాత్మ. అందుకే శరీరం ఉన్నా లేకపోయినా వివేకం–జ్ఞానం ఉన్నవాడు పరమేశ్వరుడు–అశరీరుడు. వివేకం లేని వాడు సశరీరుడు.

జీవ–పరమేశ్వరుల భిన్నత్వం మిథ్యా జ్ఞానం వల్ల కలిగినదే కాని యదార్థం, స్వతః సిద్ధము కాదు. జీవాత్మకు–పరమాత్మకు కూడా పుణ్యపాపాల ప్రభావం ఉండదు. ఆత్మ నిర్లిప్తము, భోగము లేనిది. జాగ్రత్–స్వప్నావస్థలలో జీవుడు తను అనుభవిస్తున్నది, ఉపభోగమైనది తెలుసుకుంటున్నాడు. అప్పుడు నేనే – ఇప్పుడు నేనే అని వ్యక్తం చెయ్యగలుగుతున్నాడు. అలాగే సుషుప్తిలో ఏదీ జ్ఞాపకం ఉండక పోయినా, నిద్రావస్థ నుండి తేరుకొని వచ్చిన తరవాత మళ్ళీ యథాప్రకారం తన కార్యకలాపాలు చేసు కుంటాడు. విజ్ఞాత (జీవాత్మ) నశించలేదు. విశేష జ్ఞానమే గాఢనిద్రలో పోయింది. *"వినాశమేవాపీతో భవతి"* (ఛా.ఉ 8.11.2), *"న హి విజ్ఞాతుః విజ్ఞాతేః విపరిలోపో విద్యతేఽవినాశిత్వాత్"* (బృ.ఉ 3.3.30). ఈ శ్రుతి వాక్యాలు జీవో–బ్రహ్మైవ అని స్పష్టం చేస్తున్నాయి. పరబ్రహ్మ కంటె జీవుడు భిన్నుడు కాదని చెప్పడమే అద్వైత సిద్ధాంత తాత్పర్యమని గ్రహించాలి.

## సూ: 1.3.20 అన్యార్థశ్చ పరామర్శః

జీవపరామర్శ వ్యర్థం కదా! ఉపదేశంలో దీనిని ఎందుకు చెప్పవలసి వచ్చింది అనే పూర్వపక్షి, ప్రజాపతి ఉపదేశ ఉపక్రమాన్ని (శారీరుడు యొక్క జాగ్రత్–స్వప్నావస్థల ప్రస్తావన) ఆక్షేపించేడు. దానికి సమాధానం ఈ సూత్రంలో వివరించడమయింది. జీవుడు జాగ్రదవస్థలో దేహేంద్రియాలను తన అధీనంలో ఉంచుకోగలడు. స్వప్నావస్థలోనూ

జాగ్రదవస్థలో కలిగిన అనుభూతి వలన తను నిర్మించుకున్న మార్గాలలోను, ఊహాప్రపంచం లోను తిరుగుతాడు. సుషుప్తిలో మాత్రం బాగా అలసిపోయి సూక్ష్మశరీరం లోంచి కూడా బయటపడి శరణాగతుడై పరమాత్మను చేరినట్లు వెళ్లిపోయి మళ్లీ యథాస్థానం (తన ఉపాధి అయిన శరీరాన్ని) చేరుకుంటాడు. ఇట్టి అపహత పాప్మాది గుణములు గల పరమాత్మ యొక్క ఉపాసన కోసమే ఈ విధంగా తెలిసిన దానిని ముందుగా చెప్పి, తెలియని–అవ్యక్తము గురించి ఆ తరవాత బోధింపబడింది. జీవపరామర్శ, దహరాకాశంలో నిర్దేశింపబడింది పరమాత్మ అని చెప్పడం కోసమే అని గ్రహించాలి.

## సూ: 1.3.21 అల్పశ్రుతేరితి చేత్తదుక్తమ్

పరమాత్మ విస్తృతమైనది, దానిని అల్పమని దహరాకాశం లోపల సూక్ష్మంగా ఇమిడి ఉంటుంది అని చెప్పటమెలా సంభవం?అనే ప్రశ్నకు ఈ సూత్రం సమాధానం. జీవాత్మ పరమసూక్ష్మమైనది ఆరాగ్రం వంటిది. ఈ సందేహ నివృత్తి కోసం ముందు 1.2.7 సూత్రంలో వివరంగా చెప్పబడింది. *"యావాన్వా అయమాకాశః తావాన్ ఏషోఽన్తర్హృదయ ఆకాశః"* ఈ శ్రుతి వాక్యం కూడా ఆకాశధర్మాలు సమంగానే వర్తిస్తాయని చెబుతున్నది. అందువల్ల సందేహము నిరాధారము.

# 6. అనుకృత్యధికరణమ్

## సూ: 1.3.22 అనుకృతేస్తస్య చ

**పూర్వపక్షి :**

కఠోపనిషత్తులోను, ముండకోపనిషత్తులోను కూడా శ్రుతి ఇలా ఉంది: *"న తత్ర సూర్యోభాతి న చంద్రతారకం, న ఇమా విద్యుతో భాంతి కుతోఽయ మగ్నిః, తమేవభాంత మనుభాతి సర్వం, తస్య భాసా సర్వమిదం విభాతి"* (అక్కడ సూర్యుడు ప్రకాశించడు, చంద్రుడు, నక్షత్రాలు కూడా ప్రకాశించవు, ఈ మెరుపులూ ప్రకాశించవు. ఇక అగ్ని మాట చెప్పాలా! అక్కడ ప్రకాశిస్తున్న దానిని అనుసరించే సర్వమూ ప్రకాశిస్తున్నది. దాని కాంతి వలనే ఇదంతా ప్రకాశిస్తున్నది – క.ఠ 2.2.5, ము.ఉ 2.2.11.).

దేనిని అనుసరించి, దేని కాంతి చేత ఇదంతా ప్రకాశిస్తున్నది. అక్కడ ఉన్నది ఏదైనా తేజోధాతువా? లేక బ్రహ్మను– పరమాత్మను ఉద్దేశించి ఈ విధంగా చెప్పబడుతున్నాదా? పగలు సూర్యుడున్నంతసేపూ చంద్రతారకములు ప్రకాశించే గుణములున్నా కనబడవు. కారణం, సూర్యుడి కాంతిలో ఇవి కనబడవని సాధారణంగా లోకంలో ప్రసిద్ధి. కాకపోతే, 'అనుభాతి' అనే శబ్దం ఉండబట్టి మరేదైనా తేజోగుణమున్న తేజోధాతువు ఉండాలని తోస్తున్నది.

**సిద్ధాంతం :**

*"తమేవ భాంతమనుభాతి సర్వమ్"* దానిననుసరించే సర్వమూ భాసిస్తున్నది – ప్రకాశిస్తున్నది అని శ్రుతిలో వినపడటం వల్ల పరమాత్మ – ప్రజ్ఞాత్మనే గ్రహించాలి. ప్రాజ్ఞుడైన పరమాత్మనే *"భారూపః–సత్యసంకల్పః"* (ఛా.ఉ 3.14.2) అని ముందు చెప్పడమైంది. సూర్య–చంద్రాదులు ఏదో ఒక తేజోధాతువు ననుసరించి ప్రకాశిస్తున్నా యని చెప్పడం యుక్తం కాదు. ఒక దీపం మరో దీపాన్ని అనుసరించి ప్రకాశించదు. అనుకరణ, వేరు వేరు స్వభావములన్న భిన్నవస్తువులలోనే ప్రపంచంలో కనబడు తున్నది. కాలుతున్న ఇనుపగుండు అగ్నితో పాటే కొలిమిలో మండుతూ కనబడు తుంది. అలాగే నేల మీద రేణువులు, ఆకాశాన్ని అనుసరించి ఎగురుతాయి. *"తస్యభాసా సర్వమిదం విభాతి"* అనే వాక్యం సూర్య చంద్రాదులు, ఈ జగత్తులో సర్వమూ స్వయంప్రకాశమైన పరమాత్మవలనే భాసిస్తున్నాయి అని స్పష్టం చెయ్యడానికే అలా చెప్పబడింది. *"యస్మిన్ ద్యౌః పృథివీ చాంతరిక్షమ్"* (ము.ఉ 2.2.5) అని పరబ్రహ్మ ఐశ్వర్యం వలనే పృథివీ ద్యౌ అంతరిక్షం, సర్వప్రాణులు ప్రతిష్ఠితమయ్యాయి అని ముందు చెప్పడమయింది. *"తద్దేవాః జ్యోతిషాం జ్యోతిరాయుః హ ఉపాసతేఽమృతమ్"* (దేవతలు జ్యోతిస్సులకు జ్యోతిస్సు, ఆయుః స్వరూపము, అమృతమూ అయిన పరబ్రహ్మమును ఉపాసిస్తున్నారు –బృ.ఉ 4.4.16).

*"హిరణ్మయే పరే కోశే విరజం బ్రహ్మనిష్కలమ్ తత్ శుభ్రం జ్యోతిషాం జ్యోతిః తద్యత్ ఆత్మవిదో విదుః"* (రాగద్వేషములు లేనిది, నిర్మలము, అవయవ రహితము అయిన బ్రహ్మమే జ్యోతిర్మయమైన ఆనందకోశములో ఉన్నది. అదే పరిశుద్ధ మైనది, జ్యోతిస్సులకు జ్యోతిస్సు అని ఆత్మవేత్తలు తెలుసుకుంటున్నారు – ము.ఉ 2.2.9). పరావిద్యా సందర్భంలో బ్రహ్మోపదేశం కోసం ఈ శ్రుతి వినబడుతున్నది. కాబట్టి, జ్యోతిస్సులకు జ్యోతిస్సు అయిన పరంజ్యోతి బ్రహ్మనిర్దేశమనే గ్రహించాలి.

సూర్యచంద్రాదులను ప్రకాశింప చేయటానికి ఏ తేజోధాతువు హేతువు కాదు. బ్రహ్మము స్వయం జ్యోతిఃస్వభావము, ప్రజ్ఞానఘనము. కారణం వల్లనే కార్య ప్రపంచం అంతా తెలియబడుతుంది. *"ఆత్మా ఏవ అస్య జ్యోతిర్భవతి ఇతి. ఆత్మనా ఏవ అయం జ్యోతిషా ఆస్తే"* (మరే జ్యోతిస్సులు లేనప్పుడు పురుషుడు ఆత్మ అనే జ్యోతిస్సుతో చైతన్యవంతుడిగా ఉంటాడు – బృ.ఉ 6.3.6).

## సూ: 1.3.23 అపి చ స్మర్యతే

స్మృతిలో కూడా ఇదేవిధంగా చెప్పబడింది. *"న తత్ భాసయతే సూర్యః న శశాంకో న పావకః యత్ గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ"* [దానిని సూర్య చంద్రాదులు అగ్ని ప్రకాశింప చెయ్యలేవు. ఏ స్థానాన్ని పొంది తిరిగి శారీరులు తిరిగి ఈ లోకమునకు రారో అదియే నా పరంథామము (నా పరమైన స్థానము) – భ.గీ 15.6 ]. అలాగే, *"యదాదిత్య గతం తేజః జగత్ భాసయతేఽఖిలమ్. యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్"* (ఓ అర్జునా! సూర్యునిలోని కాంతి, చంద్రునిలోని కాంతి, అగ్నిలోనున్న కాంతి, ఈ సమస్త జగత్తును ప్రకాశింప చేస్తున్నది నా యొక్క తేజోరూపమే, అని తెలుసుకో – భ.గీ 15.12).

## 7. ప్రమితాధికరణమ్

### సూ: 1.3.24 శబ్దాదేవ ప్రమితః

**పూర్వపక్షి :**

*"అంగుష్ఠ మాత్రః పురుషో మధ్య ఆత్మని తిష్ఠతి"* (శరీర మధ్యంలో బొటన వ్రేలంత పురుషుడున్నాడు – క.ఠ 2.1.12), అని ఇంకా *"అంగుష్ఠమాత్రః పురుషో జ్యోతిరివ అధూమకః, ఈశానో భూత భవ్యస్య స ఏవాద్య స ఉ శ్వ, ఏతద్వైతత్"* (అంగుష్ఠమాత్ర పురుషుడు పొగ లేని జ్యోతిస్సు వంటివాడు. భూత భవిష్యత్ వర్తమానాలలో ఉన్నవాడు ఈ ఈశ్వరుడే. ఈ రోజూ రేపూ కూడా ఉండేది అతడే – ఇదే బ్రహ్మము – క.ఠ 2.1.13).

ఈ అంగుష్ఠమాత్ర పురుషుడు ఎవరు? విజ్ఞానాత్మ అయిన జీవుడా? పరమాత్మా? అనే సందేహం కలుగుతున్నది. విజ్ఞానాత్మ అయిన శారీరుడే, ఏదో కల్పనతో బొటనవ్రేలంత ఉంటాడని చెప్పవచ్చు. స్మృతిలో అంగుష్ఠమాత్రుడైన సత్యవంతుణ్ణి, తనపాశంతో బలంగా యముడు లాగినట్లు వర్ణన కూడ ఉంది: *"అథ సత్యవతః కాయాత్పాశ బద్ధం వశం గతమ్. అంగుష్ఠమాత్రం పురుషం నిశ్చకర్ష యమో బలాత్"* (మహాభారతం 3.29.17). యముడు, పరమేశ్వరుణ్ణి పాశంతో బలంగా లాగటం అసమంజసం కదా! అందుచేత 'అంగుష్ఠమాత్ర' నిర్దేశం శారీరుడికి తప్ప పరమాత్మకు కుదరదు.

**సిద్ధాంతం :**

అంగుష్ఠమాత్ర పురుషుడని పరమాత్మనుద్దేశించి చెప్పడమైంది. నచికేతుడు, యముణ్ణి అడిగిన ప్రశ్న ఇలా ఉంది: *"అన్యత్ర ధర్మాత్ అన్యత్ర అధర్మాత్ అన్యత్ర అస్మాత్ కృతాకృతాత్, అన్యత్ర భూతాచ్చ భవ్యాచ్చ యత్తత్ పశ్యసి తద్వద"* (ధర్మాధర్మాలకు అతీతమైనది, ఈ జగత్తులో కనబడుతున్న కార్యానికి, దానికి కారణమైన దానికి అతీతమైనది, భూత భవిష్యత్ కాలములకూ అతీతమైన దేనిని నువ్వు చూస్తున్నావో దానిని గురించే చెప్పుము - క.ఉ. 1.2.14). దానికి సమాధానంగా మృత్యుదేవత నచికేతుడికి ఆత్మోపదేశం చేస్తూ *"ఈశానో భూత భవ్యస్య"* (భూత భవిష్యత్తులకు ప్రభువు – ఈశః) అని చెప్పి *'ఏతద్వైతత్'* (ఏ బ్రహ్మ పరమాత్మ గురించి నువ్వు ప్రశ్నించేవో అదే ఇది అని స్పష్టం చేస్తాడు. ఈ శ్రుతిలో ఈశానః అన్న శబ్దం ఉండటం వల్ల ఇది పరమేశ్వరుణ్ణి ఉద్దేశించి చెప్పినదే అని గ్రహించాలి.

### సూ: 1.3.25 హృద్యపేక్షయాతు మనుష్యాధికారత్వాత్

పరమాత్మ సర్వత్ర వ్యాపించి ఉన్నా, శారీరుడి యొక్క హృదయంలో జీవాత్మగా ప్రతిష్ఠితమైనది కాబట్టి, అంగుష్ఠ మాత్రం అని ఉదహరించి చెప్పడం తప్పుకాదు. మనుష్యులందరికి వారి వారి శరీరపరిమాణం చిన్నదైనా పెద్దదయినా వారి యొక్క అంగుష్ఠమంత మాత్రమే జీవాత్మ ఉంటుందని, శాస్త్ర విశేషం లేకుండా సర్వసాధారణ విషయంగా చెప్పబడింది. శాస్త్రం మనుష్యులకే వర్తిస్తుంది. కాబట్టి మనుష్యుల హృదయస్థానంలో ఉండే పరమాత్మ అంగుష్ఠమాత్రుడు అని చెప్పబడింది. మహాభారతంలో 'అంగుష్ఠమాత్రః పురుషః' అని సంసారి ప్రస్తావనే ఉంది కదా అని అడిగిన ప్రశ్నకు సమాధానం ఇలా చెప్పబడింది. శ్వేతకేతువు, నచికేతుడు ఇద్దరూ సంసారుల పుత్రులే విశేషం ఏమీలేదు. ఇద్దరూ శ్రోత్రియులు, పరమాత్మ గురించి తెలుసుకునే ఇచ్ఛ కలిగినవారు. శ్వేతకేతువుకి, తత్త్వమసి అని బ్రహ్మతత్త్వం ఏ విధంగా నువ్వే ఆ పరమాత్మ స్వరూపానివి అని జీవాత్మ–పరమాత్మ అభేదం బోధింపబడిందో, అదేవిధంగా నచికేతుడికి, అంతరాత్మ – పరమాత్మ ఏకత్వాన్ని 'అంగుష్ఠమాత్రం' అని స్పష్టత కోసం చెప్పబడింది.

*"అంగుష్ఠమాత్రః పురుషో–న్తరాత్మా సదాజనానాం హృదయే సంనివిష్టః, తం స్వాచ్ఛరీరాత్ ప్రవృహేత్ ముంజాదివ ఇషీకాం ధైర్యేణ తం విద్యాత్ శుక్రం అమృతమ్ ఇతి"* [అంగుష్ఠమాత్రుడైన పురుషుడు సదా జనుల హృదయకుహరంలో అంతరాత్మగా ప్రవేశించి ఉంటాడు. ముంజగడ్డిదుబ్బు నుండి మొవ్వును (ఇషీకను) వేరుచేసినట్లు ధీరత్వంతో (జ్ఞానముతో)

శరీరముతో వేరుపరచాలి. అతనినే శుద్ధమైన బ్రహ్మమని తెలుసుకోవాలి – కఠ 2.6.17 ]. ఉపయోగం లేని కలుపుమొక్కల నుండి, సారవంతము ప్రయోగకరము అయిన నారుని వేరుచేసిన విధంగా శుద్ధము, నిత్యము అయిన ఆత్మను అనిత్యము, మలినసహితము అయిన శరీరం నుండి వేరు చేసి, దానినే బ్రహ్మము (పరమాత్మ) అని తెలుసుకోవాలన్నదే ఈ ఉపదేశ సారాంశము.

# 8. దేవతాధికరణమ్

## సూ: 1.3.26 తదుపర్యపి బాదరాయణః సంభవాత్

మనుష్యులకు పైన ఊర్ధ్వలోకంలో ఉన్న దేవతలకు కూడా బ్రహ్మ విద్యార్హత ఉందని బాదరాయణుడు యొక్క అభిప్రాయమని సూత్రార్థం. మనుష్యులు కర్మను ఆచరించి స్వర్గప్రాప్తిని, బ్రహ్మజ్ఞానంతో మోక్షం పొందగలరని శాస్త్రం బోధిస్తున్నది. అయితే, స్వర్గవాసులైన దేవతలు కూడా పరావిద్యతో బ్రహ్మగమనానికి, జన్మ రాహిత్యా నికి అర్హులా కాదా అనే సందేహం కలగడం సహజం. ఇంద్రుడు స్వర్గానికి అధిపతి. అతడే ప్రజాపతి వద్ద నూరుసంవత్సరాలు బ్రహ్మచర్యంతో బ్రహ్మవిద్య కోసం శుశ్రూష చేసినట్లు *"ఏక శతం హవై వర్షాణి మఘవన్ ప్రజాపతౌ బ్రహ్మచర్యమువాస"* అని ఛాందోగ్యంలో శ్రుతి వినబడుతున్నది (ఛా.ఉ 8.11.3). అదేవిధంగా వరుణదేవుని కుమారుడు భృగువు బ్రహ్మ గురించి తెలుసుకోవాలనే కోర్కెతో తండ్రిని ప్రార్థించాడు. *"భృగుర్వై వారుణిః వరుణం పితరముపససార అధీహి భగవో బ్రహ్మేతి"* అని తైత్తిరీయంలో ఉంది (తై.ఉ 3.1). పూర్వమీమాంసా శాస్త్రంలో జైమిన్యాచార్యులు, దేవతలకు కర్మలతో మరోదేవతలను సంతృప్తిపరచే ఆవశ్యకత లేనందు వల్ల వారికి యజ్ఞయాగాది కర్మలు చేసే అధికారం ఉండదు అని అభిప్రాయ పడ్డాడు. కాని, బాదరాయణుడు భిన్నాభిప్రాయం వ్యక్తం చేస్తూ ఈ సూత్రంలో దేవతలు కూడా బ్రహ్మతత్త్వాన్ని తెలుసుకొని, మోక్షం పొందటానికి అర్హులుగా అంగీకరించాడు.

## సూ: 1.3.27 విరోధః కర్మణీతి చేన్నానేకప్రతిపత్తేర్దర్శనాత్

దేవతలు శరీరరూపధారణతో ఉంటారని చెప్తారు. మరి శరీరంతో ఉన్నవాళ్లు ఒక యజ్ఞంలో ఆవాహన చెయ్యబడి ఆ ప్రదేశానికి వస్తే మరో ప్రదేశంలో మరో యజ్ఞమవుతున్నప్పుడు అక్కడ కూడా ఉండటం ఎలా సాధ్యమవుతుందని ప్రశ్న. ఒక దేవత ఒకే సమయంలో ఎన్నోచోట్ల ప్రత్యక్షమయే అవకాశం కనబడుతున్నది. బహురూపులుగా దేవతలు ఆహుతులు పలుచోట్ల స్వీకరించగలిగే ఐశ్వర్యం గలవారని వేదవాక్యాలు సూచిస్తున్నవి. బృహదారణ్యకోపనిషత్తులో యాజ్ఞవల్క్యుడు, శాకల్యుడు అడిగిన 'కతిదేవాశ్చ' (దేవతలు ఎంతమంది?) ప్రశ్నకు *"త్రయశ్చ త్రీచ శతాత్రయశ్చ త్రీచ సహస్రాః"* (3, 006) అని సమాధానం చెప్పి, 33 మందే యదార్థంగా ఉన్నది, వారే స్వమహిమతో భిన్నభిన్న రూపాలలో ఉంటారు. *"కతమేతే"* (వాళ్లంతా ఎవరు?). *"మహిమాన ఏవ ఏషాం ఏతే త్రయంస్త్రింశత్త్వేవ దేవాః"* (బృ.ఉ 3.9.2). ఈ శ్రుతి వల్ల దేవతలు వారి ఇచ్ఛానుసారం అనేక రూపాలు ధరించి దర్శనమిస్తుంటారని తెలుపుతున్నది. అదీకాక, యోగ శక్తిని సాధించిన సిద్ధులు కూడా ఒకే సమయంలో ఎన్నో రూపాలతో, ఎన్నో ప్రదేశాలలో వ్యక్తమవుతుంటారని స్మృతులలో కూడా చెప్పబడింది. ఒకే సమయంలో ఒకే వ్యక్తికి చాలామంది నమస్కరించటం చూస్తున్నాం. అలాగే దేవతారూపం ఒకటే అయినా ఆరాధించేవారు, యాగం చేసేవారు, ఆహుతులు, ద్రవ్యార్పణ పలుప్రదేశాల్లో చేసుకోవటం సంభవం. సాక్షాత్కారం, అంతర్ధానం అయ్యే ఐశ్వర్యం ఉన్న దేవతలకు బహురూపగ్రహణం సాధ్యమని అంగీకరించవలసి వస్తుంది.

## సూ: 1.3.28 శబ్ద ఇతి చేన్నాతః ప్రభావాత్ప్రత్యక్షానుమానాభ్యామ్

**పూర్వపక్షి – ఆశంక :**

వేదం అనాది అపౌరుషేయం. అందువల్ల దాని ప్రామాణ్యానికి ఆధారం చూపించి ఋజువు చేసే ఆవశ్యకత లేదు. శబ్దం (వేదవాక్) అనాది అని అంగీకరించాలి. దేవతల గురించి వేదమే చెబుతున్నది కాబట్టి, ఆ దేవతలకు నామ రూపాలు, శరీరం ఉంటే జనన–మరణాలు కూడా సంభవించాలి కదా? దేవతలకూ పుట్టుక, మరణం ఉంటే ఒక దేవత నిత్యం ఒకే రూపంతో, ఒకే పేరుతో ఎలా ఉండటం సంభవం అన్న సందేహం వ్యక్తమయింది. ఈ సందేహ నివృత్తికే ( *'అతః ప్రభవాత్'* ) వేదం వల్లనే జగత్తు పుట్టిందని సూత్రంలో చెప్పడమైనది.

*"జన్మాద్యస్య యతః"* అనే ముందు సూత్రంలో (బ్ర.సూ 1.1.2) జగత్కారణం బ్రహ్మమని నిర్ణయించి, ఇక్కడ

వేదశబ్దం జగత్ ఉద్భవానికి (నిర్మాణానికి) కారణం అని ఎలా చెప్పబడుతుంది?

**సమాధానం :**

రుద్రులు, ఆదిత్యులు, వసువులు, విశ్వేదేవతలు, మరుత్తాది దేవతలు ఒక జాతికి చెందినవి; వ్యక్తికి సంబంధించినవి కావు. గోవు ఆకృతికి సంబంధించినది, గో గుణాలు ఉన్నది గోజాతి. వేరు వేరు గోవులు వాటి వాటి రూపాల్లో ఉన్నా గోత్వం, గో గుణసంపద సమానమే. అలాగే మనుష్యులు, వేరు వేరు రంగులూ, ఆకారాలలో ఉన్నా మనుష్యజాతి ఒక్కటే. అలాగే మిగతా ప్రాణులు వాటి గుణ విశేషాలు. దేవతలందరిని సామూహికంగా ఒక విశేష గుణసంపద ఉన్న జాతి అనే భావంతో గ్రహిస్తే, వారి వ్యక్తిత్వాన్ని అర్థం చేసుకోవటం కుదురుతుంది. అంతేకాదు. ఇంద్రుడు, అగ్ని ఇట్లాంటివన్నీ ఒక పదవీ స్థానాన్ని సూచిస్తాయి. ఇంద్రపదవిని అలంకరించిన వ్యక్తులు మారుతుంటారు. ఇంద్రుడు అనే దేవతాస్థానం ఒక్కటే.

మరో విషయం, శబ్దాధారమైంది సృష్టి అని శ్రుతి వల్ల తెలుస్తున్నది. బ్రహ్మ సంకల్పించి మనస్సులో అనుకొని సృష్టి నిర్మాణం ఆ ప్రకారం చేసినట్లు గ్రహించాలి. *"స మనసా వాచం మిధునం సమభవత్"* (అతడు మనస్సుతో వాక్కుని ఐక్యం చేసేడు – బృ.ఉ 1.2.4). ఆ మిథునమే వేదవాక్ స్మరణ, అదే సృష్టికి నాంది అని భావించాలి. వేరే వేదవాక్యం ఇలా వినబడుతున్నది : *"ఏతే ఇతి వై ప్రజాపతిః దేవాన్ అసృజత, అస్కృగ్రమ్ ఇతి మనుష్యాన్ ఇందవ ఇతి పితౄంస్తిరః పవిత్రమితి గ్రహాన్, ఆశవః ఇతి స్తోత్రం విశ్వాని ఇతి శస్త్రం అభిసౌభగ ఇతి అన్యాః ప్రజాః"* (ప్రజాపతి మనస్సులో ఇలాగ వీళ్లను అనుకొని దేవతలను, రక్తప్రధానమైన దేహంతో ఆనందించే వాళ్లు అని మనుష్యుల్ని, చంద్రలోకంలో ఉండేవాళ్లు అని పితృదేవతల్ని, అలాగే తలుచుకుంటూ మిగతా యజ్ఞసాధనాలను, వస్తువులను సృజించాడు.)

స్మృతి వాక్యాలు కూడా వేదస్వరూపమైన వాక్ (శబ్దం) అనాది అని పేర్కొంటూ దాని వల్లే జగత్తంతా ఆవిర్భవించింది అని సూచిస్తున్నవి. ఉదాహరణకి కొన్ని ఇక్కడ ప్రస్తావించబడ్డాయి. *"అనాది నిధనా నిత్యా వాగుత్సృష్టా స్వయం భువా, ఆదౌ వేదమయీ దివ్యా యతః సర్వాః ప్రవృత్తయః"* (అనాది, నాశరహితము, నిత్యము, దివ్యము అయిన వేదవాక్కు ముందుగా బ్రహ్మ చేత పలుకబడింది. దాని వల్లే విశ్వమంతా నడుస్తున్నది – మ.భా.శాం. 233.24). *"సర్వేషాం స తు నామాని కర్మాణి చ పృథక్ ప్రథక్ వేదశబ్దేభ్య ఏవాదౌ పృథక్ సంస్థాశ్చ నిర్మమే"* (పరమేశ్వరుడే వేద వాక్కులతో వేరు వేరు పేర్లను, వేరు వేరు కర్మలను, వేరు వేరు ఆచార వ్యవహారాలను నిర్మించాడు – మను 1.21). సృష్టికర్త తన సంకల్పానికి అనుగుణంగా వాక్కును మనస్సులో అనుకొని దాని ప్రకారమే సృష్టి చేశాడు అని గ్రహించాలి. *"స భూరితి వ్యాహరత్ స భూమిం అసృజత"* [అతడు (పరమేశ్వరుడు) భూః అనే శబ్దం ఉచ్చరించి భూమిని సృష్టించాడు – తై.బ్రా 2.2.42 ].

ఈ తరవాత శబ్దాల ఉచ్చారణ, ధ్వని భేదం, ధ్వనిని అనుసరించి కలిగే అర్థ జ్ఞానం ఇటువంటి సిద్ధాంతపరమైన విషయాలపై సుదీర్ఘ చర్చ శంకరుల వారి భాష్యంలో జరిగింది. స్ఫోట రూప శబ్ద జ్ఞానము విశేషముగా వ్యాకరణ శాస్త్రమునకు సంబంధం చినది. దాని ఆవశ్యకత ఈ అధికరణం యొక్క ముఖ్య విషయమునకు అంతగా లేనట్లు తోచి, ఆ చర్చను ఇక్కడ ప్రస్తావించలేదు. స్ఫోట వాదాన్ని భగవత్పాదులవారే నిరాకరించటం వల్ల ఈ నిర్ణయం తీసుకోబడింది.

దేవతలు మనుష్యులు స్థావర జంగమాది ద్రవ్యములన్నీ అనిత్యములే. నాశ రహితము, నిత్యము అయిన శబ్దము నుండి వాటి ఆవిర్భావము అన్నదే ముఖ్యప్రాతిపదిక.

## సూ: 1.3.29 అత ఏవ చ నిత్యత్వమ్

వేదవాక్కు యొక్క నిత్యత్వము వలననే దేవతలు మొదలగు ఈ జగత్తు సర్వం పుట్టినదని నిర్ణయించి ఈ సూత్రం చెప్పబడింది. యాజ్ఞికులు జన్మాంతరంలో చేసిన సుకృతం వల్ల వేదవాక్కును ఋషుల నుండి సంప్రదాయ పరంపరలో పొందారు. *"యజ్ఞేన వాచః పదవీయమాయన్ తామన్వవిందన్ ఋషిషు ప్రవిష్టామ్"* (ఋ.సం. 10.71.3). వేదవ్యాసులవారు కూడా స్మృతిలో ఇదే విషయం చెప్పారు. *"యుగాంతేఽన్తర్హితాన్ వేదాన్ సేతిహాసాన్ మహర్షయః లేభిరే*

*తపసా పూర్వమనుజ్ఞాతాః స్వయంభువా"* (మహర్షులు, యుగాంతంలోను మహాప్రళయంలోను పోయినా వేదాలను ఇతిహాసాలను తపః ప్రభావం వల్ల బ్రహ్మ వద్ద నుండే పొందారు).

## సూ: 1.3.30 సమాన నామరూపత్వాత్ చ ఆవృత్తావపి అవిరోధో దర్శనాత్స్మృతేశ్చ

మహాప్రళయంలో అంతా నశిస్తుంది అంటే, సృష్టి మళ్లీ క్రొత్తగా మొదలవు తుంది. సృష్టికర్త పరబ్రహ్మకు మాత్రం మహాప్రళయంలోనూ అంతం ఉండదు. అలాగే, శబ్దం నిత్యం అనాది అని అంగీకరించటం వల్ల వేదవాక్కు అవిచ్ఛిన్నంగా పరబ్రహ్మము నుండి సంప్రాప్తమవుతుంది. సంసారం కూడా అనాది కాబట్టి జగత్ సృష్టి కల్పాంతంలోను, పునః పూర్వ రూపంతో ఆవిర్భవించి కొనసాగుతుంది. అది ఎలాగ? అనే ప్రశ్నకు సుషిప్తిలోంచి జాగ్రదవస్థకు వచ్చిన వ్యక్తి తన పూర్వప్రజ్ఞను కోల్పోకుండా ఎలా సామాన్యంగా కార్యకలాపాలు చేసుకుంటాడో, అలాగే ప్రళయాంతంలో అనిత్యాలన్నీ నశించినా, ఆద్యంతాలు లేని నిత్యమైనవి ఉంటాయి. సుషుప్తి—జాగ్రదవస్థలలో ప్రళయ—ప్రబోధాలు ఎలా జరుగుతాయో శ్రుతి ఇలా వివరిస్తున్నది: *"యథాసుప్తః స్వప్నం న కంచన పశ్యతి అథ అస్మిన్ ప్రాణ ఏవ ఏకధా భవతి. తథైనం వాక్ సర్వే ర్నామభిః సహాప్యేతి, చక్షుః సర్వై రూపైః సహాప్యేతి, శ్రోత్రం సర్వైః శబ్దైః సహాప్యేతి, మనః సర్వైర్ధ్యానైః సహాప్యేతి, స యదా ప్రతిబుధ్యతే యథాఽగ్నేః జ్వలతః సర్వా దిశో విస్ఫులింగా విప్రతిష్ఠేరన్, ఏవమేవ ఏతస్మాదాత్మనః సర్వేప్రాణా యథాయతనం విప్రతిష్ఠంతే ప్రాణేభ్యో దేవా దేవేభ్యో లోకాః"* (కౌ. 3.3). దీని భావం: సుషుప్తిలో పురుషుడి ఆత్మ పరమాత్మతో ఐక్యం పొంది, హృదయంలో శ్రోత్రాది ఇంద్రియ వ్యవహారం (చక్షుశ్శోత్రం మనోవాక్కులు) అంతా లీనమైపోయి వ్యక్తం కావు. తిరిగి మెలుకువ వచ్చిన వెంటనే మండుతున్న అగ్ని విస్ఫులింగాల్లా ఆత్మ నుండి సర్వత్ర తిరిగి వ్యాపించి, ఇంద్రియాలు వాటి యొక్క అధిష్ఠానదేవతలు యథాప్రకారం వాటి కార్యకలాపాలు కొనసాగిస్తాయి.

**సంశయం :**

సుషుప్తికి మహాప్రళయానికి వ్యత్యాసం ఉండాలి. జన్మాంతర అనుభవాన్ని ఈ జన్మలో తెలుసుకోవటం జ్ఞప్తికి తెచ్చుకోవటం ఎలా సామాన్య మానవుడికి కుదరదో, అలాగే మహాప్రళయంలో సర్వం కాలగర్భంలో కలసిపోవలసిందే కదా అనే పూర్వపక్షి సంశయానికి ఇలా సమాధానం చెప్పబడింది: మహాప్రళయంలో కూడా హిరణ్యగర్భుడు (కార్యబ్రహ్మ) పరమేశ్వరానుగ్రహంతో కల్పాంతరానికి చెందిన వ్యవహారాన్ని పునః ప్రారంభించే అవకాశం ఉంది. ఈ విషయంలో శ్రుతి వాక్యం ఇలా వినబడుతున్నది: *"యో బ్రహ్మాణం విదధాతి పూర్వం యో వై వేదాంశ్చ ప్రహిణోతి తస్మై, తం హ దేవం ఆత్మ బుద్ధి ప్రకాశం ముముక్షుర్వై శరణమహం ప్రపద్యే"* (కల్పారంభంలో ఏ పరమేశ్వరుడు బ్రహ్మను రూపొందించి వేదాలను ప్రసాదించేడో, అట్టి ఆత్మాకారమైన బుద్ధిలో ప్రవేశించు దేవుడిని, ముముక్షువునైన నేను శరణు పొందుతున్నాను — శ్వే.ఉ 6.18).

మహాప్రళయాంతంలో కూడా పూర్వకల్పంలో ఏ శక్తులుండేవో వాటి శేషమే ఉంటుంది. ఆ శేషం నుండే సృష్టి మళ్లీ జరుగుతుంది. పూర్వసృష్టిలో ఏ కర్మలు చేశారో మళ్లీ జన్మలెత్తినా, వారి వారి కర్మఫలాలకు అనుగుణంగానే జన్మప్రాప్తి ఉంటుందని గ్రహించాలి. వర్ణాశ్రమధర్మాలు విచ్ఛిన్నమవుతూ ఏదో విధంగా ఆవిర్భావమవుతున్నా, శరీర ధర్మాలు ఒక నిర్ణీత వ్యవస్థ (పద్ధతి) ప్రకారమే ఉంటాయి. అంటే చెవులే వింటాయి. నోటి ద్వారా వాక్ ప్రకటితమవుతుంది, కన్నే చూస్తుంది. ఇలా ప్రతి యుగంలోను పంచేంద్రియాలు వాటి వాటి పనులు చేస్తాయి. కాని, ఒక ఇంద్రియం పని మరో ఇంద్రియం చెయ్యటం కాని, ఆరవ ఇంద్రయం ఉండటం కాని జరగలేదు.

ఏ యుగంలోనైనా పరమాత్మ యొక్క రూపకల్పనలోనే సృష్టి జరుగుతుంది. హిరణ్యగర్భుడు, యుగాలు మారినా పరమేశ్వరుని మాయామయ స్వరూపంగా తన శక్తిని కోల్పోడు. ఈశ్వరాదులు యధావిధిగా వారి కార్యప్రపంచ నిర్మాణాన్ని కొనసాగిస్తుంటారు. అన్ని కల్పాలు, యుగాల్లోను దేవతాస్థానాలు ఒకేలా ఉంటాయి. వారి నామాదులు మారవు. ఈ విషయమే వేదంలోను, స్మృతుల్లోను ఇలా చెప్పబడింది: *"సూర్యా చంద్రమసౌ ధాతా యథాపూర్వమకల్పయత్. దివంచ పృథివీం చాంతరిక్ష మథో స్వః"* (బ్రహ్మ, సూర్య చంద్రులను ఆకాశాన్ని పృథివీ అంతరిక్ష స్వర్గలోకాలను పూర్వంలాగనే

కల్పించాడు – ఋ.స 10.190.3). కల్పాంతంలో కొన్ని దేవతాస్థానాలను, పదవులను కొత్తవారు అధిష్ఠిస్తున్నట్లు శ్రుతిలో కూడా వినబడుతున్నది. ఒకానొక అగ్నిచయనం చేసే యజమాని తనే అగ్నిదేవతను కావాలనే కోరికతో దానికి నిర్దేశించిన యాగాన్ని యథావిధిగా చేసి, తనే అగ్నిదేవత అయ్యాడు. *"అగ్నిర్వాకామయత అన్నాదో దేవానాం స్యామితి. స ఏవ మగ్నయే కృత్తికాభ్యః పురోడాశమష్టాకపాలం నిరవపత్"* (తై.బ్రా 3.1.4.1). అలాగే కొన్ని పురాణాల్లో ఋషులు కూడా జన్మాంతరంలో ఏ వేదమును కాపాడుతూ దాని రక్షణ బాధ్యత తీసుకున్నారో తిరిగి వారికే ఆ బాధ్యతలు ఇచ్చినట్లు చెప్పబడింది. *"ఋషీణాం నామధేయాని యాశ్చవేదేషు దృష్టయః శర్వర్యంతే ప్రసూతానాం తాన్యేవ ఏభ్యో దదాతి అజః"* . ఋతువులు మారుతున్నప్పుడు భిన్నరూపాలు ఉన్నా ఆ ఋతుచిహ్నాలే ఏ విధంగా మళ్ళీ మళ్ళీ కనబడుతుంటాయో, అలాగే యుగాల ప్రారంభంలోను అవే పదార్థాలు కనబడతాయి ( *"యథా ఋతుషు ఋతులింగాని నానారూపాణి పర్యయే దృశ్యంతే తాని తాన్యేవ తథా భావా యుగాదిషు"* – విష్ణు.పు. 1.5.66)

## సూ: 1.3.31 మధ్వాదిష్వసంభవాదనధికారం జైమినిః

ఈ సూత్రములోను, దీని తరవాత చెప్పిన సూత్రములోను పూర్వపక్షి పూర్వమీమాంసలో జైమిన్యాచార్యులవారు దేవతలకు ఉపాసనా విద్యలకు, మోక్షప్రాప్తి కోసం బ్రహ్మవిద్యా విషయంలోను అర్హత లేదని చెప్పినదానికి వివరణ ఇవ్వడమైనది.

జైమిని మధువిద్య యందు ప్రతిపాదించిన ఆదిత్యోపాసనకు దేవతలు అనర్హులని భావించారు. మధువిద్యా ప్రకరణలో *"అసౌ వా ఆదిత్యో దేవ మధు"* (ఈ ఆదిత్యుడే దేవతలకు మధువు – ఛా.ఉ 3.1.1.) అని వినబడుతున్నది. మనుషులు ఆదిత్యుణ్ణి దేవతల మధువుగా తలచి ఉపాసించవచ్చు. కాని, ఆదిత్యుడు తనే ఆ విధంగా ఉపాసించటం అసమంజసం. అలాగే ఆకాశమును, సంవర్గవిద్యలో బ్రహ్మకు నాలుగు పాదములుగా ఆదిత్యుడు, అగ్ని, వాయువు, దిక్కులు అని చెప్పబడ్డాయి. ఆయా దేవతాత్మలు ఉపాస్యులౌతారు కాబట్టి, ఆయా దేవతలు సంవర్గ విద్యకు అనధికారులు. శిరస్సులోనున్న నేత్రాదిఇంద్రియాల పైన సప్తఋషుల యొక్క దృష్టిని కేంద్రీకరించి ఆయా ఇంద్రియాలకు సంబంధించిన ఉపాసనా విద్య చెప్పబడింది *"ఇమావేవ గోతమ భరద్వాజౌ అయమేవ గోతమో-యం భరద్వాజ"* (బృ.ఉ 2.2.4.). ఈ కారణం వల్ల ఆయా ఋషులు ఈ ఉపాసనకు అర్హులు కారని భావిస్తారు.

## సూ: 1.3.32 జ్యోతిషి భావాచ్చ

జైమిని వంటి పూర్వమీమాంసకులు జ్యోతిర్మండలం అచేతనమైనది కాబట్టి స్తుతికే తప్ప స్వతంత్రంగా ఏ కర్మను శ్రుతి అట్టి వాటికి విధించలేదు. అందువల్ల జ్యోతిర్మండలంలో ఉన్న ఏ దేవతాత్మకు బ్రహ్మవిద్య యందు అధికారము లేదు.

## సూ: 1.3.33 భావం తు బాదరాయణో ఽస్తి హి

ఈ సూత్రంలో 'తు' శబ్దప్రయోగంతో ముందు రెండు సూత్రాలలో పూర్వమీమాంసకుల పక్షాన్ని ఖండిస్తూ బాదరాయణుడు దేవతలూ బ్రహ్మవిద్యా ప్రాప్తికి, మోక్షముపొంది బ్రహ్మలోక గమనానికి అర్హులని భావించారని చెప్పబడింది.

దేవతావాచకాలైన ఆదిత్యాది శబ్దాలు ఆయా దేవతాత్మల ఐశ్వర్యాన్ని తెలుపుతున్నాయి. అర్థవాదాలు, స్తోత్రాలు ఆయా దేవతలను వివిధ రూపాల్లో వారివారి విభూతిని వ్యక్తం చెయ్యడానికి ఉపయోగించబడ్డాయి. విధివాక్యాలు కానంత మాత్రాన వాటి ప్రయోజనం లేదని గాని, అవి నిరర్థకములని గాని భావించతగదు. ఇంద్రుడు మేషరూపంలోను, ఆదిత్యుడు పురుషరూపంలోను వారిని స్తుతించిన వారిని దర్శించు కున్నట్లు శ్రుతులు, స్మృతులు చెబుతున్నాయి. *"మేధాతిథిం హ కాణ్వాయనం ఇంద్రో మేషో భూత్వా జహార"* (ఇంద్రుడు గొర్రె రూపంలో మేధాతిథిని దొంగలించాడు – షడ్వంశ. బ్రా. 1.1). అలాగే మహాభారతంలో *"ఆదిత్యః పురుషో భూత్వా కుంతీం ఉపజగామ"* ఇత్యాదివి సూచింపబడ్డాయి.

*"ఆపోఽబ్రువన్"* (నీరు పలికింది), *"మృత్ అబ్రవీత్"* (మట్టి పలికింది)... అనే వాక్యాలు ఆయా దేవతలు పలికినట్లు అన్వయించుకోవాలి. మృదాదులు జడ రూపములైనా, పంచభూతాలు పరమాత్మ గుణములతో భాసిస్తున్న చేతనములుగానే శ్రుతుల్లో నిర్దేశింపబడ్డాయి.

ప్రస్తుత కాలమాన పరిస్థితుల్లో దేవతల సాక్షాత్కారం వాటితో సంభాషణ వంటివి జరగకపోయినా, గతకాలంలో ధర్మబద్ధ ప్రజలకు అది సంభవించి ఉండవచ్చు అని భావించటంలో దోషం లేదు. అలాగే, యోగ సాధకులు తేజోమయ శరీరంతో వార్ధక్యం, రోగాదులను అధిగమించి సిద్ధులైనట్లు శ్రుతిలోను వినబడుతున్నది. *"పృథ్వ్యప్తేజోఽనిలఖే సముత్థితే పంచాత్మకే యోగగుణే ప్రవృత్తే న తస్య రోగో న జరా మృత్యుః ప్రాప్తస్య యోగాగ్నిమయం శరీరమ్"* (శ్వే.ఉ 2.12).

సాధకులు క్రమముక్తిలో కొంతకాలం వారి వారి ఉపాసనా దేవతల యొక్క లోకాలలో ఉండి ఆతరువాత క్రమేపి బ్రహ్మలోకం చేరుకుంటారని, ఆ విధంగా ఆయా దేవతలు వారికి మోక్షమార్గంలో సహాయపడతారని ముముక్షువులు విశ్వసిస్తారు. శ్రుతి ప్రామాణ్యం క్రమముక్తి సాధనకు ఉన్నందు వల్ల, దేవతలకు ఆకారాది రూపాలు ఉన్నాయనీ, వారికి కూడా బ్రహ్మను పొందే అవకాశం, అధికారం ఉన్నాయనే విశ్వసించాలి.

**గమనిక:** ఈ అధికరణము దీని తరవాత వచ్చిన అపశూద్రాధికరణము ప్రసంగవశము చేత మధ్యలో చెప్పబడినట్లు గమనించాలి. ఈ రెండు అధికరణముల లోను బ్రహ్మతత్త్వము గురించి గాని బ్రహ్మచిహ్నము (గౌణములు) గాని ప్రస్తావింప బడలేదు.

# 9. అపశూద్రాధికరణమ్

## సూ: 1.3.34 శుగస్య తదనాదరశ్రవణాత్తదాద్రవణాత్ సూచ్యతే హి

ఛాందోగ్యోపనిషత్తులో జానశ్రుతి – రైక్వుడు ఆఖ్యాయికను ఆధారం చేసుకొని, ఈ అధికరణంలో ద్విజులకు తప్ప అన్యులకు బ్రహ్మవిద్యాధికారం లేదు అని వ్యాఖ్యానించడమైనది.

జానశ్రుతి తనను దూషిస్తూ అనాదరణతో చెప్పిన మాటలను విని దుఃఖముతో ఆచార్యుని వద్దకు వెళ్ళినట్లు సూచిస్తున్నది అని సూత్రార్థం.

**ఆఖ్యాయిక :**

జానశ్రుతి అనే పౌత్రాయణ వంశస్థుడైన ధనికుడు సత్రములు కట్టించి, అన్నదానం చేసి (ఇష్టాపూర్తాలనే సత్కర్మలు చేసి) ఖ్యాతి గడించేడు. ఒకరోజు అతడు తన మేడపైన విశ్రమిస్తుండగా, హంసరూపంలో ఇద్దరు ఋషులు ఇలా మాట్లాడుకోవటం జరుగుతుంది: "ఓయీ! భల్లాక్ష, జానశ్రుతి దానధర్మాలు చేసినవాడు. అతని తేజస్సు స్వర్గలోకంతో సమానంగా దిశదిశలూ వ్యాపించి ఉంది. అటుప్రక్కకు వెళ్తే ఆ తేజస్సు నిన్ను కాల్చేస్తుంది అని ఒక హంస అంటుంది. దానికి సమాధానంగా రెండవహంస, అల్పజ్ఞుడైన ఈ జానశ్రుతి తేజస్సు ఎంతమాత్రము. శకటములో పడి ఉన్న జ్ఞాని రైక్వుడు విషయం తెలిసే నువ్వు మాట్లాడుతున్నావా అంటుంది. ఈ సంభాషణ విన్న జానశ్రుతి, ఎన్నో కానుకలు తీసుకొని రైక్వుని వద్దకు చేరుకొని, మీరు ఏ దేవతను ఉపాసిస్తున్నారో ఆ దేవతా ఉపాసన విద్య నాకు ఉపదేశం చెయ్యండి అని ప్రార్థిస్తాడు. ఆ సమయంలో రైక్వుడు ఓరీ శూద్రా! అని జానశ్రుతిని దూషించి నీ కానుకలు–గోవులూ నీ దగ్గరే ఉంచుకో అని అనాదరణతో ప్రవర్తిస్తాడు.

**పూర్వపక్షి :**

దేవతలు బ్రహ్మవిద్యాధ్యయనానికి అర్హులని క్రిందటి అధికరణంలో నిర్ణయించారు. మరి శూద్రులకు కూడా దాని అర్హత ఉన్నట్లు ఈ శ్రుతి వాక్యం వల్ల తెలుస్తున్నది. *"ఆహ హా రేత్వా శూద్ర తవైవ సహ గోభిరస్తు"* (ఛా.ఉ 4.2.3.). జానశ్రుతిని రైక్వుడు శూద్రుడని అవమాన పరిచినా, రైక్వుడు ఆత్మబోధన చేశాడు. అందువల్ల శూద్రులు బ్రహ్మవిద్యకు అర్హులని భావించాలి. అంతే కాదు, విదురుడు జన్మతః శూద్రుడు. కాని అతను జ్ఞానసంపన్నుడు, ధర్మాధర్మములు క్షుణ్ణముగా తెలిసినవాడు అని మహాభారతంలో (స్మృతి) ప్రామాణ్యం ఉంది కదా!

**సిద్ధాంతం :**

శూద్రులకు ఉపనయనాది సంస్కారములు లేవు. వారు వేదాధ్యయమునకు అర్హులుగా శాస్త్రం గుర్తించలేదు. లౌకిక సామర్థ్యం వేరు. అలౌకిక జ్ఞానోపదేశం వేరు. బ్రహ్మవిద్య వేదార్థ రూపమైనది కాబట్టి ద్విజులకే బ్రహ్మవిద్యార్హత ఉంది.

## సూ: 1.3.35 క్షత్రియత్వగతేశ్చోత్తరత్ర చైత్రరథేనలింగాత్

జానశ్రుతి ప్రకరణం తరవాతనున్న ప్రకరణ సందర్భంలో ఇతడు క్షత్రియుడు అని తెలుస్తున్నది. అభిప్రతారి అనే క్షత్రియుడు జానశ్రుతితో కలసి విద్యాభ్యాసం చేసినట్లు, అభిప్రతారి చిత్రరథుడనే రాజు యొక్క కుమారుడు అని చెప్పటం వల్ల జానశ్రుతి కూడా క్షత్రియుడని గ్రహించాలి. అదీ కాకుండా, రైక్వుణ్ణి అన్వేషించి అతనెక్కడ శకటంలో ఉంటున్నాడో తెలుసుకొని రావలసినదని జానశ్రుతి తన క్షత్తా (రథసారథి) ని పంపినట్లు శ్రుతిలో వినబడుతున్నది. అందువల్ల జానశ్రుతి క్షత్రియుడు (ద్విజుడు) అని తెలుస్తున్నది.

## సూ: 1.3.36 సంస్కారపరామర్శాత్తదభావాభిలాపాచ్చ

కాదంబీ కాత్యాయనుడు వాని మిత్రులు ఐదుగురు పిప్పలాద మహర్షిని బ్రహ్మను గురించి తెలుసుకునే ఆకాంక్షతో సమిథాదులు తీసుకొని వెళ్లినట్లు శ్రుతి ఇలా ఉంది: *“బ్రహ్మపరా బ్రహ్మనిష్ఠాః పరం బ్రహ్మాన్వేషమాణాః ఏష హ వై తత్సర్వం వక్ష్యతీతి తేహ సమిత్పాణయో భగవంతం పిప్పలాదముపపన్నాః”* (బ్రహ్మనిష్ఠులు, బ్రహ్మపరులు పరబ్రహ్మను తెలుసుకోవాలనే కోరికతో, సమిథలు చేతిలో పట్టుకొని పిప్పలాద మహర్షిని శాస్త్రోక్తప్రకారము ఇతడు మనకు బ్రహ్మ గురించి అంతా చెబుతాడని భావించి అతని వద్దకు వచ్చారు – ప్ర.ఉ 1.1). వారంతా బ్రహ్మనిష్ఠులు అని చెప్పడం వల్ల ఉపనయనాది సంస్కారములు వారికి జరిగేయి అని సూచించినట్లు తెలుస్తున్నది. అలాగే మరోశ్రుతిలో ఆశ్వపతి రాజు ఉపనయనం చెయ్యకుండానే *“తాన్హానుపనీయైవ”* (ఛా.ఉ 5.11.7), వైశ్వానర విద్య బోధించాడు అని ఉంది. ఇక్కడ శిష్యులు ఐదుగురు ద్విజులే. వారు ఉపనయనాదులు ముగించుకొన్న *“మహా శ్రోత్రియాః”* అని కూడా చెప్పబడింది.

## సూ: 1.3.37 తదభావనిర్ధారణే చ ప్రవృత్తేః

జాబాల కుమారుడైన సత్యకాముడు శూద్రుడు కాడని నిర్ణయించుకునే గౌతముడు అతనికి బ్రహ్మవిద్యను ఉపదేశించినట్లు ఛాందోగ్యోపనిషత్తులో వినబడుతున్నది *“న ఏతత్ అబ్రాహ్మణో వివక్తు మర్హతి, సమిథం సోమ్య ఆహర ఉపత్వానిష్యే న సత్యాత్ అగాః”* (ఛా.ఉ 4.4.5).

## సూ: 1.3.38 శ్రవణాధ్యయనార్థప్రతిషేధాత్స్మృతేశ్చ

స్మృతిలో కూడా వేదశ్రవణం, అధ్యయనం కూడా శూద్రులకు తగదు, అర్హత లేదని చెప్పబడింది. అయితే విదురుడు, ధర్మవ్యాధుడు వంటి మహనీయులు పూర్వజన్మ సంస్కారం వల్ల, ఇతిహాస పురాణాదుల శ్రవణాదుల వలన ధర్మనిష్ఠులు అయినట్లు భావించాలి.

## 10. కంపనాధికరణమ్

### సూ: 1.3.39 కంపనాత్

**పూర్వపక్షి :**

కఠోపనిషత్తులో శ్రుతి ఈ విధంగా వినిపిస్తున్నది: *"యదిదం కించ జగత్సర్వం ప్రాణ ఏజతి నిఃసృతమ్ మహద్భయం వజ్రముద్యతం య ఏతత్ విదుః అమృతాస్తే భవంతి"* (ప్రాణం నుండి ఈ జగత్తంతా, ఆ ప్రాణ స్వరూపమైన బ్రహ్మము యందే చలించుచున్నది. ఆ బ్రహ్మయే వజ్రాయుధమును ఎత్తి పట్టుకున్నట్లు భయమును పుట్టి కంపించుచున్నది. ఇలా, బ్రహ్మమహత్తును తెలుసుకున్నవారు మరణము లేని వారు అవుతున్నారు – కఠ. 2.3.2). ఈ శ్రుతిలోని 'ప్రాణ' శబ్దము పంచవాయవుల సముదాయమైన వాయువు అనే భావించాలి అని తోస్తున్నది. ఆ వాయువు కారణంగానే కదా మేఘాలు, వర్షము, పిడుగులు వస్తాయి అని నమ్ముతున్నాం! అంత మహత్తు వాయువుకి ఉందని తెలుసుకున్నవారు అమృతత్వం పొందుతారు అని కూడా చెప్పుకోవచ్చు. అదీకాక, మరో శ్రుతిలో ప్రాణ విజ్ఞాన విషయాన్ని సూచిస్తూ: *"వాయురేవ వ్యష్టిః వాయుః సమిష్టిరప పునర్మృత్యుం జయతి, య ఏవం వేద"* (విశేష రూపములన్నీ వాయువే, సామాన్యరూపములూ వాయువే. ఈ విషయం తెలుసుకున్నవాడు మృత్యువుని జయిస్తాడు) అని చెప్పబడింది. అందువల్ల ప్రాణమనే శబ్దాన్ని వాయువుగానే అర్థం చేసుకోవాలి.

**సిద్ధాంతం :**

ఈ ప్రకరణం పూర్వోత్తర భాగాలలో చెప్పిన దానిని అనుసరించి ప్రాణం అనే పదాన్ని బ్రహ్మము (పరమాత్మ) అని గ్రహించాలి. కఠోపనిషత్తులో ముందున్న శ్రుతి వాక్యం: *"తదేవ శుక్రం తత్ బ్రహ్మ, తదేవ అమృత ముచ్యతే, తస్మిన్ లోకాః శ్రితాః సర్వే తదు నాత్యేతి కశ్చన"* (అదే స్వయం ప్రకాశమైనది. అదే బ్రహ్మ, అదే నాశరహితమైనది. దానినే సర్వలోకాలు ఆశ్రయించి ఉన్నాయి. దానిని అతిక్రమించి ఏదీ ఉండలేదు – క.ఠ. 2.2.1). మరో శ్రుతిలో *"ప్రాణస్య ప్రాణం"* (ప్రాణము యొక్క ప్రాణము – బృ.ఉ 4.4.18), అని బ్రహ్మనుద్దేశించి చెప్పబడింది. కఠలో అదే వల్లీలో *"భయాత్ అస్యాగ్నిస్తపతి భయాత్తపతి సూర్యః భయాదింద్రశ్చ వాయుశ్చ మృత్యుర్ధావతి పంచమః"* (ఆ పరబ్రహ్మ భయం వల్లే అగ్ని కాల్తున్నది, సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. ఇంద్రుడు వాయువు వారి వారి పనులు చేసుకుంటున్నారు. ఐదవవాడైన మృత్యువు కూడ భయంతో పరిగెడుతుంటాడు – క.ఠ 2.3.3). ఇదే విధంగా తైత్తిరీయోపనిషత్తులో కూడా వినబడుతున్నది. *"భీషాఽస్మాత్ వాతః పవతే భీషోదేతి సూర్యః, భీషాస్మాదగ్నిశ్చ ఇంద్రశ్చ మృత్యుర్ధావతి పంచమః"* (తై.ఉ 2.8).

పరమాత్మకే ఇటువంటి అపారమైన, భీకరమైన శక్తి ఉన్నట్లు గ్రహించాలి. సర్వాత్మకమైన బ్రహ్మశాసనం ప్రకారమే జగత్తంతా నడుస్తున్నది. అంతేకాక, బ్రహ్మ జ్ఞానమే అమృతత్వసిద్ధికి ఒకేఒక్క మార్గమని, శ్వేతాశ్వతరోపనిషత్ లో వినబడు తున్నది *"తమేవ విదిత్వా అమృతత్వమేతి నాన్యః పంథా విద్యతేఽయనాయ"* (శ్వే.ఉ 6.1.5). తక్కిన ఉపాసనా విద్యలు (వాయు విజ్ఞానం మొదలైనవన్నీ) అశాశ్వతములు, 'అన్యదార్తమ్' అని ముందు కూడా సూచింపబడింది. అందువల్ల ప్రాణ శబ్దంతో బ్రహ్మనిర్దేశమే జరిగినట్లు గ్రహించాలి.

## 11. జ్యోతిరధికరణమ్

### సూ: 1.3.40 జ్యోతిర్దర్శనాత్

**పూర్వపక్షి :**

ఛాందోగ్యోపనిషత్తులో సుషుప్తిలో ఉపాధియైన ఈ దేహేంద్రియ సమూహముతో సంబంధము విడిచిపెట్టి జీవుడు కొంతకాలము పరంజ్యోతిని చేరుకొని బ్రాహ్మీస్థితిని పొందుతాడు అని ఇలా చెప్పబడింది: *"ఏష సంప్రసాదోఽస్మాత్ శరీరాత్ సముత్థాయ పరంజ్యోతి రుపసంపద్య స్వేన రూపేణ నిష్పద్యతే"* (ఛా.ఉ 8.12.3). 'జ్యోతిః' అనే శబ్దము కంటికి కనబడేటట్లు చేసే వెలుగు (కాంతి) అని రూఢి అర్థంలోనే గ్రహించాలి అన్నట్లు తోస్తున్నది. అలాగే, అదే ఉపనిషత్తులో మరణ సమయం గురించి చెప్తూ *"అథ యత్ర ఏతదస్మాత్ శరీరాత్ ఉత్క్రామతి అథ ఏతైరేవ రశ్మిభిః ఊర్ధ్వ మాక్రమతే"* అని చెప్పబడింది [మరణాసన్న స్థితిలో జ్ఞాన సంజ్ఞ తప్పిన ఇతడు (ముముక్షువు) ఈ శరీరం విడచి సూర్య రశ్మలతో కూడి ఊర్ధ్వలోకాన్ని చేరుకుంటాడు]. అందువల్ల 'జ్యోతిః' అనే శబ్దం కాంతి, వెలుగు అనే సూచిస్తున్నది.

**సిద్ధాంతం :**

ఇంద్రుడికి ప్రజాపతి ఆత్మోపదేశం చేసిన ప్రకరణంలో పై శ్రుతి వచనాలు వినబడుతున్నాయి. అందువల్ల ఇక్కడ బ్రహ్మనిర్దేశమే కాని సామాన్య జ్యోతిని ఉద్దేశించి చెప్పినవి కావు. ఆత్మకు ఎటువంటి సుఖదుఃఖాలతోను, కోరికలతోను ప్రమేయం ఉండదు *"య అపహతపాప్మా"* అని వివరణ చెప్పబడింది. ఆ తరువాత *"అశరీరం వావ సంతం న ప్రియాప్రియే స్పృశతః"* అని అశరీరులైన వాయువు, ఆకాశాదుల విశిష్ట లక్షణాలను చెప్పడమైనది. చివర వాక్యంలో అదే శ్రుతిలో *"పరంజ్యోతిః ఉత్తమః పురుషః"* అని పరబ్రహ్మ యొక్క పరమాగతి నిర్దేశం స్పష్టం చెయ్యబడింది. అందువల్ల, జ్యోతి శబ్దము పరమాత్మను గురించి చెప్పినదే అని గ్రహించాలి.

## 12. అర్థాంతరత్వాదివ్యపదేశాధికరణమ్

## సూ: 1.3.41 ఆకాశోఽర్థాంతరత్వాదివ్యపదేశాత్

నామరూపాల కంటె భిన్నమైనది అని సూచించడం వల్ల ఆకాశము బ్రహ్మమే అని సూత్రార్థము.

**పూర్వపక్షి :**

*"ఆకాశో వై నామ నామరూపయోర్నిర్వహితా తే యదంతరా తత్ బ్రహ్మ తదమృతం స ఆత్మా"* (ఛా.ఉ 8.14.1). ఈ శ్రుతిలో పంచభూతములతో పాటు చెప్పిన భూతాకాశమునా, లేక పరబ్రహ్మమునా దేనిగురించి చెప్పడమైనది? ఆకాశం సామాన్య రూఢి అర్థంలో భూతాకాశమనే అందరూ గ్రహిస్తారు. ఎటువంటి నామ రూపాలున్న పరిచ్ఛిన్న వస్తువులనైనా నిర్వహించటం భూతాకాశానికే వీలు కలుగు తుంది. ఇక్కడ బ్రహ్మలింగాలేవీ స్పష్టంగా వ్యక్తం కానందున ఈ సందేహం కలుగుతున్నది.

**సిద్ధాంతం :**

ఇక్కడ 'ఆకాశ' శబ్దాన్ని పరబ్రహ్మముగానే గ్రహించాలి. నామరూపములకు భిన్నమైనది, అతీతమైనది పరమాత్మ. *"తే యదంతరా తత్ బ్రహ్మ"* కార్యజగత్తులో అన్నీ నామరూపములతో, పేర్లతోను ఆకారాదులతోను వ్యక్తమవుతాయి. భిన్న భిన్న స్వరూపములన్నవన్నీ వేరువేరుగా గ్రహింపబడతాయి. నామరూప విభాగకర్త బ్రహ్మము. *"అనేన జీవేనాత్మ నానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి"* (నా ఆత్మ అయిన ఈ జీవుని – ప్రాణి యొక్క రూపంలో ప్రవేశించి అనేక నామరూపాలతో ప్రకటితమౌతాను – వ్యాకృతి చేస్తాను). ఈ శ్రుతిలో జీవ–బ్రహ్మ అభిన్నత్వం (జీవో బ్రహ్మైవ) వ్యక్తమవుతున్నదని గ్రహించాలి. నామరూప నిర్వహణే సృష్టికర్త యొక్క లక్షణం అని కూడా విశదమౌతున్నది.

# 13. సుషుప్త్యుత్క్రాంత్యధికరణమ్

## సూ: 1.3.42 సుషుప్త్యుత్క్రాంత్యోర్భేదేన

(పూర్వ సూత్రములో నున్న 'వ్యపదేశాత్' అనే పదం ఈ సూత్రంలో కూడా వర్తిస్తుంది)

**పూర్వపక్షి :**

బృహదారణ్యకోపనిషత్తులో *"కతమ ఆత్మేతి, సో-యం విజ్ఞానమయః ప్రాణేషు హృద్యంత ర్జ్యోతిః పురుషః"* (బృ.ఉ 4.3.7.) అని యాజ్ఞవల్క్యుణ్ణి జనక మహారాజు ప్రశ్నిస్తాడు. ఆత్మ అంటే ఎవరు? విజ్ఞానమయుడు, బుద్ధిమయుడు, ప్రాణముల యందు హృదయమందు ఉన్న శరీర భాగముల కన్నా వేరుగా ఉండే జ్యోతిస్వరూపం లోనున్న పురుషుడే ఆత్మ. ఈ విషయంపై విస్తృత చర్చ జరిగినట్లు కూడా శ్రుతిలో వినబడుతున్నది. అయితే, విజ్ఞానమయుడు, బుద్ధిమయుడు ఇటువంటి శబ్దాలు శారీరుడికే వర్తించాలి. పైగా, ఆ సందర్భంలో జాగ్రదవస్థ ఇత్యాది శరీర అవస్థలు కూడా చెప్పబడ్డాయి. ఉపక్రమ ఉపసంహారములలో *"యో యం విజ్ఞానమయః ప్రాణేషు"* అనే చెప్పబడింది (బృ.ఉ 4.3.7, 4.4.22). అందువల్ల ఇక్కడ 'పురుషః' అనేది శారీరుడుకి సంబంధించిన ప్రస్తావన అని చెప్పటమే భావ్యమని తోస్తున్నది.

**సిద్ధాంతం :**

ఇక్కడ 'పురుష' శబ్దం పరమేశ్వరునికి వర్తిస్తుంది కాని జీవస్వరూపము (శారీరుడి) యొక్క ప్రస్తావన కాదు. ఎందుకంటే సుషుప్తిలోను, అంత్యకాలంలో జీవుని విడచి వెళ్లే ఉత్క్రాంతిలోను, ఈ జీవస్వరూపం ప్రాజ్ఞాత్మ – పరమాత్మతో ఐక్యమయి (కలిసిపోయి) ఎట్టి ప్రాపంచిక బాహ్యవిషయాలను, శరీరసంబంధ విషయాలను గ్రహించలేడు అని శ్రుతిలో ఈ విధంగా వినబడుతున్నది. సుషుప్తి విషయంలో: *"అయం పురుషః ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్తః న బాహ్యం వేద న అంతరమ్ "* (బృ.ఉ 4.3.21) అని, అలాగే ఉత్క్రాంతిలో *"అయం శారీర ఆత్మా ప్రాజ్ఞేనాత్మనా అన్వారూఢ ఉత్సర్జన్యాతి"* (బృ.ఉ 4.3.3) అని చెప్పబడింది. అంటే పరమాత్మతో కలసిపోయిన ఈ జీవాత్మ, ఉపాధియైన ఈ శరీరాన్ని విడచి వెళ్ళి పోతుంది అనే అవగతం అవుతున్నది.

*"యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు"* అనే శబ్దంతో సుషుప్త్యవస్థ గురించి చెప్పిన సందర్భంలో సంసారి యొక్క ధర్మాలకు అనుగుణంగా పరమాత్మ బోధన కోసమే (తత్త్వమసి అని బోధించినట్లు) చెప్పబడినట్లు సమన్వయించు కోవాలి. *"ధ్యాయతీవ లేలాయతీవ"* అని చెప్పినది కూడా దీనినే సమంగా అర్థం చేసుకోడానికే అని గ్రహించాలి. బుద్ధి స్థిరంగా ఉంటే ఆత్మ ధ్యానిస్తున్నట్లు నిశ్చలంగా ఉంటుంది. బుద్ధి చలిస్తూ ఉంటే ఆత్మ చలిస్తూ ఉంటుందనే ఈ శ్రుతి స్పష్టం చేస్తున్నది. అందువల్లే విజ్ఞానమయుడైన శారీరుడు సంసారి ధర్మాలతో ఒక విధంగాను, అసంసారి ధర్మాలతో ఒక విధంగాను ప్రవర్తిస్తుంటాడు. కాని జీవాత్మకు – పరమాత్మకు ఎటువంటి భేద వ్యాపారం ఉండదు. ఇదే విషయాన్ని జనకమహారాజు మోక్షప్రాప్తి గురించి ప్రశ్నించగా యాజ్ఞవల్క్యుడు ఇలా చెప్తాడు: *"అనన్వాగతః తేన భవతి అసంగోహ్యయం పురుషః"* (ఈ జీవాత్మ అవస్థాధర్మం చేత స్పృశింపబడదు. సర్వావస్థలందు పాపపుణ్యకర్మలకు అతీతంగా నిర్మలంగా ఉంటుంది). అలాగే *"అనన్వాగతం పుణ్యేన అనన్వాగతం పాపేన తీర్ణోహి తదా సర్వాన్ శోకాన్ హృదయస్య భవతి"* (సుషుప్తిలో జీవుడు పుణ్యం చేత కాని, పాపం చేత కాని స్పృశించబడక హృదయ సంబంధమైన సమస్త దుఃఖాలను అధిగమిస్తాడు – బృ.ఉ 4.3.22.

## సూ: 1.3.43 పత్యాదిశబ్దేభ్యః

పరబ్రహ్మ యొక్క అసంసారిత్వ స్వరూపాన్ని ప్రతిపాదించటమే ఇచ్చట ముఖ్యోద్దేశము. *"సర్వస్య వశీ"* , *"సర్వస్యేశానః"* , *"సర్వస్యాధిపతిః"* ఇటువంటి గుణాలు యొక్క వర్ణన అసంసారిత్వాన్నే ప్రతిపాదిస్తున్నవి. అంతేకాదు, *"స న సాధునా కర్మణా భూయాన్నో ఏవాసాధునా కనీయాన్"* (కౌ.ఉ 3.8) వంటి ప్రస్తావనలు పరబ్రహ్మముకు ఎటువంటి సంసారసంబంధమైన స్వభావాన్ని ప్రతిషేధిస్తున్నవి. అందువల్ల, ఇచ్చట అసంసారియైన పరమేశ్వర ప్రస్తావన జరిగినట్లు

గ్రహించ వలసియుంది.

# *1.*

# ప్రథమాధ్యాయము – చతుర్థపాదము



## 1. అనుమానికాధికరణమ్

### సూ: 1.4.1 అనుమానికమప్యేకేషామితి చేన్న శరీరరూపకవిన్యస్తగృహీతేర్దర్శయతి చ

(అనుమానికమపి ఏకేషాం ఇతి చేత్ న శరీరరూపక విన్యస్త గృహీతేః దర్శయతి చ)

బ్రహ్మము యొక్క లక్షణం ఈ అధ్యాయం రెండవ సూత్రంలో *"జన్మాద్యస్య యతః"* (బ్ర.సూ 1.1.2) యందు చెప్పడమైనది. అయితే ఆ లక్షణం సాంఖ్యమతస్థులు ప్రతిపాదించిన ప్రధానమునకు కూడా వర్తించగలదని ఆక్షేపించబడగా *"ఈక్షతేర్నా శబ్దమ్"* (బ్ర.సూ 1.1.5) అనే సూత్రంలో ప్రధానము జగత్కారణం కాజాలదని తిరస్కరించబడింది. అయినా శ్రుతి–స్మృతుల ప్రామాణ్యం విశ్వసిస్తున్న కొందరు వేదశాఖీయులు ప్రధానము జగత్ సృష్టి–స్థితి–లయములకు కారణము కావచ్చునని నమ్ముతున్నారు. వారిలో కపిలాది మహర్షులు కొన్ని శ్రుతి–స్మృతి వాక్యాలను ఉదహరిస్తూ ప్రధానమునకు సమాన శబ్దాలను కూడా చూపించారు. అయితే వీరి వాదన సర్వజ్ఞమైన బ్రహ్మము (పరమాత్మ) జగత్కారణమనే వేదాంత మూల ప్రాతిపదకకు విరుద్ధమవుతుంది. అంతేకాక, వేదములన్నింటిలోను ఒకే రీతిలో గమనం, గతి సామాన్యం ఉంది. ప్రధానం విషయంలో మాత్రం గమనంలో భేదం కనబడుతున్నది. ఈ పాదంలో అటువంటి అస్పష్టతను నిర్మూలించటానికే కొన్ని శ్రుతి–స్మృతి శబ్దాల పరిశీలన చేసి అద్వైత సిద్ధాంతాన్ని నిర్ణయించటం, సందేహాలను నివృత్తి చేయటం జరిగింది.

**పూర్వపక్షి :**

కఠోపనిషత్తులో *"మహతః పరమవ్యక్తం అవ్యక్తాత్ పురుషః పరః"* (క.ఉ 1.3.11) అని శ్రుతి వినబడుతున్నది. 'మహత్', 'అవ్యక్తమ్' అనే పదాలు సాంఖ్య ప్రతిపాదిత ప్రధానంలో కూడా అదే క్రమంలోనే చెప్పబడ్డాయి. అందువల్ల, 'అవ్యక్తం' బ్రహ్మప్రతిపాదనా లేక ప్రధాన ప్రతిపాదనా? అవ్యక్తం ప్రధాన నిర్దేశమా లేక శరీర సంబంధమైన మరి దేనినైనా సూచిస్తున్నదా?

**సిద్ధాంతం :**

కఠోపనిషత్తులో పైన ఉదహరించిన అవ్యక్త శబ్దం ఎంత మాత్రము సాంఖ్య స్మృతులలో చెప్పబడిన త్రిగుణాత్మకమైన ప్రధానమునకు వర్తించదు. *"న వ్యక్తం అవ్యక్తమ్"* (వ్యక్తము కానిది అవ్యక్తము) అంటే ప్రధానము తప్ప మరొకటి కాదు అనే వాదన సమంజసము అసలు కాదు. 'అవ్యక్తం' అనే పదము సాంఖ్యులు ఎన్నుకున్న ఒక సాంకేతిక పదము అనే గ్రహించాలి. వారి సిద్ధాంతంలో అది త్రిగుణాత్మకమైనది. సత్వరజస్తమోగుణాల సమన్వయం. అవ్యక్తం అనేది సూక్ష్మమైనది, చూడశక్యము కానిది అనే భావనలో యౌగిక శబ్దంగా ఎక్కడైనా వాడవచ్చు. సాంఖ్యులకు ప్రధానము అవ్యక్తము అనే రూఢ్యర్థం ఉండవచ్చు. కాని, అన్ని శాఖల వారికీ అందరి దార్శనికులకూ అదే రూఢ్యర్థం (భావన) ఉండాలనే నియమం లేదు. కఠోపనిషత్తులో ప్రకరణ సందర్భం పరిశీలిస్తే ఈ విషయం స్పష్టమవుతుంది. జీవాత్మ శరీరాలకు రథికుడు, శరీరం ఒక రథం అనే కల్పనతో శ్రుతి ఇలా వినబడు తున్నది: *"ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవతు, బుద్ధింతు సారథిం విద్ధి మనః ప్రగ్రహ మేవచ"* (క.ఉ 1.3.3). ఆ తరవాత *"ఇంద్రియాణి హయాన్ ఆహుః విషయాం స్తేషు గోచరాన్ ఆత్మేంద్రియ మనో యుక్తం భోక్తేతి ఆహుర్మనీషిణః"* [ఆత్మ రథికుడని తెలుసుకో, శరీరమే రథము. బుద్ధి రథసారథి. మనస్సు కళ్ళెము.

ఇంద్రియములు గుఱ్ఱములు. కోరికలను తీర్చేది ఆ గుఱ్ఱములే. శరీర–ఇంద్రియ–మనస్సులతో సంయుక్తమైన నువ్వే (ఆత్మయే) భోక్త అని ధీమంతులు చెప్తున్నారు – క.ఉ 1.3.4 ].

ఇంద్రియాలను వశంలో ఉంచుకోలేని వాడు సంసారబంధంలో పడి సుఖ దుఃఖాలను అనుభవిస్తాడు. ఇంద్రియాలను, కోరికలను నిగ్రహించుకునే వ్యక్తి, సంసార సాగరాన్ని దాటి పరమపదమైన విష్ణువును పొందుతాడు. అందువల్ల పరమాగతి లక్ష్యంగా ఉన్నవాడు ఇంద్రియభోగాల కన్నా పరమాత్మ దర్శనమే శ్రేష్ఠమని పరమాగతినే ఆకాంక్షిస్తాడు. *"ఇంద్రియేభ్యః పరాహ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః మనసస్తు పరా బుద్ధిః బుద్ధేరాత్మా మహాన్ పరః మహతః పర మవ్యక్త మవ్యక్తాత్ పురుషః పరః పురుషాన్న పరం కించిత్ సా కాష్ఠా సా పరా గతిః"* [ఇంద్రియములు కన్న కోరికలు (విషయములు) గొప్పవి. విషయముల కన్నా మనస్సు గొప్పది. మనస్సు కంటె బుద్ధి పరమైనది. బుద్ధి కన్నా పరమైనది (గొప్పది) ఆత్మ (ప్రత్యగాత్మ). సకలప్రాణి బుద్ధులకు ప్రత్యగాత్మ స్వరూపమగుట వలన హిరణ్యగర్భుడు మహత్తుగా వర్ణింపబడ్డాడు. సర్వమహత్తుయగు అవ్యక్తము నుండి ప్రథమముగా జన్మించినది హిరణ్యగర్భతత్త్వము. అట్టి అవ్యక్తం కన్నా పరమైన పురుషుడు (పర బ్రహ్మము) గొప్పవాడు. పరమపురుషుని కన్నా పరమైనది మరేది లేదు. అదే పరాకాష్ఠ, అదే పరమాగతి – క.ఠ 1.3.10, 1.3.11 ].

*"ఇంద్రియాణాం గ్రహత్వం, విషయాణామతి గ్రహత్వమ్"* అనేది శ్రుతి వాక్యం. ఇంద్రియములు గ్రహించే గుణము కలవి. కోరికలు లేకపోతే ఇంద్రియము లకు పనే లేదు. కోరికల యొక్క, ఇంద్రియముల యొక్క వ్యాపారాన్ని నడిపేదే మనస్సు. బుద్ధి వలనే భోక్తృత్వం; కర్మఫలం భోక్తను చేరుకోవటం జరుగుతుంది. అందువల్ల మనస్సు కంటె బుద్ధి గొప్పది. ఆత్మ బుద్ధి కంటె మహత్తైనది. ఆత్మయే రథాన్ని అధిరోహించిన రథికుడు – స్వామి, ప్రభువు.

శరీరాదులందు రథాది రూపకల్పన చేసి శరీర, ఇంద్రియ, మనో బుద్ధులు, కోరికలు, భోగములు వీటన్నింటితో కూడి ఉన్న భోక్త, సంసారగతిని పొంది భోగము లను అనుభవించటానికి ఎంత అవకాశమున్నదో, అంతే అవకాశం భోగత్యాగంతో, నివృత్తి మార్గంలో మోక్షసాధనకు, సంసార బంధ విముక్తితో పరమాగతిని పొందటానికి ఉంది. ప్రత్యగాత్మయే నువ్వు, నీ కర్మ ఫలసాక్షి నీ హృదయస్థానంలో ఉన్న ప్రత్యగాత్మయే అని చెప్పడమే ఇక్కడ ముఖ్య ఉద్దేశ్యం.

*"ఏష సర్వేషు భూతేషు గూఢోఽఽత్మా న ప్రకాశతే దృశ్యతే త్వగ్రయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః"* (అన్ని భూతములయందు గూఢంగా ఉన్న ఆత్మ బయటకు కనబడదు. సూక్ష్మ దృష్టి ఉన్నవారు, ఏకాగ్రత సాధించి, సూక్ష్మబుద్ధి వల్ల ఆత్మను తెలుసుకోగలరు – క.ఉ 1.3.12). అతిశ్రేష్ఠమైన పరమపదం చేరుకోవటం బహు కష్టతరం. జ్ఞానసాధనతోనే సాధించబడుతుంది. దానిని ఆత్మజ్ఞానంతో పొందే ఉపాయము కూడా ఈ విధంగా చెప్పబడింది: *"యచ్ఛే ద్వాఙ్మనసీ ప్రాజ్ఞః, తద్యచ్ఛేత్ జ్ఞాన ఆత్మని; జ్ఞానమాత్మని మహతి నియచ్ఛేత్ తద్యచ్ఛే చ్ఛాంత ఆత్మని"* (వాక్కును మనస్సులో నిగ్రహించాలి. కోరికలపై వ్యామోహముండే మనస్సును కూడా జ్ఞానం ద్వారా నిశ్చయ స్వరూపమైన బుద్ధిలో స్థిరంగా నిలిపి ఉంచాలి. అట్టి స్థిరబుద్ధిని సూక్ష్మంగా చేసి ఆత్మయందు, తద్వారా సమిష్టి బుద్ధి రూపమైన హిరణ్యగర్భాత్మ, ఈశ్వరుని యందు నిలుపుకోవాలి. ఆపైన పరాకాష్ఠయైన పరమాత్మ స్థానము, నిర్గుణబ్రహ్మను చేరి మోక్షము పొందబడుతుంది – క.ఉ 1.3.13.). ఇలా ప్రతిపాదించిన మోక్షమార్గమునందు అన్యశాఖీయులు భావించే ప్రధానము యొక్క ప్రసక్తి లేద.

## సూ: 1.4.2 సూక్ష్మం తు తదర్హత్వాత్

ప్రకరణం సందర్భంగా సూక్ష్మశరీర ప్రస్తావన మాత్రమే అవ్యక్తమని చెప్ప బడింది కాని ప్రధానము కాదు. స్థూలశరీరం వ్యక్తమయేది – బాహ్యంగా కనబడేది. సూక్ష్మశరీరం కారణరూపంలో ఉన్న అవ్యక్తము. బృహదారణ్యకంలో *"తద్ధేతం తర్హి అవ్యాకృత మాసీత్"* (బృ.ఉ 1.4.7.). ఇదంతా అప్పుడు అవ్యాకృతంగా ఉండేది. జగదావిర్భావానికి ప్రాగవస్థలో నామరూపాలు లేకుండా బీజశక్తి అవస్థలో సమస్త ప్రపంచమూ అవ్యక్తంగానే ఉంటుంది.

## సూ: 1.4.3 తదధీనత్వాదర్థవత్

ఈ జగత్తు యొక్క ప్రాగవస్థనే ప్రధానంగా సాంఖ్యులు భావిస్తారు. మరి ఉత్పత్తికి పూర్వం (అదే ప్రాగవస్థ) నామరూపములు లేని జగత్తు అవ్యక్తమని వేదాంతులు, అద్వైతులు అంటే సాంఖ్య సిద్ధాంతమైన ప్రధానమును అంగీకరించినట్లే కదా! అని పూర్వపక్షి వాదన. దీనికి సమాధానం ఈ సూత్రం ద్వారా ఇలా చెప్పబడింది.

జగత్తు యొక్క ప్రాగవస్థ పరమాత్మ అధీనంలో ఉంటుంది. అచేతనమైన ప్రధానము జగత్కారణం కాజాలదు అని ఉపనిషత్తులు వక్కాణిస్తున్నాయి. పరమేశ్వరుడు సర్వ శక్తిమంతుడు, స్వతంత్రుడు, నిర్గుణుడు అని నమ్మినవాళ్ళే ముముక్షువులు. అయితే, సంసార బీజశక్తి జ్ఞానం చేత కాల్చబడుతుంది కాబట్టి *"జ్ఞానాదేవ తు కైవల్యం"* అనే విశ్వాసం ఉన్నవారు అవ్యక్తం అంటే పరమేశ్వరుణ్ణి ఆశ్రయించుకొన్న మాయామయమైన మహానిద్ర అని గ్రహిస్తారు. సంసారులైన జీవులందరూ స్వరూపజ్ఞానం నశించగా మహాసుషుప్తిలో బ్రహ్మములోనే, లయం పొందుతారు.

శ్రుతిలో కొన్ని సందర్భాలలో అవ్యక్తం 'ఆకాశ' శబ్దంతో చెప్పబడింది. *"ఏతస్మిన్నుఖల్వక్షరే గార్గ్యాకాశ ఓతశ్చ ప్రోతశ్చ"* (బృ.ఉ 3.8.11.). కొన్ని చోట్ల అక్షర శబ్దంతో చెప్పబడింది *"అక్షరాత్పరతరః పరః"* (ము.ఉ 2.1), మరికొన్ని చోట్ల మాయగా నిర్దేశించబడింది. *"మాయాంతు ప్రకృతిం విద్యాత్ మాయినంతు మహేశ్వరమ్"* (శ్వే.ఉ 4.10). మాయ శబ్దం నిర్వచనం చెయ్యబడదు. అదే అవ్యక్తము. దానిని అనిర్వచనీయము (నిరూపింప శక్యము కానిది) అనే గ్రహించవలసి ఉంటుంది.

హిరణ్యగర్భుడి యొక్క బుద్ధి 'మహత్' అని సమన్వయించుకుంటే మహత్ పుట్టుకకు కారణం అవ్యక్తమైన పరమాత్మ. అదే *"మహతః పర మవ్యక్తమ్"* అని స్పష్టమవుతుంది. అయితే, కొందరు వ్యాఖ్యాన కర్తలు, సూక్ష్మశరీరం అవ్యక్తమని అభిప్రాయం వ్యక్తం చేశారు. సూక్ష్మశరీరం పైనే బంధం, మోక్షం ఆధారపడి ఉంటాయి. అందువల్ల స్థూలశరీరం కంటే అది పరమైనది అని వారి భావన. *"తదధీనత్వాదర్థవత్"* అనే పై సూత్రంలో ఇదే విషయం చెప్పబడిందని వారు వ్యాఖ్యానించారు. అయితే భాష్యకారులు (భగవత్పాదులవారు) దీనిని నిరాకరించి, శరీరాన్ని స్థూల సూక్ష్మ భేదం లేకుండా గ్రహించాలి అని అభిప్రాయపడ్డారు. *"పురుషాన్న పరం కించిత్"* అనేదే మూల ప్రతిపాదన. అందువల్ల ప్రధానము యొక్క ప్రస్తావనే అనవసరం.

## సూ: 1.4.4 జ్ఞేయత్వావచనాచ్చ

అణిమాది విభూతులు పొందటానికి త్రిగుణాత్మకమైన ప్రధానాన్ని ఉపాసించాలని సాంఖ్యులు భావిస్తారు. త్రిగుణాలకు పురుషులకు ఉన్న భేదం తెలుసు కోవటం వల్ల ముక్తి కలుగుతుందని కూడా వారు చెబుతారు. అయితే, అవ్యక్తం జ్ఞేయం (తెలుసుకోదగినది) అని ఎక్కడా వారి స్మృతులలో చెప్పబడలేదు. అందువల్ల రథ రూప కల్పనతో శరీరాదుల క్రమంలో విష్ణువు యొక్క పరమపదాన్ని నిర్దేశిస్తూ కఠోపని షత్తులో అవ్యక్తం అని ఏది చెప్పబడిందో దానినే గ్రహించటం సబబుగా ఉంటుంది.

## సూ: 1.4.5 వదతీతి చేన్న ప్రాజ్ఞో హి ప్రకరణాత్

"అశబ్ద మస్పర్శ మరూప మవ్యయం తథాఽరసం నిత్యమగంధ వచ్చయత్, అనాద్యనంతం మహతః పరం ధ్రువం నిచాయ్య తం మృత్యుముఖాత్ ప్రముచ్యతే" (క.ఉ 1.3.15). ఈ శ్రుతి ఏది శబ్దరహితమో, స్పర్శలేనిదో, రూపము లేనిదో, వికారాదులు లేనిదో, నిత్యమో, ఆద్యంతాలు లేనిదో, మహత్తు కంటే పరమైనదో, స్థిరమో దానిని అన్వేషించి తెలుసుకొని మృత్యుముఖం నుండి బయటపడి ముక్తుడు అవుతాడు అని పలుకుతున్నది. ఇదే ప్రధానమని సాంఖ్యవాదుల పూర్వపక్షం. అయితే జ్ఞేయము, అన్వేషణ చేసి తెలిసికోదగినది ప్రధానము కాదు. ప్రాజ్ఞుడు–పరమాత్మ ప్రకరణములో *"పురుషాన్నపరం కించిత్ సా కాష్ఠా సా పరాగతిః"* అని స్పష్టంగా జ్ఞేయ మైనది నిర్దేశింపబడింది. ప్రధానమును అన్వేషించినంత మాత్రాన మృత్యువు నుండి విముక్తి పొందవచ్చని సాంఖ్యులూ చెప్పలేదు. కాబట్టి, చేతన స్వభావమున్న ప్రాజ్ఞాత్మ (పరబ్రహ్మము) యే జ్ఞేయము అనే ఉపనిషద్వాక్యాన్ని అంగీకరించాలి.

## సూ: 1.4.6 త్రయాణామేవ చైవముపన్యాసః ప్రశ్నశ్చ

కఠోపనిషత్తులో నచికేతుడు మృత్యువుని అడిగిన మూడు వరాలు, అగ్ని– జీవుడు–పరమాత్మకు చెందినవి. ఈ మూడింటికి సంబంధించిన సమాధానాలు తప్ప మరే విషయము అందులో చర్చింపబడలేదు. అందువల్ల, సాంఖ్యులు ప్రతిపాదించిన ప్రధానము గురించి ఎట్టి చర్చ ఏ విధంగానూ ఈ ప్రకరణంలో వినబడదు.

**ఆఖ్యాయిక :**

గౌతమ సగోత్రీయుడు, వాజశ్రవుని కుమారుడు అయిన ఉద్దాలకుడు, విశ్వజిత్ యాగాన్ని తన సంపదనంతా దానముగా ఇచ్చి స్వర్గఫలమును పొందటానికి పూనుకుంటాడు. యజ్ఞం చేసుకుంటున్న సమయంలో యుక్తవయస్సు కూడా రాని తన కుమారుడైన నచికేతుణ్ణి దానధర్మాలు, ఋత్విక్కులకు ఇచ్చే తాంబూలాదులకు సహాయపడతాడనే ఉద్దేశ్యంతో నియమించుకుంటాడు. తండ్రి ముసలి ఆవుల్ని దానముగా ఇవ్వటం చూసి కుమారుడు, ఈయనకు నరకము తప్పదన్నట్లు భావించి, తండ్రీ! మరి నన్నెవరికి దానముగా ఇయ్యదలిచావు అని విడవకుండా మూడు పర్యాయాలు అడుగుతాడు. దానితో విసుగెత్తిన తండ్రి, నిన్ను యముడికే దానంగా ఇచ్చేస్తాను అని కోపంగా అంటాడు. నచికేతుడు మనుస్సలో బాధపడినా, తండ్రితో తండ్రీ! మన పూర్వీకులెవ్వరూ ఆడిన మాట తప్పలేదు నువ్వు కూడా తప్పవు కదా! అని గుర్తు చెయ్యగా నచికేతుని యమలోకమునకు తండ్రి పంపివేస్తాడు. అక్కడ యమధర్మరాజు దేశాంతరము పోవటం వల్ల నచికేతుడు మూడురోజులు అన్నపానాదులు లేకుండా ప్రతీక్షించవలసి వస్తుంది. మృత్యుదేవత తన గృహం వద్ద ఆ విధంగా ఆకలిదప్పులతో తన రాకకు ఎదురు చూస్తునట్లు పరివారం ద్వారా తెలుసుకొని, నచికేతునకు అతిథి సత్కారములు చేసి మూడు వరములు ప్రసాదిస్తు న్నాను కోరుకోమని అంటాడు. దానికి నచికేతుడు మొదటిగా తాను తిరిగి వెళ్ళి నప్పుడు, తన తండ్రి శాంతచిత్తుడై ప్రేమగా చూసుకునేటట్లు అనుగ్రహించమని అడుగుతాడు. ఆపైన వరాలు కోరుకున్నప్పుడు నచికేతునకు మృత్యుదేవతకు అగ్ని, జీవుడు, పరమాత్మ అనే మూడు అంశాలపై చర్చ విస్తృతంగా జరుగుతుంది. ఇదే కఠోపనిషత్తులో ఉపన్యసించబడింది. వాటి ప్రస్తావనే ఇక్కడ ప్రశ్న – సమాధాన రూపంలో జరిగింది.

నచికేతుడు మృత్యుదేవతను అగ్ని చయనం గురించి అడిగిన ప్రశ్న ఇలా ఉంది: *"స త్వమగ్నిం స్వర్గ్య మధ్యేషి మృత్యో ప్రబ్రూహి త్వం శ్రద్ధధానాయ మహ్యమ్"* (ఓ మృత్యు దేవతా! స్వర్గాన్ని ప్రసాదించే అగ్ని చయనాన్ని గురించి నువ్వు బాగా అధ్యసించి తెలుసుకున్నావు. శ్రద్ధావంతుడైన నాకు దానిని గూర్చి ఉపదేశించుము. ఇది నా రెండవ వరముగా స్వీకరించు – క.ఠ 1.1.13). మూడవ వరము: *"యే యం ప్రేతే విచికిత్సా మనుష్యే అస్తీత్యేకే నాయం అస్తీతి చ ఏకే ఏతత్ విద్యాం అనుశిష్టః త్వయాహం వరాణామేష వరస్తృతీయః"* [మనుష్యుడు మరణానంతరము ఇంకా ఉంటాడని కొందరు (అట్టి పునర్జన్మ) ఉండదని కొందరూ అంటారు. ఈ విషయంలో నువ్వు నాకు ఏది చెప్తావో అదే నా మూడవ వరంగా అనుగ్రహించు – క.ఠ. 1.1.20 ]. జీవ విషయమైన ప్రశ్న ఇలా ఉంది: *"అన్యత్ర ధర్మాత్ అన్యత్ర అధర్మాత్ అన్యత్ర అస్మాత్ కృతాకృతాత్, అన్యత్ర భూతాచ్చ భవ్యాచ్చ యత్తత్ పశ్యసి తద్వద"* (ధర్మానికి, అధర్మానికి అతీతమైనది; కార్యానికి, కారణానికి అతీతమైనది; భూత భవిష్యత్తులకు అతీతమైనది; దేనిని నువ్వు చూస్తున్నావో - దానిని గురించే చెప్పుము – క.ఉ 1.2.14). నచికేతుడు వయస్సులో చిన్నవాడే అయినా, అతని శ్రద్ధకు, బుద్ధి కుశలతకు మృత్యుదేవత చాలా సంతోషించి, లోకాలకు ఆది అయిన అగ్ని విషయం వివరంగా బోధించి, తదుపరి మరణానంతరము నాశనము లేని ఆత్మ యొక్క ధర్మాలను ఇలా బోధిస్తాడు: *"హంత త ఇదం ప్రవక్ష్యామి గుహ్యం బ్రహ్మ సనాతనమ్, యథా చ మరణం ప్రాప్య ఆత్మా భవతి గౌతమ"* (క.ఉ 2.5.6). ఆపైన, జన్మ–కర్మల విషయాన్ని వివరిస్తూ: *"యోని మన్యే ప్రపద్యంతే శరీరత్వాయ దేహినః స్థాణుమన్యేఽను సంయంతి యథా కర్మ, యథాశ్రుతమ్"* (క.ఉ 2.5.7) అని చెబుతాడు. ఇది జీవునకు సంబంధించిన బోధన (జీవులు పూర్వజన్మలో తాము చేసిన పుణ్యపాపములు, కర్మల ననుసరించి, తాము సంపాదించుకొన్న విజ్ఞానము ననుసరించి, దేహధారణ చేసి మాతృగర్భవాసమును అనుభవించి మరల మరల పుడుతుంటారు. ఉత్తములైన వారు ఇహములో మానవ జన్మను, పరములో దేవతాది జన్మలను పొందుతారు. అధములైన వారు వృక్షాదిస్థావర జన్మనే అనుభవిస్తారు). అదేవిధంగా, మృత్యుదేవత నచికేతునకు ఆత్మ – పరమాత్మ బోధనను విస్తృతముగా చేస్తాడు. *"న జాయతే*

*మ్రియతేవా విపశ్చిత్"* (ఆత్మ నిత్యమైనది. దానికి నాశనము లేదు) జన్మ–మరణముల ప్రసక్తి శరీర సంబంధమైనది. ఆత్మ–పరమాత్మలు అభేదం కాబట్టి వాటి విషయంలో వినాశనం ఉండదు. శారీరుడే జనన–మరణాలు సుఖదుః ఖాలు అనుభవించే భోక్త. ఇటు తరవాత, అవస్థా ధర్మాలపై చర్చ ముందుకు సాగింది. ధీరుడు విద్యావంతుడు అయిన పురుషుడు(మనిషి) సర్వవ్యాప్తము, నిర్మలము అయిన ఆత్మను తెలిసికొని దుఃఖానికి అతీతుడౌతాడు. స్వప్న–జాగ్రదవస్థలలో చేతనత్వం ఉన్న జీవాత్మ–పరమాత్మల అభేదం చెప్పబడింది.

ప్రాజ్ఞుని విజ్ఞానం (ఆత్మ జ్ఞానం) వలనే శోక నివృత్తి కలుగుతుంది అనే వేదాంత సిద్ధాంతం యొక్క ప్రస్తావన ఇలా ప్రకరణ సందర్భంలో జరుగుతుంది: *"యదేవ ఇహ తదముత్ర, యదముత్ర తదన్విహ, మృత్యోః సమృత్యు మాప్నోతి య ఇహ నానా ఇవ పశ్యతి"* (ఈ దేహంలో ఏ చైతన్య రూపం ఉన్నదో, అదే సూర్యాదు లలో ఉన్న భారూపం. శరీరములో ఉన్న ఆత్మను, అఖండరసమైన ప్రజ్ఞానఘనుడైన పరమాత్మను, అవిద్య వలన భిన్నరూపంలో గ్రహించేవారు సంసార వలయంలో పడి మృత్యువు నుండి మృత్యువునే పొందుతారు. వారికి విముక్తి లేదు – క.ఉ 2.1.10). ఈ సందర్భంలో నచికేతుడు ఇహ–పర లోకాలలో భోగమునకు ప్రలోభ పడకుండా జన్మరాహిత్యాన్నే కోరుకోవటం గమనించి, మృత్యుదేవత అతణ్ణి చాలా ప్రశంసిస్తాడు. అటుపైన ఆత్మకు సంబంధించిన అసంసారిత్వ ధర్మాలను గూర్చి ఉపన్యాసం ముందుకి సాగుతుంది.

అవిద్య పోయే వరకు సాధారణ మానవధర్మాలు (అహంభావం ఇత్యాదివి), సంసార తాపత్రయము పోవు. విద్యాప్రాప్తి వలన దేహాభిమానం పోవటమేకాదు, జీవ–పరమాత్మ అభిన్నత్వం సులభంగా బోధపడుతుంది. అందువల్లే సంసారి ధర్మాలు, వాటి వల్ల కలిగే అనర్థాలు బోధపరచి తదనంతరమే *'తత్త్వమసి'* బ్రహ్మమును తెలుసుకంటే సర్వం విజ్ఞానమౌతుంది అనే బోధన బ్రహ్మవేత్తలు చేస్తారు. అగ్ని–జీవ –పరమాత్మల బోధన, వరముల యొక్క కల్పనతో మేళవించి విస్తృతముగా నచికేతుడికి, మృత్యుదేవత ద్వారా కఠోపనిషత్తులో చెప్పబడింది. ఈ ఉపన్యాసం చర్చలో, సాంఖ్యులు ప్రతిపాదించిన ప్రధానమునకు సంబంధించిన ప్రశ్న లేదు, సమాధానమూ లేదు.

## సూ: 1.4.7 మహద్వచ్చ

సాంఖ్యులు వాడే 'మహత్' శబ్దం, ఎలా ఉపనిషత్తులు బోధించే మహత్ శబ్దానికి సమానము కాదో, అలాగే సాంఖ్యులు వాడే 'అవ్యక్త' పదం కూడా వేదాంతములలోను, శ్రుతులలోను నిర్దేశించిన అవ్యక్త పదమునకు భిన్నమైనది. సాంఖ్యవాదులు సత్త్వగుణ ప్రధానమైన సత్తామాత్రం (నిర్వికల్పబుద్ధి) ప్రధానమనే అర్థంలో వాడతారు. కాని సచ్ఛబ్దం, వైదిక–ఉపనిషత్ ప్రయోగాలలో ఆత్మపరంగా చెప్పబడింది. *"బుద్ధేరాత్మా మహాన్ పరః"*, *"మహాంతం విభు మాత్మానమ్"*, *"వేదాహ మేతం పురుషం మహాంతమ్"*, ఇత్యాది వాక్యాల్లో పరమాత్మ–పరమేశ్వర నిర్దేశమే జరిగింది. అలాగే, అవ్యక్తం విషయం లోను సాంఖ్యులు చెప్పే అర్థం, వేదాంతములలో చెప్పే అర్థం వేరు వేరుగా ఉన్నాయి. ఈ వ్యత్యాసం తెలుసుకున్న వారు ప్రధానమునకు సంబంధించిన ప్రస్తావన, కఠోపనిషత్ ప్రకరణములో ఎక్కడా లేదని గ్రహిస్తారు.

## 2. చమసాధికరణమ్

### సూ: 1.4.8 చమసవదవిశేషాత్

కపిలమహర్షి వంటి సాంఖ్యవాదులు, వేదాంతములలో కూడా ప్రధానమును నిర్దేశిస్తూ కొన్ని శబ్దాలు ఉన్నాయని ఉదహరిస్తూ శ్వేతాశ్వతర ఉపనిషత్తులో ఈ మంత్రభాగం చూపడమైనది: *"అజా మేకాం లోహిత శుక్ల కృష్ణాం బహ్వీః ప్రజా సృజమానాం సరూపాః, అజోహ్యేకో జుషమాణోఽనుశేతే జహాత్యేనాం భుక్తభోగా మజోఽన్యః"* (ఎరుపు, తెలుపు, నలుపు రంగులు గల తనతో సమానమైన రంగులు గల సంతానానికి జన్మనిచ్చిన ఒక 'అజను' మరో 'అజ' అనుభవిస్తూ దానిని అనుసరించే శయనిస్తున్నది. మరో 'అజం' మాత్రం దానిని అనుభవించి విడచిపెట్టి వేసింది – శ్వే.ఉ 4.5). ఈ మంత్రంలో లోహిత, శుక్ల, కృష్ణవర్ణాలు ప్రధానములో సత్త్వరజస్తమో గుణాలను, సామ్యావస్థయందు, అవయవధర్మాలను నిర్దేశిస్తున్నట్లు వారి మతం. అలాగే *"న జాయతే ఇతి అజః"* (పుట్టుక లేనిది అజః) అనే అర్థంలో ప్రధానమును కూడా గ్రహించవచ్చును అని వారి అభిప్రాయము. అజా శబ్దానికి మేక అనే అర్థం రూఢిలో జనసామాన్యంలో ఉన్నా, ఇక్కడ విద్యాప్రకరణ సందర్భాన్ని బట్టి ఆ అర్థం గ్రహించబడదు అని అంగీకరిస్తారు. త్రిగుణాత్మకమైన ప్రధానము వలనే సృష్టి జరిగింది, అటువంటి స్వభావసిద్ధమైన ప్రకృతిని ఒక అజుడు (పురుషుడు, సంసారి) సేవిస్తూ, అవిద్య వలన అదే తన ఆత్మ అనుకుంటూ అవివేకిగా సంసారంలో పడి ఉంటాడు. మరొక అజుడైతే (పురుషుడు) వివేక జ్ఞానంతో విరక్తుడై భోగములు కల్పించే ఈ ప్రకృతిని వదలిపెట్టి వెళ్లిపోతాడు. ఇలా సమన్వయం చేసుకుంటూ, శ్రుతిలో ప్రధానమును గురించి ప్రామాణ్యం ఉందని కపిలాదులు భావించారు.

**సంశయం :**

అజా అంటే రూఢ్యర్థంలో మేక అని ప్రకరణ సందర్భంగా గ్రహించబడదు. అందువల్ల ఆ శబ్దం త్రిగుణాత్మక ప్రధానమునకు చిహ్నములుగా మూడు రంగుల్లో అన్వయించుకోవచ్చును, లేదా మాయ అని కూడా గ్రహించవచ్చు అని అనిపిస్తున్నది.

**సిద్ధాంతం :**

శ్రుతిప్రామాణ్యం, సాంఖ్యవాదుల ప్రధానమునకు ఏ విధంగానూ కుదరదు. పైన ఉదహరించిన మంత్రాన్ని, ప్రకరణ సందర్భంలోనే అన్వయించుకోవాలి. స్వతంత్ర రూపంలో విశేషకారణం లేకపోవటం వలన ఎట్టి వాదనా సమర్థించబడదు. *"అర్వాగ్బిలశ్చమస ఊర్ధ్వ బుధ్నః"* (క్రింది భాగంలో రంధ్రము, పైన గరిట వలె చమసాకారంలో ఉన్నది – బృ.ఉ 2.2.3.) అనే మంత్రంలో చమసం అనే శబ్దానికి, ఇది అని నిర్ధారించి చెప్పటం కుదరదు. అలాగే ఇక్కడ కూడ 'అజా' శబ్దాన్ని ఎటువంటి అర్థంలో సమన్వయించుకోవాలో సూచించే విశేషము ఏదీ లేదు.

### సూ: 1.4.9 జ్యోతిరుపక్రమా తు తథా హ్యధీయత ఏకే

కొన్ని శాఖలవారు తేజో అబన్నాదుల స్వరూపమైన ప్రకృతి అజా అని గ్రహించవచ్చు అని విశ్వసిస్తున్నారు. పరమేశ్వరుని వలన ఉద్భవించిన తేజో అబన్నాదులు: తేజస్సు–జలము–పృథివీ ఈ మూడింటి ధర్మాలు కలిగినవి జరాయుజం–అండజం–స్వేదజం–ఉద్భిజ్జం అనే నాలుగు వర్గాలు ప్రాణుల్లో ఉన్నాయి. అందువల్ల తేజో అబన్నాదులను భూతత్రయ రూపంలో 'అజ' గా అన్వయించు కోవటం కుదురుతుంది. శ్రుతిలో కూడా ఇలా వినబడుతున్నది: *"యదగ్నే రోహితం రూపం తేజస్తద్రూపం, యచ్ఛుక్లం తదపాం యత్ కృష్ణం తదన్నస్య"* (ఎరుపు అగ్నిరూపం, తెలుపు జలరూపం, నలుపు పృథివీ రూపం – ఛా.ఉ 6.4.1)

ఏ పదాల అర్థంలో సందేహం లేదో వాటి ఆధారంగా సందేహమున్న పదాలకు అర్థం నిర్ణయించుకోవలసి వస్తుంది. ప్రకరణ సందర్భంగా ఉపనిషత్తులో ఆరంభం ఇలా ఉంది: *"బ్రహ్మ వాదినో వదంతి కిం కారణం బ్రహ్మ"* (శ్వే.ఉ 1.1) ఆ

తరువాత, *"తే ధ్యాన యోగానుగతా అపశ్యన్ దేవాత్మ శక్తిం స్వగుణైః నిగూఢామ్"* (శ్వే.ఉ 1.3) అని సూచింపబడింది. వాక్యశేషంలో *"మాయాం తు ప్రకృతిం విద్యాన్మాయినం తు మహేశ్వరమ్"* (శ్వే.ఉ 4.4) అని చెప్పిన తరవాత, *"యో యోనిం యోనిం అధితిష్ఠత్యేకః"* అని పరమాత్మ నిర్దేశం జరిగింది. సర్వప్రాణులకు కారణ భూతమైన అవ్యాకృతరూపంలో ఉన్నటువంటి పరమేశ్వర శక్తియే ఈ విధంగా చెప్ప బడినట్లు బ్రహ్మవాదులంతా గ్రహిస్తారు. పరమేశ్వర శక్తికి కార్యరూపములైన తేజో అబన్నాదులు, ఆ అనిర్వచనీయమైన శక్తికి వివర్తరూపములని కూడా శ్రుతి వల్ల తెలుస్తున్నది.

## సూ: 1.4.10 కల్పనోపదేశాచ్చ మధ్వాదివదవిరోధః

ఇక్కడ 'అజా' శబ్దాన్ని మేక నుద్దేశించి కాని, ప్రధానాన్ని ఉద్దేశించి కాని చెప్పినట్లు గ్రహించటం సబబు కాదు. కాల్పనికంగా ఉపదేశించటానికి తేజో అబన్నాదుల లక్షణమైన భూతప్రకృతిని నిర్దేశించినట్లు గ్రహించవచ్చు. భూతప్రకృతి కూడా చరాచర రూపంలో సమస్తకార్య సముదాయాన్ని ఉద్భవింపజేస్తుంది. ఒక జీవుడు అవిద్య చేత సంసారిగా బంధంలో పడి చిక్కుకుంటాడు. మరోజీవుడు జ్ఞాన సాధనతో బంధం నుండి విముక్తి కోరుకుంటూ మోక్షగామి అవుతాడు. ఈ విధంగా, బంధ–మోక్ష వ్యవస్థల ఉపన్యాసమే జరిగినట్లు తెలుస్తున్నది. *"ఏకోదేవః సర్వ భూతేషు గూఢః సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా"* (ఛా.ఉ 3.1) అని ముందు సూత్రాలలో చెప్పినట్లు ఉపాధుల వలనే నామరూపాలలో భిన్నత్వం కాని సర్వాత్మకమైన పరమాత్మ అంతటా వ్యాపించి ఉంది.

ఈ ఉపనిషత్తుల సారాంశమే ఇక్కడ కూడా చెప్పబడింది. ద్యులోకాలకు అగ్నిత్వం, ఆదిత్యునకు మధుత్వం, వాక్కుకు ధేనుత్వం కల్పించి ఎలా బోధింపబడిందో, అదేవిధంగా తేజో అబన్నాదుల ప్రతిరూపమైన పరమాత్మకు 'అజా' శబ్దం కల్పించబడింది.

## 3. సంఖ్యోపసంగ్రహాధికరణమ్

## సూ: 1.4.11 న సంఖ్యోపసంగ్రహాదపి నానాభావాదతిరేకాచ్చ

(సంఖ్యోప సంగ్రహాదపి + న + నానాభావాత్ + అతిరేకాచ్చ)

సంఖ్యను గ్రహించినందు వల్ల కూడా ప్రధానాదులకు పంచవింశతి తత్త్వాలలో సంఖ్య అధికంగా కావటం వల్ల కుదరదు అని సూత్రార్థం.

ముందు ఉదహరించిన అజా శబ్దం ప్రధానమును వ్యక్తం చెయ్యదు అని నిర్ణయించడమైనది. అయినా, సాంఖ్యవాదులు మరో శ్రుతిని ఉదహరిస్తూ వారి వాదన కొనసాగిస్తున్నారు. *"యస్మిన్ పంచ పంచ జానాః ఆకాశశ్చ ప్రతిష్ఠితః తమేవ మన్య ఆత్మానం విద్వాన్ బ్రహ్మ అమృతోఽమృతమ్"* (దేనియందు పంచ పంచ జనాలు, ఆకాశము నిలిచి ఉన్నాయో, దానినే ఆత్మగా భావిస్తున్నాను. ఈ విధంగా నాశరహితమైన బ్రహ్మమును తెలుసుకొని నేను అమృతుడైనాను – బృ.ఉ 4.4.17). జనకుడు—యాజ్ఞవల్క్యునకు చేసిన ఆత్మోపదేశం గురించి చెప్పిన శ్రుతిలో ఇలా వినబడుతున్నది. ఈ మంత్రంలో పంచ పంచ అనే పదాలను 5×5=25 గా స్వీకరించి ఇవి మూలప్రకృతిని – 25 తత్త్వాలను సూచిస్తున్నట్లు సాంఖ్యుల వాదన. సాంఖ్య కారికలో తత్త్వాల విశదీకరణ ఇలా చెయ్యబడింది: *"మూలప్రకృతి రవికృతిర్మహదాద్యాః, ప్రకృతి వికృతి యః సప్త షోడశశ్చ వికారో న ప్రకృతిః, న వికృతిః పురుషః"* (సాం.కా 4). సూక్ష్మంగా చెప్పాలంటే దీని అర్థం: ప్రధానము మూలప్రకృతి. అది అన్నింటికి కారణం – ప్రకృతి. కాని దేనికి కార్యం వికృతి కాదు. ఏడు అనగా మహత్, అహంకారం, పంచభూత తన్మాత్రలు, ప్రకృతి —వికృతులు. మహత్తు ప్రధానం నుండి పుట్టింది కాబట్టి అది ప్రధానమునకు వికృతి అవుతుంది. మహత్తు నుండి అహంకారం పుట్టింది. అందుచేత మహత్తుకు అహంకారం (లేక తమస్సు) వికృతి. అలాగే తమస్సు (అహంకారం) నుండి పంచ జ్ఞానేంద్రియాలు, పంచకర్మేంద్రియాలు, మనస్సు పుట్టాయి. వీటికి అహంకారం ప్రకృతి. పంచతన్మాత్రల నుండి పంచస్థూల మహాభూతాలు పుట్టటం వలన వాటికి మహాభూతాలు ప్రకృతులు. ఏకాద (11) ఇంద్రియాలు, పంచస్థూల మహా భూతాల నుండి ఏ తత్త్వాలు పుట్టలేదు. అలాగే పృథివ్యాదుల నుండి వృక్షములు, తదితరములు పుట్టినా, అవి వికృతులే కాని ప్రకృతులు కావు.

ముందు చెప్పిన శ్రుతిలో పంచజన శబ్దంతో రూఢ్యర్థాన్ని చెప్పుకోవాలా, లేక యౌగికంగా సాంఖ్య తత్త్వాలను సమన్వయించుకోవాలా అన్నదే పూర్వపక్షి సంశయం.

**సిద్ధాంతం :**

పంచవింశతి (25) తత్త్వాలు భిన్న భిన్నములు. వాటిని ఐదేసి వంతున విభక్తం చెయ్యటం, మళ్లీ ఆ పంచభాగాలను కలిపి 5×5=25 అని స్థిరీకరించటం కుదరదు. అది ముఖ్య ప్రాతిపదికను వదలి మరేదో చెప్పినట్లవుతుంది.

ఆత్మ అనగా చేతనుడైన పురుషుడు, ఈ పంచవింశతి తత్త్వాలలో అంతర్గతంగా చెప్పబడింది. అలాగే, ఆకాశాన్ని కూడ వేరే తత్త్వంగా గ్రహిస్తే, సంఖ్య పెరిగిపోయి మూల సిద్ధాంతానికే విరుద్ధమవుతుంది. అందువల్ల *"పంచ—పంచ జనాః"* అనే శ్రుతి, సాంఖ్యుల 25 తత్త్వాలను సూచించదు. అయితే, ఈ పంచజనాః ఎవరు అన్నది ముందు సూత్రంలో బాదరాయణుల వారు ఇలా సూచిస్తున్నారు.

## సూ: 1.4.12 ప్రాణాదయో వాక్యశేషాత్

*"యస్మిన్ పంచ పంచ జనాః"* అనే మంత్రం తరవాత, వాక్యశేషంలో బ్రహ్మస్వరూపం నిర్దేశిస్తూ ఇలా చెప్పబడింది: *"ప్రాణస్య ప్రాణం ఉత చక్షుషశ్చక్షుః ఉతశ్రోత్రస్య శ్రోత్రం అన్నస్యాన్నం మనసో యే మనో విదుః"* (ప్రాణానికి ప్రాణం, నేత్రాలకు నేత్రం, శ్రోత్రానికి శ్రోత్రం, అన్నానికి అన్నం, మనస్సుకు మనస్సు అయిన దానిని ఎవరు తెలుసుకుంటున్నారో! – బృ.ఉ 4.4.18). ఇక్కడ ప్రాణాలతో పాటు ఐదు చెప్పబడ్డాయి. వాక్యశేషంలో ఈ ఐదు సమీపంలో ఉన్నందు వల్ల

ప్రాణాదులనే పంచజనాః అని గ్రహించటం సబబుగా ఉంటుంది; ఛాందోగ్యంలో *"యే వా ఏతే పంచ బ్రహ్మ పురుషాః"* (ఛా.ఉ 3.13.6), అనే శ్రుతిలో జనవాచకమైన పురుషశబ్దం ప్రాణాలను ఉదహరిస్తునే చెప్పబడింది. అదే ఉపనిషత్తులో బ్రాహ్మణ భాగంగా *"ప్రాణోహి పితా ప్రాణోహి మాతా"* (ఛా. 7.15.1) అని కూడా శ్రుతిలో వినబడు తున్నది. వేదమంత్రాలకు, ఇలా వాక్యశేషంలో ఉన్న ప్రసిద్ధమైన పదము ననుసరించి, ముందున్న సందేహాత్మక వాక్యానికి అర్థం చెప్పుకోవటం జరుగుతుంది. పంచజనాః అనే పదానికి కొందరు వ్యాఖ్యాతలు మరికొన్ని అర్థాలు సూచించటం జరిగింది. అయితే సూత్రకారులు పంచవింశతి తత్త్వాలను నిరాకరించటానికే *"ప్రాణాదయో వాక్యశేషాత్"* అనే సూత్రం చెప్పినట్లు గ్రహించాలి.

## సూ: 1.4.13 జ్యోతిషైకేషామసత్యన్నే

(ఏకేషాం అసతి అన్నే జ్యోతిషా)

కాణ్వశాఖీయులకు అన్నభక్షణ లేదు. వారు బ్రహ్మస్వరూపంగా క్రిందపడిన ఫలాలనే భుజిస్తారు. అందువల్ల ఆ శాఖకు చెందిన వేదవాదులు జ్యోతిస్ శబ్దం చేత అన్వయించుకొని ఇలా మరో శ్రుతి వాక్యాన్ని స్వీకరించి అన్నానికి బదులు జ్యోతిస్ శబ్దాన్ని కలుపుకొని బ్రహ్మస్వరూపంగా ఈ మంత్రాన్ని ఉదహరిస్తారు: *"తద్దేవా జ్యోతిషాం జ్యోతిః"* (పరబ్రహ్మనే సూర్యాది దేవతలుకూడ జ్యోతిస్సు అని ఉపాసిస్తారు – బృ.ఉ 4.4.16). కొందరు శాఖీయులు, ముందున్న వాక్యం అనుసరించి, మరి కొందరు తరువాత వస్తున్న వాక్యశేషాన్ని బట్టి వాడుకలో లేని శబ్దాలకు అర్థం చెప్పుకోవటం యుక్తమా అని పూర్వపక్షి ప్రశ్నిస్తే ఇలా సమాధానం చెప్పడమైనది: మాధ్యందినులు ఒక విధంగాను, కాణ్వశాఖీయులు మరో విధంగాను అన్వయించు కున్నా, వారంతా బ్రహ్మము జగత్కారణం అని విశ్వసించే వారే. సాంఖ్యుల ప్రధాన పరమైన సిద్ధాంతాన్ని మాధ్యందినులు కాని, కాణ్వులు కాని సమర్థించరు. అందువల్ల వివాదమే లేదు.

## 4. కారణత్వాధికరణమ్

## సూ: 1.4.14 కారణత్వేన చాకాశాదిషు యథావ్యపదిష్టోక్తేః

[ఆకాశాదులందు బ్రహ్మ కారణత్వాన్ని ఎలా సమానంగా అన్ని వేదాంతభాగాలలో చెప్పబడిందో అదే విధంగా స్రష్ట (సృష్టికర్త) విషయంలోను శ్రుత్యంతరంలో ఎట్టి భేదాభిప్రాయమూ లేదు అని సూత్రార్థం.]

వేదాంత వాక్యాలన్నింటిలోను బ్రహ్మప్రతిపాదనలో సామాన్యగతి ఉందని ముందు స్పష్టం చెయ్యబడింది. అలాగే సాంఖ్య ప్రతిపాదితమైన ప్రధానమునకు శ్రుతి ప్రామాణ్యం లేదు అని కూడా నిర్ధారించడమైనది. అయినా, ఇక్కడ మరో విధమైన ఆక్షేపణ చెయ్యబడుతున్నది. సృష్టిక్రమ విషయంలో అన్ని ఉపనిషత్తులందు ఒకే ప్రస్తావన లేదు. భిన్న భిన్న అభిప్రాయాలు వ్యక్తమౌతున్నాయి.

తైత్తిరీయంలో *"ఆత్మనః ఆకాశః సంభూతః"* (పరమాత్మ వలన ఆకాశము సంభవించింది – తై.ఉ 2.1) అని వినబడుతుంటే, ఛాందోగ్యంలో *"తత్తేజో–సృజత"* (ఛా.ఉ 6.2.3), ప్రశ్నోపనిషత్తులో *"స ప్రాణ మసృజత ప్రాణాత్ శ్రద్ధామ్ "* (ప్ర.ఉ 6.4) అని ఉంది. ఐతరేయంలో *"స ఇమాన్ లోకాన్ అస్పజత అంభో మరీచిర్మర మాపః"* (పరమేశ్వరుడు స్వర్గము, అంతరిక్షము, మర్త్యలోకము, పాతాళలోకములను సృష్టించెను – ఐ.ఉ 4.1.2). ఇందులో ఎటువంటి క్రమమూ చెప్పబడలేదు. *"అసద్వా ఇదమగ్ర ఆసీత్ తతో వై సదజాయత"* (తై.ఉ 2.7) ప్రారంభంలో ఇదంతా అసత్ గానే ఉండేది, దాని నుండి సత్ పుట్టింది. ఛాందోగ్యంలో *"అసదేవ ఇదమగ్ర ఆసీత్, తత్సదాసీత్ తత్సమభవత్"* (ప్రారంభంలో ఇదంతా అసత్ గానే ఉండేది. అది సద్రూపమయి జగత్తుగా ఆవిర్భవించింది – ఛా.ఉ 3.19.1). మరికొన్ని శ్రుతుల్లో *"తద్ధైక ఆహుః అసదేవ ఇదమగ్ర ఆసీత్"* [కొందరు ఇదంతా అసత్ (శూన్యంగా) ఉండేదంటారు] ఇలా ఆరంభించి తదుపరి *"కుతస్తు ఖలు సోమ్య! ఏవం స్యాదితి హోవాచ, కథం అసతః సత్ జాయేతేతి, సత్త్వేవ సోమ్య ఇదమగ్ర ఆసీత్"* అని ఛాందోగ్యంలో వినిపిస్తున్నది (ఛా.ఉ 6.2.2). (అసత్ నుండి సత్ ఎలా పుడుతుంది అన్నదే ప్రశ్న. ఓ సౌమ్యుడా! ప్రారంభంలో కూడా ఇదంతా సత్‌గానే ఉండేది. ఇక్కడ అసద్వాదాన్ని (శూన్యవాదాన్ని నిరాకరిస్తూ) సత్ పూర్వకమైన జగత్ సృష్టి యొక్క ప్రస్తావనే జరిగింది. అలాగే *"తద్ధేదం తర్హి అవ్యాకృత మాసీత్, తత్ నామరూపాభ్యామేవ వ్యాక్రియత"* (సృష్టి అంతా మొదట్లో అవ్యాకృతంగానే ఉండేది. అది నామరూపాల చేత వ్యక్తమయింది – బృ.ఉ 1.4.7).

**పూర్వపక్షి :**

ఇక్కడ ఉదహరించిన శ్రుతుల్లో సృష్టిక్రమ సంబంధమైన విషయంలో విగానం (భిన్నత్వం) వినబడుతున్నది. వేదాంత వాక్యాలన్నింటిని గ్రహిస్తే, జగత్కారణం బ్రహ్మము అని నిర్దిష్టంగా చెప్పబడదు. మరేదైనా కారణాన్ని యుక్తితో సమన్వయించు కోవచ్చును. అది ప్రధానమైనా కావొచ్చును, మరేదైనా కావొచ్చును అని తోస్తున్నది.

**సిద్ధాంతం :**

ఆకాశాది ఆవిర్భావక్రమంలో కొంత వ్యత్యాసం శ్రుతుల్లో వినబడుతున్నా సృష్టికర్త–స్రష్ట విషయంలో ఎటువంటి విగానం ఉపనిషత్తుల్లో లేదు. అన్ని వేదాంతములు కారణభూతమని సర్వజ్ఞుడు, సర్వాత్మ, శక్తిమయుడు, అద్వితీయుడు అని నిర్దేశించిన పరమేశ్వరుణ్ణే స్రష్టగా చెప్తున్నాయి. *"సత్యం జ్ఞాన మనంతం"* అని బ్రహ్మలక్షణాలను చెప్పి, తదనంతరము *"సోఽకామయత బహుస్యాం ప్రజాయేయ"* అని సృష్టికర్తగా పరమేశ్వరుని కోరిక మనసులో మాట వ్యక్తం చేసి, చేతన స్వరూపమైన పరబ్రహ్మయే స్వతంత్రంగా జగత్ నిర్మాణానికి కారణమని స్పష్టం చేయబడింది. 'స్రష్టగా' ఈశ్వరుడే ఉపాధి పరంగా సర్వభూతములందు ఉండే ప్రత్యగాత్మగా కూడా చెప్పడమైనది. నామ–రూప భేదములతో వ్యాకృతమైన స్రష్టకు– సృష్టింపబడిన జీవులకు భేదము లేదు అని బోధిస్తూ, *"ఇదం సర్వ మసృజత యదిదం కించ"* (కార్యజగత్తులో నున్న స్థావర–జంగములన్నీ ఆ పరమాత్మ వల్లే సృజింపబడినవి) అని చెప్పడం స్పష్టంగా శ్రుతులలో వినబడుతున్నది.

బ్రహ్మము యొక్క కారణ స్వరూపాన్ని ప్రతిపాదించి, బ్రహ్మమే కార్య సముదాయ నిర్మాణానికి నిమిత్త కారణమని

కూడా, శ్రుతులు అన్ని వేదాంతములందు ఒకే విధంగా విన్పిస్తున్నాయి. కార్యసముదాయ ఆవిర్భావక్రమంలో కొంత వ్యత్యాసం (విగానం) ఉన్నంత మాత్రాన కారణబ్రహ్మ నిర్దేశం తృణీకరించటం యుక్తం కాదు. కొన్ని చోట్ల ఆకాశాది క్రమము, మరికొన్ని చోట్ల తేజసాది క్రమము శ్రుతిలో ఉంది. కాని కార్యము ప్రతిపాద్యము, ముఖ్యాంశము కాదు. ఉపక్రమోపసంహారాలలో కూడా సర్వవేదాంతాలలో ప్రధాన ప్రతిపాద్యం బ్రహ్మమనే గ్రహించాలి. సృష్ట్యాది ప్రపంచం, బ్రహ్మమును, తల్లక్షణాలను తెలుసుకోటానికి ఉపకరించేదే. శ్రుతిలో ఈ విషయం ఇలా వినబడుతున్నది: *"అన్నేన సోమ్య శుంగేన ఆపో మూల మన్విచ్ఛ, అద్భిః సోమ్య శుంగేన తేజో మూలమన్విచ్ఛ, తేజసా సోమ్య శుంగేన సన్మూల మన్విచ్ఛ"* [ఓ సౌమ్య! అన్నంతో పృథివిని, దానికి మూలమైన నీటిని, నీటికి మూలమైన తేజస్సును, తేజస్సుకు మూలమైన సత్‌ను (బ్రహ్మమును) తెలుసుకో – ఛా.ఉ 3.8.4 ]. ఒక కార్యము యొక్క చిహ్నముతో దాని కారణరూపాన్ని, అలా చివర వరకు వెతుక్కుంటూ పోతే సర్వానికి మూలమైన అద్వితీయమైన బ్రహ్మమునే గుర్తించవచ్చు అని దీని భావము. మాండూక్య కారికలో గౌడపాదాచార్యుల వారు ఇలా విశదీకరించారు: *"మృత్‌లోహ విస్ఫులింగాద్యైః సృష్టిర్యా చోదితాన్యథా । ఉపాయః సోఽవతారాయ నాస్తి భేదః కథంచన"* (మృత్ లోహము–విస్ఫులింగాలు మొదలైన ఉదాహరణలతో కారణము– కార్యము వేరువేరుగా చెప్పబడ్డాయి. కాని జగత్ సృష్టిలో అన్నింటికి మూలకారణమైన జీవ–పరమాత్మ ఏకత్వ విషయంలో భేదములేదు – మా.కా. 3.25). *"బ్రహ్మవిదాప్నోతి పరమ్"* , *"తరతిశోకమ్"* , *"తమేవ విదిత్వాఽతిమృత్యుమేతి"* ఇటువంటి శ్రుతి వచనాలు బ్రహ్మమును తెలుసుకున్నవారు మోక్షమును పొందుతారు అని నిర్వివాదముగా పలుకుతున్నవి.

## సూ: 1.4.15 సమాకర్షాత్

*"అసద్వా ఇదమగ్ర ఆసీత్"* (ఇదంతా మొదట్లో అసత్ గానే ఉండేది). ఈ విషయంలో కొన్ని భేదశ్రుతులున్నాయి అన్నది అంగీకారమే. కాని 'అసత్' అనే శబ్దంతో శూన్యవాదుల 'తుచ్ఛము' అనే అర్థంతో అన్వయించుకోబడదు. *"అసద్వా ఇదమగ్ర ఆసీత్"* అని చెప్పిన వెన్వెంటనే *"అసన్నేవ స భవతి ఆసత్ బ్రహ్మేతి వేదచేత్, అస్తి బ్రహ్మేతి చేద్వేద సంతమేనం తతో విదుః"* [ఎవడు బ్రహ్మ అసత్ అని భావిస్తాడో, అతడు కూడా అసన్ (అస్తిత్వం లేనివాడౌతాడు). బ్రహ్మ ఉనికిని తెలుసుకున్నప్పుడు తన ఉనికిని తెలుసుకుంటాడు] అని దీని భావన. సద్రూపమైన బ్రహ్మమును, అన్నమయకోశాదులను వర్ణించి తద్వారా లోపలున్న హృదయాకాశంలో ప్రత్యగాత్మను నిర్దేశించటం జరిగింది. బ్రహ్మము సత్పదార్థమైనా నామరూపాలతో వ్యాకృతము కాక పూర్వము అసత్తులాగే వ్యవహరించేది. *"తత్సదాసీత్"* (అదే సత్పదార్థంగా నామరూపాలతో జగత్తులో వ్యాకృతమైంది). ముందుగానే ఉద హరించిన, *"తద్ధైక ఆహుః అసదేవ ఇదమగ్ర ఆసీత్"* అనే శ్రుతిలో అన్య మతస్థుల (శూన్యవాదుల) అభిప్రాయం చెప్పి దానిని ఖండిస్తూ సత్పక్ష వాదన యొక్క స్థిరీకరణ చేస్తూ *"తతో వై సదజాయత"* అని స్పష్టం చేయబడింది. బృహదారణ్యక శ్రుతిలో ఎక్కడైతే *"తద్ధేదంతర్హి అవ్యాకృత మాసీత్"* అని ఉందో అక్కడే *"స ఏష ఇహ ప్రవిష్ట ఆనఖాగ్రేభ్యః"* అని విన్పిస్తున్నది [అవ్యాకృతరూపంలో నున్న ఆ పరమేశ్వరుడే ఇక్కడ శరీరంలో నఖాగ్రం వరకు వ్యాపించి (చేతనస్వరూపంతో) ఉంటాడు].

ఘటాది నిర్మాణానికి కులాలుడు, బంగారాది ఆభరణాలకు స్వర్ణకారుడు నిమిత్త కారణమైనట్లే, నామ–రూపాలలో ప్రాణులు వ్యాకృతమవటానికి పరమాత్మ కారణం. అయితే, జగత్ సృష్టికి పరమాత్మ ఉపాదానకారణము–నిమిత్తకారణమూ అని చెప్పబడినట్లు గ్రహించాలి. *"అనేన వ్యాకరవాణి"* అనే మరో శబ్దం ద్వారా, జగత్సర్వం పరమాత్మ యొక్క వ్యాకృతం వల్ల నిర్మింపబడింది, అని సర్వాధ్యక్షుడైన బ్రహ్మనుద్దేశిస్తునే చెప్పబడింది.

# 5. బాలాక్యధికరణమ్

## సూ: 1.4.16 జగద్వాచిత్వాత్

**పూర్వపక్షి :**

కౌషీతక బ్రాహ్మణంలో బాలాకి–అజాతశత్రుల సంవాదం ఉంది. అక్కడ శ్రుతిలో ఇలా వినబడుతున్నది: *"యో వై బాలాక ఏతేషాం పురుషాణాం కర్తా యస్య వై తత్ కర్మ స వేదితవ్యః"* (ఓ బాలాకీ! పురుషులందరికి ఎవడు కర్తయో, ఈ జగత్తు ఎవని కార్యమో, అతడే తెలిసికొనవలసినవాడు – కౌ.బ్రా 4.29). ఈ సందర్భంలో 'వేదితవ్యం' అనే పదంతో బాలాకిని అజాతశత్రుడు ఎవరి గురించి అడుగుతున్నాడు? ముఖ్యప్రాణమా? జీవుడా? పరమాత్మయా? ముఖ్యప్రాణమనే తోస్తున్నది. కారణం మరొక సందర్భంలో శ్రుతిలో చేతన సంబంధిత కర్మయావత్తు ప్రాణాన్నే ఆశ్రయించి ఉంటుందని తెలియజేస్తున్నది. వాక్యశేషంలో కూడ *"అథాఽస్మిన్ ప్రాణ ఏవ ఏకధా భవతి"* అని ప్రాణ శబ్దంతోనే కర్మ గురించి చెప్పబడింది. బాలాకి అంతకుముందు *"ఆదిత్యే పురుషః చంద్రమసి పురుషః"* (ఆదిత్యునిలోనున్న పురుషుడు, చంద్రునిలోనున్న పురుషుడు) అని దేవతాదుల ప్రాణావస్థ, ఆయుష్షు గురించే చెప్పినట్లు వినబడుతున్నది కదా!

బృహదారణ్యకంలో శాకల్యుడు – యాజ్ఞవల్క్యునికి జరిగిన సంవాదంలో కూడా *"కతమ ఏకో దేవ ఇతి, ప్రాణ ఇతి. స బ్రహ్మ త్యత్ ఇత్యాచక్షతే"* (ఆ ఒక్క దేవుడు ఎవరు? ప్రాణము అదే బ్రహ్మ–త్యత్–వదలిపెట్టేది, అని చెప్పబడుతున్నది – బృ.ఉ 3.9.9). అయితే జీవుడు అనే సందేహం *"యస్య వై తత్ కర్మ"* అనే వాక్యం వలన కలుగుతున్నది. కర్మను బట్టే కదా జీవుడి యొక్క సుఖదుఃఖాలు కలుగుతాయి. భోక్తగా జీవుడు పరిగణింపబడడం కూడా కర్మ యొక్క కర్తగానే కదా?

బాలాకికి – అజాతశత్రుడు నిద్రపోతున్న (సుషుప్తిలో ఉన్న) పురుషుణ్ణి పిలవగా ఆ వ్యక్తికి తెలివిరాదు. అందువల్ల, ప్రాణం కర్త కాదు అని చెప్పి నిద్రపోతున్న వ్యక్తిని కర్రతో కొట్టి లేపి, కర్మ చేసే కర్త వేరొకటి అని ఆత్మ గురించి విశదీకరిస్తాడు. ఆ సందర్భంలో *"తద్యథా శ్రేష్ఠీ స్వైః భుంక్తే, స్వాః శ్రేష్ఠినం భుంజంతి, ఏవమేవ ఏష ప్రజ్ఞాత్మా ఏతైః ఆత్మభిః భుంక్తే, ఏవమేవ ఏత ఆత్మాన ఏత మాత్మానం భుంజంతి"* [ముఖ్యుడైన ఓ ఇంటిపెద్ద (గృహస్థు), యజమానిగా ఏ విధంగా తనవాళ్లను తన చెప్పుచేతల్లో ఉంచుకుంటూ అనుభవిస్తాడో, ఆ యజమాని మీద ఆధారపడి ఉన్న వాళ్లంతా ఎలా అనుభవిస్తుంటారో, అలాగే ఈ జీవుడు ఆదిత్యాది పురుషులు అధిష్ఠాన దేవతలుగా ఉండే సాధనాలన్నింటిని ఉపయోగించుకొని భోగాలను అనుభవిస్తాడు. ఆ అధిష్ఠానదేవతలే జీవుణ్ణి అనుభవిస్తాయి – కౌ.బ్రా 4.20 ]. జీవుడు ప్రాణధారణ చేసినవాడు, కాబట్టి అతని విషయంలోనే ప్రాణశబ్ద అన్వయం యుక్తము. ప్రాణం రూపం లేని పరమాత్మ విషయంలో కుదరదు. అందువల్ల 'వేదితవ్యమనే' పదంతో జీవుడు అనో, ముఖ్యప్రాణమనో చెప్పుకోవలసి ఉంటుంది.

**సిద్ధాంతం :**

ఇక్కడ సందర్భోచితంగా పరమాత్మనే పురుషుల కర్తగా గ్రహించాలి. ఉపక్రమంలో బాలాకి, అజాతశత్రుతో *"బ్రహ్మతే బ్రవాణి"* (నీకు బ్రహ్మ గురించి చెబుతాను) అని గొప్పలు పలికి, ఆదిత్యాది కొందరి దేవతలనే చెప్పి ఊరుకుంటాడు. ఆ సందర్భంలో అజాతశత్రు *"మృషా వై ఖలు మా సంవిదిష్ఠా బ్రహ్మతే బ్రవాణి"* నీవల్ల కానటువంటి అసత్య ప్రతిజ్ఞలు చెయ్యకు. నువ్వు పురుషుల అందరి యొక్క కర్తను తెలుసుకోవాలి. అతనే బ్రహ్మ అని బ్రహ్మోపదేశం చేస్తాడు. పరమేశ్వరుడే స్వతంత్రంగా సమస్త సృష్టి చెయ్యగల సమర్థుడు. అందరి పురుషుల యొక్క నిర్మాణము పరబ్రహ్మకే సాధ్యము అని స్పష్టం చేస్తాడు.

*"యస్య వై తత్కర్మ"* అనే వాక్యం ధర్మాధర్మ సంబంధిత కర్మను కాని చేతన సంబంధిత కార్యకలాపాలను కాని నిర్దేశించదు. ఇక్కడ సృష్టికార్యం కూడా చెప్పబడలేదు. *"ఏతత్ కర్మ"* అని నపుంసక వచనంలో ఉంది కాబట్టి పురుష నిర్దేశం కూడా కుదరదు. *"ఏతేషాం పురుషాణాం"* అని బహువచనంలో ఉంది కాబట్టి పురుషుల యొక్క కర్త పరమేశ్వరుడనే సమన్వయించుకోవాలి. సర్వజగత్తుకు పరమేశ్వరుడే కర్తగా అన్వయించుకుంటే, పురుషులూ జగత్తులో ఒక భాగంగా

అంతర్గతమై ఆదిత్యాది దేవతాపురుషులు, మనుష్యులూ అంతా వ్యక్తమై అది బ్రహ్మనిర్దేశము అని చెప్పటం యుక్తము.

## సూ: 1.4.17 జీవముఖ్యప్రాణలింగాన్నేతి చేత్తద్వ్యాఖ్యాతమ్

జీవ–ప్రాణలింగాలు *"అథాస్మిన్ ప్రాణ ఏవైకధా భవతి"* , *"తద్యథా శ్రేష్ఠీ"* అని శ్రుతిలోను వినిపిస్తున్నాయి అనే ఆక్షేపణ పూర్వపక్షి ఈ అధికరణంలో ముందు చెయ్యడం అయింది. అయితే ఇదే విధమైన ఆక్షేపణ ప్రతర్దనాధికరణంలో *"జీవముఖ్య ప్రాణలింగాన్నేతి చేన్నోపాస్త్రై విధ్యాదాశ్రితతత్వాదిహ తద్యోగాత్"* (బ్ర.సూ 1.1.31.) అనే సూత్రంలో పరిష్కరింపబడింది. ఉపక్రమ ఉపసంహారాలను పరిశీలిస్తే బ్రహ్మ విషయమే బోధనాంశము అని స్పష్టం అవుతున్నది. జీవోపాసనం, ముఖ్య ప్రాణో పాసనం, బ్రహ్మోపాసనం – అని మూడు విధాలైన ఉపాసనలను ప్రస్తావించటం జరిగేది. అలాంటి ప్రసక్తే కనబడదు. *"సర్వాన్ పాప్మనో–పహత్య సర్వేషాంచ భూతానాం శ్రైష్ఠ్యం స్వారాజ్యమాధిపత్యం పర్యేతి, య ఏవం వేద"* (ఈ విధంగా తెలుసుకున్న వాడు సమస్త పాపాలను పోగొట్టుకొని, సమస్త భూతములకు శ్రేష్ఠుడిగా, ఎవరి అధీనంలోను ఉండనవసరం లేని ఆధిపత్యాన్ని పొందుతాడు). *"ప్రాణ బంధనం హి సోమ్య మనః"* అనే ఛాందోగ్యశ్రుతిలో ప్రాణ శబ్దంతో బ్రహ్మనిర్దేశమే జరిగింది. అంతే కాకుండా జీవునకు–బ్రహ్మమునకు ఉన్న అభేదాన్ని, ఏకత్వాన్ని కూడా ఇక్కడ వ్యక్తం చెయ్యబడింది.

## సూ: 1.4.18 అన్యార్థం తు జైమినిః ప్రశ్నవ్యాఖ్యానాభ్యామపిచైవమేకే

జైమిన్యాచార్యులవారు జీవుని పరామర్శ, పరమాత్మ బోధన కొరకే చెయ్యబడిందని భావించారు. కాని, ఒక శాఖీయులు జీవాత్మ కంటె భిన్నమైనదిగా పరమాత్మను నిర్దేశిస్తున్నారు. బాలాకీ–అజాతశత్రు సంవాదంలో అజాతశత్రు ఆయతనం గూర్చి ప్రస్తావించిన సందర్భం ఉంది. అందులో *"క్వ ఏతత్ బాలాకే పురుషోఽశయిష్ట క్వ వా ఏతత్ భూత, కుత ఏతదాగాత్"* (బాలాకీ ఈ సుషుప్తిలో నున్న పురుషుడు చలనం లేకుండా దేని ఆధారంపై శయనించాడు, ఎవరితో కలిసి ఎక్కడికి వెళ్లిపోయాడు. మళ్లీ ఎక్కడ నుండి తిరిగి వచ్చాడు – కౌ.బ్రా 4.19). జీవాత్మ, సుషుప్త్యవస్థలో బ్రహ్మతో ఐక్యమై శాంతిస్తుందని, ప్రాణధారులంతా పరమాత్మ యొక్క అంశమని సర్వసామాన్యంగా అన్ని వేదాంతాలలోను చెప్పబడింది. ఏ పరమాత్మను చేరుకుంటే ఎట్టి దుఃఖమూ, వికారము ఉండదో, ఆ పరమాత్మను తెలుసుకోవటమే గమ్య లక్షణము. అదే, వేదితవ్యము(తెలియదగినది) అని చెప్పబడింది.

వాజసనేయశాఖకు చెందినవారు బృహదారణ్యకంలో ఉన్న బాలాకి – అజాతశత్రు సంవాదంలో ఇలా పఠిస్తున్నారు: *"య ఏష విజ్ఞానమయః పురుషః క్వ ఏష తదాభూత్ కుత ఏతదాగాత్"* (ఈ విజ్ఞానమయ పురుషుడు ఇంతసేపూ ఎక్కడ ఉన్నాడు? తిరిగి ఈ విధంగా ఏక్కడ నుండి వచ్చాడు?). ఈ ప్రశ్నలోను దానికి సమాధానమైన *"య ఏషోఽన్తర్హృదయ ఆకాశః తస్మిన్ శేతే"* (లోపలనున్న హృదయాకాశంలో శయనిస్తున్నాడు) అని చెప్పిన సందర్భంలో పరమాత్మ యొక్క నిర్దేశమే జరిగింది. *"దహరోఽస్మిన్ ఆకాశః"* అని దహరాకాశ శబ్దం తోను పరమాత్మనే తెల్పడమైంది. అలాగే, *"సర్వఏవ ఆత్మనో వ్యుచ్చరంతి"* (అన్ని ఆత్మలు పైకి పోతున్నాయి) ఉపాధి కారణంగా వేరు వేరు శరీరాలలో ఉండే ఆత్మలన్నీ స్వస్వరూపమయిన పరమాత్మనే చేరుకుంటాయి అని చెప్పటమే దీని తాత్పర్యము. ఈ సందర్భంలో బోధనాంశము ఆత్మతత్త్వము. జీవుని యొక్క ప్రసంగము కాని, ముఖ్యప్రాణము యొక్క ప్రతిపాదన కాని ఈ ప్రకరణంలో చెయ్యబడలేదు అని గ్రహించవలసి ఉంటుంది.

# 6. వాక్యాన్వయాధికరణమ్

## సూ: 1.4.19 వాక్యాన్వయాత్

**పూర్వపక్షి :**

బృహదారణ్యకోపనిషత్తులో యాజ్ఞవల్క్యునికి అతని భార్య మైత్రేయికి జరిగిన సంభాషణను పురస్కరించుకొని పూర్వపక్షి ప్రశ్న ఇలా ఉంది: *"న వా అరే పత్యుః కామాయ"* అని యాజ్ఞవల్క్యుడు ప్రారంభించి, *"న వా అరే సర్వస్యకామాయ సర్వం ప్రియం భవతి, ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి, ఆత్మా వా అరే ద్రష్టవ్యః, శ్రోతవ్యో, మంతవ్యో, నిదిధ్యాసితవ్యః, మైత్రేయీ! ఆత్మనో వా అరే దర్శనేన, శ్రవణేన, మత్యా, విజ్ఞానేన ఇదం సర్వం విదితమ్"* అని బోధిస్తాడు. (ఓ మైత్రేయీ! ప్రతీదానిపై కామము–ఇచ్ఛ–కోరిక దానిపై ఉన్న ప్రీతి–ఇష్టం వల్ల కలగదు. తన కొరకే – తన ఆత్మ తృప్తికే అది ప్రియము–ప్రీతికరమూ అవుతుంది. అందుచేత ఆత్మను పరామర్శించుకోవాలి, తెలుసుకోవాలి, మననం చేసుకోవాలి, పునః పునః తల్చుకొని నిదిధ్యాసనం చెయ్యాలి. ఆత్మదర్శనంతోను, శ్రవణంతోను, మననంతోను, విజ్ఞానంతోను సమస్తము తెలిసికొనబడుతుంది – బృ.ఉ 2.4.5, 4.5.6.).

ఈ సందర్భంలో *"ద్రష్టవ్యః, శ్రోతవ్యః, మంతవ్యః"* అని విజ్ఞానాత్మ ఉపదేశమా లేక పరమాత్మ యొక్క ఉపదేశమా చెయ్యబడింది? ఉపక్రమంలో ఉన్న ప్రీతి, భార్య–పుత్ర–విత్తాది కోరికలు భోక్తకు సంబంధించినవి. అందువల్ల, విజ్ఞానాత్మ అయిన శారీరుడే ఇక్కడ ప్రస్తావించబడినాడు అన్నట్లు తోస్తున్నది. అంతేకాదు ఈ శ్రుతి వినబడుతున్న ప్రకరణలోనే ముందు *"ఇదం మహద్భూతం అనంతం అపారం విజ్ఞానఘన ఏవైతేభ్యో భూతేభ్యః సముత్థాయ తాన్యేవ అనువినశ్యతి న ప్రేత్య సంజ్ఞాస్తి"* [అపరిచ్ఛిన్నము, అనంతము, సర్వవ్యాపి, చేతనమయమైన ఈ మహద్భూతము దేహాదిరూపంలో అన్ని భూతములలో పుట్టి మరణానంతరం దేహాదులలోనే ఏ సంజ్ఞ (చిహ్నము) విడవకుండా నశిస్తుంది – బృ.ఉ 2.4.12 ]. ఉపసంహారంలో కూడా *"విజ్ఞానతార మరే కేన విజానీయాత్"* అనే వాక్యంలో కూడా విజ్ఞానాత్మ ప్రస్తావనే ఉంది. అందువల్ల, ఆత్మజ్ఞానం భోగములన్నింటికి భోక్త అయిన శారీరుడిని గురించి ఔపచారికార్థంలో చెప్పినట్లు అన్వయించుకుంటే సరిపోతుంది.

**సిద్ధాంతం :**

సమగ్రంగా ఈ ప్రకరణంలో ఉన్న శ్రుతి వాక్యాలన్నిటినీ పరిశీలించి చూస్తే, ఇక్కడ పరమాత్మ బోధనే జరిగినట్లు స్పష్టం అవుతుంది. యాజ్ఞవల్క్యుడు ఆరంభంలోనే తాను గృహస్థాశ్రమాన్ని వదలి సన్యాసాశ్రమానికి వెళిపోతున్న కారణాన్ని *"అమృతత్వస్యతు న ఆశా అస్తి విత్తేన"* (ధనం వలన మోక్షము కలుగుతుందనే ఆశ లేదు) అని తన మనసులోమాట చెప్తాడు. అది గ్రహించిన విద్యావంతురాలైన మైత్రేయి *"యేనాహం న అమృతా స్యాం కిమిహం తేన కుర్యాం, యదేవ భగవాన్ వేద తదేవ మే బ్రూహి"* అని పలుకుతుంది (మోక్షగతిని ప్రసాదించని ధనముతో నాకూ ఏమి ప్రయోజనం? అందువల్ల పూజ్యులైన మీరు తెలుసుకొన్న మార్గాన్నే నాకు కూడా ఉపదేశించండి).

యాజ్ఞవల్క్యుడు అమృతత్వేచ్ఛ కలిగిన మైత్రేయిని ప్రశంసించి, ఆత్మ బోధనకు ఉపక్రమిస్తాడు. అట్టి సందర్భంలో పరమాత్మ ప్రస్తావనే సముచితం కాని విజ్ఞానాత్మ గురించి చెప్పటం కాదు. అందువల్లే *"బ్రహ్మ తం పరాదాత్ యో అన్యత్ర ఆత్మనో బ్రహ్మ వేద"* (ఎవడు తన ఆత్మ కంటె బ్రహ్మము భిన్నమని తలుస్తాడో, ఆ బ్రహ్మమే వానిని దూరం చేసి, అస్తిత్వం లేకుండా చేస్తుంది). *"ఇదం సర్వం యదయమాత్మా"* (సమస్త వస్తుసముదాయము–దృశ్య ప్రపంచంలో నున్నదంతా ఆత్మకు వ్యతిరిక్తము (భిన్నము) కాదు అని ఈ సందర్భంలోనే వివరించడమైనది. వీణావాద్యం, దుందుభి ఇత్యాది దృష్టాంతాలతో జరిగిన బోధన పరమాత్మ కన్నా భిన్నమైన జగత్తులేదు అని పునఃపునః చెప్పినట్లు గ్రహించవలసి ఉంది. *"అస్య మహతో భూతస్య నిఃశ్వసిత మేతత్ ఋగ్వేదః యజుర్వేదః సామవేదః"* (బృ.ఉ 4.5.11). ఈ శ్రుతిలో ఋగ్వేదాది వేదాలు, వేదాంగాలు, లోకాలు సర్వస్వం ఆ మహద్భూతమైన పరమేశ్వరుని యొక్క నిఃశ్వాసమే అని సృష్టిగురించి

చెప్పడమైంది. అలాగే జగత్తులో సమస్తము, నదులన్నీ సముద్రంలో నామరూపాలు కోల్పోయినట్లు పరమాత్మతో విలీనమయిపోతాయని ఏకాయన ప్రక్రియతో లయప్రస్తావన చెయ్యబడింది. అందువల్ల *"ద్రష్టవ్యః, శ్రోతవ్యః మంతవ్యః"* అనే వచనాలు పరమాత్మపరంగానే అన్వయించుకోవాలి.

## సూ: 1.4.20 ప్రతిజ్ఞాసిద్ధేర్లింగమాశ్మరథ్యః

(జీవేశ్వర తత్త్వాన్ని ఆశ్మరథ్యుడు, ఔడులోమి, కాశకృత్స్నుడు అనే ముగ్గురు ఋషుల అభిప్రాయాలతో సూత్రకారులు 1.4.20 నుండి 1.4.22 సూత్రాలలో పొందుపరచారు)

*"ఆత్మని విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి"* , *"ఇదం సర్వం యదయ మాత్మా"* అనేవి యాజ్ఞవల్క్యుని ప్రతిజ్ఞా వచనాలు. అందువల్ల, ప్రియాప్రియాలు ఉండే జీవుణ్ణి పరామర్శిస్తే ఈ ప్రతిజ్ఞ నెరవేరదు. విజ్ఞానాత్మ అయిన శారీరుడు పరమాత్మ కన్నా భిన్నమైతే పరమాత్మను తెలుసుకున్నా విజ్ఞానాత్మను తెలుసుకోబడదు. అప్పుడు *"ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞానం"* అనేది కుదరదు. జీవాత్మ–పరమాత్మ అభేదం తెలుసుకున్నప్పుడే *"ఇదం సర్వం యదయమాత్మా"* అనేది అవగతమవుతుంది.

జీవ–బ్రహ్మల మధ్య పరిచ్ఛిన్నము వలన భేదము గోచరిస్తుంది. కాని వాటి ధర్మాలలో సమానత్వం వలన అభేదమూ ఉంది. భేదాంశాన్ని దృష్టిలో ఉంచుకొని జీవాత్మతో మొదలుపెట్టి పరమాత్మ పరామర్శతో *"ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞానమ్"* అని బోధించటం సమంజసమని ఆశ్మరథ్యులవారి అభిప్రాయము.

## సూ: 1.4.21 ఉత్క్రమిష్యత ఏవం భావాదిత్యౌడులోమిః

ఔడులోమనే ఋషి దేహేంద్రియమనోబుద్ధుల సమూహమైన ఉపాధిని వదిలి జీవాత్మ–పరమాత్మతో లయం ఉత్ క్రాంతిలోనే జరుగుతుంది. అంతవరకు జీవుడు నామరూపాలతోనే ఉంటాడు. అందువల్ల, విజ్ఞానాత్మతో బోధించటం ఉపక్రమంలో అవశ్యము–భావ్యమని వారి అభిప్రాయం. *"ఏష సంప్రసాదోఽస్మాచ్ఛరీరాత్ సముత్థాయ పరం జ్యోతి రుపసంపద్య స్వేన రూపేణాభి నిష్పద్యతే"* (ఛా.ఉ 8.3.2) అనే శ్రుతిని ఈ సందర్భంలో ఉదహరిస్తూ చెప్పటం జరిగింది. అలాగే *"యథా నద్యః స్యందమానాః సముద్రేఽస్తం గచ్ఛంతి నామరూపే విహాయ తథా విద్వాన్ నామ రూపాద్విముక్తః పరాత్పరం పురుషముపైతి దివ్యమ్"* (నదులు సముద్రంలో నామరూపాలను త్యజించి కలసిపోయినట్లు, ప్రాజ్ఞుడు పరమాత్మను నామరూపాదులు లేకుండా చేరుకుంటాడు – ము.ఉ 3.2.8) అనే సూచిస్తున్నది. సంసారికి జీవాత్మ–పరమాత్మ భేదం స్పష్టంగా కనబడుతునే ఉంటుంది. లయంలోనే భేదం కనబడదు. అందువల్ల జీవాత్మ పరమాత్మల ఉపాధిపరమైన భేదస్వరూపాన్ని చూపించి బోధించటం యుక్తమని ఔడులోమి యొక్క అభిప్రాయము.

## సూ: 1.4.22 అవస్థితేరితి కాశకృత్స్నః

శారీరుడు రూపంలో పరమాత్మ ప్రవేశించి వ్యాకృతమయ్యేడు. అందువల్ల ఆ భేదం చూపుతూ ఉపక్రమించటంలో తప్పులేదని కాశకృత్స్నుడనే ఋషి చెప్తున్నారు. ఛాందోగ్యంలో *"అనేన జీవేనాత్మనానుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి"* (ఛా.ఉ 6.3.2), తైత్తిరీయంలో *"సర్వాణి రూపాణి విచిత్య ధీరో నామాని కృత్వా ఆభివదన్యదాస్తే"* (తై.ఆ 3.12.7) అనే శ్రుతిని వారు ఉదహరించారు. ఈ రెండు మంత్రాలు, పరమాత్మే జీవునిలో ప్రవేశించి ఉన్నాడు. అని చెప్తున్నాయి. అందువల్ల పరమాత్మ–జీవాత్మల ఏకత్వాన్ని 'తత్త్వమసి' అనే వాక్యంలో బోధించినట్లు చెప్పటమే శాస్త్రపరంగా ఉచితమని కాశకృత్స్నులవారి అభిప్రాయం.

పై మూడు సూత్రాలలో వివరించిన అభిప్రాయాలలో వ్యత్యాసం కనబడు తున్నది. కాని, జీవుని ఉత్పత్తి ఉపాధి కల్పితం అని అంగీకరించి సమన్వయించు కుంటే, పరమాత్మ దర్శనానికి అమృతత్వ సిద్ధికి మార్గం సులువవుతుంది.

విజ్ఞానాత్మ –పరమాత్మల మధ్య భేదభావం, అవిద్యాప్రభావం వల్ల వచ్చినదే; పారమార్థికము కాదు. కాబట్టి, సమ్యక్ జ్ఞానార్జనతో ఆత్మైకత్వం పొందబడుతుంది.

*"ఏకమేవాద్వితీయమ్"* , *"ఆత్మైవేదం సర్వమ్"* , *"బ్రహ్మైవేదం సర్వమ్"* , *"ఇదంసర్వం యదయమాత్మా"* , *"నాన్యోఽతోఽస్తి ద్రష్టా"*, *"నాన్యదతోఽస్తి ద్రష్టృ"* , –ఇత్యాది శ్రుతులు, *"వాసుదేవః సర్వమితి"* , *"సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరమ్"* ఇత్యాది గీతావచనాలు పారమార్థికాన్ని స్పష్టం చేస్తున్నవి.

ప్రకరణ ముందుభాగంలో ఉదహరించిన *"ఇదం మహద్భూతం అనంతం అపారం విజ్ఞానఘన ఏతేభ్యో భూతేభ్యః సముత్థాయ తాన్యేవాను వినశ్యతి న ప్రేత్య సంజ్ఞాస్తి"* అనే శ్రుతిలోను *"అత్రైవ మా భగవానమూముహన్న ప్రేత్య సంజ్ఞాస్తి"* (బృ.ఉ 2.4.13) అనే శ్రుతిలోను ఆత్మకు వినాశనమున్నట్లు విన్పిస్తున్నది అని పూర్వపక్షి సంశయం వ్యక్తం చెయ్యడమైంది. అయితే, ఈ సందర్భంలో వినాశ వచనం విశేష జ్ఞానం కోల్పోతుంది అని మాత్రమే సూచిస్తున్నట్లు యాజ్ఞవల్క్యుని సమాధానం బట్టి అర్థమౌతుంది. *"న వా అరే!ఽహం మోహం బ్రవీమి, అవినాశీ వా అరేఽయమాత్మాఽనుచ్ఛిత్తిధర్మా మాత్రా సంసర్గస్తు అస్య భవతి"* . ఈ ప్రత్యుత్తరంలో ఆత్మకు నాశనము లేదు. దానికి అహంకారాది వికారాలతో అవిద్య వలన సంబంధం కలుగుతుంది. ఆ సంబంధం విద్య–జ్ఞానసాధనతో పోతుంది అని, *"న ప్రేత్య సంజ్ఞాస్తి"* అనే వచనంలో ఆత్మ నిత్యత్వాన్ని మైత్రేయికి యాజ్ఞవల్క్యుడు విశదీకరిస్తాడు.

జీవాత్మ–పరమాత్మ భేదాన్ని ప్రతిపాదించటం బుద్ధిహీనతను చెప్పినట్లు అవుతుందని *"అన్యోఽసావన్యోఽహమస్మీతి న స వేద యథాపశుః"* (నేను వేరు పరమాత్మ వేరు అని భావించేవాడు సరిగ్గా అర్థం చేసుకున్నవాడు కాదు. వాడు పశువులాంటి వాడు – బృ.ఉ 1.4.10) అని శ్రుతిలో వినిపిస్తున్నది. అలాగే *"మృత్యోః స మృత్యుమాప్నోతి య ఇహ నానా ఇవ పశ్యతి"* (బృ.ఉ 4.4.19) అనే శ్రుతి జీవేశ్వరుల భేద దర్శనాన్ని విరోధిస్తున్నది. బ్రహ్మైకత్వం విశ్వసించనివారు ముముక్షు వులు కాజాలరు. ఏకత్వ భావనతో ఆత్మజ్ఞాన సాధనమే వేదాంత సారాంశము. *"వేదాంత విజ్ఞానేన సునిశ్చితార్థా"* (ము.ఉ 3.2.6), *"తత్ర కో మోహః కః శోకః ఏకత్వ మనుపశ్యతః"* (ఈ.ఉ 7) ఇత్యాది శ్రుతులు వేదాంత జ్ఞానంతో ఏకత్వాన్ని గ్రహించి శోక–మోహాలకు అతీతులౌతారు అనే బోధిస్తున్నవి. క్షేత్రజ్ఞుడైన జీవాత్మ –పరమాత్మలు అభిన్నమని చెప్పే వాక్యాలు భగవద్గీతలోను పలుచోట్ల ఉన్నాయి. మోక్షము కృత్రిమము, అశాశ్వతము అని నమ్మేవారు, జీవాత్మ–పరమాత్మ భేదాన్ని ఎత్తి చూపేవారు. వారు సమ్యగ్దర్శనానికి అవరోధము కల్పిస్తున్నారు. వారి మార్గము సుగమము కాదని భాష్యకారులు స్పష్టం చేస్తున్నారు.

## 7. ప్రకృత్యధికరణమ్

## సూ: 1.4.23 ప్రకృతిశ్చ ప్రతిజ్ఞాదృష్టాంతానుపరోధాత్

శ్రుతిలోను ప్రతిజ్ఞకు దృష్టాంతానికి అవరోధం లేనందు వలన బ్రహ్మ విశ్వసృష్టికి మూలకరణమని సూత్రార్థం.

**పూర్వపక్షి :**

ఇహ పరలోకాలలో సుఖభోగాలకు ధర్మాధర్మ వివేకము (ధర్మజిజ్ఞాస) ఏ విధంగా తెలిసికొనదగినదో, అదే విధంగా మోక్షప్రాప్తికి బ్రహ్మజ్ఞానం (బ్రహ్మజిజ్ఞాస) అవసరం అని ప్రథమాధ్యాయం మొదట్లో చెప్పబడింది. *"జన్మాద్యస్యయతః"* అనే సూత్రంలో బ్రహ్మలక్షణాలు వివరించబడ్డాయి. ఆ సందర్భంలో మృత్ (మన్ను) ఘటాదుల నిర్మాణానికి, సువర్ణం రుచకాది బంగారు ఆభరణాలకు ఉపాదానకారణము (మూలవస్తువు) అనే దృష్టాంతాలు చెప్పబడ్డాయి. మృత్, సువర్ణం మూలవస్తువులు అయినా ఘట, రుచకాదులు భిన్న భిన్న రూపాలలోకి స్వతంత్రముగా మారలేవు. ఘటాదుల నిర్మాణానికి కులాలుదు (కుమ్మరి), రుచకాదుల నిర్మాణానికి బంగారు పనివాడు (కంసాలి) నిమిత్త కారణంగా పరిగ్రహింపబడతారు. అదేవిధంగా, జగత్ ఆవిర్భావానికి బ్రహ్మము కేవలం నిమిత్తకారణమనే తోస్తున్నది. *"స ఈక్షాంచక్రే"* , *"స ప్రాణ మసృజత"* అనే శ్రుతివాక్యాలలో కార్యాచరణ ప్రణాళికను తయారు చేసుకొని పరమేశ్వరుడు జగత్కార్యం నిర్వహించినట్లు తెలుస్తున్నది. కుమ్మరి కాని, బంగారుపనివాడు కాని, తగిన సాధన సామగ్రిని (పనిముట్లు) ఉపయోగించే ఏ వస్తువునైనా, ఎలా చెయ్యాలో ఆలోచించే చేస్తాడు. కార్యం సఫలం అవడానికి కర్త (పని చేసేవాడు), కర్మ (చేసే పని కార్యం), కరణం (సాధన సామగ్రి), అధికరణ (చేసే విధానం) ఉండాలి. పరమేశ్వరుడు ఎన్నో సాధనాలను ఉపయోగించుకుంటునే జగత్కార్యాన్ని నిర్వహిస్తూ ఉండాలి. 'ఈశః' అనే శబ్దంలోనే ఈశ్వరుడు అందరికి ప్రభువు – నియంత అని చెప్పబడుతున్నది. యమాది దేవతలు అతని నియంత్రణలోనే వారి వారి కార్యకలాపాలను భయంతో చేస్తున్నట్లు శ్రుతులు విన్పిస్తున్నవి. అయితే, జగద్రూపంలో భిన్నభిన్న అంగాలు, వాటిలో జడస్వభావము, మాలిన్యము ఇత్యాది విలక్షణాలు కూడా కన్పిస్తున్నవి. *"నిష్కలం, నిష్క్రియం, శాంతం, నిరవద్యం, నిరంజనమ్"* (శ్వే.ఉ 6.19) అనేవి బ్రహ్మము యొక్క సహజమైన (ప్రకృత) ధర్మాలు. *"జగత్కారణం బ్రహ్మ"* అంటే జగత్సృష్టికి బ్రహ్మ కేవలం నిమిత్తకారణమనే తోస్తున్నది. ఉపాదాన కారణంగా సాంఖ్యాది స్మృతులలో విన్పిస్తున్న ప్రధానము కాని, వేరేదైనా కాని ఉండి ఉండవచ్చును అనే సందేహం కలుగుతున్నది.

**సిద్ధాంతం :**

జగత్సృష్టికి, బ్రహ్మ కేవలం ఉపాదాన కారణమే కాదు, నిమిత్తకారణమని కూడా అంగీకరించాలి. *"ఉత తమాదేశ మప్రాక్ష్యో యేనాశ్రుతం శ్రుతంభవతి, అమతం మతం, అవిజ్ఞాతం విజ్ఞాతం"* (ఛా.ఉ 6.1.2) అనే శ్రుతిలో ఉపదేశ ప్రతిజ్ఞ ఒక దానిని తెలుసుకుంటే సర్వం విజ్ఞాతమౌతుంది అని వినబడుతున్నది. ఉపాదాన కారణాన్ని తెలుసుకున్నప్పుడే కార్యం విదితమౌతుంది. కారణం–కార్యం రెండూ బ్రహ్మవశం అయినప్పుడు, బ్రహ్మమే ఉపాదానకారణము–నిమిత్తకారణము అని స్థిరీకరించుకోవాలి. *"యథా సోమ్య! ఏకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాత్ వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్"* (కుండలు, పిడతలు, ప్రమిదలు అనే పేర్లు కులాలుడు చేసే వస్తువులకు నామ–రూప భేదాలతో పెట్టుకున్నవి, కాని అవన్నీ మట్టి రూపాలన్నదే సత్యము – ఛా.ఉ 6.1.4). అలాగే సృష్టిలోస్థావర రూపాలు, పేర్లు వాగాధారమైనవి. అంతటికి మూలభూతము బ్రహ్మమే అనేదే ఈ శ్రుతి తాత్పర్యము. ఇదేవిధంగా, పలుశ్రుతులు బ్రహ్మ ఉపాదానకారణం గాను, నిమిత్త కారణం గాను ఎలా తెలుసుకోబడుతుందో చూపుతూ దృష్టాంతాలతో ఇలా వినబడు తున్నవి: *"ఏకేన లోహమణినా సర్వం లోహమయం విజ్ఞాతం స్యాత్"* (ఛా.ఉ 6.1.4 నుండి 6.1.6), *"కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి"* (ము.ఉ 1.1.3), *"యథా పృథివ్యామోషధయః సంభవంతి"* (ము.ఉ 1.1.7.), *"ఆత్మని ఖల్వరే దృష్టే, శ్రుతే, విజ్ఞాతే ఇదం సర్వం విదితమ్"* (బృ.ఉ 4.5.6). ఉపనిషద్వాక్యాలు బ్రహ్మ యొక్క ప్రకృతిని నిర్ధారిస్తూ చెప్తున్నట్లు పై ఉదహరించిన వాక్యాలలో విదితమవుతున్నది.

*“గోమయాత్ వృశ్చికా జాయంతే”* (తేలుజాతి కీటకములు గోమయం నుండి పుడుతున్నవి)అనే వాక్యంలో మూలాన్ని సూచిస్తున్న ‘గోమయాత్’ అనేపంచమీ విభక్తి శబ్దం ఉన్నట్లే *“యతోవా ఇమాని భూతాని జాయంతే”* అనే శ్రుతి వాక్యంలో ‘యతః’ అని పంచమీ శబ్దప్రయోగం ఉన్నట్లు గ్రహించాలని సూత్రభాష్యంలో వివరణ ఇవ్వబడింది. *“ఏకమేవాద్వితీయం”* అనే శబ్దం, బ్రహ్మ తప్ప మరొక అధిష్ఠాత ఎవరూ లేరని స్పష్టంచేస్తున్నది. అందువల్ల పరమాత్మనే ఉపాదాన–నిమిత్త కారణాలని గ్రహించాలి.

## సూ: 1.4.24 అభిధ్యోపదేశాచ్చ

*“సోఽకామయత బహుస్యాం ప్రజాయేయ”* అనే శ్రుతిలో పరమాత్మ సంకల్ప ప్రభావం వలన సృష్టికార్యము జరిగినట్లు తెలుస్తున్నది. అనేక నామ–రూపాది భేదాలతో ఆ మహత్‌భూతమే అవతరించింది, అని బ్రహ్మ యొక్క మూలప్రకృతిని కారణ రూపంలోను, కార్య రూపంలోను కూడా వ్యక్తం చేస్తున్నది.

## సూ: 1.4.25 సాక్షాచ్చోభయామ్నానాత్

సర్వభూతముల సృష్టి–లయలు రెండింటికి బ్రహ్మకారణమని *“సర్వాణి హ ఇమాని భూతాన్యాకాశాదేవ సముత్పద్యంతే ఆకాశం ప్రత్యస్తం యంతి”* (ఛా.ఉ 1.9.1) అని శ్రుతి పలుకుతున్నది. దేని నుండి ఉద్భవం అవుతుందో, దానిలో లీన మవటం సామాన్యం. పృథివిలో జన్మించిన చెట్లుచేమలు భూమిలోనే అంతతః కలసి పోతున్నట్లు జగద్వాపారంలో లయ ప్రక్రియ, అస్తిత్వానికి మూలహేతువైన ఉపాదాన కారణం లోనే జరగాలి. పరమేశ్వరేచ్ఛపైనే జనన–మరణాలు రెండూ ఆధారపడి ఉంటాయి అనేది సర్వవిదితము.

## సూ: 1.4.26 ఆత్మకృతేః పరిణామాత్

*“తదాత్మానం స్వయమకురుత”* (తై.ఉ 2.7) అనే శ్రుతి, బ్రహ్మ పరిణామ స్వరూపమే జగత్తని తెలియజేస్తున్నది. ఉపాదాన కారణంగా పరమాత్మ కర్తృత్వానికి మూలం. కార్యభారాన్ని నిర్వహిస్తున్న అదే శక్తి, వికార రూపంలో కర్మగా పరిణామం చెందటం కూడా ఈ శ్రుతి వల్ల తెలుస్తున్నది. ఆత్మ అనాది కావటం వల్ల, పరమాత్మ వివర్తమే సృష్టిలో కన్పడుతున్నది. *“సచ్చ త్యచ్చాభవత్ నిరుక్తంచానిరుక్తంచ”* (తై.ఉ 2.6) అనే శ్రుత్యనుసారం ప్రత్యక్ష సద్రూములుగా పృథివీ–అప్–తేజస్సులు (భూత త్రయం) కనపడుతుంటే, అప్రత్యక్షరూపంలో వాయ్వాకాశాలను పరబ్రహ్మ వివర్త రూపాలుగా గ్రహించవలసి ఉంటుంది.

## సూ: 1.4.27 యోనిశ్చ హి గీయతే

*“కర్తార మీశం పురుషం బ్రహ్మ యోనిమ్”* (ము.ఉ 3.13) అనే శ్రుతి *“యత్ భూత యోనిం పరిపశ్యంతి ధీరాః”* (ము.ఉ 1.1.6) అనే శ్రుతి, బ్రహ్మ జగత్ సృష్టికి మూలకారణం అని తెల్పుతున్నాయి. ‘యోని’ శబ్దం ప్రకృతి – మూలస్థానము అనే అర్థంలో వ్యక్తం చెయ్యబడుతుంది. అంతేకాదు, వాక్యశేషంలో *“యథోర్ణనాభిః సృజతే గృహ్ణతే చ”* (సాలిపురుగు గూడు కోసం, తాను దారాన్ని సృజించికొని, దానినే తిరిగి తనలోకి తీసుకున్న రీతిలో) పుట్టించటానికి, అంతం చెయ్యటానికి కూడ బ్రహ్మ మూలస్థానమని చెప్పబడింది.

పై నాలుగు సూత్రాలలో పరబ్రహ్మ జగత్‌సృష్టికి ఉపాదాన కారణమూ, దాని నిర్మాణానికి నిమిత్తకారణమని సూత్రకారులు స్థిరీకరించినట్లు గ్రహించాలి.

## 8. సర్వవ్యాఖ్యానాధికరణమ్

### సూ: 1.4.28 ఏతేన సర్వే వ్యాఖ్యాతా వ్యాఖ్యాతాః

సాంఖ్యులు ప్రతిపాదించిన ప్రధానము జగత్కారణము కాదు అని ఈ అధ్యాయంలో, ముందు చర్చించిన అధికరణలలో వేదాంతవాక్యాల ప్రామాణ్యంతో తిరస్కరింపబడింది. *"ఈక్షతేర్నాశబ్దమ్"* అనే సూత్రంలో స్మృత్యాధారమైన ప్రధాన కారణవాదుల ఆక్షేపణ నిర్హేతుకమైనది అని స్పష్టం చేసినా, కొంతమంది అన్య శాఖీయులు మళ్లీ ప్రధానమును కొన్ని ఉపనిషద్వాక్యాలతో ముడిపెట్టి, దానిని జగత్కారణంగా అన్వయించుకోవచ్చును అనే అభిమతాన్ని వ్యక్తం చెయ్యటం జరిగింది. అందువల్ల పునః వారందరి వాదనను ఖండిస్తూ, చేతనమయమైన పరమాత్మయే జగత్సృష్టికి ఉపాదానకారణమని, సర్వాధ్యక్షుడుగా సర్వేశ్వరుడే, నిమిత్త కారణమని ఈ పాదంలో చెప్పడమైనది. కర్తృత్వం – కర్మత్వం బ్రహ్మపరంగా సమన్వయించుకోవటమే వేదాంత వాక్యాల తాత్పర్యము.

'వ్యాఖ్యాతాః' అని సూత్రంలో రెండు పర్యాయములు చెప్పటం అధ్యాయ సమాప్తిని సూచిస్తుంది.

***ఇతి సమన్వయాధ్యాయం సమాప్తమ్.***

# 2.

# అవిరోధాధ్యాయము : ప్రథమపాదము



ప్రథమాధ్యాయంలో సర్వజ్ఞుడైన పరబ్రహ్మమే జగత్కారణమని, సర్వప్రాణుల సృష్టి–స్థితి–లయములకు పరమాత్మ మూలమని అతడే సర్వాధ్యక్షుడని, అతని ఆధీనంలో ప్రపంచములో సర్వమూ నిర్వహించబడుతున్నదని ప్రస్తావించడమైనది. వేదాంత వాక్యాల ప్రమాణంతోను, వేద సారాంశమైన భగవద్గీతాది బోధనల యొక్క సమన్వయంతోను సర్వేశ్వరుడే అందరికి ఆత్మస్వరూపమని ప్రతిపాదించబడింది.

ఈ అధ్యాయంలో స్మృతికారులతో కాని, తార్కికులతో కాని వేదవిహితమైన పరమాత్మ తత్త్వాన్ని, విభూతిని అంగీకరించడంలో విరోధమేమీ లేదని స్థాపించబడు తున్నది. ప్రస్తుతము ఈ అధ్యాయ ప్రథమపాదంలో కపిలముని తన తంత్రగ్రంథంలో ప్రతిపాదించిన అంశాలను పరిశీలించి, వారి మతం ఎంతవరకు శాస్త్రసమ్మతమో, శాస్త్రవిరుద్ధమైన స్మృతి వచనాలను ఎందుకు నిరాకరించవలసి ఉందో విస్తృతంగా చర్చింపబడుతున్నది.

## 1. స్మృత్యధికరణమ్

### సూ: 2.1.1 స్మృత్యనవకాశదోషప్రసంగ ఇతి చేన్నాన్య స్మృత్యనవకాశదోషప్రసంగాత్

సాంఖ్య స్మృతికి ఈ పరిశీలనలో అవకాశం కల్పించకపోవటం దోషం అంటే అప్పుడు మిగతా స్మృతులను పరిత్యజించి వాటికి అవకాశం కల్పించలేదనే దోషం వస్తుందని సూత్రార్థం.

సాంఖ్యశాస్త్రాన్ని పరమర్షి కపిలుడు తంత్రమనే పేరుతో రచించి సమ్యక్ జ్ఞానంతో మోక్షప్రాప్తి పొందవచ్చునని ప్రతిపాదించాడు. వేద ప్రామాణ్యాన్ని తిరస్కరించకుండా, అగ్నిహోత్రాది అనుష్ఠానక్రియలు, వర్ణాశ్రమాది విధ్యుక్త ధర్మాలను వ్యతిరేకించటం వల్ల కపిలతంత్రం (కపిలస్మృతి) ప్రత్యేక స్థానాన్ని సంతరించుకుంది. నాస్తిక వాదులు కాకపోయినా, కపిలముని వారి అనుచరులు ఈశ్వర అస్తిత్వాన్ని, బ్రహ్మమొక్కటే అని అంగీకరించలేదు. సాంఖ్యమతం ప్రకృతి–పురుషుడు లేక జీవుడు అని రెండు మూలతత్త్వాలను ప్రస్తావించింది. ప్రకృతి జడం అచేతనమైనది. జీవుడు చైతన్యరూపుడు. ప్రపంచ వ్యవహారాలన్నిటిని సాక్షిగా పురుషుడు చూస్తూ ఉంటూ, ప్రకృతి ప్రాపంచిక వ్యవహారాలను నడుపుతూ ఉంటే, వాటిని అనుభవిస్తాడు కాని వాటికి కర్త కాదు. దేహాలు వేరు కాబట్టి జీవులు (ఆత్మలూ) వేరువేరుగానే ఉండాలి. ఇది సర్వాత్మకత్వానికి విరుద్ధం.

కపిలమతాన్ని మిగతా స్మృతికారులైన మనువు, ఆపస్తంబుడు, గౌతముడు ఇత్యాదులు వ్యతిరేకించారు, నిందించారు కూడా.

**పూర్వపక్షి:**

కపిలమునికి ఆర్షజ్ఞానం, వేదములపై బహు ఆదరణ ఉందనే ఈశ్వర వాదులు విశ్వసిస్తారు. శ్రుతిలో కూడా అతణ్ణి సర్వజ్ఞుడిగా ఇలా చెప్పబడింది *"ఋషి ప్రసూతం కపిలం యస్తమగ్రే, జ్ఞానైః బిభర్తి జాయమానం చ పశ్యేత్"* (ఎవరు సర్వజ్ఞుడైన కపిలుని సృష్టించి, అతనిలో సర్వ జ్ఞానములు నింపి పోషించాడో, ఆ సర్వేశ్వరుణ్ణి చూడాలి – శ్వే.ఉ 5.2). ఇంతటి జ్ఞాన సంపన్నుడైన కపిలముని సిద్ధాంతం నిరాకరించబడదు. అదీకాక, ఈక్షత్యాది కారణాల చేత పరమేశ్వర సంకల్పం, కోరిక ప్రకారమే జగత్సృష్టి జరిగిందని నిర్ణయించి మళ్లీ ఈ ప్రసంగం చెయ్యవలసిన అవసరం ఏముంది?

**సిద్ధాంతం:**

కపిలాదులు ఈశ్వరకారణత్వాన్ని అంగీకరించలేదు. మనకు ఈశ్వర కారణత్వాన్ని ఆదరించి విధ్యుక్త ధర్మాలను విస్మరించని స్మృతులు ఎన్నో ఉన్నాయి. జన సామాన్యానికి వేదాలు అందుబాటులో లేని కారణంగా స్మృతి ప్రాచుర్యం ఎక్కువగా ఉంటుంది. అందువల్ల స్మృతులలో చెప్పిన అంశాలను క్షుణ్ణంగా పరిశీలించి, వాటి సామర్థ్యం చేతనే కపిలమతం ఎందుకు అంగీకార యోగ్యము కాదో పరామర్శించి నిర్ధారింపబడుతున్నది.

మహాభారతం శాంతిపర్వంలో పరమేశ్వరుని యొక్క ప్రస్తావన ఇలా చెప్పబడింది: *"యత్తత్ సూక్ష్మం అవిజ్ఞేయం"* (సూక్ష్మమూ తెలియ శక్యముకానిది పరమాత్మ – 336.28). *"స హ్యన్తరాత్మా భూతానాం క్షేత్రజ్ఞశ్చేతి కథ్యతే"* (అతనినే సర్వభూతాల యొక్క అంతరాత్మ, అతనినే క్షేత్రజ్ఞుడని కూడా అంటారు), *"తస్మాద వ్యక్తముత్పన్నం త్రిగుణం ద్విజసత్తమ"* (ఆ పరమేశ్వరుని నుండియే త్రిగుణములతో అవ్యక్తం ఉద్భవించింది – మ.శాం 336.30). మరోచోట పరబ్రహ్మ గురించి ఇలా ప్రస్తావించటం జరిగింది: *"అవ్యక్తం పురుషే బ్రహ్మనిష్కలే ప్రవిలీయతే"* (అవ్యక్తం నిర్గుణోపేతమైన బ్రహ్మలో లీనమవుతుంది – 341.31) *"అతశ్చ సంక్షేపమిమం శృణుధ్వం నారాయణః సర్వమిదం పురాణః"* (అందువల్ల సంక్షిప్తంగా చెప్పే ఈ విషయం వినండి – ఇదంతా పురాణపురుషుడైన నారాయణుడే). *"స సర్గకాలేచ కరోతిసర్వం సంహారకాలే చ తదత్తి భూయః"* (అతడే సృష్టి సమయంలో సమస్తమూ సృష్టిస్తాడు ప్రళయకాలంలో అంతటినీ మళ్లీ మ్రింగి వేస్తాడు). భగవద్గీతలో ఇదే విధంగా బోధింపబడింది: *"అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయస్తథా"* (జగదుత్పత్తికి, ప్రళయానికి కూడా కారణం నేనే – భ.గీ 7.6). ఆపస్తంబ ఋషి తన ధర్మసూత్ర గ్రంథంలో పరమేశ్వరుడు సృష్టికర్తగా ఇలా చెప్తున్నాడు: *"తస్మాత్ కాయాః ప్రభవంతి సర్వే స మూలం శాశ్వతికం స నిత్యః"* (ఈ పరమాత్మయే సృష్టికి మూలకారణము. అతడే శాశ్వతము – అ.ధ.సూ 1.8.23.2). ఈ విధంగా బ్రహ్మమే జగత్కారణమని స్మృతులు బోధిస్తున్నవి.

స్మృతి వాక్యాలు శ్రుతికి అనుగుణంగా ఉంటే వాటిని తప్పక అంగీకరిం చాలి. కాని శ్రుతికి విరుద్ధంగా ఉంటే, వాటిని ఊహామాత్రంగా తిరస్కరించవలసి వస్తుంది. వాటికి ప్రమాణం లేదు. శ్రుతితో విరోధమున్న స్మృతి నిరాకరింపబడాలని జైమిన్యాచార్యులవారూ *"విరోధే త్వదపేక్షం స్యాదసతి హ్యనుమానమ్"* (జై.సూ 1.3.3) అనే సూత్రంలో ప్రతిపాదించారు. ఇంద్రియములకు అతీతమైనది పరమాత్మ. అందువల్ల కేవలం శ్రుతి సహాయంతోనే దాని ఉనికి తెలుసుకొని, పరమాత్మ అనే శక్తి ఉంది అని నిరూపించటం శక్యము; అన్యథా అసాధ్యము. కపిలుడు జ్ఞానసిద్ధి గల ముని, అందువల్ల అతను ప్రతిపాదించినదంతా గ్రహించాలి అనే వాదన అంగీకరించలేము. స్మృతి వాక్యాల్లో విప్రతిపత్తి ఉన్నప్పుడు శ్రుతిని ఆశ్రయించడమే న్యాయం. అదీకాక, ముందు ఉదహరించిన శ్వేతాశ్వతర శ్రుతిలో 'కపిలమ్' అని సామాన్యరూపంలోనే ఉంది. అది తంత్రకర్త కపిలమునినే నిర్దేశిస్తున్నదా అనే విషయం కూడా స్పష్టంగా లేదు. వాసుదేవుడనే మరో కపిలుడు సగర పుత్రులను భస్మీకృతులను చేసినట్లు పురాణగాథ కూడా ఉంది.

ధర్మశాస్త్ర కర్త అయిన మనువు చెప్పిందల్లా మహదౌషధం అని సూచిస్తున్న శ్రుతి వాక్యం కూడా ఉంది: *"యద్వైకించ మనురవదత్తత్ భేషజం"* (తై.సం 2.2.10.2). మరి దాన్నీ గ్రహించాలి కదా! కపిలుడు సర్వాత్మత్వాన్ని నిరాకరిస్తే, మనువు సర్వ భూతాలలోనూ ఉన్న ఆత్మ ఒకటే అని సర్వాత్మతత్త్వాన్ని ప్రశంసిస్తున్నాడు. *"సర్వ భూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని సంపశ్యన్ ఆత్మయాజీ వై స్వారాజ్య మిధిగచ్ఛతి"* (పరమాత్మను సకల భూతాలలోను, సకల భూతాలను తనలోనూ చూచే ఆత్మయాజి స్వారాజ్యం పొందుతాడు – మ.స్మృ 12.91).

మహాభారతంలో సృష్టికర్త ఒక్కడేనా, లేక సాంఖ్యయోగులు చెప్తున్నట్లు బహురూపాల్లో ఉంటారా, అనే ప్రశ్న – దానికి సమాధానం శాంతిపర్వంలో ఇలా ఉంది: *"బహవః పురుషా బ్రహ్మన్ ఉత ఆహో ఏక ఏవతు…బహవః పురుషా రాజన్ సాంఖ్య యోగ విచారిణామ్"* (శాం.ప. 252.1, 252.2.), *"బహూనాం పురుషాణాం హి యథైకా యోనిరుచ్యతే, తథా తం పురుషం విశ్వమాఖ్యాస్యామి గుణాధికమ్"* (అనేక పురుషులకూ మూలకారణమైన, విశ్వరూపుడూ గుణాలలో అధికుడూ అయిన వానిని గూర్చి చెబుతున్నాను విను అని ఉపక్రమించి ఇలా ఉపదేశించాడు), *"మమాంతరాత్మా తవచ యే

*చాన్యే దేహ సంస్థితాః సర్వేషాం సాక్షిభూతోఽసౌ న గ్రాహ్యః కేనచిత్ క్వచిత్"* (నాకు, నీకు, సకల దేహధారులకు అంతరాత్మ, సర్వసాక్షి అయిన పరమాత్మ, ఎవని వలనా, ఎక్కడా గ్రహింప శక్యంకాదు).

పరమేశ్వరుడు విశ్వరూపి స్వేచ్ఛగా సర్వప్రాణులలోను సంచరిస్తూ ఉంటాడని ఇలా వర్ణింపబడింది: *"విశ్వ మూర్ధా విశ్వభుజో విశ్వపాదాక్షి నాసికః ఏకశ్చరతి భూతేషు స్వైరచారీ యథా సుఖమ్"* (అనేక శిరస్సులు, అనేక భుజములు కలవాడు, అనేక పాదములు, నేత్రములు నాసికలు కలవాడు, ఆ పరమేశ్వరుడు స్వేచ్ఛగా సకల భూతములలోను సంచరిస్తుంటాడు – శాం.ప 353.5). ఇదే సర్వాత్మ భావం ఈశావాస్యోపనిషత్తులో ఇలా విన్పిస్తున్నది: *"యస్మిన్ సర్వాణి భూతాని ఆత్మైవాభూత్ విజానతః తత్ర కో మోహః కః శోక ఏకత్వ మనుపశ్యతః"* (ఏ జ్ఞానోదయ సమయంలో జ్ఞానికి సకల ప్రాణులూ తన ఆత్మ స్వరూపమనే తెలిసిందో, అట్టి స్థితిలో మోహం, శోకం అనేవి ఉండవు — ఈ.ఉ. 7)

కపిల స్మృతి, శ్రుతికి విరుద్ధంగాను, మిగతా స్మృతులకు విరుద్ధంగాను ఆత్మభేదాన్ని కల్పిస్తున్నది. అందువల్ల కపిలమతం ఎక్కడో విని, దానినాధారంగా చేసుకొని ప్రస్తావిస్తున్నట్లు కన్పిస్తున్నది. ఇది ఊహైనా కావొచ్చు. సర్వత్రా అంగీకరించే శ్రుతిని, తదాధారిత ఇతర స్మృతులకు విరుద్ధంగా ఉంది. అందువల్ల కపిలమతాన్ని విస్మరించినా దోషం లేదు.

## సూ: 2.1.2 ఇతరేషాం చానుపలబ్ధేః

సాంఖ్య స్మస్మృతిలో, ప్రధానం కంటే ఇతరములైన మహదాదులు కల్పించ బడ్డాయి. అవి వేద సమ్మతములు, లోక సమ్మతములు కావు. స్థూల భూతాలు, ఇంద్రియాలు, వేదంలోను లౌకికంగా కూడ ప్రసిద్ధమైనవే. వాటిని ఆదరించవచ్చు. కాని మహత్తు—అహంకారమూ, అహంకారము నుండి ఉద్భవించినట్లు చెప్పే పంచ తన్మాత్రలు అంగీకరించబడవు. శ్రుతిలో వినబడుతున్న 'మహత్' ఇత్యాది ప్రస్తావనలు సాంఖ్య స్మస్మృతిలో ప్రతిపాదితమైన మహదాదులకు చాల భిన్నమైనవని *"అనుమానిక మప్యేకేషామ్"* అనే సూత్రంలో ముందు వివరించబడింది (బ్ర.సూ 1.4.1). కార్య రూపాలైన మహదాదులను ప్రస్తావిస్తున్న స్మస్మృతికి ఏ ప్రమాణం లేనట్లే, ప్రధానం యొక్క స్మస్మృతి ప్రస్తావన కూడా అప్రమాణమే ఔతుంది. ఇదేవిధంగా, తర్కప్రయోగంతో ప్రతిపాదిస్తున్న దానినీ *"న విలక్షణత్వాత్"* అనే రాబోయే సూత్రంలో (బ్ర.సూ 2.1.4) క్షుణ్ణంగా పరిశీలించి తిరస్కరించటం జరుగుతుంది.

## 2. యోగ ప్రత్యుక్త్యధికరణమ్

## సూ: 2.1.3 ఏతేన యోగః ప్రత్యుక్తః

శ్రుతివిరుద్ధం కాబట్టి యోగస్మృతి కూడ నిరాకరించబడుతుందని సూత్రార్థం.

యోగస్మృతిలో కూడా శ్రుతి విరుద్ధమైన ప్రధానం, మహదాది కార్యరూపాలు ప్రతిపాదించబడ్డాయి. కాబట్టి, యోగ స్మృతులు ఇచ్చట తిరస్కరింపబడుతున్నవి.

**పూర్వపక్షి:**

ఆత్మసాక్షాత్కారం చేసుకోటానికి *"శ్రోతవ్యో, మంతవ్యో నిదిధ్యాసితవ్యః"* అని శ్రుతి నిర్దేశము (బృ.ఉ 2.4.5). శ్వేతాశ్వతర ఉపనిషత్తులో యోగాసన విధానంలో శిరస్సు, కంఠం, వక్షస్థలాన్ని ఎత్తుగా నిలబెట్టి ధ్యానించాలి అని ఇలా శ్రుతి విన్పిస్తున్నది: *"త్రిరున్నతం స్థాప్య సమం శరీరమ్"* (శ్వే.ఉ 2.8). కఠోపనిషత్తులో కూడా యోగవిద్య ప్రస్తావన వినబడుతున్నది *"తాం యోగమితి మన్యంతే స్థిరా మింద్రియ ధారణామ్"* (స్థిరమైన ఇంద్రియనిగ్రహం యోగం అనబడుతుంది – క.ఉ 2.6.11). అదే ఉపనిషత్తులో మరో దగ్గర శ్రుతి వాక్యం ఇలా ఉంది: *"మృత్యు ప్రోక్తాం నచికేతోఽథ లబ్ధ్వా విద్యామేతాం యోగవిధిం చ కృత్స్నమ్"* (ఈ ఆత్మవిద్యను సమస్త యోగవిధిని నచికేతుడు మృత్యుదేవత నుండి ఉపదేశం పొందాడు – క.ఉ 2.6.18). ఈ విధంగా శ్రుతిలో యోగ విద్యకు సంబంధించిన ప్రసంగాలు చాలా కనబడతాయి. యోగ శాస్త్రంలో బ్రహ్మతత్వాన్ని తెలుసుకోవటానికి, ఒక సాధనంగా ఉపయోగపడేది యోగాభ్యాసం అని చెప్తారు: *"అథ తత్త్వ దర్శనోపాయో యోగః"* . యోగ విద్య వేదాంత పరంగా బ్రహ్మప్రాప్తికే చెప్పబడుతున్నది, కాబట్టి దానిని ఏ కారణం చేత నిరాకరించవలసిందని ఇప్పుడు చెబుతున్నారు.

**సిద్ధాంతం:**

సాంఖ్య–యోగస్మృతులు చాలా ప్రాచుర్యంలో ఉన్నాయి. సందేహంలేదు. శిష్టులు కూడా వాటిని గౌరవించారు. శ్వేతాశ్వతర ఉపనిషత్తు *"తత్కారణం సాంఖ్య యోగాధిగమ్యం జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాశైః"* (శ్వే.ఉ 6.13). ఇంద్రియ నిగ్రహంతో, ధ్యానాదులతో, యోగసాధనతో కోరికలను అంతం చేసుకొని ఈశ్వరుణ్ణి తెలుసుకొని, బంధ విముక్తుడౌతాడు అని దీని సారాంశం. అయితే వేదమార్గం అపేక్షించని యోగమార్గం చేత మోక్షం లభించదు. అందుకని వాటిని నిరాకరించటం జరుగుతున్నది.

*"తమేవ విదిత్వాఽతి మృత్యుమేతి, నాన్యః పంథా విద్యతేఽయనాయ"* (శ్వే.ఉ 3.8). శ్రుతిలో ప్రస్తావించిన ఆత్మైకత్వ జ్ఞానం వలనే మోక్షప్రాప్తి లభిస్తుంది. మరో మార్గము లేదు. సాంఖ్యులు, యోగులు, ద్వైతులు. ఆత్మ–పరమాత్మ భిన్నత్వాన్ని విశ్వసిస్తారు. ఆత్మైకత్వాన్ని అంగీకరించరు. *"తత్కారణం సాంఖ్య యోగాధిగమ్యమ్"* అని శ్వేతాశ్వతర శ్రుతి, వేదోక్తమైన జ్ఞానమార్గాన్నే సాంఖ్య–యోగ పదాల సహాయంతో ప్రస్తావిస్తున్నట్లు గ్రహించాలి. సాంఖ్య–యోగ స్మృతులలో ఏవి వేద విరుద్ధములు కావో, వాటిని సర్వత్రా గౌరవించాలి. *"అసంగో హ్యయం పురుషః"* అనే శ్రుతి (బృ.ఉ 4.3.16) నిర్గుణ బ్రహ్మమును బోధిస్తున్నది. ఇదే నిర్గుణాకారాన్ని సాంఖ్య మతస్థులు అంగీకరిస్తున్నట్లు కూడా కనబడుతున్నది. అందువల్ల, అటువంటి అంశాలలో వైరుధ్యం లేదు. అలాగే యోగ స్మృతుల్లో సన్యాసాది ఆశ్రమధర్మాలను గౌరవిస్తూ, శ్రుత్యాధారమైన నివృత్తి మార్గాన్ని బోధిస్తున్న కొన్ని వాక్యాలు కూడా కనబడతాయి. వీటికి కూడా శ్రుతి తార్కాణం ఉందనే గ్రహించవలసి ఉంది. *"అథ పరివ్రాడ్వివర్ణ వాసా ముండోఽపరిగ్రహః"* (మాసిన వస్త్రాలు ధరించినవాడు, శిరోముండనం చేసుకున్నవాడు, ధన సంచయం చెయ్యని వాడు, దేశసంచారీ సన్యాసి – జా.ఉ 5). ఇవి వేద విరుద్ధం కానివి.

వేదాంత విచారం వల్లే తత్త్వజ్ఞానం కల్గుతుంది. మోక్షప్రాప్తి, ఆత్మజ్ఞానం వల్ల లభిస్తుంది. అందువల్ల, బ్రహ్మతత్వాన్ని తెలుసుకో దలచినవాడు వేదవేత్త కావాలని నమ్ముతారు. *"న వేదవిన్మనుతే తం బృహంతం"* అనేది శ్రుతివాక్యం (తై.బ్రా. 3.12.9.7).

## 3. విలక్షణత్వాధికరణమ్

## సూ: 2.1.4 న విలక్షణత్వాదస్య తథాత్వం చ శబ్దాత్

ప్రపంచం విలక్షణం వల్ల బ్రహ్మము కాదు. అది శ్రుతి వల్లనే తెలుస్తున్నదని సూత్రార్థం.

ఈ జగత్తుకు బ్రహ్మము మూలకారణం, నిమిత్తకారణం కూడా అనే అద్వైత పక్షానికి స్మృతి సంబంధమైన ఆక్షేపణలను తిరస్కరించిన పిదప, తర్కసంబంధమైన ఆక్షేపణ ఇప్పుడు పరిహరింపబడుతున్నది.

**పూర్వపక్షి:**

బ్రహ్మము సిద్ధ వస్తువు. పృథివీ మొదలగు సిద్ధవస్తువులకు ఉన్నట్లే ఇతర ప్రమాణాలకు అవకాశం ఉంటుంది. శ్రుతులలో పరస్పర విరోధం ఎక్కడైనా కనబడితే, ఒక శ్రుతిని ఆధారం చేసుకొని, మిగతా శ్రుతులను ఏ విధంగా సమన్వయించు కుంటామో, అదే విధంగా ప్రమాణాంతరాలలో భేదం వచ్చినప్పుడు, శ్రుతి మూలం గానే దానిని పరిష్కరించుకోవాలి. *"శ్రోతవ్యో మంతవ్యః"* అని శ్రవణంతోనే కాదు, మననంతో కూడా ఆత్మను తెలుసుకోవాలి అని బోధిస్తున్న బృహదారణ్యక శ్రుతి, తర్కంతో కూడా పరిశీలించ దగినదనే సూచిస్తున్నది. అందువల్ల తర్కమూలమైన ఈ ఆక్షేపం ఇక్కడ చేయబడుతున్నది.

చేతనమైన బ్రహ్మము జగదుత్పత్తికి కారణం, అదే దాని ప్రకృతి అనే వాదనను అంగీకరించలేము. జగత్తు బ్రహ్మము కంటె విలక్షణమైనది. బ్రహ్మ–జగత్తు ఒకటి కావు. జగత్తు బ్రహ్మము యొక్క కార్యమని అంగీకరించినా, చేతనము లేని జగత్తు జడము, శుద్ధత్వము కూడా లేనిది. దీనికి భిన్నంగా బ్రహ్మము చేతనమైనది, శుద్ధమైనది. రుచకాది ఆభరణాలకు మృత్ మూలం (ప్రకృతి కాదు), అలాగే ఘటాదు లకు సువర్ణం మూలం కాదు. సుఖ–దుఃఖ మోహమయమైన జగత్తు, సుఖ–దుఃఖ మోహాలకతీతమైన బ్రహ్మము యొక్క కార్యం ఏ విధంగా అవుతుంది? అందువల్ల జగత్తు బ్రహ్మమునకు విలక్షణమైనది అవ్వాలి. స్వర్గం–నరకం ఇవన్నీ జగద్విస్తార రూపాలవటం వల్ల జగత్తు అశుద్ధమైనది. దేహేంద్రియ రూపాలలో జగత్తు చేతనమైన ఆత్మ యొక్క ఉపభోగానికి సాధనంగా అవుతున్నది కాబట్టి అచేతనమే అవాలి. రెండూ సమాన గుణాలవైతే ఒకదానికి మరొకటి ఎలా ఉపకరిస్తుంది. రెండు దీపాలు ఒకదానికొకటి ఉపకరించవు కదా! అందువల్ల జగత్తుకూ–బ్రహ్మకూ ఉపకార్య ఉపకారక భావం కుదరదు. చేతనులు, నిరతిశయులు, ఏ విధమైన గుణాది అతిశయమూ లేనివారు, కర్తృత్వం లేనివారనే సాంఖ్యులు ప్రతిపాదిస్తున్నప్పుడు దానిని అంగీకరించవచ్చు కదా?

**సిద్ధాంతం:**

జగత్తుకు చేతనం ప్రకృతి అని శ్రుతి బలంతోనే జగత్సర్వమూ చేతన రూపమనే స్థాపింపబడుతున్నది. ప్రకృతి యొక్క రూపం వికారంలోనూ అన్వయించ వచ్చు. ఆత్మకు స్వచ్ఛమైన చైతన్యం ఉన్నా మూర్ఛ, సుషుప్త్యవస్థలలో బయటకు స్పష్టంగా కనబడదు. అలాగే కాష్ఠ, లోష్టాదుల్లో వాటిగుణం దాగే ఉంటుంది. అన్నం– పప్పు–మాంసం అన్నీ పృథివీ రూపాలే (పార్థివాలే) అయినా ప్రతీ ఆత్మలో ఉండే విశేషం వల్ల అవి ఏ విధంగా పరస్పరోపకారకాలుగా ఉంటాయో, అదేవిధంగా ఇక్కడా ప్రవర్తించవచ్చు.

*"విజ్ఞానం చావిజ్ఞానంచ"* అనే శ్రుతి వాక్యమే చేతనం–అచేతనం సహవాసం ఉండవచ్చనే సూచిస్తున్నది. అచేతనమైన జగత్తు– చేతనమైన బ్రహ్మము కంటె విలక్షణమనే, సూత్రంలో *"తథాత్వం చ శబ్దాత్"* అని స్పష్టం చేస్తున్నది.

**సంశయం:**

అచేతనాలని పరిగ్రహింపబడ్డ మృత్, అప్ ఇత్యాది భూతాలు, వాగాది ఇంద్రియాలు కూడా చేతనత్వం ఉన్నవాటిగా మాట్లాడుతున్నట్లు శ్రుతిలో వినబడు తున్నది: *"మృత్ఽబ్రవీత్, ఆపోఽబ్రువన్"* (శత.బ్రా 6.1.3.2), *"తత్తేజో ఐక్షత"* , *"త ఆప ఐక్షంత"* (ఛా.ఉ 6.2.3.4). అలాగే ఇంద్రియాల విషయంలో కూడా *"తేహ ఇమే ప్రాణా అహం శ్రేయసే వివదమానా*

*బ్రహ్మ జగ్ముః"* (ఈ ప్రాణాలు వాటిలో అవి వాదించుకుంటూ బ్రహ్మ దగ్గరికి పోయాయి). *"తే హ వాచ మూచుః త్వం నః ఉద్గాయేతి"* (బృ.ఉ 1.3.2). ఈ విధంగా వినిపిస్తున్న శ్రుతివాక్యాలు అచేతనమైన వాటికి కూడా చేతనత్వం ఉందనే సూచిస్తున్నవి. ఈ ఆక్షేపణకు సమాధానంగా క్రింది సూత్రం చెప్పబడింది.

## సూ: 2.1.5 అభిమానివ్యపదేశాస్తు విశేషానుగతిభ్యామ్

సూత్రంలో 'తు' శబ్దం ఆక్షేపణను తిరస్కరిస్తున్నది. భూతాత్మకమైన పృథ్వీ, అపాదులు, అలాగే ఇంద్రియాదులు చేతనమైనవి కావు. అయినా, ఆయా అభిమాన దేవతలు అక్కడ పలుకుతున్నట్లు ఈ శ్రుతి వాక్యాలను సమన్వయించుకోవాలి. విశేషానుగతుల వల్ల (విశేషానుకరణ వలన) భోక్తలైన జీవులకు–భూతేంద్రియాలకు ఉన్నటువంటి సహయోగం వల్ల, చేతన–అచేతన రెండు విభాగాలతో కలిసే పరమాత్మ విశేషంగా కనబడుతుంది. ఈ విషయం ముందు కూడా *"విజ్ఞానం చావిజ్ఞానంచ"* అనే తైత్తిరీయ శ్రుతి వాక్య సహాయంతో స్పష్టం చేయబడింది.

అదీకాక, కౌషీతకులు ముఖ్యప్రాణం–ఇంద్రియాలకూ జరిగిన ప్రాణ సంవాదాన్ని ఇంద్రియాల మధ్య జరిగిన కలహంగా కాకుండా, దేవతలే వారిలో ఎవరు గొప్ప అని కలహించుకొని తండ్రి అయిన ప్రజాపతినే నిర్ణయించమని అతని వద్దకు వెళ్లినట్లు ఇలా పఠిస్తున్నారు. *"ఏతా హ వై దేవతా అహంశ్రేయసే వివదమానాః"* ... *"తా ఏతాః సర్వాదేవతాః ప్రాణే నిఃశ్రేయసం విదిత్వా"* . ఈ విధంగా 'దేవతాః' అనే శబ్దం చేత ఇంద్రియాలను పేర్కొంటున్నారు. వేదంలోను, ఇతిహాస పురాణాలలోను పంచభూతాలను, ఇంద్రియాలను వాటి అభిమాన దేవతా రూపాలలో పేర్కొనటం కనబడుతుంది. ఐతరేయ శ్రుతి ఇలా వినబడుతుంది: *"అగ్నిర్వాగ్భూత్వా ముఖం ప్రావిశత్"* (అగ్ని వాక్కు రూపంలో ముఖంలో ప్రవేశించింది). అలాగే, ఛాందోగ్య శ్రుతి: *"తేహ ప్రాణాః ప్రజాపతిం పితరమేత్య ఊచుః"* (ప్రాణాలు తండ్రియైన ప్రజాపతిని చేరి పలికాయి – ఛా.ఉ 5.1.7). ఈ విధంగా శ్రుతి వాక్యాలు లౌకిక వ్యవహారాన్ని అనుకరిస్తూ ప్రాణాదులలో చేతనత్వ కార్యకలాపం జరిగినట్లు సూచిస్తున్నాయి.

## సూ: 2.1.6 దృశ్యతే తు

'తు' శబ్దం పూర్వపక్షాన్ని తిరస్కరిస్తున్నది. చేతనాల నుండి అచేతనాల ఉత్పత్తి, అచేతనాల నుండి చేతనాల ఉత్పత్తి కనబడుతున్నదని సూత్రార్థం.

ఈ జగత్తు విలక్షణం కాబట్టి, బ్రహ్మము దానికి ప్రకృతి కాదని నిర్ధారిస్తూ తప్పని సరిగా చెప్పబడదు. మనుష్యులు (శారీరులు) చేతనమయులే, కాని వారి నుండి గోళ్లు, వెంట్రుకలు పుట్టటం కనబడుతున్నది కదా! అలాగే, అచేతనములైన, గోమయాదుల నుండి వృశ్చికాది చేతనములైన క్రిములు పుడుతున్నవి కదా! అచేతన ములైన శరీరాదులు కేశనఖాదులకు కారణం, అలాగే వృశ్చికాదుల యొక్క శరీరాలే గోమయాది అచేతనములకు కారణం అని వాదించినా కుదరదు. కారణం విలక్షణం పోదు. పురుషాదులకు–కేశనఖాదులకు పరిణామం వల్ల ఏర్పడిన వ్యత్యాసం ఎంత దూరమైందో, గోమయాదుల మధ్య, వ్యత్యాసం ఎంత దూరమైందో, గోమయాదుల మధ్య, వృశ్చికాదుల మధ్య పరిణామ వ్యత్యాసం కూడా అంతే దూరమైనది. పూర్తి సారూప్యం ఉంటే ప్రకృతి–వికృతి అనే భేదం కనబడదు. కేశనఖాదులలో, పురుషాదు లలో ఉండే పృథ్వీ సంబంధగుణమే అనువర్తిస్తున్నదని భావిస్తే, బ్రహ్మపరమైన సత్తా స్వభావం ఆకాశాదులలో అనువర్తిస్తున్నట్లు నమ్మాలి. జగత్తుకు చేతనమైన బ్రహ్మ మూలకారణం – ప్రకృతి అవుతుందనే శాస్త్ర తాత్పర్యం. బ్రహ్మవాదులు, ఈ జగత్తు లోని సమస్త వస్తుసముదాయమూ బ్రహ్మప్రకృతే అని నిస్సందేహంగా అంగీకరిస్తారు. ప్రతి పదార్థంలోను చేతనాంశం తప్పక ఉండాలనే నమ్ముతారు.

బ్రహ్మము సిద్ధ వస్తువు కాబట్టి ప్రత్యక్ష, అనుమాన ఇతర ప్రమాణాలతో దాని ఉనికిని స్థాపించగలగాలని పూర్వపక్షి ముందు చేసిన ఆక్షేపణకు ఇప్పుడు సమాధానం ఇవ్వబడుతున్నది.

బ్రహ్మమునకు ఏవిధమైన రూపమూ లేనందు వల్ల ప్రత్యక్షంగా కనబడదు. ఎట్టి చిహ్నాలు–లింగాలు లేనందు వల్ల

అనుమానాది ప్రమాణాలతో స్థాపించబడదు. ధర్మం విషయంలో ఎలాగో, అలాగే శాస్త్రంచేతనే బ్రహ్మపదార్థం నిరూపింపబడుతుంది. ఏ తర్కమూ ఉపయుక్తం కాదనే శ్రుతి స్పష్టం చేస్తున్నది: *"నైషా తర్కేణ మతిరాపనీయా ప్రోక్తాఽన్యే నైవ సుజ్ఞానాయ ప్రేష్ఠ"* (ప్రియమైన నచికేతా! బ్రహ్మవేత్త అయిన ఆచార్యుని బోధనవలనే పరమాత్మను పొందగలవు – క.ఉ 1.2.9). *"కో అద్ధా వేద క ఇహ ప్రవోచత్"* ... *"ఇయం విసృష్టిర్యత ఆబభూవ"* (ఈ సృష్టి ఎలా జరిగిందో ఎవడికెరుక, ఎవడు చెప్పగలడు – ఋ.సం 1.30.6). అలాగే *"అచింత్యాః ఖలు యే భావా న తాంస్తర్కేణ యోజయేత్"* అనే మరో స్మస్మృతి వాక్యం జగత్కారణం ఎవరికీ తెలియతరము కానిదని పల్కుతున్నది. అలాగే భగవద్గీత కూడా బోధిస్తున్నది: *"అవ్యక్తోఽయం, అచింత్యోఽయం, అవికార్యోఽయముచ్యతే"* (పరమాత్మ రూపం అవ్యక్తమైనది, ఊహాతీతము, ఎట్టి వికారము లేనిది –భ.గీ 2.25). *"న మే విదుః సురగణాః, ప్రభవం న మహర్షయః అహమాదిర్హి దేవానాం, మహర్షీణాం చ సర్వశః"* (దేవతలూ మహర్షులూ కూడ నా ఉద్భవము ఎరుగరు. నేను దేవతలకన్నా, మహర్షులకన్నా ఆద్యుడను – భ.గీ 10.2).

శ్రుతి సమ్మతమైన తర్కం వలనే బ్రహ్మము యొక్క ఉనికిని నిశ్చయించుకో గలము. వాదనే ప్రధానమని భావించే శుష్క తర్కానికి ఆస్కారం లేదు. శ్రుతి, ప్రపంచం బ్రహ్మనిర్మితమూ, బ్రహ్మ కన్నా వ్యతిరిక్తమైన ప్రపంచం లేదు, కార్యం–కారణం అభిన్నములనే స్పష్టం చేస్తున్నది. దీనినే అనుసరించాలి. మరో ప్రమాణం ఏదీ లేదు.

కేవలం తర్కం మోసపూరతమైనదని *"తర్కాప్రతిష్ఠానాత్"* అని ముందు వస్తున్న సూత్రంలో (బ్ర.సూ 2.1.11) వివరంగా చెప్పబడుతున్నది. *"విజ్ఞానం చావిజ్ఞానంచాభవత్"* అనే శ్రుతివాక్యం, పరమాత్మ యొక్క మూలం సమస్త జగద్రూపంలోనే కనబడుతున్నదనే నిర్ధారిస్తున్నది.

## సూ: 2.1.7 అసదితి చేన్న ప్రతిషేధమాత్రత్వాత్

బ్రహ్మము చేతనము, శుద్ధము, శబ్దరహితము; దానికి విరుద్ధంగా జగత్తు అచేతనము, అశుద్ధము, శబ్దసహితము. కాబట్టి, ఉత్తత్తికి పూర్వం కార్యం అసత్తు కావాలని పూర్వపక్షి చేసిన ఆక్షేపణకు ఇక్కడ సమాధానం ఇవ్వబడుతున్నది. కార్యం ఇప్పుడూ, ఉత్పత్తికి పూర్వమూ కూడా కారణ రూపంలో సత్తు (సత్) గానే ఉంటుంది. కారణాత్మతో సంబంధం లేకుండా జగత్తు ఎప్పుడూ ఉండదు. అందువల్ల, ఉత్పత్తికి పూర్వం కార్యం అసత్ అని చెప్పడం యుక్తం కాదు. జగత్తు బ్రహ్మము యొక్క పారమార్థిక రూపం. జగదుత్పత్తి తరవాత ఆ పారమార్థిక రూపం ఎలా ఉందో, కార్యోత్పత్తికి పూర్వం కూడా బ్రహ్మము నిత్యం కాబట్టి, అలాగే ఉండాలి. అందువల్ల సత్కార్య వాదనకిది విరోధం కాదు.

## సూ: 2.1.8 అపీతౌ తద్వత్ప్రసంగాదసమంజసమ్

**ఆక్షేపణ:**

ప్రళయంలో బ్రహ్మములో జగత్తు విలీనమైతే, జగత్తుకున్న రూప విశేషాలు, అచేతనత్వం ఇత్యాదులు బ్రహ్మ పదార్థాన్నే కలుషితం చెయ్యాలి కదా! బ్రహ్మములో పూర్తిగా నామరూపాలు లేకుండా కలిసిపోయిన జగత్తు మళ్లీ పరిచ్ఛిన్నమైన వేరువేరు రూపాలలో కార్యరూపం ఎలా ధరిస్తుంది? అదీకాక, కర్మాది కారణాల చేత మళ్లీ జన్మ సంభవిస్తుంటే, ముక్తులై బ్రహ్మైక్యత పొందినవారు మళ్లీ కొత్త జన్మ ఎత్తవలసి వస్తుంది కదా! అందువల్ల బ్రహ్మ జగత్ సృష్టికి మూలకారణమనే వాదన సమంజసం కాదు. ఈ ఆక్షేపణకు సమాధానం క్రింది సూత్రంలో చెప్పబడింది.

## సూ: 2.1.9 న తు దృష్టాంతభావాత్

కార్యరూపం కారణంలో విలీన మవడం వల్ల మూలమే కలుషితం అయి చెడిపోతుందనే వాదన సరైనదికాదు. దీనికి దృష్టాంతాలేవీ కనబడవు. ఘటాదులు మట్టిలో కలిసి పోలేదా! రుచకాది ఆభరణాలు మళ్లీ బంగారం కాలేదా? పృథివీ

వికార మైన సమస్త ప్రాణులు ఎలా పుట్టినా మళ్లీ పృథివిలో కలిసినప్పుడు, పృథివీధర్మం ఎప్పుడూ కోల్పోదు. ఈ విషయం రానున్న ఆరంభణాధికరణంలో వివరించబడింది.

జగత్కారణం బ్రహ్మము అని నిర్దేశిస్తున్న శ్రుతులు: *"సర్వం ఖల్విదం బ్రహ్మ"* , *"ఇదంసర్వం యదయమాత్మా"* , *"ఆత్మైవేదం సర్వమ్"* , *"బ్రహ్మైవేదమమృతం పురస్తాత్"* ఇత్యాదులు ఏ విశేషం లేకుండా సృష్టి–స్థితి–లయలకు (త్రికాలాలలోను) కార్యం –కారణం కన్నా అభిన్నము, వేరు చెయ్యబడనిది అనే ప్రతిపాదిస్తున్నవి. కార్యధర్మాలు అవిద్యాజనితాలు. మాయావి తన మాయకు ఎలా అతీతంగా ఉంటాడో, అలాగే పరమాత్మ సంసార మాయ చేత స్పృశింపబడడు. స్వప్న దర్శనాలు, జాగ్రదవస్థలోను, సుషుప్తిలోను కూడా అనుగతం కావు. పరమ వేదాంత జ్ఞాని గౌడపాదాచార్యులవారు అవస్థాత్రయం (సృష్టి–స్థితి–లయలు మూడూ) ఈశ్వర మాయే అని వారి కారికలో ఇలా ప్రస్తావిస్తున్నారు : *"అనాది మాయయా సుప్తో యదా జీవః ప్రబుధ్యతే అజమనిద్ర మస్వప్నమద్వైతం బుధ్యతే తదా"* (అనాదియైన మాయతో నిద్రపోతున్న జీవుడెప్పుడు, ఆ పరమాత్మే నేనని తెలుసుకొని మేల్కొంటాడో, అప్పుడు జరామరణం లేనిది, స్వప్నావస్థ లేనిది అయిన అద్వైత ఆత్మత్త్వాన్ని తెలుసుకుంటాడు – గౌ.కా 1.1.16).

**సంశయం:**

బ్రహ్మలో పూర్తిగా లీనమయి విభాగమే కోల్పోయినప్పుడు, మళ్లీ మళ్లీ పూర్వవిభాగంతో జగదుత్పత్తి ఎలా జరుగుతుంది?

**సమాధానం:**

ఈ విషయాన్నే శ్రుతి ఇలా తెలియజేస్తున్నది: *"ఇమాః సర్వాః ప్రజాః సతి సంపద్య న విదుః సతి సంపద్యామహ ఇతి, త ఇహ వ్యాఘ్రో వా, సింహో వా, వృకో వా, వరాహో వా, కీటో వా, పతంగో వా, దంశో వా, మశకో వా యద్యద్భవంతి, తత్తదా భవంతి"* (ఈ ప్రాణులు బ్రహ్మములో ఐక్యమైనా, బ్రహ్మలో లీనమౌతున్నట్లు తెలుసుకో లేవు. సుషుప్త్యవస్థకు పూర్వం వ్యాఘ్రంగా కాని, సింహంగా కాని, పురుగు, మిడత, దోమ, ఈగ ఇలా ఏ విభాగంలో ఉండేదో మళ్లీ అదే శరీరంలో మేల్కొంటాయి –ఛా.ఉ 6.9.2.3). దీనికి కారణం, మిథ్యాజ్ఞానం నాశనం కాకుండా అలా ఉండిపోవటం.

మరణానంతరం కూడా అజ్ఞానసంస్కారం యథాతథంగా ఉండిపోతుంది. దాని ప్రభావం వల్ల, మళ్లీ పూర్వవిభాగాన్నే పొందటం జరుగుతుంది. అదేవిధంగా, మహాప్రళయంలో మిథ్యాజ్ఞాన శక్తియే విభాగానికి కారణం అని అనుమాన ప్రమాణంతో స్థిరీకరించుకోవాలి. ముక్తులకైతే, యదార్థ జ్ఞానప్రాప్తి వల్ల మిథ్యాజ్ఞానం నిర్విశేషంగా పోతుంది కాబట్టి మళ్లీ జన్మ పొందే ప్రసక్తి ఉండదు.

## సూ: 2.1.10 స్వపక్ష దోషాచ్చ

పూర్వపక్షి వాదనలో ఉన్న దోషాలను ఎత్తి చూపిస్తూ, ఈ దోషాలు ఇరు పక్షాలకు (ప్రధానవాదులకు–బ్రహ్మవాదులకు) సమానంగా వర్తిస్తాయి. కాబట్టి, వాటిని దోషాలుగా పరిగణించ నవసరం లేదని ఇక్కడ స్పష్టం చేయబడుతున్నది.

సాంఖ్యులు శబ్దాది గుణరహితమైన ప్రధానం జగదుత్పత్తికి మూలం అని భావిస్తారు. ఈ విధంగా విలక్షమైన కార్యాన్ని అంగీకరించటం, జగదుత్పత్తికి పూర్వం అసత్కార్యవాదం ప్రసక్తం అవటం ఇరుపక్షాలకు సమానమే అవుతుంది. అదే విధంగా, ప్రళయంలో కార్యం మూలంలో అవిభాగంతో లీనమయినప్పుడు, మూలమైన ప్రధానం రూపసహితము, కలుషితము అయ్యే అవకాశం ఉంది. ప్రళయంలో సమస్త విశేషాలు పూర్తిగా అంతమైపోతే, ప్రతీ పురుషునిలోను ప్రళయానికి పూర్వస్థితి, మళ్లీ ఉత్పత్తిలో వారివారి కర్మానుగత భోగఫలాలను, వేరు చెయ్యటం శక్యం కాదు. అప్పుడు ముక్తులకూ బంధం అంతం కాదు. మళ్లీ జన్మప్రసక్త మవుతుంది. అందువల్ల, ఈ విధంగా దోషాలను ఎత్తిచూపటంలో ప్రయోజనం లేదు.

## సూ: 2.1.11 తర్కాప్రతిష్ఠానాదప్యన్యథానుమేయమితిచేదేవమప్యవిమోక్షప్రసంగః

(తర్కాప్రతిష్ఠానాత్ + అపి + అన్యథా + అనుమేయం + ఇతి చేత్ + ఏవమపి + అవిమోక్ష ప్రసంగః)

ఏది శ్రుతి వల్ల మాత్రమే తెలియబడుతుందో, ఆ విషయాన్ని తర్కబలంతో సాధిద్దామనుకోవటం, అంతుచిక్కని అర్థరహితమైన వాదనే అవుతుంది.

తర్కబలంతో చేసిన వాదనను, వాని కన్నా బుద్ధికుశలత ఉన్న మరోవ్యక్తి ఖండించే అవకాశం ఉంది. ఊహాజనితాలైన తర్కములు శాశ్వతంగా నిలబడలేవు. కపిల–కాణాదుల సిద్ధాంతాలలోనే పరస్పర విరోధం కనబడుతున్నది. అయితే, తర్కాలన్నీ అప్రతిష్ఠాలన్నా లోక వ్యవహారం నడవదు. పాక భోజనాది విషయాలలో లాగే, పూర్వపద్ధతులూ–ఇప్పటి పద్ధతులకు పోలికలు, మంచి చెడ్డలను గుర్తించి లోక వ్యవహారం కొనసాగుతునే ఉంటుంది.

మనువు ధర్మాధర్మ విచక్షణా జ్ఞానానికి, ప్రత్యక్ష అనుమాన ప్రమాణాలతో పాటు శ్రుతిలో ఉన్న ప్రమాణాన్ని కూడా గుర్తించాలని బోధించాడు. అంతేకాకుండా, వేదవిరుద్ధంకాని తర్కంతో ఎవడు అనుసంధానం చేసుకుంటాడో, అతడే ధర్మాన్ని తెలుసుకోగలడని ఇలా వ్యక్తం చేసేదు: *"ప్రత్యక్ష మనుమానం చ శాస్త్రం చ వివిధాగమమ్, త్రయం సువిదితం కార్యం ధర్మ శుద్ధి మభీప్సతా, ఆర్షం ధర్మోపదేశం చ వేద శాస్త్రాऽవిరోధినా యస్తర్కేణ అనుసంధత్తే స ధర్మం వేద నేతరః"* (మ.స్మృ 12.105, 106). శాస్త్ర ప్రమాణం వల్లే పరమాత్మ జగత్కారణం అని బ్రహ్మవాదులు విశ్వసిస్తారు. అలాగే, సమ్యక్ జ్ఞానం వల్ల మోక్షప్రాప్తి కలుగుతుందని మోక్షవాదుల దృఢవిశ్వాసం. భూత, భవిష్యత్ వర్తమానాలకు చెందిన తార్కికులనందరినీ ఒక చోట చేర్చి నిర్ణయించటం, తార్కికవాదులకు శక్యం కాదు. శ్రుత్యాధారిత జ్ఞానసాధన, సమ్యక్ జ్ఞానాన్ని ప్రసాదిస్తుందనే విషయం నిర్వివాదాంశం.

శ్రుతిపరంగాను, శాస్త్రానుగుణంగా ఉన్న తర్కసిద్ధాంతాలను కూడా క్షుణ్ణంగా పరిశీలించి, బ్రహ్మము జగత్తుకు మూల కారణమని, నిజస్వభావమని ఇచ్చట నిర్ధారించడమైనది.

# 4. శిష్టాపరిగ్రహాధికరణమ్

## సూ: 2.1.12 ఏతేన శిష్టాపరిగ్రహా అపి వ్యాఖ్యాతాః

ప్రధాన కారణవాదులు వారి స్మృతుల్లో ప్రతిపాదించిన కొన్ని అంశాలను వేదాలను అనుసరించే ఉండటం వల్ల వాటిని శిష్టులు కూడా అంగీకరించారు. అయితే, బ్రహ్మకారణ వాదాన్ని వారు ఆక్షేపించారు కాబట్టి వారి వాదనను గత అధికరణంలో తిరస్కరించటం జరిగింది. ఈ అధికరణంలో అణ్వాదివాదుల సిద్ధాంతాన్ని కూడా, 'ప్రధానమల్లబర్హణ' న్యాయం చేత తిరస్కరించబడుతున్నది.

వ్యాసుడు, మనువు ఇత్యాది శిష్టులు అణ్వాదికారణ వాదులను పూర్తిగా తిరస్కరించారు. అదీకాక, పరమ గంభీరమైన జగత్కారణం ఊహలతోను, కేవల తర్క సహాయంతోను నిశ్చయింపబడదు. అందువల్ల శ్రుతి విరుద్ధమైన ఈ సిద్ధాంతాలు అంగీకరించబడవు. అవి అద్వైత సిద్ధాంతానికి, బ్రహ్మకారణవాదానికి విరుద్ధములు. అందువల్ల వాటిని తిరస్కరించడమైనది.

## 5. భోక్త్రాపత్త్యధికరణమ్

### సూ: 2–1–13 భోక్త్రాపత్తేరవిభాగాశ్చేత్స్యాల్లోకవత్

**పూర్వపక్షి:**

చేతనుడైన జీవుడు భోక్త. అన్న–శబ్దాది విషయాలు భోగ్యాలు. భోక్త–భోజ్యం అనే విభాగం లోకంలో ప్రసిద్ధమూ, సామాన్యము. భోక్త–భోగ్యంగాను, భోగ్యం–భోక్త గాను అయినా ఈ విభాగానికే ముప్పు వస్తుంది. భోక్త–భోగ్యం ఈ రెండూ మూలమైన బ్రహ్మమునకు అభిన్నములైతే, భోక్తృ–భోగ్యాలు రెండూ ఇతరేతర భావాన్ని పొందేవి, (పరస్పర విరుద్ధములు) అవొచ్చు. అంటే భోగ్యవస్తువు–భోక్త, భోక్త–భోగ్యవస్తువు అయిపోయే అవకాశం ఉంది. అందువల్ల, ఈ విభాగానికి ఎట్టి విఘాతం రాకూడదు. వర్తమాన కాలంలో ఉండే విభాగమే భూతకాలంలో ఉండేది, భవిష్యత్కాలంలో కూడా ఇదే విధమైన విభాగం భోక్తృ–భోగ్యాలలో ఉంటుందనే కల్పించుకోవాలి. లేకపోతే, అద్వితీయమైన బ్రహ్మము, సర్వానికి మూలకారణం అని చెప్పబడదు.

**సిద్ధాంతం:**

జలరూపమైన సముద్రం కంటె ఫేన–బుద్బుద–తరంగాలు భిన్నం కాక పోయినా, అవి నీటి యొక్క వికారాలనే లోకంలో గ్రహించబడుతున్నాయి. ఫేన– బుద్బుద–తరంగాలు ఒకదానిలో మరొకటి కలిసిపోతాయి. అవి సముద్ర జలానికి అభిన్నములైనా, సముద్రానికి అన్యములై పోలేదు. అలాగే భోక్తృ–భోగ్యాలకూ ఇతరేతర భావం ప్రసక్తమవడం కాని, పరబ్రహ్మతో అన్యత్వం ప్రసక్తమవడం కాని ఉండదు. *"తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్"* అనే తైత్తిరీయశ్రుతి వికారాతీతమైన బ్రహ్మ (స్రష్ట) జగత్కార్యంలో ప్రవేశించి భోక్తగా ఉన్నాడు, అని తెలియజేస్తున్నది. కార్యంలో ప్రవేశించిన బ్రహ్మము, ఘటాది ఉపాధులను బట్టి ఆకాశానికి భేదం ఏర్పడినట్లు, సర్వత్రా ఉపాధినిమిత్తమైన విభాగంతో ఉంటుంది. పరమకారణమైన బ్రహ్మము కంటె, జగత్తు అనన్యమైనప్పటికీ, పైన ఉదహరించిన సముద్రతరంగాది విభేదం లాగ, భోక్తృ–భోగ్య రూపమైన విభాగంతో ఉండవచ్చు.

# 6. ఆరంభణాధికరణమ్

క్రిందటి అధికరణములో సముద్రము–తరంగాలు–ఫేన–బుద్బుదాలు వేరుగా కనబడుతున్నా, అవి సముద్రానికి అభిన్నములు కావని చెప్తూ, అదే విధంగా బ్రహ్మమునకూ జగత్తుకు భేదాభేధాలు రెండూ సమన్వయించుకోబడతాయని ప్రస్తావించటం జరిగింది. ఈ అధికరణంలో వ్యావహారిక దృష్టితో బ్రహ్మకూ–జగత్తుకు భేదము కల్పించబడ్డా, పారమార్థికంగా అట్టి విభాగము లేదని స్థాపించబడుతున్నది.

## సూ: 2.1.14 తదనన్యత్వమారంభణశబ్దాదిభ్యః

వాచారంభణం ఇత్యాది శబ్దాల వల్ల కారణమైన బ్రహ్మకూ, కార్యమైన జగత్తుకూ ఎట్టి భేదము లేదని సూత్రార్థం.

ఆకాశాదులతో సర్వత్ర వ్యాపించి ఉన్న జగత్తు వేద్యం జగత్తు దానికి కారణం. కారణం కన్న, కార్యమైన ఈ విస్తృతమైన ప్రపంచం అన్యము కాదని శ్రుతి నిర్ధారిస్తున్నది: *"యథాసోమ్య ఏకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాత్ వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యమ్"* (ఘట–శరావాదు లన్నీ మట్టితో చెయ్యబడ్డ ఆకారాలే; నామ–రూపాల భేదంవల్ల అవి మట్టి కన్నా భిన్న వస్తువుల్లా వికారరూపంలో వేరు చెయ్యబడుతున్నాయి. మూలం, మట్టి అన్నదే సత్యం – ఛా.ఉ 6.1.1). ఈ దృష్టాంతం చూపుతూ, బ్రహ్మమునకు వ్యతిరిక్తమైన జగత్తు లేదని నిరూపింపబడుతున్నది.

పృథివీ–తేజస్–ఉదకం ఈ మూడు పరమాత్మ నుండి పుట్టినవే. తన్మాత్ర రూపాలైన ఈ మూడింటిని, త్రివృత్కరణ ప్రక్రియలో కలిపినట్లు శ్రుతివాక్యం ఇలా విన్పదుతున్నది: *"యదగ్నే రోహితం రూపం తేజస్తద్రూపం, యచ్ఛుక్లం తదపాం, యత్ కృష్ణం తదన్నస్య, అపాగా దగ్నే రగ్నిత్వం వాచారంభణం వికారో నామధేయం త్రీణిరూపాణీత్యేవ సత్యమ్"* (ఛా.ఉ 6.4.1). త్రివృత్ కృతములైన మహాభూతముల సముదాయము మాత్రమే ఈ ప్రపంచము. అగ్నిలోని ఎర్రని రూపము తేజస్సు, తెల్లని రూపము ఉదకముల రూపము, నల్లనిది అన్నరూపంలో ఉన్న పృథివి యొక్క సూక్ష్మరూపము. అగ్నిలోని మూడు రూపాలను వేరు చేస్తే అగ్ని అంటూ వేరేదేదీ ఉండదు. ఈ విధంగా కార్యాలన్నింటిని వేరు చేసుకుంటూ పోతే చివరకు మిగిలేది బ్రహ్మమే – అదే సత్యం మిగిలినవన్నీ కల్పించుకొన్న మిథ్యారూపాలే.

ఆరంభణ శబ్దంతోపాటు, ఆత్మైకత్వాన్ని ప్రతిపాదిస్తున్న *"ఐతదాత్మ్యం సర్వం తత్సత్యం"* , *"స ఆత్మా తత్త్వమసి"* , *"సర్వం ఇదం యదయమాత్మా"* , *"బ్రహ్మైవేదం సర్వమ్"* , *"ఆత్మైవేదం సర్వం"* , *"నేహనానాస్తి కించన"* ఇత్యాది శ్రుతి వచనాలను అన్వయించుకోవాలని సూత్రంలోని చివరనున్న 'ఆదిభ్యః' శబ్దం సూచిస్తున్నది.

ఘటాకాశం మహదాకాశం కంటే భిన్నమనే మిథ్యాజ్ఞానం, ఘట విచ్ఛిన్నంతో ఎలా పోతుందో, మృగతృష్ణలో నీరు లేదని ఎలా తెలుసుకుంటామో, అలాగే భోగ్య– భోక్తృ సముదాయం, బ్రహ్మ కంటె అభిన్నమని యదార్థజ్ఞానం వల్ల అవగతమవుతుంది.

**ఆక్షేపణ:**

బ్రహ్మము అనేకాత్మకమైనది. వృక్షానికి అనేక శాఖలున్నట్లు, బ్రహ్మలో కూడ అనేక ప్రవృత్తులు, శక్తులూ ఉన్నాయి. అందువల్ల ఏకత్వం–నానాత్వం రెండూ సత్యమనే భావించాలి. సముద్రం అంటే ఏకత్వం, ఫేన–బుద్బుద–తరంగాది భేదం చేత నానాత్వం. మృత్‌లో ఏకత్వం. ఘట–శరావాదుల్లో నానాత్వం. ఏకత్వాంశం వల్ల మోక్షం లభిస్తే, నానాత్వం వల్ల లౌకిక (సాంసారిక) వ్యవహారం జరుగుతుంది. ఇలా అన్వయించుకుంటే మృదాది దృష్టాంతాలు మూలానికి అనుగుణాలు (అనురూపాలు) అవుతాయికదా?

**సమాధానం:**

*"మృత్తికేత్యేవ సత్యమ్"* అనే వాక్యం ప్రకృతి మాత్రమే సత్యమూ, నామ రూపాలతో ఉన్న కార్యసముదాయమంతా

అసత్యమని వాచారంభణ శబ్దంలో స్పష్టం చేయబడుతున్నది. అలాగే బ్రహ్మము విషయంలో కూడా మూలకారణం ఒక్కటే సత్యమని *"స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో"* ఇత్యాది వాక్యాల్లో చెప్పబడింది. బ్రహ్మాత్మత్వం తెలుసుకొన్న వ్యక్తికి, నానాత్వ భావన ఉండదు. దీనినే శ్రుతి ఇలా బోధిస్తున్నది: *"యత్ర తు అస్య సర్వమాత్మైవాభూత్ తత్ కేన కం పశ్యేత్"* (బృ.ఉ 4.5.15). ఆత్మ సాక్షాత్కారం చేసుకొన్న జ్ఞానికి క్రియా–కారక–ఫల లక్షణాలున్న వ్యవహారంతో ఏ ప్రమేయం ఉండదు.

అవస్థావిశేషాన్ని బట్టి వ్యవహారాభావం ఉంటుంది అని చెప్పడం కూడావీలు కాదు. అంటే సంసారావస్థలో మాత్రమే ప్రమాణాలతో తెలుసుకునే వ్యవహార జ్ఞానం (ప్రమాతృత్వం) ఉంటుంది కాని, బంధవిముక్తావస్థలో ఉండదు అనే వాదన యుక్తం కాదు. నువ్వే బ్రహ్మము (బ్రహ్మాత్మత్వభావం) అని నిర్దేశిస్తున్న 'తత్త్వమసి' ఉపదేశం, మరణానంతరం నువ్వు బ్రహ్మము కాబోతున్నావని చెప్పలేదు. బ్రహ్మాత్మత్వ భావం నిత్య సిద్ధమైనదనే స్పష్టం అవుతున్నది. నానాత్వం అజ్ఞానం వల్ల వచ్చేది, ఏకత్వమే పారమార్థికం అని చెప్పబడుతున్నది. *"మృత్యోః సమృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి"* (బృ.ఉ 4.4.10). ఈ శ్రుతి భేదదృష్టిని నిరాకరిస్తూ అభేదమే సత్యమని నిర్ధారిస్తున్నది. సత్యమైన బ్రహ్మ ఏకత్వాన్ని గుర్తించినవాడు బంధ విముక్తుడవుతాడు. అది గ్రహించక అసత్యమైన నానాత్వాన్ని చూచేవాడు భవబంధంలో చిక్కుకుంటాడు.

**ఆక్షేపణ:**

కేవలం ఏకత్వవాదననే ( *'ఖల్విదం బ్రహ్మ'* అనే వాదనను) అంగీకరిస్తే, లౌకిక ప్రమాణాలన్నీ నిష్ప్రయోజనాలు అవుతాయి. విధిశాస్త్రమూ, ప్రతిషేధ శాస్త్రమూ భేదాన్ని గుర్తించి చెప్పినవే కదా? మోక్షోపదేశం కూడా విద్యావిహీన శిష్యుడూ, శాసించే ఆచార్యుడూ అనే భేదంపై ఆధారపడి చెప్పినదే. అదీకాక, అసత్య ప్రాతిపదిక మీద ఆధారం చేసుకొని బోధింపబడిన ఆత్మైకత్వం సత్యం ఎలా అవుతుంది?

**సమాధానం:**

స్వప్నాంతం జాగ్రదవస్థలోకి వచ్చిన తరవాత, స్వప్న దృశ్యాలు అవాస్తమని తెలుసుకున్నట్లే, బ్రహ్మైకత్వ జ్ఞానానికి పూర్వం సమస్తవ్యవహారమూ సత్యమనే భావన ఉంటుంది, ఆత్మైకత్వ జ్ఞానం కలిగిన తరవాతే అది అంతా మిథ్య అనే విషయం విదిత మవుతుంది. ప్రతీప్రాణీ, అవిద్యాప్రభావం వల్ల స్వాభిమానంతో నేను–నాది అనేమిథ్యా జ్ఞానంతో ఉండడం స్వాభావికం. స్వప్నంలో ఉన్నంతసేపూ, స్వప్నదృశ్యాలు అసత్యా లయినా, నిజంగానే కనబడతాయికదా! ఆ స్థితిలో ప్రత్యక్షాభాసం అనే అనిపించదు.

**సంశయం:**

సర్పభ్రాంతితో, సర్పమే కరిచింది అని అనుకునేవాడు మరణించడు. అలాగే ఎండమావిలో నీళ్లు త్రాగాననే భ్రమపడినవాడికి ఎట్టి ప్రయోజనము ఉండదుకదా?

**సమాధానం:**

స్వప్నంలో ఒక వ్యక్తి సర్పం కరచినట్లు, తనకు స్నానాదులు జరుగుతున్నట్లు భ్రమ పడుతుంటాడు. మేల్కొన్న తరువాత నిజంగా తనకు ఏ పామూ కరవలేదని, స్నానాది దృశ్యాలు అవాస్తవములని స్మరించగలుగుచున్నాడు. ఈ దృష్టాంతం స్వప్నంలో అనుభవించిన క్లేశం దేహాతీతమైనదని స్పష్టం చేస్తున్నది.

లోకవ్యవహారంలో, భేద వ్యవహారం–అభేదవ్యవహారం రెండూ కనబడతాయి కాబట్టి రెండూ సత్యములే అని నిశ్చయించబడదు. భేదవ్యవహారం – అభేదవ్యవహారం రెండూ ఒకే కాలంలో జరగవు. భేదవ్యవహారం ఉన్నప్పుడు అభేదవ్యవహారం ఉండదు. అలాగే అభేదవ్యవహారం ఉన్నప్పుడు, భేదవ్యవహారం ఉండదు. భేదవ్యవహారం లౌకికం–అభేదవ్యవహారం పారమార్థికం.

ఆత్మైకత్వ జ్ఞానమే చివరఘట్టం, దాని తరవాత దేని ఆకాంక్ష ఉండదు. ఆత్మైకత్వ జ్ఞానం కలగకముందు లౌకికమూ–వైదికమూ అయిన సమస్త సత్య–అసత్య వ్యవహారమూ ఎట్టి అవరోధం లేకుండా సాగుతుంది. ఆత్మైకత్వ జ్ఞానప్రాప్తితో,

పూర్వం ఉన్న భేదవ్యవహారం పూర్తిగా పోతుంది. అందువల్ల బ్రహ్మము అనేక రూపాలలో ఉంటుందనే భావనే ప్రసక్తం కాదు.

**సంశయం:**

మృదాదులను దృష్టాంతంగా చెప్పడం వల్ల బ్రహ్మ విషయంలో కూడా పరిణామం (మార్పు) ఉంటుందనే నమ్మవలసి వస్తుంది కదా?

**సమాధానం:**

బ్రహ్మ కూటస్థ నిత్యం. *"స ఏష మహానజ ఆత్మాఽజరోఽమరోఽమృతో ఽభయో బ్రహ్మ"* (బృ.ఉ 4.4.25), అలాగే *"అస్థూలమనణు"* (బృ.ఉ 3.8.8)... ఇత్యాది శ్రుతులు బ్రహ్మవిషయంలో ఎట్టి పరిణామరూపమైన ధర్మాలు ఉండవనే నిర్దేశిస్తున్నవి. ఎట్టి వికారములు లేనిదవటం వల్ల బ్రహ్మము నిత్యమూ, కూటస్థమూ. ఆత్మైక దర్శనం వల్ల ఏ విధంగా మోక్షఫలసిద్ధి లభిస్తుందో, అదేవిధంగా జగదాకా రంలో బ్రహ్మమును తెలిసికోవటం వలన, ఏదో ఒక ఫలం లభిస్తుందనే వాదన కూడా యుక్తం కాదు. కూటస్థ బ్రహ్మాత్మత్వ జ్ఞాన మొక్కటే ఫలదాయకం. ఈ విషయాన్నే బృహదారణ్యక శృతి *"నేతి నేతి ఆత్మా"* అని ఉపక్రమించి *"అభయం వై జనక ప్రాప్తో ఽసి"* అని ఉపసంహరిస్తూ బోధిస్తున్నది.

**ఆక్షేపణ:**

సంసార, ప్రపంచాలకు బీజములైన నామ–రూపాదులు, సర్వజ్ఞుడైన ఈశ్వరుని యొక్క మాయాశక్తి అని నిర్దేశిస్తున్న శ్రుతి–స్మస్మృతి ప్రమాణాలు ఉన్నాయి. *"ఆకాశో వై నామ నామరూప యోర్నిర్విహితా తే యదంతరా తద్బ్రహ్మ"* (ఛా.ఉ 8.14.1); *"సర్వాణి రూపాణి విచిత్య ధీరః నామాని కృత్వాభివదన్ యదాస్తే"* (తై.ఆ 3.12.7). ఈశ్వరుడు నామ–రూప ఉపాధులననుసరించే ఉంటాడని సూచించడం వలన ఈశ్వరుని యొక్క ఈశ్వరత్వం, సర్వజ్ఞత్వం ఇత్యాది గుణాలు అవిద్యారూపమైన ఉపాధులందున్న పరిచ్ఛేదం వల్ల ఏర్పడినవే అని అర్థం చేసుకోవలసి వస్తుంది. పారమార్థిక అవస్థలోనే, ఏ లౌకిక సంబంధమైన వ్యవహారము ఉండదని శ్రుతులు విన్పిస్తున్నవి: *"యత్ర నాన్యత్ పశ్యతి, నాన్యత్ శృణోతి నాన్యత్ విజానాతి స భూమా"* (ఛా.ఉ 7.24.1). అలాగే *"యత్ర తు అస్య సర్వమాత్మైవాభూత్ తత్ కేన కం పశ్యేత్"* (బృ.ఉ 4.5.15). అంటే, దీని భావం లౌకికంగా అవిద్యాకృత వ్యవహారం తప్పదనే కదా? భగవద్గీతలో కూడా ఇదే బోధన కనబడుతుంది: *"న కర్తృత్వం న కర్మాణి సృజతి ప్రభుః, న కర్మఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే"* (భ.గీ 5.14). పరమేశ్వరుడు మనుష్యుల యొక్క కర్తృత్వాన్ని కాని, కర్మను కాని, కర్మఫలాన్ని కాని సృజించడు. వీటికి కారణం వారి ప్రకృతియే. అలాగే *"నాదత్తే కస్యచిత్ పాపం న చైవ సుకృతం విభుః అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః"* (సర్వవ్యాపి అయిన పరమాత్మ, ప్రాణుల పుణ్య–పాపాలను పంచుకోడు. అజ్ఞానంతో కర్తృత్వాలను తమపై ఆరోపించుకొని మోహితులవుతుంటారు – భ.గీ 5.15). *"ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశే-ర్జున తిష్ఠతి, భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా"* (సర్వప్రాణుల హృదయంలోనే ఉంటూ ఈశ్వరుడు తన మాయ చేత వారి కర్మలతోనే వారిని భ్రమింపచేస్తుంటాడు – భ.గీ 18.61). ఈ ఆక్షేపణలకు సమాధానంగా క్రింది సూత్రం చెప్పబడింది.

## సూ: 2.1.15 భావే చోపలబ్ధేః

కారణం ఉన్నప్పుడే కార్యం కనబడుతున్నది కాబట్టి, కార్యం కారణం కన్నా అభిన్నమని అనుమానించాలి. మట్టి ఉన్నప్పుడే ఘటం, దారాలు ఉన్నప్పుడే వస్త్రం ఉంటుంది. ఘటానికి నిమిత్తకారణమైన కులాలుడు లేని చోట కూడా ఘటం కనబడుతున్నది. అగ్ని ఉన్నప్పుడే ధూమం ఉంటుంది అని కూడా నిర్ణయించబడదు. అగ్ని ఆర్పేసిన తరవాత కూడా పిల్లలు చిన్న చిన్న కుండలలో పొగనింపి చూపుతుం టారు. ఇలాటివి సామాన్యం. ఇది అనుమానపరంగా చేసిన వ్యాఖ్య. ఇప్పుడు ప్రత్యక్ష పరంగా కూడా సమాధానం చెప్పబడుతున్నది.

దారాలు ఒకవిధంగా కూర్చి బట్ట నేస్తున్నారు. ఈ తంతువులకు భిన్నంగా బట్ట లేదు. దారముల యొక్క ఓతప్రోతాలు, తదితర అంశాలే బట్టలో కనబడతాయి. లోహిత–శుక్ల–కృష్ణ రూపాలలో అగ్ని, అగ్నికి కారణమైన వాయువు,

దానికి కారణ మైన ఆకాశం ఇలా మూలాన్ని అన్వేషించుకుంటూ పోతే చివరకు పరబ్రహ్మము తప్ప మరేదీ చిక్కదు. సర్వప్రమాణాలు పరబ్రహ్మము దగ్గరే అంతమైపోతాయి.

## సూ: 2.1.16 సత్త్వాచ్చావరస్య

కారణంలో కార్యం కనబడుతున్నది కాబట్టి, కార్యకారణాలకు అనన్యత్వం ఉంది. *"సదేవ సోమ్య ఇదమగ్ర ఆసీత్"* (ఛా.ఉ 6.2.1). *"ఆత్మావా ఇదమేక ఏవాగ్ర ఆసీత్"* (ఐ.బ్రా 2.4.1.1). ఈ విధంగా వినిపిస్తున్న శ్రుతివాక్యాలు జగదుత్పత్తికి పూర్వం కారణమైన పరమాత్మ 'సత్' రూపంలోనే ఉంది అని తెలుపుతున్నాయి. మూలంలో లేనిది, దాని నుంచి పుట్టదు. ఇసుకలో తైలం లేదు – అందువల్ల తైలం ఇసుక నుండి పుట్టదు. కారణమైన బ్రహ్మము మూడు కాలాలలోను సత్ రూపంలోనే ఉంటుంది, అసత్ అయ్యే ప్రసక్తే లేదు. కారణమైన బ్రహ్మములోని సత్త్వమ్, జగత్తులో ఉన్న సత్త్వమ్ ఒకటే. అందువల్ల కార్యమైన జగత్తు, కారణమైన బ్రహ్మకు అనన్యము.

## సూ: 2.1.17 అసద్వ్యపదేశాన్నేతి చేన్న ధర్మాంతరేణ వాక్యశేషాత్

జగదుత్పత్తికి పూర్వం, కార్యం అసత్తని పలుకుతున్న శ్రుతులు కూడా వినిపిస్తున్నవి కాబట్టి, ఉత్పత్తికి పూర్వం కార్యానికి సత్త్వం లేదని పూర్వపక్షి ఆక్షేపణ. తైత్తిరీయ శ్రుతి *"అసద్వా ఇదమగ్ర ఆసీత్"* (తై.ఉ 2.7.1), అలాగే ఛాందోగ్యశ్రుతి *"అసదేవ ఇదమగ్ర ఆసీత్"* (ఛా.ఉ 7.19.9) వినిపిస్తున్నవి కదా? దీనిని తిరస్కరిస్తూ సమాధానం ఇలా చెప్పబడింది: బ్రహ్మ అవ్యాకృత రూపంలో సద్రూపంలో ఎప్పుడు ఉన్నదనే వాక్యశేషంలో, *"తత్సదాసీత్"* అని స్పష్టంగా ఉంది. అదీకాక *"తదాత్మానం స్వయమకురుత"* అని విశేషించి చెప్పడం కూడా విన్పిస్తున్నది. వ్యాకృత నామ రూపాలకు పూర్వధర్మం అవ్యాకృత నామరూప ధర్మం. ఇట్టి అవ్యాకృత నామరూప ధర్మాన్నే పైన ఉదహరించిన శ్రుతుల్లో 'అసత్' గా గ్రహించాలి.

## సూ: 2.1.18 యుక్తేః శబ్దాంతరాచ్చ

యుక్తితోను, మరికొన్ని శ్రుతి వాక్యాల ఆధారంతోను కార్యంలో సత్త్వం ఉన్నదని, కారణం కంటె కార్యము అనన్యమని చెప్పబడుతున్నది. పెరుగు–పాలతోను, ఘటాదులు మట్టితోను, ఆభరణాలు బంగారంతోను తయారు అవుతాయి. పెరుగు కావలసి వచ్చినప్పుడు పాలసంగ్రహమే చేస్తారు, కాని మట్టిని కాదు. ఘటాదుల కోసం బంగారం వెతకరు కదా! అసత్కార్య వాదంలో, ఉత్పత్తికి పూర్వం ఏ కార్యం, కారణంలో ఉండదు. అప్పుడు పెరుగు–పాల నుండే ఎందుకు వస్తుంది, మట్టి నుండి ఎందుకు పుట్టదు ఇట్లాంటి ప్రశ్నలు ఉత్పన్నమవుతాయి.

కారణంలో కల్పించబడే శక్తి, కారణం కంటే అన్యమైనా లేక కారణంలో ఏదో రూపంలో లేకపోయినా కార్యం జరగదు. అందువల్ల పరమాత్మ శక్తి కారణ స్వరూపమైనది, కార్యమైన ఈ జగత్తు, తత్ కారణ స్వరూపమనే నిర్ధారించుకోవలసి ఉంది. క్షీరాది ద్రవ్యాలు–ధధ్యాది రూపాలలో ఉన్నప్పుడే దాని కార్యం ఇది అని నిర్దిష్టంగా చెప్పబడుతుంది. కార్యం, కారణం కంటె అన్యమైనది అని నూరు సంవత్సరాలు వాదించినా స్థాపించబడదు.

(ఇలా వ్యాఖ్యానించిన తరువాత భగవత్పాదులవారు తమ భాష్యంలో మరికొన్ని తర్కాధారిత యుక్తులను ప్రస్తావించారు. అయితే, సూత్రాన్ని అర్థం చేసుకోటానికి ఇంతవరకు భాష్యంలో వివరించిన దృష్టాంతాలు సరిపోతాయని, భాష్యాన్ని కుదించి సమర్పించటం జరిగింది.)

మూలకారణమైన పరబ్రహ్మయే చిట్టచివర కార్యరూపం వరకు వివిధ ఆకారాలలో నటుడి రూపంలో కనబడుతూ ఉంటుంది. ఆ మూలమే సమస్త వ్యవహారాలకు స్థానం అవుతున్నది.

ఇప్పుడు ముందు సూత్రంలో పూర్వపక్షి ఉదహరించిన అసత్ పక్షాన్ని వ్యతిరేకిస్తూ శబ్దాంతర వాక్యాలను ఇలా

ప్రస్తావించటం జరిగింది: *"సదేవ సోమ్య ఇదమగ్ర ఆసీత్ ఏక మేవాద్వితీయమ్"* (ఛా.ఉ 6.2.1) ఈ వాక్యంలో ఇదం శబ్దం, సచ్ఛబ్ద వాచ్యమైన కారణంతో సమానాధి కరణ్యంతో విన్పిస్తున్నది అంటే ఈ కార్యమే ఆ 'సత్' అని నిర్ధారిస్తున్నదని అర్థం చేసుకోవాలి. అందువల్ల కార్యానికి కూడా సత్‌తో పాటు, సత్త్వం అనన్యత్వం ఉన్నాయనే నిర్ధారించుకోవాలి.

## సూ: 2.1.19 పటవచ్చ

ఏదైనా వస్త్రం మడతపెట్టి ఉన్నప్పుడు దాని పూర్తి విశేషాలు కనబడని కారణంగా, దాని పొడవు, వెడల్పు, రంగు తదితర విశేషణాలను చెప్పలేము. ఆ వస్త్రాన్ని పూర్తిగా పరచి చూచినప్పుడే దాని కార్య సంబంధ గుణాలు, దారాలు వాటి నాణ్యత, నేతకారుల పనితనము, సాధన సామగ్రి, ఇత్యాది వెన్నో అనేక విశేషాలు అభివ్యక్తమవుతాయి. ఇదే మడతలోనున్న వస్త్రము– మడత విప్పి పరచి ఉన్న వస్త్రము అనే న్యాయాన్ననుసరించి కార్యం—కారణం కంటె అనన్యమని నిర్ధారించుకోవొచ్చు.

## సూ: 2.1.20 యథా చ ప్రాణాది

పంచప్రాణాల యొక్క భేదాలే అయిన ప్రాణాపానాదులు, ప్రాణయామం చేత నిరోధింపబడి కేవలం కారణరూపంలో ఉన్నప్పుడు, జీవించి ఉండడం అనే కార్యం మాత్రమే జరుగుతుంది. శరీరావయవాలను మరోవిధంగా వంచటం, మలచటం ఇత్యాదులు చెయ్యబడవు. ప్రాణభేదాలు మళ్లీ పనిచేయడం ప్రారంభించి నప్పుడు జీవించి ఉండడం కంటె అధికమైన మిగతా అవయవ వ్యాపారము నిర్విరోధంగా జరిగిపోతుంది. అన్ని పనులూ జరుగుతాయి. వాయువు అనే రూపంలో పంచప్రాణాలూ (ప్రాణాపాన ఉదానాదులు) కలిసే ఉంటాయి. ప్రాణం కంటె అన్యములు కావు. అదే విధంగా జగత్సమస్తమూ బ్రహ్మము యొక్క కార్యమవడం వల్ల జగత్తు బ్రహ్మమునకు అనన్యము. దీనినే శ్రుతి ఇలాబోదిస్తున్నది: *"యేనాశ్రుతం శ్రుతం భవతి, అమతం మతం, అవిజ్ఞాతమ్ విజ్ఞాతమ్"* (ఛా.ఉ 6.1.3).

## 7. ఇతర వ్యపదేశాధికరణమ్

## సూ: 2.1.21 ఇతరవ్యపదేశాద్ధితాకరణాదిదోషప్రసక్తిః

(పూర్వపక్ష సూత్రం)

బ్రహ్మకారణవాదం ఇప్పుడు మరోవిధంగా ఆక్షేపింపబడుతున్నది. *"స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో"* అని బోధిస్తున్న ఛాందోగ్యశ్రుతి (ఛా.ఉ 6.8.7) శారీరుడైన శ్వేతకేతుని నువ్వే బ్రహ్మవని బోధిస్తున్నది. *"తత్ సృష్ట్వా తదేవాను ప్రావిశత్"* అనే తైత్తిరీయశ్రుతి (తై.ఉ 2.6), బ్రహ్మమునకు శరీరాత్మత్వం కల్పిస్తున్నది. అంటే బ్రహ్మము ఏ వికారాలు లేకుండా శారీరాత్మ అయినట్లు చెప్తున్నది. *"అనేన జీవేనాత్మనాను ప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి"* అనే ఛాందోగ్య శ్రుతి (ఛా.ఉ 6.3.2), శారీరుడు బ్రహ్మము కన్నా వేరుకాదని, ఆ పరదేవతే నామ–రూపాలతో జీవులలో ప్రవేశించినదని వినిపిస్తున్నది. ఈ విధంగా శారీరుడికి సృష్టి కర్తృత్వం రావాలి. అప్పుడు శారీరుడు స్వతంత్రుడై జరా–మరణ పాశాలను తనంతట తాను సృష్టించుకుంటున్నాడు అనే, అర్థం వస్తుంది. కాని, పరాధీనుడు కానివాడెవడూ దుఃఖతరమైన జీవితాన్ని కోరుకోడు. మాయావి తన ఇష్టప్రకారము సృజించిన మాయను తనే ఉపసంహరించుకోవటం సామాన్యం. అలాగే శారీరుడు తను సృష్టించుకొన్న జరామరణ క్లేశాదుల నుండి అనాయాసంగా బయటపడాలి. అయితే, ఇది ఎక్కడా కనబడదు. ఈ విధంగా హిత క్రియాదులు ప్రత్యక్షంగా కనబడకపోవటం వల్ల చేతనం నుండి జగత్ ప్రక్రియ కాలేదనే అనిపిస్తున్నది.

## సూ: 2.1.22 అధికంతు భేదనిర్దేశాత్

'తు' ప్రత్యయం పూర్వపక్షాన్ని తిరస్కరిస్తూ సూత్రంలో సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తున్నది. సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడు నిత్య–శుద్ధ–బుద్ధ ముక్త స్వభావమున్న పరబ్రహ్మము సృష్టి కర్త, జగత్కారణం అనే వేదాంత ప్రాతిపదిక, పరమాత్మకు శక్తి పరమైన, జ్ఞానపరమైన ప్రతిబంధకం లేదనే స్పష్టం చేస్తుంది. శారీరుడికే పరిమిత జ్ఞానం–శక్తి ఇత్యాది విశేషాలు వర్తిస్తాయి. జగత్ సృష్టి, శారీరుడి వశం కాదు. ఆత్మ జీవుని కన్నా మహచ్ఛక్తి కలది. అందుకే ఆత్మ దర్శనంతో పరమాత్మను తెలుసుకోమని శ్రుతులు ఇలా విన్పిస్తున్నవి: *"ఆత్మా వా అరే! ద్రష్టవ్యః, శ్రోతవ్యో, మంతవ్యో నిదిధ్యాసితవ్యః"* (బృ.ఉ 2.4.5), *"సోఽన్వేష్టవ్యః స విజ్ఞాసితవ్యః"* (ఛా.ఉ 8.7.1), *"స తా సోమ్య తదా సంపన్నో భవతి"* (ఛా.ఉ 6.8.1), *"శారీర ఆత్మా ప్రాజ్ఞేనాత్మ నాన్వారూఢః"* (బృ.ఉ 4.3.35).

**సంశయం:**

*"తత్త్వమసి"* ఇత్యాది శ్రుతి వాక్యాల్లో అభేద నిర్దేశం స్పష్టంగా వినబడు తున్నది. భేదాభేదాలు రెండూ ఎలా సంభవమవుతాయి? భేదం ఉంటున్న ప్పుడు–అభేదం ఎలా నిర్దేశించబడుతుంది?

**సమాధానం:**

ఉపాధి భేదం చేత మహదాకాశ–ఘటాకాశాలలో భేదం ఎలా కన్పడుతుందో అలాగే ఉంటుందని, ముందు చాలా పర్యాయములు వివరించటం జరిగింది. అవిద్యా కల్పితమైన, దేహేంద్రియ సంఘాతము వల్ల ఏర్పడిన భేదవ్యపదేశం మిథ్యయే కాని, యథార్థంగా లేదని కూడా ముందు చాలా పర్యాయములు స్పష్టం చెయ్యబడింది. లౌకికంగా భేద బుద్ధి ఉన్నంత వరకు బ్రహ్మ–జీవుడి కన్నా ఎంతో అధికుడనే భావన ఉంటుంది. బ్రహ్మవేత్తకు ఎట్టి భేద జ్ఞానమూ ఉండదు. హితకరణాదులు జీవాత్మ యొక్క ధర్మాలు, ఇవి సృష్టికర్తకు ప్రసక్తమయే ప్రశ్నే ఉత్పన్నం కాదు.

## సూ: 2.1.23 అశ్మాదివచ్చ తదనుపపత్తిః

లోకంలో ఎన్నో రాళ్ళు ఉంటాయి. అన్నీ పృథివీ జాతికి చెందినవే అవుతాయి. కాని, వాటిలో కొన్ని వజ్రవైడూర్యాది ఎంతో విలువైనవి ఉంటాయి, కొన్ని విలువలేనివి ఉంటాయి. అదేవిధంగా వృక్షాలలోను వైచిత్ర్యం కనబడుతుంది. చందనం

ఇత్యాది వృక్షాలు, వాసన వెదజల్లే పూలజాతులు, సాధారణమైన వృక్షాలు ఉంటాయి. అన్నరసం రక్తాన్ని పోషిస్తుంది, కేశ–లోమాలను కూడా పోషిస్తుంది. అదేవిధంగా బ్రహ్మమునకు ప్రాజ్ఞుడు, జీవుడు అనే భేదంతోనే కాకుండా చిత్రవిచిత్ర రూపాలలో ప్రతిబింబించటం కూడా సంభవమే.

స్వప్నంలో విచిత్రమైన దృశ్యాలు చూడటం సంభవిస్తున్నది కదా! అలాగే ఈ భేదం కూడా కుదురుతుంది. అయితే శ్రుతి *"వాచారంభణం వికారో నామధేయ మనే"* నిర్ధారిస్తున్నది. అందువల్ల చిత్ర విచిత్రమయిన కార్య భేదమంతా వాగ్వ్యాపారం చేత కల్పితమైనదే. కారణ స్వరూపమైన పరమాత్మయే సత్యము. అదే శాశ్వతము.

# 8. ఉపసంహారదర్శనాధికరణమ్

## సూ: 2.1.24 ఉపసంహారదర్శనాన్నేతి చేన్న క్షీరవద్ధి

**పూర్వపక్షి:**

అద్వితీయమైన బ్రహ్మము చేతన స్వరూపమైనా, బ్రహ్మము ఏ సహాయము తీసుకోకుండా జగత్ సృష్టికి కారకుడని అంగీకరించబడదు. అది శక్యము కాని పని, కులాలుడు ఘటాది వస్తువులను నిర్మించటానికి మట్టి, చక్రము, కర్ర ఇత్యాది సాధనములనన్నింటిని సమకూర్చుకోవలసి వస్తుంది కదా? అలాగే బ్రహ్మము ఏ సాధనసామగ్రి యొక్క ఆవశ్యకత లేకుండా, ఒక్కడే విశ్వసృష్టి ఎలా చెయ్యడం సాధ్యము? అందువల్ల బ్రహ్మము జగత్కారణం కాదనిపిస్తున్నది.

**సిద్ధాంతం:**

పాలకు స్వయంగా పెరుగుగా పరిణమించే స్వభావం ఉంది. బాహ్య సాధనాపేక్ష లేకుండా క్షీరం దధిగా మారుతున్నది. ఉష్ణత్వం లాంటి సాధనాలు ఆ ప్రక్రియను వేగవంతం చెయ్యటానికి ఉపకరిస్తాయి. పాలలో స్వభావసిద్ధమైన దధిగా మారే గుణం లేకపోతే, ఏ సాధన వల్ల పాలు పెరుగుగా మారవు. వాయువు, ఆకాశం ఇత్యాదులు ఉష్ణత్వ సాధనం చేత పెరుగుగా మారవు కదా! సాధన సామగ్రి వికారానికి పూర్ణత్వం చేకూరుస్తుంది. బ్రహ్మమునకు విచిత్రమైన శక్తులు, పరిపూర్ణత్వం ఉన్నాయి కాబట్టి క్షీరాదుల్లో కలిగినట్లు పరిణామం సాధ్యమవుతుంది. ఇందులో ఎటువంటి సందేహమునకు తావు లేదు.

## సూ: 2.1.25 దేవాదివదపి లోకే

దేవతలకు, సాలెపురుగు ఇత్యాది ప్రాణులకు ఎవరి సహాయం లేకుండా వాటికి కావలసినవి సమకూర్చుకొనే శక్తి ఎలా ఉందో, అలాగే పరబ్రహ్మమునకు సృష్టికార్యము సాధ్యమవుతుంది.

దేవతలు, ఋషులు, పితృదేవతలకు ప్రభావ విశేషం చేత స్వసంకల్పంతో శరీరాదులను, రథాదులను సృష్టించుకొనే శక్తి ఉంటుందని ఇతిహాస–పురాణాలు, వేదమంత్ర అర్థవాదాలు సూచిస్తున్నాయి. లోకంలో సాలెపురుగు తనే దారాన్ని సృజించుకొని దానిలో సంచరిస్తూ ఉంటుంది. కొన్ని జాతి కొంగలు మేఘగర్జనతో (పురుష సంయోగం) లేకపోయినా గర్భం ధరిస్తాయి. తామర తీగ (పద్మ లత) ఒక సరస్సు నుండి మరో సరస్సుకు బాహ్యసాధనాపేక్ష లేకుండా విస్తరిస్తుంది. అలాగే, చేతనమయుడైన బ్రహ్మము ఎట్టి బాహ్యాపేక్షా లేకుండా జగత్ సృష్టి చెయ్యడంలో అసాధ్యమేముంటుంది? అయితే సాలెపురుగు, కొంగ, దేవతాదులు బ్రహ్మముతో సమానత్వం ఉన్నవి కావు. ఈ దృష్టాంతాలకు–దార్ష్టాంతికమైన బ్రహ్మమునకు చాలా వ్యత్యాసం ఉంది. సామర్థ్య భేదాలు ఉంటాయి. కాని బ్రహ్మశక్తి ఊహకందనిది. అందువల్ల, ఎట్టి బాహ్యాపేక్షా లేకుండా జగత్ నిర్మాణము, సమస్త సృష్టికార్యము బ్రహ్మమునకు సాధ్యమనే ఈ సూత్రంలో ప్రతిపాదించబడింది.

# 9. కృత్స్నప్రసక్త్యధికరణమ్

## సూ: 2.1.26 కృత్స్నప్రసక్తిర్నిరవయవత్వశబ్దకోపో వా

(పూర్వపక్ష సూత్రం)

బ్రహ్మము నిరవయవి. అందువల్ల క్షీరాదుల్లో పరిణామం ఉన్నట్లు అంగీకరిస్తే, బ్రహ్మసర్వస్వమూ (కృత్స్నం) పరిణామం చెందాలి. అలా కాకుండా బ్రహ్మము సావయవి అని అంగీకరిస్తే, మూల సిద్ధాంతానికే విఘాతం వస్తుందని సూత్రార్థం.

బ్రహ్మకు ఎట్టి అంగాలు లేవు (నిరవయవి). అయితే, కార్యరూపంలో సమస్తమైన బ్రహ్మము పరిణామం చెందాలి. పృథివ్యాదులలాగ అవయవి అయితే కొంత భాగంలో మార్పు కలగడం, కొంతభాగంలో మార్పు లేక పోవడం సాధ్యం. కాని, బ్రహ్మము నిరవయవి అనే శ్రుతులు నిర్దేశిస్తున్నవి. ఉదాహరణకు: *"నిష్కలం, నిష్క్రియం, శాంతం, నిరవద్యం, నిరంజనమ్"* (శ్వే.ఉ 6.19), *"దివ్యో హ్యమూర్తః పురుషః స బాహ్యాభ్యంతరో హ్యజః"* (ము.ఉ 2.1.2), *"అస్థూల మనణు"* (బృ.ఉ 2.8.8).

అంతేకాక, పరిణామస్వరూపంతో అనిత్యం—నాశనం అంగీకరిస్తే *"అజః అమరః"* ఇత్యాది శ్రుతులకు వైరుధ్యం వస్తుంది. సావయవత్వం, నిరవయత్వం రెండూ ఎలా కుదురుతాయి?

## సూ: 2.1.27 శ్రుతేస్తు శబ్దమూలత్వాత్

'తు' శబ్దం పూర్వపక్షాన్ని తిరస్కరిస్తున్నది. జగత్తుకు బ్రహ్మము మూల కారణం అని ఏవిధంగా శ్రుతి స్థాపిస్తున్నదో, అదే విధంగా వికారానికి (కార్యానికి) వ్యతిరిక్తమైన బ్రహ్మము (కారణం) ఉన్నదనే శ్రుతి ప్రామాణ్యం ఉంది. *"సేయం దేవతా ఐక్షత హంత అహ మిమాస్తిస్రో దేవతా అనేన జీవేనాత్మనా అనుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి"* (ఛా.ఉ 6.3.2). అలాగే *"తావానస్య మహిమా తతో జ్యాయాంశ్చ పురుషః, పాదో ఽస్య సర్వాభూతాని, త్రిపాదస్యామృతం దివి"* (ఛా.ఉ 3.12.6). ప్రకృతి— వికారరూపం రెండూ అనన్యంగా ఉంటాయనే శ్రుతిలో వినబడు తున్నది. ప్రతి ప్రాణి యొక్క హృదయస్థానంలో బ్రహ్మముంటుందని, సుషుప్తిలో జీవాత్మ— సత్సంపన్నుడౌతాడని శ్రుతి నిర్దేశం. కార్యరూపంలోనే కాక, బ్రహ్మములో చాలా భాగం అవికృత రూపంలో ఉందనే శ్రుతులు బోధిస్తున్నవి. బ్రహ్మ నిరవయవి అనే ఉపనిషద్వాక్యాలు నిర్ధారిస్తున్నవి. శబ్ద ప్రామాణ్యంతోనే అగోచరమైన బ్రహ్మమును స్థాపించడం శక్యం. అందువల్ల నిరవయత్వాన్ని నిస్సందేహంగా అంగీకరించాలి.

లోకవ్యవహారంలో కూడా మణి—మంత్ర—ఔషధాల యొక్క శక్తిని శాస్త్ర ప్రామాణ్యంతో తప్ప, తర్కంతో నిరూపించటం శక్యం కాదు. బ్రహ్మకార్యము విలక్షణ మైనదే కాదు అచింత్యము. అతీంద్రియమైన పరమాత్మతత్త్వం కేవలం శబ్ద ప్రమాణం చేతనే గ్రహింపబడుతుంది.

**సంశయం:**

బ్రహ్మము నిరవయవి. అయినా పరిణామం చెందుతుంది. ఈ పరిణామం మొత్తం బ్రహ్మ పదార్థానికంతకు వర్తించదు. అప్పుడు ఒకరూపంలో పరిణామం చెంది, మరో రూపంలో పరిణామం చెందకుండా ఎలా ఉండడం సాధ్యము? క్రియా సంబంధమైన వ్యవహారాల్లో వికల్పాన్ని ఆశ్రయించవచ్చు. (ఉదా: *"అతిరాత్రే షోడశినం గృహ్ణాతి"* , *"నాతి రాత్రే షోడశినం గృహ్ణాతి"* ఇత్యాదులు). సృష్టికార్యం ఏ పురుషుని (వ్యక్తి) ఆధీనంలో లేదు. కాబట్టి వికల్పాదులు గ్రహించబడవు. అందువల్ల, బ్రహ్మ సావయవా, నిరవయవా అనే అంశానికి పరిహార మార్గమే లేదనిపిస్తున్నది.

**సమాధానం:**

అవిద్యా కల్పితమైన రూపభేదం చేత బ్రహ్మము సావయవి అనే భావం వస్తుంది. తిమిరదోషం వల్ల ద్విచంద్ర దర్శనమైనంత మాత్రాన చంద్రుడు ఒక్కడే కాని చాలా చంద్రులు లేరు కదా! వ్యాకృతంగాను, అవ్యాకృతంగాను ఉన్న సర్వమూ బ్రహ్మరూపమే అని కాని, బ్రహ్మరూపము కాదని కాని చెప్పటం (నిర్వచించటం) అసాధ్యం. లౌకికంగా, అవిద్యా కల్పితమైన వ్యవహారంలో బ్రహ్మ పరిణామం ఎన్నో రూపాలలో కనబడవచ్చు. కాని, పారమార్థిక రూపంలో బ్రహ్మమొక్కటే. నానారూపాలు లేవు. నామ రూప భేదం కేవలం వాచారంభణం (వాక్కుతో వచ్చినది). నీ ఆత్మయే పరబ్రహ్మ అని తెలుసుకోవటం వల్ల మోక్ష ఫలసిద్ధి కలుగుతుందని పరిణామ శ్రుతి *"స ఏషా నేతి నేత్యాత్మా"* అని ఉపక్రమించి *"అభయంవై జనక ప్రాప్తోఽసి"* అని ఉపసంహారంలో బోధిస్తున్నది (బృ.ఉ 4.2.4). అందువల్ల, బ్రహ్మము అవయవి అనే భావమే అవిద్యాకృతమైనదని నిర్ధారించుకోవాలి.

## సూ: 2.1.28 ఆత్మని చైవం విచిత్రాశ్చ హి

స్వప్నం చూస్తున్న జీవాత్మ యొక్క స్వరూపానికి ఎట్టి విఘాతం లేకుండా చిత్రమైన దృశ్యాలు సృజింపబడుతుంటాయి. *"న తత్ర రథా, న రథ యోగా, న పంథానో భవంతి, అథ రథాన్ రథయోగాన్ పథః సృజతే"* అని శ్రుతి వాక్యం (బృ.ఉ 4.3.10). లోకంలో మాయలు చేసేవారు, స్వరూపానికి ఆఘాతం (ఉపమర్దం) లేకుండా విచిత్రమైన మాయలు చేస్తున్నారు కదా! అలాగే బ్రహ్మ మొక్కటే అయినా, దాని స్వరూపానికి ఎట్టి విఘాతము లేకుండా చిత్ర, విచిత్రమైన సృష్టి అనేక ఆకారాలలో జరుగుతునే ఉంటుంది.

## సూ: 2.1.29 స్వపక్షదోషాచ్చ

సాంఖ్యులు, వైశేషికులు ఎవరైతే ఇటువంటి ఆక్షేపణలు చేస్తుంటారో, వారి సిద్ధాంతాలలోను ఇటువంటి దోషాలు ఎత్తి చూపవచ్చు. అపరిచ్ఛిన్నము, శబ్ద రహితము, నిరవయవి అయిన, సాంఖ్యుల ప్రధానం, కారణం అయితే, కార్యం అవయవీ, పరిచ్ఛిన్నము, శబ్దసహితము కాలేదా? అందువల్ల వారి పక్షంలో ప్రధానం అనే మూలరూపానికే కృత్స్న ప్రసక్తి రావాలి. అలాగే, త్రిగుణాత్మకమైన సత్త్వ–రజస్తమో గుణాలు ఒక్కొక్కటీ కూడా నిరవయవి అని సాంఖ్యుల సిద్ధాంతం. గుణాలు నిరవయత్వం కలవి, కాని ప్రధానం కాదు అని వాదించబడదు. గుణాలు సావయవములైతే, మూలమైన ప్రధానం నిత్యమైనది కాదు. దానికి నాశనముండాలి.

అణువాది సిద్ధాంతంలో కూడా ఇదేవిధమైన దోషం ప్రసక్తమవుతుంది. అణువు–అణువుతో పూర్తిగా కలిసిపోదు, ఒక భాగంతోనే కలుస్తుంది అని వాదించబడదు. ఇలా మిగతా సిద్ధాంతాలలోను దోషాలు కనబడతాయి. కాబట్టి, ఆ విధమైన వాదనే మానుకోవటం మంచిది (ఈ విషయాలు ద్వితీయపాదంలో వివరంగా చర్చించబడ్డాయి).

బ్రహ్మము సర్వానికి మూలకారణం అనే సిద్ధాంతంలో కార్యరూపంలో నానాత్వం కనిపించినా, అవికృత రూపంలో పరబ్రహ్మ నిరవయవి. ఈ విధంగా ఉపదేశిస్తున్న ఉపనిషద్వాక్యాలనే, బ్రహ్మవాదులు పూర్తిగా అంగీకరిస్తారు. ఆ శ్రుతి వాక్యాలే వారికి ప్రామాణ్యము.

## 10. సర్వోపేతాధికరణమ్

### సూ: 2.1.30 సర్వోపేతా చ తద్దర్శనాత్

పరమాత్మ సర్వశక్తులతో కూడుకునినదని శ్రుతి వాక్యాల్లో కనబడుతున్నదని సూత్రార్థం.

పరబ్రహ్మ మొక్కటే అయినా, చిత్రవిచిత్ర శక్తులు ఉండడంవల్ల విశ్వసృష్టి బాహ్యాపేక్షలేకుండా జరుగుతున్నది. పరమాత్మకు అట్టి మహచ్ఛక్తి ఉన్నదనే శ్రుతి ఇలా నిర్ధారిస్తున్నది: *"సర్వకర్మా, సర్వకామః, సర్వగంధః, సర్వరసః సర్వమిద మభ్యాత్తో ఒవాకీ అనాదరః"* (సమస్త కర్మలు, సమస్త కామములు, సమస్త గంధములు, సమస్త రసాలు కలది, జగత్సర్వమూ వ్యాపించి ఉన్నది, వాక్కు లేనిది, ఎట్టి వాంఛలు లేనిది బ్రహ్మ – ఛా.ఉ 3.14.4). *"సత్య కామః, సత్య సంకల్పః"* (ఛా.ఉ 8.7.1), *"యః సర్వజ్ఞః సర్వవిత్"* (ము.ఉ 1.1.9), *"ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి! సూర్యా చంద్రమసౌ విధృతౌ తిష్ఠతః"* (బృ.ఉ 3.8.9).

### సూ: 2.1.31 వికరణత్వాన్నేతి చేత్తదుక్తమ్

దేహేంద్రియాలు లేని బ్రహ్మకు సర్వశక్తిమత్త్వం ఎలా ఉంటుందనే ప్రశ్నకు సమాధానం ముందే చెప్పబడింది. చేతనులైన దేవతలు–ఋషులు ఇత్యాదులకు ఆధ్యాత్మికమైన దేహేంద్రియాలుండ బట్టే అది సాధ్యం కాని, ఏ అవయవాలు, వాక్కూ లేని అక్షరుడికి అది ఎలా సాధ్యం?

పరమేశ్వరుని శక్తి అపారము. శ్రుతి మూలంగానే దానిని తెలుసుకోవటం సాధ్యం కాని, తర్కాదుల వల్ల దానిని నిరూపించలేము. ఇంద్రియాదులు లేకపోయినా పరమేశ్వరుడికి సాధ్యము కానిది లేదనే శ్వేతాశ్వతర శ్రుతి ఇలా విన్పిస్తున్నది: *"అపాణి పాదో జవనోగ్రహీతా పశ్యత్యచక్షుః, స శృణోత్యకర్ణః"* (శ్వే.ఉ 3.19).

# 11. ప్రయోజనవత్త్వాధికరణమ్

## సూ: 2.1.32 న ప్రయోజనవత్త్వాత్

(పూర్వపక్ష సూత్రం)

ఏ కార్యమైనా చేపట్టడానికి ఏదో ఒక ప్రయోజనమంటూ ఉండాలి. జగత్ సృష్టికి ఏ ప్రయోజనం బ్రహ్మమునకు ఉన్నట్లు కనబడదు. కాబట్టి బ్రహ్మము జగత్తును సృష్టించలేదు అని సూత్రార్థం.

ఏదో ఒక లాభం ఉంటేనే లోకంలో ఎవరైనా ఒక పనిని ప్రారంభించి దానిలో నిమగ్నమై ఉంటారు. ఈ లోకప్రవృత్తికి అనుగుణంగా బృహదారణ్యక శ్రుతి ఇలా విన్పిస్తున్నది: *"న వా అరే! సర్వస్య కామాయ సర్వం ప్రియం భవతి, ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి"* (బృ.ఉ 2.4.4). జగత్ సృష్టి అనే మహత్కార్యాన్ని చేపట్టడానికి చేతనుడైన బ్రహ్మమునకు ఎట్టి ప్రయోజనమూ కనబడదు. అదీకాక, ఏదైనా ప్రయోజనాన్ని ఆశించి ఈ కార్యాన్ని మొదలుపెడితే అది పరమాత్మ మూల ధర్మానికే విరుద్ధమవుతుంది. పరమేశ్వరుడు నిత్యతృప్తుడు, ఎటువంటి కోరికలు లేనివాడు అనే కదా శ్రుతి బోధిస్తున్నది! జగత్‌సృష్టి విషయం పరిశీలిస్తే పరబ్రహ్మ ఉన్మత్తుడనే భావం కూడా కలుగుతుంది. *"స సర్వజ్ఞః"* అనే శ్రుతికి ఈ భావన విరుద్ధ మవుతుంది. అందువల్ల జగత్కార్యానికి, పరమాత్మ కారణం కాదనే అనిపిస్తున్నది.

## సూ: 2.1.33 లోకవత్తు లీలాకైవల్యమ్

'తు' ప్రత్యయం పూర్వపక్షి వాదన ఖండిస్తూ సిద్ధాంతాన్ని సూత్రంలో ప్రతిపాదిస్తున్నది. విశ్వసృష్టి పరమాత్మ లీల అనే నిర్ధారించుకోవాలి.

లోకంలో అన్ని సంపత్తులూ ఉన్న రాజులూ, అమాత్యులు, ఇలాంటివారు సరదా కోసం కొన్ని ప్రయోజనం కనబడని పనులు చేస్తూ ఉంటారు. బాహ్య ప్రయోజనం ఆశించకుండా ఉచ్ఛ్వాస–నిశ్వాసాలు వాటంతట అవే జరిగిపోతూ ఉంటాయి. అదేవిధంగా, సృష్టి పరమాత్మ యొక్క లీల. జగత్‌కార్యం మనందరకూ చాలా గొప్పది, కష్టమైనదీ అని అనిపించటం సామాన్యం, కాని సర్వశక్తి మంతుడైన పరబ్రహ్మమునకు అది లీల అనే భావించాలి. సర్వజ్ఞుడు, సత్యసంకల్పము గల పరమేశ్వరుడికి సృష్టికార్యం ఉన్మత్త ప్రవృత్తి అని భావించడం ఎంతమాత్రం తగదు. సృష్టికార్యంలో పరమార్థత ఉందని శ్రుతి వాక్యాలు బోధిస్తున్నవి. ఈ తాత్పర్యాన్నే గ్రహించి సృష్టిలో ఉన్న వైవిధ్యాన్ని అర్థం చేసుకోవాలి.

## 12. వైషమ్య నైర్ఘృణ్యాధికరణమ్

## సూ: 2.1.34 వైషమ్యనైర్ఘృణ్యే న సాపేక్షత్వాత్తథా హి దర్శయతి

ఎవరు చేసిన కర్మలను బట్టి వారికి జన్మ ప్రాప్తించడం వలన పరమేశ్వరుడికి జాలి, పక్షపాతము లేవని శ్రుతి వల్ల తెలుస్తున్నదని సూత్రార్థం.

**పూర్వపక్షి:**

పరమేశ్వరుడు దేవతాత్మలకు సుఖ–సంతోషాలను ప్రసాదిస్తూ, సృష్టిస్తు న్నాడు. కొన్ని ప్రాణులు ఆజన్మాంతం దుఃఖమయ జీవితం గడుపుతాయి. మనుష్యుల లోను కొందరు భోగ భాగ్యాలు అనుభవించినా, కొందరు నికృష్టపు బతుకే బతుకుతూ కష్టాలు అనుభవిస్తుంటారు. అందువల్ల సృష్టిలో తారతమ్యం కనబడుతుంది. సామాన్య మానవులకున్నట్లు, సృష్టి కర్తలో రాగద్వేషాలు, పక్షపాతం, కక్షసాధించే ప్రవృత్తి ఉన్నట్లు భావించవలసి వస్తుంది. శ్రుతి, స్మృతి వాక్యాలు, పరమేశ్వరుడు స్వచ్ఛమైన సంకల్పాదులు కలవాడని, ఎటువంటి రాగద్వేషాలు లేనివాడని బోధిస్తున్నాయి. కాని సర్వత్ర సమానభావం సృష్టిలో కనబడదు. అందువల్ల జగత్సృష్టికి పరమేశ్వరుడు మూలకారణం అని అంగీకరించబడదు.

**సమాధానం:**

పరమేశ్వరుడికి ఎట్టి వైషమ్య–నైర్ఘృణ్యాదులు లేవు. సృష్టి, ధర్మాధర్మాలను అపేక్షించే జరుగుతుందని తెలుసుకోవాలి. సృష్టిలో కన్పిస్తున్న తారతమ్యాలకు, ఈశ్వరునికి కక్ష, పక్షపాతం ఆపాదించటం యుక్తం కాదు. ఒక ప్రదేశంలో వర్షం పడినపుడు పర్జన్యుడికి (మేఘానికి) అక్కడ ఎటువంటి విత్తనాలు, మొక్కలు ఉన్నాయనే భేదభావం ఎలా ఉండదో, అలాగే సర్వేశ్వరుడి సృష్టి సమభావంతోనే జరుగుతుంది. అయితే, ఎవరి కర్మఫలాన్ననుసరించి వారికి సుఖతమ–సుఖతర –దుస్తర జీవితం (జన్మ) లభిస్తుంది. దీనినే స్పష్టం చేస్తూ శ్రుతి ఇలా వినిపిస్తున్నది: *"ఏష హ్యేవ సాధు కర్మ కారయతి యమేభ్యో లోకేభ్య ఉన్నినీషత ఏష ఉ ఏవ అసాధు కర్మ కారయతి తం యమధో నినీషతే"* (ఎవనినైతే ఉత్తమలోకాలకు తీసుకొని వెళ్లాలను కుంటాడో వాని చేత మంచిపనులు చేయిస్తాడు. ఎవనిని అధోలోకాలకు పంపించాలనుకుంటే వాని చేత దుష్కర్మలు చేయిస్తాడు – కౌ.బ్రా 3.8). అలాగే మరో శ్రుతి: *"పుణ్యో వై పుణ్యేన కర్మణా భవతి పాపః పాపేన"* అని వినిపిస్తున్నది (బృ.ఉ 3.2.17.). ఈ బోధనే భగవద్గీతలో కనబడుతున్నది. *"యే యథా మాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహం"* (నన్ను మనుష్యులు ఏ విధంగా ఆశ్రయించి సేవిస్తారో, అదేరీతిలో వారిని అనుగ్రహిస్తాను – భ.గీ 4.11).

## సూ: 2.1.35 న కర్మావిభాగాదితి చేన్నానాదిత్వాత్

**సంశయం:**

సృష్టికి పూర్వం అవ్యాకృతరూపంలో పరమాత్మలో ఎటువంటి విభాగం లేదు అని ముందు నిర్ణయించబడింది. అందువల్ల మొట్టమొదట సృష్టి ఎట్టి వైషమ్యాలు లేకుండానే జరిగి ఉండాలి. సృష్టి జరిగిన తరవాతనే కదా, శరీరాదుల విభాగాన్ని ఆపేక్షించే కర్మ జరుగుతుంది. కర్మ చేస్తేనే శరీరాది విభాగం ఏర్పడుతుంది అని నిర్ధారిస్తే, అన్యోన్యాశ్రయ దోషం ప్రసక్తమవుతున్నది కదా? ఇదెలా కుదురుతుంది?

**సమాధానం:**

సంసారం–జగత్తు అనాది. చెట్టు ముందా, విత్తు ముందా? అనే ప్రశ్నకు సమాధానం లేదు. హేతువైన కర్మ – ఆ హేతువు వల్ల ఆవిర్భవించిన సంసారమూ అనాదిగా ఉన్నవనే విశ్వసించాలి. అందువల్ల, హేతుహేతుమద్భావంతో ప్రవర్తించటంలో వైరుధ్యం ఉండదు. అయితే సంసారం అనాది అని ఎలా నిర్ణయించ బడుతున్నదనే సంశయం క్రింద సూత్రంలో నివారించబడుతున్నది.

## సూ: 2.1.36 ఉపపద్యతె చాప్యుపలభ్యతె చ

సంసారం అనాది అని శ్రుతి, స్మృతి వాక్యాలు నిర్ధారిస్తున్నాయని సూత్రార్థం.

సంసారానికి ప్రారంభం అంటూ ఉంటే అది ఎప్పుడో, ఏ కారణం లేకుండా వచ్చిందని చెప్పవలసి ఉంటుంది. అప్పుడు ముక్తులు కూడా తిరిగి జన్మ పొందవలసి వస్తుంది. సుఖ–దుఃఖాది వైషమ్యాలకు ఈశ్వరుడు అపరాధికాడు కదా! రాగ–ద్వేష–మోహాల యొక్క వాసనలతో ఈ జన్మ వస్తుందనే ముందు కూడా స్పష్టం చెయ్య బడింది. అయితే కర్మలేకుండా శరీరం ఉద్భవించదు; శరీరం లేకుండా కర్మ ఉండదు. ఈ ఇతరేతర ఆశ్రయదోషం సంసారం అనాది అనే సిద్ధాంతంలో ప్రసక్తమే కాదు. సంసారం ఆద్యంతాలు లేనిదనే శ్రుతి, స్మృతి స్పష్టం చేస్తున్నవి: *"అనేన జీవేన ఆత్మనా అనుప్రవిశ్య నామరూపే వ్యాకరవాణి"* (ఛా.ఉ 6.3.2), ఈ శ్రుతి వాక్యం పరమాత్మ (ప్రాణాలు), ప్రాణధారణ చేసే జీవాత్మ కూడ అనాదులనే తెల్పుతున్నది. అలాగే *"సూర్యా చంద్రమసౌ ధాతా యథాపూర్వమకల్పయత్"* (సూర్య–చంద్రులను పరబ్రహ్మ యథాపూర్వం కల్పించాడు – ఋ.స 10.109.3). దీనివల్ల, సమస్త సృష్టి మహాప్రళయంలో తిరోహితమైనా అనాది కారణంగా, అదే విధంగా కొనసాగుతుంది అని తెలుస్తున్నది. భగవద్గీత కూడా సృష్టి అనాది అని ఇలా బోధిస్తున్నది *"న రూప మస్యేహ తథోప లభ్యతే నాంతో న చాదిర్నచ సంప్రతిష్ఠా"* (ఈ సంసారమనే వృక్షానికి ఆది–అంతము లేవు. నశ్వరము కాబట్టి సరియైన స్థితి లేనిది -భ.గీ 15.3).

## 13. సర్వధర్మోపపత్త్యధికరణమ్

### సూ: 2.1.37 సర్వధర్మోపపత్తేశ్చ

ఇంతవరకు ఇతర శాఖీయులు, ఈశ్వరుడు జగత్కారణం కాదు అని చేసిన ఆక్షేపణలనన్నింటిని తిరస్కరించటమైనది. ఇప్పుడు అన్ని వేదాంతాలలోను ప్రతిపాదిం చిన నిర్గుణ బ్రహ్మమే జగత్కారణము, సృష్టికి సర్వాధ్యక్షుడు అని స్పష్టంగా చెప్పటానికి సమస్త కారణ ధర్మాలు ఉన్నాయని సూత్రకారులు ప్రస్తావిస్తున్నారు. నిర్గుణ స్వరూపమైన బ్రహ్మ నిమిత్తకారణం కావచ్చును కాని, ఉపాదాన కారణం ఎలా అవుతుందనే సంశయ నివృత్తికై ఈ సూత్రం ప్రతిపాదించబడింది. పరబ్రహ్మములో సర్వజ్ఞత సర్వశక్తితో పాటు, మహామాయ వంటి కారణ ధర్మాలన్నీ ఉండడం వల్ల జగత్సృష్టికి బ్రహ్మము తప్ప మరెవ్వరూ మూలం కాదు. నిర్గుణమైనా, మాయోపాధి చేత ఉపాదాన కారణానికి ఉండవలసిన ధర్మాలన్నీ ఉండడం వల్ల, పరబ్రహ్మమే జగత్కారణమని స్థాపిస్తూ ఈ ప్రకరణాన్ని సూత్రకారులు ఉపసంహరిస్తున్నారు.

# *2.*

# అవిరోధాధ్యాయము : ద్వితీయపాదము



ఈ పాదంలో సాంఖ్యాది సిద్ధాంతాలు నిస్సారములని సూత్రకారులు వాటిని నిరాకరిస్తున్నారు.

## 1. రచనానుపపత్త్యధికరణమ్

అచేతనమైన ప్రధానం లేక అవ్యక్తం జగదుత్పత్తికి ఉపాదాన కారణం అని సాంఖ్యసిద్ధాంత మూల ప్రాతిపదిక. అయితే, అచేతనమైనది జగత్కారణం కాదని ఈ ప్రకరణలో స్థాపించబడుతున్నది.

### సూ: 2.2.1 రచనానుపపత్తేశ్చ నానుమానమ్

ప్రధానము వలన సృష్టి జరగదు. అందువలన అది జగత్కారణముగా అంగీకరింపబడదని సూత్రార్థం.

**సంశయం:**

ప్రథమాధ్యాయంలో *"ఈక్షతేర్నాశబ్దమ్"* అనే సూత్రంలోను (బ్ర.సూ 1.1.5), *"కామాచ్చ నానుమానాపేక్షా"* అనే సూత్రంలోను (బ్ర.సూ 1.1.18), *"ఏతేన సర్వే వ్యాఖ్యాతా వ్యాఖ్యాతాః"* అనే సూత్రంలోను (బ్ర.సూ 1.4.28) సాంఖ్యవాదుల ప్రధాన కారణ వాదాన్ని తిరస్కరించారు కదా మళ్లీ ఈ చర్చ ఎందుకు?

**సమాధానం:**

సాంఖ్యులు తమ సిద్ధాంతానికి అనుగుణంగా కొన్ని వేదాంత వాక్యాలను ఉదహరిస్తారు. వారి ఉదాహరణలలోని అన్వయం సరైనది కాదని ముందు ప్రస్తావించటం జరిగింది. ఈ ప్రకరణంలో సాంఖ్యాది దర్శనాలు సమ్యక్ దర్శనాలు, వాటి వల్ల మోక్షసిద్ధి లభిస్తుందనే ప్రచారాన్ని విరోధించటానికి, వారి తర్కపరమైన వాదనలు నిస్సారములని స్థాపించబడుతున్నది.

**సాంఖ్యసిద్ధాంత ముఖ్యాంశములు:**

ప్రధానం లేక ప్రకృతి అనేది సర్వజగదావిర్భావానికి మూలకారణం. ఘట, శరావాదులు మృత్ వల్ల సృష్టించబడుతున్నాయి కాబట్టి వాటిలో మట్టి ఉంటుంది. అలాగే సృష్టిలో సత్త్వ–రజస్–తమోగుణాలు, మూడూ సుఖ–

దుఃఖ–మోహ రూపాల్లో అనుస్యూతంగా ఉంటాయి. ఇవి శరీరానికే కాదు, శరీరేతరమైన బాహ్య పదార్థా లన్నింటికి సామాన్యము. త్రిగుణాత్మకమైన ప్రధానం అచేతనమైనది. అయినా, నానా వికారాలరూపంలో పరిణామం చెందుతుందని అనుమాన ప్రామాణ్యంతో సాంఖ్యులు వారి సిద్ధాంతాన్ని నిలబెట్టుకోటానికి ప్రయత్నిస్తుంటారు.

సాంఖ్యకారికలో ఐదు హేతువులు ఇలా వర్ణించబడ్డాయి: *"భేదానాం పరిమాణాత్సమన్వయాచ్ఛక్తితః ప్రవృత్తేశ్చ, కారణకార్య విభాగాదవిభాగాద్వైశ్వరూపస్య కారణమస్త్యవ్యక్తమ్"* (సాంఖ్యకారిక 15, 16 శ్లో ॥).

కార్యప్రపంచం పుట్టడానికి పూర్వం ప్రధానంలో మహదహంకారాది తత్త్వాలు లీనమై కనబడకుండా ఉంటాయి, అందుకే ప్రధానాన్ని అవ్యక్తం అని కూడా చెప్పడం జరిగింది. ఘటంలో అంతటా మట్టి సామాన్యము, కాని మట్టి అంతటిలోనూ ఘటం ఉండదు. ఘటపరిమాణం, మట్టి పరిమాణాని కంటె బహు తక్కువ. అయినా ఘటావిర్భావానికి పూర్వం, కారణమైన మట్టిలో ఆ శక్తి అవ్యక్తరూపంలో ఉంటుంది. కాబట్టి, ఘటం మట్టి నుండే సృష్టింపబడుతుంది. మట్టి నుండి బట్ట నేయబడదు. కారణం అవ్యక్తరూపంలో బట్టను తయారు చేసే శక్తి మట్టిలో లేదు. కొంతకాలానికి కారణంలో, కార్యాలన్నీ లీనమయిపోతాయి. అందువల్ల, మహదాదులు ప్రధానంలో కలిసిపోతాయి.

అచేతనమైన ప్రధానం ఆధ్యాత్మికమైన శరీరాలను ఎలా సృష్టించగలదు అనే కీలక ప్రశ్నకు, ఈ దృష్టాంతాలలో సమాధానం చిక్కదు. మట్టిని ఘటాది రూపాలలో సృజించడానికి చేతనుడైన కులాలుడున్నాడు. అలాగే ప్రాసాదాదులు నిర్మించటానికి నిపుణులైనవారు ఉన్నారు. కాని, చేతనరూపాలైన శరీరాదులు యొక్క అధిష్ఠానం, ప్రధానం చెయ్యలేదు. అధిష్ఠాత చేతనుడైతేనే ఈ కార్యం సిద్ధిస్తుంది.

సత్త్వ–రజస్–తమోగుణాలతో కూడిన ప్రధానంలోని సత్త్వగుణం సుఖాన్ని, రజోగుణం దుఃఖాన్ని, తమోగుణం మోహాన్ని కలిగిస్తుందని, అందువల్ల జగత్సర్వం సుఖ–దుఃఖ–మోహాత్మకమైనదని సాంఖ్యులు భావిస్తారు. కాని సుఖ–దుఃఖ–మోహాలు అంతఃకరణ వ్యాపారాలు. శబ్దాదులు సుఖ–దుఃఖ–మోహాలకు నిమిత్త హేతువులు కావాలి. ఘటాదుల్లో మట్టి అనుస్యూతంగా ఉన్నట్లే, శబ్దాదుల్లో సుఖ–దుఃఖ– మోహాలుంటే, అందరికీ ఒకేలా సుఖాదులు కలగాలి. కాని జగత్తులో అది కనబడదు. అందువల్ల, సాంఖ్యులు చూపుతున్న హేతువు అంగీకరించబడదు. సుఖ–దుఃఖ– మోహాలు శారీరుల యొక్క మనోభావాలను బట్టి ఉంటాయి. కాబట్టి, వాటి మూలం మనస్సు (చిత్తం) కాని శబ్దాదులు కావు.

త్రిగుణాలు నిత్యములని సాంఖ్యుల సిద్ధాంతం. కాని గుణాలు కూడా పరిమిత ప్రమాణం ఉన్నవి కాబట్టి, వాటిలో నిత్యత్వం ఉండదు.

మృత్ నుండి ఘటం, పృథివీ నుండి మృత్ పుడుతున్నాయి. మృత్, పృథివీ కూడా అచేతనమైనవి. కారణం, అచేతనమైనా కార్యం జరుగుతున్నది. కారణ–కార్య విభాగాన్ని బట్టి అచేతనమైన ప్రధానం వల్ల సర్వకార్యాలు జరిగే అవకాశం ఉంది. శయనాసనాదులు ఆలోచనా పూర్వకంగా జరుగుతాయి, కాబట్టి అవి చేతన శక్తి వలనే సాధ్యము.

## సూ: 2.2.2 ప్రవృత్తేశ్చ

ప్రధానం యొక్క ప్రవృత్తి కూడ సంభవం కాదు కాబట్టి, ప్రధానం జగత్కారణం కాజాలదని సూత్రార్థం.

సాంఖ్యసిద్ధాంతం ప్రకారము సత్త్వ–రజస్–తమోగుణాలు సమంగా ఉన్న స్థితి సామ్యావస్థ. సామ్యావస్థలో ప్రధానంలో ఎట్టి మార్పు–పరిణామం ఉండదు కాబట్టి సృష్టి జరిగే అవకాశం ఉండదు. సామ్యావస్థ పోయి, గుణాలలో తేడా వచ్చిన ప్పుడు, ఒకగుణం అంగి గాను, మిగతావి అంగాలుగాను ఏర్పడినప్పుడు (అంగాంగీ భావము వచ్చినప్పుడు) ఏదైనా కార్యాన్ని పుట్టించే ప్రవృత్తి ప్రధానంలో వస్తుంది. అయితే, అచేతనమైన ప్రధానంలో స్వతంత్రంగా ఏ అపేక్ష లేకుండా ఇట్టి ప్రవృత్తి రాడానికి అవకాశమే లేదు. కాబట్టి ప్రధానం జగత్కారణం అనే సిద్ధాంతం అంగీకరించబడదు. అచేతనములైన రథాదుల్లో, ఏ ప్రవృత్తి ఉండదు. కాని చేతనులైన ఇతరుల ప్రయత్నం వలన వాటిలో ప్రవర్తన (కదలిక) వస్తుంది. దేహం ప్రవర్తిస్తుంటే చేతనం ఉందని ఊహించగలుగుతున్నాము.

**ప్రశ్న:**

లోకాయితికులు దేహానికి చేతనత్వం ఉంది కాబట్టి ఆత్మతో సంబంధం లేకుండా దేహంలో ప్రవృత్తి సిద్ధిస్తుందనే విశ్వసిస్తారు. అందువల్ల, ప్రవృత్తి అనేది అచేతనానికే కాని చేతనమైన ఆత్మ వల్ల జరగదని వారి వాదన ఎలా తిరస్కరించ బడుతుంది?

**సమాధానం:**

అచేతనంలో ఏదైనా ప్రవృత్తి ఉంటే అది ఉండు గాక! కాని ప్రవృత్తి కార్య రూపం దాల్చాలంటే చేతనమయమైన మరో దానితో సంపర్కం(సంబంధం) ఉండాలి.

కాష్ఠాదులవంటి మండే వస్తువులతో సంపర్కం ఉంటేనే అగ్ని జ్వలిస్తుంది. అగ్ని దానంతట అది పుట్టదు. అలాగే, చేతనమైన దేహమే రథాదుల్ని చలింపజేస్తున్నది. రథంలో దానంతట అదే కదిలే ప్రవృత్తి లేదు. చేతనమే ప్రవర్తకం (ప్రవర్తింపజేసేది) అవుతున్నది.

**సంశయం:**

బ్రహ్మవాదులు కూడా దేహాదులతో కూడిన ఆత్మ కేవలం విజ్ఞాన స్వరూపంగా ఉంటుంది, దానిలో స్వతస్సిద్ధంగా ఏ ప్రవృత్తి ఉండదనే కదా అంటారు. పరమాత్మ, అద్వితీయమైనప్పుడు, ప్రవర్తింపచేసేది మరేదీ లేనప్పుడు, ప్రవర్తకత్వం అనేది ఎలా వస్తుంది?

**సమాధానం:**

ప్రవృత్తి శూన్యమైన ఆత్మ, అయస్కాంతం వంటిది. ఇనుముతో కూడిన వస్తువుల్ని అయస్కాంతం ప్రవర్తింప చేసినట్లు, రూపాదులు చక్షురాది ఇంద్రియాలను ప్రవర్తింప చేసినట్లు సర్వజ్ఞుడు, సర్వవ్యాపి, సర్వశక్తి కల పరమాత్మలో (బ్రహ్మములో) నిర్గుణుడైనా అన్నింటిని ప్రవర్తింపజేసే చేతనత్వం ఉంది. అందువల్ల, జగత్ సృష్టికి సర్వజ్ఞుడైన బ్రహ్మమే కారణమని వేదాంతులు విశ్వసిస్తారు. జీవాత్మ–పరమాత్మ భిన్నములనే భేదభావం అవిద్యాకృతమైనది. నామ–రూపాలనే మాయావేశ వశం వల్ల వచ్చే ఈ భేదం, ఇంతకు ముందు పలుసార్లు చర్చించడమైనది. దానిని మళ్లీ ప్రస్తావించనక్కర లేదు. ఆత్మశక్తి అపారము.

## సూ: 2.2.3 పయోంబువచ్చేత్తత్రాపి

పాలు, నీరు ప్రవర్తించినట్లు అచేతనమైన ప్రధానం కూడా ప్రవర్తిస్తుందనే వాదన సరైనది కాదు. వాటికి కూడా చేతనుల ప్రేరేపణ ఉందని సూత్రార్థం.

**ప్రశ్న:**

చేతనం యొక్క బాహ్యప్రేరేపణ లేకుండా నదీ ప్రవాహం జరుగుతున్నది. అలాగే, ఆవులు దూడలకు పాలిచ్చి పోషిస్తున్నవి. అదేవిధంగా, అచేతనమైన ప్రధానం పురుషార్థ సిద్ధికి స్వాభావికంగానే ప్రవర్తించటం జరుగుతుందని అంగీకరించవచ్చు కదా?

**సమాధానం:**

దూడకు చేతనమున్నది. దాని ప్రేరణ వల్ల ఆవు పాలను బిడ్డ పోషణార్థం ఇస్తున్నది. చేతనాపేక్ష ఉండబట్టే ఈ కార్యం సిద్ధిస్తున్నది. అలాగే నదిలో నీరు ప్రవహించటానికి కారణం చేతనమయుడైన పరమేశ్వరుడే అని శ్రుతి ఇలా వినిపిస్తున్నది: *"యోఽప్సు తిష్ఠన్నద్భ్యోఽన్తరో యం ఆపో న విదుః యస్యాపశ్శరీరం యోఽపామంతరో యమయతి"* (బృ.ఉ 3.7.4). అలాగే *"ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి! ప్రాచ్యోఽన్యాః నద్యః స్యందంతే"* (బృ.ఉ 3.8.9). అయితే, ముందు *"ఉపసంహారదర్శనాన్నేతి చేన్న క్షీరవద్ధి"* అనే సూత్రంలో (బ్ర.సూ 2.1.24) ఏ ప్రేరణ లేకుండా పాలు–పెరుగుగా

మారుతుందని చెప్పి, ఇప్పుడు ప్రేరణ ఉంది అని ఎలా సమర్థిస్తున్నారు, అనే ప్రశ్నకు సమాధానం ఇలా భాష్యకారులు ఇస్తున్నారు: పాలు దధిగా పరిణామం చెందడం లోకదృష్ట్యా చెప్పబడింది. వేదాంతపరంగా ప్రతీ కార్యానికి ప్రేరకుడు సర్వేశ్వరుడనే గ్రహించాలి.

## సూ: 2.2.4 వ్యతిరేకానవస్థితేశ్చానపేక్షత్వాత్

ప్రధానం కంటే మరేదీ ప్రవర్తింపజేసేదీ (నివర్తింపజేసేదీ) లేదు కాబట్టి, ప్రధానం జగత్కారణం కాదని సూత్రార్థం.

సాంఖ్య సిద్ధాంతంలో సామ్యావస్థలో నున్న మూడుగుణాలే ప్రధానమని చెప్పబడతాయి. ఆ గుణాలకు వేరుగా మరేవీ ప్రవర్తింపజేయడానికి కాని, నివర్తింప జేయడానికి కాని లేవు. ఆ విధంగా ప్రధానం అనపేక్షత్వం కలది. కాని ప్రధానంలో పరిణామం ఒక్కొక్క పర్యాయం ఉంటుంది, ఒక్కొక్క పర్యాయం ఉండదు అనే వారి ప్రతిపాదన సమంజసం కాదు. వేదాంత శ్రుతి వాక్యాలు, సర్వజ్ఞుడైన పరబ్రహ్మ అధీనంలో సమస్త సృష్టికార్యము, యాజమాన్యము జరుగుతుందని బోధిస్తున్నవి. అందువల్ల, ఈశ్వరేచ్ఛ ప్రవర్తనకు–నివర్తనకు సమానంగా అన్వయించుకోవచ్చు.

## సూ: 2.2.5 అన్యత్రాభావాచ్చ న తృణాదివత్

**సంశయం:**

ఆవులు ఆహారంగా తీసుకునే గడ్డి ఇత్యాదులు పాలుగా స్వభావసిద్ధంగానే మారుతున్నాయి కదా?

**సమాధానం:**

తృణాదులు పాలుగా మారడానికి చేతనమైన గోవు నిమిత్తకారణం. అదే ఆహారం ఎద్దులు తిన్నా, పాలు ఇవ్వలేవు కదా! మనుష్య ప్రయత్నంతోనే పుష్టికర ఆహారం ఇచ్చి గోవుల నుండి ఎక్కువ పాలు పొందటమనేది సామాన్యంగా జరుగు తున్నదే. అందువల్ల ప్రధానం యొక్క పరిణామం, తృణాది పరిణామంతోపోల్చబడదు.

## సూ: 2.2.6 అభ్యుపగమేఽప్యర్థాభావాత్

ప్రధానమునకు స్వాభావిక ప్రవృత్తి ఉన్నదని అంగీకరించినా ఆ ప్రవృత్తి యొక్క ప్రయోజనం ఏమీ కనిపించదని సూత్రార్థం.

లోకంలో ప్రజలు ఏదో ప్రయోజనాన్ని ఆశించే వారి వారి కార్యాలలో నిమగ్నమై ఉంటారు. అదే విధంగా పురుషునికి మోక్షం ప్రసాదించటానికే ప్రధానం ప్రవర్తిస్తుందనే సాంఖ్య సిద్ధాంతం ఈ సూత్రంలో వ్యతిరేకింపబడుతున్నది.

భోగమూ–మోక్షమూ అనే రెండు ప్రయోజనాలలో ఏదో ఒకటైనా ప్రధానం యొక్క ప్రవృత్తి వల్ల పురుషునికి లభించాలి. భోగమే లభిస్తుందంటే, మరి మోక్షం సిద్ధించటానికి అవకాశం లేదు. భోగం కాదు, అపవర్గం (మోక్షమే) దాని ప్రయోజనం అంటే, ప్రధానం యొక్క ప్రవృత్తే లేకుండా స్వాభావికంగానే మోక్షం రావాలి. భోగం– మోక్షం రెండూ ప్రధానం యొక్క ప్రవృత్తి వల్ల లభిస్తాయన్నా కుదరదు, కారణం భోగ్యమైన వస్తు సముదాయం అనంతం. నిత్యం భోగ ప్రవృత్తే, ఉంటే మోక్షం ఎలా వస్తుంది? అందువల్ల ప్రధానం యొక్క ప్రవృత్తి పురుషప్రయోజనానికే జరుగుతుందని చెప్పడం యుక్తం కాదు.

## సూ: 2.2.7 పురుషాశ్మవదితి చేత్తథాపి

కుంటివాడైన వ్యక్తి అంధుణ్ణి నడిపిస్తున్నట్లు, అయస్కాంతం ఇనుమును ప్రేరేపించినట్లు, పురుషుడే ప్రధానాన్ని ప్రేరేపిస్తాడు అని ప్రతిపాదించినా దోష పరిష్కారం లేదని సూత్రార్థం.

ప్రధానం స్వతంత్రంగా ప్రవర్తిస్తుందని కదా సాంఖ్యుల ప్రాతిపదిక? ఉదాసీనుడైన పురుషుడు ప్రధానాన్ని ఏ విధంగా

ప్రవర్తింపజేస్తాడు? అయస్కాంతం సన్నిధిలో (దగ్గరగా ఉంటే) దాని ప్రేరేపణ, అందువల్ల అది నిత్యమూ ఉండదు. అదీకాక ప్రధానానికి–పురుషుడికి ఒక సంబంధం ఏర్పరిచే మూడవ వస్తువు ఏదీలేదు. పురుషునిలో ఉండే 'దృక్ శక్తి' వల్ల, ప్రధానంలో ఉండే దృశ్యత్వం (చూడ గలిగే శక్తి) ప్రేరేపించబడుతుందని వాదించినా ఈ ప్రశ్నకు పరిష్కారం లేదు. ప్రధానం దేనిని స్వతంత్రంగా ప్రవర్తింపజేయలేదు.

## సూ: 2.2.8 అంగిత్వానుపపత్తేశ్చ

సత్త్వ రజస్తమోగుణాలు వాటి స్వరూప మాత్రంతో ఉండటమే సామ్యావస్థ. ఇటువంటి ప్రధానావస్థలో ఏ కార్యం జరగదు. సృష్టి కార్యానికి ఈ గుణాలలో వైషమ్యం రావాలి. అంగాంగీభావం వస్తే గుణాల స్వరూపమే మారిపోతుంది. అందువల్ల, బాహ్యమైన నిమిత్తం లేకపోవడం వలన గుణవైషమ్యాభావం వల్ల జరిగే మహదాద్యుత్పత్తే జరగదు. అప్పుడు సృష్టే జరగదు.

## సూ: 2.2.9 అన్యథానుమితౌ చ జ్ఞశక్తివియోగాత్

**ప్రశ్న:**

ఇప్పుడు పూర్వపక్షి మరోవిధంగా ఈ ప్రశ్నకు సమాధానం కుదురుతుందని వాదన కొనసాగిస్తున్నాడు. గుణాలు కూటస్థమైనవి కావు. కాని, కార్యస్వభావాన్ని బట్టి సామ్యావస్థలోను వాటిలో వైషమ్యం వచ్చే యోగ్యత కలిగే అవకాశం ఉంది. అప్పుడు కార్యోత్పత్తి సాధ్యమవుతుంది కదా?

**సమాధానం:**

ప్రధానానికి జ్ఞశక్తి (దృక్ శక్తి) ఉందంటే అది వేదాంత వాదాన్ని అంగీకరించినట్లే అవుతుంది. అప్పుడు ఎటువంటి విరోధమూ బ్రహ్మవాదులతో ఉండదు. కాని, సామ్యావస్థలో గుణాలు వైషమ్యం పొందే యోగ్యత ఉన్నా, కార్యాన్ని ప్రేరేపించే నిమిత్తం (చేతనరూపంలో) ఏదీ లేదు. కాబట్టి వైషమ్యం పొందవు. ఒకవేళ పొందినా, నిమిత్తం లేకపోవటం అనేది ఎప్పుడూ సామాన్యం కాబట్టి, వైషమ్యం సర్వదా పొందాలి. అలాంటప్పుడు కూడా, ప్రధానం వల్ల కార్యోత్పత్తి జరగదు.

## సూ: 2.2.10 విప్రతిషేధాచ్చాసమంజసమ్

సాంఖ్యదర్శనంలో చాలా పరస్పర విరోధాలున్నాయి. అందువల్ల కూడా వారి సిద్ధాంతం అసమంజసమని సూత్రార్థం.

సాంఖ్య సిద్ధాంతంలో ఎన్నో పరస్పర విభేదాలు కనబడతాయి. కొన్ని చోట్ల వారు ఐదు కర్మేంద్రియాలు, త్వక్, మనస్సు కలిపి ఏడింద్రియాలని చెబుతారు, మరికొన్ని చోట్ల మొత్తం పదకొండు (పంచకర్మేంద్రియాలు+పంచజ్ఞానేంద్రియాలు +మనస్సు) ఇంద్రియాలను లెక్కిస్తారు. మహత్తు నుండి భూతన్మాత్రలు ఉద్భవించాయి అని కొన్నిచోట్ల, మరికొన్ని చోట్లు అహంకారం నుండి పుట్టిదంటారు. అలాగే, అంతః కరణాలు మూడని కొన్నిచోట్ల, బుద్ధి ఒక్కటే అని మరికొన్ని చోట్ల ప్రస్తావించారు. పరమేశ్వరుడే జగత్కారణం అని నిర్దేశిస్తున్న శ్రుతి, తదనుగుణంగా ఉన్న స్మృతి వాక్యాలకు సాంఖ్య సిద్ధాంతానికి చాలా విభేదం ఉంది. అందువల్ల బ్రహ్మవాదులు సాంఖ్యదర్శనాన్ని అంగీకరించరు.

**ప్రశ్న:**

సంసారం పీడించేది (తాపకం), పీడించబడేవాడు పురుషుడు (తప్తుడు). తప్య–తాపకాలు వేరు వేరు కాకుండా ఒకే ఆత్మ యొక్క విశేషాలని చెబితే మోక్షం ఎలా కలుగుతుంది?

సముద్రజలానికి సంబంధించిన తరంగ–ఫేన–బుద్బుదాలు, ముందు *"భోక్త్రాపత్తేరవిభాగాశ్చ"* అనే సూత్రంలో

(బ్ర.సూ 2.1.13) సముద్రం యొక్క విశేషాలని, జలం కంటె వేరుకాకపోయినా పరస్పర విభాగం ఉందనే కదా చెప్పడమైనది? అలలు కూడా కనబడుతూ– అణిగిపోతూ ఉంటాయి. ఆవిర్భావ–తిరోభావ రూపంలో నిత్యం ఉంటాయి. సముద్రానికి–అలలకు అనిర్మోక్షం అనే అంగీకరించాలి కదా?

అదీకాక, తప్య తాప్యాలకు లోకంలో స్పష్టంగా భేదం కనబడుతుంది. అర్థం (కోరుకునే వస్తువు), అర్థీ (కోరుకునే పురుషుడు) వేరు వేరు కావాలి. అభిన్నమైతే, ఏ ప్రయోజనాన్ని కోరుకుంటున్నాడో అది వానికి నిత్యసిద్ధమవుతుంది, అప్పుడు కోరుకునే ప్రశ్నే ఉండదు.

అర్థికి అనుకూలంగా ఉన్నది అర్థం, ప్రతికూలంగా ఉన్నది అనర్థం అవుతుంది. ఈ అనర్థమే తాప్యకం. తప్య–తాప్యకాలు రెండింటిలో భేదం పరిగణించి వాటి సంయోగ హేతువుని పరిష్కరిస్తే కాని మోక్షం ఉండదు. సాంఖ్య సిద్ధాంతరీత్యా తాప్యం బుద్ధి, తాపకం సంసారం. బంధ–మోక్షాలు పురుషుని కన్నా భిన్నమైన బుద్ధికి సంబంధించినవి. బుద్ధికి సంబంధించిన అవివేకం పోతే మోక్షం పొందవచ్చు. కాని వేదాంతరీత్యా, బుద్ధి–పురుషునితోనే ఉంటుంది– అభేదము. అందువల్ల మోక్షం ఎలా కలుగుతుందనే సాంఖ్యుల ప్రశ్న.

**సమాధానం:**

కూటస్థమూ, వికారరహితము, నిర్గుణము అయిన బ్రహ్మలో తప్య–తాపక భావం ఉండదు. ఏకాత్మక వాదంలో దుఃఖం (తప్యం) అనేది చేతనానికే ఉంటుంది కాని, అచేతనమైన దేహానికి ఉండదు. దేహం నశిస్తే దానితో పాటే తప్యం (దుఃఖం) నశిస్తూ ఉంటే, దాని నాశనానికి వేరే ప్రయత్నం మరెందుకు?

సాంఖ్యమతంలో కూడా సత్త్వగుణం తప్యం, రజోగుణం తాపకం అని విశదీ కరించినట్లు చెప్పబడదు. ఆ రెండింటిలో చేతనం కలియడం ఉండదు. చేతనుడైన పురుషుడు, సత్త్వగుణంతో ఉండటం వలన తపిస్తున్నట్లు కనబడుతున్నది. అంటే నిజంగా తపించలేదు అనే భావమే వస్తుంది కదా! తప్య–తాపక భావం అనేది అవిద్య వల్ల వచ్చినదే కాని పారమార్థికం కాదు అనే స్థిరీకరించుకోవాలి. అలా కాకుండా చేతనానికే తప్యత్వం నిత్యం ఉంటుంది, అంటే సాంఖ్య సిద్ధాంతానికే విరుద్ధమై అనిర్మోక్ష ప్రసంగం అవుతుంది.

**పశ్న:**

తప్య–తాపక శక్తులు నిత్యమే అయినా పురుషుని బుద్ధితో సంయోగము ఉన్నంత వరకే తప్తుడౌతాడు. ఈ సంయోగానికి కారణం తమస్సు–అవివేకం. అవివేకం నశిస్తే ఆత్యంతిక మోక్ష ప్రాప్తికి అవిరోధం ఏముంటుంది?

**సమాధానం:**

తమస్సు కూడా సత్త్వ–రజో గుణాలతో నిత్యమైనది అనియే కదా సాంఖ్య త్రిగుణాత్మక సిద్ధాంతం ప్రతిపాదిస్తున్నది. మరి వాటి సంయోగం ఎలా పోతుంది? అదీకాక ఈ త్రిగుణముల యొక్క ప్రవృత్తి చంచలం అని కూడా అంటారు. తమస్సు ఉద్భవించటం, అణిగి పోవటం కూడా అనియతమైతే మోక్షం పొందినవాళ్లు, మళ్లీ బద్ధులు కావలసి వస్తుంది. ఇది సమంజసం కాదు.

వేదాంతరీత్యా ఆత్మైకత్వాన్ని అంగీకరిస్తే తప్య–తాపక భావం ఉండదు. వికార భావం అంతా వాచారంభణం మాత్రమే. అందువల్ల, అద్వైత సిద్ధాంతంలో ఎట్టి వైరుధ్యమూ లేకుండా, పరమాత్మయే జగత్కారణము, *'ఖల్విదంబ్రహ్మ'* అని, జీవాత్మ–పరమాత్మ అభిన్నములని స్థిరీకరించబడినది.

# 2. మహద్దీర్ఘాధికరణమ్

సాంఖ్యుల ప్రధాన కారణవాదాన్ని ముందు అధికరణంలో జగత్కారణం కాదని నిరాకరించబడింది. ఇప్పుడు వైశేషికుల పరమాణుకారణ వాదాన్నితిరస్కరింప బోతున్నారు. ముందుగా కణాద మహర్షి (ఉలూకుడని కూడా అతడి పేరే అంటారు) వైశేషిక సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తూ, బ్రహ్మకారణవాదాన్ని ఏవిధంగా వ్యతిరేకించడం జరిగిందో భాష్యకారులు ప్రస్తావించారు. దానిని సంక్షిప్తంగా ఇక్కడ అందించడమైంది.

**పరమాణుకారణ సిద్ధాంతం : కొన్ని అంశాలు**

ఒక కారణద్రవ్యంతో సమవాయ సంబంధంతో ఉన్న గుణాలు, కార్య రూపంలో సమాన జాతికి చెందిన గుణాలనే పుట్టించగలవు కాని, వేరే జాతిక్గుణాలను పుట్టించలేవు. తెల్లని దారాలు, తెల్లని బట్టనే పుట్టించగలవు కాని, వేరే రంగుగల బట్టను పుట్టించలేవు. చేతనమైన బ్రహ్మము జగత్కారణమని అంగీకరిస్తే, జగత్తంతా చేతనమయినదే కావాలి. అచేతనమైన కార్యం ఉండదు. అచేతనమైన కార్యం కనబడుతుండడం వల్ల బ్రహ్మము జగత్కారణం కాదు.

**పారిమాండల్య సిద్ధాంతం:**

పరమాణువులు కార్యాన్ని ఆరంభించకుండా, వాటి వాటి గుణాలతో పారిమాండల్యమనే పరిమాణంతో ప్రళయకాలంలో వేరువేరుగా ఉంటాయి. వాయువుకు సంబంధించిన పరమాణువులకు స్పర్శగుణం మాత్రమే ఉంటుంది. జల పరమాణువులకు స్పర్శ–రూప–రస గుణాలు ఉంటాయి. పృథివీ పరమాణువుల్లో, స్పర్శ–రూప–రస–గంధ గుణాలుంటాయి. ఆకాశం నిత్యం ఉండేది, విభువు కాబట్టి దానిలో పరమాణువులుండవు. వైశేషుకుల సిద్ధాంతంలో నాలుగు రకాలైన పరిమాణాలు ఉంటాయి: 1) అణువు 2) హ్రస్వం 3) మహత్ 4) దీర్ఘం.

జీవుల వాటి వాటి కర్మల ననుసరించి సుఖ–దుఃఖాలననుభవించాలి కాబట్టి జగత్తు అనేది ఆవిర్భవించాలి. జగత్ సృష్టికి పరమాణువులు పరస్పర సంయోగం చెంది కార్యరూపం దాలుస్తాయి. రెండు పరమాణువులు కలిస్తే ద్వ్యణుకం, మూడు కలుస్తే ఒక త్ర్యణుకం ఏర్పడతాయి. రెండు ద్వ్యణుకాలు కలిసి చతురణుకం ఏర్పడుతుంది.

(శంకరులవారి భాష్యానికి సంబంధించిన వరకే వైశేషికులు సిద్ధాంతాన్ని క్లుప్తంగా చర్చించడమైనది. మిగతా వ్యాఖ్యానకారుల అభిమతాన్ని చర్చించలేదు. అంతేకాకుండా, భగవత్పాదులవారి భాష్యాన్ని కూడా చాలా కుదించి సులువుగా గ్రహించడానికి వీలున్నట్లు ప్రస్తావించడమైనది.)

## సూ: 2.2.11 మహద్దీర్ఘవద్వా హ్రస్వపరిమండలాభ్యామ్

హ్రస్వ–పరిమండలాల నుండి మహత్–దీర్ఘాలు పుట్టినట్లు చేతనమైన బ్రహ్మము నుండి, అచేతనమైన జగత్తు పుట్టవచ్చునని సూత్రార్థం.

పరమాణువులో ఉండే పరిణామం పారిమాండల్యం అని చెప్పబడుతున్నది. రెండు పరమాణువులు కలిసి ద్వ్యణుకం అయినా మరొక పారిమాండల్యం ఏర్పడదు. ద్వ్యణుకానికి మరొక పరిమాణం అణుత్వ–హ్రస్వత్వాలతో ఉంటుంది. రెండు ద్వ్యణుకాలు, చతురణకం అయినా అణుత్వ–హ్రస్వత్వాలు కాకుండా మహత్–దీర్ఘ ప్రమాణాలు ఉంటాయి. అనేక పరమాణువులు కాని, అనేక ద్వ్యణుకాలు కాని ద్వ్యణుకాలతో కూడిన పరమాణువుతో కార్యాన్ని ఆరంభించేటప్పుడు ప్రమాణంలో ఇదే పద్ధతి కొనసాగుతుంది. దీనినాధారం చేసుకొనే సూత్రకారులు పై సూత్రాన్ని ప్రతిపాదిస్తున్నారు.

పరిమండల ప్రమాణం గల పరమాణువు నుండి అణువు–హ్రస్వము ప్రమాణముగల ద్వ్యణుకమూ, మహత్–దీర్ఘ ప్రమాణము గల త్ర్యణుకాదులు ఎలా పుడుతున్నాయని వైశేషకులు సిద్ధాంతీకరించారో, అదే విధంగా చేతనమైన బ్రహ్మము (పరమాత్మ) కారణంగా అచేతనమైన జగత్తు కూడా పుడుతుంది.

**పూర్వపక్షి ప్రశ్న:**

ద్వ్యణుకాది కార్యద్రవ్యాలు, కారణంలో ఉన్న పరిమాణానికి విరుద్ధమైన మరొక పరిమాణం చేత ఆక్రమించబడి ఉంటాయి. అందువల్ల కారణంలో ఉన్న పారిమండల్యాదులు కావన్నది సత్యమే. కాని జగత్తు చేతనవిరోధి చేత ఆక్రమింప బడలేదు. చేతనవిరుద్ధమైన గుణం ఏదీలేదే! అచేతనం అంటే చేతన లేదనే కదా అర్థం? చేతనానికి పారిమాండల్యాదులకు చాలా వ్యత్యాసం ఉంది.

**సమాధానం:**

కారణంలో పారిమాండల్యాదులున్నా, అవి ఎలా అనారంభకాలవుతు న్నాయో, అదే విధంగా చైతన్యం కూడా జగత్తులో చైతన్యాన్నే పుట్టించక పోవొచ్చు. పారిమాండల్యాదులు స్వజాతీయ పరిమాణాన్ని కార్యంలో ఆరంభించక పోవడానికి దాని యొక్క స్వభావమే కారణం అని అంగీకరించాలి. ఇదే అనారంభకత్వ స్వభావం, చేతన విషయంలో కూడా వర్తిస్తుంది. అందువల్ల, జగత్తుకు బ్రహ్మము కారణమైనా, అచేతనములు కూడా ఉంటాయి.

సంయోగం వల్ల కొన్ని వస్తువులు విలక్షణమైన మరొక వస్తువుని (ద్రవ్యాన్ని) పుట్టిస్తాయి. ఒక కారణం (మూలం) సమాన జాతీయమైన కార్యాన్నే పుట్టిస్తుందనే నియమం ఏమీ లేదు. చేతనం తనకు సమాన జాతీయంకాని అచేతనాన్ని కూడా పుట్టించవచ్చు. ఈ విషయం ముందు *"దృశ్యతే తు"* అనే సూత్రంలో (బ్ర.సూ 2.1.6) లో ప్రస్తావించి చర్చించటం జరిగింది. అది సాంఖ్య సిద్ధాంతానికి వర్తించినట్లే, వైశేషుకుల సిద్ధాంత నిరాకరణకు వర్తిస్తుంది.

# 3. పరమాణుజగదకారణత్వాధికరణమ్

## సూ: 2.2.12 ఉభయథాపి న కర్మాతస్తదభావః

ఈ ప్రకరణములో కణాదుల పరమాణు కారణవాదాన్ని సూత్రకారులు తిరస్కరిస్తున్నారు.

బట్ట (పటం) అనే ద్రవ్యం దారాలనే అవయవాలతో కలిసి ఉంటుంది. దారాలనే ద్రవ్యాలతో ఆరంభించబడిన బట్టలోనున్న దారాలు, ఒకదానితో ఒకటి అనుగతంగాను, సంయుక్తంగాను ఉంటున్నట్లు లోకంలో చూస్తున్నాం. అదేవిధంగా, అవయవాలతో కూడుకొని ఉన్న ప్రతీద్రవ్యమూ తనకు అనుగతంగా ఉండి సంయోగ సహితమైన ద్రవ్యాలతోనే ఆరంభింపబడుతుంది. ఈ అవయవి – అవయవభావం ఎక్కడ చిట్టచివరగా ఆగిపోయి అపకర్షం, అంతమవుతుందో అదే పరమాణువు. అంటే, ఒక ద్రవ్యంలోని అవయవాలనన్నింటిని విడదీసుకుంటూ పోగా, చిట్టచివర ఇక విడదియ్యడానికి సాధ్యము కాని అవయవమే పరమాణువు. జగత్తులో ఉన్న పర్వతాలు, సముద్రాలు ఇత్యాది ద్రవ్యాలన్నీ అవయవాలతో కూడి ఉన్నాయి. సావయవులు కాబట్టి వాటికి పుట్టుక–నాశనము అనే రెండూ ఉంటాయి. కారణం లేకుండా కార్యం ఉండదు. అందుచేత పరమాణువులే జగత్సృష్టికి కారణం అని కణాదులు ప్రతిపాదించిన సిద్ధాంతము.

పృథ్వీ–ఆపస్–తేజో–వాయువులు నాలుగు మహాభూతాలు అవయవాలతో కూడుకొని ఉన్నవే. అందువల్ల నాలుగు విధాలైన పరమాణువులున్నాయని కల్పించ బడింది. ప్రళయకాలంలో పృథివ్యాది భూతాలు నాశనమయినప్పుడు, పరమాణువుల పర్యంతమే విచ్ఛిన్నమవుతాయి. తరవాత సృష్టికార్యం వాయు పరమాణువులతో కనబడని (అదృష్ట) ప్రక్రియ ఆరంభమవుతుంది. జీవులు సుఖ–దుఃఖాలను అనుభవించాలి కాబట్టి ఈ అదృష్ట కర్మ, అణువుల కదలిక (చలనం) వల్ల స్వతంత్రంగా పుడుతుందని సిద్ధాంతం. ఆ కర్మ ఏ అణువులో పుట్టిందో, ఆ అణువును మరొక అణువుతో కలుపుతుంది. ఇలా ద్వ్యణుకం–త్ర్యణుకం–చతురణుక ం క్రమంలో వాయువు ఏర్పడుతుంది. ఆ ప్రక్రియలో నీరు–అగ్ని–పృథివీ పుడతాయి. ఇంద్రియాదు లతో కూడిన శరీరం, జగత్సర్వం ఇలా అణువుల నుండి ఆవిర్భవిస్తాయి. దారాలలో ఉన్న రూపాదుల నుండి, బట్టలో రూపాదులు వచ్చినట్లు, అణువుల కలయిక వల్ల ద్వ్యణుకాదుల్లో రూపాదులు వస్తాయని కణాద ఋషుల యొక్క సిద్ధాంతం.

అణువుల ద్వారా సృష్టికార్యం జరుగుతుందనే సిద్ధాంతం, భ్రాంతి మూలక మని సూత్రకారుల యొక్క అభిమతం. దీనినే భాష్యకారులు ఇలా వివరిస్తున్నారు:

విభాగావస్థలోనున్న అణువుల సంయోగం కర్మ (కదలిక అనే క్రియ) ద్వారానే జరగాలి. దారాలలో సంయోగం కర్మ వల్లనే జరుగుతున్నది కదా! కర్మ అనేది కార్యం కాబట్టి దానికొక నిమిత్తం ఉండాలి. నిమిత్తం లేకపోతే ఆద్యకర్మ ఎలా జరుగుతుంది? ప్రలయకాలంలో శరీరాదులు లేని కారణంగా బాహ్యప్రయత్నం ఉండదు. మరో విధంగా దేనితోనో గట్టిగా ఢీకొనడం (అఘాతాదికం) లాంటిది జరిగే అవకాశం కనబడదు. అందువల్ల ఆద్యకర్మకు, ఎటువంటి నిమిత్తము లేని పక్షంలో సృష్టి జరగదు.

ఆద్యకర్మకు కనబడని (అదృష్ట) నిమిత్తముందని అనుమానిస్తే అది ఆత్మ సమవాయీవా (విడదియ్యడానికి శక్యం కాని సంబంధం) లేక అణుసమవాయీవా అనే సందేహం వస్తుంది. ఏ విధంగా కూడా, అణువులలో అదృష్ట నిమిత్తకమైన కర్మ (క్రియ) కుదరదు. చేతనము చేత అధిష్ఠింపబడని అచేతనము స్వతంత్రంగా ప్రవర్తింపజేయలేదు అని ముందు సాంఖ్య సిద్ధాంతాన్ని నిరాకరిస్తూ చెప్పడమైంది. నిశ్చితమైన కర్మ నిమిత్తం ఏదీ లేకపోవడం వల్ల ఆద్యకర్మ మొదలవదు. కర్మ లేకపోతే సంయోగం ఉండదు. సంయోగం కుదరనందువల్ల ద్వ్యణుకాది కార్యజాతం పుట్టదు.

ఇప్పుడు సంయోగానికి–విభాగానికీ కూడా కావలసిన ప్రవర్తక కర్మ లేనందు వల్ల సృష్టి–ప్రళయాలు కుదరవని భాష్యకారులు విశదీకరిస్తున్నారు.

ఒక అణువు మరొక అణువుతో పూర్తిగా కలిసిపోతుందా లేక ఒక భాగం లోనే కలుస్తుందా అనే ప్రశ్న

పరిశీలించబడుతున్నది. పూర్తిగా సంయోగం చెందితే పరిమాణంలో వృద్ధి జరగదు. రెండు అణువులు కలసినా, ఒకే అణుపరిమాణంలోకి మారాలి. ఇది లోకంలో కనబడుతున్న దానికి విరుద్ధం అనిపిస్తున్నది. వేరు వేరు భాగాలు ఉన్న ఒక ద్రవ్యం, భాగాలున్న మరొక ద్రవ్యంతో సంయోగం చెందడమే కనిపిస్తున్నది. అణువులలో అవయవాలు ఉండవు. అందువల్ల ఒకభాగంతో సంయోగం కుదరదు. పరమాణువులకు వాస్తవంగా భాగాలు యదార్థంగా ఉండవు, కల్పితాలు అంటే సంయోగం యదార్థం కాదు. యదార్థం కాని సంయోగం యదార్థమైన కార్యానికి అసమవాయి కారణం (విడదియ్యడానికి శక్యమయే సంబంధం) కాజాలదు.

సృష్టి మొదట్లో (ఆద్యకర్మలో) పరమాణువుల మధ్య సంయోగం ఎలా జరగదో, అలాగే ప్రళయంలో కూడా విభాగం జరగదు. అందువల్ల, సంయోగ– వియోగములు రెండింటికి నిమిత్తకారణం ఏదీ లేనందు వల్ల, పరమాణు కారణం తిరస్కరించబడుతున్నది.

## సూ: 2.2.13 సమవాయాభ్యుపగమాచ్చ సామ్యాదనవస్థితేః

సమవాయ సంబంధం అంగీకరించటం వలన అనవస్థాదోషం వస్తుంది. అప్పుడు కూడా అణుకారణవాదం అంగీకరించబడదని సూత్రం యొక్క ముఖ్యార్థం.

రెండు అణువుల నుండి పుట్టిన ద్వ్యణుకం అణువుల కన్నా భిన్నమైనది. కాని, దానికి అణువులతో సమవాయ సంబంధం ఉంటుందని పరమాణు కారణ వాదుల సిద్ధాంతం. అణువుల కంటె భిన్నమైన ద్వ్యణుకం ఏ విధంగా అణువులతో సమవాయ సంబంధంతో ఉంటుందో, అదే రకమైన సంబంధంతో అణు–ద్వ్యణుకాలు ఉండాలి కదా?

**పూర్వపక్షి:**

ఈ దారాలలో వస్త్రం ఉంది. అంటే దారాలకు వస్త్రానికి సమవాయ సంబంధం ఉందని తెలుస్తుంది. అప్పుడు ఈ సమవాయ సంబంధం ఎలా ఏర్పడింది అనే ప్రశ్నే ఉదయించదు. అందువల్ల అనవస్థా దోషం ఏమీ రాదు.

**సమాధానం:**

ఈ తర్కం అంగీకరించబడదు. కార్యమైన వస్త్రం (పటం), కారణమైన దారాలలో (తంతువులో) ఉంది. వాటిది సమవాయ సంబంధం. అది విడదియ్య బడనిది. ఈ సమవాయ సంబంధం వస్త్రానికి – దారాలకు రెండింటికి సమంగా వర్తిస్తుంది. తంతువుకి మరో తంతువుకి ఉన్నది మాత్రం సంయోగ సంబంధం. ఈ సంబంధం విడదియ్యబడుతుంది. అంటే సంయోగ సంబంధం, తంతు ద్వయానికి సమవాయ సంబంధం వల్ల ఏర్పడుతుంది. ఇదే విధంగా ద్వ్యణుక పరమాణువులతో సమవాయ సంబంధం ఉండి తీరాలి.

**ప్రశ్న:**

సంయోగం గుణం కాబట్టి మరొక సంబంధం అవుతుంది, సమవాయం గుణం కానప్పుడు అది మరో సంబంధాన్ని అపేక్షించదు కదా?

**సమాధానం:**

సంయోగం గుణం అన్నది మీ సిద్ధాంతం యొక్క పరిభాష అయితే, దానిని అందరూ అంగీకరించవలసిన ఆవశ్యకతే లేదు. ద్వ్యణుకాలకు–అణ్వాదులకు సమవాయసంబంధం ఉందంటే, అనవస్థాదోష ప్రసక్తి వస్తుంది. అప్పుడు ఏ ప్రక్రియా ఉండదు. పరమాణుకారణ వాదాన్ని, ఈ కారణంగా కూడా తిరస్కరించాల్సివస్తుంది.

## సూ: 2.2.14 నిత్యమేవ చ భావాత్

అణువుల్లో నిత్యం ప్రవృత్తి స్వభావం–నివృత్తి స్వభావం ఉంటున్న కారణంగా అణుకారణ వాదం

అంగీకరించబడదని సూత్రార్థం.

అణువుల్లో స్వభావతః సృష్టి చేసే ప్రవృత్తి, నిత్యమూ ఉంటుందని కాని, నిత్యమూ ప్రళయం కలిగించే స్వభావముతో విరుద్ధంగా ఉంటాయని కాని, నిత్యమూ ఉభయ స్వభావములు ఉండవని కాని ఎలా ప్రతిపాదించినా పరమాణు కారణ వాదము సృష్టికి మూలం అని అంగీకరించబడదు.

అణువులు నిత్యము సృష్టి చేస్తూ ఉంటే ప్రళయం ఉండదు. నిత్యమూ నివృత్తి స్వభావంతో ఉంటే సృష్టే జరగదు. అలాగే విరుద్ధం అవటం వల్ల ఉభయ స్వభావత్వం కుదరదు. రెండు స్వభావములు (అనుభయ స్వభావములు) అంటే ప్రవృత్తిగాని–నివృత్తిగాని ఏదో నిమిత్తకారణంగా జరుగుతుందని, అప్పుడు నిమిత్తమైన అదృష్టం నిత్యమూ సన్నిహితమై, ప్రవృత్తి నిత్యమూ జరగవలసి వస్తుంది. అదృష్టాదికం నిమిత్తమని అంగీకరించని పక్షంలో సృష్టి జరగదు. ఈ కారణం వల్ల కూడా పరమాణు కారణవాదం అంగీకరించబడదు.

## సూ: 2.2.15 రూపాదిమత్త్వాచ్చ విపర్యయో దర్శనాత్

పరమాణువులు నిత్యం ఉండేవి, అవి మహాభూతాలకు ఆరంభకాలు అని వైశేషికుల సిద్ధాంతం. అణువుకు రూపాదులుంటే అది అణువు కానిది, అనిత్యమైనది అవుతుంది. అప్పుడు ఈ సిద్ధాంతానికే విరుద్ధంగా మరేదో పరమకారణం ఉందని ఊహించాల్సి వస్తుంది. లోకంలో రూపాదులన్న ద్రవ్యం మూలకారణం కంటె స్థూలం గాను, అనిత్యస్వభావం ఉన్నదిగాను కనబడుతుంది. వస్త్రం, తంతువులకన్నాస్థూలత్వం, అనిత్యత్వము కలిగి ఉంటుంది కదా! అప్పుడు పరమాణువులకు ఏదో సూక్ష్మమైన, నిత్యత్వమున్న మూలకారణం మరొకటి ఉన్నట్లు భావించవలసి వస్తుంది. పరమాణువే సత్ పదార్థం, దానికి కారణం ఏదీకనబడదనే వాదన అంగీకార యోగ్యం కాదు.

ఆరంభవాదం ప్రకారము కార్యం, కారణం కంటె భిన్నమైనది. కారణం అంత వరకు లేని కార్యాన్నే క్రొత్తగా పుట్టిస్తుంది. ఘట–శరావాదులన్నింటిలోను మృత్ అనుస్యూతంగా ఉంటుంది. అలాగే సువర్ణం, బంగారు ఆభరణాలన్నింటిలోను అనుస్యూతంగా ఉంటుంది. కారణంలో లీనమైతే కార్యరూపం నశించటం జరుగు తుంది. నెయ్యి పేరుకొని గట్టిగా ఉన్నప్పుడూ నెయ్యిఉంది, కరిగిపోయినా నెయ్యి ఉంది. పరమాణువులు నశించాలంటే కారణవిభాగమైనా ఉండాలి, కారణ వినాశ మైనా జరగాలి కదా! వైశేషిక సిద్ధాంతంలో ఈ రెండూ జరగవు. కాబట్టి పరమాణు కారణవాదం అంగీకరింపబడదు.

## సూ: 2.2.16 ఉభయథా చ దోషాత్

దోషం రెండు విధాలుగా కూడా ఉండటం వలన పరమాణు కారణవాదం అంగీకరింపబడదని సూత్రార్థం.

గంధ–రస–రూప–స్పర్శ గుణాలు నాలుగూ కల పృథివి స్థూలరూపంలో ఉంది. రూప–రస–స్పర్శ–గుణాలు మూడే ఉన్న నీరు సూక్ష్మమైనది. రూప–స్పర్శ గూణాలున్న తేజస్సు సూక్ష్మతరమైనది. ఒక్క స్పర్శ గుణమేకల వాయువు అతిసూక్ష్మ రూపంలో ఉంటుంది. ఈ విధంగా గుణాలలో తారతమ్యములున్న మహాభూతాలు, వాటి యొక్క పరమాణువులలో కూడా తారతమ్యాలతో కనబడతాయా? ఎక్కువ గుణాలు ఉంటే వాటి ఆకారం (మూర్తి) పెరగాలి, తక్కువ ఉంటే దాని ఆకారం చిన్నదవాలి. కారణంలో గుణాలు ఎక్కువగా ఉంటే మూర్తిపెరుగుతున్నది, కాబట్టి మూర్తి పెరగకుండా (మూర్త్యుపచయం) లేకుండా గుణం పెరగడం (గుణోపచయం) ఉండదు. పరమాణువుల్లో సమత్వం కోసం, ఒకే గుణం ఉంటుంది అనడం అసలు కుదరదు. అప్పుడు మహాభూతాలలో ఉండే గుణసంపదకే భంగం వస్తుంది. అలా కాకుండా ప్రతీ పరమాణువులోను గంధ–రూప–రస–స్పర్శగుణాలు నాలుగూ ఉంటాయన్నా కుదరదు. వాయుస్తేజాదుల్లో కూడ, లేని గుణాలు వచ్చి చేరాలి. ఇది అసమంజసం. అందువల్ల పరమాణు కారణ వాదం తిరస్కరింపబడాలి.

## సూ: 2.2.17 అపరిగ్రహాచ్చాత్యంతమనపెక్షా

(అపరిగ్రహాత్ చ+అత్యంతం+అనపేక్షా)

సాంఖ్యుల ప్రధానకారణ వాదంలో కొన్ని అంశాలను వేదవేత్తలు వారి స్మృతుల్లో చేర్చి అంగీకరించారు. కాని పరమాణు కారణ వాదాన్ని శిష్టులు ఎవరూ అంగీకరించలేదు (వైశేషికులు అర్ధవైనాశికులు అనే భావం చాలమందిలో గట్టిగా ఉంది). అందువల్ల వేద సంప్రదాయాన్ని గౌరవించే వేదవాదులు, ఈశ్వరకారణ వాదాన్ని దృఢంగా నమ్మే బ్రహ్మవాదులు, పరమాణుకారణ వాదాన్ని ఆదరించలేదు. దీనినే భాష్యకారులు ఈ సూత్రంలో ప్రస్తావించి, ఆ తరవాత పరమాణు సిద్ధాంతంలోని మరికొన్ని అంశాలను తర్కపరంగా పరిశీలించి ఈ ప్రకరణను ఉపసంహరిస్తూ, పరమాణు కారణవాదాన్ని నిరాకరించడానికి మూడు ముఖ్య కారణాలను చూపారు:

1. ఈ సిద్ధాంతం నిస్సారమైన తర్కం మీద ఆధారపడి ఉంది;
2. జగత్కారణం ఈశ్వరుడనే శ్రుతి వాక్యాలకు విరుద్ధమైనది;
3. శ్రుతివాక్యాలను ఆదరించే శిష్టులెవరూ ఈ సిద్ధాంతాన్ని ఆదరించలేదు.

## 4. సముదాయాధికరణమ్

వైశేషికుల పరమాణు సిద్ధాంతాన్ని తిరస్కరించిన పిదప, ఇప్పుడు సూత్రకారులు బౌద్ధమత సిద్ధాంతాలను, బ్రహ్మకారణ వాదాన్ని స్థాపించటానికి, ఎదుర్కొంటున్నారు.

**బౌద్ధమత మూల సిద్ధాంతాలు:**

బౌద్ధులు వేదప్రామాణ్యాన్ని, ఈశ్వర అస్తిత్వాన్ని అంగీకరించరు. స్థిరమైన పదార్థం అంటూ ఏమీ లేదు. ప్రతి వస్తువు క్షణికమే, పుట్టిన మరుక్షణమే నశిస్తుంది. జీవునితో సహా అన్ని వస్తువులూ క్షణికములే. అయితే, కర్మవశం చేత, జీవనం నదీ ప్రవాహంలా సాగుతుండడంతో ఏకత్వభ్రాంతి కలుగజేస్తుంది. వీరు శూన్యవాదులు. చివరకు మిగిలేది శూన్యమే. అందువల్ల వీరిని సర్వవైనాశికులని కూడా అంటారు.

ప్రపంచంలో కనబడుతున్న జరా మరణాది దుఃఖ హేతువులను చూసి బుద్ధుడు నాలుగు ఆర్యసూత్రాలను ప్రతిపాదించాడు:

- జగత్తులో దుఃఖం అందరికీ ఉంది;
- ఈ దుఃఖానికి కారణం ఉంది;
- దుఃఖాన్ని పూర్తిగా నివారించవచ్చు;
- దుఃఖాలను తొలగించే మార్గం ఉంది.

దుఃఖాలను తొలగించే మార్గానికి ఎనిమిది అంగాలు (అష్టాంగాలు) ప్రస్తావించబడ్డాయి – అవి: సమ్యక్ దృష్టి, సమ్యక్ సంకల్పం, సమ్యక్ వాక్, సమ్యక్ కర్మాంతం, సమ్యక్ జీవం, సమ్యక్ వ్యాయామం, సమ్యక్ స్మృతి, సమ్యక్ సమాధి.

ముఖ్యతః బౌద్ధులు శూన్యవాదులే అయినా, కాలక్రమేణ మార్పులు వచ్చి నాలుగు శాఖలు (విభాగాలు) ఏర్పడ్డాయి:

- మాధ్యమికులు: ప్రపంచం అంతా అసత్ అనే శూన్యవాదులు.
- సౌత్రాంతికులు: బాహ్యపదార్థాలు ఉన్నాయి, అవి పరోక్షాలు ప్రత్యక్షంగా కనబడవు.
- వైభాషికులు: బాహ్యపదార్థాలు, మానసిక ప్రపంచం కూడా సత్యమే, సర్వంగోచరమే.
- యోగాచారులు: బాహ్యప్రపంచం కాల్పనికం. విజ్ఞానమే సత్యము. అదే ప్రపంచ రూపంలో కనబడుతున్నది (దీనినే విజ్ఞానవాదం అంటారు).

ఈ ప్రకరణంలో సౌత్రాంతికులు, వైభాషికులు, వీరిరువురి యొక్క సిద్ధాంతాలపైనే చర్చ జరిగింది. రానున్న అధికరణంలో, యోగాచారుల యొక్క (విజ్ఞానవాదం) పై చర్చ జరగనున్నది.

## సూ: 2.2.18 సముదాయ ఉభయహేతుకేఽపి తదప్రాప్తిః

భూతం–భౌతికం అనే బాహ్యవస్తువులను, చిత్తం–చైత్తం అనే అంతర వస్తువులను సర్వాస్తిత్వ వాదులు అంగీకరిస్తారు. చిత్తం అంటే జ్ఞానం, చైత్తం సుఖ–దుః ఖాలు. భూతం అంటే పృథివికి సంబంధించినది. చక్షురాది ఇంద్రియాలు, నదీ– పర్వతాదులు, భౌతికం అనబడతాయి. పరమాణువులు నాలుగు రకాలు. అవి పృథివీ –ఆపస్–తేజో–వాయు అనే నాలుగు భూతాలకు సంబంధించినవి. పృథివీకి చెందిన పార్థివ పరమాణువులు కఠినంగాను, జల పరమాణువులు చిక్కదనంతోను (స్నిగ్ధం), తైజస పరమాణువులు వేడిగాను, వాయుపరమాణువులు కదిలే స్వభావంతోను ఉంటాయి. ఈ పరమాణు సిద్ధాంతం బౌద్ధులందరూ విశ్వసిస్తారు. అదేవిధంగా, రూప–విజ్ఞాన–వేదన–సంజ్ఞ–సంస్కారం అనే ఐదు స్కంధాలు శరీరంలో కలుస్తాయి. అవే సర్వ వ్యవహారాలకు కారణం అని బౌద్ధుల సిద్ధాంతం.

భూత–భౌతికాల సముదాయం అణువుల వల్ల ఏర్పడితే, చిత్త–చైత్తాత్మకమైన శరీరం పంచస్కంధాల సముదాయం

అని, రెండు సముదాయ హేతువులు నిర్దేశించ బడ్డాయి. కాని, ఆ రెండు సముదాయాలలో చేరినవి అచేతనములు. మరొక భోక్తను – ప్రశాసకుణ్ణి (ఈశ్వరుని) బౌద్ధులు అంగీకరించరు. అందువల్ల, ఏ విధంగా ఈ రెండు సముదాయాలు ఏర్పడతాయో అర్థంకాదు. స్థిరమైన ఆత్మ అనేది లేదు, విజ్ఞాన ప్రవాహమే ఆత్మ అంటే, అదే సముదాయాలకు హేతువు ఎలా అవుతుంది? చిత్త– చైత్తాత్మకమైన సముదాయం ఏర్పడకపోతే, తదాధారితమైన లోకయాత్ర జరగదుకదా?

## సూ: 2.2.19 ఇతరేతరప్రత్యయత్వాదితి చేన్నోత్పత్తిమాత్రనిమిత్తత్వాత్

**పూర్వపక్షి:**

చేతనుడైన ప్రశాసకుడు లేకపోయినా, అవిద్యాదులు పరస్పరం ఒకదాని కొకటి కారణం అవడంవల్ల కూడా లోకయాత్ర, జరగవచ్చు. దార్శనికులందరూ అంగీకరించే ఈ అవిద్యాదులు ఇలా పేర్కొనబడుతున్నాయి: 1) అవిద్య, 2) సంస్కారం, 3) విజ్ఞానం, 4) నామరూపం, 5) షడాయతనం, 6) స్పర్శ, 7) వేదన, 8) తృష్ణ, 9) ఉపాదానం, 10) భవం (పుట్టడం), 11) జాతి, 12) జర, 13) మరణం, 14) శోకం, 15) పరిదేవన, 16) దుఃఖం, 17) దుర్మనస్త. అవిద్యాదుల యొక్క ఈ సముదాయం పరస్పర నిమిత్తక–నైమిత్తిక భావం అంటే ఒకదానికి ఒకటి కారణం–కార్యం అవుతూ, ఘటీ యంత్రం తిరుగుతున్న రీతిలో నిరంతరం తిరుగుతూ ఉంటే భూత–భౌతికాల సముదాయం ఏర్పడుతుంది.

**సమాధానం:**

అవిద్యాదులు పరస్పర కారణాలైతే పూర్వమైనది ఉత్తరోత్తరమైన దాని యొక్క ఉత్పత్తికి నిమిత్తం కావొచ్చు (ఉదా: అవిద్య – సంస్కారానికి), కాని సంఘాతం పుట్టడానికి నిమిత్తం కాదు. ఏ భోక్తకు భోగాన్ని ప్రసాదించటానికి, సంఘాతం ఏర్పడాలో, అలాటి స్థిరుడైన భోక్తే లేడని కదా క్షణికవాదం సూచిస్తున్నది! అందుచేత, అవిద్యాదులు, పరస్పరోత్పత్తికి హేతువులైనా కూడా భోక్త లేకపోవడం వలన సంఘాతం జరిగే అవకాశం లేదు.

## సూ: 2.2.20 ఉత్తరోత్పాదే చ పూర్వనిరోధాత్

జగత్తులో ఉండే ప్రతీ వస్తువూ క్షణికమైనప్పుడు, క్షణికాలైన అవిద్యాదుల నుండి సంస్కారాదులు పుట్టడానికే అవకాశం లేదు. పూర్వక్షణంలో ఉన్న వస్తువు, హేతువు (నిమిత్తం), ఉత్తరక్షణంలో పుట్టేది ఫలం అని అంగీకరించినా, పూర్వక్షణం నాశనమై అభావగ్రస్తమౌతుంది, అప్పుడు ఫలం కుదరదు. హేతువు యొక్క స్వభావం (స్వరూపం) ఫలంలో సంక్రమించే వరకు ఉంటేనే ఫలం సిద్ధిస్తుంది. కాని, ఇది క్షణభంగ వాదనకు విరుద్ధం అవుతుంది. మరోవిషయం: ఒక వస్తువు కనబడడం కనబడక పోవడం, ఆ వస్తువులో ఎంత వరకు శాశ్వతత్వం ఉంది అనే దానిపై ఆధారపడి ఉంటాయి. ఇవి వస్తు ధర్మాలు–ద్రష్ట యొక్క ధర్మాలు కావు. ఇందువల్ల కూడా బౌద్ధమతం అసంగతం.

## సూ: 2.2.21 అసతి ప్రతిజ్ఞోపరోధో యౌగపద్యమన్యథా

(అసతి ప్రతిజ్ఞోపరోధః+యౌగపద్యమ్+అన్యథా)

పూర్వక్షణం లేకపోయినా కార్యం ఉత్పన్నమౌతుందంటే అది సిద్ధాంతానికి విరుద్ధం. ఉత్తరక్షణం పుట్టే వరకు పూర్వక్షణం ఉంటుందంటే కారణము–కార్యము ఒకే సమయంలో ఉండాలని సూత్రార్థం.

క్షణభంగ వాదంలో పూర్వక్షణం నిరోధగ్రస్తం (నాశనమైతే) ఉత్తరక్షణానికి హేతువు కాదు. అప్పుడు చిత్త–చైత్యాలు నాలుగు హేతువులు చేరి పుడతాయని కదా బౌద్ధ సిద్ధాంతం? ఈ హేతువులు లేకుండా కార్యోత్పత్తి జరుగుతుందంటే, నిరాటంకంగా ప్రతి వస్తువూ నిత్యమూ అంతటా పుడుతూ ఉండాలి. కాని అది సిద్ధాంతానికే విరుద్ధం కదా?

## సూ: 2.2.22 ప్రతిసంఖ్యాఽప్రతిసంఖ్యానిరోధాప్రాప్తిరవిచ్ఛేదాత్

సంతానానికి విచ్ఛేదం లేకపోవడం వలన ప్రతిసంఖ్యా నిరోధమూ. అప్రతిసంఖ్యా నిరోధమూ ప్రాప్తించవని సూత్రార్థం.

బుద్ధిపూర్వకంగా ఒక వస్తువుని నాశనం చేస్తే అది ప్రతిసంఖ్యానిరోధం, బుద్ధిపూర్వకంగా చేయబడని వినాశం అప్రతిసంఖ్యానిరోధం అని చెప్పబడతాయి. బౌద్ధుల సిద్ధాంతంలో అన్ని వస్తువులూ క్షణికాలే. ఒక వృక్షం క్షణక్షణానికి ఉత్పత్తి, వినాశం పొందుతున్నా, చెట్టు యొక్క అవిచ్ఛిన్నమైన ధార మాత్రమే మనకి గోచరమ వుతుంది. అయితే, ఈ ప్రతిసంఖ్యాప్రతిసంఖ్యానిరోధాలు, సంతానానికి చెందినవా, లేక సంతానులకు చెందినివా అనే ప్రశ్న వస్తుంది. ఏమైనా, అవిచ్ఛిన్నంగా అన్వయి (చెట్టు అనే వస్తువు) ఉన్నట్లు ప్రత్యభిజ్ఞ వల్ల తెలుస్తున్నది కాబట్టి, రెండు విధాల అంటే సంతానానికి కాని సంతానులకు కాని నిరోధం సంభవం కాదు.

## సూ: 2.2.23 ఉభయథా చ దోషాత్

ప్రతిసంఖ్యా నిరోధంలో అంతర్గతమై కల్పింపబడ్డ అవిద్యాదుల నిరోధం ఏదైనా సాధనాలతో సమ్యక్ జ్ఞానం వల్ల కలుగుతుందా లేక దానంతట అదే స్వతంత్రంగా జరుగుతుందా? కొన్ని సాధనాలతో జరుగుతుంది అంటే, వినాశం నిర్హేతుకంగా జరుగుతుందనే ప్రాతిపదికకు విరుద్ధమవుతుంది. వినాశం దానంతట అదే జరుగుతుందన్నప్పుడు, మార్గోపదేశం వ్యర్థం అవుతుంది. అందువల్ల, రెండు విధాలుగా కూడా సిద్ధాంతంలో దోషం వ్యక్తమౌతున్నది. కాబట్టి ఈ సిద్ధాంతం అంగీకార యోగ్యం కాదు.

## సూ: 2.2.24 ఆకాశే చావిశేషాత్

నిరోధద్వయమూ, ఆకాశమూ కూడా స్వరూపం లేని నిరుపాఖ్యమైనవి, అసద్వస్తువులు అని బౌద్ధుల సిద్ధాంతం. పై సూత్రాలలో నిరోధద్వయం యొక్క నిరాకరణ జరిగింది. ఇప్పుడు ఆకాశానికి సంబంధించిన వారి సిద్ధాంతం తిరస్కరింప బడుతున్నది:

*"ఆత్మనః ఆకాశః సంభూతః"* అనే తైత్తిరీయశ్రుతి ప్రకారం (తై.ఉ 2.2) ఆకాశం కూడా వస్తువే అని నిర్ణయించబడింది. అయితే, బౌద్ధులు శ్రుతి ప్రామాణ్యాన్ని అంగీకరించరు. అందువల్ల, మరో ప్రమాణంతో ఆకాశం వస్తువే, అసత్తు కాదు అని నిరూపించబడుతున్నది.

శబ్దం అనే గుణం ఆకాశాన్ని ఆశ్రయించే ఉంది. అందువల్ల అనుమాన ప్రమాణం చేత ఆకాశం అసత్ కాదు అని అంగీకరించాలి. అదీకాక పృథివి దేనిని ఆశ్రయించి ఉన్నది ఇటువంటి ప్రశ్న–ప్రతివచనాల సందర్భంలో, బౌద్ధమత దార్శనికులూ వాయువు ఆకాశాన్ని ఆశ్రయించుకొనే ఉన్నదని ఇలా వ్యక్తం చేశారు: *"వాయురాకాశ సంనిశ్రయః"* . అందువల్ల ఆకాశం నిరుపాఖ్యం కాజాలదు. అసత్తుకు నిత్యానిత్యాలు ఉండవు. నిత్యత్వం ఉండబట్టి ఆకాశం సద్వస్తువని అంగీకరించాలి.

## సూ: 2.2.25 అనుస్మృతేశ్చ

క్షణికత్వం శరీరానికి అంగీకరించబడుతుంది. కాని జ్ఞాత అయిన ఆత్మకు క్షణికత్వం లేదు. జ్ఞానాన్ని అనుసరించి వచ్చే స్మరణయే అనుస్మస్మృతి. ఒక వ్యక్తికి సంబంధించిన ఉపలబ్ధి (జ్ఞానం) మరోవ్యక్తి వల్ల స్మరించటం జరగదు. దర్శన, స్మరణాలకు ఒకే వ్యక్తి కర్త కావాలన్నది సామాన్యం. అందువల్ల, జ్ఞాతకు క్షణికత్వం ఉందని చెప్పటం సిద్ధాంతపరంగా యుక్తం కాదు.

మరణ పర్యంతం ఒకదాని తరువాత ఒకటిగా కలుగుతున్న జ్ఞానానికి తాను ఒక్కడే కర్తనని గుర్తిస్తూ, మళ్లీ క్షణభంగ వాదాన్ని బౌద్ధులు ఏ విధంగా విశ్వసిస్తున్నారో అర్థం కాదు. ప్రత్యభిజ్ఞానం సాదృశ్యం వల్ల ఏర్పడుతున్నది అని చెప్పడం

అర్థం లేని వాదన. ఎవరికైనా, నేను నిన్న చూసిన వస్తువు ఇదేనా అనే సంశయం కలగవచ్చు, కాని నిన్నటి నేను, నేనేనా అనే సందేహం కలగడం అన్నది జరగదు. అందువల్ల బౌద్ధుల సిద్ధాంతం యుక్తంగా లేదు.

## సూ: 2.2.26 నాసతోఽదృష్టత్వాత్

అభావం (అసత్) నుండి, భావం (సద్వస్తువు) పుట్టడం ఎక్కడా కనబడదని సూత్రార్థం.

అభావం నుండి భావం పుట్టదు. అభావత్వంలో విశేషం లేదు కాబట్టి, కారణ విశేషం అంగీకరించటం నిరర్థకం. పాలలో విశేషగుణం ఉంది కాబట్టి, పెరుగు ఉత్పత్తి అవుతుంది. బీజంలో విశేషం ఉంది కాబట్టి, ఉద్భవిస్తుంది. మృత్పిండంలో విశేషం ఉంది కాబట్టి, ఘటాదికం తయారవుతున్నది. నీలోత్పలంలో నీలత్వం స్వభావ సిద్ధమైన విశేషం. ఆ విశేషం అంగీకరిస్తే అది భావమే కాని అభావం కాదు. అభావం ఏ వస్తువు యొక్క ఉత్పత్తికీ హేతువు కాదు. అసత్పదార్థాలైన శశవిషాణాదుల నుండి సత్పదార్థాలు పుట్టవు. సత్పదార్థమైన బంగారం నుండే కుండలాలు మొదలైన ఆభరణాలు ఉత్పత్తి అవుతున్నాయి. అందువల్ల అభావం నుండి భావం పుట్టదు.

## సూ: 2.2.27 ఉదాసీనానామపి చైవం సిద్ధిః

ఏ పని చెయ్యకపోయినా కార్యం సిద్ధించాలని సూత్రార్థం.

అభావం నుండి భావం పుట్టడం సంభవమైతే, ఏ ప్రయత్నం చెయ్యక పోయినా కార్యం సిద్ధించాలి. వ్యవసాయదారుడు పొలం దున్నకుండా, విత్తనాలు వెయ్యకుండా పంటలు పండాలి. కులాలుడు మట్టిని శుభ్రంగా సరిచేసుకోవటం, ఇత్యాది ప్రయత్నం లేకుండానే ఘటాదులు ఉత్పత్తికావాలి. అలాగే నేతకారులు మగ్గంపై దారాలుంచి నెయ్యకపోయినా వస్త్రాలు తయారు కావాలి. స్వర్గ–మోక్షాలను ఎవరూ ఆశించకుండా వస్తుంటే వాటి యత్నం చెయ్యనక్కరలేదు కదా? ఈ కారణం వల్ల అభావం నుండి భావం పుడుతుందనే సిద్ధాంతం తిరస్కరించబడుతున్నది.

# 5. అభావాధికరణమ్

ఈ అధికరణంలో బౌద్ధమతానికి చెందిన యోగాచార శాఖీయుల విజ్ఞాన వాదాన్ని సూత్రకారులు తిరస్కరిస్తున్నారు.

## సూ: 2.2.28 నాభావ ఉపలబ్ధేః

**పూర్వపక్షి:**

విజ్ఞాన వాదంలో ప్రమాణం, ప్రమేయం, ఫలం అనే సమస్త వ్యవహారమూ బుద్ధిని అధిష్ఠించి ఉన్న రూపంలో, లోలోపలే జరుగుతుంది. బాహ్యంగా కనబడేది (బాహ్యార్థం) ఉంటుందని అంగీకరించినా కూడా, అది బుద్ధిలో ప్రవేశిస్తే గాని ప్రమాణాది వ్యవహారం జరగదు.

ఏ వస్తువు యొక్క జ్ఞానం కలగడానికైనా నాలుగు అంశాలు ఉండాలి: 1) గ్రహించే వ్యక్తి (ప్రమాత); 2) తెలుసుకోవలసినది (ప్రమేయం); 3) చక్షురాదులకు వస్తువుతో సంబంధం ఏర్పడినప్పుడు కలిగే జ్ఞానం; 4) ఆ జ్ఞానానికి ఫలం—ఇది ఈ వస్తువు (గోవుని—గోవుగా) తెలుసుకోవడం.

విజ్ఞానవాదుల ప్రకారం విజ్ఞానమే నీలాద్యాకారంతో కల్పితమై ప్రమేయం అవుతుంది. నీలి వస్తువు అని తెలుసుకోవడమే మానం (జ్ఞానము). అంటే విజ్ఞానంలో శక్తియే మానం అనబడుతుంది. ఆ శక్తికి ఆశ్రయమైన రూపంలో ఉన్న వ్యక్తియే ప్రమాత. ఈ భేదాలన్నీ విజ్ఞానంలో ఉన్న కల్పితాలే. వాస్తవంలో విజ్ఞానం తప్ప వస్తువు (పదార్థం) గాని, ప్రమాణంగాని, దానిని తెలుసుకొనడంగాని, తెలుసుకునే వాడుగాని, వేరు—వేరుగా లేవు. భేదకల్పనతోనే వ్యవహారం అంతా లోలోపలే జరిగిపోతుంది.

బాహ్యపదార్థాలు పరమాణువులైనా కావాలి, లేకపోతే వాటి సమూహాలు స్తంభ, వృక్షాది ఆకారాల్లో భాసించాలి. జ్ఞానం కేవలం అనుభవరూపంలోనే కలుగు తుంది. అందువల్ల, స్తంభజ్ఞానం, ఘటజ్ఞానం, వ్యక్తిజ్ఞానం ఇలా ఏదో ఒక విశేషంతోనే ఉత్పన్నమవుతుంది. అందువల్ల, జ్ఞానానికి వస్తువుకి సారూప్యం ఉందనే గ్రహించ వలసి వస్తుంది. అంటే అనుభవమే జ్ఞానం — విషయం (వస్తువు) అనేది జ్ఞానంలోనే ఉంది. జ్ఞానమే, విషయరూపంగా మారి అలా కనబడుతుంది. అందువల్ల విజ్ఞానం కంటె భిన్నంగా బాహ్యపదార్థాలు ఏవీ లేవు అన్నీ కల్పితాలే అని సిద్ధాంతీకరించు కోవాలి.

స్వప్నం, మాయావి సృష్టించిన దృశ్యాలు, ఎండమావుల్లో నీరు – ఏవీ యదార్థం కావు. కాని వాటిలో గ్రాహ్యమూ (తెలుసుకొనబడేదీ), గ్రాహకమూ (తెలుసుకునేది) వేరు వేరుగా ఉన్నట్లు ఎలా అనుకుంటున్నామో, అదే విధంగా జాగ్రదవస్థలో స్తంభాది జ్ఞానం కలుగుతుంది. అయితే బాహ్యపదార్థం ఏదీ లేకపోతే జ్ఞానంలో వైచిత్ర్యం ఎలా కుదురుతుంది అనే ప్రశ్న వస్తుంది. ఇది వాసనా వైచిత్ర్యం వల్ల వస్తుందని నిర్ణయించుకోవలసి వస్తుంది.

**సిద్ధాంతం:**

ఎట్టి బాహ్యార్థం లేదని అంగీకరించబడదు. స్తంభం, గోడ, గోవు ఇలా వస్తువులన్నీ ప్రత్యక్షంగా కనబడుతుంటే, అవన్నీ కల్పితమని ఎలా భావించ బడుతుంది? భోజనం చేసే వ్యక్తి తృప్తిని అనుభవిస్తూ, నేను భోజనం చెయ్యలేదని ఎవడైనా అంటాడా? ఏ వస్తువునైనా, ఆ వస్తువురూపంలో గ్రహించడం సమంజసం కాని జ్ఞానమే ఆవస్తువు అని చెప్పడం సబబుకాదు. అదీ కాకుండా విజ్ఞానవాదులు కూడ *"బహిర్వత్ అవభాసతే"* అని 'వత్' శబ్ద ప్రయోగాన్ని వారి సిద్ధాంతాన్ని నిలబెట్టుకోవడానికి ఉపయోగిస్తున్నారు. అంటే 'బాహ్యపదార్థం వలె' అనే అర్థం వస్తున్నది కదా! బాహ్యపదార్థాన్ని అంగీకరిస్తేనే ఈ విధంగా చెప్పటం కుదురుతుంది.

ప్రత్యక్షాది ప్రమాణాల చేత కనబడుతున్నదానిని సంభవమని, కనబడని దానిని అసంభవమని నిర్ణయించబడుతుంది. ప్రమాణాల ప్రవృత్తి—అప్రవృత్తులను బట్టి సంభవం అసంభవం నిర్ధారింపబడతాయికాని, సంభవాసంభవాలను బట్టి ప్రవృత్త్యప్రవృత్తులు నిర్ణయింపబడవు.

జ్ఞానం ఉన్న ఒక వస్తువుతో సారూప్యం పొందడం వల్ల ఆ వస్తువు నశించదు. ఆ వస్తువు (విషయం) ఉంటేనే కదా సారూప్యం కలిగేది! నల్లని గోవు, తెల్లనిగోవు అంటే వాటి రంగుల్లో ఉన్న భేదం కాని, గోజాతిలో లేదు. అలాగే ఘటం యొక్క జ్ఞానం, పటం యొక్క జ్ఞానం కూడాను. వస్తువులలో ఉన్న భేదమే, జ్ఞాన భేదాన్ని కల్గిస్తుంది. ఘటం–పటం వేరువేరు వస్తువులు. ఈ భేదమే, జ్ఞానంలో భేదంగా సాక్షాత్కరిస్తుంది. క్షీరగంధః (పాలవాసన), క్షీరరసః (పాలరుచి) విశేష్యాలైన గంధ–రసాలకే భేదం చూపుతున్నాయి. విశేషణమైన క్షీరానికి కాదు. క్షీరం అనే పదార్థం ఒక్కటే కదా. పదార్థం ఉండగా, జ్ఞానంలో భేదం ఏర్పడుతున్నది. పదార్థం లేకపోతే, దానితో ఇమిడి ఉన్న జ్ఞానం ఉత్పత్తికాదు.

ఈ సందర్భంలో భాష్యకారులు తర్కాన్ని చూపిస్తూ విజ్ఞానవాదంలో మరి కొన్ని లోపాలను ఉదహరించారు. పూర్వోత్తర క్షణాలకు చెందిన రెండు విజ్ఞానాలు, తమ జ్ఞానం చేతనే క్షీణమవుతాయి కాబట్టి అవి పరస్పరం ఒకదానిని–మరొకటి గ్రహించలేవు. స్థిరమైన ఆత్మ లేని కారణంగా మిగతా ధర్మాలు, అలాగే బంధమోక్షాది ప్రతిజ్ఞలు కూడా కుదరవు (ఉపలబ్ధం కావు).

విజ్ఞానం తనను తానే స్వాత్మ యందు తెలుసుకుంటుందనే ప్రస్తావనయుక్తం కాదు. బాహ్యార్థం తన కంటె భిన్నమైన విజ్ఞానం చేతనే తెలుసుకోబడుతుందని గ్రహించాలి.

**ఆక్షేపణ:**

జ్ఞానమే దీపం మాదిరిగా ప్రకాశాత్మకమైనది. దానిని గ్రహించడానికి వేరే భారూపం యొక్క అవసరం ఏమిటి?

**సమాధానం:**

ఈ వాదన అంగీకరించబడదు. విజ్ఞానం అనిత్యం; ఉత్పత్తి–వినాశ ధర్మాలు కలది. అది జడము. కాబట్టి, జన్మాదులను గ్రహించలేదు. కూటస్థమైన చైతన్యం నిత్యమైనది. కూటస్థమైన చిదాత్మకసాక్షి స్వయం ప్రకాశమైనది. దానికి పరాపేక్ష లేకపోవటం వల్ల, స్వయంగా తెలుసుకుంటుంది, అదే ప్రకాశింపజేస్తుంది. చిదాత్మ స్వయంసిద్ధమైనది.

క్షణిక విజ్ఞానాన్ని ప్రతిపాదిస్తున్న యోగాచార సిద్ధాంతానికి, వేదాంతులు ప్రతిపాదించే హృదయంలో నిత్యం సాక్షిగా ఉండే అంతరాత్మకు ఎటువంటి పోలికలు లేవు. అందువల్ల విజ్ఞానవాదం అంగీకరించబడదు.

## సూ: 2.2.29 వైధర్మ్యాచ్చ న స్వప్నాదివత్

బాహ్యార్థాలు లేవు అని వాదిస్తూ, విజ్ఞానవాదులు జాగ్రదవస్థలో కలిగేస్తంభ ఘటాది జ్ఞానాలు, స్వప్నావస్థలో నిజంగా ఏ వస్తువు లేకపోయినా కలిగే జ్ఞానంవంటివే అని ప్రస్తావించడం జరిగింది. దానికి ఈ సూత్రంలో సమాధానం ఇవ్వబడుతున్నది.

స్వప్న–జాగ్రదవస్థలకు చాలా వ్యత్యాసం ఉంది. జాగ్రదవస్థలో కలిగే దర్శనం అనుభవపూర్వకమైనది. స్వప్నావస్థలో కలిగే దర్శనం స్మృతిరూపమైనది. స్తంభాన్ని జాగ్రదవస్థలో చూచింది యదార్థమైనది. స్వప్నంలో కనబడింది యదార్థ వస్తువు కాదు. అందువల్ల స్వప్న దృష్టాంతంతోను, మాయావి చేసే మాయలతోను, స్వయంగా అనుభవిస్తున్న వాటిని పోల్చి చెప్పడం భావ్యంకాదు. వాటి వాటి ధర్మాల చేత, అగ్ని వేడిగా ఉంటుంది, నీళ్లు చల్లగా ఉంటాయి. అలాగే స్వప్న–జాగరితాల వైధర్మ్యాన్ని అంగీకరించ వలసి ఉంటుంది.

## సూ: 2.2.30 న భావోఽనుపలబ్ధేః

బాహ్య పదార్థాలు లేకపోయినా వాసనా వైచిత్ర్యం వల్ల జ్ఞాన వైచిత్ర్యం కల్గుతుందని ఇంతక పూర్వం విజ్ఞానవాది ప్రతిపాదించిన దానిని (సూ: 2.2.28) ఈ సూత్రంలో ఖండింపబడుతున్నది. అర్థజ్ఞానం ఉంటేనే, ప్రతి వస్తువు విషయంలో బహువిధాలుగా దానికి సంబంధించిన వాసనలు (జ్ఞాపకాలు) పుట్టడానికి అవకాశం ఉంది. కాని, బాహ్యార్థమే లేనప్పుడు

తద్వాసనలకు స్థిరత్వం ఎలా ఉంటుంది?

బీజం నుండి అంకురం పుడుతున్నదని అనుభవం వల్ల తెలుస్తున్నది. విత్తుముందా-చెట్టుముందా అని చెప్పడానికి వీలుకాకపోయినా, అనాదిత్వం వల్ల అది సంభవం అని చెప్పవచ్చు. కాని అర్థానుభవం లేకుండా వాసనలకు స్థిరత్వం (నిలకడ) లేదు కాబట్టి అనాదిత్వ కల్పన అంధపరంపర (గుడ్డివానిపై మరో గుడ్డివాడు ఆధారపడడమే అవుతుంది కదా!)

వాసనలు అంటే ఒక విధమైన సంస్కారాలు అని అర్థం చేసుకోవలసి వస్తుంది. ఆశ్రయం లేకుండా ఎట్టి సంస్కారాలు ఉండవనే లోకంలో కనబడుతున్నది. వాసనలకు ఆశ్రయం కల్పించే దానిని యోగాచార మతం (క్షణభంగ వాదులైన బౌద్ధులు) అంగీకరించలేదు. అందువల్ల కూడా ఈ సిద్ధాంతం తిరస్కరించబడుతున్నది.

## సూ: 2.2.31 క్షణికత్వాచ్చ

జీవాత్మకు ఉండే అహం—అహం అనే జ్ఞాన ప్రవాహాన్ని బౌద్ధులు 'ఆలయ విజ్ఞానమ్' అంటారు. అలాగే వస్తువుల్లో నీల—పీతాది గుణాలకు సంబంధించిన జ్ఞానం 'ప్రవృత్తి విజ్ఞానమ్' అనబడుతుంది. ఆలయ విజ్ఞానం కూడా ప్రవృత్తి విజ్ఞానం వలే క్షణికమైనదని బౌద్ధుల సిద్ధాంతం. కూటస్థమైనది, నిత్యమైనదేదీ లేనందు వల్ల ఆలయవిజ్ఞానం భూత—భవిష్యత్—వర్తమాన కాలాలు మూడింటిలోను జరిగే వ్యవహారాల యొక్క స్మరణ – ప్రత్యభిజ్ఞ కలగజేయలేదు. అందువల్ల యోగాచారులూ క్షణభంగ సిద్ధాంతానికి ప్రతిబద్ధులే కాబట్టి వారి విజ్ఞానవాదం ఈ కారణంగా కూడా తిరస్కరింపబడుతున్నది.

## సూ: 2.2.32 సర్వథానుపపత్తేశ్చ

మాధ్యమికశాఖకు చెందిన బౌద్ధమతస్థులు శూన్యవాదులు. సర్వశూన్యత్వమే బుద్ధుని ముఖ్యసిద్ధాంతం. ప్రపంచం అసత్, సర్వేశ్వరుడు లేడనే వారి వాదం సర్వ ప్రమాణాలకు విరుద్ధమైనది. అందువల్ల, శ్రుతి—ఉపనిషత్ప్రామాణ్యం పై అచంచల విశ్వాసమున్న బ్రహ్మవాది అయిన సూత్రకారులు శూన్యవాదాన్ని పూర్తిగా తిరస్కరించా లనే భావంతో ప్రత్యేకించి ఏ సూత్రం ప్రతిపాదించలేదు. బౌద్ధుల యొక్క సిద్ధాంతాలు ఏ విధంగా పరిశీలించి చూచినా నిలబడలేవు; శూన్యవాదం, బాహ్యార్థవాదం, విజ్ఞాన వాదం – అన్నీ పరస్పర విరుద్ధమైన సిద్ధాంతాలతో రూపకల్పన చేయబడ్డవి. అందువల్ల, వాటిని పూర్తిగా తిరస్కరించటమే ఉత్తమమని ఈ సూత్రంలో భాష్యకారులు అభిప్రాయపడుతూ ఈ ప్రకరణను ముగించారు.

# 6. ఏకస్మిన్నసంభవాధికరణమ్

ఈ అధికరణంలో సూత్రకారులు దిగంబర జైన సిద్ధాంతాన్ని తిరస్కరిస్తు న్నారు. ముందుగా జైనమత ముఖ్య ప్రాతిపదికలను సంక్షిప్తంగా ప్రస్తావించటం జరిగింది.

**జైనమత ముఖ్య సిద్ధాంతాలు:**

జైనమతం చాలా పురాతనమైనది. వారి సిద్ధాంతంలో ఏడు పదార్థాలు ఇలా నిర్దేశింపబడ్డాయి: జీవం–అజీవం–అస్రవం–సంపరం–నిర్జరం–బంధం– మోక్షం. జీవుడు భోక్త, అజీవం భోగ్య వస్తువు, ఇంద్రియాలు కోరికలను కలుగజేస్తూ విషయాభిముఖంగా ప్రవర్తింపజేయడం అస్రవం, ఆ ప్రవృత్తిని నియంత్రించే యమ నియమాదులు సంవరం, పాపాలను పోగొట్టే సాధనం నిర్జరం, బంధం, కర్మ. కర్మ బంధం నుండి విముక్తి పొంది ఆకాశంలో పైపైకి పోవటమే మోక్షం. వారు వాడే పారిభాషిక శబ్దాల్లో అస్తికాయాలు (పదార్థాలు) ఇలా వివరించబడ్డాయి:

- జీవాస్తికాయం – జీవుడు
- పుద్గలాస్తికాయం – పరమాణు సముదాయమైన శరీరం
- ధర్మాస్తికాయం – మంచి ప్రవర్తనతో ఊహించదగినది
- అధర్మాస్తికాయం – జీవుణ్ణి శరీరంలో బంధించేది

సప్తభంగీనయం (ఏడు నియమాలు) జైన సిద్ధాంతంలో ఒక ముఖ్యభాగము. ఒక అంశాన్ని నానా విధాలుగా పరిశీలించి చూడడమే దీని ఉద్దేశ్యము. జగత్తుల్లో ఏ వస్తువుకూ ఒక నిశ్చితమైన స్వరూపం ఉండదు. దీనినే వారు ఏకాంతత్వం లేదు అంటారు. వస్తువు యొక్క స్వరూపం ఇది అని నిశ్చితంగా చెప్పడం ఏకాంతత్వం అవుతుంది. ఏకాంతత్వానికి భంగం ఏడువిధాలుగా ఉంటుందని భావించడం చేత 'సప్త భంగీనయం' అని సిద్ధాంతీకరించి, ఒక వస్తువును ఏడు విధాలుగా ఇలా పరిశీలించవచ్చు అని ప్రతిపాదించటమైనది:

1. స్యాదస్తి : ఒక విధంగా ఉంది లేక ఈ వస్తువు ఉండవచ్చును.
2. స్యాన్నాస్తి : అదే వస్తువు ఒక విధంగా లేకపోవచ్చును.
3. స్యాదస్తిచ నాస్తిచ : ఒక విధంగా ఉండవచ్చును లేకపోవచ్చు కూడా.
4. స్యాదవ్యక్తవ్యః : ఒక విధంగా వర్ణింప శక్యం కానిది.
5. స్యాదస్తి చావ్యక్తవ్యః : ఒక విధంగా ఉండవచ్చును, కాని వర్ణింప శక్యం కానిది.
6. స్యాన్నాస్తి చావ్యక్తవ్యః : లేదనీ వర్ణింప శక్యం కానిది.
7. స్యాదస్తి చనాస్తి చావ్యక్తవ్యః : ఉందనీ లేదనీ చెప్ప శక్యం కానిది.

జైనులు అనీశ్వరులు. దేవుణ్ణి–పరమాత్మను అంగీకరించరు. వారికి తీర్థంకరులే సర్వజ్ఞులు, పూజనీయులు, మహాపురుషులు (మహావీరుడు 24 వ తీర్థంకరుడు, బుద్ధుని సమకాలికుడు). ఏకాత్మవాదం అంగీకరించరు. ఎన్ని శరీరాలు ఉన్నాయో అన్ని ఆత్మలు ఉంటాయి. అంటే ఆత్మ శరీర ప్రమాణమంతది. శరీరం నశిస్తే ఆత్మకు విముక్తి.

జైనులు ప్రత్యక్షప్రమాణాన్నే కాకుండా అనుమాన–శబ్ద–ప్రమాణాలను అంగీకరిస్తారు. ప్రత్యక్షంగా కనబడే పృథివీ–ఆపస్–తేజో–వాయువులూ ఆకాశం, కాలం ధర్మం, అధర్మం అనే తత్త్వాలనూ అంగీకరిస్తారు. ఆత్మ ఉంది, సుఖదుఃఖాది గుణాలను బట్టి ఆత్మ అస్తిత్వాన్ని ఊహించవచ్చును.

## సూ: 2.2.33 నైకస్మిన్నసంభవాత్

ఒక ధర్మి (వస్తువు) యందు సత్త్వ–అసత్త్వ అనే విరుద్ధ ధర్మాలు కలిసి ఉండడం కుదరదు. శీతోష్ణాలు కలిసి

ఉండడం అసమంజసం. నానాత్వాన్ని సప్త భంగీనయ సిద్ధాంతంలో ప్రతిపాదించటం అందువల్ల యుక్తం కాదు. నిర్ధారణ అన్నది కూడా ఒక అంశమే. దాని విషయంలో కూడా స్యాదస్తి–స్యాన్నాస్తి అనే వికల్పాలు కుదరవు. దీని వల్ల ఈ ఫలం లభిస్తుందని నిశ్చయంగా చెప్పినప్పుడే ఆ ప్రాతిపదికకు ప్రయోజనం ఉంటుంది. సంశయాత్మకమైన శాస్త్రం అంగీకరించబడదు.

అదే విధంగా పంచ అస్తికాయల విషయంలో కూడా చాల సందేహాలు కనబడతాయి. జీవాస్తికాయం ఇటువంటి వస్తువుల్లో అవ్యక్తత్వం (వ్యక్తం చెయ్యలేక పోవటం) ఉండదు. వీటిని నిర్ధారణ చెయ్యలేకపోతే ఫలం నిర్ధారణ చెయ్యబడదు. స్వర్గ–మోక్షాలు ఒక పక్షంలో నిత్యములూ, మరోపక్షంలో అనిత్యములూ అని అనిశ్చితంగా చెప్పడం సబబు కాదు కదా! నిశ్చితాభిప్రాయం లేని కారణంగా జైన సిద్ధాంతానికి చెందిన ఏకం–అనేకం, నిత్యం–అనిత్యం, వ్యతిరిక్తం–అవ్యతిరిక్తం అనే ప్రాతిపదికలు తిరస్కరించబడతాయి. శరీరాలు పరమాణువుల సమూహము అని పుద్గలాస్తికాయ సిద్ధాంతం ప్రతిపాదిస్తున్నది. వైశేషిక బౌద్ధమత సిద్ధాంతాలను చర్చించిన సందర్భంలో పరమాణు వాదాన్ని తిరస్కరించటం జరిగింది. అందువల్ల ఆ అంశాన్ని మళ్లీ పరిశీలించవలసిన అవసరం లేదు. పరమాణు కారణవాదాన్ని జగత్ సృష్టి–స్థితి–లయలకు ఏ విధంగానూ అంగీకరించలేము.

## సూ: 2.2.34 ఏవం చాత్మాఽకార్త్స్న్యమ్

ఆత్మ అకృత్స్నము (సర్వగతము కానిది). శరీరమెంత పరిణామము గలదో అంతే పరిణామం కలది అని చెప్పబడదని సూత్రార్థం.

శరీరాలు ఎన్ని ఉన్నాయో అన్ని ఆత్మలున్నాయి, ఆత్మ పరిమాణం–శరీర పరిమాణకం అని జైనుల సిద్ధాంతం ప్రతిపాదిస్తున్నది. అంటే ఘటాదుల వలె పరిచ్ఛిన్న ప్రమాణం కలది, అనిత్యమైనది–అకృత్స్నము, సర్వగతత్వం లేనిది అనే కల్పన స్పష్టంగా కనబడుతుంది. ఈ కల్పననే ఇచ్చట తిరస్కరించటం జరిగింది.

శరీరాల పరిమాణం అన్నిజీవులలోను ఒకే మాదిరిగా ఉండదు. ఒక వ్యక్తి కర్మవిపాకం వల్ల ఏనుగు జన్మ ఎత్తితే తన ఆత్మతో ఏనుగు శరీరానికంతకూ వ్యాపించలేదు. అలాగే ఈగ–దోమ జన్మ ఎత్తితే వాని ఆత్మ, దాని శరీరంలో ఇమడదు. అంతే కాదు, శరీరావస్థ కౌమార–యౌవన–వార్ధక్యావస్థలలో మారుతూ ఉంటుంది. అప్పుడు ఆత్మ యొక్క పరిమాణం మారుతుందా? ఈ ప్రశ్నలకు సమాధానం జైన మతంలో దొరకవు. శరీర మాత్రంచేత పరిచ్ఛిన్నమైన అవయవాలకు అనంతత్వం కల్పించడం కూడా అసమంజసమే. అందువల్ల ఈ సిద్ధాంతం నిరాకరించబడుతున్నది.

## సూ: 2.2.35 నచ పర్యాయాదప్యవిరోధో వికారాదిభ్యః

శరీరం పెద్దదయినప్పుడు కొన్ని జీవావయాలు (అణు రూపంలో) వచ్చి చేరతాయి, చిన్నదయినప్పుడు తొలగిపోతాయి అని కూడా చెప్పబడదు. ఇలా జీవావయాలు వచ్చి చేరడం పోవడం వలన జీవుడికి వికారం కలిగే దోషం (ప్రమాదం) వస్తుంది. జీవుడు కూడా నిత్యత్వం లేనవాడనీ చెప్పవలసి వస్తుంది. అంతేకాదు, సంసారసాగరంలో కొట్టుకుంటున్న శారీరుడికి, బంధమోక్షం కలిగి పైపైకి వెళ్లిపోతాడనే సిద్ధాంతం కూడా బాధింపబడుతుంది.

వస్తూ–పోతూ ఉండే శరీర కణాలు వేరు, నిత్యత్వం ఉన్న ఆత్మవేరు అని అంగీకరించ వలసి వస్తుంది. చర్మానికి నిత్యత్వం లేకపోవొచ్చు, కాని ఆత్మ– శరీరానికున్న చర్మంతో సమానం కాదు. అదీకాక, ఈ జీవావయాలు ఎక్కడ పుడతాయి, ఎక్కడ విలీన మవుతాయి అనే విషయంలో కూడా స్పష్టత కనబడదు. శరీరాలు పంచమహాభూతాల నుండి ఉద్భవిస్తాయనే సిద్ధాంతం కూడా జైనులు అంగీకరించరు. ఈ విధంగా జీవావయాల విషయంలో ఎన్నో సిద్ధాంతపరమైన దోషాలు కనబడుతున్న కారణంగా, ఈ ప్రతిపాదన అంగీకరించబడదు.

శరీర పరిమాణం గల ఆత్మ పెరుగుతూ–తరుగుతూ ఉన్నా, నదీ ప్రవాహంలో కనబడే నిత్యత్వం దానిలోనూ

కల్పించబడుతుందనే వాదన కూడా అసమంజసం. బౌద్ధమతం గురించి చర్చించిన సందర్భంలో ఈ ప్రవాహసంతాన నిత్యత్వ సిద్ధాంతాన్ని తిరస్కరించడం జరిగింది. ప్రవాహసంతానమే లేకపోతే ఆత్మే లేదు (నైరాత్మ్యవాదం) అని అంగీకరించవలసివస్తుంది, అలా కాకుండా నదీప్రవాహం కనబడినట్లు ఉంటుందని ప్రతిపాదిస్తే, ఆత్మకు వికారదోషం తప్పదు. అందువల్ల, రెండు విధాలా సిద్ధాంతంలో ఉన్న దోషం పోదు. ఈ కారణంగా శరీరంలో జీవావయాలు వచ్చిచేరినప్పుడు వృద్ధి, అవి పోయినప్పుడు ఆత్మ పరిమాణం తగ్గడం అనే సిద్ధాంతం అంగీకరించబడదు.

## సూ: 2.2.36 అంత్యావస్థితేశ్చోభయనిత్యత్వాదవిశేషః

మోక్షప్రాప్తి సమయంలో జీవుని పరిమాణం, ఒక నిశ్చిత రూపంలో నిత్యంగా ఉంటుందని జైనులు విశ్వసిస్తారు. అప్పుడు, మోక్షానికి పూర్వం కూడా అదే నిశ్చిత పరిమాణం ఉంటుందని అంగీకరించ వలసి ఉంటుంది. మోక్ష పూర్వావస్థలో, ఉపచయాపచయాలు (వృద్ధికావటం, తగ్గిపోవటం) అంగీకరిస్తే నిత్యత్వ వాదనకు విరోధం కలుగుతుంది. జీవుని పరిమాణం – శరీర పరిమాణం అంతే ఉంటుందని అంగీకరిస్తే, అప్పుడు పెరిగిన–తరిగిన ఇతర శరీరాల ప్రాప్తి ఆత్మకు ఉండదు. అందువల్ల మోక్షావస్థలో నిత్యమైన ఏపరిమాణం ఉంటుందో, అదే పరిమాణంగల శరీరంలో మాత్రమే దానితో బద్ధమైన ఆత్మ ముందూ–ఆ తరవాత కూడా ఉంటుందని చెప్పవలసి వస్తుంది. ఇలా అంగీకరించని పక్షంలో, జీవ పరిమాణం (మోక్ష సమయంలో) నిత్యమైనది అంటే జీవుడు ఎప్పుడూ అణు ప్రమాణుడైనా లేకపోతే మహత్ ప్రమాణుడైనా అయి ఉండాలి. అందువల్ల, ఆత్మకు శరీరంతో సమానమైన పరిమాణం ఉంటుందనే జైన సిద్ధాంతం అంగీకరించబడదు.

# 7. పత్యధికరణమ్

ఈ అధికరణములో జటాధారులైన మాహేశ్వరుల యొక్క సిద్ధాంతాలను సూత్రకారులు నిరాకరిస్తున్నారు. మాహేశ్వరులు ఆగమాలను (పూజావిధాన శాస్త్రాన్ని) అనుసరిస్తారు. కాపాలికులు, పశుపతులు, కారుణిక సిద్ధాంతులు, శైవులు అనే నాలుగు శాఖలకు చెందిన వారిని మాహేశ్వర మతానికి చెందినవారని దార్శనికులు పేర్కొంటారు.

**మాహేశ్వరుల మూల సిద్ధాంతం:**

ఈశ్వరుడు (అధిష్ఠాత) జగత్ నిర్మాణానికి కేవలం నిమిత్త కారణమే కాని, ఉపాదాన కారణం (ప్రకృతమైన మూలకారణం) కాదు. ఆగమశాస్త్ర ప్రామాణ్యాన్ని అంగీకరించే ఈ మతస్థులు, సాంఖ్య–యోగవాదుల యొక్క సిద్ధాంతాలతో ప్రభావితు లైనట్లు కనబడుతుంది. అద్వితీయమైన బ్రహ్మమును జగత్తుకు ప్రకృతి అనే తత్త్వాన్ని అంగీకరించరు. ప్రధానము–పురుషుడు–ఈశ్వరుడు పరస్పరం వేరు వేరైన వారని మాహేశ్వరుల సిద్ధాంతం కాబట్టి, అది వేద విరుద్ధమని బ్రహ్మవాదులు భావిస్తారు.

## సూ: 2.2.37 పత్యురసామంజస్యాత్

సూత్రకారులు ప్రథమాధ్యాయంలో బ్రహ్మము జగదాధారం–జగత్కర్త అంటే సృష్టికి ప్రకృతి ఉపాదాన కారణము నిమిత్తకారణము కూడా అని నిర్దేశిస్తూ *"ప్రకృతిశ్చ ప్రతిజ్ఞాదృష్టాంతానుపరోధాత్"* అనే సూత్రంలో (బ్ర.సూ 1.4.23) శ్రుతి–స్మస్మృతి ప్రమాణాలతో స్థాపించారు. తదనంతరం *"అభిధ్యోపదేశాచ్చ"* , అనే సూత్రంలో (బ్ర.సూ 1.4.24) ఈశ్వరునికి కర్తృత్వ–ప్రకృతిత్వాలు రెండూ ఉన్నాయని మళ్లీ ఉద్ఘాటించారు.

మాహేశ్వరుల మతంలో ఈశ్వరుడు కేవలం అధిష్ఠాత (నిమిత్త కారణం), ప్రకృతి కాదు అనే ప్రతిపాదన, వేదాంతవిహిత బ్రహ్మైకత్వ పక్షానికి విరుద్ధంగా ఉంది. మాహేశ్వరులు కార్యం–కారణం–యోగం–విధి–దుఃఖాంతం అనే ఐదింటిని (వేరు వేరు పదార్థములుగా) జీవుల యొక్క బంధవిముక్తికి(మోక్షానికి) ఉపదేశించారు. ఈ ఉపదేశం శ్రుతి–స్మృతి సమ్మతమైన బ్రహ్మకారణ వాదానికి విరుద్ధం కాబట్టి, ఇక్కడ ఆ సిద్ధాంతం అసామంజస్యం అని తిరస్కరించబడుతున్నది.

హీనులుగాను–మధ్యములుగాను–ఉత్తములుగాను ప్రాణులను సృష్టిస్తున్న ఈశ్వరుడికి సమభావం లేకుండా, రాగ–ద్వేషాదులున్నట్లు భావించవలసి ఉంటుంది. అప్పుడు సృష్టికర్త ఈశ్వరుడు కాదు, అనీశ్వరుడౌతాడు. అందువల్ల ఈశ్వరుడు కర్మ వల్ల ప్రేరితుడై జగత్ నిర్మాణానికి నిమిత్తకారణం మాత్రమే అవుతున్నాడు. ఇది మాహేశ్వరుల వాదనలో ముఖ్యాంశం.

కర్మ ఈశ్వరుణ్ణి ప్రేరేపిస్తుంది – ఈశ్వరుడు కర్మను ప్రేరేపిస్తాడు అనే సిద్ధాంతంలో అన్యోన్యాశ్రయ దోషం వ్యక్తమవుతుంది. కర్మ అచేతనం కాబట్టి ఈశ్వరుణ్ణి ప్రేరేపించదు అని ప్రథమతః అంగీకరించాలి. కర్మ యొక్క ప్రేరణ లేనిదే ఈశ్వరుడు ప్రవర్తించదు. అలా కాకుండా, ఈశ్వరుడే కర్మను ప్రవర్తింప జేస్తాడు, ఆ తరవాత ఆ కర్మ వల్ల ఈశ్వరుడు ప్రేరేపింపబడి మరో కర్మ చేయిస్తాడు అని వాదిస్తే దానిలో అన్యోన్యాశ్రయదోషం వస్తుంది కదా?

సంసారం (జగత్) అనాది కాబట్టి, అన్యోన్యాశ్రయ దోషం ప్రసక్తం కాదనే వాదన కూడా యుక్తం కాదు. వర్తమాన కాలంలో ఉండే అన్యోన్యాశ్రయదోషం భూతకాలంలో కూడా ఉండవలసి వస్తుంది. కాబట్టి, అనాదిత్వ కల్పన అంధపరంపరా న్యాయం చేత తిరస్కరింపబడాలి.

ఈశ్వరునికి ఎట్టి స్వార్థపరత (స్వప్రయోజనం) ఆరోపింపబడదు. అదీకాక, యోగశాస్త్రం ప్రకారం ఈశ్వరుడూ ఒక పురుషుడే. ఉదాశీనత్వం ఇద్దరికీ సమానమే. అందువల్ల ఈశ్వరుణ్ణి యోగశాస్త్రరీత్యా ప్రవర్తకుడు అని అంగీకరించడం కూడా అసామంజస్యం అవుతుంది.

## సూ: 2.2.38 సంబంధానుపపత్తేశ్చ

ప్రధానము–పురుషులు–ఈశ్వరుడూ ఈ మూడూ వేరు వేరు పదార్థములని మాహేశ్వరుల మతప్రతిపాదన. అప్పుడు ఈశ్వరుడు, ఏ సంబంధం లేకుండా ప్రధానము పురుషులపై ఎలా ఈశత్వం వహిస్తాడు? అదీకాక, ఈశ్వరునికి–ప్రధానము నకు–పురుషులకూ సంయోగరూపమైన సంబంధాన్ని కాని, సమవాయ సంబంధం కాని కుదరదు. వాటికి కార్య–కారణ భావం ఏదీ వారి సిద్ధాంతం ప్రతిపాదించలేదు.

బ్రహ్మకారణ వాదంలో జగత్తుకీ – బ్రహ్మకు అనిర్వచనీయమైన తాదాత్మ్య సంబంధం అంగీకరించబడుతుంది. బ్రహ్మము – పురుషుడు అభిన్నములు. ఉపనిష ద్విదిత ఆత్మైకత్వాన్ని, బ్రహ్మవాదులు పూర్తిగా అంగీకరిస్తారు. వేద బాహ్యమైన కల్పనలతో ప్రతిపాదించిన యోగ–సాంఖ్య–మాహేశ్వర సిద్ధాంతాలు అసమంజసమని తిరస్కరించబడుతున్నవి.

## సూ: 2.2.39 అధిష్ఠానానుపపత్తేశ్చ

ప్రత్యక్షంగా కనబడనిదీ, రూపాదులు లేనిది ప్రధానం. దానికి ఈశ్వరుడు అధిష్ఠాత అని కల్పించడం కూడా కుదరదు. ఘటాదుల నిర్మాణం కుంభకారుడు చేస్తు న్నాడంటే, మృదాది వస్తువులపై కులాలుడికి సంపూర్ణ పరిజ్ఞానం ఉంటుంది. అందు వల్ల అధిష్ఠాతగా ఆ కార్యాన్ని చెయ్యగలడు. ఈశ్వరుడు ప్రధానాదులను అధిష్ఠించి, కులాలుడి వలె ప్రవర్తింప జేయవచ్చు అనే తార్కికుల ప్రతిపాదన అంగీకరించబడదు.

## సూ: 2.2.40 కరణవచ్చేన్న భోగాదిభ్యః

పురుషుడు ఇంద్రియాల నధిష్ఠించి ఉన్నట్లు ఈశ్వరునికి ప్రధానాన్ని అధిష్టించి ఉండడం కూడా కార్య నిర్వహణ యందు కుదరదు. ఈశ్వరునికి అప్పుడు భోగాది సంబంధం ఏర్పడుతుందని సూత్రార్థం.

రూపాదులు లేని ఇంద్రియ సముదాయాన్ని పురుషుడు అధిష్ఠించి తన వశంలో ఉంచుకున్న రీతిలో, ఈశ్వరుడు ప్రధానాన్ని అధిష్ఠించవచ్చు అనే వాదన కూడా అంగీకరించబడదు. ఇంద్రియాలను అధిష్ఠించిన పురుషుడు, భోగాదులను అనుభవిస్తాడు. ఈశ్వరునికి భోగాదులు కల్పించటం యుక్తం కాదు.

పై రెండు సూత్రాలకు భాష్యకారులు మరో వికల్పంతో వ్యాఖ్యానించటం కూడా జరిగింది.

ఈశ్వరునికి ఒక శరీరం ఇంద్రియాదులతో కల్పించుకుంటే ప్రధానాన్ని ప్రవర్తింప జేయవచ్చు. అయితే సృష్టి తరవాతే శరీరం అన్నది ఏర్పడాలి. సృష్టికి ముందు శరీరాదులు కల్పించబడవు. స్వ ఇచ్ఛతో ఈశ్వరుడు శరీరాన్ని పొందే అవకాశం ఉందని ప్రతిపాదిస్తే, ఈశ్వరుడు కూడా ఒక సంసారిలాగా భోగి అవుతాడు. అప్పుడు అనీశ్వరత్వం ప్రసక్తమవుతుంది. అందువల్ల అదీ అసమంజసమే అవుతుంది.

## సూ: 2.2.41 అంతవత్త్వమసర్వజ్ఞతా వా

ప్రధాన–పురుష–ఈశ్వరులకు అంతము (నాశనము) లేదా ఈశ్వరునికి అసర్వజ్ఞత్వం కాని ప్రాప్తిస్తాయని సూత్రార్థం.

మాహేశ్వరులు ఈశ్వరుడు సర్వజ్ఞుడూ, అనంతుడూ అని నమ్ముతారు. అనంతమైన ప్రధానమూ, అనంతులైన పురుషులూ, పరస్పరము వేరు వేరు పదార్థము లని నమ్ముతున్నప్పుడు, వాటి యొక్క సంఖ్యా పరిమాణాలను ఏ విధంగానైనా పరిచ్ఛిన్నం చేసి, ఈశ్వరుడు నిర్ణయిస్తాడా అనే ప్రశ్న ఉత్పన్నమవుతుంది. పరిచ్ఛిన్న రూపాలైతే, అంతం (వినాశం) ఉండాలి. ఈ విధంగా ప్రధాన–పురుష–ఈశ్వరులకు అంతం ఉంటే, ఆది (మొదలు) కూడా ఉండాలి. ఆద్యంతాలు ఉంటే శూన్యత్వం ఏర్పడే అవకాశం ఉంది. అలా పరిచ్ఛిన్న రూపాలను ఈశ్వరుడు ప్రధాన–పురుషుల యందు (ఇయత్తా) నిర్ణయించడు అనే ప్రాతిపదిక, ఈశ్వరుడు సర్వజ్ఞుడు అనే సిద్ధాంతానికి విరుద్ధమవుతుంది. అప్పుడు మూలసిద్ధాంతమైన

సర్వజ్ఞతకే హాని కలుగు తుంది. అందువల్ల మాహేశ్వరుల ఈశ్వరాధిష్ఠిత కార్యవాదము తిరస్కరింపబడుతున్నది.

# 8. ఉత్పత్త్యసంభవాధికరణమ్

ఈ అధికరణంలో భాగవతుల పాంచరాత్రాగమంలో ప్రతిపాదితమైన సిద్ధాంతం నిరాకరించబడుతున్నది.

శాండిల్యుడనే ఋషి (విద్వాంసుడు) నాలుగు వేదాల యందు పరమ శ్రేయస్సును పొందజాలక పాంచరాత్రాగమం అనే స్మస్మృతిలో ప్రతిపాదించిన ఈ సిద్ధాంతాన్ని భాగవతులు ఆదరిస్తారు. వారి మతం యొక్క సారాంశాన్ని ఇలా సంక్షిప్తంగా చెప్పవచ్చు:

- నిరంజన జ్ఞాన స్వరూపమైన పరమాత్మ వాసుదేవుడు
- ఆయనే వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అనిరుద్ధ – అనే నాలుగు వ్యూహరూపాల్లో తనను తాను విభజించుకొని జగత్కార్యం నిర్వహిస్తున్నాడు.
- ఈ నాలుగు రూపాల్లో వాసుదేవుడు పరమాత్మ పరప్రకృతి
- సంకర్షణ–ప్రద్యుమ్న–అనిరుద్ధులు కార్యరూపాలు. సంకర్షణుడు జీవుడు; ప్రద్యుమ్నుడు మనస్సు; అనిరుద్ధుడు అహంకారము. దీనినే చతుర్వ్యూహ వాదంగా కూడా పేర్కొంటారు.

భగవంతుడైన వాసుదేవుణ్ణి అభిగమన–ఉపాదాన–ఇజ్యా–స్వాధ్యాయ –యోగ అనే ఐదు సాధన ప్రక్రియలతో 100 సంవత్సరాలు ఆర్చించిన భక్తులు, దుఃఖాలు క్షీణించగా పరమేశ్వరుణ్ణి చేరుకుంటారు. అభిగమనాది ఐదు సాధనాలను ఇలా వివరించటం జరిగింది:

1. అభిగమనం : మనోవాక్కాయములను అవధాన పూర్వకంగా చేసుకొని దేవతా గృహానికి వెళ్లడం.
2. ఉపాదానం : పూజాద్రవ్యాలను సంగ్రహించడం
3. ఇజ్య : పూజించటం
4. స్వాధ్యాయం : అష్టాక్షరాది జపం
5. యోగ : ధ్యానం చేసుకోవడం

## సూ: 2.2.42 ఉత్పత్త్యసంభవాత్

(ఉత్పత్తి+అసంభవాత్)

జీవాత్మ యొక్క ఉత్పత్తి నిరాకరించబడుతున్నదని సూత్రార్థం.

సర్వాత్మ స్వరూపుడైన నారాయణుడు అనేక రూపాల్లో ఉంటాడు అనే సిద్ధాంతం శ్రుతి సమ్మతమైనదే. *"స ఏకధా భవతి, త్రిధా భవతి"* (ఛా.ఉ 7.26.2). అలాగే, పరమేశ్వరుణ్ణి ధ్యానాదిక్రియలతో ఆరాధించి పొందవచ్చుననే ఉపదేశం కూడా వేదసమ్మతమైనదే. అందువల్ల వాటిని ఆదరించాలి. పరమాత్మయైన నారాయణుడి సేవ, ఆరాధన చేయడమే శ్రేయస్కరమని శ్రుతి–స్మృతి వాక్యాలు ఉద్బోధిస్తున్నాయి.

ఈ సూత్రంలో నిరాకరింపబడుతున్నది వాసుదేవుని నుండి సంకర్షణుడు, సంకర్షణుని నుండి ప్రద్యుమ్నుడు, ప్రద్యుమ్నుని నుండి అనిరుద్ధుడు పుట్టాడు అనే ఉత్పత్తి సిద్ధాంతమే. వాసుదేవుడనే పరమ ప్రకృతి (పరమాత్మ) నుండి సంకర్షణుడనే జీవుని ఉత్పత్తి సంభవం కాదు. ఉత్పత్తి ఉంటే మరణం ఉండాలి. జీవాత్మకు అనిత్యత్వం కల్పించడం యుక్తం కాదు. ఆత్మకు నిత్యత్వం ఉంటేనే భగవంతుణ్ణి పొందిన ప్రాణికి, మోక్షం–ముక్తి కల్పించబడుతుంది. కార్యం–కారణాన్ని పొంది విలీనం కావాలి. సూత్రకారులు ఈ తరవాత పాదంలో *"నాత్మాఽశ్రుతేః నిత్యత్వాచ్చ తాభ్యః"* అనే సూత్రంలో (బ్ర.సూ 2.3.17.) జీవాత్మకు ఉత్పత్తి లేదని మళ్లీ స్పష్టం చేస్తున్నారు. అందువల్ల సంకర్షణుడనే జీవుని ఉత్పత్తి వాసుదేవుని నుండి జరిగిందనే సిద్ధాంతం అంగీకరింపబడదు.

## సూ: 2.2.43 నచ కర్తుః కరణమ్

కర్త నుంచి సాధనాలు (కరణం) పుట్టవని సూత్రార్థం.

దేవదత్తుడనే ఒకానొక కర్త నుండి, పరశు (గొడ్డలిలాటి) సాధనము పుట్టడం ఎక్కడా కనబడదు. అందువల్ల సంకర్షణుడనే జీవుని నుండి ప్రద్యుమ్నుడనే మనస్సు అనిరుద్ధుడనే అహంకారము పుడుతుందనే భాగవతులు యొక్క సిద్ధాంతం, దృష్టాంతాలు లేకుండా అంగీకరించబడదు.

## సూ: 2.2.44 విజ్ఞానాదిభావే వా తదప్రతిషేధః

భాగవతమతస్థులు, సంకర్షణుడు–ప్రద్యుమ్నుడు–అనిరుద్ధుడూ కూడా జ్ఞానం, ఐశ్వర్యం, శక్తి, బలం, వీర్యం, తేజస్సు – అనే ఈశ్వర ధర్మాలు కలవారని పేర్కొంటారు. అంతేకాదు వారు అపహత పాప్మాది గుణములతో నాశరహితమైన వారని కూడా విశ్వసిస్తారు. అప్పుడు పరమార్థతత్త్వం భగవంతుడైన వాసుదేవుని ఒక్కడి యందే ఉందని చెప్పబడదు. అదీకాక, పరమాత్మ ధర్మాలు వాసుదేవుని యందు ఉన్నప్పుడు, అనేక ఈశ్వరుల కల్పన వ్యర్థం అనిపిస్తుంది.

కార్య–కారణాలలో ఏదో ఒక విశేషం భిన్నంగా ఉండాలి. ఘటానికి–మృత్‌కి కొంత విశేషం కనబడుతున్నది కదా! ఏ విశేషం(అతిశయం) లేకపోతే, ఒక వస్తువు కారణమని దానికిది కార్యమని చెప్పబడదు. పాంచరాత్ర సిద్ధాంతంలో సంకర్షణాదులు పరమేశ్వరుడైన వాసుదేవుని స్వ స్వరూపములే, ఈ నలుగురి గుణాలలో (ఐశ్వర్యాదు లలో) తారతమ్యం లేదని చెప్పబడుతున్నది. బ్రహ్మాదిస్తంబ పర్యంతమూ జగత్తులో నున్న సర్వమూ భగవద్రూపమే అని అవగతమవుతున్నప్పుడు, భగవద్వ్యూహాలు (పరమాత్మ రూపం) నలుగురికే పరిమితమన్న కల్పన యుక్తం కాదు.

## సూ: 2.2.45 విప్రతిషేధాచ్చ

పాంచరాత్రాగమంలో పరస్పర విరోధమూ, వేదవిరుద్ధ కల్పన స్పష్టంగా కనబడుతుంది. ఒకే వస్తువుని గుణమని–గుణీ అని చెప్పటం జరిగింది. జ్ఞాన ఐశ్వర్యాదులు గుణాలు, ఆ గుణాలే వాసుదేవుల ఆత్మలు, అంటే ఆ గుణాలున్నగుణులు అని ప్రతిపాదించటం పరస్పర విరుద్ధంగా ఉంది. శాండిల్యుడు నాలుగు వేదాలు అధ్య యనం చేసినా పరమశ్రేయస్సును పొందజాలక పాంచరాత్రాగమ శాస్త్రాన్ని రూపొం దించాడు అని వ్యక్తం చెయ్యడం కూడా వేదనింద (వేద అనాదరణ) అవుతుంది.

ఈ కారణాల వల్ల భాగవతుల పాంచరాత్ర సిద్ధాంతం నిరాకరించ బడుతున్నది.

# 2.
# అవిరోధాధ్యాయము : తృతీయపాదము



ఈ పాదంలో ఉపనిషత్తుల్లో విన్పిస్తున్న సృష్టిక్రమాదులకు సంబంధించిన శ్రుతులకు కాని, జీవాత్మ శ్రుతులకు కాని ఎట్టి విరోధం లేదని సూత్రకారులు స్పష్టం చేస్తున్నారు.

### 1. వియదధికరణమ్

## సూ: 2.3.1 న వియదశ్రుతేః

ఆకాశం యొక్క పుట్టుక గురించి ఎక్కడా శ్రుతిలో వినబడదు. అందువల్ల ఆకాశానికి పుట్టుక లేదని సూత్రార్థం.

**ఏకదేశి పక్షం**

పంచభూతాల యొక్క సృష్టి విషయంలోను, జీవుని ఉత్పత్తి విషయంలోను, ప్రాణాల యొక్క ఉత్పత్తి విషయంలోను శ్రుతులు ఒకే విధంగా ఉపనిషత్తుల్లోనూ వినబడవు. ఛాందోగ్యంలో *"సదేవ సోమ్య ఇదమగ్ర ఆసీత్ ఏకమేవాద్వితీయమ్"* (ఛా.ఉ 6.2.1) అని సచ్ఛబ్ద వాచ్యంతో బ్రహ్మను ప్రస్తావించి, *"తదైక్షత తత్తేజోఽసృజత"* (ఛా.ఉ 6.2.3), బ్రహ్మము తేజస్సును మాత్రమే సృష్టించినదని చెప్పబడు తున్నది. ఇక్కడ ఆకాశం యొక్క ఉత్పత్తి గురించి ఏమీ వినిపించదు. అందువల్ల ఆకాశానికి పుట్టుక లేదనిపిస్తున్నది. ఇలా ఒకరి వాదన.

## సూ: 2.3.2 అస్తి తు

సూత్రంలో 'తు' శబ్దం, ముందుసూత్రంలో ప్రస్తావించిన ఏకదేశ పక్షాన్ని నిరాకరిస్తూ, మరో అభిప్రాయాన్ని ఇలా వ్యక్తం చేస్తున్నది:

ఆకాశానికి ఉత్పత్తి ఉంది. తైత్తిరీయోపనిషత్తులో *"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ"* అని ఉపక్రమించి *"తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః"* (తై.ఉ 2.1) అని వినిపిస్తున్నది. ముందు ఉదహరించిన ఛాందోగ్యశ్రుతికి, తైత్తిరీయ శ్రుతికి విరోధం కనబడుతున్నది. విరోధం లేకుండా పరస్పర సమన్వయంతో ఏకవాక్యత కుదరదు. ఛాందోగ్యశ్రుతిలో తేజస్సు మొదట ఉద్భవించినట్లు తెలియజేస్తుంటే, తైత్తిరీయ శ్రుతి ఆకాశం మొదట పుట్టినట్లు సూచిస్తున్నది. అదీకాక *"వాయోరగ్నిః"* అనే శ్రుతి వాక్యం (తై.ఉ 2.1), వాయువు నుండి అగ్ని పుట్టినట్లు చెబుతున్నది.

## సూ: 2.3.3 గౌణ్యసంభవాత్

ఈ సూత్రంలో మరో పక్షం చూపబడుతున్నది. కణ్వాది మతస్థులు ఆకాశానికి ఉత్పత్తి నిరాకరిస్తారు. అందువల్ల ఆకాశానికి ఉత్పత్తి ఉందనే కల్పనను కేవలం గౌణంగా (లాక్షణికంగా) గ్రహించవలసి ఉంటుంది. ఆకాశానికి సమవాయి కారణంగాని – అసమవాయి కారణంగాని – నిమిత్తకారణంగాని కల్పించబడవు. అలాగే, ఆకాశం పుట్టడానికి పూర్వం అవకాశరహితమైనదీ – సుషిర (సూక్ష్మ), ఛిద్ర (సూక్ష్మతమ) ద్వారాలు లేనివేవీ ఊహించబడవు. ఆకాశం విభువు కాబట్టి పుట్టుక లేకపోవడం (అజత్వం) కూడా కుదురుతుంది. అందువల్ల ఆకాశానికి ఉత్పత్తి కల్పిస్తున్న శ్రుతిని కేవలం గౌణార్థంలోనే గ్రహించవలసి ఉంది.

## సూ: 2.3.4 శబ్దాచ్చ

ఆకాశం నిత్యమైనదని శ్రుతి వల్ల తెలుస్తున్నదని సూత్రార్థం.

ఈ సూత్రంలో, ముందు మూడు సూత్రాలలో వ్యక్తం చేసిన అభిప్రాయా లకు (పక్షాలకు) ఇలా ఒక సమాధానం చెప్పబడుతున్నది: *"వాయుశ్చాంతరిక్షంచ ఏతదమృతమ్"* (బృ.ఉ 2.3.3). వాయువు అంతరిక్షము కూడా నాశనము లేనివి– అమృతములు అని బృహదారణ్యకోపనిషత్తు ధృవీకరిస్తున్నది. అలాగే *"ఆకాశవత్సర్వ గతశ్చ నిత్యః"* అని నిత్యత్వ– సర్వగతత్వ ధర్మాలున్న పరమాత్మను ఆకాశంతో పోల్చటం జరిగింది. *"స యథా అనంతోఽయ మాకాశ ఏవం అనంత ఆత్మావేదితవ్యః"* (ఆకాశం వలె ఆత్మ కూడా అనంతమని తెలుసుకోవాలి). *"ఆకాశ శరీరం బ్రహ్మ"* (తై.ఉ 1.6.2), *"ఆకాశ ఆత్మా"* (తై.ఉ 1.7.1) అనే శ్రుతి వాక్యాలు బ్రహ్మ ఆకాశ స్వరూపము – ఆకాశం బ్రహ్మ యొక్క స్వరూపము అని పలుకుతున్నాయి. అందువల్ల, ఆకాశం బ్రహ్మము వలె నిత్యమైనది, పుట్టుక లేనిదనే గ్రహించవలసి ఉంది.

## సూ: 2–3–5 స్యాచ్చైకస్య బ్రహ్మశబ్దవత్

(స్యాత్ చ ఏకస్య బ్రహ్మశబ్దవత్)

'బ్రహ్మ' శబ్దానికి ఉన్నట్లు సంభూత శబ్దానికి ముఖ్యత్వమూ, గౌణత్వమూ కూడా ఉండవచ్చునని సూత్రార్థం.

**ఆక్షేపం:**

*"తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః"* (తై.ఉ 2.1) అనే వాక్యంలో సంభూత శబ్దానికి, పుట్టినది అనే ముఖ్యార్థం, తరవాత వినిపిస్తున్న తేజస్సు మొదలైన వాటికి గౌణార్థం చెప్పడం యుక్తం కాదు కదా?

**సమాధానం:**

సంభూత శబ్దం పై శ్రుతివాక్యంలో ఒకే పర్యాయం ప్రయోగించబడినా, సందర్భాన్ని బట్టి బ్రహ్మ శబ్దాన్ని గౌణార్థంలోను, ముఖ్యార్థంలోను కూడా ప్రయోగిం చడం కనబడుతున్నది. *"తపసా బ్రహ్మ విజిజ్ఞాసస్వ"* (తపస్సు చేత బ్రహ్మమును తెలుసుకో), *"తపో బ్రహ్మేతి"* (తపస్సే బ్రహ్మము) అని వినిపిస్తున్న తైత్తిరీయ భృగువల్లీ (తై.ఉ 3.2) ప్రకరణంలో, అన్నాన్ని సూచిస్తున్నప్పుడు గౌణార్థంలో ప్రయోగించ బడింది. ఆనందాన్ని సూచిస్తున్నప్పుడు అదే శబ్దం ముఖ్యార్థంలో వాడబడింది. బ్రహ్మమును తెలుసుకొనడానికి సాధనంగా వినియోగించే తపస్సు విషయంలో బ్రహ్మము శబ్దం గౌణంగా (లాక్షణికార్థం) *"తపోబ్రహ్మ"* అని వాడబడింది. విజ్ఞేయమైన బ్రహ్మము విషయంలో ముఖ్యార్థంలో ఉపయోగించబడింది. అదేవిధంగా, ఆకాశ తేజో విషయాల్లోను అన్వయించుకోవచ్చును.

**సంశయం:**

*"ఏకమేవాద్వితీయమ్"* అనే వాక్యం, బ్రహ్మము తప్ప మరేమీ లేవని సూచిస్తున్నది కదా?

**సమాధానం:**

పూర్వావస్థలో పరమాత్మ తప్ప కార్యరూపంలో ఏదీ లేదని దీని అర్థం. బ్రహ్మము తోపాటు ఆకాశం ఉన్నా, పరమాత్మ యొక్క ఏకత్వ ప్రతిజ్ఞకు భంగం వాటిల్లదు.

ఘటాదులకు ప్రకృతియైన మృత్‌కు కులాలుడు అధిష్ఠాతగా కనబడతాడు కాని, జగత్ప్రకృతియైన బ్రహ్మకు వేరే అధిష్ఠాత లేదు అని *"ఏకమేవాద్వితీయమ్"* అనే స్పష్టం చేస్తున్నది. ఆకాశం ఉన్నా బ్రహ్మమునకు ద్వితీయత్వం రాదు. సృష్టికి పూర్వం ఆకాశం–బ్రహ్మము నీళ్లు–పాలు వలె కలిసిపోయి వేరు వేరు లక్షణాలు లేనివి. *"ఆకాశ శరీరం బ్రహ్మ"* ఇత్యాది శ్రుతులు ఆకాశం–బ్రహ్మ అభేదం అని తెలియపరుస్తున్నవి.

**ఆక్షేపం:**

బ్రహ్మవిజ్ఞానం చేత సర్వం తెలుస్తుంది (సర్వవిజ్ఞానసిద్ధి) అని సూచిస్తున్నది కూడా ఇదే భావంతో అని గ్రహించాలి. బ్రహ్మమునకు సంబంధించిన దేశకాలాలకు భిన్నంగా ఆకాశానికి దేశకాలాలు లేవు. ప్రతివస్తువు కూడా, ఆకాశం ఏ దేశకాలంలో ఉంటుందో అదే దేశ కాలంలో పుడుతుంది. క్షీరంలో కలిసిన నీటిబిందువులు ఎలా భిన్నములు కావో, అలాగే బ్రహ్మముతోను, తత్ కార్యాలతోను, దేశకాలాలు అభిన్నములు. అందువల్ల ఆకాశం యొక్క ఉత్పత్తి ఉన్నదని చెప్పడం కూడా గౌణం అని భావించవచ్చును కదా?

పై ఆక్షేపణలకు సమాధానం ఇలా ఇవ్వబడుతున్నది:

## సూ: 2.3.6 ప్రతిజ్ఞాఽహానిరవ్యతిరేకాచ్ఛబ్దేభ్యః

కార్యకారణాలకు భేదం లేనందు వల్ల సర్వవిజ్ఞాన ప్రతిజ్ఞకు భంగం లేదని సూత్రార్థం.

ప్రతి వేదాంతంలోను ఒకేవిధంగా సమస్త వస్తుసముదాయము, జ్ఞేయమైన బ్రహ్మము కన్నా వ్యతిరిక్తంగా లేదని ఇలా తెలియజేస్తున్నవి: *"యే నాశ్రుతం శ్రుతం భవతి, అమతం మతం అవిజ్ఞాతం విజ్ఞాతమ్"* (ఛా.ఉ 6.1.1), *"ఆత్మని ఖల్వరే*

*దృష్టే శ్రుతే మతే విజ్ఞాతే ఇదం సర్వం విదితమ్"* (బృ.ఉ 4.5.6), అలాగే *"న కాచనమత్‌బహిర్ధా విద్యాస్తి"* సమస్త కార్యరూపములు బ్రహ్మకారణంగా పుడితేనే వ్యతిరేకత లేకపోవడం కుదురుతుంది. ప్రకృతికి–కార్యాలకు వ్యతిరేకం ఉండదు అనే న్యాయం వల్లనే సర్వవిజ్ఞాన ప్రతిజ్ఞ సిద్ధిస్తుందని శ్రుతి మూలంగా తెలుస్తున్నది. *"యేనాశ్రుతం శ్రుతం భవతి"* అనే ప్రతిజ్ఞ మృదాది దృష్టాంతాల చేత స్థాపింపబడింది. అలాగే *"సదేవ సౌమ్య ఇదమగ్ర ఆసీత్, ఏకమేవాద్వితీయమ్"* (ఛా.ఉ 6.2.1) అని స్థాపించడానికే *"తదైక్షత తత్తేజోఽసృజత"* (ఛా.ఉ 6.2.3) బ్రహ్మకారణంగా పుట్టిన కార్య సముదాయాన్ని చూపుతూ, *"ఐతదాత్మ్యమిదం సర్వమ్"* (ఛా.ఉ 6.8.7) అనే వాక్యంతో ప్రారంభించి, అధ్యాయం చివర వరకూ బ్రహ్మము కంటె వ్యతిరిక్తమైన కార్యాలు ఉండవని చెప్పబడింది. అందువల్ల, ఆకాశం బ్రహ్మకార్యం కాకపోతే ప్రతిజ్ఞా హాని కలుగుతుంది. వేద ప్రామాణ్యాన్ని శంకించడం యుక్తం కాదు.

*"ఇదం సర్వం యదయమాత్మా"* (బృ.ఉ 2.4.6) అనే శ్రుతి, *"బ్రహ్మైవ ఇదం అమృతం పురస్తాత్"* (ము.ఉ 2.2.12) అని విన్పిస్తున్న శ్రుతి, సర్వవిజ్ఞాన ప్రతిజ్ఞనే దృష్టాంతాలతో దృఢీకరిస్తున్నవి. అందువల్ల, అగ్ని మొదలగు భూతాల వలె, ఆకాశానికి కూడా ఉత్పత్తి ఉందని అంగీకరించాలి కాని, శ్రుతివాక్యం లేదంటూ ఆకాశానికి పుట్టుక లేదని భావించడం యుక్తం కాదు.

ఆకాశోత్పత్తిని చూపుతున్న *"తస్మాద్వా ఏతస్మాదాత్మాన ఆకాశః సంభూతః"* అనే తైత్తిరీయశ్రుతి (తై.ఉ 2.1) చూపబడినా, అది *"తత్తేజోఽసృజత"* అనే ఛాందోగ్యశ్రుతి వాక్యానికి విరుద్ధంగా ఉందనే వాదన అంగీకరించబడదు. *"తస్మాద్వా ఏతస్మాదాత్మన ఆకాశః సంభూతః, ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః"* అనే తైత్తిరీయశ్రుతి క్రమంలో, తేజస్సు సృష్టి మూడవ దానిగా చెప్పబడుతున్నది. తత్ (పరమాత్మ) ఆకాశాన్ని, వాయువుని సృష్టించి తరవాత తేజస్సును సృష్టించింది అని – పైన ఉదహరించిన ఛాందోగ్యశ్రుతిని సమన్వయించుకోవచ్చును. అప్పుడు ఆకాశోత్పత్తి విషయంలో ఎట్టి విరోధం ఉండదు.

స్రష్ట (సృష్టి కర్త) ఒకడే అయినా, సృష్టించబడే కార్యములు అనేకములు. వాటిని ఏ క్రమంలోనైనా సృష్టించవచ్చు. అందుచేత రెండు శ్రుతులనూ ఏకవాక్యత కుదిరేటట్లు సమన్వయించుకోవడం ఉత్తమం కాని, వాటిని వైరుధ్యం ఉందని నిరాకరించటం యుక్తం కాదు. *"సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలానితి శాంత ఉపాసీత"* (ఛా.ఉ 3.14.1) అనే శ్రుతి సమస్త వస్తు సముదాయము బ్రహ్మము నుండే పుట్టినదని స్పష్టం చేస్తున్నది. అందువల్ల, మరో శ్రుతిలో ఆకాశంతో ప్రారంభమయే ఉత్పత్తి క్రమానికి ఏ అడ్డూరాదు. తేజస్సుకు ప్రాధాన్యముందనే భావనతో, శ్రుత్యంతరంలో వినిపిస్తున్న ఆకాశమనే మరో ముఖ్యపదార్థాన్ని త్యజించడం సమంజసం కాదు. క్రమం ఒక పదార్థం యొక్క ధర్మం, దానికి ప్రాముఖ్యత ఇవ్వడం కన్నా, పదార్థనికే ప్రాముఖ్యత ఇవ్వడం ఉచితం. అదీకాక *"తత్తేజోఽసృజత"* అనే శ్రుతి వాక్యంలో క్రమం నిర్దేశింపబడలేదు. కేవలం అర్థాన్ని బట్టి శ్రుత్యంతరంలో విన్పిస్తున్న *"వాయో రగ్నిః"* అనే వాక్యం చేత క్రమం నిశ్చయింపబడింది. ఈ కారణం వల్ల, శ్రుతులలో విరోధం లేదని ఆకాశం యొక్క ఉత్పత్తిని అంగీకరించాలి.

మరొక విషయం కూడా ఇక్కడ స్పష్టం చెయ్యవలసి ఉంది. ఏక విజ్ఞానం చేత సర్వ విజ్ఞానం అనేది పాలు నీళ్లు కలిసి పోయినట్లు అనే దృష్టాంతంతో (క్షీరోదక న్యాయం చేత) సమన్వయించబడదు. మృదాది దృష్టాంతాలు ఉపాదాన కారణం – దాని యొక్క కార్యరూపాలు స్థాపించడానికి ఉద్దేశింపబడ్డాయి. క్షీరోదకన్యాయం వలన సమ్యక్ జ్ఞానం సిద్ధించదు. బ్రహ్మమొక్కటే అద్వితీయము. ఈ మూల కారణాన్ని తెలుసుకుంటే, దాని వలన ప్రాప్తించే కార్యాలన్నీ తెలుసుకోవచ్చు. కీలకమైన ఈ తత్త్వాన్ని శ్వేతకేతువుకు నిర్దిష్టంగా బోధించడానికి *"శ్వేతకేతో యన్ను సౌమ్యేదం మహామనా, అనూచానమానీ, స్తబ్ధోఽస్యుత తమాదేశ మప్రాక్ష్యో యేనాశ్రుతం శ్రుతం భవతి"*...(ఛా.ఉ 6.1.3) అని ప్రత్యక్షంగా కనబడే ఉదాహరణలతో పలుమార్లు చెప్పబడింది. అందువల్ల సర్వమూ బ్రహ్మము యొక్క కార్యమనే గ్రహించాలి.

## సూ: 2.3.7 యావద్వికారం తు విభాగో లోకవత్

ఈ సూత్రం ఆకాశానికి ఉత్పత్తి సంభవం కాదనే పక్షాన్ని ఖండిస్తున్నది. లోకంలో ఘట–శరావాదులు గాని,

కేయూర–కుండలాది ఆభరణాలు గాని, సూది –ఖడ్గం మొదలైన వస్తువులు గాని భిన్నరూపాలలో కనబడుతున్న కార్య సముదాయమే. వికారం కానిది ఏదీ విభక్తంగా కనబడదు. ఉపాదాన కారణాలైన మృత్‌కాని, సువర్ణం గాని, ఇనుపముద్ద గాని విభక్తంగా కనబడవు. పృథివ్యాదులు, ఆకాశం వేరు వేరుగా కనబడుతున్నాయి. అందువల్ల అవీ కార్యరూపాలే. కార్యాలకు నాశనం అనివార్యం.

ఆత్మ కార్యం కాదు. అది పరమకారణం. దేని నుండీ ఉద్భవిచింది కాదు. దానికి నాశనము లేదు. ఆత్మ, ఆకాశాది కార్యాలన్నింటికి ఆధారభూతమైన స్వరూపం. ఆత్మ స్వయంసిద్ధమైనది, స్వప్రకాశమైనది. అగ్నికి ఉష్ణత్వం నిరాకరించబడదు. ఆత్మ క్షణికం కాదు. ప్రత్యభిజ్ఞ (స్మరణ జ్ఞానంతో తెలుసుకోవడం వల్ల) ఆత్మ నిత్యమైనది. జ్ఞాతవ్యమైన వస్తువులు మారుతున్నా, జ్ఞాతలో మార్పు లేకుండా సదా ఒకే ఆత్మ అవుతున్నది. అందువల్ల ఆత్మ, ఆకాశాదుల్లా కార్యరూపమని చెప్పబడదు.

**ఆక్షేప నివృత్తి:**

ఇప్పుడు 'ఆకాశము యొక్క ఉత్పత్తికి సమానజాతీయమైన కారణద్రవ్యం లేదు' అనే ఆక్షేపణ నిరాకరించబడుతున్నది.

సమానజాతీయమైన కారణమే, ఒక కార్యాన్ని పుట్టించ గలిగే శక్తి కలది ఉంటుందనే నియమం ఏదీ లేదు. తంతువులు వాటి సంయోగము సమానజాతికి చెందినవి కావు. తంతువులు ద్రవ్యమైతే, సంయోగం గుణం అని అంగీకరించ బడుతున్నది. రంగు రంగులుకల పశువుల వెంట్రుకలతో తాడులా పెనవేసి వాడటం చూస్తున్నాము. అలాగే మిశ్రమ ఉన్ని కంబళీలు నేస్తున్నారు. అదీకాక, ఒక ద్రవ్యం యొక్క పరిణామం వల్ల కూడా వేరే కార్యరూపం దాల్చే అవకాశం ఉంది. పాలు పెరుగుగా పరిణామం చెందడం, బీజం అంకురంగా పరిణామం చెందడం కనబడు తున్నదే. అందువల్ల శ్రుతి ప్రామాణ్యాన్ని అనుసరించి బ్రహ్మకారణంగా అకాశాది మహాభూతాల ఉత్పత్తిక్రమంలో జగత్తు ఆవిర్భవించిందని నిశ్చయింపబడుతున్నది. ఈ విషయమే ముందు *"ఉపసంహారదర్శనాన్నేతి చేన్న క్షీరవద్ధి"* అనే సూత్రంలో (బ్రసూ 2.1.24) స్పష్టం చెయ్యబడింది.

ఆకాశానికి ఉన్న విశేషగుణం శబ్దాశ్రయత్వం. శబ్దాశ్రయమైన ఆకాశం ప్రళయకాలంలో లేదని తెలుస్తున్నది. *"అస్థూల మనణు"* (బృ.ఉ 3.8.8) అనే శ్రుతి పరమాత్మకు పృథివికున్న స్థూలత్వాది గుణాలు లేవని చెప్తున్నది. అలాగే సృష్టికి పూర్వం ఆకాశం లేదని కూడ నిర్ణయించబడుతుంది. 'శబ్దాచ్చ' అనే శ్రుత్యనుసారం ఆకాశానికి ఉత్పత్తిలేదని చెప్పబడదు. ఆకాశానికి ఉత్పత్తి – వినాశమూ అంగీకరిం చాలి. ఆకాశానికి అమృతత్వం ఎలా చూపబడింది? దేవతలకు ఉత్పత్తి – అంతమూ ఉన్నా అమృతులు అని ఎలా చెప్పబడిందో అలాగే ఆకాశానికి అమృతత్వం చూప బడింది. ఆకాశానికి కూడ, పరమాత్మ సమానధర్మములున్నాయని చెప్పబడదు.

*"ఆకాశవత్ సర్వ గతశ్చ నిత్యః"* అనే శ్రుతిని, నిరతిశయమైన మహత్త్వం ఆత్మకు ఉందనే భావంతో ఆకాశంతో పోల్చటం జరిగింది, కాని ఆత్మకు–ఆకాశానికి సమాన ధర్మాలు లేవు. అదేవిధంగా ఆకాశం ఏవిధంగా అనంతమో ఆత్మ కూడా అనంతము అని కూడా చెప్పబడింది. అంతమాత్రం చేత ఆకాశానికి నిత్యత్వము ఉందని చెప్పడం యుక్తం కాదు. *"జ్యాయాన్ ఆకాశాత్"* అనే శ్రుతి బ్రహ్మ పరిమాణం ఆకాశంతో పోలిస్తే చాలా ఎక్కవ – గొప్పదనే స్పష్టం చేస్తున్నది. అలాగే *"న తస్య ప్రతిమాస్తి"* అనే శ్రుతి బ్రహ్మమునకు ఉపమానము ఏదీ లేదని, *"అతోఽన్యదార్తమ్"* అనే శ్రుతి పరమాత్మ తప్ప తక్కిన కార్యజాతమంతా నశ్వరములనీ (అంతము కావలసినవే) అని పలుకుతున్నవి. అందువల్ల ఆకాశం బ్రహ్మము యొక్క కార్యమనే నిర్ధారించుకోవాలి.

## 2. మాతరిశ్వాధికరణమ్

## సూ: 2.3.8 ఏతేన మాతరిశ్వా వ్యాఖ్యాతః

క్రిందటి అధికరణంలో ఆకాశోత్పత్తి విషయంలో జరిగిన చర్చ, వాయువు ఉత్పత్తి విషయంలోను వర్తిస్తుంది. అందువల్ల మళ్లీ విస్తారమైన వ్యాఖ్యానం ప్రతిపాదించలేదు.

తైత్తిరీయశ్రుతిలో *"ఆకాశాద్వాయుః"* (ఆకాశం నుండి వాయువు పుట్టింది) అని వినిపిస్నున్నది (తై.ఉ 2.1). కాని, ఛాందోగ్యశ్రుతిలో వాయువు యొక్క ప్రసక్తి లేదు. అందువల్ల ఈ రెండుశ్రుతులకు విరోధం ఉంది కాబట్టి, వాయువుకి కూడా ఉత్పత్తి లేదని మరో పక్షం. వాయువుకి ఉత్పత్తిని నిర్దేశిస్తున్న శ్రుతిని కేవలం గౌణంగా గ్రహిస్తే ఈ విరోధం ఉండదని మరోపక్షం. అయితే *"సైషాఽనస్తమితా దేవతా యద్వాయుః"* అనే బృహదారణ్యక శ్రుతి (బృ.ఉ 1.5.22) వాయువు అంతము, అస్తమయము లేని దేవత అని వినిపిస్తున్నందున వాయువుకి ఉత్పత్తి ఉందా! అనే సందేహం కల్గిస్తుంది. కాని, ఆకాశానికి నిత్యత్వ (అమృతత్వ) ధర్మం ఎలా చెప్ప బడిందో అలాగే వాయువు అస్తమించదు – వినాశము లేనిదని చెప్పబడింది. అంతే కాని, వాయువుకి కూడా పరమాత్మ ధర్మమైన నిత్యత్వం లేదు. ఆకాశము – వాయువు కూడా ఉత్పత్తి–వినాశాలున్న బ్రహ్మకార్యములే అని నిర్ధారించబడుతున్నది.

ఉపాసనావిద్యా బోధనలో వాయువుకి అస్తమయ నిషేధం కల్పించబడింది. కార్యబ్రహ్మోపాసనకు, వాయుదేవతోపాసనకు సంబంధించిన సంపద్విద్యలు శాశ్వతమైన మోక్షాన్ని చేకూర్చవు. కొందరు ఈ విషయం గుర్తించలేక వాయువు, పరమాత్మ (నిర్గుణబ్రహ్మ)తో సమానమైనదని అపోహపడవచ్చు. ఈ అధికరణంలో అటువంటి సందేహం నివృత్తి చేయబడుతున్నది.

## 3. అసంభవాధికరణమ్

### సూ: 2.3.9 అసంభవస్తు సతోఽనుపపత్తేః

ఊహాతీతమైన ఆకాశ–వాయువులకు ఉత్పత్తి ఉందంటే, పరమాత్మకు కూడ ఏదో ఒక కారణం వల్ల ఉత్పత్తి ఉండవచ్చు అనే అనుమానం కలుగుతుంది. ఈ విధమైన సంశయనివృత్తి కొరకే ఈ సూత్రం చెప్పబడింది.

బ్రహ్మపదార్థం కేవలం సద్రూపం. సన్మాత్రమైన బ్రహ్మ మరో సన్మాత్రం నుండి పుట్టడం సంభవం కాదు. స్వరూపరహితమైన అసత్ నుండి కూడా బ్రహ్మ పుట్టే ప్రసక్తి లేదు. *"కథ మసతః సత్ జాయేత"* అనే ఛాందోగ్యశ్రుతి పలుకుతున్నది (ఛా.ఉ 8.7.1). అలాగే *"స కారణం కరణాధిపో న చాస్య కశ్చిజ్జనితా న చాధిపః"* (శ్వే.ఉ 6.9) అని మరో శ్రుతి వాక్యం బ్రహ్మమును పుట్టించిన మరోకారణం ఏదీ లేదని కూడా ఉన్నది. మూల ప్రకృతిగా దేనిని నిర్దేశిస్తారో, దానినే వేదాంతులు బ్రహ్మముగా అంగీకరిస్తారు. అందువల్ల ఈ శ్రుతి వాక్యాల్లో విరోధం లేదు.

## 4. తేజోధికరణమ్

### సూ: 2.3.10 తేజోఽతస్తథాహ్యాహ

తేజస్సు వాయువు నుండి పుట్టినదనే శ్రుతి చెబుతున్నదని సూత్రార్థం.

తేజస్సు సద్రూపమైన బ్రహ్మము నుండి పుట్టినట్లు ఛాందోగ్యశ్రుతి వల్ల తెలుస్తున్నది. తైత్తిరీయంలో తేజస్సు వాయువు నుండి పుట్టినట్లు చెప్పబడింది. అయితే వాయువు తరవాత అగ్ని బ్రహ్మము నుండే పుట్టినట్లు సమన్వయం చేసి శ్రుత్యంతర భేదం నివృత్తి చేయబడింది. ఈ సందర్భంలో సర్వమూ బ్రహ్మకారణంగానే కార్యరూపం దాల్చిందని *"తజ్జలాన్"* (ఛా.ఉ 8.7.1), *"ఏతస్మాజ్జాయతే ప్రాణః"* (ము.ఉ 2.1.3) ఇత్యాది శ్రుతి వాక్యాల ప్రామాణ్యం చూపబడింది.

ఆవు పాలు కాచి మీగడ తీస్తారు, ఆ పాలే పెరుగుగా మార్పుచెందుతుంది. అందువల్ల పెరుగూ, మీగడ పాల నుంచే పుడుతున్నవని ఎలా చెప్పబడుతున్నదో, అలాగే ఆకాశాన్ని, వాయువుని సృష్టించిన పరమాత్మ, తేజస్సుని సృష్టించిందని శ్రుతిని సమన్వయించుకోవడంలో ఎట్టి విరోధమూ ఉండదు.

*"తదాత్మానం స్వయమకురుత"* అనే తైత్తిరీయ శ్రుతి (తై.ఉ 2.7.1) బ్రహ్మ తనకు తానే వేరు వేరు రూపాలలో సృజించుకొనెను అని పలుకుతున్నది. అలాగే భగవద్గీత శ్లోకం *"బుద్ధిః జ్ఞాన మసమ్మోహః అని మొదలై, భవంతి భావా భూతానాం మత్తఏవ పృథగ్విధాః"* అని బోధిస్తున్నది. సర్వేశ్వరుడైన పరమాత్మ వలనే బుద్ధి, జ్ఞానము, మోహం లేకపోవటమూ, సుఖ–దుఃఖములు, ఉత్పత్తి–ప్రళయములు, భయము– అభయము ఇత్యాది భావములన్నీ కలుగుతున్నవని ఈ ఉపదేశం యొక్క సారాంశం (భ.గీ 10.4, 10.5). అందువల్ల జగత్సర్వం బ్రహ్మమూలమని గ్రహిస్తే శ్రుతి వాక్యాలలో ఎట్టి విరోధం అగుపడదు.

## 5. అబధికరణమ్

### సూ: 2.3.11 ఆపః

ముందున్న సూత్రం నుండి *"అతస్తథాహ్యాహ"* అనే పదాలు చేర్చుకుంటే, నీరు (అప్) తేజస్సు నుండి పుట్టినట్లు శ్రుతి వల్ల తెలుస్తున్నదని సూత్రార్థం.

*"తదపోఽసృజత"* , *"అగ్నేరాపః"* అని వినిపిస్తున్న శ్రుతివచనాలు తేజస్సు నుండి నీరు పుట్టినదని స్పష్టంగా తెలియజేస్తున్నవి. ఇదే క్రమంలో పృథివి యొక్క ఉత్పత్తి కూడా రాబోయే సూత్రంలో చెప్పబడుతున్నది.

## 6. పృథివ్యధికారాధికరణమ్

### సూ: 2.3.12 పృథివ్యధికారరూపశబ్దాంతరేభ్యః

ప్రకరణసందర్భంగాను, రూపం వల్ల, ఇతర శ్రుతుల ఆధారంగా భూమికి ఉత్పత్తి ఉందని సూత్రార్థం.

**పూర్వపక్షి:**

*"తా ఆప ఐక్షంత బహ్వ్యః స్యామ ప్రజాయేమహీతి తే అన్నమసృజంత"* (నీళ్లు అనేక రూపాలు సృజిద్దాం అని సంకల్పించి అన్నం యొక్క సృష్టిని చేసేయి – ఛా.ఉ 6.2.4). ఇలా వినిపిస్తున్న శ్రుతి ధాన్యాది అన్నరూపాల ఉత్పత్తి గురించి పలుకుతున్నాదా లేక పృథివి యొక్క సృష్టిగురించి తెలియజేస్తున్నదా అనే సంశయం కలుగుతున్నది. *"తస్మాద్యత్ర క్వచ వర్షతి తదేవ భూయిష్ఠమన్నం భవతి"* అనే ఛాందోగ్య శ్రుతి ఎక్కడ ఎక్కువ వర్షం కురుస్తుందో అక్కడ ధాన్యాదులు బాగా పండుతాయనే చెబుతున్నది కాని, భూమి అధికమవుతుంది అనే అర్థంలో లేదు కదా?

**సమాధానం:**

పృథివి నీటి నుండి ఉద్భవించిందనే ఇక్కడ చెప్పబడుతున్నది. ఛాందోగ్యంలో ఉన్న ఈ ప్రకరణ మహాభూతాల ఉత్పత్తికి సంబంధించినది. *"తత్తేజోఽసృజత"* అనే క్రమంలోనే ఈ శ్రుతి కూడా వినిపిస్తున్నది. అదీకాక, వాక్యశేషంలో *"యత్ కృష్ణం తదన్నస్య"* అని పృథివికి అనుగుణమైన 'కృష్ణ' రూపం స్పష్టం చెయ్యబడింది.

బృహదారణ్యకంలో మరోశ్రుతి *"తద్యదపాం శరః ఆసీత్ తత్సమ హన్యత, సా పృథివీ అభవత్"* (బృ.ఉ 1.2.2). భూమి యొక్క ఉత్పత్తిని చెప్పి, *"పృథివ్యాఓషధయః ఓషధీభ్యో అన్నమ్"* అని సూచిస్తున్నది. అందువల్ల అన్నాదులు, ఓషధులు, వనస్పతులు పృథివి నుండి పుట్టేయి అని స్పష్టంచేయబడుతున్నది. పృథివి ఉత్పత్తికి ఉదకములే మూలం అని శ్రుతి వల్ల నిర్ధారించబడుతున్నది కాబట్టి ఎట్టి సందేహము లేదు.

## 7. తదభిధ్యానాధికరణమ్

### సూ: 2.3.13 తదభిధ్యానాదేవ తు తల్లింగాత్సః

**సంశయం:**

ఆకాశ–పృథివ్యాది మహాభూతాలు స్వయంగా తమతమ కార్యాలను నిర్వర్తించుకుంటాయా లేక పరమాత్మ ఆయా స్వరూపాల్లో ఉంటూ వాటిని ప్రవర్తింప జేస్తూ ఉంటుందా?

**సమాధానం:**

నిరపేక్షమైన పరమాత్మ ఆయా భూతాల స్వరూపంతో ఉంటూ వాటిని ప్రవర్తింపజేస్తున్నది. బృహదారణ్యక శ్రుతి ఇలా విన్పిస్తున్నది: *"యః పృథివ్యాం తిష్ఠన్ యః పృథివ్యా అంతరో యం పృథివీ న వేద, యస్య పృథివీ శరీరం యః పృథివీ మంతరో యమయతి"* (బృ.ఉ 3.7.3). ఈ విధంగా ఒక్క పృథివీ విషయంలోనే కాదు మహాభూతాలన్నింటి విషయంలోనూ శ్రుతి వినబడుతున్నది. అంటే అధిష్ఠాత, సర్వాధ్యక్షుడూ పరమేశ్వరుడని స్పష్టం అవుతున్నది. *"సోఽకామయత బహుస్యాం ప్రజాయేయ"* ఎన్నో కార్యరూపాలలో తనే ప్రవేశించాలని సంకల్పించిన పరమాత్మ *"సచ్చ త్యచ్చాభవత్"* , *"తదాత్మానం స్వయమకురుత"* , మూర్తామూర్త రూపాల్లో తనే సర్వాత్మ అయింది. అందువల్ల, అప్ తేజస్సులకు ఈక్షణం ఉన్నట్లు విన్పిస్తున్న శ్రుతులు సద్రూపమైన పరబ్రహ్మానే ఈక్షితగా సూచిస్తున్నట్లు గ్రహించాలి. *"నాన్యోఽతోఽస్తి ద్రష్టా"* అని విన్పిస్తున్న బృహదారణ్యక శ్రుతి (బృ.ఉ 3.7.23) కూడా సర్వాత్మకమైన పరబ్రహ్మ కన్నా వేరే ద్రష్ట (చూచేవాడు) లేదని నిర్ధారిస్తున్నది.

# 8. విపర్యయాధికరణమ్

## సూ: 2.3.14 విపర్యయేణ తు క్రమోఽత ఉపపద్యతే చ

ప్రళయం సృష్టిక్రమానికి విపర్యంగా జరుగుతుందని సూత్రార్థం.

*"యతోవా ఇమాని భూతాని జాయంతే యేన జాతాని జీవంతి యత్ ప్రయంతి అభిసం విశంతి"* అని తైత్తిరీయ శ్రుతి (తై.ఉ 3.1.1), ప్రాణుల యొక్క సృష్టి–స్థితి–లయములు మూడూ బ్రహ్మపై ఆధారపడి ఉన్నాయని తెలియజేస్తున్నది. అయితే, ఉత్పత్తి ఏక్రమంలో జరిగిందో, అదే క్రమంలో ప్రళయంలో విలీనం కూడా జరుగుతుందా, లేక భిన్నంగానా అనే ప్రశ్నకు ఈ సూత్రంలో సమాధానం చెప్ప బడుతున్నది.

ప్రళయ క్రమం, ఉత్పత్తి క్రమానికి విపర్యంగా జరుగుతుంది. లోకంలో మెట్లు ఎక్కివెళ్లిన క్రమానికి విపర్యంగా (విపరీత క్రమంలో) దిగడం చూస్తున్నాంకదా! అలాగే నీటిలో పుట్టిన వడగళ్లు నీటిలోను, మట్టితో తయారైన ఘటాదులు మళ్లీ మట్టిలో విలీనం అవడం కనబడుతున్నది. అందువల్ల నీటి నుండి పుట్టినటువంటి పృథివి మళ్లీ నీటిలోను, తేజస్సు నుండి పుట్టిన నీరు మళ్లీ తేజస్సులోను, తేజస్సు, వాయువులోను అంతం (విలీనం) అవడం యుక్తం.

సూక్ష్మం, సూక్ష్మతరం అయిన సమస్త కార్యమూ క్రమంగా దాని తరవాతది, అయిన కారణంలో (మూల వస్తువులో) లీనమై చివరకు సూక్ష్మాతిసూక్ష్మమైనది, పరమకారణమైనదైన బ్రహ్మ పదార్థంలోనే లీనం అవుతుంది. ఇదే విషయం మహాభారతంలో ఇలా చెప్పబడింది. *"జగత్ ప్రతిష్ఠా దేవర్షే! పృథివ్యప్సు ప్రలీయతే, జ్యోతిష్యాపః ప్రలీయతే, జ్యోతిర్వాయౌ ప్రలీయతే"* [ఓ నారదా! జగత్తుకి ఆధారమైన పృథివి ఉదకములందు, ఉదకములు జ్యోతిస్సులోను, జ్యోతిస్సు (అగ్ని) వాయువులోను లీనమవుతాయి – శాం.ప 339.29 ]. కార్యం నిలచిఉండగా కారణం నశించదు. కారణం నశించిన తరవాత కార్యం ఉండదు. కాని కార్యం నశించినా కారణం ఉండటమే సహజం. ఇదే జగత్తులో సర్వత్రా కనబడుతుంది.

# 9. అంతరావిజ్ఞానాధికరణమ్

## సూ: 2.3.15 అంతరా విజ్ఞానమనసీ క్రమేణ తల్లింగాదితి చేన్నావిశేషాత్

**పూర్వపక్షి:**

మహాభూతాల యొక్క ఉత్పత్తి–ప్రళయాలు అనులోమ–ప్రతిలోమ క్రమంలో జరుగుతాయని నిర్ణయించబడింది. అయితే, ఉత్పత్తి ఆత్మతో ప్రారంభమై, మళ్లీ ఆత్మతో అంతమవుతున్నదని తెలుస్తున్నది. కాని, కఠోపనిషత్తులో శ్రుతి ఇలా వినబడు తున్నది: *"బుద్ధింతు సారథిం విద్ధి మనః ప్రగ్రహమేవచ ఇంద్రియాణి హయానాహుః"* (క.ఉ 3.3). మనస్సు–బుద్ధి ఇంద్రియాలతో కలిసే ఉంటాయనే దీని అర్థం కదా? ఇంద్రియ సహిత మనో–బుద్ధులు భూతాల తదనంతరం ఉత్పత్తి అవుతున్నాయా లేక ఆత్మకూ, భూతాలకు మధ్య వాటి ఉత్పత్తి క్రమం నిర్ణయించు కోవాలా అనే సందేహం కలుగుతున్నది. అథర్వవేదీయ ముండకోపనిషత్తులో *"ఏతస్మాజ్జాయతే ప్రాణో మనః సర్వేంద్రియాణిచ, ఖం వాయుర్జ్యోతి రాపః పృథివీ విశ్వస్యధారిణీ"* (ము.ఉ 2.1.3.) ఈ శ్రుత్యనుసారం మనస్సు, ఇంద్రియాలు, మహా భూతాలకు – ఆత్మకు మధ్యన పుట్టినట్లు కనబడుతున్నది. అయితే, ఈ క్రమం ముందు నిర్ణయించిన ఆత్మ తరవాత మహాభూతాల ఉత్పత్తి అనే క్రమానికి విరుద్ధంగా ఉందని తోస్తున్నది.

**సమాధానం:**

ఇంద్రియాదులు భౌతికములు, అంటే మహాభూతాల నుండి ఉత్పత్తి అయినవే. అందువల్ల మహాభూతాల యొక్క ఉత్పత్తి – ప్రళయ క్రమమే ఇంద్రియ, మనో బుద్ధులకు వర్తిస్తుంది. ఇంద్రియాదులకు విశేషంగా ఏ క్రమమూ చెప్పబడలేదు. అందువల్ల మరొక క్రమాన్ని అన్వేషించి నిర్ణయించుకునే ఆవశ్యకత లేదు. *"అన్న మయం హి సోమ్య మనస్తేజోమయీ వాక్"* (ఛా.ఉ 6.5.4) ఇత్యాది శ్రుతులు ఇంద్రియాలు భౌతికములని స్పష్టం చేస్తున్నవి. అదీకాక, పైన ఉదహరించిన ముండకోపనిషత్తులోని శ్రుతి ఉత్పత్తిక్రమం సూచించలేదు. పంచ భూతాలకు – ఇంద్రియ మనో–బుద్ధుల ఉత్పత్తికి పరమాత్మయే మూలకారణమని మాత్రమే తెలియ జేస్తున్నది. అందువల్ల మహాభూతాల యొక్క ఉత్పత్తిక్రమంలో, శ్రుతి వాక్యాల్లో ఎటువంటి విరోధము అగుపడదు.

## 10. చరాచర వ్యపాశ్రయాధికరణమ్

ఇంతవరకు మహాభూతాల యొక్క ఉత్పత్తికి పరమాత్మ కారణమని శ్రుతివాక్యాల ప్రామాణ్యంతో నిర్ణయించబడింది. ఇక పైన, ఈ పాదాంతం వరకు జీవుని యొక్క సృష్టి గురించి కూడా శ్రుతి ఒకే విధంగా తెలియజేస్తున్నదని సూత్రకారులు స్థిరీకరిస్తున్నారు.

## సూ: 2–3–16 చరాచరవ్యపాశ్రయస్తు స్యాత్తద్వ్యపదేశో భాక్తస్తద్భావ భావిత్వాత్

స్థూల శరీరానికే వినాశంకాని జీవుడికి (శరీరాన్ని ఆశ్రయించిఉన్న ఆత్మకు) వినాశం లేదని శ్రుతి ఇలా విన్పిస్తున్నది: *"జీవాపేతం వావ కిలేదం మ్రియతే న జీవో మ్రియతే"* (ఛా.ఉ 6.11.3). అయితే, మనకు జనన–మరణాల్లో జీవుడు (ఆత్మ) అగోచరము, కనిపించే వస్తువు కాదు. శరీరంతో కనబడే జీవుడిపై జనన మరణాలు ఆరోపింపబడుతున్నవి. అందువల్ల జీవుని యొక్క జనన–మరణాలను భాక్తంగా (గౌణం) లాక్షణికార్థంలో గ్రహించవలసి ఉంటుంది. జనన–మరణ శబ్దాలు, స్థావర–జంగమ శరీరాలకు సంబంధించి ఉపయోగించబడుతున్నవి. స్థావర–జంగమ రూపాలలో ఉన్న ప్రాణులు పుట్టడం–నశించడం కనబడుతుంది. కాని వాటిని ఆశ్రయించుకొని ఉన్న జీవుడు (ఆత్మ) కాదు. శరీరమే ఈ ఆత్మ, అనే భావన (తద్భావ భావిత్వం) ఈ అపోహకు కారణం. శరీర సంబంధం లేకపోతే జీవుడు పుట్టేడని కాని మరణించేడని కాని ఎవరూ గుర్తించలేరు. జాతకకర్మాది విధులు కూడా, శరీర సంబంధం ఉండబట్టే నిర్వర్తించబడుతున్నవి. శరీరం లేకపోతే ఎవరికీ జాతకాది కర్మలు?

బృహదారణ్యకంలో శ్రుతి జనన–మరణాలు శరీరానికే అని స్పష్టం చేస్తూ ఇలా వినబడుతున్నది: *"స వా అయం పురుషో జాయమానః శరీరమభి సంపద్య మానః... ఉత్క్రామన్ మ్రియమాణః"* (బృ.ఉ 4.3.8) (ఈ పురుషుడు–జీవుడు, శరీరాన్ని పొందినప్పుడు పుడుతున్నాడు, శరీరం విడిచి వెళ్లిపోయిన సమయంలో మరణిస్తు న్నాడు). అందువల్ల, శరీర సంయోగ–వియోగాలే జనన–మరణ శబ్దాలకు నిమిత్తంగా గ్రహించవలసి ఉంది.

## 11. ఆత్మాధికరణమ్

### సూ: 2.3.17 నాత్మాఽశ్రుతేర్నిత్యత్వాచ్చ తాభ్యః

(న ఆత్మా అశృతేః నిత్యత్వాచ్చ తాభ్యః)

**పూర్వపక్షి:**

శరీరేంద్రియాలతో కలిసి, శారీరుడు యొక్క గూటికి (పంజరానికి) జీవుడనే ఆత్మ అధ్యక్షత వహిస్తున్నది. శారీరుడే కర్మఫలభోగం అనుభవిస్తున్న భోక్త అయితే, ఈ జీవాత్మ బ్రహ్మము నుండి పుడుతున్నదా; లేక బ్రహ్మము అజుడు(పుట్టుక లేనివాడు) కాబట్టి జీవాత్మకూ పుట్టుక లేదా అనే సందేహం కలుగుతున్నది. జీవాత్మ విషయంలో శ్రుతి వాక్యాల్లో కూడా కొంత వ్యత్యాసం కనబడుతున్నది. కొన్ని సందర్భాలలో పరమాత్మ తనంతట తనే కార్యరూపంలో జీవుడిగా చేరగా ప్రాణుల సృష్టి జరిగింది అని చెప్పబడింది. కొన్ని స్థానాల్లో అగ్నికణాలు (విస్ఫులింగాలు) చెదిరినట్లు బ్రహ్మ నుండి జీవాత్మలు సృష్టింపబడినట్లు వినబడుతున్నది.

నిర్వికారి అయిన పరబ్రహ్మ జీవుడిగా ఉద్భవించడం జరగదు. పరమాత్మ అపహత పాప్మాది గుణాలతో నిర్మలము (శుద్ధమైనది). జీవుడు అందుకు భిన్నము. సుఖ–దుఃఖాలను అనుభవించే శారీరుడు పాప–పుణ్యాలకు అతీతుడు కాదు. విభక్త స్వరూపాలైన ఆకాశాదులకు ఉత్పత్తి ఉందని నిర్ణయించబడింది. జీవాత్మ, ప్రతి శరీరంలోను విభక్తరూపంలో ఉంటున్నది కాబట్టి కల్పారంభంలో జగదుత్పత్తి సంభవించిన సమయంలోనే సృష్టి విషయంలో శ్రుతి ఇలా వినబడుతున్నది: *"యథాగ్నేః క్షుద్రా విస్ఫులింగాః వ్యుచ్చరంతి, ఏవమేవ అస్మాత్ ఆత్మనః సర్వే ప్రాణాః"* (బృ.ఉ 2.1.20). ప్రాణులు భోక్తలు. వారి సృష్టిని, లయాన్ని మరో శ్రుతి కూడా ఇలా తెలియజేస్తున్నది: *"యథా సుదీప్తాత్ పావకాద్విస్ఫులింగాః సహస్రశః ప్రభవంతే స రూపాః తథా అక్షరాత్ వివిధాః సోమ్య! భావాః ప్రజాయంతే తత్రచైవాపియంతి"* (చక్కగా రగుల్కొన్న అగ్ని నుండి, నిప్పురవ్వలు అన్ని దిక్కులకు విరజిమ్ముతున్నట్లు అక్షరుడైన పరబ్రహ్మ నుండి జీవులు ఉద్భవించి, ఆ పరమాత్మలోనే లయం అవుతున్నవి – ము.ఉ 2.1.1).

**సిద్ధాంతం:**

జీవాత్మకు పుట్టుక–చావులేవు. జీవాత్మ నిత్యత్వాన్ని నిర్ధారిస్తూ ఎన్నో శ్రుతి వాక్యాలు విన్పిస్తున్నవి: *"న జీవో మ్రియతే"* (ఛా.ఉ 6.11.3), *"స వా ఏష మహా నజ ఆత్మాఽజరోఽమరోఽమృతోఽభయో బ్రహ్మ"* (బృ.ఉ 4.4.22), *"న జాయతే మ్రియతేవా విపశ్చిత్"* (క.ఉ 2.18), *"అజోనిత్యః శశ్వతో-యం పురాణః"* (క.ఉ 2.18), *"తత్ సృష్ట్వా తదేవాను ప్రావిశత్"* (తై.ఉ 2.1.1), *"అనేన జీవేనాత్మనానుప్రవిశ్య, నామరూపే వ్యాకరవాణి"* (ఛా.ఉ 6.3.2), *"స ఏష ఇహ ప్రవిష్ట ఆనఖాగ్రేభ్యః"* (బృ.ఉ 1.4.7), *"తత్త్వమసి"* (ఛా.ఉ 6.8.7), *"అహం బ్రహ్మాస్మి"* (బృ.ఉ 1.4.10), *"అయమాత్మా బ్రహ్మ సర్వాను భూః"* (బృ.ఉ 2.4.19).

**ఆక్షేపణ:**

జీవాత్మ విభక్తంగా శరీరస్వరూపంలో కనబడుతున్నది – కాబట్టి అది కార్యరూపము. కార్యరూపానికి ఉత్పత్తి–ప్రళయాలు తప్పవుకదా?

**సమాధానం:**

జీవాత్మకు యదార్థంగా ప్రవిభాగం లేదు. *"ఏకో దేవః సర్వ భూతేషుగూఢః సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా"* అని శ్రుతి విన్పిస్తున్నది (శ్వే.ఉ 6.11). ఘటాకాశం, మహదాకాశంలా ఉపాధి వేరవడం వల్ల ఆకాశానికి విభాగం ఉన్నట్లు ఎలా చెప్పబడు తున్నదో, అలాగే జీవాత్మ–పరమాత్మ భేదం కల్పితము. *"స వా అయమాత్మా బ్రహ్మ విజ్ఞానమయో, మనోమయః ప్రాణమయశ్చక్షుర్మయః, శ్రోత్రమయః"* (బుద్ధిమయము, మనోమయము, ప్రాణమయము, చక్షు శ్శ్రోత్రమయమైన ఈ

ఆత్మయే బ్రహ్మ – బృ.ఉ 4.4.5). ఈ శ్రుతి, వికారరహితమైన పరమాత్మ బుద్ధ్యాదుల్లో పూర్తిగా కలిసిపోయి, జీవాత్మ రూపంలో భాసిస్తూ ఉంటుందని తెలియజేస్తున్నది. ఉపాధి సంబంధం వల్ల జీవుడికి ఉత్పత్తి ప్రలయాలు ఆరోపించబడుతున్నవి. జీవాత్మ, పరమాత్మ భిన్నములు కావు. *"ప్రజ్ఞానఘన ఏతేభ్యో భూతేభ్యః సముత్థాయ తాన్యేవాను వినశ్యతి న ప్రేత్య సంజ్ఞా అస్తీతి"* (బృ.ఉ 4.5.13). దీని భావం: ప్రజ్ఞాన ఘనరూపమైన పరమాత్మ, దేహంలో జీవాత్మగా పరిణామం చెంది ప్రాణులను అనుసరించే ఉంటుంది. దేహాలు నశిస్తాయి కాని ఆత్మకు నాశనము లేదు. మైత్రేయీ–యాజ్ఞవల్క్య సంవాదంలో ఆత్మబోధన విన్న మైత్రేయి *"మా భగవాన్ మోహాంతం అపీపిపత్ న వై అహం ఇమం విజానామి"* (ఓ పూజ్యుడా నీవు నన్ను మోహంలో పడవేస్తున్నావు. నేను ఈ ఆత్మ తత్త్వాన్ని తెలుసుకోలేను) అని పలుకగా *"న వా అరేఽహం మోహం బ్రవీమి అవినాశీ వా అరే అయమాత్మా అనుచ్ఛిత్తి ధర్మా...మాత్రాఽసంసర్గస్త్వస్య భవతి"* (మైత్రేయీ! నేను నిన్ను మభ్యపెట్టడానికి ఏమీ చెప్పలేదు. ఈ ఆత్మకు వినాశము ఏమీ లేదు. మరణంలో ఆత్మకు ఉచ్ఛేదమూ ఉండదు. ఇంద్రియాదులతో ఎటువంటి సంబంధము లేకపోవడం మాత్రమే జరుగుతుంది – బృ.ఉ 4.5.14).

ఏ వికారమూ లేని పరబ్రహ్మయే జీవబ్రహ్మ అని అంగీకరిస్తే, ఆత్మజ్ఞానం వల్ల సర్వం తెలుసుకోబడుతుందనే ప్రతిజ్ఞకు ఏవిధమైన భంగం కూడా వాటిల్లదు. ఈ ప్రతిజ్ఞకు అనుగుణంగానే జనకుడు యాజ్ఞవల్క్యునికి ఆత్మోపదేశం చేసిన ప్రకరణ సందర్భంలో *"అత ఊర్ధ్వం విమోక్షాయైవ బ్రూహి"* అనే శ్రుతి మూలకంగా (బృ.ఉ 4.3.15) ఆత్మతత్త్వం–పరమాత్మ స్వరూపత్వం బోధింపబడింది. ఆత్మ పుట్టదు–వినాశం చెందదు అనే సిద్ధాంతం పైనే విజ్ఞానమయాత్మకు సమస్త సంసార ధర్మాలు నిరాక రించబడి, మోక్షమార్గము ఉపదేశింపబడుతున్నది.

## 12. జ్ఞాధికరణమ్

### సూ: 2–3–18 జ్ఞోఽత ఏవ

పుట్టుక లేకపోవడం వల్లే జీవుడు జ్ఞానస్వరూపుడని సూత్రార్థం.

**సంశయం:**

వైశేషికులు (కణాదులు) జీవుడు ప్రకృతః అచేతనుడు, కాని అప్పుడప్పుడు ఆగంతుకమైన చేతనత్వం వస్తూ పోతూ ఉంటుందని నమ్ముతారు. దీనికి విరుద్ధంగా, కపిలాది సాంఖ్యులు జీవుడు నిత్యచైతన్యుడని భావిస్తారు. మూర్ఛ ఇత్యాది రోగాలున్నవారు, గాఢనిద్రలో ఉన్నవారికి కూడ కొంతకాలం బుద్ధిపనిచెయ్యదు. అందువల్ల జీవుడు నిత్యచైతన్యంతో ఉండదు అనే నమ్మవలసి వస్తుంది. ఇంతకీ జీవునికి నిత్యచైతన్యం ఉంటుందా? ఉండదా?

**సమాధానం:**

ఆత్మకు ఉత్పత్తి లేదని ముందు ప్రకరణంలో చెప్పబడింది. ఆ కారణం వల్లనే ఆత్మకు నిత్యచైతన్యం ఉంటుంది. జీవుడు (ఆత్మ) స్వయంప్రకాశ స్వరూపమని శ్రుతులు నిర్ధారిస్తున్నవి. *"విజ్ఞాన మానందం బ్రహ్మ"* (బృ.ఉ 3.9.28), *"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ"* (తై.ఉ 2.1.1), *"అనంతరోఽబాహ్యః కృత్స్నః ప్రజ్ఞానఘన ఏవ"* (బృ.ఉ 4.5.13). అట్టి పరబ్రహ్మమే జీవాత్మ కాబట్టి అగ్నికి స్వతః సిద్ధంగా ఉష్ణత్వగుణం ఉన్నట్లు, జీవునికి నిత్యచైతన్యం ఉంటుంది.

బృహదారణ్యకోపనిషత్తులోని విజ్ఞానమయ ప్రకరణంలో *"అసుప్తః సుప్తానభిచాకశీతి"* (బృ.ఉ 4.3.11), *"అత్రాయం పురుషః స్వయం జ్యోతిర్భవతి"* (బృ.ఉ 4.3.9), *"న హి విజ్ఞాతుర్విజ్ఞాతేః విపరిలోపో విద్యతే"* (బృ.ఉ 4.3.30) అలాగే ఛాందోగ్యంలో *"అథ యోవేద ఇదం జిఘ్రాణీతి స ఆత్మా"* (ఛా.ఉ 8.12.4) అనే శ్రుతి ఆత్మ జ్ఞానస్వరూపం అని నిర్ధారిస్తున్నవి.

సుషుప్త్యవస్థలో ఏదీ వినబడదు, తెలుసుకోబడదు, విజ్ఞానం పోతుందికదా! అనే ఆక్షేపణకు ద్రష్ట యొక్క దృష్టికి లోపం ఉండదు. ఆ సమయంలో చూడటానికి భిన్నమైన వస్తువు ఏదీ లేదు. ఆత్మ పరమాత్మలో లీనమై ఉంటుంది. ఇదే శ్రుతిలో ఇలా వినబడుతున్నది: *"యద్వై తన్న పశ్యతి, పశ్యన్వై తన్న పశ్యతి, న హి ద్రష్టుః దృష్టేః విపరిలోపో విద్యతేఽవినాశితత్వాత్ న తు తత్ద్వితీయ మస్తి తతోఽన్యత్ విభక్తం యత్ పశ్యేత్"* (బృ.ఉ 4.3.23). వైశేషికుల వాదన శ్రుతికి విరుద్ధం. దానిని ముందే నిరాకరించడమైంది. జీవాత్మ నిత్యచైతన్య స్వరూపమనే శ్రుతి నిర్ధారిస్తున్నది.

## 13. ఉత్క్రాంతిగత్యధికరణమ్

### సూ: 2.3.19 ఉత్క్రాంతిగత్యాగతీనామ్

(పూర్వపక్ష సూత్రం)

శరీరం నుండి లేచి వెళ్లిపోవడం (ఉత్క్రాంతి), గమన ఆగమనాలు జీవుడికి ఉండబట్టి, ఆత్మ అణుపరిమాణమైనదే అని సూత్రార్థం.

జీవుడు నిత్యచైతన్య స్వరూపుడు అని గత అధికరణంలో స్థాపించబడింది. అయితే, శారీరుడి ఆత్మకు ఉత్‌క్రాంతి గమనాగమనాలు ఉన్నట్లు శ్రుతిలో ఇలా విన్పిస్తున్నది: *"స యదస్మాత్ శరీరాత్ ఉత్క్రామతి సహైవైతైః సర్వైః ఉత్క్రామతి"* (జీవుడు ఈ శరీరం విడిచి పైకి వెళ్లిపోయినప్పుడు, ఇంద్రియవృత్తులతో కలిసే వెళ్లిపోతాడు – కౌ.షీ 3.3). మరో శ్రుతి ఈ లోకం నుంచి వెళ్లిపోయిన వాళ్లందరూ చంద్రలోకం చేరుకుంటారని ఇలా విన్పిస్తున్నది: *"యేవై చ అస్మాత్ లోకాత్ ప్రయంతి చంద్రమస మేవ తే సర్వే గచ్ఛంతి"* (కౌ.షీ. 1.2). అదే విధంగా బృహదారణ్యక శ్రుతి ఇలా పల్కుతున్నది: *"తస్మాత్ లోకాత్ పునరేత్యస్మై లోకాయ కర్మణే"* (తిరిగి ఆ లోకం నుండి కర్మననుభవించడానికి ఈ లోకం మళ్లీ వస్తాడు – బృ.ఉ 4.4.6). అణుపరిమాణంలో ఉంటేనే ఆత్మకు ఉత్క్రాంతి, గమనాగమనాలు సాధ్యమవుతాయి. ఆత్మకు శరీర పరిణామం కుదరదని ఇంతకముందు జైనమత సిద్ధాంతాన్ని నిరాకరిస్తూ చెప్పబడింది. అందువల్ల ఆత్మ అణుపరిమాణ మాత్రమే అవాలని తోస్తున్నది.

### సూ: 2.3.20 స్వాత్మనా చోత్తరయోః

గమనాగమనాలకు కర్తకు సంబంధించినవి కాబట్టి, జీవునికి అణు పరిమాణమే ఉంటుందని సూత్రార్థం.

పూర్వపక్షి వాదన కొనసాగుతున్నది. గ్రామాధిపత్యం పోయిన వ్యక్తికి, శారీరకంగా స్థాన భంగం లేక పోయినా అధికారం పోతున్నది. అలాగే, కర్మక్షయం వల్ల దేహంపై ఉండే అధికారం పోయి ఉత్క్రాంతి జరగవచ్చును. ఉత్క్రాంతి అంటే దేహాన్ని విడచిపెట్టి ఆత్మ వెళ్లిపోవడం జరుగుతుందని విశదీకరిస్తే, గమనాగమనాలు ఎలా జరుగుతాయి అనే ప్రశ్న ఉదయిస్తుంది. గమనం అన్నది ఒక క్రియ, అది కర్తపై ఆధారపడి ఉండాలి. అదీకాక, ఉత్క్రాంతి ఇంద్రియాల ద్వారాగాని శరీరంలో ఒక భాగం నుండి గాని జరుగుతుందని శ్రుతి ఇలా విన్పిస్తున్నది: *"చక్షుషో వా మూర్ధ్నో ఽవాఽన్యేభ్యో వా శరీర దేశేభ్యః"* (బృ.ఉ 4.4.2). *"స ఏతాస్తేజో మాత్రాః సమభ్యా దదానో హృదయమేవ అను అవక్రామతి"* (జీవుడు నిద్రావస్థలో తేజోమాత్రాలైన ఇంద్రియాలతో పాటు హృదయస్థానంలో చేరుకుంటాడు – బృ.ఉ 4.4.1) తిరిగి జాగ్రదవస్థలో ఆ తేజోమాత్రాలతోనే హృదయస్థానం నుంచి మళ్లీ వస్తాడు. *"శుక్రమాదాయ పునరైతి స్థానమ్"* (బృ.ఉ 4.3.11). శరీరం లోపల జరిగే ఈ గమనాగమనాలు జీవుడికి అణుప్రమాణం ఉంటేనే సంభవమవుతుంది.

### సూ: 2.3.21 నాణురతచ్ఛ్రుతేరితి చేన్నేతరాధికారాత్

(న అణుః అతచ్ఛ్రుతేః ఇతి చేత్ న ఇతరాధికారాత్)

అణుత్వం కంటె భిన్నమైన మహాపరిమాణం శ్రుతిలో వినబడుతుండడం వల్ల జీవుడు అణుపరిమాణం కలవాడు కాదు అని అంటే, అది పరమేశ్వరుని యొక్క ప్రస్తావన ఉండబట్టే కుదరదని సూత్రార్థం.

కొన్ని శ్రుతులు ఆత్మకు అణుపరిమాణత్వం ఇలా నిరాకరిస్తున్నాయి: *"స వా ఏష మహానజ ఆత్మా, యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు"* (ప్రాణములయందు ఉన్న ఈ ఆత్మ చాలగొప్పది, పుట్టుక లేనిది – మహానజః – బృ.ఉ 4.4.22). *"ఆకాశవత్ సర్వగతశ్చ నిత్యః"*, *"సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ"* (తై.ఉ 2.1.1). వీటి వల్ల పరమాత్మ విస్తృత స్వరూపమని అని తెలుస్తున్నది. *"విరజః పర ఆకాశాత్"* (దోషరహితమైనది, ఆకాశం కన్న గొప్పది – బృ.ఉ 4.4.20). జీవాత్మ,

పరమాత్మ కన్నా అభిన్నము అని వాదిస్తూ జీవుడికి అణుపరిమాణత్వం ఎలా నిర్ణయించబడుతుందని ఆక్షేపణ.

శాస్త్ర దృష్ట్యా జీవ–పరమేశ్వరుల ఏకత్వాన్ని స్థాపించటానికి వామదేవుని విషయంలో చెప్పబడ్డా మహాపరిమాణాది లక్షణాలు బ్రహ్మమునకే వర్తిస్తాయి. శరీరాలను ఆశ్రయించి ఉన్న జీవుని అణుత్వానికి ఎట్టి వైరుధ్యం ఉండదు.

## సూ: 2.3.22 స్వశబ్దోన్మానాభ్యాం చ

జీవాత్మ పరిమాణం చాలా సూక్ష్మమైనదనే శ్రుతివాక్యాలు స్థాపిస్తున్నవి. *"ఏషోఽణురాత్మా చేతసా వేదితవ్యో యస్మిన్ ప్రాణః పంచధా సంవివేశ"* (ఐదు విధాలైన ప్రాణములతో కలసి ఉన్న ఆత్మను చైతన్యం ద్వారానే తెలుసుకోగలము ము.ఉ 3.1.9). అలాగే *"వాలాగ్రశతభాగస్య శతధా కల్పితస్య చ భాగో జీవః స విజ్ఞేయః"* (తల వెంట్రుకలో నూరవభాగంలో – మరో నూరవభాగ ప్రమాణంతో ఆత్మ ఉంటుందని గ్రహించాలి – శ్వే.ఉ 5.9). అలాగే మరో శ్రుతి కూడా, ఆత్మ పరిమాణం చాలా సూక్ష్మమైనదని, ఇలా వినిపిస్తున్నది: *"ఆరాగ్ర మాత్రో హ్యపరోఽపి దృష్టః"* (పశువుల కర్రకు ఉండే ఇనుపముల్లు కొనకన్నా, చిన్న పరిమాణంలో ఉండే జీవాత్మ మరొకటని గ్రహించవచ్చు).

**ఆక్షేపం:**

జీవుడికి అణుపరిమాణం మాత్రమే ఉంటుందంటే వేసవిలో తాపం శరీరమంతటికీ ఉంటుంది. అలాగే శీతల గంగాజలంలో మునిగిన వానికి శరీరం అంతా చలి పుదుతుంది. అందువల్ల, జీవుదు అణుపరిమాణుడు కాదు. అణు పరిమాణం ఉంటే సకల దేహంలోను జ్ఞానం (చైతన్యం) ఒకేలా ఎలా ఉంటుంది? దీనికి సమాధానం క్రింది సూత్రంలో ఇలా ఇవ్వబడింది:

## సూ: 2.3.23 అవిరోధశ్చందనవత్

మంచిగంధం శరీరంలో ఏ భాగానికైనా అల్పమాత్రంలో పూస్తే దేహమంతా ఆహ్లాదం, సువాసన వ్యాపిస్తాయి. శరీరంపై ఉన్న త్వక్ ఇంద్రియం (చర్మం), ఆత్మతో కలిసి మొత్తం శరీరానికంతటికి అదే చైతన్యభావం (ఉష్ణ–శీతాది జ్ఞానం) కలిగిస్తుంది.

**ఆక్షేపం:**

ఆత్మ దేహంలో ఒక ప్రదేశానికి పరిమితం కాదు కదా? అందువల్ల చందనాన్ని ఆత్మతో పోల్చిచెప్పడం కుదరదు. దృష్టాంత–దార్ష్టాంతికాలకు వైషమ్యం ఉంది. దీనికి సమాధానంగా ఈ క్రింది సూత్రం చెప్పబడింది.

## సూ: 2.3.24 అవస్థితివైశేష్యాదితి చేన్నాభ్యుపగమాద్ధృది హి

(అవస్థితి వైశేష్యాదితి చేత్ న అభ్యుపగమాత్ హృదిహి)

ఆత్మ హృదయస్థానంలో ఉన్నట్లు పలుశ్రుతి వాక్యాలు ఇలా వినబడుతున్నవి: *"హృది హ్యేష ఆత్మా"* (ప్ర.ఉ 3.6), *"స వా ఏష ఆత్మా హృది"* (ఛా.ఉ 8.3.3), *"కతమ ఆత్మేతి యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు హృదయాంతర్జ్యోతిః పురుషః"* (బృ.ఉ 4.3.7) అందువల్ల దృష్టాంత – దార్ష్టాంతికాలలో వైషమ్యం లేదు.

## సూ: 2.3.25 గుణాద్వా లోకవత్

జీవుడు అణు పరిమాణంలో ఉన్నా, చైతన్యం దేహ వ్యాప్తంగా ఉంటుంది. ఒక గదిలో ఏప్రదేశంలో ఒక దీపం కాని, ప్రకాశిస్తున్న మణి ఉన్నా, దాని వెలుగు గది నలుమూలలా వ్యాపించి ఉంటున్నట్లు అనుభవ పూర్వకంగా తెలుస్తున్నది. అందువల్ల సందేహానికి తావు లేదు.

**ఆక్షేపం:**

గుణం–గుణిని వదలి మరోప్రదేశంలో ఉండదు కదా? వస్త్రంలో ఉన్న శుక్ల గుణం వస్త్రాన్ని వదలి ఉండదు. దీపకాంతి కూడా తేజోద్రవ్యమే. బహుళంగా ఉన్న తేజో అవయవాలు ఉన్న తేజోద్రవ్యమైతే, అది దీపంలో ప్రకాశవంతంగా ఉంటుంది. తేజోద్రవ్యం యొక్క అవయవాలు అల్పమాత్రంలో ఉంటే అది తక్కువ కాంతివంతం అవుతుంది. అందువల్ల, సూక్ష్మపరిమాణంలో ఉండే ఆత్మ దేహాన్ని అంతటిని ప్రభావితం చెయ్యలేదని తోస్తున్నది. దీనికి సమాధానం క్రింది సూత్రంలో ఇవ్వబడింది.

## సూ: 2.3.26 వ్యతిరేకో గంధవత్

మంచి వాసన ఉండే పుష్పాదుల దగ్గరగా వెళ్లనక్కరలేదు. దూరం నుంచే వాటినాశ్రయించిన గంధమనే గుణం తెలుస్తుంది అలాగే, జీవాత్మ అణుప్రమాణంలో ఉన్నా చైతన్యగుణం దేహమంతా వ్యాపించి ఉండడం సంభవం. అయితే పరమాణు వులు అతీంద్రియములు కదా? అనే మరో ఆక్షేపం చెయ్యబడింది. ఆకారం–రూపం వంటి గుణాలు దూరంగా మరుగై ఉంటే కనబడవు–తెలుసుకోబడవు. అలాగే వాసనా గుణం కూడా తెలియబడక పోవచ్చు. ప్రత్యక్షంగా సంపెగ, నాగకేసరాది సుగంధ పుష్పాల వాసన, దూరం నుంచే తెలుస్తూఉంటే మళ్లీ అర్థంలేని ఆక్షేపణ అనవసరం.

## సూ: 2.3.27 తథాచ దర్శయతి

ఆత్మ హృదయస్థానంలో ఉంటుంది. అది అణుపరిమాణంలో ఉంటుంది, చైతన్యగుణంతో దేహమంతా వ్యాపించి ఉంటుందని ఛాందోగ్య శ్రుతిలో ఇలా వినిపిస్తు న్నది: *"ఆత్మానం పశ్యామః ఆలోమభ్య ఆనఖాగ్రేభ్యః ప్రతిరూపం"* (ఛా.ఉ 8.8.1).

## సూ: 2.3.28 పృథగుపదేశాత్

ఆత్మనూ, చైతన్యాన్ని వేరువేరుగా నిర్దేశిస్తూ ఉపదేశించటం వల్ల కూడా, ఆత్మ అణుపరిమాణంలో ఉంటుందని తెలుస్తున్నదని సూత్రార్థం.

*"ప్రజ్ఞయా ఇదం శరీరం సమారూహ్య"* అని కౌషీతకి శ్రుతి (కౌ.షీ 3.6). ఇందులో జ్ఞానం చేత శరీరాన్ని అధిష్ఠించి ఉన్న ఆత్మ అని వినిపిస్తున్నందు వల్ల ఆత్మ వేరు – ప్రజ్ఞ (జ్ఞానం) వేరు అని అర్థం చేసుకోవలసి ఉంది. ఆత్మే చైతన్యగుణంతో దేహమంతా వ్యాపించి ఉందని భావించాలి. *"తదేషాం ప్రాణానాం విజ్ఞానేన విజ్ఞానమాదాయ"* అనే బృహదారణ్యక శ్రుతి (బృ.ఉ 2.1.17) ఇంద్రియాల యొక్క జ్ఞానశక్తి, ఆత్మమూలకమైన చైతన్యశక్తితో గ్రహింపబడుతున్నదని కూడా సూచిస్తున్నది. అందువల్ల, ఆత్మ అణుపరిమాణంలో ఉంటుందని నిర్ణయించుకోవడము యుక్తము.

## సూ: 2.3.29 తద్గుణసారత్వాత్తు తద్వ్యపదేశః ప్రాజ్ఞవత్

'తు' శబ్దం పూర్వపక్షి వాదనలను తిరస్కరిస్తూ ఈ సూత్రంలో సిద్ధాంతాన్ని ప్రతిపాదిస్తున్నది.

**సిద్ధాంతం:**

ఆత్మ అణుప్రమాణం కలదనే వాదన అంగీకరించబడదు; కారణం 1) ఆత్మకు ఉత్పత్తి లేదు, 2) జీవేశ్వరుల అభేదం వల్ల పరబ్రహ్మమే జీవుడు అని ఉపనిషద్వాక్యాల బోధన నిర్ణయాత్మకంగా ఉంది. పరమాత్మ విభువు (సర్వవ్యాపి) అని శ్రుతి–స్మస్మృతివాక్యాలు నిర్ధారిస్తున్నవి. అదీకాక, ఆత్మ అణుమాత్రం అయినా దేహానికంతటికీ త్వక్ ఇంద్రియం ద్వారా వేదన (బాధ) తెలుస్తున్నదనే వాదన కూడా సమంజసం కాదు. కాలుకి ముల్లు గుచ్చుకుంటే ఆ భాగమే బాధగా ఉంటుంది కాని శరీరం అంతా ఉండదు.

గుణం–గుణిని ఆశ్రయించే ఉంటుందన్నది పూర్తిగా అంగీకరించాలి. గుణిని విడిచిపెడితే అది దాని గుణమే కాదు. పృథివీగంధం పృథివిని ఆశ్రయించే ఉంటుంది. పృథివి నుంచే నీళ్లను, వాయువుని చేరుతుంది. ఈ విషయాన్ని మహాభారతంలో వ్యాసుల వారు ఇలా ప్రస్తావించారు: *"ఉపలభ్య అప్సుచేద్గంధం అనైపుణాః, పృథివ్యామేవ తం విద్యా దపో వాయుంచ సంశ్రితమ్"* (మ.భా.శాం. 232.9). అగ్నికి ఉష్ణప్రకాశ ధర్మాలు స్వతఃసిద్ధంగా ఉన్నట్లు, చైతన్యం జీవుని (ఆత్మ) యొక్క ధర్మం–స్వరూపం. చైతన్యం గుణమని – జీవుడు గుణి అని విభాగించబడదు. జీవుడు విభువు. అందువల్ల ఆత్మకు అణుపరిమాణత్వం నిరాకరించబడుతున్నది. ఇంతకు ముందే శరీర పరిమాణం నిరాకరించబడింది.

**సంశయం:**

శ్రుతిలో వినిపిస్తున్న అణుత్వాది నిర్దేశాలు ఆత్మపై ఏవిధంగా ఆరోపించి చెప్పబడ్డాయి?

**సమాధానం:**

ఇచ్ఛా, ద్వేషం, సుఖం–దుఃఖం ఇత్యాదులు బుద్ధి యొక్క గుణాలు. పరమాత్మకు లేనట్లే జీవాత్మకు కర్తృత్వ భోక్తృత్వాలు లేవు. అయినా, సంసారిత్వం, బుద్ధి యొక్క గుణాలను శరీరోపాధిని ఆశ్రయించి ఉన్న జీవునిపై ఆపాదించి చెప్పబడు తున్నవి. అలాగే, బుద్ధి సంబంధమైన ఉత్క్రాంతి ఇత్యాదులు కూడా ఆరోపించ బడుతున్నవి. ఆత్మకు సూక్ష్మత్వాన్ని సూచిస్తున్న శ్రుతి వాక్యంలో ఆత్మ అనంతమని ఇలా వినిపిస్తున్నది: *"వాలాగ్ర శతభాగస్య శతధా కల్పితస్య చ; భాగోజీవః స విజ్ఞేయః స చ అనంత్యాయ కల్పతే"* (శ్వే.ఉ. 5.9) జీవుని అణుత్వం కల్పితం, అనంతత్వం పారమార్థికం అని గ్రహించటమే యుక్తము. ఆత్మపదార్థం–ఆత్మతత్త్వం అతి సూక్ష్మమైనది, ఇంద్రియగ్రాహ్యము కానిది అని బోధించడానికే *"ఏషోఽణురాత్మా చేతసా వేదితవ్యః"* (ము.ఉ 3.1.9) ఇత్యాది ఉపనిషద్వాక్యాలు ఉద్దేశింపబడినవి. శరీరోపాధిని బట్టి, పరమాత్మ మహాభూతము, జీవాత్మ చాలా సూక్ష్మమైనది, అనే భావనతో కూడా ఆత్మకు అణుపరిమాణం కల్పించి చెప్పడం సంభవము.

బుద్ధి హృదయస్థానంలో ఉంటుంది కాబట్టి ఆత్మకు హృదయాయతనత్వం నిర్దేశింపబడింది. ఉత్క్రాంతి, గమన–ఆగమనాలు కూడా మనో–బుద్ధులకు చెందిన క్రియలు. *"ప్రజ్ఞయా శరీరం సమారూహ్య"* అనే కౌషీతకి శ్రుతిలోని 'ప్రజ్ఞయా' అనే పదానికి బుద్ధితో అని సమన్వయించుకుంటే శరీరోపాధి వల్ల బుద్ధ్యాదులు గల శారీరుడికి, ఉత్క్రాంతాదులు (గమనాగమనాలు) యుక్తంగా ఉంటాయి. 'ప్రజ్ఞయా' అనే పదం చైతన్యం అనే అర్థంలో గ్రహించబడదు.

సగుణోపాసనలో కార్యబ్రహ్మకు అణుత్వాది గుణాలు నిర్దేశింపబడ్డాయి. *"అణీయాన్ వ్రీహేర్వా యావాద్వా మనోమయః ప్రాణశరీరః"* (ఛా.ఉ 3.14.2) ఇత్యాది శ్రుతులు వినిపిస్తున్నవి. అందువల్ల జీవుని విషయంలో కూడా అవే గుణాలు చెప్ప బడినట్లు కనబడుతున్నది.

**సంశయం:**

బుద్ధి–ఆత్మల యొక్క సంయోగం నిత్యమైనది కాదు. ఏదో ఒకనాడు విడిపోవలసిందే. ఆత్మకు, బుద్ధితో సంబంధం తెగిపోయిన వెంటనే జీవాత్మకు అసత్త్వం – అసంసారిత్వం అనే దోషాలు ప్రసక్తం అయే అవకాశం ఉంది కదా? దీనికి సమాధానం క్రింది సూత్రంలో ఇవ్వబడుతున్నది:

## సూ: 2.3.30 యావదాత్మభావిత్వాచ్చ న దోషస్తద్దర్శనాత్

జీవుని యొక్క జీవత్వము–సంసారిత్వము బుధ్యుపాధి సంబంధం ఉన్నంత వరకూ ఉంటుంది. సమ్యక్‌దర్శనంతో (ఆత్మసాక్షాత్కారంతో) ఆ సంబంధం–పూర్తిగా పోతుంది. నిజంగా చెప్పాలంటే బుధ్యుపాది సంబంధానికి వ్యతిరిక్తంగా జీవుడు లేడు. అంతా పరమాత్మయే అని శ్రుతులు విన్పిస్తున్నవి. నిత్యముక్త స్వరూపమైనది, సర్వజ్ఞుడైన పరమేశ్వరునికి భిన్నమైన చేతనాంశము (పదార్థము) మరొకటి ఏదీ లేదనే ఉపనిషత్తుల్లో ఇలా వినిపిస్తున్నది: *"నాఽన్యోఽస్తి విజ్ఞాతా"* (బృ.ఉ 3.7.23), అలాగే ఛాందోగ్యంలో *"తత్త్వమసి"* (ఛా.ఉ 6.8.7), *"అహం బ్రహ్మాస్మి"* (బృ.ఉ 1.4.10) అనే మహావాక్యాలు ఈ అభిప్రాయాన్నే స్థిరీకరిస్తున్నవి.

**సంశయం:**

బుద్ధి సంయోగం యావదాత్మభావి – అవిద్యాకృతమని ఎలా తెలుస్తుంది?

**సమాధానం:**

*"యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు హృద్యంతర్జ్యోతిః పురుషః స సమానః సన్ ఉభౌలోకౌ అనుసంచరతి ధ్యాయతీవ, లేలాయతీవ"* (బృ.ఉ 4.3.4). ఈ శ్రుతి వల్ల ఆత్మ ఇహ–పరలోకాలకు సంచరిస్తూ ఉంటుందని, బుద్ధి ధ్యానిస్తుంటే ఆత్మ ధ్యానిస్తూ ఉన్నట్లు, బుద్ధి చలిస్తూ ఉంటే, ఆత్మ చలిస్తూ ఉన్నట్లు కనబడుతుందని స్పష్టంగా తెలియజేస్తున్నది.

అవిద్యా ప్రభావం వల్ల, మిథ్యాజ్ఞానం వల్ల, బుధ్యుపాధులతో సంబంధం కొనసాగుతూ సంసారబంధం విడదు. సమ్యక్ జ్ఞానంతో ఆత్మసాక్షాత్కారం కలిగితే నాది–నా శరీరం–నా ఆత్మీయులు అనే అపోహ పోతుంది. శ్వేతాశ్వతర శ్రుతి దీనినే ఇలా ప్రస్తావిస్తున్నది: *"వేదాహ మేతం పురుషం మహాంతం ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్, తమేవ విదిత్వాఽమృతత్వ మేతి, నాన్యః పంథా విద్యతేఽయనాయ"* (సూర్యుని వంటి తేజస్సు గల ఈ పరమేశ్వరుణ్ణి నేను తెలుసుకున్నాను. ఆ జ్ఞానంతోనే నేను మృత్యువుని అధిగమిస్తాను. మోక్షప్రాప్తికి వేరే మార్గము మరేదీ లేదు –శ్వే.ఉ 3.8).

**సంశయం:**

సుషుప్తిలోను, ప్రళయంలోను ఆత్మకు బుద్ధితో సంబంధం ఉండదని శ్రుతి ఇలా విన్పిస్తున్నది: *"సతా సోమ్య తదా సంపన్నో భవతి, స్వమపీతో భవతి"* (ఛా.ఉ 6.8.1) ప్రళయంలో కార్యాలన్నీ నశిస్తాయి కాబట్టి, బుద్ధి సంబంధం జీవాత్మకు పూర్తిగా నశించిపోవాలి కదా? దీనికి సమాధానం ఈ క్రింది సూత్రంలో చెప్పబడింది.

## సూ: 2.3.31 పుంస్త్వాదివత్త్వస్య సతోఽభివ్యక్తియోగాత్

బాల్యావస్థలో పురుషత్వగుణాలు వ్యక్తంకాక పోయినా, యుక్తవయస్సులో వ్యక్తమైనట్లు, బుద్ధి సంబంధం కూడా సుషుప్తి – ప్రళయ కాలాలలో నిగూఢంగా దాగి ఉంటుంది. సుషుప్త్యవస్థ నుండి జాగ్రదవస్థకు వచ్చిన వెంటనే బుద్ధి యథాతథంగా పనిచేస్తుంది. ప్రళయానంతరం సృష్టి కాలంలో తిరిగి ఆవిర్భవిస్తుంది. లేని గుణం అకస్మాత్తుగా పుట్టడానికి అవకాశం లేదు. మనో–బుద్ధ్యాదులతో పరలోకం వెళ్లిన శారీరుడు, కర్మఫలం అనుభవించడానికి ఇహలోకంలో మళ్లీ జన్మ ఎత్తక తప్పదు. అయితే, ఎటువంటి జన్మ వస్తుందో ఊహించబడదు. ఛాందోగ్య శ్రుతి పూర్వవాసనలతో జన్మ ప్రాప్తిస్తుందని ఇలా విన్పిస్తున్నది: *"సతి సంపద్య న విదుః సతి సంపద్యామహ ఇతి, త ఇహ వ్యాఘ్రో వా, సింహో వా, వరాహో వా, కీటో వా, పతంగో వా, దశకో వా, మశకో వా యద్యద్భవంతి తద్భవంతి"* (ఛా.ఉ 6.9.3) అందువల్ల, బుధ్యుపాధుల సంబంధం ఆత్మశాంతించి, పరమాత్మతో శాశ్వత లయం పొందే వరకు ఉంటుందనే నిశ్చయింపబడుతున్నది.

## సూ: 2.3.32 నిత్యోపలబ్ధ్యనుపలబ్ధి ప్రసంగోఽన్యతరనియమోవాఽన్యథా

అంతఃకరణం, మనస్సు–బుద్ధి–అహంకారం–చిత్తం అనే పేర్లతో నిర్దేశింప బడుతున్నది. అంతఃకరణం అనే దాని యొక్క అస్తిత్వాన్ని స్వీకరిస్తే తప్ప విషయజ్ఞానం గుర్తింపబడదు.

ఆత్మకు వికారం లేదు కాబట్టి ఎటువంటి శక్తి ప్రతిబంధకం ఆత్మవిషయంలో ఉండదు. పూర్వోత్తర క్షణాలలో ఇంద్రియాలలో కనిపించని ప్రతిబంధకం, ఇంద్రియాదుల్లో అకస్మాత్తుగా రాదు. మనస్సే చంచలమైనది. మనస్సు సావధానంగా లేకపోతే వస్తు జ్ఞానం కలగదు. దీనినే బృహదారణ్యక శ్రుతి ఇలా తెలియచేస్తున్నది: *"అన్యత్రమనా అభూవం నాదర్శమ్, అన్యత్రమనా అభూవం నాశ్రౌషమ్"* ... *"మనసాహ్యేవ పశ్యతి, మనసా శృణోతి"* (నా మనస్సు ఎక్కడో ఉండబట్టి చూడలేదు, మరో దగ్గర మనస్సు ఉండబట్టి వినలేదు...మనస్సుతోనే చూస్తున్నాడు, మనస్సు తోనే వింటున్నాడు) *"కామ స్సంకల్పో విచికిత్సా శ్రద్ధాఽశ్రద్ధా ధృతిరధృతిః హ్రీః, ధీః, భీః ఇత్యేతత్సర్వం మన ఏవ"* (కోరిక, సంకల్పం,

సంశయం, శ్రద్ధ, అశ్రద్ధ, ధైర్యం, అధైర్యం, సిగ్గు, ప్రజ్ఞ, భయం ఇత్యాదులన్నీ మనస్సు యొక్క వ్యాపారములే అని గ్రహించాలి – బృ.ఉ 1.5.3). అందువల్ల మనోబుద్ధుల గుణసారత్వం (ప్రభావం) వలన శరీరోపాధిని ఆశ్రయించిన జీవునికి ఉత్క్రాంతి, ఇహపరలోకాల గమన–ఆగమనాలు, అవిద్యా బీజాలు నశించే వరకు కొనసాగుతుంటాయి.

# 14. కర్త్రధికరణమ్

## సూ: 2.3.33 కర్తా శాస్త్రార్థవత్త్వాత్

శాస్త్రానికి ప్రయోజనం ఉంది. కాబట్టి జీవుడు కర్తగా పరిగ్రహింప బడుతున్నాడని సూత్రార్థం.

కొన్ని శ్రుతివాక్యాలు జీవుడు పరమాత్మస్వరూపంగా అసంగుడని పలుకుతున్నవి. కొన్ని పురుషుడికి కర్మలను విధిస్తున్నవి. అందువల్ల, జీవాత్మకు కర్తృత్వం ఉందా లేదా అనే సందేహం వస్తుంది. బుద్ధ్యాది గుణసారత్వం దృష్ట్యా, జీవుడు కర్తగా కూడా భావించబడతాడు.

కర్తృత్వం అంగీకరిస్తేనే విజ్ఞానాత్మ అయిన పురుషుడు యజ్ఞయాగాదులు, దాన–ధర్మాలు చేయాలని నిర్దేశిస్తున్న శాస్త్రానికి ప్రయోజనం ఉంటుంది. లేకపోతే, శాస్త్రం అర్థరహితమైపోతుంది. జీవుడికి కర్తృత్వం ఉందనే శ్రుతిలో కూడావినిపిస్తున్నది. *"ఏష హి ద్రష్టా, శ్రోతా, మంతా, బోద్ధా, కర్తా, విజ్ఞానాత్మా పురుషః"* [ఈ విజ్ఞానాత్మయైన పురుషుడు (జీవాత్మ) చూస్తున్నవాడు, వినేవాడు, ఆలోచించేవాడు, తెలుసుకునేవాడు, కర్తా కూడా అవుతున్నాడు – ప్ర.ఉ 5.9 ].

## సూ: 2.3.34 విహారోపదేశాత్

వినాశం లేని జీవుడు స్వప్నావస్థలో, స్వేచ్ఛతో తన శరీరంలో విహరిస్తూ ఉంటాడని శ్రుతి ఇలా పలుకుతున్నది: *"స ఈయతేఽమృతో యత్రకామమ్"* (బృ.ఉ 4.3.12). అలాగే మరో శ్రుతి *"స్వేశరీరే యథాకామం పరివర్తతే"* (బృ.ఉ 2.1.9) అని వినిపిస్తున్నది. అందువల్ల జీవాత్మకు కర్తృత్వం ఉంది.

## సూ: 2.3.35 ఉపాదానాత్

బుద్ధి అనే సాధనంతో ఇంద్రియ సముదాయాన్ని గ్రహిస్తున్నట్లు మరో శ్రుతిలో వినబడుతున్నది. *"తదేషాం ప్రాణానాం విజ్ఞానేన విజ్ఞాన మాదాయ"* (బృ.ఉ 2.1.17). అలాగే, *"ప్రాణాన్ గృహీత్వా"* (బృ.ఉ 2.1.18) అనే మరో వాక్యంలో కూడా జీవుడు ఇంద్రియాదులను గ్రహిస్తున్నట్లు తెలియజేస్తున్నది. కాబట్టి, జీవుడికి కర్తృత్వం ఉన్నట్లు నిశ్చయించుకోవాలి.

## సూ: 2.3.36 వ్యపదేశాచ్చ క్రియాయాం న చేన్నిర్దేశవిపర్యయః

లౌకిక–వైదిక క్రియల్లో జీవుడి ప్రసంగం ఉన్నందువల్ల జీవుడికి కర్తృత్వం ఉందని సూత్రార్థం.

తైత్తిరీయంలో జీవుడు యజ్ఞం చేస్తున్నాడు, మిగతా లౌకిక కర్మలూ చేస్తున్నా దని శ్రుతి ఇలా విన్పిస్తున్నది: *"విజ్ఞానం యజ్ఞంతనుతే కర్మాణి తనుతేఽపిచ"* . ఈ శ్రుతిలో బుద్ధి యొక్క ప్రసంగం లేదు. విజ్ఞానం అని కర్తృవాచకంలో చెప్పబట్టి, జీవుడి నిర్దేశమే కనబడుతున్నది.

**ఆక్షేపం:**

బుద్ధి కన్నా వ్యతిరిక్తమైన జీవాత్మను కర్తగా భావిస్తే స్వతంత్రంగా తనకు నచ్చిన విధంగా జీవుడు ప్రవర్తించాలి. కాని ఆత్మ నియమం లేకుండా ప్రవర్తించడం కుదరదు. ఈ ఆక్షేపణకు సమాధానంగా ఈ క్రింది సూత్రం చెప్పబడింది.

## సూ: 2.3.37 ఉపలబ్ధివదనియమః

ఆత్మ చైతన్యస్వరూపం కాబట్టి ఏదైనా విషయజ్ఞానాన్ని సంగ్రహించడంలో స్వతంత్రంగానే ప్రవర్తించగలదు. కాని, తనంతట తాను ఏ కార్యాన్ని చెయ్యలేదు. క్రియకు ఇంద్రియాదుల సహాయం అవసరం ఉంటుంది. వంటచేసేవాడు సాధన

సామగ్రి కోసం పరుల సహాయం తీసుకున్నా, వండిపెట్టే కర్తృత్వం తానే నిర్వహి స్తున్నాడు కదా! అందువల్ల, సహాయం అర్థించినా జీవాత్మకు కర్తగా కర్తృత్వం పోదు.

## సూ: 2.3.38 శక్తివిపర్యయాత్

బుద్ధి, జీవుడు వేరు వేరు అంశాలని అంగీకరించబడింది. బుద్ధి కన్నా వ్యతిరిక్తమైన జీవుడే కర్త అవడం యుక్తం. బుద్ధే కర్త అని భావిస్తే, బుద్ధికి ఇంద్రియ గ్రాహకశక్తి (కరణత్వం) కాకుండా, కర్తృత్వం వస్తుంది. బుద్ధిని కర్తగా అంగీకరించ లేము. సమస్త వ్యవహారమూ అహంకార పూర్వకంగానే (బుద్ధికి వ్యతిరిక్తంగా) జరుగుతుంది. అందువల్ల ఆత్మనే కర్తగా స్వీకరించాలి.

## సూ: 2.3.39 సమాధ్యభావాచ్చ

(సమాధి+అభావాచ్చ)

*"ఆత్మావా అరే! ద్రష్టవ్యః శ్రోతవ్యో, మంతవ్యో, నిదిధ్యాసితవ్యః, సోఽన్వేష్టవ్యః, స విజ్ఞాసితవ్యః"* అని శ్రుతి (బృ.ఉ 2.4.5). ధ్యాన, మననాదులతో ఆత్మజ్ఞానం పొందవచ్చునని ఈ శ్రుతి బోధిస్తున్నది. అలాగే *"ఓ మిత్యేవం ధ్యాయథ ఆత్మానమ్"* అని ముండకోపనిషత్తు (ము.ఉ 2.2.6) లో వినిపిస్తున్నది. ధ్యానం–సమాధి అనే క్రియలు, ఆత్మకు కర్తృత్వం లేకపోతే జరగవు. అందువల్ల జీవుణ్ణే కర్తగా గ్రహించాలి.

## 15. తక్షాధికరణమ్

## సూ: 2.3.40 యథా చ తక్షోభయథా

వడ్రంగి వలె ఆత్మ కర్త–అకర్త అని ఉభయథా సమన్వయించుకోవచ్చునని సూత్రార్థం.

ఆత్మకు కర్తృత్వం స్వాభావికమా, లేక ఉపాధి వల్ల వచ్చినదా అనే అంశంపై ఈ అధికరణంలో చర్చ జరుగుతున్నది. భాష్యకారులు చాలా నిశితంగా పరిశీలించిన అంశాలను సరళతరం చేసి ప్రస్తావించడం జరిగింది.

ఆత్మకు కర్తృత్వం స్వాభావికమైతే, మోక్షప్రాప్తికి జన్మరాహిత్యానికి అవకాశం ఉండదు. అందువల్ల, ఆత్మకు కర్తృత్వం స్వాభావికం అని అంగీకరించబడదు.

**సంశయం:**

కొన్ని కర్మలు చెయ్యడం వలన దైవత్వం ప్రాప్తిస్తుందని శాస్త్రం బోధిస్తున్నది. అదేవిధంగా మోక్షం కూడా, కొన్ని సాధనలతో కర్తృత్వాన్ని అంతం చేసుకొని, పొందవచ్చుననే సందేహం కలుగుతున్నది.

**సమాధానం:**

సాధనలతో ప్రాప్తించిన ఫలం అనిత్యం. ఆత్మజ్ఞానంతో పొందిన మోక్షమే నిత్యమైనది. అందువల్ల, ఆత్మకు కర్తృత్వం, ఉపాధి ధర్మాల యొక్క అధ్యాస వలన చూపబడిందే కాని స్వాభావికం కాదు. *"ధ్యాయతీవ లేలాయతీవ"* అనే శ్రుతి వాక్యం (బృ.ఉ 4.3.7), అలాగే *"ఆత్మేంద్రియ మనో యుక్తం భోక్తా ఇత్యాహుః మనీషిణః"* అనే శ్రుతి (క.ఉ 3.4), జీవాత్మకు కర్తృత్వం–భోక్తృత్వం ఉపాధి సంబంధం వల్ల ప్రాప్తించినవని తెలియచేస్తున్నవి. కర్తృత్వ–భోక్తృత్వాలు అవిద్యా స్థితిలో ఉన్న పురుషుడికి వర్తిస్తాయని, అప్పుడే ద్వైతభావం ఉంటుందని శ్రుతి ఇలా వినిపిస్తున్నది: *"యత్రహి ద్వైతమివ భవతి, తదితరం ఇతరం పశ్యతి"* (బృ.ఉ 2.4.14). జ్ఞాన ప్రాప్తితో ద్వైత భావన నశించి ఆత్మైకత్వ భావన కలిగి, అంతా పరమాత్మరూపం కనబడుతుందని శ్రుతి ఇలా తెలియజేస్తున్నది: *"యత్ర వా అస్య సర్వమాత్మైవాభూత్ తత్కేన కం పశ్యేత్"* (బృ.ఉ 2.4.14).

సుషుప్తిలో అలసిపోయిన జీవాత్మ, పరమాత్మను చేరినప్పుడు సుఖ–దుః ఖాల నుండి విముక్తి పొంది శాంతిని పొందుతుంది. *"తద్వా అస్యైతత్ ఆప్తకామం, ఆత్మకామం, అకామం రూపం శోకాంతరమ్"* (బృ.ఉ 4.3.21) ఇలా ప్రారంభమైన శ్రుతి ఉపసంహారంలో ఇలా ముగుస్తున్నది: *"ఏషా అస్య పరమాగతిః ఏషా అస్య పరమా సంపత్, ఏషోఽస్య పరమోలోక, ఏషోఽస్య పరమానందః"* (బృ.ఉ 4.3.32).

సూత్రకారులు పైన ప్రస్తావించిన *"యథాచ తక్షా ఉభయథా"* అనే సూత్రంలో ఈ పరమార్థాన్నే ప్రస్తావిస్తున్నారు. అవిద్య వల్ల తను సృష్టించుకున్న ద్వైతప్రపంచంలో పురుషుడు స్వప్న–జాగ్రదవస్థలలో శ్రమతో దుఃఖాన్ని పొందుతూ ఉంటాడు. అదే జీవుడు, దేహేంద్రియాలతో దూరమైనప్పుడు, సుషుప్తిలో పరబ్రహ్మను చేరి ఆనందంగా ఉంటాడు. అలాగే కర్తృత్వం నుంచి ముక్తి పొందిన జీవుడు కైవల్యావస్థలో కేవల ఆత్మ స్వరూపుడై పరమానంద స్వరూపుడౌతాడు.

వడ్రంగి సాధనాలు లేకుండా ఉంటే అకర్త, అదే వడ్రంగి సాధనాలతో సహా ఉంటే కర్త అవుతున్నాడు. ఇదేవిధంగా, జీవుడు స్వస్వరూపంలో అకర్త, మనో బుద్ధులనే సాధనాలతో కలిసి ఉన్నప్పుడు కర్త అవుతున్నాడు.

జీవుడు, పరబ్రహ్మ స్వరూపమనే ఉపనిషత్తులు పలుకుతున్నవి. అందువల్ల, ప్రకృతః జీవుడు కర్త కాదు. కర్తృత్వం అవిద్యా కల్పితమనే నిర్ధారించుకోవాలి.

స్వప్నంలో విహారం వాసనామయమైనదే కాని పారమార్థికం కాదు. స్వప్నావస్థలో ఇంద్రియాదులు వాటి వృత్తి వ్యాపారం నుండి విరమించినా, మనస్సు పనిచేస్తునే ఉంటుంది. *"స ధీః స్వప్నో భూత్వా ఇమం లోక మతిక్రామతి"* అని శ్రుతి (బృ.ఉ 4.3.7). అలాగే, మహాభారతంలో కూడా ఇంద్రియాలు విరమించగా, మనస్సు పనిచేస్తూ ఉండడం వల్ల స్వప్న దర్శనానుభవం కలుగుతుందని ఇలా చెప్పబడింది: *"ఇంద్రియానాం ఉపరమే మనోఽనుపరతం యది, సేవతే విషయానేవ*

*తద్విద్యాత్ స్వప్నదర్శనమ్"* (మ.భా.శాం. 275.24).

*"విజ్ఞానం యజ్ఞం తనుతే"* అని తైత్తిరీయంలో వినబడుతున్నది కూడా బుద్ధికే కర్తృత్వాన్ని ఆపాదిస్తున్నది. విజ్ఞానమయాత్మకు శ్రద్ధాదులు అంగాలని *"తస్య శ్రద్ధైవ శిరః"* అనే వాక్యం తెలియజేస్తున్నది. శ్రద్ధాది గుణాలు బుద్ధికి సంబంధించినవి. అందువల్ల, ఆత్మకు కర్తృత్వం ఉపాధిని బట్టే నిర్ణయింపబడింది. స్వతంత్రంగా జీవాత్మకు కర్తృత్వం ఏమి లేదు.

## 16. పరాయత్తాధికరణమ్

### సూ: 2.3.41 పరాత్తు తచ్ఛ్రుతేః

జీవుడికి పరమేశ్వరుని ప్రేరణ వల్లే కర్తృత్వం వస్తున్నదని సూత్రార్థం.

బుద్ధ్యాది ఉపాధుల వలన అవిద్యాజనితమైన కర్తృత్వం జీవుడికి ఉత్పన్న మవుతున్నదని క్రిందటి అధికరణంలో చెప్పబడింది. అయితే, ఆ కర్తృత్వం ఈశ్వరాపేక్ష లేకుండా ఏర్పడుతున్నదా లేక, ఈశ్వరుని వల్ల ప్రేరేపింపబడి వస్తున్నదా అనే విషయంపై ఈ అధికరణంలో చర్చ జరుగుతున్నది.

**పూర్వపక్షి:**

కర్తృత్వ విషయంలో జీవుడే బాధ్యత వహించాలి. ఇందులో ఈశ్వరాపేక్ష ఏమీ ఉండదు. జీవుడు రాగద్వేషాల చేత ప్రేరితుడై స్వప్రయోజనం కోసం కావలసిన సాధనాలను సమకూర్చుకొని కర్తృత్వానికి సంసిద్ధుడౌతుంటాడు. అదీకాక, ఈశ్వరుడు అసూయ, పక్షపాతం ఇత్యాది గుణాలకు అతీతుడని ముందు *"వైషమ్యనైర్ఘృణ్యే న సాపేక్షత్వాత్"* అనే సూత్రంలో (బ్ర.సూ 2.1.34) నిర్ధారించబడింది. అందువల్ల, జీవుడికి కర్తృత్వం, ఈశ్వరప్రేరితం కాదు. తనే స్వంతంగా సృష్టించుకున్నదని తోస్తున్నది.

**సిద్ధాంతం:**

సూత్రంలోని 'తు' శబ్దం పూర్వపక్షి వాదనను నిరాకరిస్తూ జీవుడు ఈశ్వరాపేక్షతోనే కర్తృత్వాన్ని వహిస్తున్నాడని నిర్ధారించబడుతున్నది. సకలప్రాణుల హృదయస్థానంలోనున్నవాడు, చైతన్యస్వరూపుడు, సాక్షి, కర్మాధ్యక్షుడు ఈశ్వరుడు. తత్కారణంగా, జీవికి సంసారిత్వం–బంధవిముక్తి కూడా సిద్ధిస్తున్నవి. జీవుడు, రాగ ద్వేష, అహంకారాది గుణాలతో ప్రేరితుడైనా, వాని కార్యకలాపాలన్నీ ఈశ్వరేచ్ఛతో జరుగుతాయనే శ్రుతి ఇలా స్పష్టం చేస్తున్నది: *"ఏష హ్యేవ సాధుకర్మ కారయతి, తం యం ఏభ్యో లోకేభ్య ఉన్నినీషతే, ఏష హి ఏవ అసాధుకర్మ కారయతి, తం యం అధో నినీషతే"* (ఏ పురుషుణ్ణి ఊర్ధ్వలోకాలకు తీసుకొని వెళ్లాలని ఈశ్వరుడు సంకల్పిస్తాడో, వాడిచేత మంచికర్మలు చేయిస్తాడు, ఎవడిని అధోలోకాలకు పంపించ దలచుకుంటే వాని చేత దుష్కర్మలు చేయిస్తాడు – కౌ.షీ 3.8). అలాగే సర్వాంతర్యామిగా అందరినీ భగవంతుడే నియంత్రిస్తున్నట్లు కూడా శ్రుతిలో వినబడుతున్నది: *"య ఆత్మని తిష్ఠన్ ఆత్మానమంతరో యమయతి"* (బృ.ఉ 3.7.22).

**ఆక్షేపం:**

కేవలం ఈశ్వరాపేక్షతోనే జీవుడు కర్మలు చేస్తుంటే, తను చెయ్యని కర్మల యొక్క ఫలితం కూడా అనుభవించవలసి వస్తుంది కదా? దీనికి సమాధానం క్రింది సూత్రంలో చెప్పబడింది.

### సూ: 2.3.42 కృతప్రయత్నాపేక్షస్తు విహితప్రతిషిద్ధావైయర్థ్యాదిభ్యః

సూత్రంలోని 'తు' శబ్దం చేత ఆక్షేపం నివారింపబడుతున్నది. పురుషుడు చేసిన ధర్మాధర్మ కార్యాలకు అనుగుణంగానే ఈశ్వరుడు వాని చేత కర్మలు చేయిస్తూ ఉంటాడు. పురుషుడు ముందు చేసిన ప్రయత్నానికి అనుగుణంగానే ఇప్పుడు కర్మ చేయిస్తున్నాడు, అంతకుముందు చేసిన ప్రయత్నానికి ప్రతిఫలంగానే గతంలో కర్మచేయించాడు అని నిర్ణయించుకోవాలి. సంసారం అనాది కాబట్టి ఇలా జరుగుతునే ఉంటుంది. ఈశ్వరుడు, ఏ కారణం లేకుండా తన ఇష్టానుసారము సుఖదుఃఖాలను ప్రాణులకు కలుగజేస్తాడనుకోవడం వేదవిరుద్ధము. విహితకర్మలు చేసిన వారికే మంచి జరుగుతుందని, నిషిద్ధకర్మలు చేసినవానికే అనర్థం కలుగుతుందని శ్రుతి పలుకుతున్నది. అందువల్ల కర్మానుగుణంగానే ఈశ్వరాపేక్షతో జీవుడికి కర్తృత్వం ఆపాదింపబడుతున్నది.

# 17. అంశాధికరణమ్

## సూ: 2.3.43 అంశో నానావ్యపదేశాదన్యథా చాపి దాశకితవాదిత్వమధీయత ఏకే

భేదనిర్దేశం వినబడడం వల్ల జీవుడు పరమేశ్వరుని అంశంగా చెప్పవచ్చును, అయితే, కొన్ని శాఖల వారు ఎంత హీనులైనా (దాశకిత వాదం) ప్రజలందరూ బ్రహ్మముతో సమానులని భావిస్తారు. ఇది ఈ సూత్రార్థం.

జీవుడు ఉపకారం పొందేవాడు–ఈశ్వరుడు ఉపకారం చేసేవాడనే భావంతో జీవేశ్వరులకు ఉపకార్యోపకార సంబంధముంటుందని చెప్పబడింది. అయితే, ఈ సంబంధం స్వామి–భృత్య సంబంధంలాంటిదా, లేక అగ్నికి–విస్ఫులింగాలకు ఉన్న సంబంధంలాటిదా అనే సంశయం కల్గుతుంది. పరమాత్మ అంగాలు లేని నిరవయవి (అవయవ రహితమైనది). అందువల్ల జీవేశ్వరులకు అంగాంగీ భావం అంగీకరించ బడదు. అగ్ని–విస్ఫులింగ సంబంధమే పరమేశ్వరుడు–జీవుడు మధ్య ఉంటుందని, జీవుడు పరమేశ్వరాంశమని ఈ ప్రకరణలో నిర్ధారించడబడుతున్నది.

*"సోఽన్వేష్టవ్యః స విజ్ఞాసితవ్యః"* (ఛా.ఉ 8.8.1), *"ఏతమేవ విదిత్వా మునిర్భవతి"* ఇత్యాది శ్రుతులు, జీవుడు–పరమాత్మ భిన్నములు అని నానాత్వం (నానావ్యపదేశం) చేస్తున్నవి. కాని ఆత్మైకత్వాన్ని, సర్వాత్మక వాదాన్ని అంగీకరించటానికి జీవేశ్వరులు అభిన్నులు, జీవుడు–పరమేశ్వరుని అంశము అనేదే ప్రాతిపదిక.

ఆథర్వణికులు బ్రహ్మసూక్తంలో భిన్నత్వం చూపకుండా ఇలా పఠిస్తున్నారు: *"బ్రహ్మ దాశా, బ్రహ్మదాసా, బ్రహ్మైవ ఇమే కితవాః"* (మత్స్యకారులు, దాసులు, జూదరులు అందరూ బ్రహ్మరూపములే). దీని భావం, ఎంతహీనులుగా చూపబడ్డా అందరూ ఆ పరమాత్మ యొక్క అంశాలే. ఇదంతా నామ రూప భేదంగానే పరిగణిం చాలి. ఇదే పారమార్థిక భావాన్ని శ్వేతాశ్వతర శ్రుతి ఇలా విన్పిస్తున్నది: *"త్వం స్త్రీ, పుమానసి, త్వం కుమార, ఉత వా కుమారీ, త్వం జీర్ణో దండేన వంచసి, త్వం జాతో భవసి విశ్వేతో ముఖః"* (నువ్వు స్త్రీవి, పురుషుడవు, నీవే పసిబాలుడవు, పసిబాలికవు, నువ్వే ముసలివాడవుగా కర్ర సహాయంతో నడుస్తున్నావు, నువ్వే జగమంతా వివిధ ముఖాలతో వ్యాపించి ఉన్నావు – శ్వే.ఉ 4.3). అలాగే *"సర్వాణి రూపాణి విచిత్య ధీరః నామాని కృత్వాఽభివదన్యదాస్తే"* అని తైత్తిరీయ ఆరణ్యకంలో వినబడుతున్నది (బ్రహ్మమే నామరూపాలతో విస్తరించి ఉంది. బ్రహ్మమును తెలుసుకున్న విద్వాంసుడు అమృతుడౌతున్నాడు – తై.ఆ 3.12.7). బ్రహ్మమునకు వ్యతిరిక్తంగా మరో చైతన్య రూపమేదీలేదని *"నాన్యోఽతోఽస్తి ద్రష్టా"* అనే శ్రుతికూడా (బృ.ఉ 3.7.23) నిర్ధారిస్తున్నది. అందువల్ల జీవుడు, ఈశ్వరాంశమనే గ్రహించాలి.

## సూ: 2.3.44 మంత్రవర్ణాచ్చ

శ్రుతి మంత్రభాగంలో పరమాత్మ అంశములే సర్వప్రాణులూ అని ఇలా వినిపిస్తున్నది: "తావానస్య మహిమా తతో జ్మాయాంశ్చ పురుషః, పాదోఽస్య సర్వాభూతాని త్రిపాదస్యాంమృతం దివి" (పరమాత్మ యొక్క మూడు పాదాలు స్వర్గ లోకంలో ఉండగా, ఒక పాదమే ఇహలోకంలో స్థావర, జంగమ రూపాల్లో ఉంది – ఛా.ఉ 3.12.6). అంశము, పాదము, భాగము ఇవి పర్యాయపదాలుగా వాడుకలో ఉండబట్టి జీవులందరూ పరమాత్మ అంశాలనే ఇక్కడ నిర్దేశింపబడుతున్నది.

## సూ: 2.3.45 అపిచ స్మర్యతే

భగవద్గీతలో జీవుడు ఈశ్వరాంశమనే బోధించబడింది: *"మమైవాంశో జీవలోకే జీవభూతః సనాతనః"* (సర్వప్రాణుల యొక్క దేహములో ఉన్న సనాతమైన జీవాత్మ నా అంశమే –భ.గీ 15.7). మాయోపాధియైన సర్వేశ్వరుడు, శరీరాద్యుపాధులు ఉన్న జీవులను శాసిస్తున్నాడని, నియంత్రిస్తున్నాడని శాస్త్రరీత్యా బోధించడంలోవైరుధ్యం లేదు. లౌకిక వ్యవహార దృష్ట్యా ఇదే స్వామి–భృత్య సంబంధంగా ప్రస్తావింపబడుతున్నది.

**ఆక్షేపం:**

జీవుణ్ణి పరమేశ్వరుని అంశమని నిర్ధారిస్తే, సంసారిత్వం ఉండే జీవుని సుఖ–దుఃఖాలు పరమాత్మలో కలిసి పరమాత్మను తదంశాలయిన, మిగతా జీవులను దుఃఖభాగులను చేసే ప్రమాదం ఉంటుంది. అందువల్ల సంసారంలో ఉండటమే సమ్యగ్దర్శనం కన్నా మంచిదనిపించవచ్చు. అప్పుడు, సమ్యగ్దర్శనం యొక్క ప్రయోజనమే ఉండదు. దీనికి సమాధానంగా క్రింది సూత్రం చెప్పబడింది.

## సూ: 2.3.46 ప్రకాశాదివన్నైవం పరః

(ప్రకాశాదివత్+న ఏవం+పరః)

పరమేశ్వరుడు అవిద్యాకృతమైన దుఃఖాదులకు అతీతుడు. జీవునికే దేహాభిమానం దానితో పాటు వచ్చే పుత్ర – పౌత్రాదుల మీద పెంచుకున్న అభిమానం. నామ–రూపాల చేత ఏర్పడిన దేహేంద్రియాద్యుపాధులు వేరు, నేను అనబడే నా ఆత్మ వేరు అని గ్రహించలేక పోవడమే దీనికి ముఖ్యకారణం. అందువల్ల జీవుడను భవించే సుఖ–దుఃఖాలు, నేను–నాది–నావారు అనే మిథ్యాభిమానం వలన కలుగుతున్నవని తెలుసుకోవలసి ఉంటుంది. పరమేశ్వరుడికి దేహాది ఆత్మభావం కాని, దుఃఖాభిమానం కాని ఉండదు కదా!

నిత్య చైతన్య స్వరూపమూ, అసంగుడూ, ఏకోరికలు లేని పరమేశ్వరుడికి ఇతరుల సుఖదుఃఖాదులు సంక్రమించటం ఉండదు. అందువల్ల, సమ్యగ్దర్శనం వ్యర్థమయే ప్రసక్తే ఉండదు.

ఆకాశంలో వ్యాపించిఉన్న సూర్య చంద్రుల యొక్క కాంతులు, అంగుళ్యాది ఉపాధుల సంబంధం వల్ల వక్రంగాను, తిన్నగాను ఉన్నట్లు కనబడుతుంది. కాని వాస్తవంగా ప్రకాశము వక్ర–ఋజుత్వాదులను పొందదు. అలాగే, నీటిలో ప్రతి బింబిస్తున్న సూర్యబింబము కాని చంద్రబింబము కాని, నీటిని కదిలిస్తే ఆ ప్రతిబింబాలు కదిలినట్లు కనబడినా, నిజరూపాలైన సూర్య చంద్రులు కంపించరు. అలాగే, ఘటాదులలోని ఆకాశం కదులుతున్నట్లు భ్రమ కలిగించినా, యదార్థంగా ఆకాశంలో చలనం ఉండదు. ఇదే విధంగా, శరీర మనోబుద్ధ్యాధి ఉపాధుల వలన జీవాంశము దుఃఖీస్తున్నా, మూలమైన ఈశ్వరుడు దుఃఖీంచడు. *"తత్త్వమసి"* వంటి వేదాంత బోధనలు, పురుషుడిలో అవిద్యాకృత మిథ్యాభావాలను విద్యతో నిర్మూలించి, బ్రహ్మతత్త్వాన్ని ప్రతిపాదించటానికే ఉద్దేశించబడ్డవి.

## సూ: 2.3.47 స్మరంతి చ

శ్రుతి–స్మస్మృతి వాక్యాలు పరమేశ్వరుడు లోకంలో జీవులు అనుభవిస్తున్న సుఖదుఃఖాల వల్ల లిప్తుడు కాడని తెలియజేస్తున్నవి. మహాభారతంలో ఇలా విశదీకరించ బడింది: *"తత్రయః పరమాత్మా హి స నిత్యోనిర్గుణః స్మస్మృతః, న లిప్యతే ఫలైశ్చాపి పద్మపత్రమివాంభసా, కర్మాత్మాత్వపరో యోఽసౌ మోక్ష–బంధైః స యుజ్యతే స సప్తదశకేనాపి రాశినా యుజ్యతే పునః"* (మ.భా.శాం 351.14.19). ఈ శ్లోకాల భావం: పరమాత్మ నిత్యుడు, నిర్గుణుడు; తామరాకుపై నీరు ఎలా అంటదో, అలా ఏ ఫలం చేత అంటకుండా ఉంటాడు. జీవుడు కర్మాత్మ పదిఇంద్రియాలు, పంచప్రాణాలు, మనోబుద్ధులనే పదిహేడింటితో కలిసి బంధ–మోక్షాలతో సంబంధం కలిగి ఉంటాడు.

ఈ పారమార్థిక బోధనే శ్రుతిలో ఇలా విన్పిస్తున్నది: *"తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి, అనశ్నన్నన్యోఽభిచాకశీతి"* (జీవుడు మధురమైన కర్మఫలం తింటున్నాడు; పరమాత్మ తినకుండా చూస్తున్నాడు – శ్వే.ఉ 4.6). అలాగే, *"ఏకస్తథా సర్వ భూతాంతరాత్మా న లిప్యతే లోక దుఃఖేన బాహ్యః"* [సూర్యుడు బాహ్యదుఃఖాల చేత ఎలా ప్రభావితుడు (లిప్తుడు కాడో), అలాగే సర్వభూతాంతరాత్మ, అసంగుడైన పరమేశ్వరుడికి జీవుల దుఃఖాలు అంటవు – క.ఉ 5.11 ].

**ఆక్షేపం:**

సమస్త జీవులకూ ఒకే అంతరాత్మ అని ప్రతిపాదిస్తే, లౌకిక–వైదిక పరమైన చెయ్యదగినవీ – చెయ్యకూడనివీ (అనుజ్ఞా పరిహారాలని చెప్పబడ్డ) కార్యనియమాలు, వాటి యొక్క ఫలం కలగా–పులగం కాకుండా, ఎవరిది వారికి ఎలా

సంక్రమిస్తుంది? నిరవయవి అయిన బ్రహ్మమునకు, జీవుడు అంశం కాజాలడు. కాబట్టి, సర్వాత్మకమైన పరమాత్మయే సకలప్రాణులందు జీవాత్మగా అభేదరూపంలో ఉంటే అనుజ్ఞా, పరిహారాలు ఏవిధంగా కుదురుతాయి – నియమించబడతాయి? దీనికి సమాధానం క్రింద సూత్రంలో చెప్పబడుతున్నది.

## సూ: 2.3.48 అనుజ్ఞాపరిహారౌ దేహసంబంధాత్జ్యోతిరాదివత్

వైదికకర్మకు సంబంధించి అగ్నిష్టోమయాగంలో పశువుని వధించవచ్చునని చెప్పింది అనుజ్ఞ. ఏ ప్రాణినీ హింసించరాదు అని చెప్పింది పరిహారం. అలాగే, ఋతుకాలంలో భార్యను చేరవచ్చునన్నది అనుజ్ఞ. గురుభార్యా సంపర్కం ఎప్పుడూ తగదనేది పరిహారం. ఆత్మ, పరమాత్మ అభిన్నములైనా, అనుజ్ఞాపరిహారాలు దేహ సంబంధమైనవి కాబట్టి కుదురుతాయని స్పష్టం చేయబడుతున్నది.

ఈ దేహమే నేను అనే భావంతో నేను అంధుణ్ణి, నేను అంధుణ్ణికాను, నేను మూఢుణ్ణి, నేను మూఢుణ్ణికాను, నేను పొట్టివాణ్ణి, నేను పొడుగువాణ్ణి, ఇత్యాది భావన దేహసంబంధమైనది; ఆత్మ సంబంధమైనది ప్రాణులందరిలో సామాన్యం. సమ్యగ్దర్శనం అవిద్యను నివారింపజేస్తుంది.

**ఆక్షేపం:**

సమ్యగ్దర్శనం ఉంటే అనుజ్ఞా–పరిహారాలు వర్తించవా?

**సమాధానం:**

సమ్యగ్దర్శనం కలిగిన పురుషుడు కృతార్థుడు. వానికి నియోజ్యత్వం (నియోగించబడడం) అనే ప్రసక్తి ఉండదు. ఆత్మ దేహాదుల కన్నా భిన్నమైనది అని తెలుసుకున్న విద్యావంతునికి నియోగం ఉండదు. సర్వమూ ఆత్మ స్వరూపమని ఆత్మసాక్షాత్కారంతో తెలుసుకున్న జ్ఞాని (బ్రహ్మవేత్త) సంగతి వేరే చెప్పనవసరం లేదు. సమ్యగ్దర్శి, ఇష్టం వచ్చినట్లు ప్రవర్తించడు. సర్వప్రవృత్తులకు మూలకారణం దేహాభిమానం. దేహాభిమానం సమ్యగ్దర్శనం వల్ల నశిస్తుంది. జీవుడికి అనుజ్ఞా – పరిహారాలు దేహ సంబంధం వల్ల చెప్పబడినవి. జ్యోతిరాదుల దృష్టాంతంతో ఇలా విశదీకరించబడుతున్నది:

అగ్ని ఒకటే అయినా శ్మశానాగ్ని త్యజించబడుతున్నది. మిగతా ప్రదేశాల లోని అగ్ని గ్రహించబడుతున్నది. పార్థివములైన, వజ్ర, వైడూర్యములు సంగ్రహించ బడుతున్నాయి, నర కళేబరాదులు పరిహరింపబడుతున్నవి. సూర్యరశ్మి అంతా ఒకటే అయినా, అపరిశుద్ధ ప్రదేశాలలో పరిహరింపబడుతున్నది, పరిశుద్ధ ప్రదేశాలలో ఉపయోగింపబడుతున్నది. గోమూత్రం పవిత్రమైనదని స్వీకరిస్తున్నారు, అన్యమైనది పరిహరింపబడుతున్నది. అందువల్ల అనుజ్ఞా – పరిహారాలు జీవునికి దేహసంబంధం వల్లే ఏర్పడుతున్నాయని నిర్ణయించుకోవాలి. జీవుడికి దేహాద్యుపాధులతో సంబంధ విశేషం ఉన్నంత వరకూ అనుజ్ఞా–పరిహారాలు కుదురుతాయి.

## సూ: 2.3.49 అసంతతేశ్చావ్యతికరః

(అసంతతేః చ అవ్యతికరః)

ఒకే జీవాత్మకు భిన్న భిన్న స్థూలదేహాలతో ఉపాధిసంబంధం ఏర్పడుతూ ఉంటుంది. ఈ స్థూలదేహాలు నశిస్తూ ఉన్నా, కర్మఫలం మోక్షప్రాప్తి వరకూ జీవుణ్ణి వెంటాడుతూనే ఉంటుంది. అందువల్ల, జీవభేదం కొనసాగుతూనే ఉంటుంది. జీవభేదం ఉన్నందు వల్ల కర్మవ్యతికరం (కర్మ సంకీర్ణం కాని), ఫలవ్యతికరం కాని ఉండే అవకాశం లేదు. కాబట్టి, ఏ పురుషుడి యొక్క కర్మఫలం వానికే లభిస్తుంది.

కర్తా–భోక్తా అయిన ఆత్మకు సంతతితో అనగా సకల శరీరాలతో సంబంధం లేని కారణంగా, జీవులకు సంబంధం ఉండదు. అందువల్ల పుణ్య పాపఫలాలయందు సంకీర్ణం, ఏకాత్మత్వాన్ని అంగీకరించినా ఉండదు.

## సూ: 2.3.50 ఆభాస ఏవ చ

జీవుడు, పరమాత్మ యొక్క అభాస మాత్రమే. అంటే సాక్షాత్తు పరమేశ్వరుడు కాదు, అలా అని పరమేశ్వరుని కన్న భిన్న పదార్థము కాదు. ఉదాహరణతో చెప్పాలంటె, నీటిలో కనబడే సూర్యునిలాగ, కదులుతూ ప్రతిబింబిస్తున్న సూర్యుని యొక్క ఆభాస రూపంలా గ్రహించవలసి వస్తుంది. అందువల్ల ఒక స్థానంలో జల సూర్యుడు కదులుతూ ఉన్నా, మరో స్థానంలో జలసూర్యుడు ఎట్టి కదలిక లేక ఉంటాడు. అదేవిధంగా, ఒక జీవుడి యొక్క కర్మఫలం, మరో జీవుడి యొక్క కర్మ ఫలంతో ఎట్టి సంబంధము లేకుండా, ఎవరి కర్మఫలం వారే అనుభవించటం జరుగుతుంది. ఏవిధమైన సాంకర్యం (వ్యతికరం) ఉండదని నిస్సందేహంగా చెప్పవచ్చు. ఆభాస మిథ్యాజ్ఞానం వల్ల ఏర్పడుతుంది కాబట్టి అవిద్యా జనితమని చెప్పడం సమంజసం. అవిద్యా కృతమైనదని అంగీకరించినప్పుడు, బ్రహ్మభావన ద్వారా జీవాత్మ–పరమాత్మ ఏకత్వాన్ని బోధించటం సరళతరం అవుతుంది.

**సాంఖ్య–కణాదుల సిద్ధాంత పరిశీలన:**

సాంఖ్యులు, కణాదులు, జీవాత్మ–పరమాత్మల ఏకత్వాన్ని అంగీకరించరు. వారి సిద్ధాంతం ప్రకారం ఆత్మలు అనేకములు. అంతేకాదు విభువులు–సర్వగతములు. అందువల్ల వారి మతంలో కర్మఫల సాంకర్యం కలిగే అవకాశం ఉంది. సాంఖ్యులు సమస్త ఆత్మలూ సన్నిహితంగా ఉండే చైతన్య రూపాలని విశ్వసిస్తారు. ఒక ఆత్మకు సుఖ–దుఃఖ సంబంధం ఏర్పడినప్పుడు, మిగతా ఆత్మలకు సుఖ–దుఃఖ సంబంధం కలగవలసి వస్తుంది. అలాగే కణాదులు మనస్సు–ఆత్మయొక్క సాయుజ్యం కారణంగా ఒక ఆత్మకు సుఖ–దుఃఖ సంబంధం ఉన్నప్పుడు, మిగతా ఆత్మలకు సుఖదుఃఖాలు కలుగుతాయని నమ్ముతారు. అందువల్ల సాంకర్య దోషం ప్రసక్తమవుతుంది.

**ఆక్షేపం:**

అదృష్టాన్ని బట్టి కర్మఫలం, సుఖ–దుఃఖ ఉపభోగం ప్రాప్తిస్తాయని కూడా చెప్పవచ్చు కదా?

**సమాధానం:**

అదృష్టంలో కూడా ఏవిధమైన నియమము ఉండదని ఈ క్రింది సూత్రం చెప్పబడింది:

## సూ: 2.3.51 అదృష్టానియమాత్

అదృష్టం విషయంలో కూడా ఏ విధమైన నియమము లేదు. ఆకాశం వలె సర్వత్రా వ్యాపించి ఉన్న అనేకములైన ఆత్మలు ప్రతిశరీరంలోను బాహ్యాంతర విశేషం లేకుండా సన్నిహితంగా ఉన్నప్పుడు మనో వాక్కాయ కర్మల వల్ల అదృష్టం ప్రాప్తించటం జరుగుతుంది. అది ధర్మాధర్మ లక్షణాలకు అనుగుణంగానే ఉంటుంది.

సాంఖ్య సిద్ధాంతం ప్రకారం అది ప్రధానం మీద ఆధారపడి ఉంటుంది. అదృష్టానికి – ఆత్మకు సమవాయి (విడదియ్యబడని) సంబంధం ఉండదు. అన్ని ఆత్మలకు ప్రధానం సామాన్యమే కాబట్టి సుఖ–దుఃఖ ఉపభోగంలో నియమం ఉండదు. అలాగే కణాదుల మతంలోను ఆత్మ–మనస్సు సంయోగం వల్ల కలిగే అదృష్టం కూడా ఇది ఈ ఆత్మది – ఇది ఈ ఆత్మది అని వేరుచేసి స్థిరీకరించబడదు. అందువల్ల, సాంకర్యదోషం కలగవచ్చు. అది నివారించబడదు.

**ఆక్షేపం:**

ప్రతి ఆత్మలోను నేను ఈ ఫలం, ఈ విధంగా పొందుతాను, ఈ విధంగా దుష్ట ఫలాన్ని నివర్తించుకుంటాను అనే మానసికమైన ఆలోచన (అభిసంధి) ఉంటుంది. దాని ప్రకారం అదృష్టం ఎవరిది వారికే ప్రాప్తించవచ్చు కదా?

**సమాధానం:**

అటువంటి స్వస్వామి భావం ఆత్మలకు – అదృష్టానికి కుదరదని క్రింది సూత్రంలో చెప్పబడింది.

## సూ: 2.3.52 అభిసంధ్యాదిష్వపి చైవమ

(అభిసంధ్యాదిషు అపి చ ఏవమ్)

మనోనిశ్చయం లేక మానసికాభిప్రాయం (అభిసంధి) ఆత్మకు, అదృష్టానికి మధ్య స్వస్వామి సంబంధాన్ని ఏర్పరుస్తుంది. అందువల్ల ఈ అదృష్టం – ఈ జీవుడిది, ఈ అదృష్టం ఈ జీవుడిది అని నియమించవచ్చు అని పూర్వపక్షి వాదన.

**సమాధానం:**

పై ఆక్షేపణ సరైనది కాదు. ఆత్మ – మనస్సయోగం చేత సమస్త ఆత్మల సన్నిధిలో జరిగే మనోనిశ్చయం ఇత్యాదులు కూడా కర్మఫల నియమ హేతువులు కాజాలవు. అందువల్ల సాంకర్య దోషం పోదు.

## సూ: 2.3.53 ప్రాదేశాదితిచేన్నాంతర్భావాత్

ఆత్మ సర్వగతము. అది విభువే అయినా శరీరంలో ఉండే మనస్సుతోనే దాని సంయోగం జరుగుతుంది. కాబట్టి ప్రదేశరీత్యా (శరీరంలో జరిగే) మనోనిశ్చయా లకు, సుఖ–దుఃఖాలకు, అదృష్టానికి ఒక వ్యవస్థ కుదరవచ్చు అని పూర్వపక్షి చేసిన ఆక్షేపణ ఈ సూత్రంలో తిరస్కరించబడుతున్నది.

ఆత్మలు విభువులు. అవి అన్ని శరీరాలలోను ఉంటాయని వైశేషికుల సిద్ధాంతం. అందువల్ల, ఆత్మకు శరీరానికి భిన్నమైన (శరీరావిచ్ఛిన్న) ప్రదేశం కల్పించ బడదు. ఆత్మకు ఒక ప్రదేశం ఉన్నట్లు భావించినా అది కాల్పనికమే అవుతుంది. పారమార్థికంగా ఏ కార్యాన్ని నియంత్రించలేదు. అందువల్ల అన్ని ఆత్మల సన్నిధిలో పుదుతున్న శరీరం కూడా ఇది ఈ ఆత్మకు సంబంధించినది, మిగతా వాటికి సంబంధించినది కాదు అని నిర్ణయించి చెప్పబడదు. ప్రదేశ భేదం అంగీకరించిన దానికి స్వర్గాది ఉపభోగం కలిగే అవకాశం కూడ ఉండదు. స్వర్గాదులిచ్చే అదృష్టం ఒక శరీరంలో పుడితే, దాని భోగం మరో శరీరంలో కలిగే అవకాశం ఉంది. యథార్థతః ఆత్మలు అనేకములు – అవి సర్వగతములు అనే మౌలిక సిద్ధాంతమే అసమంజసం. దానికి తగిన దృష్టాంతాలు ఏవీ కనబడవు.

ఆత్మలకు లక్షణభేదం లేదు కాబట్టి వాటిని వేరు చేసి వాటి భేదం ఏ విధంగానూ నిర్ణయించబడదు. వైశేషికులు మాత్రం అంత్యవిశేషం యొక్క భేదాన్ని బట్టి ఆత్మకు – ఆత్మకు వ్యత్యాసం చెప్పబడుతుందని భావిస్తారు. కాని, అంత్యవిశేషం దేని వల్ల ఏర్పడుతుందో చెప్పలేరు. నిత్యద్రవ్యాలైన పృథివ్యాదుల్లో విశేషం అంగీకరిస్తారు. ఒక పృథివీ పరమాణువు–మరొక పృథివీ పరమాణువు కన్నా భిన్నమైనది. కాని, ఆ విశేషం ఎలా ఏర్పడిందో చెప్పలేరు. విశేషాలకు విశేషం కల్పించవలసిన ఆవశ్యకత లేకపోవటమే అంత్యవిశేషంగా వారు భావిస్తారు. బ్రహ్మవాదులు వైశేషిక సిద్ధాంతమైన ఆకాశాదుల విభుత్వం తిరస్కరిస్తారు. ఆకాశాదులు కూడా బ్రహ్మ కార్యరూపాలనే బ్రహ్మవాదుల సిద్ధాంతం. ఈ సిద్ధాంతానికి అనుగుణంగా ప్రతిపాదించబడిందే ఆత్మైకత్వం. ఆత్మైకత్వ సిద్ధాంతాన్ని అంగీకరించి నప్పుడు, కర్మఫల సాంకర్యం (వ్యతికరం) అవుతుందనే సంశయమే కలగదు. ఎవరి కర్మను అనుసరించి వారికి ఆ కర్మఫలం ప్రాప్తిస్తుందన్న భావనే సర్వదా ఉంటుంది.

# *2.*

# అవిరోధాధ్యాయము : చతుర్థపాదము



రెండవ అధ్యాయము యొక్క మూడవ పాదంలో స్థూల శరీరానికి సంబంధించిన శ్రుతులలో ఏవిధమైన విరోధము లేదని నిర్ణయించబడినది. సూత్రకారులు లింగశరీరమునకు సంబంధించిన శ్రుతులలో కూడా ఏ విధమైన అవిరోధము లేదని, ఈ పాదంలో సమగ్రంగా పరిశీలించి విశదీకరిస్తున్నారు.

# 1. ప్రాణోత్పత్త్యధికరణమ్

## సూ: 2.4.1 తథా ప్రాణాః

ఏ విధంగా మహాభూతాలు పరమాత్మ నుండి ఉద్భవించాయో అలాగే ప్రాణాలు కూడా పరబ్రహ్మ నుండే పుట్టాయని సూత్రార్థం.

**పూర్వపక్షి:**

*“తత్తేజోఽసృజత”* అనే ఛాందోగ్యశ్రుతి (ఛా.ఉ 6.2.3), *“తస్మాద్వా ఏతస్మా దాత్మన ఆకాశః సంభూతః”* అని వినిపిస్తున్న తైత్తిరీయ శ్రుతి (తై.ఉ 2.1.1), ప్రాణాల ఉత్పత్తికి బ్రహ్మకారణమని తెలియచెయ్యటం లేదు. మరికొన్ని శ్రుతులలో అసలు ప్రాణాలకు ఉత్పత్తే లేదన్నట్లు కూడా ఇలా వినిపిస్తున్నవి: *“అసద్వా ఇదమగ్ర ఆసీత్”* (తై.ఉ 2.7); *“తదాహుః కిం తదాసీదితి, ఋషయో వావతేఽగ్రేఽసదాసీత్, తదాహుః కే తే ఋషయ ఇతి, ప్రాణావావ ఋషయః”* (శత.బ్రా 6.1.1.1). దీని భావం: సృష్టికి పూర్వం అసత్ మాత్రమే ఇదంతా ఉండేది. అసత్తుగా ఉన్నది ఏది అని అన్నారు. సృష్టికి పూర్వం ఋషులు అసత్ రూపంలో ఉండేవారు. ఆ ఋషులు ఎవరు అని పల్కారు, ప్రాణాలే ఆ ఋషులు. మరికొన్ని శ్రుతి వాక్యాలైతే వీటికి విరుద్ధంగా ప్రాణాలకు ఉత్పత్తి ఉందని తెలియజేస్తున్నవి. *“యథాగ్నేః జ్వలతః క్షుద్ర విస్ఫులింగాః వ్యచ్చరంత్యేవమేవ ఏతస్మా దాత్మనః సర్వే ప్రాణాః”* (బృ.ఉ 2.1.20), అలాగే *“ఏతస్మాత్ జాయతే ప్రాణో మనః సర్వేంద్రియాణిచ”* (ము.ఉ 2.1.3), ప్రశ్నోపనిషత్తులో కూడా అదే విధంగా *“స ప్రాణమసృజత, ప్రాణాత్ శ్రద్ధాం, ఖం వాయుర్జ్యోతి రాపః, పృథివీ ఇంద్రియం మనోఽన్నమ్”* (ప్ర.ఉ 6.4). ఇలా శ్రుతులలో చాలా వ్యత్యాసం ఉండటం వల్ల ప్రాణాలకు ఉత్పత్తి ఉన్నదని చెప్తున్న శ్రుతులను అముఖ్యంగా (గౌణార్థంలో) గ్రహించాలని తోస్తున్నది.

**సమాధానం:**

పైన వివరించిన సంశయాల నివృత్తి చెయ్యడానికే *“తథా ప్రాణాః”* అని సూత్రంలో చెప్పబడింది. ఐతే, ఉపమానం లేకుండా 'తథా' అనే పదంతో సూత్రం ఎలా ప్రారంభించబడింది అని పూర్వపక్షి మళ్లీ ఆక్షేపం వ్యక్తం చెయ్యగా, గడచిన పాదంలో ఆకాశాదులు బ్రహ్మము యొక్క వికారాలని ఏ విధంగా చెప్పబడిందో, అదే విధంగా ప్రాణాలు కూడ పరబ్రహ్మ యొక్క వికారములని సమన్వయించు కోవాలని సూచిస్తూ రెండు శ్రుతులను ఇలా భాష్యకారులు ఉదహరించారు: *“ఏతస్మాదాత్మనః సర్వే ప్రాణాః, సర్వే లోకాః, సర్వేదేవాః సర్వాణి భూతాని వ్యచ్చరంతి”* (బృ.ఉ 2.1.2), *“ఏతస్మాత్ జాయతే ప్రాణో మనః సర్వేంద్రియాణిచ, ఖం వాయుః జ్యోతి రాపః పృథివీ విశ్వస్య ధారిణీ”* (ము.ఉ 2.1.3). ప్రాణముల యొక్క ఉత్పత్తి అన్ని శ్రుతులలోను చెప్పబడక పోయినా, కొన్ని ఉపనిషద్వాక్యాలలో స్పష్టంగా, ఏ పరమాత్మ కారణంగా ఆకాశాది మహాభూతాలు పుట్టేయో, ప్రాణాలు కూడా ఆ పరమాత్మ యందే పుట్టాయని వినబడుతున్నది. అందువల్ల, ప్రాణాలు పరబ్రహ్మ యొక్క వికారములనే గ్రహించాలి.

## సూ: 2.4.2 గౌణ్యసంభవాత్

గౌణంగా చెప్పడం కుదరదు కాబట్టి ప్రాణాలకు ఉత్పత్తి ఉన్నదనే అంగీకరించాలని సూత్రార్థం.

సృష్టికి పూర్వం కూడా ప్రాణాలున్నాయని పూర్వపక్షి వాదిస్తూ ప్రాణాలకు ఉత్పత్తి సూచిస్తున్న శ్రుతులను గౌణార్థంలో అముఖ్యమైన వాటిగా పరిగణించాలని ప్రస్తావించటం జరిగింది. ఈ సూత్రంలో ప్రాణోత్పత్తి శ్రుతిని గౌణంగా గ్రహించటం తగదని విశదీకరించబడింది. *“కస్మిన్ను భగవో విజ్ఞాతే సర్వమిదం విజ్ఞాతం భవతి”* (ము.ఉ 1.3.3). దేనిని తెలుసుకుంటే,

ఈ జగత్తులో సర్వం తెలుసుకోవడం జరుగుతుంది అనే ప్రశ్నకు, అన్నింటికి మూలకారణం బ్రహ్మము అని తెలుసుకో అని సమాధానం ఇవ్వడమైంది. ఈ ప్రతిజ్ఞకు ప్రాణోత్పత్తిని సూచిస్తున్న శ్రుతులను గౌణంగా స్వీకరిస్తే భంగం వాటిల్లుతుంది. అందువల్ల ప్రాణాలు మూలకారణమైన పరబ్రహ్మ నుండే పుట్టేయని గ్రహించవలసి ఉంది.

బ్రహ్మ జగత్ సృష్టి కంతకూ మూల కారణమని చాలా శ్రుతులు పలుకు తున్నవి. *"పురుష ఏవేదం విశ్వం కర్మ తపో బ్రహ్మ పరామృతమ్"* (ము.ఉ 2.1.10), *"బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్ఠమ్"* (ము.ఉ 2.2.11), అలాగే *"ఆత్మనో వా అరే! దర్శనేన శ్రవణేన, మత్యా, విజ్ఞానేన ఇదం సర్వం విదితమ్"* (బృ.ఉ 2.4.5), ఇత్యాది శ్రుతులు బ్రహ్మ సృష్టికి మూలకారణము, బ్రహ్మ తత్త్వాన్ని తెలుసుకుంటే సర్వం విదితమవుతుందనే ప్రతిజ్ఞా వచనాన్ని దృఢీకరిస్తున్నాయి.

మూలప్రకృతియైన బ్రహ్మము యందు ప్రాణాది విశేషములేవీ లేవని *"అప్రాణో హ్య మనాః శుభ్రో హ్యక్షరాత్ పరతః పరః"* (ము.ఉ 2.1.2) అని శ్రుతి వినిపిస్తున్నది. అంటే, పరమాత్మ ప్రాణము, మనస్సు (లింగ శరీరము) లేని నిర్మల మైనదని స్పష్టం అవుతున్నది. అయితే, ప్రాణాదులు బ్రహ్మము యొక్క కార్య రూపములు కాబట్టే, సృష్టికి పూర్వం కూడా, ప్రాణాదులు ఉన్నట్లు కొన్ని శ్రుతులు తెలియజేస్తున్నాయని వాటిని అన్వయించుకోవాలి.

మూలకారణం బ్రహ్మము. తన్మూలంగా ఒకదాని తరువాత మరొకటి సృష్టిలో సృజింపబడ్డాయి. మూడవ కార్యానికి రెండవది ప్రకృతి (కారణం) అవుతుంది. అలాగే నాల్గవ కార్యానికి మూడవది కారణం అవుతుంది. అవ్యాకృతమైన సూక్ష్మావస్థ నుండి, వ్యాకృతావస్థలోకి వచ్చిన పదార్థాలను కారణం–కార్యం, లేదా ప్రకృతి–వికార రూపాలని చెప్పడం శ్రుతులలోను, స్మృతిలోను కనబడుతుంది.

ఇక్కడ మరో విషయం కూడ గమనించవలసి ఉంది. వియదధికరణంలో కూడ *"గౌణ్యసంభవాత్"* అనే సూత్రం (బ్ర.సూ 2.3.3) చెప్పబడింది. అయితే అక్కడ అది పూర్వపక్షి సూత్రం. దానిని తిరస్కరిస్తూ ఆకాశానికి కూడా ఉత్పత్తి ఉందని సిద్ధాంతంలో చెప్పబడింది. ఇక్కడ ప్రస్తావించినది సిద్ధాంత పరమైన సూత్రం. అందువల్ల ప్రాణాలకు ఉత్పత్తి ఉంది, దానికి పరబ్రహ్మయే మూలకారణం అని చెప్పడమైనది.

## సూ: 2.4.3 తత్ప్రాక్శ్రుతేశ్చ

*"ఏతస్మాత్ జాయతే ప్రాణః"* అనే శ్రుతిలో (ము.ఉ 2.1.3) జన్మను ధృవ పరుస్తున్న 'జాయతే' అనే పదం ప్రాణాలకు వర్తించి, ఆ తరవాత వినబడుతున్న ఆకాశాది భూతాలకు అనువర్తిస్తున్నది. ఆకాశాదులకు జన్మ ముఖ్యార్థంలోనే స్థిరీకరించబడింది. అదేవిధంగా, ప్రాణాల యొక్క ఉత్పత్తి కూడా గౌణంగా కాకుండా ముఖ్యార్థంలో అన్వయించుకోవడమే సమంజసంగా ఉంటుంది. అలాగే, *"స ప్రాణ మసృజత, ప్రాణాత్ శ్రద్ధామ్"* అనే శ్రుతిలో కూడా (ప్ర.ఉ 6.4) ప్రాణోత్పత్తిని తెలియజేస్తున్న సృజ ధాతువు, తదనంతరం వినిపిస్తున్న శ్రద్ధాదులకు వర్తిస్తున్నది. *"ఏతస్మాదాత్మనః సర్వే ప్రాణాః సర్వేలోకాః సర్వే దేవాః సర్వాభూతాని వ్యుచ్చరంతి"* అని ఉదహరించిన బృహదారణ్యక శ్రుతి (బృ.ఉ 2.1.20.) లో చివరనున్న 'వ్యుచ్చరంతి' అనే శబ్దం, ముందు వినబడుతున్న ప్రాణాదులకు కూడా వర్తిస్తున్నదని భాష్యకారులు ఈ సూత్రానికి వివరణ ఇచ్చారు.

## సూ: 2.4.4 తత్పూర్వకత్వాద్వాచః

*"తత్తేజోஉసృజత"* అనే శ్రుతి (ఛా.ఉ 6.2.3) విన్పిస్తున్న ప్రకరణంలో తేజస్సు, అప్, పృథివీ మూడింటినీ తేజో అబన్నాదులుగా చెప్పడమైంది. అక్కడ ప్రాణముల ఉత్పత్తి గురించి ప్రస్తావన ఏదీలేదు. అయినా, తదనంతరం *"అన్నమయం హి సోమ్య మన, ఆపోమయః ప్రాణ స్తేజోమయీ వాక్"* అని వినిపిస్తున్నది (ఛా.ఉ 6.5.4). అందువల్ల వాక్, ప్రాణ, మనస్సులు, తేజోఅబన్నాదుల వలె బ్రహ్మము యందే ఉద్భవించాయని చెప్పడమే యుక్తము. బ్రహ్మము యొక్క నామ–రూప వ్యాక్రియ సందర్భంలో చెప్పడం వల్ల కూడా ప్రాణాలు బ్రహ్మకార్యమని నిర్ధారించ వచ్చును. *"యేనాఽశ్రుతం శ్రుతం భవతి"* అని ఉపక్రమించిన బ్రహ్మబోధన, *"ఐతదాత్మ్యమిదం సర్వమ్"* అని ఉపసంహారం చెయ్యబడింది. మనః ప్రాణాదులు అన్నాది

మయములు అని చెప్పడం వల్ల కూడా ప్రాణములు బ్రహ్మము యొక్క వికారములనే సిద్ధిస్తున్నది. అందువల్ల ప్రాణముల యొక్క ఉత్పత్తి బ్రహ్మకారణంగా జరిగిందని నిర్ణయించబడుతున్నది.

## 2. సప్తగత్యధికరణమ్

### సూ: 2.4.5 సప్త గతేర్విశేషితత్వాచ్చ

శ్రుతిలో విశేషంగా సప్తప్రాణాల యొక్క గతిని నిర్దేశించడం వలన, ప్రాణాల సంఖ్యను ఏడు అని నిర్ణయించవచ్చునని సూత్రార్థం.

గత అధికరణంలో ప్రాణాల ఉత్పత్తికి సంబంధించి శ్రుత్యంతర విరోధాలను పరిష్కరించడం జరిగింది. ఇప్పుడు సంఖ్యాపరమైన విభేదాలను సూత్రకారులు పరిష్కరిస్తున్నారు.

**పూర్వపక్షి:**

*"సప్తప్రాణాః ప్రభవంతి తస్మాత్"* అని వినిపిస్తున్న ముండకోపనిషత్ లోని శ్రుతి (ము.ఉ 2.1.8) ఐదు జ్ఞానేంద్రియాలు, వాక్, మనస్సు కలిపి ఏడు ప్రాణాలని తెలియజేస్తున్నది. బృహదారణ్యకంలో *"అష్టౌగ్రహా అష్టావతిగ్రహాః"* (బృ.ఉ 3.2.1) అని హస్తములతో కలిపి ఎనిమిది అని చెప్పబడింది. తైత్తిరీయ సంహితంలో *"సప్త వై శీర్షణ్యాః ద్వావవాఞ్చౌ"* (తై.సం. 5.1.7.1) అని వినబడుతున్నది. (శిరస్సులో ఉండేవి ఏడు పాయూపస్థులు మొత్తం 9). మరో సందర్భంలో అదే సంహితంలో *"నవమే పురుష ప్రాణా నాభిర్దశమీ"* అని చెప్పబడింది (తై.సం. 5.3.2.3). బృహదారణ్యకంలో ఒక శ్రుతి పదకొండు ప్రాణాలని ఇలా వినిపిస్తున్నది *"దశమే పురుషే ప్రాణా ఆత్మైకాదశః"* (బృ.ఉ 3.9.4). ఇక్కడ ఐదు జ్ఞానేంద్రియాలు, ఐదు కర్మేంద్రియాలు, ఆత్మ లేక మనస్సు కలిపి పదకొండు అని సూచిస్తున్నది. మరోచోట, ఆయతనం (హృదయం)తో కలిపి పన్నెండు అని *"సర్వేషాం స్పర్శానాం త్వగేకాయనం"* --- అనే మంత్రంలో (బృ.ఉ 2.4.11) వినిపిస్తున్నది. ప్రశ్నోపనిషత్తులో, అహంకారాన్ని వీటితో జమచేసి ప్రాణాల యొక్క సంఖ్యను మొత్తం పదమూడుగా చెప్పబడింది (ప్ర.ఉ 4.8).

ఈ విధంగా శ్రుత్యంతర వ్యత్యాసం చాలా ఉంది. అయినా, గతి దృష్ట్యా ప్రాణాలు ఏడు అని గ్రహించటమే యుక్తమనిపిస్తున్నది. శిరస్సులో ఉండే ప్రాణాలనే *"సప్తవై శీర్షణ్యాః ప్రాణాః"* అని విశేషించి వినబడుతున్నది. అలాగే *"సప్తప్రాణాః ప్రభవంతి తస్మాత్"* అని కూడా నిర్దిష్టంగా చెప్పబడింది. *"ప్రాణా గుహాశయాః సప్త సప్త"* అని ద్విరుక్తి ఉన్నా అందులో ఏదోషమూ కనబడదు. ఎక్కువ సంఖ్యలో చెప్పినవి వృత్తి భేదాన్ని బట్టి చెప్పినవని అన్వయించుకొని, చిన్న సంఖ్య అయిన ఏడింటినే స్థిరీకరించుకోవటం యుక్తం కదా?

ఇలా సందేహం వస్తున్నందు వల్ల ఈ క్రింది సూత్రం చెప్పబడింది.

### సూ: 2.4.6 హస్తాదయస్తు స్థితేఽతో నైవమ్

హస్తాదులకు కర్మతో సంబంధం ఉంటుంది. అందువల్ల వాటిని కూడా జ్ఞానేంద్రియాలతో కలిపి చెప్పుకోవాలి. అధిక సంఖ్యలో అల్పసంఖ్య ఇమిడిపోతుంది. కాబట్టి జ్ఞానేంద్రియాలను, కర్మేంద్రియాలను, అంతఃకరణమును (మనస్సును) కలిపి 11 ఇంద్రియాలని నిర్ణయించుకోవడం సబబుగా ఉంటుంది. మనస్సు, బుద్ధి, అహంకారం, చిత్తం అని పరిగణించేవన్నీ మనస్సు యొక్క వృత్తి భేదాలే. అదీకాక, కామాది వృత్తులకు అనుగుణంగానే *"ఏతత్సర్వం మన ఏవ"* అని బృహదారణ్యక శ్రుతి తెలియజేస్తున్నది (బృ.ఉ 1.5.3). శిరస్సులో ఉన్నవి నాలుగు ప్రాణాలే, అయినా స్థాన భేదం దృష్ట్యా ఏడని చెప్పబడుతున్నవి. ఇతర ప్రాణాలన్నీ శిరస్సులో ఉండే ప్రాణాల యొక్క వృత్తి భేదాలని చెప్పబడదు కదా! హస్తాదుల కార్యకలాపాలే వేరుగా ఉంటాయి. అలాగే *"నవ వై పురుషే ప్రాణా నాభిర్దశమీ"* అని దేహంలో ఉన్న నవ రంధ్రాలను దృష్టిలో ఉంచుకునే లెక్కించినట్లు తెలుస్తున్నది. అయితే నాభి కూడా ఒక ప్రాణానికి స్థానం కాబట్టి అది ప్రత్యేకంగా చెప్పబడినట్లు నిర్ణయించుకోవలసి వస్తుంది. కొన్ని స్థానాలు ఉపాసనల కొరకు, కొన్ని ప్రదర్శన కోసం చెప్పడం జరిగింది. అందువల్ల ప్రధానమైన వాటిని పరిగణించి, వాటి కార్యాల దృష్ట్యా ప్రాణాలు పదకొండు అని నిశ్చయించడమే యుక్తమని

చెప్పవచ్చు.

**పై రెండు సూత్రాలలో ప్రతిపాదించిన ప్రాణ సంఖ్యకు ఇలా మరో అన్వయం కూడా చెప్పబడింది :**

మరణ సమయంలో *"తముత్క్రామంతం ప్రాణోఽనూత్క్రామతి, ప్రాణమనూత్క్రామంతం సర్వే ప్రాణా అనూత్క్రామంతి"* (బృ.ఉ 4.4.2) అని శ్రుతి వినిపిస్తున్నది (జీవాత్మ వదలి వెళ్లిపోతున్నప్పుడు మిగతా ప్రాణాలన్నీ ఈ శరీరాన్ని విడిచి వెళ్లిపోతాయి). అదే సందర్భంలో మరో రెండు శ్రుతులు కూడా ఇలా పల్కుతున్నవి: *"స యత్రైష చాక్షుషః పురుషః పరాఙ్ పర్యావర్తతేఽథాఽరూపజ్ఞో భవతి"* (బృ.ఉ 4.4.1). *"ఏకీ భవతి న పశ్యతీత్యాహుః"* (బృ.ఉ 4.4.2). ఈ మంత్రాలలోని వివరణ దృష్ట్యా, చూపు మొదలు–స్పర్శతో కలిపి మనో–బుద్ధులు అంటే సప్త ప్రాణాలు (5 జ్ఞానేంద్రియాలు+మనోబుద్ధులు), సప్త ప్రాణాలు అని నిర్ధారించుకోవచ్చు అని తోస్తున్నది.

**సిద్ధాంతం:**

పూర్వపక్షి ప్రస్తావనలో ప్రాణముల సంఖ్య ఏడు అని మాత్రమే గ్రహించటం యుక్తమని చెప్పబడింది. ఈ ప్రతిపాదనను తిరస్కరిస్తూ ప్రాణముల సంఖ్యను పదకొండుగా నిర్ధారించుకోవాలని సిద్ధాంతంలో చెప్పడమైనది. *"హస్తాదయస్తు స్థితేఽతో నైవమ్"* అనే సూత్రంలో (బ్ర.సూ 2.4.6) *"హస్తో వై గ్రహః"* (బృ.ఉ 3.2.8) అనే శ్రుతిని ఉదహరించడమైంది. దీని ప్రకారము హస్తములు గ్రహములు (గ్రహించే ఇంద్రియములు); కర్మలు చేసేవి అని చెప్పబడింది. అయితే గ్రహత్వం అనగా బంధనం, కర్మ చేత క్షేత్రజ్ఞుడు బంధింపబడుతున్నాడని అన్వయించుకోవాలని భాష్యకారులు అభిప్రాయము. కర్మబంధనం ప్రస్తుతం ధరించిన శరీరానికే కాదు, మున్ముందు ధరించబోయే శరీరాలకు కూడా కొనసాగుతుంది. స్మృతి బంధవిముక్తి అనగా మోక్షప్రాప్తి వరకు, గ్రహం అనే ఈ బంధనం జీవునితో పాటే ఉంటుందని ఇలా తెలియజేస్తున్నది:

*"పుర్యష్టకేన లింగేన ప్రాణాద్యేన స యుజ్యతే, తేన బద్ధస్య వై బంధో మోక్షో ముక్తస్య తేన చ"* (బ్ర.పు) పంచ ప్రాణాలు, పంచ భూతన్మాత్రలు, పంచ జ్ఞానేంద్రియములు, పంచ కర్మేంద్రియములు, అంతఃకరణము–అవిద్య–కామం–కర్మ అనే నాల్గింటితో కలిసి ఉన్న దేహం పుర్యష్టకంగా పరిగణించబడుతుంది.

ప్రశ్నోపనిషత్తులో కూడా ఇంద్రియములు గూర్చి ప్రస్తావించిన *"చక్షుశ్చ ద్రష్టవ్యంచ"* అనే శ్రుతిలోనే *"హస్తౌచాదాతవ్యంచ, ఉపస్థశ్చ ఆనందయితవ్యంచ, పాయుశ్చ విసర్జయిత్వంచ, పాదౌ చ గంతవ్యం చ"* అని వినిపిస్తున్నది (ప్ర.ఉ 4.8). ఇలా చక్షురింద్రియంతో సమానంగా హస్తాలను, పాదాలను, ఉపస్థను, పాయువును, కూడా చేర్చి చెప్పబడింది. అలాగే బృహదారణ్యకంలో *"దశమే పురుషే ప్రాణా ఆత్మైకాదశః, తే యదా అస్మాత్ శరీరాత్ మర్త్యాత్ ఉత్క్రామంతి అథ రోదయంతి"* (మరణ సమయంలో పదకొండు ప్రాణాలు శరీరాన్ని విడచి వెళ్లిపోతున్నప్పుడు కుటుంబంలో వారికి శోకాన్ని కలుగజేస్తాయి – బృ.ఉ 3.94). ప్రకరణం కంటే శబ్దానికి (శ్రుతికి) బలం ఎక్కువ. కాబట్టి శ్రుతి ప్రామాణ్యం ఉన్న దృష్ట్యా, అర్థాన్ని సంకుచితం చెయ్యకుండా, ఇంద్రియముల యొక్క కార్యాన్ని కూడా పరిగణించి, ప్రాణాల సంఖ్య పదకొండు అనే నిశ్చయించబడుతున్నది.

## 3. ప్రాణాణుత్వాధికరణమ్

### సూ: 2.4.7 అణవశ్చ

ఈ అధికరణంలో ప్రాణముల యొక్క మరొక స్వభావాన్ని సూత్రకారులు నిర్దేశిస్తున్నారు.

ప్రాణములు అతి సూక్ష్మమైనవి. కంటికి కనబడవు. మరే ఇంద్రియముతో కూడా గ్రహించబడనివి. స్థూలములైతే మరణసమయంలో ఈ దేహాన్నుండి ఉత్క్రమిస్తు న్నప్పుడు, సర్పాలు బిలం నుండి బయటకు వస్తున్నట్లుగా, ప్రక్కనున్న వారికి కనబడేవి. శరీరంలో పరిచ్ఛిన్న ప్రమాణంతో ఉంటాయి కాబట్టి సర్వగతాలు కావు. ఏది జ్ఞాన ఉపలబ్ధికి సాధనమో, అదే కరణమనీ–ఇంద్రియవృత్తి అని గ్రహించ బడుతుంది. అందువల్ల, ప్రాణములు సూక్ష్మపరిమాణంలో, ఉపాధియైన శరీరానికి పరిమితమై ఉంటాయని నిశ్చయింపబడుతున్నది.

## 4. ప్రాణశ్రైష్ఠ్యాధికరణమ్

### సూ: 2.4.8 శ్రేష్ఠశ్చ

*"ఏతస్మాజ్జాయతే ప్రాణో మనః సర్వేంద్రియాణిచ"* అనే ముండకోపనిషత్ శ్రుతిని (ము.ఉ 2.1.3), *"స ప్రాణ మసృజత"* అనే ప్రశ్నోపనిషత్ శ్రుతిని (ప్ర.ఉ 6.4) ఉదహరించి ప్రాణములు బ్రహ్మము యొక్క కార్యములని ముందు చెప్పడమైంది. అయినా, ముఖ్యప్రాణం కూడా ఇతర ప్రాణములు (కరణముల వలె) బ్రహ్మము వికారమని మరొకమారు ఈ సూత్రంలో దృఢీకరించబడుతున్నది.

ఋగ్వేద సంహితాభాగమైన నాసదాసీయ సూక్తంలో, బ్రహ్మమును గురించి ప్రధానంగా వినబడుతుంది. ఈ సూక్తంలో శ్రుతి ఇలా పల్కుతున్నది: *"న మృత్యురాసీదమృతం, న తర్హి న రాత్ర్యా అహ్న ఆసీత్ ప్రకేతః. ఆనీదవాతం స్వధయా తదేకం తస్మాద్ధాన్యన్న పరః కించన ఆస"* (ఋ.సం 8.7.17). దీని భావం: సృష్టికి పూర్వం ప్రళయకాలంలో మృత్యువు ఉండే కార్యము లేదు. రాత్రికి చిహ్నమైన చంద్రుడుకాని, పగటికి చిహ్నమైన సూర్యుడుకాని లేడు; వాయువు కూడా లేకుండా మాయతో కూడిన పరమాత్మయే ఉండేది. అందువల్ల, ప్రాణం పుట్టుక లేనిది అజం అనే ఆశంక కలగవచ్చు. ఈ ఆశంకను తొలగించటానికే, శ్రుతి ప్రామాణ్యం చూప బడుతున్నది. *"ఆనీదవాతం"* అని విశేషంగా చెప్పడం వల్ల వాయువు (ప్రాణము) సృష్టికి పూర్వం లేదని తెలుస్తున్నది. బ్రహ్మము యొక్క మూలప్రకృతిలో కూడా ప్రాణాదులు లేవని *"అప్రాణోహ్యమనాః శుభ్ర హి అక్షరాత్ పరతః పరః"* అనే ముండకోపనిషత్ శ్రుతి (ము.ఉ 2.1.2) నిర్ధారిస్తున్నది.

*"ప్రాణోవావ జ్యేష్ఠశ్చ శ్రేష్ఠశ్చ"* అనే ఛాందోగ్యశ్రుతిలో (ఛా.ఉ 5.1.1) ప్రాణము అన్నింటి కన్నా వయస్సులో పెద్దది, అంతేకాదు చాలా శ్రేష్ఠమైనది (ప్రశస్త మైనది) అని చెప్పబడింది. శుక్రనిషేకం (రేతస్సించనము) జరిగిన సమయం నుండి ప్రాణోత్పత్తి కలగడం వలన ప్రాణం జ్యేష్ఠమని నిర్ధారింపబడుతున్నది. ప్రాణోత్పత్తి లేకపోతే, స్త్రీ యోని యందు నిషిక్తమైన శుక్రం నశించిపోవాలి. చెవులు మొదలగు ఇంద్రియాలు వాటి వాటి స్థానాల్లో ఏర్పడడం కూడా ప్రాణంతో ఉన్న గర్భస్థ పిండములో ఆ తరవాత జరుగుతుంది. అందువల్ల ప్రాణం జ్యేష్ఠమని చెప్పబడు తున్నది. అలాగే ముఖ్యప్రాణం లేకపోతే మిగతా ఇంద్రియాలు (ప్రాణాలు) ఏవీ వాటి వాటి కార్యకలాపాలు చేసుకోలేవు. *"న వై శక్ష్యామః త్వదృతే జీవితం"* అని బృహదారణ్యక శ్రుతిలో విన్పిస్తున్నది (నీవు లేకుండా మేము జీవించి ఉండ శక్యము కాదు – బృ.ఉ 6.1.13). ముఖ్యప్రాణము యొక్క జ్యేష్ఠత్వము, శ్రేష్ఠత్వము దృష్ట్యా, ప్రాణం బ్రహ్మము యొక్క వికారమని స్థిరీకరించబడుతున్నది.

# 5. వాయుక్రియాధికరణమ్

## సూ: 2.4.9 న వాయుక్రియే పృథగుపదేశాత్

ముఖ్యప్రాణం యొక్క స్వరూపం ఇప్పుడు వివరించి చెప్పడం జరిగింది. *"యః ప్రాణః స వాయుః స ఏష వాయుః పంచవిధః ప్రాణోఽపానో వ్యాన ఉదానః సమానః"* అని ఐతరేయ శ్రుతి (ఐ.ఆ. 2.3.3). ఈ శ్రుతి, ప్రాణము వాయువు, అది ఐదు విధాలుగా ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానమనే రూపాల్లో ఉంటుంది అని తెలియజేస్తున్నది. సమస్తమైన ఇంద్రియ వృత్తియే ప్రాణమని శాస్త్రాంతర అభిప్రాయమని కూడా చెప్పవచ్చు. సాంఖ్యమతస్థులు వారి కారికలో "సామాన్యాకరణ వృత్తిః ప్రాణాద్యా వాయవః పంచ" అని ప్రస్తావించారు (సాం.కా 29). ప్రాణాది పంచవాయువులు, మనో–బుద్ధి–అహంకారముల వృత్తివ్యాపారాన్ని నడుపుతాయని దీని భావంగా గ్రహించవచ్చు. అయితే, ప్రాణము వాయుమా–కరణాల వ్యాపారము కొనసాగించే సాధనముగానే పరిగణించబడదు. దానికి ప్రత్యేకత ఉందని సూత్రకారులు ఇక్కడ విశదీకరిస్తున్నారు.

ప్రాణము వాయువు కంటె భిన్నమైనదానిగా ఛాందోగ్యశ్రుతి ఇలా ఉపదేశి స్తోంది : *"ప్రాణ ఏవ బ్రహ్మణః చతుర్థపాదః, స వాయునా జ్యోతిషాభాతి చ తపతిచ"* (బ్రహ్మకు ప్రాణం, చక్షుస్సు, శ్రోత్రం, వాక్ అనే నాలుగు పాదాలు. వాటిలో ప్రాణం అధిదైవికమైన వాయువు చేత ప్రకాశింప బడుతుందని దీని భావం– ఛా.ఉ 3.18.4).

ప్రాణము వాయువు మాత్రమే ఐతే, దాని కన్నా వేరుగా చెప్పబడదు. అలాగే కరణాల యొక్క వృత్తి కంటె ప్రాణం వేరుగా నిర్దేశింపబడింది. వాగాది ఇంద్రియముల గురించి ప్రస్తావిస్తూ, ప్రాణాన్ని వేరుగా శ్రుతులు పల్కుతున్నవి. *"ఏతస్మాజ్జాయతే ప్రాణో, మనః సర్వేంద్రియాణి చ, ఖం వాయుః"* (ము.ఉ 2.1.3). అదీ కాక, అన్ని ఇంద్రియాలకు (కరణాలకు) ఒకే వృత్తి ఉండదు. ఒక్కొక్క ఇంద్రియానికి ఒక్కొక్క వ్యాపారం ఉంటుంది.

**సంశయం :**

పంజరచాలన న్యాయం అనుసరిస్తే, ఒక పంజరంలో పదకొండు పక్షులు ఉన్నా అవి అన్నీ కలిసి పంజరాన్ని ఉయ్యాల ఊపినట్లు కదిపించగలవు. అలాగే ఈ శరీరంలో పదకొండు ప్రాణాలు ఒక్కొక్కటీ తన వృత్తి (దాని పనిని) చేసుకుంటూ ప్రాణం యొక్క వృత్తిని కొనసాగించటం సాధ్యమే కదా?

**సమాధానం:**

అలా జరగదు. శ్రవణాది వ్యాపారం, కర్ణేంద్రియం వల్ల జరుగుతున్నది. ఇలా తక్కిన ఇంద్రియాలు కూడా వాటి వాటి కార్యకలాపాలు చేసుకుంటూ ప్రాణవృత్తిని నిర్వహిస్తాయని చెప్పటానికి ఏ ప్రామాణ్యం లేదు. ప్రాణనం (ప్రాణవృత్తి) వాక్ శ్రవణాదుల కన్నా చాలా విలక్షణమైనది. అది చాలా శ్రేష్ఠమైనదని కూడా చెప్పబడింది. వాయువే శరీరంలో ప్రవేశించి ఐదు విధాలుగా కార్యాన్ని కొనసాగిస్తూ ప్రాణమని చెప్పబడుతున్నది *"యః ప్రాణః స వాయుః"* . అందువల్ల ప్రాణము, వాయుతత్త్వానికి భిన్నమైతే కాదు. కాని, వాయువుతో సమానమైనదీ కాదని ఈ విషయంలో వినిపిస్తున్న భిన్నాభిన్న శ్రుతులు తెలియజేస్తున్నవి.

**ఆక్షేపం:**

వాగాది ఇంద్రియముల కన్నా ప్రాణం శ్రేష్ఠమైనది. ఇంద్రియాలు అస్వతంత్ర మైనవి. అంతే కాకుండా, శారీరుడు సుషుప్తిలో ఉన్నప్పుడు ఒక్క ప్రాణమే మేల్కొని ఉంటుంది. వాగాది ఇంద్రియాలు ఉపసంహరించుకొని, వాటివాటి పనులు చెయ్యడం మానేస్తాయి. ముఖ్యప్రాణం యొక్క ఔన్నత్యాన్ని కీర్తిస్తున్న శ్రుతి ఇలా వినిపిస్తున్నది *"సుప్తేషు వాగాదిషు ప్రాణ ఇతరాన్ ప్రాణాన్ రక్షతి మాతేవ పుత్రాన్"* [తల్లి పిల్లలను కాపాడినట్లు ముఖ్యప్రాణం ఇతర ప్రాణాలను (కరణాలను) కాపాడుతుంది]. అందువల్ల ప్రాణం జీవుడు ప్రవర్తించినట్లు స్వతంత్రంగా వ్యవహరిస్తుందా అనే సందేహం కలుగుతున్నది.

ఈ ఆక్షేపాన్ని తిరస్కరిస్తూ ఈ క్రింది సూత్రం చెప్పబడింది:

## సూ: 2.4.10 చక్షురాదివత్తు తత్సహశిష్ట్యాదిభ్యః

మహారాజుకు అమాత్యాదులు సహకరించి సేవలు అందిస్తున్నట్లు, జీవుడికి ముఖ్యప్రాణం మంత్రి వలె అన్ని ప్రయోజనాలను సమకూరుస్తూ, ఒక సాధనంగా వ్యవహరిస్తుంది. ప్రాణం కూడా చక్షురాది ఇంద్రియములతో పాటే సమానంగా ప్రాణ సంవాద ఘట్టంలో కూడా చెప్పబడింది (ఛా.ఉ 5.1.1 నుంచి 5.1.15.). సమాన ధర్మాలు కలిగి ఉన్న బృహత్సామ – రథంతర సామలను కలిపి సామగానం చెయ్యబడుతుంది. అలాగే, సమానగుణాలు కలిగి ఉండడం వల్లే ముఖ్యప్రాణాన్ని తక్కిన చక్షురాది ఇంద్రియాలతో కలిపి ప్రస్తావించడమైంది. ప్రాణాలకు కూడా చేతనత్వం లేదు. అందువల్ల జీవుడిలా స్వాతంత్ర్యం ఉండదు.

**ఆక్షేపం:**

ప్రాణం కూడా చక్షురాది ఇంద్రియాల లాంటిదైతే దాని చేత గ్రహించబడే ఏదైనా విషయం ఉండాలికదా? రూపాది కార్యసముదాయాలు పదకొండు మాత్రమే ఉన్నాయి. ప్రాణానికి వేరుగా పన్నెండవ కార్యసముదాయమేదీ గోచరించదు. ఈ ఆక్షేపణకు సమాధానంగా క్రింది సూత్రం చెప్పబడింది:

## సూ: 2.4.11 అకరణత్వాచ్చ న దోషస్తథా హి దర్శయతి

ప్రాణం తక్కిన ఇంద్రియాల వలె ఒక ఇంద్రియం కాదని ముందు కూడా చెప్పడమైనది. ముఖ్యప్రాణానికి ఒక విశిష్టమైన కార్యం ఉంది. ప్రాణసంవాదంలో *"అథ హ ప్రాణా అహం శ్రేయసి వ్యూదిరే"* (నేను గొప్ప, నేను గొప్ప అని ప్రాణాలు వాదించుకొన్న సందర్భంలో) *"యస్మిన్వ ఉత్క్రాంతే శరీరం పాపిష్ఠతరమివ దృశ్యతే స వః శ్రేష్ఠః"* అని నిర్ణయించుకోవటం జరిగింది (ఏ ప్రాణం లేచి వెళ్లిపోతే ఈ శరీరం పూర్తిగా పాడైపోతుందో అదే శ్రేష్ఠమైనది). వాగాదింద్రియాలు ఒక్కొక్కటీ లేచి వెళ్లిపోయినా శరీరం పాపిష్ఠతరం కాలేదు. ముఖ్యప్రాణం లేచి వెళ్లిపోడానికి సిద్ధమైనపుడు శరీరం శిథిలమైపోతుంది కాబట్టి మిగతా శరీరేంద్రియాలు ప్రాణం యొక్క శ్రేష్ఠత్వాన్ని అంగీకరించేయని చెప్పబడింది.

*"తాన్ వరిష్ఠః ప్రాణ ఉవాచ మా మోహ మాపద్యథ అహమేవ ఏతత్ పంచధాత్మానం ప్రవిభజ్య ఏతత్ బాణ మవష్టభ్య విధారయామి"* అని శ్రుతి ప్రశ్నోపనిషత్‌లో విన్పిస్తున్నది (ప్ర.ఉ 2.3). అలాగే బృహదారణ్యకంలో కూడా ఇలా చెప్పబడింది : *"ప్రాణేన రక్షన్ అవరం కులాయమ్"* (ప్రాణం చేత నీచమైన శరీర మనే గూటిని రక్షిస్తూ జీవుడు నిద్రిస్తున్నాడు – బృ.ఉ 4.3.12). అలాగే మరో సందర్భంలో *"యస్మాత్ కస్మాత్ చాంగాత్ ప్రాణ ఉత్క్రామతి తదేవ తత్ శుష్యతి"* అని చెప్పబడింది (ఏ అవయవం నుంచైనా ప్రాణం లేచి వెళ్లిపోతే అది శుష్కించి పోతుంది – బృ.ఉ 1.3.19). జీవుడు ఈ ప్రాణాధారంతో ఏది తింటున్నాడో ఏది తాగుతున్నాడో, వాటి వలనే ఇతర ప్రాణాలను రక్షిస్తున్నాడని ఇలా వినబడుతున్నది: *"తేన యదశ్నాతి యత్‌పిబతి తేన ఇతరాన్ ప్రాణాన్ అవతి"* . అలాగే *"కస్మిన్వహ ముత్క్రాంతే ఉత్క్రాంతో భవిష్యామి, కస్మిన్ వా ప్రతిష్ఠితే ప్రతిష్ఠాస్యామి"* (జీవుడు విడిచిపోవటం కాని, ప్రతిష్ఠగాని ముఖ్య ప్రాణం వలనే జరుగుతున్నదని దీని భావం).

## సూ: 2.4.12 పంచవృత్తిర్మనోవద్వ్యపదిశ్యతే

కార్యభేదాన్ని బట్టి వృత్తి భేదం నిర్ణయించబడుతుంది. ముఖ్యప్రాణానికి ఐదు వృత్తులున్నట్లు *"ప్రాణోஉపానో వ్యాన, ఉదాన, సమానః"* అనే శ్రుతి తెలియ జేస్తున్నది (బృ.ఉ 1.5.3). ఈ ఐదింటికి ప్రత్యేకమైన కార్యాలు ఉన్నాయి. నాసిక నుండి ఉచ్ఛ్వాసం ప్రాణం చేస్తుంది. నిశ్వాసం అపానం చేస్తుంది. బలంతో చేయ దానికి ఉపకరించేది వ్యానం. పైకి

లేచిపోడానికి హేతువు ఉదానం, అన్నరసాన్ని అన్ని అంగాలకు వ్యాపింపజేసేది సమానం అని చెప్పబడుతున్నది. మనస్సు జీవుడికి ఒక ఉపకరణంగా భావించబడినట్లే, ప్రాణం కూడా ఒక సాధనమని గ్రహించ బడుతుంది. మనస్సుకు ఎలా పంచవృత్తులున్నాయో, అలాగే ప్రాణానికి కూడా పంచ వృత్తులున్నాయని ఈ సూత్రంలో స్పష్టం చేయబడుతున్నది.

## 6. శ్రేష్ఠాణుత్వాధికరణమ్

### సూ: 2.4.13 అణుశ్చ

ముఖ్యప్రాణము అణువు వలె అల్పప్రమాణం కలదని సూత్రార్థం.

ఐదు వృత్తులతో ముఖ్యప్రాణం శరీరాన్నంతటినీ వ్యాపించి ఉంటుంది. ఉత్క్రాంతిలో ఎవరికీ గోచరము కాదు. కాబట్టి ముఖ్యప్రాణము కూడా మిగతా ప్రాణముల వలె సూక్ష్మ పరిమాణంలో ఉంటుంది. శరీరంలో పరిచ్ఛిన్నంగా ఉంటూ, ఉత్క్రాంతి గత్యాగతులు ప్రాణానికి శ్రుతిలో వినబడడం వలన, ముఖ్యప్రాణం అల్ప పరిమాణంలో ఉంటుందని గ్రహించాలి. అయితే, *"సమః ప్లుషిణా, సమో మశకేన, సమో నాగేన, సమ ఏభిస్త్రిభిర్లోకైః, సమోఽనేన సర్వేణ"* అని శ్రుతి వినిపిస్తున్నది (బృ.ఉ 1.3.22). దీని ప్రకారము చిన్న క్రిమితోను, దోమతోను, ఏనుగుతోను, ముల్లోకాలతోను, సమస్తంతోను ప్రాణము సమానమైనది కాబట్టి ముఖ్యప్రాణాన్ని విభువుగా గ్రహించాలనే ఆక్షేపం వినవస్తుంది. దానికి సమాధానంగా భాష్యకారుల వివరణ ఇలా ఉంది: చతుర్దశభువనాత్మక రూపం హిరణ్యగర్భుడు. ఆ కార్యబ్రహ్మ రూపాన్ని దృష్టిలో ఉంచుకొని ప్రాణం విభువుగా పరిగణింపబడుతుంది. కాని పరిచ్ఛిన్నమైన ప్లుషి–మశకాది ప్రతిప్రాణిలో కూడా ప్రాణానికి సమానత్వం చెప్ప బడింది. కాబట్టి, ఆధ్యాత్మికపరంగా శారీరుడిలోని ముఖ్యప్రాణం సూక్ష్మ పరిమాణంలో ఉంటుందని చెప్పటంలో ఎట్టి దోషము లేదని నిర్ణయింపబడుతున్నది.

# 7. జ్యోతిరాద్యధికరణమ్

## సూ: 2.4.14 జ్యోతిరాద్యధిష్ఠానం తు తదామననాత్

జ్యోతిస్సు మొదలగు వాటికి అధిష్ఠానంగా వాగాది ఇంద్రియ సముదాయం పని చేస్తున్నదని శ్రుతి వల్ల తెలుస్తున్నదని సూత్రార్థం. స్వతః సిద్ధంగానే వాగాది ఇంద్రియాలు వాటి వాటి పనులు నిర్వర్తించుకొంటాయా, లేక వాటినధిష్ఠించి ఉన్న దేవతలు వాటి పనిని చేస్తున్నారా అనే విషయం ఈ అధికరణంలో పరిశీలించ బడుతున్నది.

**పూర్వపక్షం:**

ఇంద్రియాల యందు వాటి పనులు చేసుకునే శక్తి (మహిమ) ఉన్నందు వల్ల, అవి స్వతంత్రంగానే వాటి వాటి పనిని నిర్వర్తించుకోగలవు. వాటి అధిష్ఠాన దేవతల వలన ఇంద్రియముల యొక్క వృత్తివ్యాపారం జరుగుతున్నదని భావిస్తే, ఆ యా దేవతలకే భోక్తృత్వ ఫలం లభించాలి కాని శారీరుడికి కాదు. అందువల్ల, ఇంద్రియాలే వాటి వాటి పనులు స్వతంత్రంగా చేసుకుంటాయని తోస్తున్నది.

**సిద్ధాంతం:**

సూత్రంలో 'తు' ప్రత్యయం పూర్వపక్షాన్ని తిరస్కరిస్తూ అగ్ని మొదలగు అభిమాన దేవతల వలనే వాగాది కరణాల యొక్క వ్యాపారం జరుగుతుందని నిర్ధారిస్తున్నది. *"అగ్ని ర్వాగ్భూత్వా ముఖం ప్రావిశత్"* అని శ్రుతివాక్యం (అగ్ని వాక్ రూపంలో ముఖంలో ప్రవేశించినది – ఐ.ఉ 2.4). అలాగే *"వాయుః ప్రాణో భూత్వా నాసికే ప్రావిశత్"* (వాయువు ప్రాణరూపంలో నాసికలో ప్రవేశించినది) అని కూడా అదే శ్రుతి తెలియజేస్తున్నది. ఛాందోగ్యంలో కూడా శ్రుతి ఇలా విన్పిస్తున్నది: *"వాగేవ బ్రహ్మణః చతుర్థః పాదః సోఽగ్నినా జ్యోతిషా భాతి చ తపతి చ"* (వాక్ బ్రహ్మము యొక్క చతుర్థ పాదము. అది అగ్నిరూపమైన జ్యోతిస్సు చేత భాసిస్తూ తన కార్యాన్ని చేస్తున్నది – ఛా.ఉ 3.18.3). బృహదారణ్యక శ్రుతి కూడా అగ్ని మొదలగు దేవతలు వాగాదులను అధిష్ఠించి ఉంటారని ఇలా తెలియజేస్తున్నది: *"స వై వాచమేవ ప్రథమాం అత్యవహత్ సా యదా మృత్యుం అత్యముచ్యత సోఽగ్ని రభవత్"* (బృ.ఉ 1.3.12). స్మృతిలో కూడా వాగాదులు అగ్ని మొదలగు అధిష్ఠాన దేవతల చేత అధిష్ఠింపబడినట్లు చెప్పడమైనది: *"వాగధ్యాత్మమితి ప్రాహుః బ్రాహ్మణాః తత్త్వదర్శినః, వక్తవ్యమధి భూతం తు వహ్నిః తత్రాధిదైవతమ్"* (వాక్కు ఈ శరీరంలో అధ్యాత్మరూపము. అగ్ని దాని అధిదేవతా రూపము – మ.భా.శాం. 31.5.5). అందువల్ల శాస్త్ర దృష్ట్యా, ఇంద్రియ సముదాయం యొక్క వృత్తివ్యాపారం అదిష్ఠాతలైన దేవతల వలననే జరుగుతుందని నిశ్చయింపబడుతున్నది.

## సూ: 2.4.15 ప్రాణవతా శబ్దాత్

ప్రాణధారుడైన శారీరుడికే ప్రాణములతో సంబంధమని శ్రుతి తెలియ జేస్తున్నాదని సూత్రార్థం. ఈ సూత్రంలో ఇంద్రియాలకు అధిష్ఠాతలైన దేవతలకు భోక్తృత్వం ప్రసక్తమవుతుందనే ఆక్షేపాన్ని నివృత్తి చేయబడుతున్నది.

ఇంద్రియాలకు అధిష్ఠానదేవతలున్నా, శారీరుడితోనే ప్రాణాలకు సంబంధం ఉంటుందని శ్రుతి వలన తెలుస్తున్నది: *"అథ యత్ర ఏతదాకాశమను విషణ్ణం చక్షుః స చాక్షుషః, పురుషో దర్శనాయ చక్షుః అథ యో వేదేదం జిఘ్రాణీతి స ఆత్మా గంధాయ ఘ్రాణమ్"* (ఛా.ఉ 8.12.14). ఎవని ప్రయోజనం కొరకు చక్షుస్సు నేత్ర గోళాన్ని ప్రవేశించిందో, ఆ శారీరుడు చూడడానికే చక్షుస్సు ఉపయోగిస్తుంది. దీనిని వాసన చూస్తున్నాను అని ఎవడు తెలుసుకుంటున్నాడో, అతడే జీవుడు అని ఈ శ్రుతి తాత్పర్యం. అందువల్ల భోగం అనుభవిస్తున్న శారీరుడితోనే ఇంద్రియ సముదాయం యొక్క సంబంధము. అదీ కాక భోక్త ఒక్కడే, కాబట్టి అధిష్ఠాతలై ఉన్న దేవతలందరికీ భోక్తృత్వం ఏ విధంగానూ ఉండదు.

## సూ: 2.4.16 తస్య చ నిత్యత్వాత్

జీవుడికే నిత్యత్వం ఉంది. అందువ్ల ప్రాణాలన్నింటికి శరీరధారుడైన జీవుడి తోనే సంబంధం ఉంటుందని సూత్రార్థం.

ఈ శరీరంలో జీవుడే నిత్యుడు. అతడే భోక్త. అధిష్ఠాన దేవతలకు శరీరంలో నిత్యత్వం లేదు. శ్రేష్ఠమైన ఐశ్వర్యం (మహిమ) ఉన్న దేవతలు, హీనమైన ఈ శరీరంలో ఉండే భోగభాగ్యాలకు భోక్తలుగా పరిగణించటం ఉచితం కాదు. బృహదారణ్యక శ్రుతిలో కూడ దేవతలకు ఎట్టి పాపం అంటదనే ఇలా విన్పిస్తున్నది : *"పుణ్యమేవాముం గచ్ఛతి న వై దేవాన్ పాపం గచ్ఛతి"* (బృ.ఉ 1.5.3). ఉత్క్రాంతి ఇత్యాదిని తెలియ జేస్తున్న శ్రుతులు కూడా ప్రాణాలు జీవుణ్ణి అనుసరించే వెళ్లిపోతాయని తెలియజేస్తు న్నవి. *"తముత్క్రామంతం ప్రాణోఽనూత్క్రామతి, ప్రాణమనూత్క్రామంతం సర్వే ప్రాణా అనూత్క్రామంతి"* (బృ.ఉ 4.4.2). అందువల్ల వాగాది కరణాలకు అధిష్ఠాతలై దేవతలున్నారని తెలుస్తున్నా, శారీరుడే భోక్తగా పరిగణింపబడతాడని శ్రుతులునిర్ధారిస్తు న్నవి. అగ్న్యాదిదేవతలు ఇంద్రియాలకు అధిష్ఠాతలైనా, వారికి భోక్తృత్వం ప్రసక్తంకాదు.

## 8. ఇంద్రియాధికరణమ్

### సూ: 2.4.17 త ఇంద్రియాణి తద్వ్యపదేశాదన్యత్ర శ్రేష్ఠాత్

ముఖ్యప్రాణం తప్ప తక్కిన ప్రాణాలన్నీ ఇంద్రియ సముదాయంగానే పరిగణింపబడతాయని సూత్రార్థం.

**పూర్వపక్షి:**

ముఖ్యప్రాణము, మరో పదకొండు ప్రాణాలని, ఇంతకుపూర్వం లెక్క చెప్ప బడింది. ఈ పదకొండూ ముఖ్యప్రాణం యొక్క వృత్తిభేదాలా లేక భిన్న పదార్థాలా అనే సంశయం వస్తుంది. శ్రుతిలోనైతే ముఖ్యప్రాణాన్నీ మిగతా కరణాలను ఒకచోట చేర్చి, ప్రాణాలన్నీ ముఖ్యప్రాణంయొక్క వృత్తి భేదాలన్నట్లు ఇలా వినిపిస్తున్నది: *"హంత, అస్యైవ సర్వేరూపం అసామేతి, త ఏతస్యైవ సర్వే రూపమభవన్ తస్మాత్ ఏతే ఏతేన ఆఖ్యాయంతే ప్రాణాః ఇతి"* (బృ.ఉ 1.5.21). అన్నింటిని కలిపి ఇక్కడ 'ప్రాణ' శబ్దంతో సమానంగా నిర్దేశించడం వలన ప్రాణాలన్నీ ఒకే విధమైనవని అర్థం చేసుకోవాలి కదా! ముఖ్యప్రాణానికి ఐదు వృత్తులు ఉన్నట్లే వాగాదులు కూడా దాని వృత్తులుగానే పరిగణింపబడాలని తోస్తున్నది.

**సిద్ధాంతం:**

వాగాది ఇంద్రియాలు ముఖ్యప్రాణం కన్నా భిన్న తత్త్వమున్న పదార్థాలు. శ్రేష్ఠమైన ముఖ్యప్రాణానికి భిన్నంగానే ఇతర పదకొండు ఇంద్రియాలను శ్రుతి నిర్దేశిస్తున్నది. *"ఏతస్మా జ్జాయతే ప్రాణో, మనః సర్వేంద్రియాణిచ"* అని ప్రాణాన్ని, తక్కిన ఇంద్రియాలను వేరు వేరుగానే సూచిస్తున్నది (ము.ఉ 2.1.3). అలా చెప్తే మనస్సును కూడా వేరుచేసి మిగతా ఇంద్రియాలతో కలపకుండా చెప్పాలి కదా! అని ఆక్షేపం చెయ్యబడుతున్నది. దానికి సమాధానంగా స్మృతి *"ఇంద్రియాణి దశైకంచ పంచచేంద్రియగోచరాః"* (భ.గీ 13.5) అని మనస్సును కూడా శ్రోత్రాదుల్లా ఒక ఇంద్రియంగానే పరిగణిస్తున్నందున, మనస్సు పదకొండు ఇంద్రియాలతో పాటే లెక్కింపబడుతున్నదని స్పష్టం చెయ్యబడింది. శ్రుతిలోను, స్మృతిలోను కూడా ముఖ్య ప్రాణాన్నే తక్కిన వాగాది ఇంద్రియాలతో కాకుండా, వేరేగా చెప్పడం కనబడుతున్నది. అందువల్ల, ముఖ్యప్రాణం మిగతా పదకొండు ఇంద్రియాల కన్నా భిన్నమైన తత్త్వం కలిగి ఉంటుందని నిర్ధారించబడుతున్నది.

### సూ: 2.4.18 భేదశ్రుతేః

శ్రుతిలో కూడా ముఖ్యప్రాణానికి, మిగతా ఇంద్రియాలకు వ్యత్యాసం వినబడుతున్నదని సూత్రార్థం.

ప్రజాపతి సంతానమైన దేవతలు (శాస్త్ర సమ్మతమైన జ్ఞానమునకు సంబంధించిన సాత్త్విక ఇంద్రియ వృత్తులు), అసురులు (పాప వృత్తులు) ఒకరిపై ఒకరు ఆధిపత్యాన్ని సాధించటం కోసం, దెబ్బలాడుకుంటున్న సమయంలో, ఉద్గీథ గానం చెయ్యడానికి ఉపక్రమించిన ఘట్టం బృహదారణ్యకంలోను (బృ.ఉ 1.5), ఛాందోగ్యంలోను వినిపిస్తుంది (ఛా.ఉ 1.2). *"తే హ వాచమూచుః"* (ఆ దేవతలు వాగింద్రియంతో నువ్వు అసురులు నశించే విధంగా ఉద్గానం చెయ్యమని కోరుతారు. కాని అసురులు అసత్యం పల్కడంవల్ల వాక్కును నశింపజేస్తారు. అదేవిధంగా, మిగతా ఇంద్రియాలు పాపగ్రస్తులైనట్లు గ్రహించి, దేవతలు ముఖ్యప్రాణాన్ని ఉద్గానం చెయ్య మని ప్రార్థిస్తారు. ఆ ప్రకరణ సందర్భంలో *"మనో వాచం ప్రాణం తాన్యాత్మనేఽకురుత"* అని వినిపిస్తుంది (బృ.ఉ 1.5.7). ఇక్కడ ప్రజాపతి మనస్సును, వాక్కును, ప్రాణాన్నీ తన కొరకు నిర్మించుకున్నాడని, వేరుగా ముఖ్యప్రాణం యొక్క నిర్దేశం వినబడుతున్నది. కాబట్టి, ముఖ్యప్రాణం వాగాది ఇంద్రియములకన్న భిన్న తత్త్వము కలదనే స్థిరీకరించుకోవాలి.

### సూ: 2.4.19 వైలక్షణ్యాచ్చ

ముఖ్యప్రాణానికి, మిగతా ఇంద్రియాలకు బహువ్యత్యాసం ఉన్నందు వల్ల అవి వేరుగా పరిగణింపబడాలని సూత్రార్థం.

వాగాది ఇంద్రియాలు నిద్రిస్తున్నప్పుడు కూడా ముఖ్య ప్రాణం మేల్కొనే ఉంటుంది. దేహధారణకు, దాని పతనానికి కూడా ముఖ్యప్రాణమే హేతువు అవుతున్నది. విషయాలను గ్రహించటానికే మిగతా ఇంద్రియాలు హేతువుగా పరిగణింపబడతాయి. ముఖ్యప్రాణం – ఇతర ఇంద్రియాల మధ్య ఎంతో వ్యత్యాసం (లక్షణ భేదం) స్పష్టంగా కనబడుతుంది. అందువల్ల, తత్త్వతః వాటిలో భిన్నత్వం ఉందని చెప్పబడుతున్నది.

*"త ఏతస్యైవ సర్వే రూపమభవన్"* అని ఉదహరించిన శ్రుతి పూర్వాపరాలను పరిశీలిస్తే, ముఖ్యప్రాణానికి మిగతా ఇంద్రియాలకున్న వ్యత్యాసం అర్థమవుతుంది. *"వదిష్యామ్యేవ అహమితి వాగ్దధ్రే"* (నేను మాట్లాడుతునే ఉంటాను అని వాక్ ప్రతిజ్ఞ చేసింది – బృ.ఉ 1.5.21) ఈ విధంగా ఉపక్రమించి "తాని మృత్యుః శ్రమోభూత్వా ఉపయేమే... తస్మాత్ శ్రామ్యత్యేవ వాక్" (మృత్యువు ఆ ఇంద్రియము లను పొంది వాటిని అడ్డగించెను, అందువల్ల వాక్ అలసిపోతుంది. వాగాది ఇంద్రియములన్నీ శ్రమరూపంలో మృత్యువు చేత ఆక్రమింపబడినా, ప్రాణం సంచరిస్తునే ఉంటుంది. అందువలన, *"అయం నః శ్రేష్ఠః"* , మన అందరిలో ప్రాణమే ముఖ్యమైనదని మిగతా ఇంద్రియాలు నిర్ధారిస్తున్నవని ఈ సందర్భంలో చెప్పబడింది. ఈ కారణంగా ముఖ్యప్రాణము, వాగాది ఇంద్రియాల కన్నా విలక్షణమైనదని నిర్ధారించబడుతున్నది. 'ప్రాణ' శబ్దం ఇంద్రియమనే లాక్షణికార్థంలో *"త ఏతస్యైవ రూపమభవన్, తస్మాదేత ఏతేనాఖ్యాయంతే ప్రాణాః"* అనే పైన ఉదహరించిన శ్రుతిలో (బృ.ఉ 1.5.21) చెప్పబడుతున్నట్లు గ్రహించవచ్చు.

## 9. సంజ్ఞామూర్తిక్ల్ప్త్యధికరణమ్

## సూ: 2.4.20 సంజ్ఞామూర్తిక్లృప్తిస్తు త్రివృత్కుర్వత ఉపదేశాత్

నామ–రూపాలతో జగత్ నిర్మాణం పరబ్రహ్మ యొక్క కార్యమనియే శ్రుతి తెలియజేస్తున్నదని సూత్రార్థం.

**పూర్వపక్షి:**

పరమాత్మ జగత్ సృష్టికి ఉపక్రమించే ముందు తేజో–బన్నాదులను సృజించినట్లు, తదుపరి త్రివృత్కరణ ప్రక్రియ జరిగినట్లు శ్రుతి ఇలా వినబడుతున్నది: *"సేయం దేవత ఐక్షత హంత అహ మిమాస్తిస్రో దేవతాః అనేన జీవేన ఆత్మనాను ప్రవిశ్య నామరూపే వ్యాకరవాణీతి. తాసాం త్రివృతం త్రివృతం ఏకైకాం కరవాణీతి"* (నేను ఈ మూడు దేవతలయందు జీవుడనే నా ఆత్మతో ప్రవేశించి నామ రూపము లతో విభజన చేస్తాను – ఛా.ఉ 6.3.2, 6.3.3.). అయితే, ఇక్కడ ప్రస్తావించిన నామ రూప వ్యాకరణ, పరబ్రహ్మ వలన కలిగిందా లేక దాని కర్త జీవుడా అనే సందేహం కలుగుతున్నది. లోక వ్యవహారంలో నేను శత్రుసైన్యంలో ప్రవేశించి పరిశీలిస్తానని ప్రభువు గూఢచారులు చేసే కార్యాన్ని తనపై ఎలా ఆరోపించుకుంటాడో, అలాగే పరమాత్మ జీవకర్తృత్వమైన వ్యాకరణను తనమీద ఆరోపించుకొని, ఉత్తమ పురుష ప్రయోగంలో 'వ్యాకరవాణి' అని చెయ్యవచ్చును. అంతేకాదు, ఘటశరావాదిరూపాలకు అనేక నామాలు కల్పించి చేసే ఏర్పాటుకు జీవుడే కర్తగా భావించబడుతున్నాడు. అందువల్ల, జగత్తులో నామ–రూప వ్యాకరణము జీవుడి వల్లే జరిగిందని తోస్తున్నది.

**సిద్ధాంతం:**

త్రివృత్కరణ పరమేశ్వరుని వలన జరిగిన కార్యమనే నిర్ధారించబడుతున్నది. తేజస్సును, జలమును, పృథివిని (తేజోఽబన్నాదులను) సృష్టించిన ఆ పరమేశ్వరుడే అగ్ని, ఆదిత్యుడు, చంద్రుడు ఇత్యాది నామాలతో జగత్ యొక్క రూప కల్పన చేసినట్లే, కుశ–పలాశాదులకు, వృక్షాలకు, మృగాలకు, మనుష్యాది జాతులకు సృష్టికర్త అని శ్రుతి తెలియజేస్తున్నది. *"సేయం దేవతా ఐక్షత"* అని ఉపక్రమించి ఆ దేవతే వ్యాకరవాణి అంటూ తనే సృష్టికర్త–వ్యాకర్త అయినట్లు తెలుస్తున్నది. నదులు, పర్వతాలు, సముద్రాలను వ్యాకరణము చేసే శక్తి, సామర్థ్యం పరమాత్మలోనే ఉన్నట్లు గ్రహించాలి. అదీకాక, పరమాత్మకన్న భిన్నమైన జీవుడు లేదు కదా! ఇదే *"జీవేన ఆత్మనానుప్రవిశ్య"* (నేనే జీవాత్మరూపంలో ప్రవేశించి) అని శ్రుతిలో వినిపిస్తున్నది. జీవత్వం ఉపాధివలన లభిస్తున్నది. అందువల్ల నామ–రూప వ్యాకర్త పరమాత్మ అనే గ్రహించాలి. *"ఆకాశో హ వై నామ నామరూప యోర్నిర్వహితా"* అని పలుకుతున్న ఛాందోగ్యశ్రుతి (ఛా.ఉ 8.14.1), తదితర ఉపనిషద్వాక్యాలు పరబ్రహ్మమే నామ రూపములతో ఈ జగత్కల్పన, వ్యాకరణము చేసినట్లు నిర్ధారిస్తున్నవి.

**త్రివృత్కరణ ప్రక్రియ:**

త్రివృత్కరణ ప్రక్రియ సృష్టికి నాందిగా, నామ–రూప విభజనకు ముందే జరిగినట్లు శ్రుతివల్ల తెలుస్తున్నది. నామ–రూపాలు భౌతికమైనవి. కాబట్టి, మహా భూతాలు వాటికి ముందే సృష్టింపబడి ఉండాలి. త్రివృత్కరణం చేసి తదనంతరం పరబ్రహ్మ, స్థావర–జంగమాల యొక్క నామ–రూప వ్యాకరణం జరిపినట్లు గ్రహించ వచ్చు. త్రివృత్కరణ ఎలా జరిగిందో శ్రుత్యాధారంగా ఇలా వివరించవచ్చు.

పృథివీ–అప్–తేజస్ అనే మూడు భూతాలలో మొదట ఒక్కొక్క దానిని రెండేసి సమ భాగాలుగా చేసి, ఆ తరువాత ఆ మూడింటి యొక్క మూడు సమ భాగాలను వేరుగా ఉంచడమైంది. మిగతా అర్ధ భాగాలను వేరు వేరుగా రెండేసి సమ భాగాలు చేసి, వాటిని ప్రతీ భూతాంశము యొక్క అర్ధ భాగానికి కలపడం జరిగింది. ఈ ప్రక్రియను ఒక ఉదాహరణతో ఇలా చెప్పవచ్చు.

తేజో భూతాన్ని రెండు సమభాగాలుగా చేసి, ఒక భాగాన్ని జలం యొక్క అర్ధ భాగానికి, మరొక దానిని పృథివి

యొక్క అర్ధ భాగానికి కల్పడం జరుగుతుంది. అదే విధంగా పృథివీ–జలాంశాలను కల్పడం వల్ల మూడు భూతాల భాగాలలోను ఇతర భూతాల యొక్క అంశం కలుస్తూ త్రివృత్కరణ జరిగినట్లు తెలుస్తున్నది.

సృష్టిక్రమంలో పృథ్వ్యాపస్తేజస్సులు మూడు వేరువేరుగానే సృష్టింపబడ్డాయి, కాబట్టి ఆ భూతతన్మాత్రలు అలాగే ఉంటాయి. అయితే, అగ్ని–ఆదిత్య–చంద్ర–విద్యుత్తులలో త్రివృత్కరణం జరిగినట్లు శ్రుతి వల్ల తెలుస్తున్నది: *"యదగ్నే రోహితం రూపం తేజస్తద్రూపం, యచ్ఛుక్లం తదపాం యత్ కృష్ణం తదన్నస్య"* (అగ్నిలో ఉన్న ఎర్రని రూపం తేజస్సుది, తెల్లని రూపం జలానిది, నల్లనిది పృథివీ రూపము– ఛా.ఉ 6.4). ఒకే రూపంతో వ్యాకరణ జరిగింది కాబట్టి, దానికి వేరుగా అగ్ని అనే నామం ఏర్పరచబడింది. ఇదే విధంగా ఆదిత్య, చంద్రమస–విద్యుదాదుల నిర్మాణం త్రివృత్కరణంలో జరిగినట్లు అన్వయించుకోవాలి. *"ఇమాస్తిస్రోదేవతాస్త్రివృత్ త్రివృత్ ఏకైకా భవతి"* (ఛా.ఉ 6.3.4). ఈ శ్రుతి వలన భౌతిక సృష్టిలో పృథివీ–అప్–తేజో దేవతలలో ఒక్కొక్క దేవత త్రివృత్–త్రివృత్‌గా కల్పింపబడినట్లు తెలుస్తున్నది. త్రివృత్కరణ పరమాత్మ వలన జరిగింది, కాబట్టి ప్రజాపతిగాని, తదితర జీవులు (పురుషులు) గాని నామ–రూప వ్యాకరణకు కర్తలుకారని నిర్ధారింపబడుతున్నది.

తేజోఽబన్నాదులు బాహ్యప్రపంచంలో ఎలా త్రివృత్కరణలో రూపొందించ బడ్డాయో, ఈ శరీరంలో కూడ మరోవిధంగా త్రివృత్కరణం పొందుతూ, మాంసాది కార్యరూపం దాలుస్తాయని సూత్రకారులు ఈ క్రింది సూత్రంలో విశదీకరిస్తున్నారు.

## సూ: 2.4.21 మాంసాది భౌమం యథా శబ్దమితరయోశ్చ

శరీరంలో ఉన్న మాంసాదికం కూడా పృథివికి సంబంధించినదే. అదీ మూడు విధాలుగా (శ్రుతిలో సూచించినట్లు) మారుతుంది. ఆపస్తేజాల యొక్క త్రివృత్కరణం కూడా శరీరంలో జరుగుతుందని సూత్రార్థం.

త్రివృత్కృతమైన పృథివి నుండి, ప్రాణులు తింటున్న అన్నాదుల నుండి మాంసాది కార్యం రూపొందుతున్నట్లు శ్రుతిలో ఇలా వినిపిస్తున్నది: *"అన్నమశితం త్రేధా విధీయతే, తస్య యో స్థవిష్ఠోధాతుః తత్ పురీషం భవతి, యో మధ్యమః తత్ మాంసం, యో ఽణిష్ఠః తత్ మనః"* (శారీరుడు భుజిస్తున్న అన్నంలో స్థూలమైనది పురీషరూపంలో బయటకు పోతుంది. మధ్యమమైనది శరీరంలో మాంసరూపంలో పెరుగుతుంది. సూక్ష్మమైనది మనస్సుగా మారుతుంది – ఛా.ఉ 6.5.1). అదేవిధంగా అప్ తేజస్సులు, త్రివృత్కృతమై శరీరంలో మరోవిధంగా కార్యరూపం దాలుస్తాయి. జలము మూత్రంగాను, రక్తంగాను, ప్రాణంగాను పరిణామం చెందితే, తేజస్సు ఎముకలు, వాటిలో తైలం–మజ్జ, వాక్‌గా రూపొందుతుంది. ఈ విధంగా శరీరంలో జరిగే త్రివృత్కరణలో, ఒక్కొక్క మహాభూతం మూడు విధాలుగా మారి పురుషరూపం దాలుస్తున్నది.

**ఆక్షేపం:**

పృథివ్యాపస్తేజస్సులు వాటి నుండి పుట్టిన భౌతికాలు కూడా త్రివృత్కృతమై ఒకే పదార్థమవుతున్నట్లు, ఏ విశేషం లేకుండా శ్రుతిలో ఇలా విన్పడుతున్నది: *"తాసాం త్రివృతం త్రివృత మేకైకా మకరోత్"* , అందువల్ల శరీరంలో జరుగుతున్న ఈ కార్యము తేజస్సుది, ఈ కార్యము పృథివికి సంబంధించినది, ఇది జలం యొక్క కార్యమని ఎలా నిశ్చయించి చెప్పబడుతున్నది? ఈ ఆక్షేపణకు సమాధానంగా క్రింది సూత్రం చెప్పబడింది:

## సూ: 2.4.22 వైశేష్యాత్తు తద్వాదస్తద్వాదః

పృథివీ–ఆపస్–తేజస్సుల కార్యాలను అధిక భాగాన్ని బట్టి నిర్ణయించి చెప్పడమైనదని సూత్రార్థం.

సూత్రంలో ఉన్న 'తు' శబ్దంతో ఆక్షేపపూర్వకమైన దోష నివృత్తి చేయ బడుతున్నది.

త్రివృత్కరణంలో ఒక్కటిగా చేయబడినా ఏ భూతము యొక్క అంశము అధికంగా గోచరమవుతున్నదో, దాని

ప్రకారము ఇది ఈ భౌతికాంశము యొక్క కార్యమని నిర్ధారించబడుతున్నది. అగ్నిలో తేజో భాగం అధికంగా ఉంది కాబట్టి, అది దాని విశేషధర్మం. అలాగే రక్తంలోనూ జల భాగం ఎక్కువగా కనబడుతున్నది.

మూడు పేటలతో కూర్చబడ్డ తాడు ఒక్కటే అయినా, దేని అంశం అధికంగా ఉంటే దానిని బట్టి లోకవ్యవహారంలో ప్రసిద్ధమవుతున్నది. అందువల్ల త్రివృత్కరణం జరిగినా, భూత–భౌతికమైన తేజోఽబన్నాదులకు సంబంధించిన కార్యాలలో ఇది తేజస్సుకు సంబంధించినది, ఇది పృథివి సంబంధమైనది, ఇది జలసంబంధమైనదని విశేషంగా చెప్పడం వీలవుతుంది.

*సూత్రంలో 'తద్వాదస్తద్వాదః'* అనే ద్విరుక్తి అధ్యాయ సమాప్తిని సూచిస్తున్నది.

# 3.

# సాధనాధ్యాయము – ప్రథమపాదము



## 1. తదంతరప్రతిపత్త్యధికరణమ్

### సూ: 3.1.1 తదంతర ప్రతిపత్తౌ రంహతి సంపరిష్వక్తః ప్రశ్ననిరూపణాభ్యామ్

జీవుడు మరో దేహాన్ని పొందటం కోసం దానికి మూలమైన భూత సూక్ష్మాల తోనే వెళ్తాడని సూత్రార్థం.

**పూర్వపక్షి:**

బృహదారణ్యకోపనిషత్తులో మరణాసన్న స్థితిలో వాగాదింద్రియాలు మనస్సులో చేరితే తరువాత ప్రాణాలన్నీ హృదయంలో కలియగా, మరో ఉపాధి దొరికిన వెంటనే తృణజ లూకాక్రిమి రీతిలో జీవుడు ఈ శరీరాన్ని వదలి, కొత్తదీ శ్రేయస్కరమైనదీ ఐన మరో శరీరాన్ని ధరిస్తాడని ఇలా చెప్పడమైంది: *"అథైన మేతే ప్రాణా అభిసమాయంతి"* (బృ.ఉ 4.4.1), తదనంతరం *"అన్యన్నవతరం కళ్యాణతరం రూపం కురుతే"* (బృ.ఉ 4.4.4). అనగా మనో వృత్తులతోను, జన్మాంతర సంస్కారం తోను మరో దేహంలో ఈ జీవుడు ప్రవేశించినప్పుడు, పూర్వదేహం యొక్క సూక్ష్మ భూతాలతో సహా వెళ్తాడా అవి లేకుండా వెళ్తాడా? అనే సందేహం కలుగుతున్నది. శరీర ధారణకు మూలమయ్యే సూక్ష్మభూతాలు కొత్త శరీరంలో ఉండనే ఉంటాయి కాబట్టి వాటితో సహా వెళ్లే అవసరం ఉండదనే అనిపిస్తున్నది. అదీ కాక, శ్రుతిలో "స ఏతాస్తేజో మాత్రాః సమభ్యాదదానః" (బృ.ఉ 4.4.1) అని చక్షురాది ఇంద్రియ తేజో మాత్రలతోనే వెళ్లిపోతాడు అని వినిపిస్తున్నది. పంచభూత మాత్రల ప్రస్తావన లేదు.

**సిద్ధాంతం:**

ముందు ఉదహరించిన శ్రుతిలో ఈ విషయం చెప్పకపోయినా, పంచాగ్ని విద్యలో మనుష్యులు ఎలా పుడుతున్నారు అనే ప్రశ్నకు సమాధానంలో ఛాందోగ్యంలో ఈ విషయంపై చర్చ జరిగింది. శ్వేతకేతువు అనే వటువుని ప్రవహణుడనే రాజు ఐదు ప్రశ్నలు అడుగుతాడు. శ్వేతకేతువుకి వాటి సమాధానాలు తెలియక తండ్రి (గౌతముణ్ణి) అడుగుతాడు. తండ్రికీ ఐదు ప్రశ్నలకూ సమాధానాలు తెలియకపోతే, ఇద్దరూ ప్రవహణుని వద్దకు పోయి వాటికి సమాధానాలు చెప్పి విద్యాబోధ చెయ్యమని కోరుతారు. రాజు అడిగిన మొదటి ప్రశ్న *"వేత్థ యథా పంచమ్యామాహుతావాపః పురుషవచసో భవంతి"* (ఐదవ ఆహుతిలో మానవ జన్మ – పురుషాకృతి ఎలా వస్తుందో చెప్పగలవా? – ఛా.ఉ 5.3.3) ఈ సందర్భంలో జరిగిన సంభాషణలో రాజు, శ్వేతకేతువుకూ—వాని తండ్రికే పంచాగ్నుల క్రమాన్ని (ద్యు—పర్జన్య— పృథివీ—పురుషాగ్ని —యోషితాగ్ని అనే ఐదు అగ్నులను చెప్పి) వాటిని అగ్ని స్వరూపంగా పరమాత్మను ఉపాసన చెయ్యాలని బోధిస్తాడు.

మరణానంతరము ద్యులోకానికి ఉదకంతో సహా వెళ్లిన జీవుడు, క్రమంగా పర్జన్యాదుల ద్వారా మళ్లీ మనిషిగా జన్మిస్తాడు. ఆపోమాత్రమూలంతో మానవ జన్మ జరుగుతుంది. కాబట్టి, భూత సూక్ష్మాలను ఈ జీవుడు మరణానంతరం తనతోనే తీసుకొని వెళ్తాడు.

### సూ: 3.1.2 త్ర్యాత్మకత్వాత్తు భూయస్త్వాత్

*"పంచమ్యామాహుతావాపః పురుషవచసో భవంతి"* అని శ్రుతిలో ఆపశ్శబ్దం (ఉదకం) మాత్రమే వినిపిస్తున్నది. కాని, అన్ని సూక్ష్మభూతాలతోను అని ఎలా నిర్ణయిస్తున్నారు?

జలం త్రిభూతాత్మకం అని త్రివృత్కరణ ప్రక్రియలో చెప్పబడింది. జలంతో పాటే మిగతా పృథ్వీ తేజస్సులు దేహారంభంకాలు అవుతాయి. అంతేకాదు, దేహంలో జల భాగం ఎక్కువగా ఉంటుంది, కాబట్టి *“ఆపః పురుషవచసః”* అని చెప్పబడింది. దేహబీజాలైన శుక్ర–శోణితములలో కూడా జలభాగమే ఎక్కువగా ఉంటుంది. దేహారంభానికి కర్మ నిమిత్తకారణం. కర్మకాండలో ఉదకాది ద్రవ్యాలు ఎక్కువగా వాడడం జరుగుతుంది. అందువల్ల జలం దేహారంభకం అని వర్ణించినా, మూడు సూక్ష్మభూతాలను దేహ ఆవిర్భావానికి మూలమని గ్రహించాలి.

## సూ: 3.1.3 ప్రాణగతేశ్చ

పంచాగ్ని ఉపాసకులు దక్షిణమార్గంలో (చంద్రయాన మార్గం) ఉత్క్రమిస్తా రని చెప్పనందు వల్ల, దక్షిణ మార్గగాములకే సూక్ష్మభూతములతో మరణానంతరము వెళ్లడం ఉంటుందా? లేక ఉత్తర మార్గంలోను, అధోమార్గంలోను పోయినవాళ్లు కూడా భూత సూక్ష్మాలతో వెళ్లడం జరుగుతుందా అనే సందేహం కలుగుతుంది.

జీవుడు దేహాంతరం పొందేటప్పుడు *“తం ఉత్క్రామంతం ప్రాణోఽనూత్క్రామతి ప్రాణమనూత్క్రామంతం సర్వే ప్రాణాః అనూత్క్రామంతి”* అని శ్రుతి (బృ.ఉ 4.4.2) ప్రాణాల ఆశ్రయం లేకుండా లేచి వెళ్లటం అనేది కుదరదు కాబట్టి ప్రాణాన్ని అనుసరించే అన్ని సూక్ష్మభూతాలు వెళ్లిపోతాయి.

## సూ: 3.1.4 అగ్న్యాదిగతిశ్రుతేరితి చేన్న భాక్తత్వాత్

వాగాదులు అగ్న్యాదులను చేరుతాయి కాబట్టి ప్రాణాలు జీవునితో వెళ్లవు అని చెప్పటం కుదరదు, కారణం అగ్న్యాది గమనం గౌణంగానే సూచింపబడిందని సూత్రార్థం. *“యత్రాస్య పురుషస్య మృతస్య అగ్నిం వాగాప్యేతి, వాతం ప్రాణః”* (బృ.ఉ 3.2.13) అనే శ్రుతిలో మరణించిన పురుషుని వాక్ అగ్నిని, ప్రాణము వాయువుని చేరుతుందని విన్పిస్తున్నది. అందువల్ల, వాగాది ఇంద్రియాలు అగ్నిని చేరుతుంటే, మరి ప్రాణాలు–ఇంద్రియాల యొక్క ఉత్క్రాంతి ముందు సూచించినట్లు ఎలా జరుగుతుంది? వాగాదులు వారి వారి అధిష్ఠాన దేవతలను చేరుకుంటాయని గౌణంగా సూచింప బడింది. అదే విధంగా కేశాలు వృక్షాలను, లోమాలు ఓషధుల్ని చేరుతాయని శ్రుతిలో గౌణంగానే సూచింపబడింది(బృ.ఉ 3.2.13). ప్రాణమనే ఉపాధి లేకపోతేదేహాంతరంలో గమనమే ఉండదు. అందువల్ల అన్ని ప్రాణాలూ జీవునితోనే ఉత్క్రమిస్తాయి.

## సూ: 3.1.5 ప్రథమేఽశ్రవణాదితిచేన్న తా ఏవ హ్యుపపత్తేః

**సంశయం:**

శ్రుతిలో పంచగ్నుల వరకు అప్ (ఉదకాలు) ప్రసక్తే లేదు. ప్రథమాగ్నిగా ద్యులోకమే శ్రుతిలో ప్రస్తావించబడింది. *“అసౌ వావ లోకో గౌతమాగ్నిః... తస్మిన్నే తస్మిన్ అగ్నౌ దేవాః శ్రద్ధాం జుహ్వతి”* (ఛా.ఉ 5.4.1, 5.4.2.). ఓ గౌతమా! ఆద్యులోకమే అగ్ని, దానిలో దేవతలు శ్రద్ధను హోమం చేస్తారనే వినిపిస్తున్నది. అందువల్ల, ఉదకాలు పురుషత్వాన్ని (మానవజన్మను) పొందుతాయని చెప్పటం యుక్తం కాదనిపిస్తున్నది.

**సమాధానం:**

*“శ్రద్ధా వా ఆపః”* అని వైదిక ప్రయోగం ఉంది. అందువల్ల దేహబీజాల సూక్ష్మత్వాన్ని, ఉదకరూపంలో బాహుల్యాన్ని బట్టి చెప్పటం కుదురుతుంది. అదీకాక, పుణ్యకర్మ చేయడానికి ఉదకం శ్రద్ధను యజమానిలో కలుగజేస్తుంది అని కూడా శ్రుతి వాక్యం ఉంది. *“అపో హస్మై శ్రద్ధాం సంనమంతే పుణ్యాయ కర్మణే”*.

## సూ: 3.1.6 అశ్రుతత్వాదితిచేన్నేష్టాదికారిణాం ప్రతీతేః

**సంశయం:**

పంచమాహుతిలో పురుషాకారం పొందితే పొందవచ్చు. కాని ఉదకాలను చెప్పినట్లుగా జీవులని స్పష్టంగా శ్రుతిలో లేదు. అందువల్ల *"రంహతి సంపరిష్వక్తః"* అని జీవులను ఉద్దేశించి చెప్పినదని భావించటం యుక్తం కాదు కదా?

**సమాధానం:**

దానధర్మాలు, ఇష్టాపూర్తాలు చేసేవారు, పితృయాన మార్గంలో చంద్రలోకం చేరుకుంటారనే శ్రుతిలో విన్పిస్తున్నది. *"అథయ ఇమే గ్రామ ఇష్టాపూర్తే దత్త మిత్యుపాసతే తే ధూమ మభిసంభవంతి"* (ఛా.ఉ 5.10.4) *"ఆకాశాత్ చంద్రమసమేష్రాజా"* (ఛా.ఉ 5.4.2). ఇష్టాపూర్తాలు చేసినవారు ధూమాది మార్గం ద్వారా ఆకాశం నుండి చంద్రలోకం చేరుకుంటారు. శ్రౌత కర్మలు ఉదకం, పాలు, పెరుగు ఇత్యాది ద్రవ పదార్థాలతోనే చెయ్యవలసి ఉంటుంది. జీవులు ఆహుతిమయమైన జలాలతో కలిసి స్వకర్మఫలాన్ని అనుభవించటానికి దేహాంతరంలో వెళ్తారని చెప్పటమే యుక్తం.

## సూ: 3.1.7 భాక్తం వానాత్మవిత్త్వాత్తథాహి దర్శయతి

**ప్రశ్న:**

ఇష్టా పూర్తాలు చేసినవారు కర్మఫలానికి ఈ దేహం విడచి వెళ్తారని చెప్పటం ఎలా సాధ్యం?

**సమాధానం:**

*"ఏష సోమోరాజా తద్దేవానామన్నం తం దేవా భక్షయంతి"* (ఛా.ఉ 5.10.4). దేవతలకు చంద్రుడు అన్నం. వానిని దేవతలు భక్షిస్తారు అని దీని అర్థం. ఇష్టాపూర్తాలు చేసిన వారికి చంద్రగమనం ఉంటుంది. వారు దేవతలకు ఉపభోగం అవుతారు అని సమన్వయించుకొని, దేవతలు వాళ్లను అన్నాదులు తిన్నట్లు భక్షిస్తారు అని భావించరాదు. శ్రుతిలో కూడ *"న హ వై దేవా అశ్నంతి న పిబంతి, ఏత దేవామృతం దృష్ట్వా తృప్యంతి"* (ఛా.ఉ 3.6.1) అనే వినబడుతున్నది (దేవతలు దానిని తినరు, త్రాగరు. అమృతంగా భావించే తృప్తి పడతారు).

అయితే, ఆత్మవేత్తలు కానివారు దేవతలకు ఉపభోగ్యులౌతారనే శ్రుతిలో విన్పిస్తున్నది. *"అథ యోఽన్యాం దేవతాం ఉపాస్తేఽన్యోఽసావన్యోఽహమస్మీతి న స వేద యథా పశురేవం స దేవానామ్"* (బృ.ఉ 1.4.10). ఈ లోకంలో యాగాది కర్మల చేత, ఇష్టా–పూర్తాది పుణ్యకర్మల చేత దేవతలకు ప్రీతి కల్గిస్తున్నవాడు పశువులా దేవతలకు ఉపకరిస్తున్నాడు, వాళ్లపై ఆధారపడి ఉంటాడని ఈ శ్రుతి సూచిస్తున్నది.

ఇష్టాపూర్తాలు చేసేవారు, ఆత్మజ్ఞాన విహీనులు. పంచాగ్ని విద్యావేత్తలు, ఇష్టా పూర్తాలు చేసే వారి కన్నా ఉత్తమ ఫలాన్నే పొందుతారని ప్రకరణాన్ని బట్టితెలుస్తున్నది. ఇష్టాపూర్తాది కర్మలు చేసినవారు చంద్రలోకభోగం అనుభవించి తిరిగి ఇహలోకం వస్తారు. *"స సోమలోకే విభూతిమనుభూయ పునరావర్తతే"* (ప్ర.ఉ. 5.4). అయితే, సత్కర్మలతో ప్రాప్తించిన చంద్రలోక భోగం ఏవిధమైన ఫలాన్నిస్తుందో మరో శ్రుతి ఇలా సూచిస్తున్నది. *"అథ తే శతం పితౄణాం జితలోకానామానందాః స ఏకః కర్మదేవానా మానందో యే కర్మణా దేవత్వమభిసంపద్యంతే"* (ఈ లోకాన్ని జయించి చంద్రలోకం చేరిన పితృదేవతలకన్న నూరురెట్లు అధికమైన ఆనందాన్ని, ఇష్టాదికర్మలతో దేవత్వం పొంది, దేవతలతో కలిసి ఉండేవారు పొందుతారు– బృ.ఉ 4.3.33). ఈ విధంగా శ్రౌతాది సత్కర్మలు చేసిన మానవులు, చంద్రలోకగమనం చేసి కర్మదేవతలకు లభించే ఫలాన్ని అనుభవించి, తిరిగి ఇహలోకానికి వస్తారని ప్రస్తావించటం జరిగింది.

## 2. కృతాత్యయాధికరణమ్

## సూ: 3.1.8 కృతాత్యయేఽనుశయవాన్దృష్టస్మృతిభ్యాం యథేతమనేవం చ

ఈ అధికరణంలో ఆత్మవేత్తలు, ఉపాసకులు కానివారి యొక్క కర్మఫల ఉపభోగం ఏ విధంగా ఉంటుందనే విషయంపై ముఖ్యంగా చర్చ జరిగింది. మరణా నంతరం ఈ జన్మలో ఇష్టాపూర్తాది కర్మల వలన చంద్రలోక ప్రాప్తిని పొందినవారు మళ్లీ ఈలోకానికి ఎలా వస్తారు? జన్మఎత్తి మరణపర్యంతం సుఖ–దుఃఖాలను అనుభ వించినా కర్మఫలశేషం ఉంటుందా? ఏ కర్మఫలం వల్ల ఎటువంటి జన్మ లభిస్తుంది, ఇట్టి ప్రశ్నలకు భాష్యకారులు విస్తృతంగా చర్చించి సమాధానాలు ఇవ్వటం జరిగింది.

**పూర్వపక్షి:**

చంద్రలోకంలో ఎంతవరకు సుకృతఫలం అనుభవించాలో అంతవరకు ఉండి తదనంతరం ఇష్టా–పూర్తాదులు చేసుకున్నవారు ఏ మార్గంలో అక్కడకు వెళ్లారో, అదే మార్గంలో గాని, మరో మార్గంలో గాని ఇహలోకానికి తిరిగి వస్తారు. శ్రుతిలో ఈ విధంగా ఆరంభంచి *"తస్మిన్ యావత్సంపాత ముషిత్వా అథ ఏతమేవ అధ్వానం పునః నివర్తంతే యథేతం"* (ఛా.ఉ 5.10.5). ఆ తరవాత *"రమణీయ చరణా బ్రాహ్మణాది యోనిమాపద్యంతే, కపూయచరణాః శ్వాది యోనిమ్"* (మంచి కర్మ ఫలితంగా ఉన్నత కులంలోను చెడు కర్మ ఫలితంగా శునకాది జన్మను పొందుతారు) అని వినిపిస్తున్నది. అయితే, చంద్రలోకంలో కర్మఫలం పూర్తిగా అనుభవించిన తరవాతనే తిరిగివస్తారా? లేక కొంత కర్మశేషంతో తిరిగి రావటం జరుగుతుందా? చంద్రలోకప్రాప్తి సుకృతం వల్ల కాబట్టి ఆ ఫలాన్ని పూర్తిగానే అనుభవించాలని తోస్తున్నది. *"యతత్సంపాత ముషిత్వా"* అనే శబ్దం ఎంత ఆర్జించేరో, అంత వరకు అనే సూచిస్తున్నది. మరోశ్రుతి కూడా *"తేషాం యదా తత్పర్యవైతి"* (బృ.ఉ 6.2.16) అని ఇష్టాపూర్తాది కర్మ ఫలభోగం పూర్తి అయ్యే వరకు అనే వినిపిస్తున్నది. మరో శ్రుతి కర్మను దేనినీ నిర్ధారించకుండా సామాన్యంగా ఇలా ఉంది: *"ప్రాప్యాంతం కర్మణస్తస్య యత్కించేహ కరోత్యయం తస్మాల్లోకాత్ పునరేతి అస్మైలోకాయ కర్మణే"* (కర్మఫలాన్ని పూర్తిగా అనుభవించే మళ్లీ ఇహలోకంలో జన్మనెత్తి కర్మ అనుభవించటానికి తిరిగి వస్తారు –బృ.ఉ 4.4.6). జన్మకు కారణం కర్మ. అందువల్ల ఇహజన్మ కలిగిందంటే కర్మశేషం ఉందనే భావించాలి. అయితే మరణంతో పరలోక గతి వల్ల ఆ కర్మఫలం భోగం అయిపోవాలి కదా? కొంతపోయి కొంత ఉండి పోదు కదా? దీపపు కాంతి ఉన్నప్పుడు దగ్గరలో ఘటం ఉన్నా, మరేది ఉన్నా కనబడుతుంది. ఈ విషయంలో తారతమ్యం ఉండబోదు.

**సిద్ధాంతం:**

నేతిగిన్నెలో నెయ్యి తీసివేసినా, కాస్త జిడ్డు గిన్నెకు అంటుకుని ఉన్నట్లే చంద్ర లోక భోగం అనుభవం అయినా, కొంత కర్మశేషం ఉండటంచే (అనుశయంతో)తిరిగి ఇహలోకానికి దిగి వస్తారు. పుణ్యకర్మల ఆచరణ వల్ల ఉత్తమ కులజాతకులు గాను, దుష్కృతాలు చేసిన వారు శునక–సూకరాది జన్మలు ఎత్తుతారని సూచించడమైనది.

కారణం లేకుండా ఆకస్మికంగా ఎట్టి సుఖదుఃఖ భోగం ఉండదు. అందువల్ల జన్మను బట్టి అనుశయం ఉందనే భావించాలి. స్మస్మృతిలో కూడా తమ తమ విధ్యుక్త ధర్మాలను ఆచరించిన వారు కూడా మరణానంతరం కర్మశేషంతో విశిష్ట రూప ఆయుర్విద్యా, ధన, మేధాది గుణాలతో మళ్లీ జన్మిస్తారని చెప్పబడింది. *"వర్ణా ఆశ్రమాశ్చ స్వకర్మ నిష్ఠాః ప్రేత్యఫల మనుభూయ శేషేణ విశిష్టదేశజాతికులరూపాయుః శ్రుత వృత్త విత్తసుఖ మేధసో జన్మప్రతిపద్యంతే"* (గౌ.ధర్మసూ. 2.2.29). ఇది ఇలా ఉన్నా, అనుశయం (అవశేషం) అనే విషయంలో భేదాభిప్రాయాలు విన్పిస్తున్నవి.

స్వర్గఫలం అనుభవించి కొంత అవశేషంతో తిరిగి వచ్చి, మళ్లీ మరో హీనమైన జన్మ ఎత్తటం శాస్త్ర విరుద్ధమని కొందరివాదన. ఏ సుకృతం చేత స్వర్గానికి చేరుకొని దేవతలతో సహవాసం చేసారో, దానిలో కొంత అనుశయం ఉండ బట్టే ఉత్తమమైన జన్మ లభిస్తుంది అని చెబుతూనే, కొందరికి మాత్రం శునకాది జన్మ లభిస్తుందని చెప్పటం యుక్తం కాదు.

అటువంటి ప్రస్తావన స్వర్గఫల ప్రాతిపదికకే విరుద్ధం అని కొందరి వాదన. ఆముష్మిక ఫలం సుకృతం వల్ల లభిస్తుందంటే దాని నంతటినీ అక్కడే అనుభవించాలి. ఒక కర్మ చేత పరలోకంలోను, మరోకర్మ చేత ఇహలోకంలోను భోగం ఉంటుందనే విభాగం సమంజసం కాదని వీరి మతం.

ఒక కర్మ మరణసమయంలో ఫలం ఇవ్వటం ప్రారంభిస్తే (అభివ్యక్తమైతే) మరో కర్మ ఆ సమయంలో నశిస్తుంది (అభివ్యజింప చేస్తుంది అని చెప్పటం కష్టం). అదీకాక ఒక్కొక్క కర్మకు, ఒక్కొక్క జన్మ ఎత్తవలసి ఉంటుంది అని కూడా చెప్పబడదు. ఒక దుష్కర్మ ఫలితం శునక జన్మ అయితే, మరో కర్మఫలం తిర్యక్ జంతుజన్మ. అలాగే ఒక సుకృతానికి దేవతాజన్మ ప్రాప్తించవచ్చు. నిర్దిష్టంగా, ఒక కర్మ వల్ల ప్రాప్తించిన దేహం, ఆ దేహపాతం అయిన తరువాత మరొక కర్మ తన ఫలం ఇవ్వటం ప్రారంభిస్తుంది. అందుకే మరోజన్మ అని కూడా చెప్పటం సమంజసమా?

స్మృతిలో *"కదాచిత్ సుకృతం కర్మ కూటస్థమిహ తిష్ఠతి, మజ్జమానస్య సంసారే యావత్ దుఃఖాత్ విముచ్యతే"* (సంసారి దుఃఖంనుండి విముక్తుడయేవరకు వాని పుణ్యకర్మ కూటస్థంగా స్థిరంగా ఉంటుంది – మ.భా.శాంతి. 290.18). అంటే పాపకర్మ వల్ల కలిగే దుఃఖభోగం అయ్యే వరకు పుణ్యకర్మఫల భోగం కోసం వేచి ఉండవలసి వస్తుంది అనే భావన వ్యక్తమవుతున్నది. అదీకాక ఘోర పాపాలు చేసేవారు ఎన్నో హీన జన్మలు ఎత్తవలసి ఉంటుందని కూడా ఉదహరించబడింది.

ఈ విధంగా కర్మఫల భోగవిషయంలో బహువిధాల ప్రస్తావనలు, వాటిపై చర్చలు వినవస్తున్నవి. ఇదమిత్థంగా కర్మనూ దాని వల్ల వచ్చే జన్మనూ నిర్ధారించి చెప్పలేకపోయినా, కర్మానుశయంతో జన్మప్రాప్తి ఉంటుందనే స్థిరీకరించుకోవాలి.

సమ్యక్‌దర్శనమున్న జ్ఞానవంతులకు అన్ని కర్మలూ సమూలంగా నశిస్తాయి కాబట్టి మోక్షప్రాప్తి కలుగుతుందన్న సిద్ధాంతం నిర్వివాదాంశము. ఎవరైతే ధూమ మార్గంలో చంద్రలోకం అధిరోహించారో, కర్మశేషంతో– అనుశయంతో ఇహ లోకానికి వారు వెళ్లిన మార్గంలోకాని, వేరే మార్గంలోకాని తిరిగిరావటం జరుగుతుందనే సూత్రకారులు ఈ చర్చను వివిధకోణాల్లో పరిశీలించి సిద్ధాంతీకరిస్తున్నారు.

## సూ: 3.1.9 చరణాదితి చేన్నోపలక్షణార్థేతి కార్ష్ణాజినః

*"తద్య ఇహ రమణీయ చరణాః"* అనే శ్రుతిని కర్మఫలం అనే అన్వయించుకో నవసరం లేదు. 'చరణమ్' అనే పదానికి ఆచారం, శీలం ఇత్యాది అర్థాలు కూడా ఉన్నాయి కాబట్టి ఆచరణ, సత్‌ప్రవర్తన వల్ల మంచి జన్మ ప్రాప్తిస్తుందని చెప్పవచ్చు అని శ్రుతివాక్యాలు ఉదహరించటం జరిగింది: *"యథాకారీ యథా చారీ తథా భవతి"* (కర్మను బట్టి, ఆచరణను బట్టి ఉపభోగం ఉంటుంది – బృ.ఉ 4.4.5) అలాగే *"యాన్యనవద్యాని కర్మాణి తాని సేవితవ్యాని నో ఇతరాణి, యాన్యస్మాకం సుచరితాని తాని త్వయోపాస్యాని"* (తై.ఉ 1.11.2). ఈ శ్రుతివాక్యాలు కర్మను–ఆచారాన్ని (ప్రవర్తనను) వేరు చేస్తున్నాయి. కాని, కార్ష్ణాజినుడనే ఋషి చరణ శ్రుతి లాక్షణికం కాబట్టి అది అవరోహణగతికి కారణం కాదు. ఉపలక్షణం చేత అనుశయాన్నే (కర్మ శేషాన్నే) సూచిస్తుందని అభిప్రాయ పడుతున్నారు.

## సూ: 3.1.10 ఆనర్థక్యమితి చేన్న తదపేక్షత్వాత్

'చరణ' మనే పదంలో శీలము ముఖ్యార్థం. దానిని విడిచి లాక్షణికమైన అనుశయాన్ని ఎందుకు గ్రహించటం? ఇష్టాది కర్మ సముదాయం ప్రవర్తన, శీలము అనే వాటిపై ఆధారపడినవే కదా? *"ఆచారహీనం న పునంతి వేదాః"* ఆచారం సరిగ్గా లేనివానిని వేదాలు పావనం చెయ్యవనే స్మృతులు చెప్తున్నవి. కాని సర్వ పురుషార్థములను సాధించేది కర్మ. అందువల్ల సదాచార సహితకర్మ (శీల ఉపలక్షిత మైన కర్మ) ఉన్నతమైన జన్మ పొందటానికి కారణమని కార్ష్ణాజినుల వారి అభిప్రాయము.

## సూ: 3.1.11 సుకృతదుష్కృతే ఏవేతి తు బాదరిః

బాదరి అనే ఋషి 'చరణ' శబ్దం సుకృత–దుష్కృతాలనే వ్యక్తం చేస్తుందని అభిప్రాయం పడుతున్నారు. చరణం–అనుష్ఠానం–కర్మ ఈ మూడు పదాలు సమానార్థకాలు. అందువల్ల సదాచారం కూడా ధర్మప్రవర్తన యొక్క విశేషమే అని గ్రహించాలి. ఉత్కృష్టమైన–ప్రశంసింప దగిన కర్మలు చేస్తే మంచిజన్మ, నిందనీయమైన కర్మాచరణ వల్ల హీనమైన జన్మ లభిస్తుందని *"తద్య ఇహ రమణీయ చరణాః"* అనే శ్రుతిని సమన్వయించుకోవాలని బాదరి కూడా అభిప్రాయం వ్యక్తం చేస్తున్నారు.

## 3. అనిష్టాదికార్యధికరణమ్

### సూ: 3.1.12 అనిష్టాదికారిణామపి చ శ్రుతమ్

ఇష్టాపూర్తాది కర్మలు చెయ్యని వారికి కూడా చంద్రలోక గతి ఉంటుందని శ్రుతులు పలుకుతున్నాయని సూత్రార్థం. ఇది పూర్వపక్షి యొక్క వాదనను సూచిస్తున్న సూత్రం.

ఇష్టాపూర్తాదులు చెయ్యనివారు కూడా చంద్రలోకం చేరుకుంటారని శ్రుతి వాక్యాలు వినిపిస్తున్నవి. కౌషీతకులు *"యే వై కేచ అస్మాల్లోకాత్ ప్రయంతి చంద్రమస మేవ తే సర్వే గచ్ఛంతి"* (ఈ లోకం విడిచివెళ్ళిన వారందరూ చంద్రలోకం చేరు కుంటారు – కౌ.షీ 1.2) అనే పఠిస్తున్నారు. పంచమాహుతి లోనే మానవజన్మ కలుగుతుందని చెప్పటం వలన ( *"పంచమ్యామాహుతావాపః పురుషవచసో భవంతి"* ) మరో జన్మ ఎత్త వలసిన వాళ్లందరూ చంద్రలోకం చేరుకోవాలి. ఇష్టాది కార్యాలు చేసిన వారికి చంద్రలోకంలో భోగం ఉంటుంది, మిగతావారు ఆ భోగం లేకుండా తిరిగి వచ్చేస్తారని అన్వయించుకోవచ్చు.

### సూ: 3.1.13 సంయమనే త్వనుభూయేతరేషామారోహావరోహౌ తద్గతిదర్శనాత్

పూర్వపక్షి ప్రస్తావనను 'తు' ప్రత్యయంతో ఖండిస్తూ ఈ సూత్రం చెప్ప బడింది. ధూమమార్గంలో చంద్రలోక అవరోహణ ఇష్టాది కర్మల భోగానికి చేస్తారు. మిగతా వారంతా యమలోకం చేరి వారి దుష్కృతాలకు తగిన యమయాతన అనుభవించి, మళ్లీ ఇహలోకానికి తిరిగి వస్తారు. కర్మఫల భోగం ఉన్నంత వరకూ ఆరోహణ–అవరోహణగతులు తప్పవు. ఇదే కఠోపనిషత్తులో యమధర్మరాజు నచికేతునితో ఇలా చెప్తాడు: *"న సాంపరాయః ప్రతిభాతి బాలం ప్రమాద్యంతం విత్తమోహేన మూఢమ్, అయం లోకో నాస్తి పర ఇతి మానీ పునః పునః వశమాపద్యతే మే"* (విత్త మోహం చేత మూఢులకు పరలోకానికి సుఖంగా వెళ్లే ఆలోచన తట్టదు. పరలోకం అంటూ మరొకటి లేదనే భావంతో, మాటిమాటికి నా పాశంలో పడుతూ ఉంటారు – క.ఉ 2–6).

### సూ: 3.1.14 స్మరంతి చ

వ్యాసమహర్షి, మనువు ఇలాటి స్మృతికారులు కూడా పాపఫలభోగం, యమ లోకంలో యమధర్మరాజు అధీనంలో అనుభవించవలసి ఉంటుందని పేర్కొన్నారు.

### సూ: 3.1.15 అపి చ సప్త

నరకాలు మొత్తం ఏడని, వాటిలో రౌరవం ఒకటని పౌరాణికులువర్ణించారు. ఇష్టాపూర్తాదులు చెయ్యనివారు, దుష్కృతాలు చేసినవారు నరక గతినే పొందుతారు.

### సూ: 3.1.16 తత్రాపి చ తద్వ్యాపారాదవిరోధః

యమలోకానికంతటికీ యమధర్మరాజు అధిపతి. రౌరవాది నరకాలకు చిత్రగుప్తుడులాంటి వారు అధికారులైనా, యమరాజు అధీనంలోనే, ఏడు యమ లోకాలూ ఉంటాయి. పురాణాలలో యమ యాతనలు, పాపాలు చేసేవారు ఎలా అనుభవిస్తారో తెలియజేయబడింది.

### సూ: 3.1.17 విద్యాకర్మణోరితి తు ప్రకృతత్వాత్

పంచాగ్నివిద్యా ప్రకరణములో *"వేత్థ యథాసౌ లోకో న సంపూర్యతే"* (ఈ లోకం ఎందుకు పూర్తిగా నిండిపోదో

తెలుసునా? – ఛా.ఉ 5.3.3) అనే ప్రశ్నకు సమాధానంగా *"అథ ఏతయోః పథోః న కతరేణచ న తాని ఇమాని క్షుద్రాణి అసకృదావర్తీని భూతాని భవంతి జాయస్వ మ్రియస్వ ఇతి ఏతత్ తృతీయం స్థానం తేన అసౌ లోకో న సంపూర్యతే"* (ఛా.ఉ 5.3.8). మూడవ మార్గంలో వెళ్లే క్షుద్రజీవులు, పుడుతూ – మరణిస్తూ ఎన్నో పర్యాయములు ఇహలోకం నుంచి అధోలోకాలకు వస్తూ పోతూ ఉంటారు. అందువల్ల ఆ లోకం నిండదు.

విద్యా ఉపాసనలు చేసే సాధకులు దేవయాన మార్గంలో ఉత్తమలోకాలకు వెళ్లిపోతారని నిర్దిష్టంగా చెప్పడమైనది. ఇష్టా–పూర్తాలు చేసినవారికి పితృయాన మార్గంలో గమనము అని వేరుగా చెప్పబడింది. ఈ రెండు మార్గాలలో ప్రయాణం చేసే అధికారం లేని వాళ్లు, మాటిమాటికి జన్మలెత్తుతూ క్షుద్రమైన మూడవ మార్గ గతినే పొందుతారు.

## సూ: 3.1.18 న తృతీయే తథోపలబ్ధేః

తృతీయ మార్గంలో పలుమార్లు పుడుతూ–చస్తూ ఉండే వాళ్లకు, పంచమాహుతి ప్రసక్తే లేదు కాబట్టి వారికి మానవజన్మ ఉండదు. వారికి క్రిమి కీటకాదుల జన్మే లభిస్తుంది. వారి దేహారంభం ఇతర భూతమాత్రలతో జరుగుతుందని గ్రహించవలసి ఉంటుంది.

## సూ: 3.1.19 స్మర్యతేఽపిచ లోకే

పురాణేతిహాసాలలో పేర్కొన్న ద్రోణుడు, దృష్టద్యుమ్నుడు, సీతాదేవి ఇలా మరికొందరు అయోనిజలు (యోని సంపర్కం లేకుండా జన్మించినవారు) అనే సూచనలున్నాయి. అందువల్ల, వారి దేహధారణ అసామాన్య రూపంలో జరిగినట్లు భావించాలి. అలాగే ఒక జాతి కొంగ, రేతఃసేకం లేకుండానే గర్భం ధరిస్తుందని లోక ప్రతీతి. అందువల్ల పురుషాగ్ని–యోషితాగ్ని అనే పంచాగ్నిక్రమం అన్ని జీవులకు వర్తించేది కాదు.

## సూ: 3.1.20 దర్శనాచ్చ

ఆహుతీ సంఖ్యానియమం లేనట్లు సాక్షాత్తుగా కొన్ని క్రిమి–కీటకాల విషయంలో నిదర్శనం కనబడుతున్నది. ప్రాణి సముదాయాన్ని జరాయుజం–అండజం–స్వేదజం–ఉద్భిజ్జం అను నాలుగు భాగాలుగా విభజించారు. ఉద్భిజ్జాలు స్థావరాలు. స్వేదజాలకు స్త్రీ–పురుష జాతుల సంగమం ఉండదు.

## సూ: 3.1.21 తృతీయ శబ్దావరోధః సంశోకజస్య

*"తేషాం ఖల్వేషాం భూతానాం త్రీణ్యేవ బీజాని భవంతి అండజం జీవజముద్భిజ్జం"* అని వినిపిస్తున్న శ్రుతిలో (ఛా.ఉ 6.3.1) స్వేదజం అని వేరేగా వ్యక్తం చెయ్యలేదు కదా? స్వేదజం జలాన్ని చీల్చుకొని పుడుతుంది. ఉద్భిజ్జం భూమిని చీల్చుకొని పదుతుంది. అయితే, మొలకెత్తిన స్థావర వృక్షజాతి ప్రాణులకూ, స్వేదజలాన్ని చీల్చుకొని ఉద్భవించే క్రిమి–కీటాలకు చాలా భేదం ఉంది. కాబట్టి, స్వేదజం – ఉద్భిజ్జం అని వేరువేరుగా సూచించి, పై సూత్రంలో చెప్పబడింది. అందులో దోషం లేదు.

## 4. సాభావ్యాపత్త్యధికరణమ్

### సూ: 3.1.22 సాభావ్యాపత్తిరుపపత్తేః

**పూర్వపక్షి:**

చంద్రమండలంలో భోగం అనుభవించి తిరిగి ఇహలోకానికి మానవరూప ధారణకు ఎలా రావటం జరుగుతుందో సూచిస్తూ శ్రుతి ఇలా వినబడుతున్నది: *"అథైతమేవాధ్వానం పునర్నివర్తంతే యథేత మాకాశ మాకాశాద్వాయుం వాయుర్భూత్వా ధూమో భవతి, ధూమో భూత్వాఽభ్రం భవతి, అభ్రం భూత్వా మేఘో భవతి, మేఘో భూత్వా ప్రవర్షతి"* (ఏ మార్గంలో చంద్రలోక గమనం అయిందో, ఆమార్గాన్ని అనుసరించే ముందు ఆకాశాన్ని, ఆకాశం నుండి వాయువుని పొంది, ఆ తరవాత ధూమంగా మారి తరవాత నీటి మేఘం అయి, వర్షరూపంలో భూమి మీద పడి అన్నాదుల రూపం పొందుతాడు – ఛా.ఉ 5.10.5). అయితే ఆకాశాది స్వరూపాన్నే యథార్థంగా పొందుతాడా, లేక వాటి యొక్క సమాన రూపాన్ని పొందుతాడా అనే సంశయం కలుగుతున్నది. శ్రుతి ముఖ్యార్థాన్ని గ్రహించటం యుక్తం కాబట్టి, ఆకాశాది స్వరూపమే పొందుతూ తిరిగి రావటం జరుగుతుందనే భావించాలి.

**సిద్ధాంతం:**

చంద్రమండలంలో కర్మఫలం ఉపభోగం అయిన తరవాత, జలమయమైన శరీరం సూక్ష్మరూపంలో ఆకాశంలో లీనమయిపోతుంది. ఆ తరవాత, వాయువు వశమై ధూమరూపంలో మేఘం, ఆ తరవాత వర్షం అవటమే సంభవం. ఆకాశం విభువు, సర్వత్ర వ్యాపించి ఉంటుంది. అందువలన దానితో సమత్వాన్నే పొంది తిరిగి రావటం సాధ్యమవుతుంది.

## 5. నాతిచిరాధికరణమ్

### సూ: 3.1.23 నాతిచిరేణ విశేషాత్

**సంశయం:**

ఆకాశాది తుల్యత్వాన్ని పొందిన జీవుడు మానవరూప ధారణం చెయ్యటానికి అల్పకాలం పడుతుందా, దీర్ఘకాలం పడుతుందా?

**సమాధానం:**

ఆకాశాది సమాన రూపాన్ని పొంది, త్వర త్వరగానే ధూమమార్గ క్రమంలో తిరిగి ఈ భూమిపైకి రావటం జరుగుతుంది. *"అతో వై ఖలు దుర్నిష్ప్రపతరమ్, యో యో హ్యన్న మత్తి యో రేతః సించతి తత్ భూయ ఏవ భవతి"* అని శ్రుతిలో వినబడుతున్నది (ఛా.ఉ 5.10.6). వ్రీహ్యాది భావం నుండి నిష్క్రమణ (బయటకు రావటం) కష్టతరం. సూక్ష్మభూతాలతో దేహారంభణం జరిగే ప్రక్రియ దృష్ట్యా, అవరోహం అల్పకాలంలోనే జరుగుతుందనే నిశ్చయించుకోవాలి.

## 6. అన్యాధిష్ఠితాధికరణమ్

### సూ: 3.1.24 అన్యాధిష్ఠితేషు పూర్వవదభిలాపాత్

తిరిగి ఇహలోకం చేరేవారికి ముందు సూత్రాలలో చెప్పినట్లు, యవాది అన్న రూపాలతో సంబంధం మాత్రమే ఉంటుంది అని సూత్రార్థం.

**పూర్వపక్షి:**

వర్షరూపంలో భూమిని చేరుతున్నవారు, యవలు ఇత్యాది అన్నరూపముల యొక్క బీజములుగాను, ఓషధులు, వృక్షాలు, తిలలు, పప్పుధాన్యాల రూపంలోను పుడతారని శ్రుతిలో ఇలా విన్పిస్తున్నది: *"త ఇహ వ్రీహి యవా ఓషధి వనస్పతయః తిలా మాషా ఇతి జాయంతే"* (ఛా.ఉ 5.10.6). కర్మానుశేషంతో భూమిపైకి వస్తున్న వారు యవాది స్థావర (వృక్షసంబంధమైన) జన్మను పొంది వాటి సుఖ–దుఃఖాలను అనుభవిస్తారా లేక కేవలం వాటితో జీవించే సంబంధం మాత్రమే పొందుతారా అనే సందేహం కలుగుతున్నది. శ్రుతిలో 'జాయంతే' అని శబ్దం వినబడుతున్నది కాబట్టి ఇష్టాది కర్మలు చేసినవారు కర్మ శేషంతో (అనుశయులుగా) స్థావర జన్మ, యవాది అన్నరూపాల జన్మనే పొందవలసి ఉంటుందనే భావించాలి. అదీకాక యజ్ఞ యాగాదుల్లో పశుహింస జరుగుతుంది కదా! అందువల్ల కూడా వారికి వ్రీహ్యాది స్థావర జన్మ, శునకాది హీన జన్మలూ కలగవచ్చు.

**సిద్ధాంతం:**

కర్మశేషంతో తిరిగి వచ్చే మానవులు అన్నవ్రీహ్యాదులతో సంబంధం మాత్రమే పొందుతారు కాని స్థావర జన్మను పొందరు. స్థావరాదుల ఉపభోగం వాటితో కలిసి ఉండటం వల్ల లభిస్తుంది. రేతఃసేచనం ఇట్లాది గుణాలను సూచించడం వల్ల స్థావరత్వం కాదు అని తెలుస్తున్నది. అయితే, పాపఫలం వల్ల ఇతర జంతువులకు స్థావరజన్మ ప్రాప్తించవచ్చు. పుణ్యఫలంతో చంద్రమండలం వెళ్లి తిరిగి కర్మశేషంతో వచ్చే మానవులకు వృక్షాది జన్మ ఉండదు.

### సూ: 3.1.25 అశుద్ధమితి చేన్న శబ్దాత్

యజ్ఞ యాగాది కర్మలు హింసతో కూడినవి. పశువధ చేయటం జరుగు తుంది కాబట్టి అవి శుద్ధమైన కర్మలుకావు అని పూర్వపక్షి చేసిన ప్రస్తావన ఖండిస్తూ ఈ సూత్రం చెప్పబడింది. *"అగ్నీషోమీయం పశుమాలభేత"* (అగ్నీష్టోమీయయాగంలో పశువుని బలి ఇవ్వాలి) అనే యజ్ఞకర్మ ధర్మాచరణ భాగమని గ్రహించాలి. అది శాస్త్ర విరుద్ధం కానిది; అశుద్ధక్రియగా పరిగణించ జాలదు. ధర్మం–అధర్మం అనేవి దేశ–కాల దృష్ట్యా పరిశీలించి నిర్ణయించవలసి ఉంటుంది. సామాన్య రీతిలో *"న హింస్యాత్సర్వా భూతాని"* (ఏ ప్రాణిని హింసించకూడదు) అనే శాస్త్రం సూచిస్తున్నది. అయితే, సామాన్య శాస్త్రం వర్తించనిది అపవాదము. అపవాదరీత్యా వైదిక కర్మలో చేసిన క్రియా ఫలితంగా స్థావరజన్మ కలుగుతుందని భావించరాదు.

### సూ: 3.1.26 రేతఃసిగ్యోగోఽథ

*"యో యో హ్యన్నమత్తి యో రేతః సించతి తద్భూయ ఏవ భవతి"* (ఛా.ఉ 5.10.6). ఈ శ్రుతి వల్ల, అన్నరూపంలో యవాది ధాన్యములు, తిల, మాషాది గింజలు తినటం వల్ల రేతఃసేచన చేసే శక్తి యుక్తవయస్సులో కలిగి, తిరిగి వారి వారి రూప–గుణ విశేషాలతో సంతానప్రాప్తి ఉంటుందనే అర్థం చేసుకోవాలి. దీనినే వ్రీహ్యాది సంబంధం అని ముందు సూత్రంలో సూచింపబడింది. (సూ: 3.1.24).

### సూ: 3.1.27 యోనేః శరీరమ్

రేతస్సు యోని యందు కూడగ, శేష కర్మఫల భోగం కొరకు మరల జన్మ నెత్తటం జరుగుతుందని *"తద్య ఇహ రమణీయ చరణాః"* అనే శ్రుతిలో వినిపిస్తున్నది. వ్రీహ్యాదిరూపంలో సుఖ–దుఃఖాలు ప్రత్యక్షంగా అనుభవించటం జరగదు. అందువల్ల, వ్రీహ్యాదుల యొక్క సంబంధంతో మాత్రమే అనుశయులు ఇహలోకంలో మానవ జన్మను పొంది కర్మఫలాన్ని అనుభవించటం జరుగుతుంది.

# *3.*

# సాధనాధ్యాయము : ద్వితీయపాదము



ఈ పాదంలో సూ. 3.2.1 నుండి 3.2.10 వరకు 'త్వం' పదార్థమైన జీవాత్మ (శారీరుడు) గురించి, ఆ తరవాత సూ: 3.2.11 నుంచి 3.2.41 వరకు 'తత్' పదార్థమైన పరమాత్మ గురించి చర్చ జరిగింది. ఈ చర్చలో జీవుని అవస్థా భేదాలు (జాగ్రత్–స్వప్న– సుషుప్త్యవస్థలు) వాటి యందు జీవుడి యొక్క లౌకిక – అలౌకిక వ్యవహారం ఏ విధంగా ఉంటుందో కూడా సూచింపబడింది.

## 1. సంధ్యాధికరణమ్

### సూ: 3.2.1 సంధ్యే సృష్టిరాహ హి

(ఇది పూర్వపక్ష సూత్రం)

స్వప్నావస్థలో జీవుడు సృష్టించుకొన్న దృశ్యాలు సత్యమైనవనే శ్రుతి సూచిస్తున్నదని సూత్రార్థం.

బృహదారణ్యకోపనిషత్తులో స్వప్నావస్థలో శారీరుడి యొక్క వ్యవహార స్థితిని ప్రస్తావిస్తూ *"స యత్ర ప్రస్వపితి"* అని ఉపక్రమించి *"న తత్ర రథా న రథయోగా న పంథానో భవంతి, అథ రథాన్ రథయోగాన్ పథః సృజతే"* (జీవుడు నిద్రిస్తున్న సమయంలో స్వప్నలోకంలో రథాలు, అశ్వాలు, మార్గాలూ ఏవీ ఉండవు అయినా వాటిని తనే సృష్టించుకుంటూ వ్యవహరిస్తాడు – బృ.ఉ 4.3.10). ఇలా సృష్టించుకొన్నది పారమార్థికమైన యదార్థ సృష్టియా, లేక మాయామయమైన మిథ్యా సృష్టియా అనే సందేహం కలుగుతున్నది.

జాగ్రదవస్థకు–సుషుప్త్యవస్థకు మధ్య ఉండేది స్వప్నావస్థ. అందుకే అది సంధ్యాస్థానం అనబడుతుంది. సంధ్యాస్థానంలో జరుగుతున్న ఈ సృష్టి కూడా యదార్థమైనదే కావాలని తోస్తున్నది. శ్రుతిలో 'సృజతే' అని స్పష్టంగా వినబడుతున్నది. అంతేకాదు, ఉపసంహారంలో *"స హి కర్తా"* (అతడే కర్త) అని కూడా చెప్పబడింది.

### సూ: 3.2.2 నిర్మాతారం చైకే పుత్రాదయశ్చ

(ఇది కూడా పూర్వపక్ష సూత్రమే)

కోరికలు మనో సంకల్పంతో కలిగినట్లు స్వప్నంలో చూచే దృశ్యాలు కూడా ఆత్మసంకల్పంతో నిర్మితమైనవే అని శ్రుతిలో ఇలా విన్పిస్తున్నది: *"య ఏష సుప్తేషు జాగర్తి కామం కామం పురుషో నిర్మిమాణః"* (క.ఉ 5.8). ఇంద్రియాదులు నిద్రావస్థలో ఉండగా ఏ పురుషుడు మేల్కొని ఉండి ప్రతీ కామాన్నీ నిర్మిస్తున్నాడో అని చెప్పటం వల్ల ఆత్మే ఈ కామాలకు సృష్టికర్త అని భావించాలి. అయితే ఇక్కడ కామ శబ్దం ఇచ్ఛ (కోరిక) అనే అర్థాన్నే సూచించదు. అది పుత్రేచ్ఛను (పుత్ర–పౌత్రాదులను) సూచిస్తున్నట్లు మరో శ్రుతి వాక్యం ఉదహరించబడింది. *"శతాయుషః పుత్ర పౌత్రాన్ వృణీష్వ, కామానాం*

*త్వా కామభాజం కరోమి"* (శతాయుష్షు గల పుత్రులను, పౌత్రులను కోరుకో, ఆ కామాన్ని తీరుస్తాను – క.ఠ.ఉ 1.24).

కఠోపనిషత్తులో వినిపిస్తున్న ఈ శ్రుతి, ప్రకరణ సందర్భంగా జీవాత్మ– పరమాత్మ స్వరూపమనే నిర్దేశిస్తున్నది. ఇదే సందర్భంలో ధర్మాధర్మాలకు అతీతమైనది పరమాత్మ అని వివరిస్తూ *"తదేవ శుక్లం తద్బ్రహ్మ తదేవామృత ముచ్యతే, తస్మిన్ లోకాః శ్రితాః సర్వే తదు నాత్యేతి కశ్చన"* (అది నిర్మలమైనది, అదే బ్రహ్మ అది నాశనము లేనిది. దానిపైనే అన్ని లోకాలు ఆధారపడి ఉన్నవి. దానిని అతిక్రమించిన వారు లేరు – క.ఉ 5.8). జాగ్రదవస్థలో, పరమాత్మ సృష్టించినదంతా సత్యమైనదిగానే గ్రహిస్తున్నాము, కాబట్టి జీవాత్మ స్వప్నంలో సృష్టించుకున్నదీ యదార్థమైనదే కావాలి.

పూర్వపక్షి ప్రస్తావించిన పై రెండు సూత్రాలకు సమాధానంగా చెప్పిన సూత్రాలు ఈ విధంగా ఉన్నాయి:

## సూ: 3.2.3 మాయామాత్రం తు కార్త్స్న్యేనానభివ్యక్తస్వరూపత్వాత్

అభివ్యక్తమైనదేదీ నిజంగా ఉండనందు వల్ల స్వప్నంలో సృష్టించుకున్నది కేవలం మాయా మాత్రమే అని సూత్రార్థం.

స్వప్నం చూసే దేహం ఎక్కడ ఉంటుందో ఆ ప్రదేశంలో రథాదులు, మార్గాలు అలాంటివి యదార్థ రూపంలో ఏవీ ఉండవు. అన్నీ మాయాదృశ్యాలే. *"బహిష్కులాయా దమృతశ్చరిత్వా, స ఈయతేఽమృతో యత్రకామమ్"* . దీని భావం అమృత స్వరూపుడైన జీవుడు తన గూటినుంచి (స్థూల శరీరం నుండి) బయటపడి అనుభవ యోగ్యమైన భోగాలను తీర్చుకోవాలని కోరుకుంటాడు. స్వప్నం దేహ సంబంధమైనదే కాని దేహాతీతమైనది కాదు.

ఎక్కడ స్వప్నం చూడడమైందో అక్కడే మెలకువ కూడా వస్తున్నది. పరిమిత కాలవ్యవధిలో ఎక్కడకో దూరంగా వెళ్లటం, తిరిగి రావటం కుదరదు కదా! మరో శ్రుతిలో కూడా ఇలా వినబడుతున్నది: *"స యత్ర ఏతత్ స్వప్నయా చరతి స్వేశరీరే యథా కామం పరివర్తతే"* (స్వప్నంలో ద్రష్ట తన దేహంలోనే స్వేచ్ఛగా తిరుగుతాడు – బృ.ఉ 2.1.18). యథార్థస్థితికి విపరీతంగా కూడా ఉంటుంది. పగలే రాత్రిగాకనబడు తుంది. వాహనాల ఏర్పాటు వాటిలో ప్రయాణం, ఇత్యాదులన్నీ పరిమిత కాలంలోనే జరిగిపోతాయి. అందువల్ల స్వప్నం మాయామాత్రము, మిథ్యా రూపమనే గ్రహించాలి.

## సూ: 3.2.4 సూచకశ్చ హి శ్రుతేరాచక్షతే చ తద్విదః

కొన్ని స్వప్నదృశ్యాలు రాబోయే మంచి చెడ్డలను సూచిస్తాయని కొన్ని శ్రుతి వాక్యాలు పలుకుతున్నవి. కాబట్టి, స్వప్న దృశ్యాలు పారమార్థిక వాసన లేనివని కూడా చెప్పలేము. ఉదాహరణకు *"యథా కర్మసు కామ్యేషు స్త్రియం స్వప్నేషు పశ్యతి సమృద్ధిం తత్ర జానీయాత్ తస్మిన్ స్వప్న నిదర్శనే"* (కామ్యకర్మ సఫలమవుతుం దని స్త్రీ స్వప్నంలో కనబడితే దాని నిదర్శనమని తెలుసుకోవాలి – ఛా.ఉ 5.2.9).అలాగే *"పురుషం కృష్ణం కృష్ణదంతం పశ్యతి స ఏనం హంతి"* (నల్లటి దంతాలున్న, నల్లటి పురుషుడు స్వప్నంలో కనబడితే మరణాన్ని సూచిస్తుంది). ఈ విధంగా స్వప్నశాస్త్రం తెలిసిన వారు కొన్ని విశేషసూచనలను పరిశీలించి చెప్తారు. కాని స్వప్నంలో చూసే దృశ్యాలు అవాస్తవమైనవి కాబట్టి వాటిని మాయామాత్రములనే గ్రహించాలి.

పూర్వపక్షి, పరమాత్మ యొక్క స్వరూపమే ఆత్మ కాబట్టి, పరమాత్మ నిర్మితాలు యదార్థ రూపములైనట్లే, ఆత్మ నిర్మితాలు కూడా నిజమే అవాలని తన అభిమతం వ్యక్తం చేశాడు. దానికి సమాధానం భాష్యకారులు ఈ విధంగా ఇవ్వటం జరిగింది:

సుఖ–దుఃఖాలు, పాప–పుణ్యాల వల్ల ఉత్పన్నమయేవి. అవి జీవుడు స్వయంగా సృష్టించుకున్నవే. అందువల్ల స్వప్నంలో రథాదులు నిర్మాణానికి తనే నిమిత్తకారణ మౌతున్నాడు. ఆత్మ స్వయం ప్రకాశమైనది. కాని, ఆత్మకున్న స్వయం ప్రకాశ శక్తిని విపులంగా బోధించటానికి జాగ్రదవస్థలో జరిగే కార్యకలాపం, స్వప్నావస్థలో జరిగే కార్యకలాపానికి వ్యత్యాసంగా ఎలా ఉంటుందో చెప్పబడింది. జాగ్రదవస్థలో విషయేంద్రియాల సంయోగం శారీరుడి యొక్క అధీనంలో ఉంటుంది. కాని స్వప్నావస్థలో ఇంద్రియాదులు నిద్రిస్తూ ఉంటాయి. స్వప్నావస్థలో నిర్మించుకున్న రథాదులు మిథ్యా

రూపములేకాని స్వయం జ్యోతిస్సు అయిన ఆత్మనిర్మితాలు కావు అని చెప్పటమే ఇక్కడ ముఖ్య ఉద్దేశము. అందువల్ల గౌణార్థంలోనే *"అథ రథాన్ రథయోగాన్ పథః సృజతే"* అనే శ్రుతిని, *"కామం కామం పురుషో నిర్మిమాణః"* అనే శ్రుతిని అన్వయించుకోవాలి.

స్వప్నంలో సృష్టించుకున్న దృశ్యాలు కూడా పరమాత్మ నిర్మితములే అనే భావనకు ఆధారం లేదు. మరో శ్రుతి కూడా దీనిని స్పష్టం చేస్తున్నది. *"స్వయం విహత్య స్వయం నిర్మాయ స్వేన భాసా స్వేన జ్యోతిషా ప్రస్వపితి"* (స్వయంగా తన బుద్ధిప్రయోగంతో దేహాన్ని చేష్టారహితం చేసుకొని, వాసనా దేహాన్ని నిర్మించుకొని తన స్వరూప చైతన్యంతో స్వప్నానుభూతిని పొందుతాడు – బృ.ఉ 4.3.9). అందువల్ల స్వప్నం జీవుని యొక్క వ్యాపారమే. పరమాత్మ వ్యాపారం కాదు. ప్రాజ్ఞుడైన ఈశ్వరుడు సర్వావస్థలలోను జీవుని అధిష్ఠాతగా ఉంటాడు. అందువల్ల స్వప్నావస్థలో పరమేశ్వరుడి యొక్క వ్యాపారం ఏమీ ఉండదని కూడ చెప్పలేము.

ప్రబోధ–సుషుప్త్యవస్థల మధ్య స్వప్నాలు వస్తాయి. అందువల్ల స్వప్నావస్థలో శారీరుడు నిర్మించుకొన్నవేవి సత్యమూ పారమార్థికమూ కాలేవు. నిజానికి, జగత్తే మిథ్యా రూపం (మాయా మాత్రము) అనే వేదాంత ప్రస్తావనలో, ఆకాశాదులు కూడా సత్యత్వం లేనివని, రెండవ అధ్యాయంలో *"తద నన్యత్వమారంభణ శబ్దాదిభ్యః"* (బ్ర.సూ 2.1.14) అనే సూత్రంలో వివరించబడింది.

## సూ: 3.2.5 పరాభిధ్యానాత్తు తిరోహితం తతో హ్యస్య బంధవిపర్యయౌ

**సంశయం:**

ఒక అగ్నికణంలా పరమాత్మ యొక్క అంశమే జీవుని యొక్క తేజోరూపం కదా? జ్ఞాన–ఐశ్వర్య శక్తులు, జీవుడిలోను ఈశ్వరుడిలోను ఒకే విధంగా ఉంటాయి, కాబట్టి స్వప్నంలో రథాది సృష్టి, జీవుడికి చేసుకోగల సామర్థ్యం ఉంటుంది అని పూర్వపక్షి తన అభిప్రాయాన్ని వ్యక్తం చెయ్యడమైంది. దానికి సమాధానం ఇక్కడ చెప్పబడుతున్నది.

**సమాధానం:**

ఆత్మ, పరమాత్మ యొక్క అంశమే, కాని జీవుడు అవిద్యచేత ఆవరింపబడి ఉంటాడు. ధ్యాన మననాది సాధనల ద్వారా కొన్ని సంపత్తులు కలిగినా అవి ఏ కొద్ది మందికో ఉపలబ్ధమవుతాయి. అవిద్యా ప్రభావం వల్ల సామాన్య జీవులు ఆత్మ తత్త్వాన్ని గ్రహించలేక సంసార బంధంలో చిక్కుకొని పరమాత్మను చేరుకోలేరు.

విద్యావేత్తలకు–బ్రహ్మవేత్తలకు బంధవిముక్తి కలిగి, ఎటువంటి సంపత్తు (ఫలము) లభిస్తుందో శ్రుతి ఇలా వినిపిస్తున్నది: *"జ్ఞాత్వా దేవం సర్వ పాశాపహానిః క్షీణైః క్లేశైః జన్మమృత్యు ప్రహాణిః, తస్యాభిధ్యానాత్ తృతీయం దేహ భేదే విశ్వైశ్వర్యం కేవల ఆప్తకామః"* (శ్వే.ఉ 1.11). *"బ్రహ్మైవాహమ్"* , నేనే బ్రహ్మను అనే భావంతో ధ్యాన మననాదులు చేసే వారికి విద్యాప్రాప్తి వల్ల లౌకికబంధాలు తొలగిపోయి, క్లేశాలు నశించి, జన్మ మృత్యువులు అంతమైపోతాయి. సగుణబ్రహ్మమును ధ్యానించిన విద్యోపాసకుడు దేహపాతానంతరం అణిమాది సమస్తైశ్వర్యములు పొంది, తదనంతరం కేవలుడైన ఆత్మకాముడు క్రమముక్తిని పొందుతాడని ఈ శ్రుతి బోధిస్తున్నది.

## సూ: 3.2.6 దేహయోగాద్వా సోఽపి

జీవుడు–పరమేశ్వరుడు అభేదమైనా ఉపాధివశం చేత దేహేంద్రియాలతో సంబంధం ఏర్పడి, అందుకారణంగా జ్ఞాన ఐశ్వర్యాలు మాటుమణిగి పోతాయి (తిరోహితమవుతాయి). స్వప్నంలో రథాది సృష్టి, ఆత్మ సంకల్పప్రభావంవల్ల జరిగితే, స్వప్నాలు సర్వదా సుఖానుభూతినిచ్చేవే కావాలి. ఏ జీవి దుఃఖాన్ని కోరుకోదు కదా! స్వప్నంలో దుఃఖానుభూతి కూడా ఉంటుంది కాబట్టి స్వప్న దృశ్యాలు ఆత్మ సంకల్పితాలు కావు.

జాగ్రదవస్థలో గతానుభూతులతో కలిగిన సుఖ–దుఃఖాల పైన స్వప్న నిర్మాణం జరుగుతుంది. దేహం అంతా

జడమయం; ఆత్మ ఒక్కటే భారూపం. కాబట్టి స్వప్నదృశ్యాలు ఆత్మజ్యోతిస్సు తోనే చూడడం జరుగుతుంది. అంతేకాని, స్వప్న సృష్టిలో పారమార్థికమైన సత్యత్వం లేదు. స్వప్నానుభూతి మాయామాత్రమైన అనుభూతి అనే గ్రహించాలి.

# 2. తదభావాధికరణమ్

## సూ: 3.2.7 తదభావో నాడీషు తచ్ఛ్రుతేరాత్మని చ

క్రిందటి అధికరణంలో స్వప్నావస్థ గురించి చర్చించడం జరిగింది. ఈ అధికరణంలో సుషుప్త్యవస్థ (గాఢ నిద్ర) గురించి చర్చ జరుగుతున్నది. స్వప్నావస్థలో మనస్సు పని చేస్తునే ఉంటుంది. సుషుప్తిలో మనో వ్యాపారం కూడా ఉండదు. అన్ని ఇంద్రియ వృత్తులూ హృదయంలో లీనమయిపోతాయి.

సుషుప్తిలో పురుషుడి అవస్థను సూచిస్తూ ఉపనిషత్ వాక్యాల్లో ఎన్నో విధాలుగా వినబడుతున్నది: *"తద్యత్ర ఏతత్ సుప్తః సమస్తః సంప్రసన్నః స్వప్నం న విజానాతి ఆసు తదా నాడీషు సృప్తో భవతి"* (సుషుప్తిలో జీవుడు స్వప్నములు చూడదు. బాహ్యాంతర ఇంద్రియాలతో సంబంధము లేకుండా నాడులను చేరుకుంటాడు – ఛా.ఉ 8.6.3). మరో శ్రుతిలో *"తాభిః ప్రత్యవసృప్య పురీతతి శేతే"* (ఆ నాడుల ద్వారా హృదయానికి చుట్టూ ఉండే పురీతత్ నాడిని చేరుకుంటాడు – బృ.ఉ 2.1.9). ఇంకొక శ్రుతిలో *"తాసు తథా భవతి, యథా సుప్తః స్వప్నం న కంచన పశ్యతి అథా అస్మిన్ ప్రాణ ఏవ ఏకధా భవతి"* (స్వప్నమేదీ చూడని గాఢనిద్రలో బ్రహ్మరూపమైన ప్రాణంలోనే ఏకత్వం పొందుతాడు – కౌషీ 4.19). ఛాందోగ్యంలో *"సతా సోమ్య తదా సంపన్నో భవతి, స్వమపీతో భవతి"* (ఛా.ఉ 6.8.1). ఇదే భావం బృహదారణ్యకం లోనూ ఇలా వినబడుతున్నది *"ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్తో న బాహ్యం కించన వేద, న అంతరమ్"* (సుషుప్తిలో జీవుడు పరబ్రహ్మను చేరుకొని బాహ్యాంతర విషయాలేమీ ఎరుగలేని స్థితిలో ఉంటాడు – బృ.ఉ 4.3.21).

ఈ విధంగా పేర్కొన్న నాడీ ప్రదేశాలు ఒకదానితో మరొకటి సంబంధం లేని స్వతంత్రమైన స్థానాలా, లేక ఒకే గమనాన్ని, ప్రయోజనాన్ని సూచిస్తున్నాయా? అనే సందేహం కలుగుతున్నది. అయితే, సుషుప్త్యవస్థలో విశిష్టజ్ఞానం శాంతించి, జీవుడు ప్రాణస్థానమైన హృదయాన్ని చేరి, సత్ స్వరూపాన్ని ఆశ్రయిస్తున్నట్లు ప్రస్తావించటం వల్ల అన్ని శ్రుతివాక్యాలూ ఒకే ఫలితాన్ని, ప్రయోజనాన్ని సూచిస్తున్నవి. సుషుప్తిలో మనస్సు యొక్క కార్యకలాపం ఉండనందున జీవుడు నిశ్చలంగా ఉంటాడు.

**సిద్ధాంతం:**

సుషుప్తిలో, పురీతతి ఇత్యాది స్థానాలు ఉదహరించి జీవుడు ప్రాణానికి ఆయతనమైన హృదయంలో ఏకత్వం పొందటం వల్ల అంతః బాహ్యేంద్రియాలలో ఎట్టి వ్యాపారమూ జరగదనే ఈ శ్రుతులు తెలియజేస్తున్నాయి. హృదయంతో సుషుప్తి స్థానాలన్నింటికీ సంబంధం ఉందనే గ్రహించాలి. అట్టి సముచ్చయం ఉంటేనే మనస్సుతో సహా అన్ని ఇంద్రియాలూ వాటి వాటి వ్యాపారం ఆపివేసి, గాఢనిద్రలో ఉన్నంతసేపూ శాంతించటం జరుగుతుంది. అప్పుడే ఆత్మ స్వేచ్ఛావిహారం చేసి, స్వస్వరూపమైన పరమాత్మను చేరుకోవటం సంభవిస్తుంది.

సూర్యరశ్ములు ప్రసరించే నాడులు బ్రహ్మలోక గమనానికి మార్గములు. వాటిని తేజోవంతం చేసేది ఆత్మయే. *"తేజసా హి తదా సంపన్నో భవతి"* అనే వాక్యం నిర్మలమైన స్థితిలో క్లేశాదులు లేకుండా బ్రహ్మమును చేరుకుంటాడు అని సూచిస్తున్నది. *"పురీతతి శేతే"* అనే వాక్యం, హృదయాన్ని ఆవరించుకొని ఉన్న దహరాకాశాన్ని చేరుకొని నిద్రిస్తున్నాడు అనే భావాన్నే తెలియజేస్తున్నది. హృదయాకాశం బ్రహ్మస్థానమని ముందు కూడా ప్రస్తావించటం జరిగింది.

'సత్', 'ప్రజ్ఞానాత్మ' అనే పదాలు బ్రహ్మమునే నిర్దేశిస్తాయి. అందువల్ల జీవుడు సుషుప్త్యవస్థలో హృదయస్థానంలో ఇంద్రియ–మనో వృత్తులతో చేరి, తాదాత్మ్యం పొందుతాడని ఈ శ్రుతివాక్యాలన్నీ స్వస్వరూప ప్రాప్తినే సూచిస్తున్నవి. అదీకాక సుషుప్తిస్థానం పురీతత్ అన్నా, నాడులన్నా, సత్ అన్నా, జీవుడి వ్యవహారం, అట్టి నిద్రా వస్థలో ఒకేలా ఉంటుంది. *"తత్ కేన కం విజానీయాత్"* , *"యత్ర వా అన్యదివస్యాత్ తత్ర అన్యోఽన్యత్ పశ్యేత్"* (బృ.ఉ 4.3.31) అని శ్రుతి వాక్యాలు. సుషుప్త్యవస్థలోసత్ –బ్రహ్మ సంపన్నుడై ఉపాధియైన శరీరేంద్రియ సముదాయం శాంతించటం వల్లదేనినీ తెలుసుకునే స్థితిలో ఉండదు. అంతరేంద్రియాలు, బాహ్యేంద్రియాలు ఆత్మవశ్యమై ఉపశమిస్తాయి. నిర్వికార స్థితిలో ప్రసన్నాత్మ

బ్రహ్మానంద యోగాన్ని అనుభవిస్తుంది.

## సూ: 3.2.8 అతః ప్రబోధోఽస్మాత్

సుషుప్తి స్థానం ఆత్మ కావడం వల్ల తిరిగి మెలుకువ రావటం (ప్రబోధం కలగటం) మళ్లీ ఆత్మ నుండే జరుగుతుంది. *"కుత ఏతదాగాత్"* (బృ.ఉ 2.1.6), *"యథాగ్నేః క్షుద్రాః విస్ఫులింగాః వ్యుచ్చరంతే ఏవమేవ ఏతస్మాత్ ఆత్మనః సర్వేప్రాణాః"* (బృ.ఉ 2.1.10), *"సత ఆగమ్య న విదుః సత ఆగచ్ఛామహే"* (ఛా.ఉ 6.10.2) అని వినిపిస్తున్న శ్రుతివాక్యాలన్నీ, ఒకే విషయాన్ని ఉద్బోధిస్తున్నవి. చైతన్య స్వరూపమైన ఆత్మ, అగ్ని విస్ఫులింగాల వలె పరమాత్మ నుండి ఉద్భవించి, ఈ దేహంలో ఉన్న బాహ్య, అంతరేంద్రియాలను చైతన్యవంతం చేస్తుంది. సుషుప్త్యవస్థ నుండి తిరిగి ప్రబోధావస్థకు వచ్చిన జీవుడు కూడ సత్–సంపత్తి కలిగినట్లు తెలుసుకోలేదు.

## 3. కర్మానుస్మృతిశబ్దవిధ్యధికరణమ్

## సూ: 3.2.9 స ఏవ తు కర్మానుస్మృతిశబ్దవిధిభ్యః

**సంశయం:**

సుషుప్త్యవస్థలో సత్ సంపత్తు పొంది వచ్చిన జీవుడు వేరే రూపంలోవస్తాడా, లేక పూర్వరూపంలోనే వస్తాడా అనే సందేహం కల్గుతున్నది. కారణం ఒక నీటి బిందువును మరో జలరాశిలో పోసి, మళ్లీ అదే నీటి బిందువును తీసుకోబడదుకదా? బ్రహ్మమును చేరిన జీవుడు పరమాత్మతో విలీనమైతే, తిరిగి అదే జీవుడు ఎలావస్తాడు. మరో జీవుడైనా కావొచ్చు, ఈశ్వరుడే మరో జీవి రూపంలో రావొచ్చు. శాశ్వతమైన మోక్షప్రాప్తికాకపోయినా, సుషుప్తిలో ఆత్మ తన ఉపాధిని విడిచిపెట్టి పరమాత్మలో లీనమవుతుంది కదా? అందువల్ల అదే ఆత్మ మళ్లీ యథాస్థానానికి వస్తుందని ఎలా నిర్ణయించడం?

**సమాధానం:**

సుషుప్తిలో పరమాత్మను చేరుకున్న జీవాత్మ తిరిగి తన పూర్వ ఉపాధినే ఆశ్రయిస్తుంది. ఏ వ్యక్తైనా తను ప్రారంభించిన కర్మను, తనే పూర్తిచేసుకుంటాడు. యజ్ఞయాగాది విషయాల్లో ఋత్విక్కులు, యజమాని ఎలా మారరో, లౌకిక కార్య కలాపాలలో ఎవరు ఆరంభించిన పనిని వారే పూర్తి చేసుకుంటారో, అలాగే ఎవరి కర్మఫలం వారే ఆది నుంచి–అంతం వరకు అనుభవించవలసి ఉంటుంది. అదీకాక, గతంలో ఒకడు చేసినది, మరొకరికి ఎలా గుర్తు (స్మరణ) ఉంటుంది? సుషుప్తి నుండి తిరిగి ప్రబోధావస్థకు వచ్చిన వ్యక్తికి ముందు తన కార్యకలాపాలన్నీ జ్ఞప్తిలోనే ఉంటాయి. సుషుప్త్యవస్థలో జరిగిందే తెలీదు.

శ్రుతిలో దీనిని నిర్ధారిస్తూ ఇలా వినబడుతున్నది: *"పునః ప్రతిన్యాయం ప్రతి యోన్యాద్రవతి బుద్ధాంతాయైవ"* (ప్రతి సుషుప్తి గమనంలోను మేల్కొనడానికి తిరిగి ఆయా ఇంద్రియస్థానాలకే వస్తాడు – బృ.ఉ 4.3.16). పలుసార్లుగాఢనిద్రావస్థలో ప్రజలు బ్రహ్మమును చేరినా అది శాశ్వతమైన బ్రహ్మలోక ప్రాప్తి (మోక్షం) కాదు అని మరో శ్రుతి ఇలా తెలియజేస్తున్నది: *"ఇమాః సర్వాః ప్రజాః అహరహః గచ్ఛంత్య ఏతం బ్రహ్మలోకం న విందంతి"* (ఛా.ఉ 8.3.2). *"త ఇహ వ్యాఘ్రో వా సింహో వా, వృకో వా, వరాహో వా, కీటో వా, పతంగో వా, దంశో వా, మశకో వా యద్యద్భవంతి తదా భవంతి"* (ఛా.ఉ 6.9.3). ఏ ప్రాణి నుంచి నిద్రావస్థలోకి వెళ్లటం జరిగిందో మళ్లీ అదే ప్రాణిలోకి తిరిగి రావటం జరుగుతుందందని దీని భావన. అందువల్ల నిద్రావస్థలోకి ఏ జీవుడు వెళ్లేడో, ఆ జీవుడే తిరిగి అక్కడే మేల్కోటం జరుగుతుంది. అదే ఆత్మ, అదే ఉపాధి, వ్యత్యాసం ఉండదు. బంధానువృత్తి ఎంతవరకు ఉంటుందో అంతవరకు, అదే జీవుడు భోగాన్ని అనుభవిస్తాడు. ఒకరి కర్మఫలాన్ని మరో జీవుడు అనుభవించడు కదా! బీజాంకుర న్యాయం చేత నిద్రలోనైనా, జాగ్రదవస్థలోనైనా అదే ఉపాధి కొనసాగుతునే ఉంటుంది.

## 4. ముగ్ధాధికరణమ్

## సూ: 3.2.10 ముగ్ధేఽర్ధసంపత్తిః పరిశేషాత్

**సంశయం:**

మూర్ఛపోయిన వ్యక్తి (ముగ్ధుడు) ఏ స్థితిలో ఉంటాడు? జాగ్రదవస్థ, స్వప్నావస్థ, సుషుప్త్యవస్థ, మరణావస్థ అని నాలుగే అవస్థలు జీవుడి విషయంలో చెప్పబడ్డాయి. కాని, మూర్ఛావస్థ ఈ నాలుగు అవస్థలకు భిన్నంగా ఉంటుంది. మూర్ఛపోయినవాడు తిరిగి మేల్కొన్న తరవాత, సుషుప్త్యవస్థ నుంచి జాగ్రదవస్థకు వచ్చినట్లే ప్రవర్తిస్తాడు. అందువల్ల మూర్ఛావస్థ, సుషుప్తి ఒకే విధమైనవని తోస్తున్నది. మూర్ఛావస్థలో ఆత్మ బ్రహ్మైక్యతను పొందుతుందా?

**సమాధానం:**

మూర్ఛపోయినవాడు జాగ్రదవస్థలో ఉండే వ్యక్తిలా స్థిరంగా కూర్చోలేడు. పడిపోతాడు, స్వప్నాలు కూడా చూడడు. ప్రాణాలుపోయిన వాని పరిస్థితీ కాదు. శరీరం ఉష్ణతను కోల్పోదు. సముచిత చికిత్సానంతరం తిరిగి సామాన్యస్థితికి వస్తాడు. అయితే మూర్ఛస్థితిలో జరిగినదేది జ్ఞాపకం ఉండదు. మూర్ఛపోయిన వ్యక్తి దేహం వణుకుతుంది. సుషుప్తిలో నున్న వ్యక్తి ప్రశాంతంగా ఉంటాడు. అదీకాక తట్టి లేపితే లేచే స్థితిలో ఉంటాడు. మూర్ఛలో ఉన్న పురుషుణ్ణి తట్టి లేపినా లేచే స్థితిలో ఉండదు. ఇది ప్రత్యేకావస్థ అని ఆయుర్వేద ఇత్యాది శాస్త్రాలు పరిగణించినా, వేదాంతులు మాత్రం ఒక విలక్షణ శారీరిక–మానసిక స్థితిగానే పరిగణిస్తారు. దానిని అర్ధసంపత్తి అని భావించవచ్చు. కర్మశేషం వల్ల వాగాది ఇంద్రియాలు ముగ్ధావస్థ తీరిన వెంటనే యథాస్థితిలో మళ్లీ పనిచేస్తాయి. కర్మశేషం లేకపోతే మరణ ప్రాప్తి కావాలి. మూర్ఛ మరణం కాదూ– సుషుప్తిలా నిర్వికారస్థితి కాదు. అందువల్ల అర్ధసంపత్తి అని భావిస్తూ మరణానికి ఒక ద్వారమనే నిర్ణయించుకోవటం యుక్తము.

## 5. ఉభయలింగాధికరణమ్

### సూ: 3.2.11 న స్థానతోఽపి పరస్యోభయలింగం సర్వత్ర హి

ఈ ప్రకరణము మొదలుకొని పాదాంతము వరకు బ్రహ్మము యొక్క స్వరూప నిరూపణము శ్రుత్యాధారంగా చేయబడుతున్నది.

**పూర్వపక్షి:**

సుషుప్త్యాది అవస్థలలో జీవుడు ఏ బ్రహ్మము యొక్క సంపన్నుడౌతాడు? శ్రుతి వాక్యాలు *"సర్వకర్మా సర్వకామః సర్వగంధః, సర్వరసః"* అని సాకార, సగుణ బ్రహ్మమును నిర్దేశిస్తున్నవి. అదేవిధంగా *"అస్థూల మనణు అహ్రస్వ మదీర్ఘమ్"* అని నిర్విశేష (నిర్గుణ) బ్రహ్మలింగాలనూ సూచిస్తున్నవి. అందువల్ల బ్రహ్మకు ఉభయ లింగత్వం సమంజసమనే తోస్తున్నది.

**సిద్ధాంతం:**

పరబ్రహ్మ ప్రకృతః సకల విశేషరహితమైనది. కాని, స్థానతః ఉపాధి సంబంధం వల్ల ఉభయలింగత్వాన్ని స్వీకరించవచ్చు. శుద్ధమైన స్ఫటికం పుష్పాదివస్తు సంయోగం (ఉపాధి) వలన భిన్న భిన్న రంగులలో కనబడవచ్చు. కాని, అట్టి సంయోగం, స్ఫటిక నిజరూపాన్ని మార్చలేదు. అలాగే, బ్రహ్మము తత్త్వతః శుద్ధ మైనది. నిర్మలమైనది, నిర్విశేషమైనది.

### సూ: 3.2.12 న భేదాదితి చేన్న ప్రత్యేకమతద్వచనాత్

ఉపాసనా విద్యలలో బ్రహ్మము యొక్క విశేషాలు—ఆకారాలు భిన్నంగా చెప్పబడ్డాయి. కొన్ని షోడశకళలు గల (పదహారు కళలున్న) స్వరూపంగాను, మరికొన్ని చతుష్పాత్, కొన్ని జీవుడులోని మూడు అవస్థలందు శరీరంగా గల వైశ్వానర రూపమని, ఇలా బహువిధాలుగా బ్రహ్మనిర్దేశం జరిగింది. అందువల్ల బ్రహ్మమును సాకారము (సగుణరూపము) అనే గ్రహించాలి కదా?

అవసరం లేదు. ఆకార భేదం ఉపాధుల వలన వచ్చినది మాత్రమే.శ్రుతిలో ఇలా వినబడుతున్నది: "యశ్చాయం అస్యాం పృథివ్యాం తేజోమయోఽమృతమయః పురుషః యశ్చాయమధ్యాత్మం శరీరస్తేజోమయోఽమృతమయః పురుషోఽయమేవ స యోఽయమాత్మా" (బృ.ఉ 2.5.1). ఈ పృథివిలో నున్న తేజోమయుడూ, అమృత మయుడైన ఏ పురుషుడు (పరమాత్మ) ఉన్నాడో, అతడే ఈ శరీరంలోనున్న తేజో మయుడు, అమృతమయుడూ అయిన ఆత్మ. అందువల్ల, కేవలం ఉపాసన కోసమే బ్రహ్మము – పరమాత్మ, వేరువేరు ఆకార, వికారాలతో బోధింపబడిందని గ్రహించాలి.

### సూ: 3.2.13 అపిచైవమేకే

వాస్తవికంగా ఎట్టి భేదం లేదు. అద్వైతశాఖీయులు బ్రహ్మరూప భేదదర్శనాన్ని ఇలా నిందిస్తున్నారు: *"మనసైవేదమాప్తవ్యం నేహ నానాస్తికించన, మృత్యోః స మృత్యు మాప్నోతి య ఇహ నానేవ పశ్యతి"* . భోక్త—భోగ్యము, ఈ రెండింటిని ప్రేరేపించే పరమేశ్వరుడు (త్రివిధ రూపములు) వేరు వేరు కావు, సమస్త ప్రపంచమూ ఆ బ్రహ్మ స్వరూపమని అద్వైతశాఖీయులు విశ్వసిస్తారు. *"భోక్తా భోగ్యం ప్రేరితారం చ మత్వా సర్వం ప్రోక్తం త్రివిధం బ్రహ్మ మే తత్"* (శ్వే.ఉ 1.12).

### సూ: 3.2.14 అరూపవదేవ హి తత్ప్రధానత్వాత్

ప్రధానంగా నిష్ప్రపంచమైన బ్రహ్మ తత్త్వాన్నే శ్రుతులు ఇలా బోధిస్తున్నవి: *"అస్థూల మనణు అహ్రస్వ మదీర్ఘమ్"* (బృ.ఉ 3–8–8.), *"అశబ్ద మస్పర్శ మరూప మవ్యయమ్"* (క.ఉ 3.15) *"ఆకాశోవై నామ, నామరూపయోర్నిర్వహితా తే

*యదంతరా తత్ బ్రహ్మ"* (ఈ జగత్తులో నామరూపములతో నున్న అన్నింటియందు సూక్ష్మ రూపములో వ్యాపించి ఉన్నదే బ్రహ్మము యొక్క సత్తా మాత్రము – ఛా.ఉ 8.14.1). *"దివ్యో హ్యమూర్తః పురుషః స బాహ్యంతరో హ్యజః"* (అక్షర పరబ్రహ్మము స్వయం జ్యోతిరూపము, అమూర్తము, సర్వవ్యాపకము అజము – ము.ఉ 2.1.2) *"తదేతత్ బ్రహ్మ అపూర్వ మనపర మనంతరం అబాహ్యం అయమాత్మా బ్రహ్మసర్వానుభూః"* (అపూర్వము, అనపరము, అనంతరము, అబాహ్యమైన పరబ్రహ్మ సమస్తమూ చూచుట, వినుట, తలచుట, తెలుసుకొనుట ఇత్యాది స్వరూపములతో అనుభవింప బడుతున్న జీవాత్మరూపంలో ఉన్నది – బృ.ఉ 2.5.19). బ్రహ్మ, ఏకాకారమైనదనే ఈ శ్రుతి వాక్యాలు నిర్ధారిస్తున్నవి.

## సూ: 3.2.15 ప్రకాశవచ్చావైయర్థ్యాత్

ఆకాశం అంతా ఒకే విధంగా ఉన్నా సూర్యప్రకాశము–చంద్రప్రకాశము అంగుళ్యాది ఉపాధికారణంగా తిన్నగాను–వంకరగాను (ఋజు–వక్రాది ఆకారాల్లో) ఎలా కనబడుతుందో, అలాగే పృథివీ ఇత్యాదుల ఉపాధి సంబంధం వల్ల, బ్రహ్మ కూడ ఆకారం పొందినట్లు కనబడుతుంది. ఉపాధికారణంగా వచ్చిన రూపాదులు, వస్తువు యొక్క యదార్థ ధర్మాలు కావు. ఉపాసన కొరకు బ్రహ్మను ఏ ఆకారంలో గ్రహించినా, బ్రహ్మ పదార్థానికి ఆకార విశేషం రాదు.

## సూ: 3.2.16 ఆహ చ తన్మాత్రమ్

బ్రహ్మము శుద్ధ చైతన్య స్వరూపము అనే శ్రుతులు విన్పిస్తున్నవి. *"స యథా సైంధవఘనోఽన్తరోఽబాహ్యః, కృత్స్నో రసఘన ఏవ, ఏవం వా అరేఽయ మాత్మానంతరోఽబాహ్యః కృత్స్నః ప్రజ్ఞానఘన ఏవ"* (ఏకరసమైన సైంధవఘునం, లోపలా బయటా సర్వత్రా అదే గుణం కలదై ఉంటుందో, అలాగే ఈ ఆత్మ ఎట్టి విలక్షణాలు లేని నిత్య చైతన్యరూపము – బృ.ఉ 4.5.13).

## సూ: 3.2.17 దర్శయతి చాథో అపి స్మర్యతే

బ్రహ్మము నిర్విశేష రూపాన్ని శ్రుతులు, స్మృతివాక్యాలూ ధృవీకరిస్తున్నవి. నామ–రూపాల్లో కనబడే ప్రపంచంలో అన్నింటిని నేతి–నేతి (ఇది కాదు–ఇది కాదు) అని నిషేధించటం వలన చివరకు మిగిలేది బ్రహ్మ. *"అథా త ఆదేశో నేతి నేతి"* (బృ.ఉ 2.3.6), *"అన్యదేవ తద్విదితాత్ అథో అవితాదధి"* (కే.ఉ 1.4), అలాగే 'యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ' (మాటలలో చెప్పలేనిది ఊహకందనిది బ్రహ్మ –తై.ఉ 2.4.1). భగవద్గీతలో *"జ్ఞేయం యత్ ప్రవక్ష్యామి యద్ జ్ఞాత్వామృత మశ్నుతే, అనాది మత్పరం బ్రహ్మ న సత్ తత్ న అసత్ ఉచ్యతే"* (అనాదియైన పరబ్రహ్మమే తెలిసికొనదగినది, అది సత్–అసత్ లకు అతీతమైనది. దానిని తెలుసుకొన్నవాడు అమృతత్వాన్ని పొందుతాడు – భ.గీ 13.12).

## సూ: 3.2.18 అత ఏవ చోపమా సూర్యకాదివత్

సూర్యుడు ఒక్కడే అయినా వేరువేరు స్థానాలలో ఉన్న జలభాండాలలో వేరు వేరుగా ప్రకాశిస్తుంటాడు. అలాగే ఆత్మకు విశేషగుణాలన్నీ ఉపాధి వల్ల ఉపక్రమించి నవే. *"యథా హ్యయం జ్యోతిరాత్మా వివస్వానపో భిన్నా బహుధైకోఽనుగచ్ఛన్, ఉపాధినా క్రియతే భేదరూపో దేవః క్షేత్రేష్వేవమజోఽయమాత్మా"* , అదే విధంగా *"ఏక ఏవహి భూతాత్మా భూతే భూతే వ్యవస్థితః"* (సర్వభూతాలలోనున్నది ఒకే ఆత్మ).

## సూ: 3.2.19 అంబువదగ్రహణాత్తు న తథాత్వమ్

ఇది పూర్వపక్షి ప్రశ్నిస్తున్న సూత్రం. ఆత్మ సూర్యుడివలే ఆకారమున్నది కాదు (అమూర్తము). ఉపాధులు కూడ సూర్యుడిలా వేరుగా ఉండి దూరంగాను లేవు. ఆత్మసర్వగతమూ, అన్నింటి యందు అభిన్నమూ (సర్వాభిన్నము) కాబట్టి జల–సూర్య దృష్టాంతము ఇక్కడ కుదరనే కుదరదు.

## సూ: 3.2.20 వృద్ధిహ్రాసభాక్త్వమంతర్భావాదుభయసామంజస్యాదేవమ్

పైన చేసిన ఆక్షేపానికి సమాధానంగా ఈ సూత్రం చెప్పబడింది. జలంలో ఉన్న సూర్యప్రతిబింబం, జలం కదులుతుంటే కదులుతున్నట్లు కనబడుతుంది. వేరు వేరు పాత్రలలో ఉంటే వేరు వేరుగా కనబడతుంది. జలం తగ్గుతుంటే ప్రతిబింబం క్రిందకి పోతున్నట్లు, జలస్థాయి పెరిగితే (వృద్ధి అవుతే) సూర్యబింబం వృద్ధిగా కనిపిస్తుంది. ఇవన్నీ జలధర్మాన్నిబట్టి వచ్చిన ఆకారభేదాలే కాని సూర్యుడికి వాస్తవంగా ఉన్న ధర్మాలు కావు. ఈ విషయమే జల–సూర్య దృష్టాంతంతో చెప్పబడింది. ఉపమేయ–ఉపమాన సారూప్యం ఎక్కడా పూర్తిగా ఉండదు. ఏ వికారములు లేనిది ఒకే రూపంలో ఉన్నదైనా, దేహాది ఉపాధి భేదం చేత వృద్ధి–క్షయమున్నట్లు కన్పిస్తుందని చెప్పటానికే జల–సూర్య దృష్టాంతం ఉదహరించబడింది. అందులో తప్పులేదు.

## సూ: 3.2.21 దర్శనాచ్చ

పరమాత్మ భిన్న భిన్న ఉపాధులనాశ్రయించినట్లు శ్రుతులు పల్కుతున్నవి. *"పురశ్చక్రే ద్విపదః, పురశ్చక్రే చతుష్పదః. పురః పక్షీభూత్వా పురః పురుష ఆవిశత్"* (పరమాత్మ లింగశరీరంతో ప్రవేశించి మనుష్యులలోను, చతుష్పాద జంతువులలోను సర్వదేహములందు ఉన్నవాడు – బృ.ఉ 2.5.18). ఇదే భావం *"అనేన జీవేనాత్మనా నుప్రవిశ్య"* అనే ఛాందోగ్య శ్రుతిలోను వినబడుతున్నది (ఛా.ఉ. 6.3.2).

ఈ సందర్భంలో శ్రీ శంకర భగవత్పాదులవారు తమ భాష్యంలో రెండు విషయాలను చర్చించారు. వాటిని సంగ్రహంగా ఇక్కడ ప్రస్తావించటం జరిగింది:

**1. రెండు వేరు వేరు అధికరణలు అవసరమా?**

ఈ అధికరణంలో సూ. 3.2.11 నుంచి 3.2.15 వరకు బ్రహ్మ – కార్య ప్రపంచమూ ఏ విధమైన రూపాన్ని ప్రదర్శిస్తాయి? ముఖ్యంగా బ్రహ్మ ఏకరూపమా లేక అనేక ఆకారాలు కలిగి ఉంటుందా అనే విషయంపై ఈ సూత్రాలలో చర్చ జరిగింది. బ్రహ్మ సద్రూపమా (సల్లక్షణమా) లేక చిద్రూపమా (బోధలక్షణమా) అనే చర్చ సూ: 3.2.15 నుంచి 3.2.21 వరకు జరిగింది. వీటిని రెండు వేరు వేరు అధికరణముల క్రింద విడదీయటం యుక్తమని కొందరి అభిమతం కాని, అట్టి ఆవశ్యకత లేదని శంకరులవారి అభిప్రాయం. పరబ్రహ్మకు అనేక లింగత్వాన్ని నిరాకరించటమే ఈ అధికరణము యొక్క ముఖ్య ఉద్దేశము.

**2. ప్రపంచం ప్రవిలయనం – దాని ప్రయోజనం ఏమిటి?**

ఆకారసహితమైన బ్రహ్మను బోధించే శ్రుతి వాక్యాలన్నీ ఆకారరహితమైన నిర్విశేష బ్రహ్మను తెలుసుకొనటానికే ఉద్దేశింపబడినవని ముందు సూచించడమైనది. ఈ విషయాన్నే తిరిగి భాష్యకారులు అద్వైతసిద్ధాంత స్థాపనకు ప్రపంచప్రవిలయ ప్రక్రియను వివరించారు. నేతి–నేతి అని సర్వ దృశ్యప్రపంచాన్ని నిషేధిస్తూ, జ్ఞేయమైన పరబ్రహ్మను జ్ఞాన సాధకులు తమ అన్వేషణలో తెలుసుకోవటమే ప్రపంచప్రవిలయం యొక్క ఉద్దేశ్యం కాని ప్రపంచాన్ని నిషేధించటం కాదు. ప్రపంచాన్ని చూస్తునే దాని మూలకారణాన్ని వెతుక్కుంటూ పోయి జ్ఞానప్రాప్తిని పొందటమే ఈ అన్వేషణ యొక్క ధ్యేయం. *"యుక్తా హ్యస్య హరయః శతా దశేత్యయం వై హరయోఽయం వై దశచ సహస్రాణి బహూని చ అనంతాని చ"* అని శ్రుతి వచనం (బృ.ఉ 2.5.19). దీని భావం జీవుడనే రథానికి పది గుఱ్ఱాలు (ఇంద్రియాలు) పూన్చబడి ఉన్నాయి. అయితే, వందలు, వేలు, అనంతములైన ప్రాణులను లాగుతున్న ఈశ్వరుడే ఆ గుఱ్ఱాలు. ఇటువంటి ఆకార విశేషాలతో విన్పిస్తున్న శ్రుతులు పరబ్రహ్మయొక్క బోధనకే ఉద్దేశింప బడినట్లు గ్రహించటం అవసరం.

విద్యాప్రకరణంలో *"మనోమయః ప్రాణ శరీరో భారూపః"* ఇత్యాది శ్రుతులు ఉపాసనావిధికి ఉపయుక్తమైనవే, ప్రపంచ ప్రవిలయాన్ని ఉద్దేశించి చెప్పినవి కావు. విద్యా ఉపాసనలలో కొన్ని పాపక్షయానికి, కొన్ని సంపత్ (ఐశ్వర్య) ప్రాప్తికి చేసే కామ్యకర్మలు. సగుణ బ్రహ్మోపాసనలు క్రమముక్తి ఫలం చేకూర్చేవి. అందువల్ల కార్యబ్రహ్మను నిర్దేశించే

శ్రుతివాక్యాలకు, నిర్విశేష బ్రహ్మమును (కారణబ్రహ్మమును) జ్ఞానమార్గం ద్వారా సాధించవచ్చు అని బోధించే శ్రుతులకు, ఏక వాక్యత కనబడదు.

ఇవి రెండూ వేరు వేరు మార్గాలు. ద్వైతప్రపంచం, బ్రహ్మతత్త్వం అర్థం చేసుకోవటానికి నిరాకరింపబడాలి. స్వర్గకామం గల వారికి యజ్ఞయాగాదులు చెయ్యమని నిర్దేశించినట్లే, మోక్షసాధనకు ప్రపంచప్రవిలయనం (నిరాకరణ) విధింప బడుతున్నదని గ్రహించాలి. ఇక్కడ ఒక ముఖ్యవిషయం తెలుసుకోవలసి ఉంది: ప్రపంచం బ్రహ్మ స్వరూపమైనది; కాని బ్రహ్మ ప్రపంచస్వరూపం కాదు. అంటేప్రపంచ సృష్టికి బ్రహ్మకారణం; కాని బ్రహ్మ ప్రపంచం వలన సృష్టింపబడలేదు. బ్రహ్మపదార్థం అనాది. నామ—రూపాలతో కూడిన అనిత్యమైన ప్రపంచాన్ని నిరాకరిస్తే కాని, బ్రహ్మ తత్త్వం తెలుసుకోబడదు.

**సంశయం:**

దేహాది రూప—గుణ సంపన్నమైన అధ్యాత్మిక ప్రపంచమూ, అధిభౌతిక బాహ్యప్రపంచమూ కనబడుతూ ఉండగా దాని నిషేధం (ప్రవిలయనం) మానవ మాత్రుడికి సాధ్యమా? బ్రహ్మజ్ఞానం సంపాదించటానికి ప్రపంచ ప్రవిలయనం చెయ్యి అని ఎన్నిసార్లు చెప్పినా బ్రహ్మజ్ఞానం రావటం, ప్రపంచాన్ని నేతి—నేతి ప్రక్రియలో నిషేధించటం జరగని పని కాదా?

**సమాధానం:**

నిష్ప్రపంచమైన బ్రహ్మమే జీవాత్మ అని చెప్పటం వల్ల, బ్రహ్మవిజ్ఞానం — ప్రపంచ ప్రవిలయనం కూడ సిద్ధిస్తాయి. రజ్జువు యొక్క స్వరూపాన్ని తెలుసుకున్న తరవాత సర్పమనే భ్రమపోతుంది. ఆత్మవిద్యను బోధించే వాక్యాలు యథార్థత్వానికి అభిముఖుడుగా సాధకుణ్ణి చేయటానికే ఉద్దేశింపబడినవి కాని తత్త్వాన్ని విధించేవి కావు. బ్రహ్మవాక్యాలు జ్ఞానప్రబోధానికి నిర్దేశింపబడ్డాయి కాని విధిరూపములు కావు. జ్ఞాన సంబంధమైన నిర్గుణ ప్రతిపాదికముల యొక్క ఫలం మోక్షము. అయితే, కొన్ని సగుణ ప్రతిపాదికములు అభ్యుదయం—ఐశ్వర్యం ఇచ్చేవే. ఈ ఫలభేదం చేత రెండూ జీవుణ్ణి ఉద్దేశిస్తూ చెప్పినవైనా, వాటిలో ఏకవాక్యత కుదరదు.

# 6. ప్రకృతైతావత్త్వాధికరణమ్

## సూ: 3.2.22 ప్రకృతైతావత్త్వం హి ప్రతిషేధతి తతో బ్రవీతి చ భూయః

**పూర్వపక్షి:**

బృహదారణ్యకంలో బ్రహ్మమునకు మూర్తరూపమూ, అమూర్తరూపమూ రెండూ ఉన్నాయని శ్రుతిలో ఇలా వినబడుతున్నది: *"ద్వే వావ బ్రహ్మణో రూపే మూర్తంచైవ అమూర్తం చ"* (బృ.ఉ 2.3.1). పంచ భూతాత్మకమైన ఈ రెండు రూపాలను ఇలా వివరించడమైనది. పృథివీ–ఆపస్–తేజో రూపమయమైనది బ్రహ్మము యొక్క సాకార మూర్తరూపం. ఆదిత్యమండలం దాని కార్యము. వాయురంతరిక్షాత్మకమైన బ్రహ్మము, రూపరహితమైన అమూర్త లక్షణము కలది. ఆదిత్య మండలంలో నున్న పురుషుడు అమూర్తబ్రహ్మము యొక్క కార్యము. అధిదైవతమైన మూర్తామూర్త ప్రపంచాన్ని ఈ విధంగా ప్రస్తావించిన తరువాత, అధ్యాత్మ శరీరాంతర్గతమైన మూర్తరూపము, తేజో అబన్నాత్మకమైనదని చెప్పబడింది. ఈ మూర్తరూప కార్యమే నేత్రగోళం (కంటిపాప). వాయురాకాశాత్మకమైన అమూర్త రూపంలో ఉన్నదే లింగశరీరం (సూక్ష్మశరీరం). అమూర్తరసమైన శారీరుడి యొక్క ఈ పురుషరూపాన్ని వివిధ రంగులలో వర్ణించడమైనది.

సల్లక్షణ (సద్రూపమైన) ప్రపంచాన్ని అధిదేవత, అధ్యాత్మ విభజనతో ప్రతిపాదించిన తరవాత *"అథాత ఆదేశో నేతి–నేతి న హ్యేతస్మాదితి నేతి అన్యత్ పరమస్తి"* (బృ.ఉ 2.3.6) అని బోధించటంలో భావం ఏమిటని సందేహం కలుగుతున్నది. నేతి నేతి అనే ఉపదేశం దేనిని నిరాకరించమని బోధిస్తున్నది? బ్రహ్మనా? రూపమున్న ప్రపంచాన్నా? రూపాలను, రూపవత్తులను కూడానా? నేతి, నేతి అని రెండు పర్యాయములు వినిపించటం వలన రూపవత్తైన బ్రహ్మనూ, సరూప్నిషేధిస్తున్నట్లు భావించవచ్చు. కాకపోతే, ప్రత్యక్షంగా కంటికి కనబడుతూ వివిధ రూపాలతో ఉన్న ఈ బాహ్యప్రపంచాన్ని నిషేధించటం తగదు. కాబట్టి, వాఙ్మనస్సులకు అతీతమైన బ్రహ్మ నిషేధమే ఈ ఉపదేశంలో సూచింపబడుతున్నట్లు భావించాలి.

**సిద్ధాంతం:**

ఉభయప్రతిషేధం అంటే రూపవత్తైన బహ్మమునూ, సాకార రూపమైన్త ప్రపంచాన్ని నిషేధించటం శూన్యవాదం అవుతుంది. అది వేద విరుద్ధము. కనబడుతున్న ప్రపంచాన్ని నిషేధిస్తూ దానికి కారణము (మూలమైన బ్రహ్మమును) అన్వేషించి గ్రహించవచ్చు. బ్రహ్మమే లేకపోతే *"బ్రహ్మ తే బ్రవాణి"* (బ్రహ్మను గురించి చెబుతాను –బృ.ఉ 2.1.1) అనే ప్రతిజ్ఞే ఉండదు. తైత్తిరీయంలో *"అసన్నేవ స భవతి, అసత్‌బ్రహ్మేతి వేదచేత్"* (పరబ్రహ్మమే లేదని ఎవడు భావిస్తాడో, వాడు తననుతానే నిరాకరిస్తున్నట్లు అవుతుంది – తై.ఉ 2.6.1). కఠోపనిషత్తులో *"అస్తీత్యేవ ఉపలబ్ధవ్యః"* (పరమాత్మ ఉన్నదనే గ్రహించాలి – క.ఉ 6.13). బ్రహ్మము లేకపోతే *"బ్రహ్మ విదాప్నోతి పరమ్"* (తై.ఉ 2.1.1), *"సత్యం జ్ఞానమనంతం"* (తై.ఉ 2.11.1) ఇత్యాది శ్రుతి బోధనలన్నీ నిరర్థకములు అవుతాయి.

*"యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ"* అనే శ్రుతి (తై.ఉ 2.4.1) వాక్కు చేత చెప్పడానికి శక్యము కానిది, మనస్సు కూడాగ్రహించలేనిది అని ప్రత్యగాత్మ స్వరూపమైన బ్రహ్మనే నిర్దేశిస్తున్నది. అందువల్ల 'నేతి, నేతి' అనే శబ్దం బ్రహ్మము యొక్క రూపప్రపంచాన్ని నిషేధిస్తూ, తత్కారణమైన బ్రహ్మమును గ్రహించమని బోధిస్తున్నది. బ్రహ్మము కంటె భిన్నంగా మరొక ప్రపంచమనేది లేదు అని నిర్ధారిం చటం కోసమే *"నాన్యత్ పరమస్తి"* (బృ.ఉ 2.3.6) అని చెప్పడమైనది. ఈ విషయాన్నే సూత్రంలో *"తతో బ్రవీతి చ భూయః"* అనే భాగంలో సూచించడమైనది.

## సూ: 3.2.23 తదవ్యక్తమాహ హి

బ్రహ్మము ఏ విధంగానూ గ్రహింపబడదు. *"న చక్షుషా గృహ్యతే నాపివాచా నాన్యైః దేవైః, తపసా కర్మణా వా"* (బ్రహ్మను కంటితో చూడలేం, వాక్కుతో చెప్పలేం, ఇతర ఇంద్రియాల చేత, తపస్సు వలన, కర్మ ద్వారా గ్రహించలేము

–ము.ఉ 3.1.8) *“యత్తదద్రేశ్య మగ్రాహ్యమ్”* (ము.ఉ 1.1.6). *“యదా హ్యేవైష ఏతస్మిన్న దృశ్యేనాత్మ్యేఽనిరుక్తేఽనిలయనే”* (తై.ఉ 2.7.1). ఈ విధంగా ఉపనిషద్వాక్యాలు బ్రహ్మము అవ్యక్తమని, అగ్రాహ్యమనీ స్పష్టం చేస్తున్నాయి. అలాగే భగవద్గీతలో కూడా *“అవ్యక్తో ఽయం, అచింత్యోఽయం అవికార్యోఽయముచ్యతే”* (భ.గీ 2.25) అనేచెప్పబడింది.

## సూ: 3.2.24 అపి చ సంరాధనే ప్రత్యక్షానుమానాభ్యామ్

అవ్యక్తమూ, ఆకారరహితమూ అయితే బ్రహ్మాప్తి ఎలా అవుతుంది? యోగులు భక్తి–ధ్యాన సంయుక్తమైన అనుష్ఠాన సమయంలో (దీనినే సంరాధన సమయమని అంటారు), బ్రహ్మ సాక్షాత్కారం చేసుకుంటారని శ్రుతులు–స్మృతి వాక్యాలు సూచిస్తున్నవి. *“పరాంచిఖాని వ్యతృణత్ స్వయంభూః తస్మాత్ పరాఙ్పశ్యతి నాంతరాత్మన్, కశ్చిద్ధీరః ప్రత్యగాత్మాన మైక్షత్, ఆవృత్తచక్షుః అమృతత్వమిచ్ఛన్”* (బాహ్యేంద్రియాల ద్వారా బహిర్ముఖులుగానే మానవుల్ని బ్రహ్మ సృష్టించాడు. అందువల్ల బాహ్యప్రపంచాన్నే చూడగలరుకాని అంతరాత్మను చూడలేరు. ఎవరో కొందరు మోక్షగాములు, బుద్ధిబలంతో అంతర్ముఖులై ప్రత్యగాత్మను దర్శించుకుంటారు – క.ఉ 4.1). మరో శ్రుతి ఇలా విన్పిస్తున్నది: *“జ్ఞాన ప్రసాదేన విశుద్ధ సత్త్వ స్తతస్తు తం పశ్యతే నిష్కలం ధ్యాయమానః”* (నిర్మలమైన మనో బుద్ధులున్న జ్ఞాని, ధ్యానంలో అఖండమైన పరమాత్మను చూస్తాడు – ము.ఉ 3.1.8).

మహాభారతంలో ఈ విధంగా చెప్పబడింది: *“యోగినః తం పశ్యంతి భగవంతం సనాతనం”* (యోగులు సనాతనమైన ఆ భగవంతుని చూస్తారు – మ.భా.ఉ 4.6.1). అదే విధంగా మరో పర్వంలో, ఇంద్రియనిగ్రహం ఉన్నవారు, శ్వాసను జయించినవారు, అలసత్వం లేనివారు, సంతుష్టహృదయులూ ఆత్మజ్యోతిని దర్శించుకొన్న యోగులకు నమస్కారము అని చెప్పడమైనది (మ.భా.శాం. 47.35).

**సంశయం:**

ధ్యానించేవాడు వేరు, ధ్యానించతగినవాడు వేరు, ఈ విధంగా ధ్యాన మార్గంలో (అనుష్ఠానం ఇత్యాదుల్లో) చెబుతుంటే మరి జీవాత్మ– పరమాత్మ భేదాన్ని బోధిస్తున్నట్లే కదా? ఈ ప్రశ్నకు సమాధానంగా క్రింది సూత్రం చెప్పబడింది:

## సూ: 3.2.25 ప్రకాశాదివచ్చావైశేష్యం ప్రకాశశ్చ కర్మణ్యభ్యాసాత్

ధ్యాన సంయుక్తమైన కర్మయందు, సూర్యప్రకాశాదుల వలె ఆత్మ ఉపాధి వశం చేత భిన్నంగా ఉన్నట్లు అగుపడుతుంది. కాని వాస్తవంలో జీవ–బ్రహ్మ అభేదాన్నే ఉపనిషత్తులలో పలుమార్లు బోధించడమైనది. ఇంతకుముందు జల–సూర్య దృష్టాంతంతో వివరించినట్లు ఆత్మ భేదం ఉపాధులవల్ల వ్యక్తమవుతున్నది. సహజ చైతన్య రూపం గల జీవాత్మ – ప్రజ్ఞానాత్మల స్వాభావిక ఏకత్వాన్ని అభిన్నత్వాన్ని పలుమార్లు ఉపనిషత్తులు స్థిరీకరించాయి.

## సూ: 3.2.26 అతోఽనంతేన తథాహి లింగమ్

జీవేశ్వరుల భేదం కేవలం అవిద్యాకృతమైనది. అవిద్యను జ్ఞానం చేత నాశనం చేసుకున్నవాడు బ్రహ్మవేత్త అవుతాడు. *“స యో హ వై తత్పరమం బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి”* అని శ్రుతి వాక్యం (ము.ఉ 3.2.9). పరబ్రహ్మను తెలుసుకున్నవాడు బ్రహ్మమే అవుతాడు. అలాగే మరోశ్రుతి *“బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి”* (బ్రహ్మగానే ఎప్పుడూ ఉన్నటువంటి జీవుడు బ్రహ్మను పొందుతాడు – బృ.ఉ 4.4.6). అందువల్ల, అభేదం స్వాభావికం కాబట్టి జీవాత్మ–ప్రజ్ఞానాత్మతో ఏకత్వాన్ని పొందుతుంది.

## సూ: 3.2.27 ఉభయవ్యపదేశాత్త్వహికుండలవత్

ధ్యానించేవాడు–ధ్యానించ దగినది, పొందేవాడు–పొందబడేది, చూచేవాడు– చూడబడేది అని జీవుడు–

పరమేశ్వరుడు వేరు వేరుగా చెప్పే భేదశ్రుతులు *"అహం బ్రహ్మాస్మి"* , *"తత్త్వమసి"* , *"ఏషత ఆత్మా సర్వాంతరః"* , *"ఏషత ఆత్మా అంతర్యామి అమృతః"* ... అని వినిపిస్తున్న అభేదశ్రుతులూ రెండూ ఉన్నాయి. అందువల్ల ఉభయ వ్యపదేశంగా అహి–కుండల న్యాయాన్ని అనుసరించి గ్రహించినా విరోధమేమీ ఉండదు. అంటే, పాము–చుట్ట (అహికుండలం) పాము అని చెప్తే అభేదమవుతుంది, దానినే మరోవిధంగా లావు, పొడవు ఇత్యాది విశేషాలతో చెప్తే భేదం ఉంటుంది. అదే వ్యత్యాసం కాని తత్త్వతః జీవ–ప్రాజ్ఞులకు ఎట్టి స్వాభావిక భేదమూ లేదనే శ్రుతి వచనాలు తెలియజేస్తున్నవి. అంతర్యామిగా పరమాత్మయే, జీవుడి చేతనత్వానికి మూలకారణం. *"జీవో బ్రహ్మైవ"* అనేదే అద్వైత సిద్ధాంతము.

## సూ: 3.2.28 ప్రకాశాశ్రయద్వా తేజస్త్వాత్

సూర్యసంబంధమైన ప్రకాశము, దానికి ఆశ్రయమైన సూర్యుడు వేరు చెయ్యబడవు. రెండూ తేజస్సులే. అయినా, సూర్యుని తేజస్సు అని భేద నిర్దేశం చెయ్యబడుతున్నది. ఈ విధంగానే జీవ–పరమాత్మల భేద నిర్దేశాన్ని చూపవచ్చు.

## సూ: 3–2–29 పూర్వవద్వా

పైన సూచించినట్లు కాక, *"ప్రకాశాదివచ్చా వైశేష్యమ్"* అనే సూత్రంలో (3.2.25) వివరించినట్లు అవిద్యారూపమైన బంధాన్ని తొలగిస్తే మోక్షం సాధించ బడుతుంది. అందువల్ల జీవేశ్వర భేదం కేవలం అవిద్యాకల్పితమనే నిర్ణయించుకోవాలి.

## సూ: 3.2.30 ప్రతిషేధాచ్చ

*"నాన్యోఽతోఽస్తి ద్రష్టా"* (బృ.ఉ 3.7.23) అనే శ్రుతి, పరమాత్మ తప్ప మరొక చేతన పదార్థాన్ని నిషేధిస్తున్నది. *"తదేతత్ బ్రహ్మ అపూర్వం అనపరం అనంతరం అబాహ్యమ్"* (బృ.ఉ 2.5.19), *"అథాత ఆదేశో నేతి నేతి"* (బృ.ఉ 2.3.6) అనే శ్రుతి వచనాలు కూడా బ్రహ్మము కన్నా వ్యతిరిక్తమైన ప్రపంచాన్ని నిరాకరిస్తూ, సమస్తమునకు కారణమైన బ్రహ్మము మాత్రమే చివరకు మిగులుతున్నట్లు నిర్ధారిస్తు న్నవి. అందువల్ల పరమాత్మకు వ్యతిరిక్తమైన జీవాత్మ లేదనే సిద్ధాంతం.

# 7. పరాధికరణమ్

## సూ: 3.2.31 పరమతః సేతూన్మానసంబంధభేదవ్యపదేశేభ్యః

(ఇది పూర్వపక్ష సూత్రము)

జగత్సర్వమూ నిషేధింపగా మిగిలిన బ్రహ్మము కంటె పరమైన మరొక తత్త్వం ఉన్నట్లు కొన్ని శ్రుతి వాక్యాలు అనుమాన జనితములుగా ఉన్నాయి. *"అథయ ఆత్మా స సేతుర్విధృతిః"* అని శ్రుతి (ఛా.ఉ 8.4.1). అంటే పరమాత్మ ఈ లోకాన్ని దాటటానికి సేతువు అని చెప్పినట్లే కదా? అలాగే *"సేతుం తీర్త్వా"* అని వారధిదాటితే బ్రహ్మలోకం చేరుతున్నట్లు మరో శ్రుతిలో వినబడుతున్నది (ఛా.ఉ 8.4.2). సేతువు ఆవలి గట్టున బ్రహ్మము కన్నా పరమైన మరొక పదార్థం ఏదైనా ఉందా అనే సంశయం కలుగుతున్నది.

ప్రకాశవాన్, ఆనంతవాన్, జ్యోతిష్మాన్, ఆయతనవాన్ అని బ్రహ్మకు నాలుగు పాదాలు ఉన్నవి. ప్రతీదానికి, గోవు పాదంలా రెండేసి చీలికలు (మొత్తం ఎనిమిది భాగాలు–శఫాలు). ఒక్కొక్క పాదంలో నాలుగేసి కళలు వంతున మొత్తం పదహారు కళలు ఉంటాయని ఒక పరిమాణ (ఉన్మాన) సూచన చెయ్యబడింది: *"తదేతత్ బ్రహ్మ చతుష్పాద, అష్టాశఫం, షోడశకలమ్"* . కొలతసూచకంతో బ్రహ్మ నిర్దేశం (వ్యపదేశం) జరిగినందు వల్ల బ్రహ్మము కంటె భిన్నమైన పదార్థాలు ఉండవచ్చుననే సంశయం ఉత్పన్నమవుతుంది.

ఇంతేకాక, పలుచోట్ల సంబంధ నిర్దేశం కూడా బ్రహ్మము విషయంలో చెయ్యబడింది *"సతా సోమ్య తదా సంపన్నో భవతి"* (ఛా.ఉ 6.8.1), శారీర ఆత్మా (తై.ఉ 2.3.1), *"ప్రాజ్ఞేనాత్మనా సంపరిష్వక్తః"* (బృ.ఉ 4.3.2). అదే విధంగా భేద వ్యపదేశాన్ని సూచిస్తూ *"అథయ ఏషోఽన్తరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే"* అనే శ్రుతిలో పురుషుడు (ఈశ్వరుడు) ఆదిత్య మండలంలో సువర్ణప్రకాశము వలె జ్యోతిస్వరూపంగా కనబడుతున్నాడని చెప్తూ తదనంతరం 'అథయ ఏషోఽన్తః అక్షిణి పురుషో దృశ్యతే" (ఛా.ఉ 1.7.5) అని చెప్పబడింది. అంటే ఆదిత్యమండలానికి ఆధారమైన ఆ పురుషుడు, నేత్రంలో ఉన్న అక్షిపురుషుడు భిన్నమనే కదా?

కొన్ని సందర్భాలలో రూపాదులను, లోక (స్థాన) నిర్దేశాలను కూడా శ్రుతి వాక్యాలలో చెయ్యడమైనది. *"తస్య ఏతస్య తదేవరూపం యదముష్యరూపం, యావ ముష్యగేష్ణౌ తౌ గేష్ణౌ యన్నామ తన్నామ"* – ఛా.ఉ 1.7.5. ఆదిత్యగత పురుషుడు ఊర్ధ్వలోకాలలోను, అక్షిపురుషుడు అధోలోకాలలోను ఇలా వేరు వేరు స్థానాలలో వారికి ఆధిపత్యం ఉంటుందని ఈ శ్రుతులు విన్పిస్తున్నవి: *"యేచ అముష్మాత్ పరాంచో లోకా స్తేషాం చేష్టే దేవకామానాం చ"* (ఛా.ఉ 1.6.8); *"యేచ ఏతస్మాత్ అర్వాంచో లోకా స్తేషాం చేష్టే మనుష్యకామానాం చ"* (ఛా.ఉ 1.7.8). అంటే ఆదిత్య లోకము కంటె పైన గల ఊర్ధ్వలోకములకు ఒక నియామకుడు, అక్షి పురుషునకు మనుషులకు భోగార్హమైన లోకాలపై ఆధిపత్యం ఉంటుందనే సూచన వ్యక్తమవుతున్నది కదా?

## సూ: 3.2.32 సామాన్యాత్తు

(పూర్వపక్ష ఆక్షేపణలను ఖండిస్తూ ప్రతిపాదించిన సూత్రం)

సృష్టి–స్థితి–లయకారకుడు బ్రహ్మము అని, అట్టి చేతన స్వరూపము కంటె భిన్నమైనది మరొకటి లేదని *"సదేవ సోమ్య ఇదమగ్ర ఆసీత్ ఏకమేవాద్వితీయమ్"* అనే ఛాందోగ్యశ్రుతి నిర్ధారిస్తున్నది (ఛా.ఉ 6.2.1). బ్రహ్మము కన్నా వ్యతిరిక్తమైన మరే పదార్థానికి చేతన స్వభావం ఉండదు. అదీకాక, బ్రహ్మము అజం (పుట్టుకలేనిది). అందువల్ల సేతువుకి అవతల గట్టున మరో భిన్నమైనదీ, ప్రకాశవంతమైన పదార్థం ఉండవచ్చుననే సందేహం నిరాధారమైనది. *"సేతుం తీర్త్వా"* అనే శ్రుతివాక్యం, జల ప్రవాహాన్ని బంధించి నిలబెట్టటానికి సేతువు ఎలా ఉపకరిస్తుందో అలా బ్రహ్మమును పొందటానికి ఒక సాధనముగ సూచిస్తున్నట్లు గ్రహించాలి.

## సూ: 3.2.33 బుద్ధ్యర్థః పాదవత్

బ్రహ్మమునకు నాలుగుపాదములు, షోడశకళలు ఇలా పరిమాణాలతో (కొలతలతో) చెప్పిన శ్రుతులు ఉపాసనా విద్యల సాధనకు చెప్పబడినవి. మనుష్యుల్లో కొందరు మందబుద్ధులు, మధ్యమబుద్ధులు, ఉత్తమబుద్ధులు ఉంటారు కదా! అందువల్ల బ్రహ్మము యందు బుద్ధిని ఏకాగ్రత చేసుకోవటానికి, స్థిరీకరించు కోవటానికి వీలుగా పాద విభజన చేసి, బ్రహ్మము యొక్క పదహారుకళలు ప్రస్తావించటం జరిగింది. ధ్యానసాధనను పరిమాణ విభజన (ఉన్మానం) సులభతరం చేస్తుంది.

## సూ: 3.2.34 స్థానవిశేషాత్ప్రకాశాదివత్

సంబంధం ఉండటం, సంబంధం లేకపోవటం అనే భేదం ఉపాధిబట్టి వచ్చేదే. సుషుప్తిలో ఇంద్రియాలు వాటివాటి వ్యాపారాల నుండి నిష్క్రమిస్తే, విశేష జ్ఞానం పోతున్నది. శరీరంతో సంబంధం ఏర్పడిన వెంటనే విశేషజ్ఞానం వస్తున్నది. ఆత్మకు, బుద్ధిమొదలైన శరీర స్థానవిశేషాలతో సంబంధం ఉన్నప్పుడు విశేష విజ్ఞానం శాంతిస్తున్నది. అలాగే, సూదిరంధ్రంలో ఉన్న ఆకాశం, మహదాకాశం ఒక్కటే అయినా, ఉపాధికారణంగా అది వేరుగా ఉన్నట్లు కనబడుతుంది. ఆత్మ విషయంలో కూడ స్థాన నిర్దేశమూ, భిన్న నిర్దేశమూ ఉపాధిననుసరించి చెయ్యబడ్డాయి.

## సూ: 3.2.35 ఉపపత్తేశ్చ

ఉపాధికృతమని నిర్ణయిస్తేనే సంబంధ వ్యపదేశమూ భేదవ్యపదేశమూ కుదురుతాయి. సుషుప్తిలో *"స్వమపీతో భవతి"* (ఛా.ఉ 6.8.1) ఇక్కడ, ఉపాధి నుండి వేరైన ఆత్మ, స్వస్వరూపమైన పరమాత్మను చేరి లయమవుతుందని చెప్పబడింది. ఉపాధియైన శరీరసంబంధం విడిపోవడం వలనే ఆత్మైక్యత సాధ్యమవుతున్నది.

ఆకాశ భేదనిర్దేశం కూడా ఉపాధికనుగుణంగానే చెయ్యబడింది. *"యోఽయం బహిర్ధా పురుషాదాకాశః"* (పురుషుని శరీరమునకు ఉన్న బాహ్యాకాశం), *"యో ఽయం అంతః పురుష ఆకాశః"* (పురుషుని శరీరములో ఉన్న ఆకాశము), *"యో ఽయం అంతర్హృదయ ఆకాశః"* (హృదయంలోని దహరాకాశము). అని వినిపిస్తున్న ఈ శ్రుతివాక్యాలు (ఛా.ఉ 3.12.7, 8, 9.) సర్వగతమైన ఆకాశానికి భూతాకాశమని, దేహాకాశమని, హృదయాకాశమని స్థాన భేదం, ఉపాధికనుగుణ్యంగా చేస్తున్నట్లు విదిత మవుతున్నది. ఉపాధిపరంగా తప్ప ఆకాశానికి మరోవిధంగా భేదనిర్దేశం కుదరదు.

## సూ: 3.2.36 తథాన్యప్రతిషేధాత్

శ్రుతి వాక్యాలు బ్రహ్మము కన్న భిన్నమైన మరో అంతరాత్మ లేదనే నిర్ధారి స్తున్నవి. *"అహమేవ అధస్తాత్"* (ఛా.ఉ 7.25.1), *"స ఏవ అధస్తాత్"* (ఛా.ఉ 7.25.2), *"ఆత్మైవ అధస్తాత్"* (ఛా.ఉ 7.25.2), *"సర్వే తం పరాదాద్యో ఽన్యత్రాత్మనః సర్వంవేద"* (ఆత్మకంటె వేరుగా సర్వమూ ఉన్నదని తలచే వాటిని ఆ సర్వమూ తినివేస్తుంది – బృ.ఉ 2.4.6). *"బ్రహ్మై వేదం సర్వమ్"* (ఇదంతా బ్రహ్మమే). *"నేహ నానాస్తి కించన"* (బృ.ఉ 4.4.19), *"యస్మాత్పరం నాపరమస్తి కించిత్"* (శ్వే.ఉ 3.9), *"తదేతత్ బ్రహ్మ అపూర్వమనపరమనంతరమబాహ్యమ్"* (బృ.ఉ 2.5.19), ఖల్విదం బ్రహ్మ, సర్వమూ బ్రహ్మమనే ఈ శ్రుతి వాక్యాల తాత్పర్యము.

## సూ: 3.2.37 అనేన సర్వగతత్వమాయామ శబ్దాదిభ్యః

ఆత్మ సర్వ వ్యాపకమని 'ఆయామ' శబ్దం నిర్ధారిస్తున్నదని సూత్రార్థం.

బ్రహ్మ సర్వవ్యాపి, సర్వగతత్వం వల్ల సేత్వాది భిన్ననిర్దేశాలు అన్నీనిరాకరింప బడతాయి. ఆత్మకు పరిచ్ఛిన్నత్వము లేదు, సర్వ వ్యాపకమైన ఆత్మస్వరూపమే జగత్తుగా భాసిస్తూ కనబడుతున్నదని శ్రుతి, స్మృతి వాక్యాలు నిర్ధారిస్తున్నవి.

*"యావాన్ వా అయమాకాశః తావాన్ ఏషోఽన్తర్హృదయ ఆకాశః"* (ఛా.ఉ 8.1.3). *"ఆకాశవత్ సర్వగతశ్చ నిత్యః"* (గౌ.కా. 3.3). *"జ్యాయాన్ దివః"* (ఛా.ఉ 3.14.3), *"జ్యాయాన్ ఆకాశాత్"* (శ.బ్రా 10.6.3.), *"నిత్యః సర్వగతః స్థాణురచలోఽయం సనాతనః"* (ఆత్మ నిత్యమైనది, సర్వత్ర వ్యాపించి ఉన్నది, స్థిరమైనది, శాశ్వతమైనది – భ.గీ 2.24).

ఆత్మయే సత్యము, జగత్తు దాని యొక్క ఆభాస రూపము అని భావించి నప్పుడే ఆత్మకు సర్వగతత్వం కుదురుతుంది. ఆత్మ వేరు – జగత్తు వేరు అంటే జగత్తులో కాక ఆత్మ భిన్నంగా ఎక్కడో భాసిస్తూ ఉండాలి. ఇది వేదాంత సిద్ధాంతానికే విరుద్ధం. కాబట్టి జగత్తు ఉండే స్థానంలోనే సర్వత్రా ఆత్మ వ్యాపించి ఉందని నిర్ణయించుకోవాలి.

## 8. ఫలాధికరణమ్

### సూ: 3.2.38 ఫలమత ఉపపత్తేః

సర్వేశ్వరుడు, సృష్టి–స్థితి–లయకారకుడు. సర్వాధ్యక్షుడైన ఈశ్వరాధీనంలోనే ప్రాణులకు త్రివిధమైన కర్మఫలం లభిస్తుందని ఈ అధికరణంలో ప్రస్తావించబడింది. ఇష్టం–అనిష్టం–వ్యామిశ్రం అనే మూడు జగత్సంబంధమైన ఫలాలు, జీవులు వారి వారి కర్మలననుసరించి అనుభవిస్తారు. ఇది ఈశ్వర నిర్ణయం ప్రకారమే జరుగుతుంది. కర్మ అనిత్యమైనది కాబట్టి కర్మ వల్ల కాలాంతరంలో పొందే ఫలం లభిస్తుందని చెప్పటం యుక్తం కాదు. దేశకాల విశేషాలు తెలిసిన బ్రహ్మము సర్వజ్ఞుడు. అందు కారణంగా, జీవుడు తన కర్మఫలాన్ని పరమేశ్వరుని నిర్ణయం ప్రకారమే అనుభవిస్తాడు.

### సూ: 3.2.39 శ్రుతత్వాచ్చ

శ్రుతివాక్యాలు కర్మఫలం ఈశ్వరేచ్ఛ వల్ల కర్తలకు లభ్యమవుతున్నట్లు ఈ విధంగా వినబడుతున్నవి: *“స వా ఏష మహానజ ఆత్మా అన్నాదో వసుదానః”* (అజుడైన పరమాత్మయే ప్రాణులకు ధన–ధాన్యములు ఇస్తున్నాడు – బృ.ఉ 4.4.24).

### సూ: 3.2.40 ధర్మం జైమినిరత ఏవ

జైమిన్యాచార్యులువారు మాత్రం కర్మ వల్లే ఫలం లభిస్తుందని భావిస్తున్నారు. *“స్వర్గకామో యజేత”* ఇత్యాది విధివాక్యాలు కర్మానుష్ఠానం ఫలప్రాప్తికి కారణం అని సూచిస్తున్నవి. అందువల్ల, కర్మఫలం ఉత్తరోత్తరా కూడా అనుభవించవచ్చును అని అభిప్రాయ పడుతున్నారు. కర్మ ఫలితాన్ని ఇవ్వకపోతే కర్మలే వ్యర్థం. అందువల్ల, ఫలం విధ్యుక్త ధర్మాచరణ వల్ల లభిస్తుందని జైమిన్యాచార్యులు వారి మతం.

### సూ: 3.2.41 పూర్వం తు బాదరాయణో హేతువ్యపదేశాత్

బాదరాయణులవారు ముందు చెప్పినట్లుగానే, కర్మలు ఈశ్వర ప్రేరితములు కాబట్టి ఈశ్వరుడే కర్మఫలానికి హేతువని భావిస్తున్నారు. ధర్మాధర్మాలు చేయించినవాడు ఈశ్వరుడనే శ్రుతులు పల్కుతున్నవి. *“హ్యేష హ్యేవ సాధుకర్మ కారయతి తం యం ఏభ్యో లోకేభ్య ఉన్నినీషతే, ఏష ఉ ఏవ అసాధుకర్మ కారయతి తం యం ఏభ్యో లోకేభ్యో–ధో నినీషతే”* (కౌ.ఉ 3.8).

కర్మాపేక్ష వల్లనైనా, అపూర్వాపేక్ష వల్లనైనా కర్మఫలాన్ని ఇచ్చేవాడు పరమాత్మయే. భగవద్గీతలో కూడా భగవదుపదేశం ఇలా ఉంది: *“యో యో యాం యాం తనుం భక్తః, శ్రద్ధయార్చితుమిచ్ఛతి, తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్”*. *“స తయా శ్రద్ధయా యుక్తస్తస్యారాధనమీహతే, లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హి తాన్”* (ఏ భక్తుడు ఏ దేవతా స్వరూపమును శ్రద్ధతో ఆరాధించాలని కోరుకుంటాడో, ఆ దేవత యందే వానికి భక్తి–శ్రద్ధలు కలిగేటట్లు చేస్తాను. తత్ఫలితంగా ఆ భక్తుడు నా వలనే ఆ భోగములను తప్పక పొందుతాడు – భ.గీ 7.21, 7.22). భగవంతుడు మానవ ప్రయత్నాన్ని బట్టి ఫలాన్ని సమకూరుస్తాడని ఈ విధంగా శ్రుతి–స్మృతి వాక్యాలు నిర్ధారిస్తున్నవి.

# *3.*

# సాధనాధ్యాయము – తృతీయపాదము



# 1. సర్వవేదాంతప్రత్యయాధికరణమ్

## సూ: 3.3.1 సర్వవేదాంతప్రత్యయం చోదనాద్యవిశేషాత్

రెండవపాదంలో విజ్ఞేయమైన బ్రహ్మము యొక్క స్వభావసిద్ధ నిత్యశుద్ధ తత్త్వాన్ని చర్చించడమైంది. ఈ ప్రకరణంలో వేదాంతాలలో బోధించిన విద్యాపరమైన ఉపాసనలలో ఏకత్వం ఉందా లేదా అనే విషయంపై చర్చ జరుగుతున్నది.

బ్రహ్మ అద్వితీయం. ఏకరూపమైనది. అందువల్ల, బ్రహ్మను పొందే ఉపాసనలలో కూడా ఏకత్వం ఉండాలి. అనేక విధములైన విజ్ఞానాలు–ఉపాసనలు ఉండకూడదని పూర్వపక్షి ఆక్షేపణ. బ్రహ్మవిజ్ఞానం విధిప్రధానం కాదు, బోధనాపరమైన చోదనా లక్షణం కలది. అందువల్ల ఉపాసనా విద్యలలో స్వల్పప్రక్రియా భేదాలు, శాఖా పరమైన భేదాలు ఉన్నా సర్వవేదాంతాలలో బోధింపబడ్డ ఉపాసనలలో ఏకత్వం తప్ప భిన్నత్వం చూడకూడదు. ఎలాగైతే యాగవిధి – చేసే విధానంలో శాఖాభేదాలు ఉన్నా ఫలభేదం యాజ్ఞికకర్మలకు లేదో, అదేవిధంగా ఉపాసనా విద్యల్లో, పద్ధతులు వేరైనా ఫలరూపంగా సిద్ధించేది సగుణబ్రహ్మ ప్రాప్తి. అందువల్ల విద్యావిధానంలో కించిత్ భిన్నత్వం దోషం కాదని సూత్రకారులు ప్రతిపాదిస్తున్నారు.

యజ్ఞ కర్మవిధులు నాల్గు రకాలుగా విభజిస్తారు: రూప, చోదన, సంయోగ, ఆఖ్య. చోదన ప్రక్రియ ప్రతిపాదిక శబ్దాన్ని సూచిస్తుంది అంటే ప్రయత్నాన్ని బోధించేది. చోదన పరంగా ఎట్టి విశేషం లేదు కాబట్టి అన్ని వేదాంతాలలో బోధించిన ఉపాసన లలో ఏకత్వం ఉంది అన్నదే సిద్ధాంతము.

## సూ: 3.3.2 భేదాన్నేతి చేన్నైకస్యామపి

**సంశయం :**

ఉపాసనా విద్యలలో గుణభేదం ఉండటం వల్ల వాటికి సర్వవేదాంత ప్రత్యయత్వం, అంటే అన్నివేదాల్లో అవి సమానమే అని చెప్పబడదు. పంచాగ్నివిద్యలో ఐదు అగ్నులనే ఛాందోగులు పఠిస్తుంటే, వాజసనేయశాఖవారు ఆరవ అగ్నిని కూడా దానితో కలుపుతున్నారు. అలాగే ప్రాణ సంవాదంలో ఛాందోగులు (వాజసనేయులు) భిన్న మంత్రపఠనం చేస్తున్నారు. ఈ భేదం వేద్య సంబంధమైనది కాదా?

**సమాధానం :**

ఇలా పఠించటం వల్ల విద్యాభేదం ఉందని నిశ్చయించబడదు. వాజసనేయులు, ఛాందోగులు కూడా ప్రత్యభిజ్ఞచేత పంచాగ్ని విద్యను–ఆరు అగ్నుల నిర్దేశమున్నదీ, ఒకే విద్యకు సంబంధించినదని తెలుసుకుంటున్నారు. అందువల్ల స్వల్ప వ్యత్యాసం ఉన్నా ఉపాసనలలో విద్యా ఏకత్వం ఉన్నదనే గ్రహించాలి.

## సూ: 3.3.3 స్వాధ్యాయస్య తథాత్వేన హి సమాచారేఽధికారాచ్చ సవవచ్చ తన్నియమః

అథర్వణ శాఖీయులు శిరోవ్రతం పాటిస్తారు. (శిరస్సు మీద అంగార పాత్ర అధ్యయన సమయంలో ధరించే పద్ధతి). ఈ వ్రతం ఆచరించని వారు అథర్వణ శాఖసంబంధమైన వేదాంతాలలో చెప్పిన బ్రహ్మవిద్యను అభ్యసించకూడదనే నియమాన్ని పాటిస్తారు. *"తేషాం ఏవైతాం బ్రహ్మవిద్యాం వదేచ్ఛిరోవ్రతం విధివ ద్యైస్తు చీర్ణమ్"* (బ్రహ్మ విద్యను శిరోవ్రతనియమాన్ని ఆచరించినవారికే బోధించాలి – ము.ఉ 3–2–10). సమాచారమనే వేదవ్రతాలను చేసేపద్ధతిని బోధించే గ్రంథంలో ఈ నియమం సూచింపబడింది. అందువల్ల, అథర్వణవేదానికి సంబంధించిన ఉపని షత్తులు అధ్యయనం చేసేవారు, ఈ సంప్రదాయం పాటించాలనే నియమం వచ్చింది. కాబట్టి ఇది గ్రంథ విశేషం కాని విద్యాధర్మం కాదు. హోమాలు (సవనాలు) చేసే విధానంలోను, అథర్వణ శాఖీయులు ప్రత్యేక విధాన్ని పాటిస్తారు. ఈ వ్యత్యాసం

ఉపాసనా విద్యకు సంబంధించినది కాదు, కేవలం అధ్యయన భేదంగానే పరిగణింప బడుతుంది.

## సూ: 3.3.4 దర్శయతి చ

శ్రుతి కూడా సర్వవేదాంతాలలో విద్యా ఏకత్వాన్నే చూపిస్తున్నది. *"సర్వే వేదా యత్పదమామనంతి"* (అన్ని వేదాలు–వేదాంతాలు ఏ బ్రహ్మస్థానాన్ని నిర్దేశిస్తూ ఓం అని చెప్తున్నాయో, దానినే బోధిస్తాను – క.ఉ 2.2.5). వేద్యమైన బ్రహ్మము సగుణమైనా, నిర్గుణమైనా ఆ ఒక్కదాన్నే వేదం నిర్దేశిస్తున్నది. ఐతరేయ ఆరణ్యకంలో శ్రుతివాక్యం ఇలా వినబడుతున్నది: *"ఏతమేవ బ్రాహ్మణా మహత్యుక్థే మీమాంసంతే, ఏమగ్నామధ్వర్యవః, ఏతం మహావ్రతే ఛందోగాః"* (దీనినే సామవేదీయులు ఉక్థం అనే స్తోత్రంలోను, అధ్వర్యులు అగ్నిలోను, ఛాందోగులు మహావ్రతంలోను పఠిస్తు న్నారు – ఐ.ఆ 3.2.3.12).

ఒకే శాఖలో చెప్పిన విషయాన్ని మరోశాఖలో ప్రతిపాదించిన విషయంతో సమన్వయం చేసుకుంటే ఏకత్వం వ్యక్తమవుతుంది. ఉదాహరణకు కఠోపనిషత్తులో *"మహత్‌భయం వజ్రముద్యతమ్"* (ఆ పరమాత్మ తలపై ఆన్చిన భయంకరమైన వజ్రాయుధం – క.ఉ 3.2) అని వినిపిస్తుంది. దీని వల్ల ఈశ్వరుడంటే భయాన్ని కలిగించేది అనే భావం వస్తుంది. తైత్తిరీయోపనిషత్తులో *"యదాహ్యేవైష ఏతస్మిన్నుదర మంతరం కురుతే, అథ తస్య భయం భవతి తత్త్వేవ భయం విదుషో-మన్వానస్య"* (నేను వేరు–పరమాత్మ వేరు అని ఎవరు భేదదృష్టితో చూస్తారో వారికే పరమేశ్వరుడు అంటే భయం కలుగుతుంది– తై.ఉ 2.7.1). ఈ శ్రుతి, భేదభావం భయానికి హేతువు కాబట్టి, నేనే బ్రహ్మను అని భావిస్తే ఎట్టి భయానికి తావులేదని స్పష్టం చేస్తున్నది.

కొద్దిపాటి వాక్యభేదంతో ఒకే విషయమైన వైశ్వానర ఉపాసన వాజసనేయులు, ఛాందోగులు ప్రస్తావిస్తున్నారు. వాజసనేయకమైన బృహదారణ్య కోపనిషత్తులో ప్రాదేశిక మాత్రంగా చెప్పిన వైశ్వానరుణ్ణి, సామవేదీయ ఛాందోగ్యో పనిషత్తులో, సర్వాత్మక అఖండస్వరూపమైన సిద్ధబ్రహ్మగా స్వీకరించమని బోధింప బడింది. *"యస్త్వేతమేవం ప్రాదేశమాత్ర మభివిమానమాత్మానం వైశ్వానరముపాస్తే స సర్వేషు లోకేషు, సర్వేషు భూతేషు, సర్వేషు ఆత్మసు అన్నమత్తి"* (ఛా.ఉ 5.18.1). ఈ విధంగా శేఖా భేదం కనబరుస్తూ, ఒక శ్రుతిలో ప్రస్తావించిన విద్యను, మరో శ్రుతిలో మరో సందర్భంలో ప్రస్తావించటం సామాన్యము. అందువల్ల శాఖాపరమైన భేదాన్ని విస్మరించి, ఉపాసన విద్యలో ఏకత్వభావాన్నే గ్రహించాలి.

## 2. ఉపసంహారాధికరణమ్

## సూ: 3.3.5 ఉపసంహారోఽర్థాభేదాద్విధిశేషవత్సమానే చ

ప్రయోజనంలో భేదం లేకపోవటం వలన విధిశేషములైన ధర్మాల వలనే గుణముల ఉపసంహారం ఒకే దాని యందు చెయ్యాలని సూత్రార్థం.

శాఖీయ భేదం కనబడుతున్నప్పుడు ఒక విద్యలో చెప్పిన గుణాలు ఆ శాఖకు చెందిన శ్రుతికి మాత్రమే వర్తిస్తాయా, లేక మరోశాఖలో చెప్పిన గుణాలతో ఉపసంహారం చేసుకోవాలా అనే సందేహం కలుగుతుంది.

ఉపాసనా ప్రయోజనం మారదు, ఒకటే అవుతుంది. అందువల్ల ఒక శ్రుతిలో ప్రస్తావించిన విజ్ఞాన గుణాలను, మరో శ్రుతిలో అదే విజ్ఞానానికి సంబంధించిన శ్రుతితో ఉపసంహారం చేసుకోవచ్చు. అగ్నిహోత్రాది విధికి అంగాలుగా ఉన్న ధర్మాలను అగ్నిహోత్రాది కర్మలందు సర్వత్రా ఒకే విధంగా ఉపసంహారం ఎలా జరుగుతుందో, అదే విధంగా విజ్ఞానం (ఉపాసన విద్య) ఒకటే అయితే, ఏ సందర్భంలో ఏ శాఖీయమైనా ఒకే విధంగా ఉపసంహారం చేసుకోవాలి.

యజ్ఞకర్మలో కొన్ని యాగాలకు అన్ని అంగాలు నిర్దేశింపబడతాయి, వీటిని ప్రకృతి యాగాలంటారు. కొన్ని యాగాలకు కొన్ని అంగాలనే చెప్పి మిగతావాటిని వదిలేస్తారు, వీటిని వికృతి యాగాలంటారు. ఈ వికృతి యాగాలు, ప్రకృతియాగాల రీతిలోనే నిర్వహించాలని ధర్మసూత్ర ప్రతిపాదన. అయితే ఉపాసన విద్యలకు ప్రకృతి – వికృతి అనే భేదం ఉండదు. అందువల్ల, ఉపాసన విద్యలన్నీ ఒకే విధమైన గుణోపసంహారం కలిగి ఉంటాయి. ఒకే విధంగా ముగిస్తాయి.

## 3. అన్యథాత్వాధికరణమ్

## సూ: 3.3.6 అన్యథాత్వం శబ్దాదితి చేన్నావిశేషాత్

(ఇది పూర్వపక్ష సూత్రం)

ప్రాణోపాసన వాజసనేయులకు, ఛాందోగులకు కూడా ఉన్నట్లు శ్రుతి వల్ల తెలుస్తున్నది. రెండింటిలోను ఉద్గీథం అనే పేరు వినబడుతున్నది.

వాజసనేయ శాఖకు చెందిన బృహదారణ్యకోపనిషత్తులో దేవతలు (సాత్త్విక వృత్తులైన జ్ఞానేంద్రియాలు) ముఖ్య ప్రాణోపాసన ద్వారా రాక్షసులను (రజస్తమో వృత్తులైన వాగాది కర్మేంద్రియాలను) జయించటానికి సంకల్పించినట్లు శ్రుతిలో ఇలా వినబడుతున్నది: *"తే హ దేవా ఊచుః హంత అసురాన్ యజ్ఞే ఉద్గీథేన అత్యయామేతి"* (ఇప్పుడీ యజ్ఞంలో ఉద్గీథం చేత రాక్షసులను అతిక్రమించి దేవత్వాన్ని పొందుదాము –బృ.ఉ 1.3.1). ఈ సంకల్పంతో అవి వాక్కును నీవు మా కోసం ఉద్గాత్రంచెయ్యమని కోరుతాయి. *"తే హ వాచం ఊచుః త్వం నః ఉద్గాయేతి"* (బృ.ఉ 1.3.2). ఉద్గాత అయిన వాక్కు అసురసంబంధమైన పాప వశమైనట్లు గుర్తించి వెంటనే ముఖ్యప్రాణాన్ని నీవు మాకు ఉద్గానం చెయ్యమని కోరుతాయి. *"అథ హఇమం ఆసన్యం ప్రాణం ఊచుః త్వం నః ఉద్గాయేతి. తథేతి తేభ్య ఏష ప్రాణ ఉదగాయాత్"* (బృ.ఉ 1.3.7).

సామవేదశాఖకు చెందిన ఛాందోగ్యోపనిషత్తులో కూడా దేవతలు ఉద్గీథం ద్వారా అసురులను జయించాలనుకున్నారని శ్రుతి ఇలా వినబడుతున్నది: *"తద్ధదేవా ఉద్గీథ మాజగ్ముః అనేన ఏనానభిభవిష్యామః"* (ఛా.ఉ 1.2.1). వాక్–మనస్సు ఇత్యాది ఇంద్రియాలు పాపసంబంధమైన అసుర వృత్తులచే వ్యాప్తమైనట్లు గ్రహించి, వాటన్నిం టిని ఉపాసనకు అనర్హమైనవని త్యజించి ముఖ్యప్రాణమును ఉద్గీథ స్వరూపముగా గ్రహించి ప్రాణోపాసన చేసినట్లు శ్రుతి ఇలా పల్కుతున్నది: *"అథ హ య ఏవాయం ముఖ్యః ప్రాణః తం ఉద్గీథం ఉపాసాంచక్రిరే"* (ఛా.ఉ 1.2.7). ఈ విధంగా రెండు ఉపనిషత్తుల్లోను ఒకే పేరుతో ప్రాణోపాసన యొక్క ప్రస్తావన జరిగింది. మిగతా వివరాలు కూడా సమానంగానే వినబడుతున్నాయి. అందువల్ల, ఈ రెండూ ఒకటేనా లేక విద్యాభేదం ఉందా అనే సంశయం కలుగుతున్నది.

## సూ: 3.3.7 న వా ప్రకరణభేదాత్పరోవరీయస్త్వాదివత్

ప్రకరణ భేదం వల్ల వాజసనేయుల ప్రాణవిద్య, ఛాందోగుల ఓంకార ఉపాసనము వేరు వేరు విద్యలుగా పరిగణించాలి. వీటిలో విద్యా భేదం స్పష్టంగా ఉంది. ఛాందోగ్యోపనిషత్‌లో ఉపక్రమం *"ఓమిత్యేతదక్షరముద్గీథముపాసీత"*, అని చెయ్యబడింది (ఛా.ఉ 1.1.1). ఓం అనే అక్షరము ఉద్గీథంలో ఒక అంగము. అదే ఇక్కడ ఉపాస్యము. సామవేదంలో ఒక విభాగానికి ఉద్గీథమని పేరు. సామవేదీయులు బ్రహ్మవిద్యలో ఓంకారాన్ని ఉపాసిస్తారు, ఉద్గీథాన్ని కాదు. బృహదారణ్యకంలో సర్వాత్మకమైన ముఖ్యప్రాణం, ఉపాస్యంగా చెప్పబడింది. శ్రుతిలో మరో వాక్యం ఇలా ఉంది: "వాచా చ *హ్యేవ స ప్రాణేన చ ఉదగాయత్"* (ఉద్గాత వాక్‌తో కూడిన ప్రాణం చేత ఉద్గానం చేసాడు – బృ.ఉ 1.3.24). ఇలా రెండు శాఖల్లోనువేరు వేరు ఉపాసనల గురించి చెప్పబడినట్లు తెలుస్తున్నది. ఉపక్రమ, ఉపసంహారాలలో భేదం ఉంటే వేరు వేరు కర్మలని, ధర్మశాస్త్రం అంగీకరిస్తున్నది. అదేవిధంగా ఉపాసన విద్యల్లో, ఉపక్రమం–ఉపసంహారం వేరుగా ఉంటే భిన్న విద్యలనే పరిగణించాలి.

ఆకాశ విద్యలో *"ఆకాశో హ్యేవ ఏభ్యో జాయాన్ ఆకాశః పరాయణమ్"* (ఆకాశం అన్నింటి కన్న పెద్దది, విస్తృతమైనది, అదే సర్వభూతాలకు ఆశ్రయము – ఛా.ఉ 1.9.1). అలాగే ఉద్గీథము సర్వోత్కృష్టమైనదని మరో శ్రుతి విన్పిస్తున్నది. *"స ఏష పరోవరీయాన్ ఉద్గీథః స ఏషోఽనంతః"* (ఉద్గీథ ప్రణవరూపము, ఓం పరమాత్మ స్వరూపము. దీనిని ఉపాస్యంగా ఎవడు స్వీకరించి ఉపాసన చేస్తాడో అతడు సర్వ లోకైశ్వర్యములు పొందుతాడు – ఛా.ఉ 1.9.2).

## సూ: 3.3.8 సంజ్ఞాతశ్చేత్తదుక్తమస్తి తు తదపి

బృహదారణ్యకంలోను, ఛాందోగ్యంలోను కూడా ఉద్గీథమనే పేరును ఉప యోగించినా, రెండూ వేరు వేరు ఉపాసనా విద్యలకు చెందినవి. అవి రెండూ వేరు వేరు ఉపాస్యాలను నిర్దేశిస్తున్నవి. వాజసనేయులకు ముఖ్యప్రాణం ఉపాస్యమైతే, ఛాందోగులు ఓంకారాన్ని ఉపాస్యంగా గ్రహిస్తున్నారు. అందువల్ల రెండింటికి విద్యా భేదం ఉంది.

కాఠకమనే గ్రంథంలో అగ్నిహోత్ర–దర్శపూర్ణ మాసమనే రెండు వేరువేరు కర్మలకు కాఠకమని ఒకే పేరు కనబడుతుంది. అవి ఏకత్వం లేని కర్మలు. అందువల్ల ఉద్గీథమని ఒకే సంజ్ఞ (పేరు) వినబడుతున్నందువల్ల ప్రాణోపాసన–ఓంకారోపాసన ఒకటికావు. అవి భిన్నమైన విద్యలు (విజ్ఞానాలు).

# 4. వ్యాప్త్యధికరణమ్

## సూ: 3.3.9 వ్యాప్తేశ్చ సమంజసమ్

ఓంకారమన్నది అన్నివేదమంత్రములలోను ఆద్యంతాలలోను వ్యాపించి ఉండటంవల్ల, ఉద్గీథమనేది ఓంకారానికి విశేషణంగా భావించటమే సమంజసమని సూత్రార్థం.

*"ఓమిత్యేత దక్షర ముద్గీథ ముపాసీత"* అని ఛాందోగ్యంలో ఉన్నబడుతున్న శ్రుతిలో (ఛా.ఉ 1.1.1), ఓం అనే శబ్దము ఉద్గీథమనే శబ్దమూ రెండూ ఒకే విభక్తిలో ఉన్నాయి. అందువల్ల దీనిని నాలుగు విధాలుగా అర్థం చేసుకోవచ్చుననే సందేహం వ్యక్తం చెయ్యబడింది: 1. అధ్యాస రూపంలో, అనగా ఓంను ఉద్గీథను ఒకదానియందు మరోదానిని అధ్యసించి, సాలగ్రామాన్ని విష్ణురూపంలో గ్రహించినట్లు; 2. అపవాద రూపంలోను అనగా తత్త్వమసి బోధనకు పూర్వము ఆత్మ–పరమాత్మ వేరు వేరు అనే భావన ఉన్నా, బోధనానంతరం ఆత్మ–పరమాత్మ అభేదాన్ని గ్రహించటం; 3. ఏకత్వం అంటే ఉద్గీథమే ఓంకారము, ఓంకారమే ఉద్గీథమని ఒకే అర్థాన్ని సూచిస్తున్నట్లు సమన్వయించుకోవటం; 4. విశేషణత్వం అంటే ఉద్గీథానికి సంబంధించిన ఓంకార మనే అర్థంలో (ఉదాహరణకు నీలోత్పలం అనే విశేషణంతో చెప్పినట్లు) గ్రహించాలా?

ఈ సందేహాలను నివృత్తి చెయ్యటానికే ఈ సూత్రం చెప్పబడింది. ఒక గ్రామంలో కొన్ని ఇళ్లు కాలిపోయినా, గ్రామం కాలిపోయిందని చెప్పటం పరిపాటి. అదేవిధంగా, ఓంకారము అనే శబ్దాన్ని మాత్రము వేదంలో ఎక్కడ వినబడినా వ్యాప్తి అనే కారణంగా, ఒకే విధంగా గ్రహించవలసి ఉంటుంది. కాని, ప్రస్తుత చర్చనీయాం శమైన ఉపాసనవిద్యకు సంబంధించి, ఓం అనే అక్షరానికి ఉద్గీథం అనేది విశేషణ మని చెప్పుకోవటం (అన్వయించుకోవటమే) సమంజసము.

# 5. సర్వాభేధాధికరణమ్

## సూ: 3.3.10 సర్వాభేదాదన్యత్రేమే

అంతటా ఒకే విధంగా, భేదం లేకుండా ప్రాణ శ్రేష్ఠత్వాన్ని చెప్పటం వలన, ఇతర స్థానాల్లో కూడా అలాగే ఉపసంహారం చేసుకోవాలని సూత్రార్థం.

**పూర్వపక్షం:**

ఛాందోగులు—వాజసనేయులు కూడా ప్రాణశ్రేష్ఠత్వం అంగీకరిస్తూ ముఖ్య ప్రాణాన్ని ఉపాస్యంగా స్వీకరించినట్లు శ్రుతిలో వినబడుతున్నది. *"యద్వా అహం వసిష్ఠోఽస్మి త్వం తత్ వసిష్ఠోఽసి"* (నీ కారణంగానే నాకు వసిష్ఠత్వం వచ్చినదని వాక్కు ప్రాణశ్రేష్ఠత్వాన్ని అంగీకరించింది – బృ.ఉ 6.1.14).

వాక్‌లో వసిష్ఠత్వం, చక్షుస్సులో ప్రతిష్ఠా, శ్రోత్రంలో సంపత్, మనస్సులో ఆయతనత్వం అనే గుణాలు ఉన్నాయని బృహదారణ్యకోపనిషత్తు, ఛాందోగ్యోపనిషత్తు ప్రాణసంవాద ప్రకరణములో ఒకే విధంగా ప్రస్తావిస్తున్నవి. అదే విధంగా కౌషీతకాది శాఖల్లో ప్రాణసంవాదం పూర్తిగా చర్చించకపోయినా, వాగాది దేవతలు వాటి శ్రేష్ఠత్వాన్ని నిరూపించుకోవటానికి కలహించుకున్నట్లు కౌషీతకంలో కూడ చెప్పబడింది. *"అథాతో నిఃశ్రేయసాదానమ్"* అని కౌషీతక శ్రుతిలో వినబడుతున్నది (ఇప్పుడు శ్రేష్ఠత్వం యొక్క నిర్ణయం చెయ్యబడుతున్నది). తదనంతరం *"ఏతా హ వై దేవతా అహం శ్రేయసే వివిదమానాః"* (ఎవరు మనలో గొప్ప అని తమ శ్రేష్ఠత్వాన్ని నిరూపించు కోటానికి వాగాది దేవతలు కలహించారు – కౌ. 2.14). ఈ విధంగా ప్రాణసంవాద ప్రసక్తి చాలా శాఖల్లో ఉంది. అయితే, ప్రాణానికి శ్రేష్ఠత్వం చెప్పబడింది కాని వసిష్ఠత్వం ఇత్యాది గుణాలు అన్ని చోట్ల చర్చింపబడలేదు. ఛాందోగ్యంలోను (5.1.1), బృహదారణ్యకంలోను (6.1.1) ఒకే విధంగా చెప్పబడ్డాయి. అందువల్ల, మిగతా శాఖల్లోని శ్రుతులను ఆయా ధర్మాలతో కలిపి, ముఖ్యప్రాణం యొక్క శ్రేష్ఠత్వాన్ని నిర్ధారించుకోవాలా లేక అట్టి అవసరం లేదా అనే సందేహం కలుగుతున్నది. *"అథో య ఏవం విద్వాన్ ప్రాణే నిః శ్రేయసం విదిత్వా"* అని కౌషీతకంలో వినబడుతున్నది (కౌ.షీ. 1.14). కాని 'ఏవం' శబ్దం ఉపాస్యాన్ని నిర్ధారించి చెప్పలేదు. అదీకాక ముందు అధికరణంలో సర్వవేదవ్యాప్తమైన, ఓంకారాన్ని కాకుండా ఉద్గీథ శబ్దానికి విశేషణంగా ఉన్న ఓంకారాన్నే గ్రహించాలని నిర్ణయింపబడింది. అందుకే ఈ సంశయం.

**సిద్ధాంతం:**

ప్రాణసంవాదంలో అన్ని చోట్లా సాదృశ్యం ఉంది. అందువల్ల, అన్ని శాఖలకు చెందిన ఉపనిషత్తులలోను ప్రాణవిజ్ఞానం ఒకే ఉపాసనకు చెందినట్లు తెలుస్తున్నది. ఈ కారణంగా ఒక దగ్గర చెప్పిన ప్రాణధర్మాలను మరో శ్రుతిలో చేర్చుకోవటంలో ఎట్టి దోషమూ లేదు. వాజసనేయ శాఖకు చెందిన బ్రాహ్మణంలోను, కౌషీతక బ్రాహ్మణంలోను ప్రాణవిజ్ఞానం యొక్క ప్రసంగమే చెయ్యబడింది. అందువల్ల ఏ ఒక్క స్థానంలో ప్రసంగించిన గుణాలనైనా, ఆ విజ్ఞానం ఎక్కడ బోధింపబడ్డా, అన్ని చోట్ల అవే చెప్పినట్లు నిర్ణయించుకోవాలి. గుణితో పాటే గుణాలు ఉంటాయి. పండితుడిలో పాండిత్యం, శూరుడిలో శూరత్వం, స్థాన భేదం వల్ల పోవుకదా! ఒక ఉపాసనకు సంబంధించిన ధర్మాలు – గుణాలు ఆ ఉపాసన యొక్క ప్రస్తావన ఎక్కడ జరిగినా ఒకేలా అన్వయిస్తాయి. అందువల్ల, అన్ని చోట్ల ఒకే విధంగా ప్రాణ ధర్మాలను ఉపసంహరించుకోవటమే సమంజసము.

## 6. ఆనందాద్యధికరణమ్

### సూ: 3.3.11 ఆనందాదయః ప్రధానస్య

**సంశయం:**

ఆనందరూపత్వం, విజ్ఞానఘనత్వం, సర్వాత్మత్వం, సర్వగతత్వం ఇత్యాదివి బ్రహ్మము యొక్క ధర్మాలని కొన్ని శ్రుతులలో వినబడుతున్నవి. ఈ ధర్మాలను సర్వత్రా గ్రహించాలా, లేక ఏయే శ్రుతులలో వినబడుతున్నాయో, ఆయా ప్రదేశాలలో మాత్రమే గ్రహించాలా?

**సమాధానం:**

ఆనందాది ప్రధాన లక్షణాలను సర్వత్ర పరబ్రహ్మ లక్షణాలుగా గ్రహించాలి. అన్ని చోట్ల, బ్రహ్మ అద్వితీయమని ప్రస్తావించటం వల్ల ఈ లక్షణాలన్నీ వర్తిస్తాయి.

**ప్రశ్న:**

ఐతే తైత్తిరీయోపనిషత్తులో *"తస్య ప్రియమేవశిరః, మోదో దక్షిణః పక్షః, ప్రమోదో ఉత్తరః పక్షః, ఆనంద ఆత్మా, బ్రహ్మ పుచ్ఛం ప్రతిష్ఠా"* అని ప్రియ శిరస్సాదుల ప్రసక్తి కూడా ఉంది. ఇవి బ్రహ్మ లక్షణాలు కావా? ఈ ప్రశ్నకు సమాధానం క్రింది సూత్రంలో చెప్పబడింది.

### సూ: 3.3.12 ప్రియశిరస్త్వాద్యప్రాప్తిరుపచయాపచయౌ హి భేదే

ప్రియశిరస్త్వాది గుణాలు హెచ్చుతగ్గులు భేదం ఉన్నప్పుడే వర్తిస్తాయి కాని, అన్ని స్థలాలో వాటి ఉపసంహారం కుదరదు అని సూత్రార్థం.

తైత్తిరీయంలో వినబడుతున్న ప్రియం, మోదం, ప్రమోదం ఇత్యాది గుణాలు బ్రహ్మ సహజధర్మాలుగా పరిగణింపబడవు. కారణం, అవి పరస్పరాపేక్షచేత, భోక్తలు అనుభవించే సంతోషాన్ని బట్టి హెచ్చు–తగ్గు మాత్రలలో వ్యక్తమౌతున్నట్లు కనబడుతు న్నది. ప్రియశిరస్త్వాదులు వాస్తవికంగా కోశ ధర్మాలని మాత్రమే పరిగణించాలని ముందు *"ఆనందమయో అభ్యాసాత్"* అనే సూత్రంలో (బ్ర.సూ 1.1.12) వివరించద మైనది. అదీకాక, పరబ్రహ్మ యందు చిత్త ఏకాగ్రత కోసమే ఈ ధర్మాలు ప్రస్తావింప బడినట్లు గ్రహించవలసి ఉంది. మరెక్కడా ప్రియశిరస్త్వాదుల ప్రస్తావన ఏ విధంగానూ కనబడదు. కొన్ని ధర్మాలు ఉపాసన కొరకే నిర్దిష్టంగా చెప్పబడ్డాయి. అందువల్ల, సగుణబ్రహ్మోపాసనలో ఉపచితాపచిత గుణత్వం (గుణాలలో హెచ్చుతగ్గులు) ఉండే అవకాశం ఉంది. కాని, నిర్గుణబ్రహ్మ ధర్మాలలో భేదనిర్దేశం లేదు.

### సూ: 3.3.13 ఇతరే త్వర్థసామాన్యాత్

ఆనందమయత్వం, విజ్ఞానఘనత్వం, సర్వగతత్వం ఇత్యాది గుణాలు పర బ్రహ్మకు మాత్రమే వర్తిస్తాయి. అందువల్ల అద్వితీయ నిర్గుణబ్రహ్మ విషయంలో ఈ సామాన్య ధర్మాలు అన్ని చోట్ల ఉపసంహరించుకోవచ్చును. ఇతర ధర్మాలు (సంయద్వామ ఇత్యాది సశరీరసంబంధ ధర్మాలు) సగుణ బ్రహ్మోపాసనకు మాత్రమే వర్తిస్తాయి.

# 7. ఆధ్యానాధికరణమ్

## సూ: 3.3.14 ఆధ్యానాయ ప్రయోజనాభావాత్

ధ్యానపూర్వకమైన సాక్షాత్కారం కొరకు పురుషుడే పరమశ్రేష్ఠుడుగా చెప్ప బడుతున్నాడు. ఇంద్రియాదుల యొక్క జ్ఞానంవల్ల ప్రయోజనం లేనందువల్ల వాటి శ్రేష్ఠత్వం చెప్పబడలేదని సూత్రార్థం.

**సంశయం:**

కఠోపనిషత్తులో *“ఇంద్రియేభ్యః పరాహ్యర్థా, అర్థేభ్యశ్చ పరం మనః మనసస్తు పరాబుద్ధిః”* అని వివరించి *“పురుషాన్న పరం కించిత్ సా కాష్ఠా సా పరాగతిః”* అని ప్రతిపాదించబడింది (క.ఉ 3.11). ఇక్కడ శబ్దాది విషయములు (అర్థాః) ఇంద్రియముల కంటె శ్రేష్ఠమైనవి, ఇంద్రియముల కన్నా మనస్సు, మనస్సు కన్నా బుద్ధి, వీటన్నింటి కన్నా ఉత్కృష్ఠమైనది పురుషుడు (పరమాత్మ), అదే పరమాగతి అని చెప్పబడింది. అంటే, ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి ఇత్యాదులన్నీ శ్రేష్ఠములేనా లేక పురుషుడు మాత్రమే మహత్తుగలవాడా అనే సంశయం కలుగుతున్నది. *“ఇంద్రియేభ్యః పరాహ్యర్థా”* ఇత్యాది శబ్దాలు భిన్న వాక్యాలైతే, ప్రతీ విషయమూ–మనస్సు, బుద్ధి ఇత్యాదులు శ్రేష్ఠములైతే వాటివల్ల వేరే వేరే విద్యా ప్రయోజనాలు ఉంటాయా? ఇంద్రియాదులు పరమేశ్వర ప్రాప్తికి విద్యాసాధనములు అవుతాయా?

**సమాధానం:**

పురుషుడే సర్వశ్రేష్ఠుడుగా అన్నింటికి మించిన వాడని చెప్పడం వల్ల, ఇంద్రియాదులను శ్రేష్ఠమైన వాటిగా గ్రహించడం వల్ల ఎట్టి ప్రయోజనమూ లేదు. అన్ని విషయభోగాలకు అతీతమైన బ్రహ్మపదార్థం సర్వోత్కృష్టమైనదని తెలుసుకుంటే, మోక్షఫలప్రాప్తి అనే ప్రయోజనం ఉంటుందని శ్రుతి వల్ల తెలుస్తున్నది. *“నిచాయ్య తం మృత్యుముఖాత్ ప్రముచ్యతే”* (అన్నింటి కన్న ఉత్కృష్టమైనది శాశ్వతమైనదని ఆత్మతత్త్వాన్ని తెలుసుకున్నవాడు మృత్యుముఖం నుండి బయటపడుతున్నాడు). *“పురుషాన్న పరం కించిత్ సా కాష్ఠా సా పరాగతిః”* అనే వాక్యం పురుషుని కన్నా పరమైనది (మహత్తైనది–గొప్పది) మరొకటి లేదు అనే బోధన, ధ్యానపూర్వకమైన సమ్యక్ జ్ఞానదర్శనం కోసం ఉద్దేశింపబడింది, అంతే కాని ఇంద్రియాదులు పరమైనవని గ్రహించి ధ్యానించడం కోసం కాదు.

## సూ: 3.3.15 ఆత్మశబ్దాశ్చ

*“ఏష సర్వేషు భూతేషు గూఢోఽఽత్మా న ప్రకాశతే, దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః”* (క.ఉ 3.12). ఇంద్రియాదులు అనాత్మలు– జడ పదార్థములు. చేతనుడైన పురుషుడే ఆత్మస్వరూపము. సకల ప్రాణులందు గూఢముగా కనిపించని సూక్ష్మపదార్థము ఆత్మ. దీనిని జ్ఞానవంతులు, సూక్ష్మబుద్ధి కలవారే దర్శించుకోగలరు. *“యచ్ఛేద్వాఙ్మనసీ ప్రాజ్ఞః”* (ఇంద్రియములను మనస్సునందు, మనస్సును బుద్ధియందు నిల్పి, ఆ ధ్యానము ద్వారా ప్రాజ్ఞుడు ఆత్మదర్శనము చేసుకుంటాడు – క.ఉ 3–13). ఈ విషయం *“అనుమానిక మప్యేకేషామ్”* (బ్ర.సూ 1.4.1) అనే సూత్రంలో చర్చించడమైనది.

*“సోఽధ్వనః పరమాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్”* (మనస్సును నిగ్రహించుకున్న జ్ఞానవంతుడు సంసార మార్గాన్ని దాటి, ఈశ్వర సాన్నిధ్యాన్ని – విష్ణువు యొక్క పరమపదాన్ని చేరుకుంటున్నాడు – క.ఉ 3.9). ఈ విధంగా పవిత్రమైన బ్రహ్మలోక ప్రాప్తికి త్రోవను బోధించటం వలన, ఇంద్రియాదుల ప్రస్తావన మోక్ష గమనానికి ఉద్దేశించినట్లు, ఆ పరమపదం ఏదో, ఎలా చేరుకోవటమో తెలుసు కోవటానికి ఉపయుక్తమని గ్రహించాలి.

# 8. ఆత్మగృహీత్యధికరణమ్

## సూ: 3.3.16 ఆత్మగృహీతిరితరవదుత్తరాత్

(ఆత్మగృహీతిః + ఇతరవత్ + ఉత్తరాత్)

ఆ తరవాత వస్తున్న వాక్యం వలన 'ఆత్మ' శబ్దంతో పరమాత్మనే గ్రహించాలని సూత్రార్థం.

**పూర్వపక్షి:**

ఐతరేయంలో శ్రుతి ఇలా విన్పిస్తున్నది. *"ఆత్మావా ఇదమేక ఏవాగ్ర ఆసీత్ నాన్యత్ కించన మిషత్ స ఈక్షత లోకాన్ను సృజా ఇతి"* (ఐ.ఉ 1.1). తదనంతరం *"స ఇమాన్ లోకా నసృజత అంభో మరీచీర్మర మాపః"* (ఆదిలో ఇదంతా ఒక్క ఆత్మ మాత్రమే ఉండేది. మరొకటి ఏదీ చలించేది ఉండేది కాదు. నేను లోకాలను సృష్టిస్తానని ఆత్మ ఆలోచించి స్వర్గాన్ని, అంతరిక్షాన్ని, మానవలోకాన్ని, పాతాళలోకాన్ని సృజించింది – ఐ.ఉ 1.2). ఇక్కడ ఆత్మ శబ్ద నిర్దేశము, పరమాత్మకు వర్తిస్తుందా లేక మరి ఎవరినైనా ఉద్దేశించి చెప్పబడిందా అనే సందేహం కలుగుతున్నది.

సృష్టిలో ముందుగా మహాభూతాల సృష్టి జరిగినట్లు చెప్పవలసి ఉందికదా! *"అదోఽమ్భః పరేణ దివమ్"* (ఐ.ఉ 1.2). ద్యులోకానికి పైన జలంతో వ్యాప్తమై ఉన్న లోకం అంభస్. అంభస్ ఇత్యాది లోకాలనే సృష్టించినట్లు పై శ్రుతిలో విన్పిస్తున్నది. హిరణ్యగర్భుడు మానవాకారంలో ఉంటాడని, పరమేశ్వరుని చేత నియమింపబడ్డ ఈ హిరణ్యగర్భుడే లోకాలను సృష్టించిన బ్రహ్మదేవుడని మనకు శ్రుతులు, స్మృతులు ఇలా చెబుతున్నవి: *"ఆత్మైవేద ఆసీత్ పురుషవిధః"* (బృ.ఉ 1.4.1). *"స వై శరీరీ ప్రథమః స వై పురుష ఉచ్యతే, ఆదికర్తా స భూతానాం బ్రహ్మాగ్రే సమవర్తత"* అని స్మృతి వాక్యము. అంతే కాదు, ఐతరీయంలో దేవతలు ప్రజాపతి వలన పుట్టారు అని శ్రుతి వినిపిస్తున్నది: *"అథాతో రేతసః సృష్టిః ప్రజాపతే రేతో దేవాః"* శరీరం గల హిరణ్యగర్భుడు చేతన స్వభావం ఉన్నవాడే కాబట్టి అతడూ ఆలోచించి లోకాదులను సృష్టించడానికి సామర్థ్యం ఉన్నవాడే అనిపిస్తున్నది. విచిత్ర మైన ఈ సృష్టికి కర్త ప్రజాపతే అని మరోశ్రుతి కూడ ఇలా తెల్పుతున్నది *"తాభ్యో గామానయత్తాభ్యో–శ్వ మానయత్తాభ్యః పురుషమానయత్తా అబ్రువన్"* (ఐ.ఉ 1.2.2). దేవతాధిష్ఠానంతో ఇంద్రియాలను సృజించిన తరువాత, ఆయతనం కోసం అవి సృష్టికర్తను మా కోసం ఏవైనా సృష్టించు అని క్షుత్–పిపాసల రూపంలో అడగ్గా, క్షుత్–పిపాసలు కోసం ముందు గోవులను, అశ్వాలను సృష్టిస్తాడు. ఇవి చాలవు అంటే మనుష్యులను సృష్టిస్తాడు. అప్పుడు అవి మాకిక చాలులే అంటాయి. ఇది ఐతరేయంలో నున్న సృష్టిక్రమం సంగతి.

**సిద్ధాంతం:**

'ఆత్మ' శబ్దంతో పరమాత్మనే గ్రహించాలి. *"తస్మాద్వా ఏతస్మా దాత్మాన ఆకాశః సంభూతః"* అనే తైత్తిరీయ శ్రుతి నుదహరించి 'ఆత్మ' శబ్దంతో ఆకాశాది మహాభూతాల సృష్టికి పరమాత్మే కారణమని చెప్పబడింది. అలాగే 'ఆత్మ' శబ్దంతో జీవాత్ (ప్రత్యగాత్మ) గ్రహింపబడుతున్నది. *"ఆత్మైవేదమగ్ర ఆసీత్ పురుషవిధః"* అని విశేషణంగా విన్పడడం వల్ల, ఇక్కడ పరమాత్మనే సర్వలోకములయొక్క సృష్టికర్తగా గ్రహించాలి.

## సూ: 3.3.17 అన్వయాదితి చేత్స్యాదవధారణాత్

(అన్వయాదితిచేత్ + స్యాత్ + అవధారణాత్)

వాక్యాన్వయం వల్ల హిరణ్యగర్భ నిర్దేశమే కాని పరమాత్మ యొక్క నిర్దేశం ఇక్కడ కుదరదని పూర్వపక్షి చేసిన ఆక్షేపణకు సమాధానంగా ఈ సూత్రం చెప్పబడింది.

జగదుత్పత్తికి–సృష్టికి పూర్వం, ఏకత్వాన్ని నిర్ధారించడం వల్ల పరమాత్మ కారణంగానే మహాభూతాలు సర్వలోకాలూ, ప్రాణులూ సృజింపబడ్డాయని గ్రహించ వచ్చు. ఆకాశాన్ని, వాయువుని సృష్టించి తదనంతరం *"తత్తేజోఽసృజత"* అని శ్రుతి

వాక్యాలను అన్వయించిన రీతిలో, సర్వమూ పరమేశ్వర కారణంగానే ఆవిర్భవించి నట్లు అన్వయించుకోవాలి.

బ్రహ్మతత్త్వం విశదీకరించటమే ఐతరేయోపనిషత్తులోని శ్రుతివాక్యముల ఉద్దేశము. అందువల్ల అంభోమరీచీ ఇత్యాది లోకాలను, లోకపాలకుల్ని సృష్టించి, తరవాత శరీరాలనిర్మాణం చేసిన సృష్టికర్త తనే ఆ శరీరాలలో ప్రవేశించినట్లు శ్రుతిలో వినబడుతున్నది. *"కథం న్విదం మదృతే స్యాత్"* (నేను లేకుండా ఈ శరీరం ఎలా ఉంటుంది – ఐ.ఉ 3.11). ఇలా ఆలోచించి *"స ఏతమేవ సీమానం విదార్యైతయా ద్వారా ప్రాపద్యత"* (ఆ పరమాత్మ బ్రహ్మరంధ్రం ద్వారా లింగ శరీరంలో ప్రవేశించెను – ఐ.ఉ 3.12) అని కూడా వినబడుతున్నది. *"యది వాచాభివ్యాహృతం యది ప్రాణేనాభిప్రాణితమ్"* (వాగ్వ్యాపారం వాక్కు, ప్రాణవ్యాపారం ప్రాణం చేస్తుండగా చూచినప్పుడు) *"అథ కోఽహమ్"* – మరి నేనెవరిని అనే సందేహం కలిగింది (ఐ.ఉ 3.11). *"స ఏతమేవ పురుషం బ్రహ్మ తతమపశ్యత్"* (సర్వత్రా వ్యాపించి ఉన్న పురుషుణ్ణే బ్రహ్మ రూపంలో చూచాడు – అంటే బ్రహ్మసర్వ వ్యాప్తమైనదని గ్రహించాడు – ఐ.ఉ 1.3.13)

అదేవిధంగా, శ్రుతిలో ఆ తరవాత కూడా సర్వం బ్రహ్మమే అని సూచిస్తూ బ్రహ్మాత్మత్వ దర్శనాన్ని నిర్ధారిస్తున్న వాక్యాలు ఇలా విన్పిస్తున్నవి: *"ఏష బ్రహ్మ ఏష ఇంద్రః"* , *"సర్వం తత్ ప్రజ్ఞానేత్రం, ప్రజ్ఞానే ప్రతిష్ఠితం, ప్రజ్ఞానేత్రో లోకః, ప్రజ్ఞా ప్రతిష్ఠా, ప్రజ్ఞానం బ్రహ్మ"* (ఇతడే బ్రహ్మ, ఇతడే ఇంద్రుడు, ఇదంతా బ్రహ్మ యొక్క ప్రజ్ఞయే, బ్రహ్మమందే ప్రతిష్ఠితమైనది. ప్రజ్ఞానమే బ్రహ్మ. అందువల్ల పరమాత్మ కారణంగా, మహాభూతాలు, సమస్త లోకాలు, ప్రాణికోటి సర్వమూ ప్రతిష్ఠింప బడినట్లు నిర్ధారణ చేసుకోవాలి – ఐ.ఉ 3.1.3)

ఈ సందర్భంలో ముఖ్యసూత్రానికి మరోవిధంగా కూడా వ్యాఖ్యానం చెయ్యబడింది.

**పూర్వపక్షి సంశయం:**

వాజసనేయ శాఖకు చెందిన బృహదారణ్యకోపనిషత్తులో, ఆత్మకు సంబంధించిన శ్రుతి ఇలా వినిపిస్తున్నది: *"కతమ ఆత్మేతి. యోయం విజ్ఞానమయః ప్రాణేషు హృది అంతః జ్యోతిః పురుషః"* (బృ.ఉ 4.3.7). ఇక్కడ ఆత్మ శబ్దంతో ఉపక్రమించి ఈ ఆత్మ అనేది ఏది? హృదయం లోపల (బుద్ధిస్థానంలో) ఉన్న తేజో రూపంలో ఉన్న పురుషుడే ఆత్మ అని చెప్పబడింది. ఉపసంహారం కూడా ఇలా విన్పిస్తున్నది: *"సవా ఏష మహానజ ఆత్మాఽజరోఽమరోఽమృతోఽభయో బ్రహ్మ"* (అదే సర్వసంగ విముక్తమూ అమృతధర్మమూ గల బ్రహ్మరూపము – బృ.ఉ 4.4.25). ఛాందోగ్యంలో మరోవిధంగా ఆత్మబోధనకు సంబంధించి ఉపక్రమ ఉపసంహారాలు జరిగాయి. ఉపక్రమంలో 'సత్' శబ్దమే ఉంది. 'ఆత్మ' శబ్దం లేదు *"సదేవ సౌమ్య ఇదమగ్ర ఆసీత్ ఏకమేవాద్వితీయమ్"* (ఛా.ఉ 6.2.1). ఉపసంహారంలో *"స ఆత్మా తత్త్వమసి"* అని బోధింపబడింది. ఇలా రెండు శాఖలలోను వేరువేరుగా బోధింప బడింది కదా, మరి బ్రహ్మాత్మత్వ ప్రతిపాదన ఎలా నిర్ణయింప బడుతుంది?

**సమాధానం:**

'సత్' శబ్దంతో ఉపక్రమించినా ఛాందోగ్య శ్రుతి కూడా బ్రహ్మమునే నిర్దేశిస్తున్నది. *"యేనాశ్రుతం శ్రుతం భవతి, అమతం మతం, అవిజ్ఞాతం విజ్ఞాతమ్"* అని ఈ శ్రుతి వాక్యంలో విన్పిస్తున్నది (ఛా.ఉ 6–1–1.). ఈ విధమైన అవధారణ స్పష్టంగా ఉండటం వల్ల జీవునకు, సత్ పద నిర్దేశమైన ఆత్మకు భేదం లేదని, తత్త్వమసి అని పదే పదే బోధించటం వలన జీవాత్మ–బ్రహ్మాత్మ రూపమనే గ్రహించాలి. అద్వితీయమైన బ్రహ్మమే సద్రూపము (సల్లక్షణము) కలది. అందువల్ల వాక్య నిర్మాణంలో కాస్త భేదమున్నా రెండు శాఖలకు సంబంధించిన ఉపనిషత్తుల్లోను ప్రతిపాదించినది బ్రహ్మాత్మత్వ దర్శనమే.

## 9. కార్యాఖ్యానాధికరణమ్

### సూ: 3.3.18 కార్యాఖ్యానాదపూర్వమ్

పవిత్రత కోసం చేసే ఆచమనం, క్రియే కాని విధి కాదు, సంకీర్తన రూపంలో చెప్పినది. ఆచమనం ప్రాణానికి వస్త్రధారణం వంటిది అని సూత్రార్థం.

**పూర్వపక్షి:**

వాజసనేయ బృహదారణ్యకంలోను, సామవేదీయ ఛాందోగ్యంలోను ప్రస్తావించిన ప్రాణ సంవాదంలో, ముఖ్యప్రాణం నాకు ఏది అన్నము? ఏది వస్త్రము? అని వాగాది ఇంద్రియాలను అడుగుతుంది. నీకు క్రిముల నుండి కుక్కల వరకు సర్వప్రాణులూ తినేదే అన్నము, ఉదకము నీకు వస్త్రమని సమాధానం ఇస్తాయి. ఆచమన ప్రక్రియ ద్వారా ప్రాణానికి వస్త్రధారణ ఎలా జరుగుతుందో ఇలా చెప్పబడింది: *"తస్మాద్వా ఏతదశిష్యంతః పురస్తాత్ చ ఉపరిష్టాచ్చ అద్భిః పరిదధతి"* (అందువల్లనే అన్నం తినే ముందు, తిన్న తరవాత నీటితో దీనిని కప్పుతున్నారు – ఛా.ఉ 5.2.2) వాజసనేయ శ్రుతి ఇలా విన్పిస్తుంది: *"తద్విద్వాంసః శ్రోత్రియా అశిష్యంత ఆచమంతి, అశిత్వాచ ఆచమంతి, ఏతమేవ తదన్నమనగ్నం కుర్వంతో మన్యంతే"* (అందువల్లనే విద్వాంసులు శ్రోత్రియులూ భోజనానికి ముందు, భోజనం తరవాత ఆచమనం చేస్తారు. దీని ద్వారా ప్రాణం అనగ్నంగా ఉండకుండా వస్త్రధారణ చేసినట్లు భావిస్తారు – బృ.ఉ 6.1.14) అదేవిధంగా మరో వాక్యం కూడ వినబడుతున్నది: *"తస్మాదేవంవిత్ అశిష్యన్నాచామేత్ అశిత్వాచ ఆచామేత్ ఏతమేవ తదన్నమనగ్నం కురుతే"* (ఈ విధంగా తెలుసుకున్నవాడు తినే ముందు, తిన్న తరవాత కూడా ఆచమనం చేస్తూ ప్రాణాన్ని అనగ్నం చేస్తున్నాడు).

**సమాధానం:**

ఆచమనం అనే క్రియ పవిత్రత్వం కొరకు (కార్యాఖ్యానం వల్ల) చెప్పబడింది కాని విధిరూపంలో కాదు. ఇక్కడ ఆచమన సంకీర్తనమే జరిగింది. ప్రతి పురుషుడు చేయదగినట్లు ప్రసిద్ధమైన ఆచమన క్రియ అన్ని కర్మలలోను స్మృతి విధిస్తున్నది. అదే ఇక్కడ ప్రస్తావింపబడినట్లు కనబడుతున్నది. ఆచమనం చేయదగిన ఉదక ప్రస్తావన ప్రాణవిద్యకు సంబంధించి కొత్తగా ప్రాణాన్ని అనగ్నంగా ఉంచాలి అని బోధిస్తున్నది. ఆచమనం పవిత్రత కోసం చేసే ఒక క్రియ, ఆ క్రియనే ప్రాణధారణం కోసం జలాన్ని వస్త్రంగా ధరించటమనే మరోక్రియగా అంగీకరించటంలో దోషంలేదు.

*"యదిదం కించాశ్వభ్యః ఆక్రిమిభ్య ఆకీట పతంగేభ్యః తత్తేఽన్నమ్"* అనే బృహదారణ్యక శ్రుతి (బృ.ఉ 6.1.14) సర్వమూ ప్రాణానికి అన్నమే అని, ధ్యానం కోసం ప్రాణవిద్యా అంగంగా బోధింపబడింది. దానితోపాటే వినబడుతున్న ఆచమన క్రియ జలాన్ని ఒక పరిధానం (వస్త్ర ధారణగా) బోధింపబడుతున్నది. అది ప్రాణానికి ఒక వస్త్రం లాటిది అని గ్రహించాలి.

ఆచమనం విధ్యుక్తమైన కర్మకాదని కాణ్వశాఖీయులు దానిని నిరాకరిస్తూ *"తస్మాదేవంవవిదశిష్యన్నాచామేదశిత్వా చాచామేత్"* అనే వాక్యాన్ని పఠించరు. మాధ్యందిన శాఖీయులు కూడ *"అపో వాసః"* అని ఉదకం ప్రాణం యొక్క వాసస్, వస్త్రమనే గ్రహిస్తారు. అందువల్ల, ప్రాణవిద్యలో వాసో విజ్ఞానమే విధించబడుతున్నాది కాని ఆచమన క్రియ కాదు.

## 10. సమానాధికరణమ్

# సూ: 3.3.19 సమాన ఏవం చాభేదాత్

**పూర్వపక్షి:**

శుక్ల యజుర్వేదీయ వాజసనేయ శాఖీయులకు అగ్నిరహస్య సంహితంలోను, ఉపనిషత్ భాగమైన బృహదారణ్యకంలోను శాండిల్యవిద్య అనే పేరుతో ఆత్మోపాసన బోధింపబడింది. అయితే, ఈ విద్యకు సంబంధించి అగ్నిరహస్య సంహితా భాగంలో ఇలా వినబడుతున్నది: *"స ఆత్మానముపాసీత మనోమయం, ప్రాణ శరీరం, భారూపమ్"* (మనోమయము, ప్రాణ శరీరము, భారూపము ఐన ఆత్మను ఉపాసించ వలెను). బృహదారణ్యకోపనిషత్తులో ఆ విద్యయే మళ్లీ ఇలా చెప్పబడింది: *"మనో మయోఽయం పురుషో భాః సత్యః తస్మిన్ అంతర్హృదయే యథా వ్రీహిర్వా, యవోవా స ఏష సర్వస్య ఈశానః, సర్వస్యాధిపతిః సర్వమిదం ప్రశాస్తి, యదిదం కించ"* [ఈ పురుషుడు మనోమయుడు, తేజస్వరూపము, సత్యమైన వాడు–చేతనుడు. వ్రీహివలె, యవ వలె (సూక్ష్మంగా) ఉన్నాడు. ఈ పురుషుడే సర్వానికి ఈశ్వరుడు(ఈశః), సర్వానికి అధిపతి. ఈ జగత్తులో ఏది ఉన్నదో దానంతటినీ శాసిస్తున్నాడు – బృ.ఉ 5.6.1 ].

ఒకే శాఖకు చెందిన సంహితాభాగంలో ఒకలాగ, ఉపనిషద్భాగంలో ఒకలాగ పరమాత్మ గుణాలు చెప్పబడ్డాయి. అవి రెండూ, వేరువేరు విద్యలకు సంబంధించి నవా? ఒకే విద్యకు సంబంధించినవైతే, ఆ శాఖీయులు గుణోపసంహారం ఎలా చేసుకోవాలి? అసలు గుణోపసంహారం చెయ్యనక్కర లేదా ఈ విధమైన సందేహాలు కలుగుతున్నవి.

రెండు స్థానాలలోను ఆత్మవిద్యయే బోధింపబడుతున్నది. ఉపాస్యము ఒక్కటే మనోమయత్వాది గుణములుగల బ్రహ్మము – పరమాత్మ అద్వితీయము. విద్యకు రూపం ఉపాస్యము; ఉపాస్యము ఒక్కటే కాబట్టి, విద్యా భేదం లేదు. అందువల్ల సంహితా భాగంలో ఉన్న అగ్నిరహస్యము, ఉపనిషద్భాగంలో మరికొన్ని విశేష గుణాలతో పునః బోధించబడింది. ఇందులో దోషమేమీ లేదు. అదీకాక, మనోమయం ఇత్యాది సమాన గుణాలు రెండింటిలో ఉండటంవల్ల ఇది శాండిల్య విద్యకు సంబంధించినదే అని తెలుసుకోగలుగుతున్నాము. ఉపనిషద్భాగంలో సర్వేశ్వరుడు (సర్వస్య ఈశానః), సర్వాధిపతి అని పరమాత్మ యొక్క గుణాలు అధికంగా చెప్పబడ్డాయి. విద్యాబోధనలో ఏకత్వం, గుణోపసంహారమూ కూడా వాజసనేయ సంహితంలోను, ఉపనిషత్తులోను ఉన్నదనే గ్రహించాలి.

అగ్నిరహస్యంలో వినబడుతున్న అగ్నిచయన విధిని ప్రధాన విధిగాను, ఉపనిషత్తులో కొన్ని కొత్త గుణాలతోను (పునరుక్తితో అనువాదపూర్వకంగా) చెప్పిన భాగాన్ని గుణవిధిగాను శాస్త్రరీత్యా పరిగణిస్తారు.

## 11. సంబంధాధికరణమ్

### సూ: 3.3.20 సంబంధాదేవమన్యత్రాపి

(ఇది పూర్వపక్ష సూత్రము)

శాండిల్యవిద్యలో నిర్ణయించినట్లు ఏక విద్యాత్వం అనే సంబంధం వల్ల గుణోపసంహారం సత్యవిద్యలో కూడా ఉంటుందని సూత్రార్థం.

బృహదారణ్యకంలో *"సత్యం బ్రహ్మ"* (బృ.ఉ 5.5.1) అని ఉపక్రమిస్తూ *"తద్యత్ తత్ సత్య మసౌ స ఆదిత్యో య ఏష ఏతస్మిన్ మండలే పురుషో యశ్చాయం దక్షిణేఽక్షన్ పురుషః"* అని శ్రుతి వినిపిస్తున్నది (బృ.ఉ 5.5.2). ఈ శ్రుతి తాత్పర్యం: ఆ సత్య స్వరూపము ఏదియో అదే ప్రసిద్ధమైన ఆదిత్యుడు. సూర్యమండలంలోని ఆ పురుషుడే, ఈ జీవుడి కుడి కంటిలోనున్న అక్షిపురుషుడు.

ప్రకరణ సందర్భంగా సత్యస్వరూపమైన హిరణ్యగర్భునియొక్క ఉపాసన ఇక్కడ ప్రస్తావింపబడింది. సృష్టికి పూర్వము జగత్తులో అంతా నీరే ఉండెను. ఆ జలమే పృథివ్యాది భూత పంచకమును సృజించినది. సత్యరూపమైన భూత పంచకమే హిరణ్యగర్భుడు. అతడే సమస్త దేవతలను సృష్టించెను.

సత్యరూపమైన హిరణ్యగర్భబ్రహ్మకే ఆధిదైవతము, అధ్యాత్మము అని రెండు స్థానవిశేషాలు చెప్పబడ్డాయి. భూ–భువః–సువః అనే మూడు వ్యాహృతులు అధిదైవత మైతే, శిరో–బాహు–పాదరూపములు అధ్యాత్మపురుషుని శరీరము. 'అహః' అన్నది అధిదైవత నామం అని 'అహమ్' అనేది అధ్యాత్మ నామం అని సత్యవిద్యా బోధనలో వివరించబడింది. బృహదారణ్యకంలో *"స యో హైత తం మహద్యక్షం ప్రథమజం వేద సత్యం బ్రహ్మేతి"* , అనే శ్రుతి మొదలుకొని (బృ.ఉ 5.4.1) *"యోఽయం దక్షిణే ఽక్షన్ పురుషః తస్య భూరితి శిర"* అనే శ్రుతి వరకు (5.5.4) ఈ వివరణజరిగింది.

**ప్రశ్న:**

సత్ విద్యగా బోధింపబడ్డ ఈ హిరణగర్భోపాసనను అధి దైవం–అధ్యాత్మం అనే విభాగం లేకుండా రెండు స్థానాలలోను అనుసంధానం చేసుకోవటం యుక్తమని తోస్తున్నది. ఎందుకంటే, గత అధికరణంలో శాండిల్యవిద్యకు సంబంధించిన ఉపదేశం రెండు స్థానాలలో వినిపిస్తున్నా, విద్యా ఏకత్వం ఉంటే ఒకే విధంగా ఉపసంహారం చేసుకోవాలని నిర్ణయింపబడింది. విద్యలో ఏకత్వమనే సంబంధం వల్ల విద్యాప్రాప్తి రెండు స్థానాలలోనూ (అహః–అహమ్) ఒకటే కదా? ఈ ప్రశ్నకు సమాధానం క్రింది సూత్రంలో చెప్పబడింది.

### సూ: 3.3.21 న వా విశేషాత్

ఉపాసనా స్థాన విశేషాలను నిర్దేశించడమైనది. అధిదైవత పురుషుణ్ణి *"య ఏష ఏతస్మిన్ మండలే పురుషః"* అని నిర్దేశించి, అధ్యాత్మ పురుషుణ్ణి *"యోఽయం దక్షిణేఽక్షన్ పురుషః"* అని నిర్దేశింపబడింది. అధిదైవత పురుష నామం 'అహః' అయితే, అధ్యాత్మ పురుష నామం 'అహమ్' అని స్థాన విశేషాన్ని బట్టి ఉపనిషద్విశేష రహస్య నామం వేరువేరుగా ప్రస్తావింపబడింది. అందువల్ల రెండింటికి ప్రాప్తిలో ఏకత్వం ఉండదు.

### సూ: 3.3.22 దర్శయతి చ

ఆదిత్యునిలోను – అక్షిలోను ఉన్న పురుషుడు ఒక్కడే. ఆదిత్య పురుషునికి కొన్ని రూపాదులు చెప్పబడ్డాయి. అలాగే అక్షిగత పురుషునికి కొన్ని రూపాదులు చెప్పబడ్డాయి. అయితే, పురుషుడు ఒక్కడే అయినా స్థానాలు వేరు. అందువల్ల, ఒక స్థానంలో ఉన్న పురుషుని ధర్మాలకు, మరో స్థానంలో ఉన్న పురుషుని ధర్మాలకు సమానత్వం ఉండదు. మంత్రరూపంలో

వ్యవస్థనుద్దేశిస్తూ శ్రుతి ఇలా వినబడుతు న్నది: *"తస్యైతస్య తదేవ రూపం యదముష్య రూపం, యావముష్యగేష్ణౌ తౌ గేష్ణౌ యన్నామ తన్నామ"* (ఛా.ఉ 1.7.5). అయితే, రెండింటికి ఉన్న పోలికలను దృష్టిలో ఉంచుకొనే అతిదేశం చేత *"తస్యైతస్య తదేవరూపమ్"* అని ఉపసంహారం చెయ్య బడింది. అతిదేశం లేకపోతే అక్కడ చెప్పిన గుణాలు అక్కడ, ఇక్కడ చెప్పిన గుణాలు ఇక్కడ (పరస్పరము) వర్తించవనే గ్రహించాలి.

## 12. సంభృత్యధికరణమ్

### సూ: 3.3.23 సంభృతిద్యువ్యాప్త్యపి చాతః

(సంభృతి ద్యువ్యాప్తి అపి చ అతః)

ఈ కారణంగానే సంభృతి ద్యువ్యాప్తి అనేవి కూడా ఉపసంహరింపబడవని సూత్రార్థం.

**సంశయం:**

ఖీల అనే వైదిక గ్రంథంలో రాణాయనీయ శాఖకు చెందినవారు బ్రహ్మ యొక్క గుణాలను ఇలా ప్రస్తావించారు: *"బ్రహ్మ జ్యేష్ఠా వీర్యా సంభృతాని బ్రహ్మాగ్రే జ్యేష్ఠం దివ మాతతాన"* [బ్రహ్మకారణంగా ఆకాశోత్పాదనం మొదలైన వీర్యవంతమైన పరాక్రమ విశేషాలు ఎట్టి ఆటంకాలు లేకుండా జరిగేయి. అన్నింటికన్న పెద్దదైన (జ్యేష్ఠమైన) ఆ బ్రహ్మ, దేవతల ఉత్పత్తికి ముందే స్వర్గం అంతా వ్యాపించి ఉండేది]. రాణాయనీయ శాఖవారు శాండిల్యవిద్య మొదలైన బ్రహ్మవిద్యలను వారి ఉపనిషత్తుల్లో పఠిస్తున్నారు. అందువల్ల సందేహం కలుగుతున్నది. వీర్య సంభృతి—ద్యునివేశం ఇత్యాది బ్రహ్మము యొక్క విభూతులు శాండిల్య విద్య ఇత్యాదుల్లో కూడా అనువర్తించి ఉపసంహారం చేసుకోవాలా అక్కర్లేదా?

**సమాధానం:**

ద్యు నివేశం—ఆకాశోత్పాదన ఇటువంటి విభూతులను బ్రహ్మవిద్యతో కలిపి ఉపసంహరించుకో కూడదు. సంభృతి — ద్యువ్యాప్తి అనే ఐశ్వర్యములు అధిదైవిక మైనవి. బ్రహ్మోపాసన అధ్యాత్మపరంగా స్థాన విశేషంతో ఇలా నిర్దేశింపబడింది: *"ఏష మ ఆత్మా అంతర్హృదయే"* (ఛా.ఉ 3.14.3), *"దహరం పుండరీకం వేశ్మ దహరోఽస్మిన్నంత రాకాశః"* (ఛా.ఉ 8.1.1), జాబాల సత్యకామునికి, ఉపకోసలుడు బోధించిన బ్రహ్మవిద్యలో నేత్రస్థానం బ్రహ్మ ఆయతనంగా *"య ఏషో అక్షిణి పురుషో దృశ్యతే"* అని చెప్పబడింది.

**సంశయం:**

అయితే ఆధిదైవికములైన విభూతులు కూడా బ్రహ్మోపాసనలో చెప్పబడ్డాయి కదా? ఉదాహరణకు కొన్ని శ్రుతులలో ఇలా వినిపిస్తున్నది: *"జ్యాయాన్ దివో జ్యాయాన్ ఏభ్యో లోకేభ్యః"* (ఛా.ఉ 3.14.3), *"ఏష ఉ భామినీః ఏషహి సర్వేషు లోకేషు భాతి"* (ఛా.ఉ 4.15.4), *"యావాన్ వా అయమాకాశః తావాన్ ఏషో అంతర్హృదయ ఆకాశ, ఉభే అస్మిన్ ద్యావా పృథివీ అంతరేవ సమాహితే"* (ఛా.ఉ 8.1.3). ఆయతన విశేషాలేవీ కనబడని షోడశకళల ప్రస్తావన కూడా బ్రహ్మవిద్యలో జరిగింది కదా?

**సమాధానం:**

సంభృత్యాదులు, శాండిల్యవిద్యకు సంబంధించిన మనోమయత్వాది గుణాలు పరస్పరం వేరైనవి. బ్రహ్మపదార్థం ఒక్కటే అయినా వేరు వేరు ఐశ్వర్యాల సంబంధరీత్యా సంపదుపాసనలు బోధింపబడ్డాయి.

ఉద్గీథప్రస్తావనలో పరోవరీయస్త్వాది ఉత్కృష్ట గుణాలు వేరు వేరుగా బోధించటం హిరణ్యగర్భ బ్రహ్మోపాసన విషయంలో జరుగుతుందని ముందు కూడా చెప్పటం జరిగింది. అందువల్ల సంపదుపాసనలో విద్యా భేదం ఉండే అవకాశం ఉంటుంది. రాణాయనీయ శాఖీయుల శ్రుతిలో బ్రహ్మము యొక్క ప్రత్యభిజ్ఞ *"బ్రహ్మ జ్యేష్ఠా"* అనే పదంలో ఉన్నంత మాత్రాన, దాని ఉపసంహారం శాండిల్యవిద్యలో చెయ్యనవసరం లేదు.

# 13. పురుషవిద్యాధికరణమ్

## సూ: 3.3.24 పురుషవిద్యాయామివ చేతరేషామనామ్నానాత్

(పురుషవిద్యాయామివచ + ఇతరేషాం + అనామ్నానాత్)

తాండిశాఖకు చెందిన రహస్య బ్రాహ్మణంలోను, పైంగిశాఖకు చెందిన రహస్య బ్రాహ్మణంలోను పురుషవిద్య ప్రతిపాదించబడింది. పురుషుణ్ణి యజ్ఞంగా కల్పించి వాని ఆయుస్సును (జీవితకాలం) మూడు సవనాలుగా విభజించి ఇలా చెప్పబడింది: 1. ప్రాతః సవనం – మొదటి 24 సంవత్సరాలు, 2. మాధ్యందిన సవనం – తదుపరి 44 సంవత్సరాలు, 3. సాయంసవనం – తరవాత 48 సంవత్సరాలు. మొత్తం 116 సంవత్సరాల ఆయుస్సు పురుషయజ్ఞ ఫలం అని నిర్ణయించడమైనది. ఇదేవిధంగా, ఛాందోగ్యోపనిషత్తులో కూడ చెప్పబడింది (ఛా.ఉ 3.16.1 నుంచి 7). తైత్తిరీయ శాఖకుచెందిన మహానారాయణోపనిషత్తులో కూడా పురుషయజ్ఞం శ్రుతిలో ఇలా వినబడుతున్నది (అను. 80). *"విదుషో యజ్ఞస్యాత్మా యజమానః శ్రద్ధా పత్నీ"* (ఆత్మ యజమాని, శ్రద్ధ అతని పత్ని). ఈ విధంగా యజ్ఞానికి సంబంధించిన అన్ని వివరాలు సూచించడమైనది.

**సంశయం:**

తాండి–పైంగి శాఖీయులు పఠిస్తున్న పురుషయజ్ఞ ధర్మాలను, తైత్తిరీయంలో ప్రతిపాదించిన పురుషయజ్ఞ మంత్రాలతో ఉపసంహారం చేసుకోవాలా? అవసరం లేదా?

**సమాధానం:**

అవసరం లేదు. సూత్రంలో దీనినే నిర్ధారించి చెప్పడమైనది. తైత్తిరీయ మహానారాయణోపనిషత్తులో మంత్రాలు విలక్షణంగా ఉన్నాయి. మిగతా వాటికి, వీటికి సమానత్వం లేదు. తైత్తిరీయంలో పురుషునకు యజ్ఞత్వం లేదు. మంత్రంలో *"విదుషః యజ్ఞస్య"* విద్వాంసుడే యజ్ఞం అని వినిపిస్తున్నది. ఇలా చాలా వ్యత్యాసాలు వేదశబ్దాలలో (ఆమ్నాయంలో) ఉన్నాయి.

ఛాందోగ్యశ్రుతిలో *"ఏష హ షోడశ వర్ష శతం జీవతి య ఏవం వేద"* (ఇలా తెలుసుకున్నవాడు నూట పదహారు సంవత్సరాలు జీవిస్తాడు – ఛా.ఉ 3.16.7) అని పురుషవిద్యాఫలం చెప్పడమైంది. అందువల్ల, ఆశీర్మంత్రాదులు పురుషవిద్యా ధర్మాలు, తైత్తిరీయ మహానారాయణోపనిషత్తులో వినబడనందున వాటిని ఇతర తాండ్య, పైంగి, ఛాందోగ్య శ్రుతులతో ఉపసంహారం చెయ్యనవసరం లేదు.

# 14. వేధాద్యధికరణమ్

## సూ: 3.3.25 వేధాద్యర్థ భేదాత్

శాంతిమంత్రాల అర్థంలో భేదం ఉండటం వల్ల వాటికి ఉపాసనా విద్యలలో ఉపసంహారం ఉండదని సూత్రార్థం.

ఈ అధికరణంలో వేరు వేరు శాఖీయులు వారి వారి యజ్ఞకర్మల ఆరంభంలో చదివే శాంతిపాఠాల ప్రస్తావన చేస్తూ, వాటిని ఉపాసనా విద్యలలో ఉపసంహారం చేసుకోవటం గురించి చర్చజరిగింది.

**పూర్వపక్షి:**

అథర్వణ వేదీయులు వేదాంతాధ్యయనంలో శాంతి పాఠంగా వారి వేదానికి సంబంధించిన మంత్రాన్ని ఇలా పఠిస్తారు: *"సర్వం ప్రవిధ్య హృదయం ప్రవిధ్యధమనీః ప్రవృజ్య, శిరోఽభి ప్రవృజ్య త్రిధా విపృక్తః"* [ఓ దేవతా! నా శత్రువు శరీరాన్ని చీల్చివెయ్యి, ముఖ్యంగా హృదయాన్ని ఛేదించు, రక్తనాడులను (ధమనులను) తెంపివెయ్యి, శిరస్సు ముక్కలుచెయ్యి, ఇలా మూడు విధాలుగా నా శత్రువులు నాశనం చెయ్యబడుదురు గాక!]. అదే విధంగా తాండి శాఖీయులు *"దేవసవితః ప్రసువ యజ్ఞమ్"* (ఓ సూర్యదేవుడా! యజ్ఞాన్ని నెరవేర్చు). శాట్యాయనులు *"శ్వేతాశ్వో హరితనీలోఽసి"* (తెల్లని అశ్వం కల నువ్వు నీలివర్ణంలో ఉంటావు)అనిచదువుతారు. కఠ–తైత్తిరీయ శాఖీయులు *"శం నో మిత్రః శం వరుణః"* అనేశాంతిపాఠంచదువుతారు (సూర్యుడు, వరుణుడు మనకు సుఖాన్ని కలుగజేయుదురు గాక!). వాజసనేయులు *"దేవా హ వై సత్రం నిషేదుః"* (దేవతలు యజ్ఞం చెయ్యడానికి సిద్ధంగా కూర్చున్నారు) అని వారి ప్రవర్గ్య బ్రాహ్మణంలో (యజ్ఞ – యాగాదికర్మల ముందు), ఉపనిషత్తులు పఠించే ముందు చదువుతారు. కౌషీతకులు *"బ్రహ్మవా అగ్నిష్టోమో బహ్మైవ తదహః బ్రహ్మణైవ తే బ్రహ్మోపయంతి, తేఽమృతత్వమాప్నువంతి య ఏతదహః ఉపయంతి"* (అగ్నిష్టోమమే బ్రహ్మము, ఆ యజ్ఞం చేసే దివసం బ్రహ్మము, అగ్నిష్టోమయజ్ఞం చేసిన వారు క్రమంగా ముక్తిని పొందుతారు).

ఇలా పలు విధాలుగా విన్పిస్తున్న ఆయావేదాలకు చెందిన శాంతి మంత్రాలను కూడా ఉపాసనా విద్యలలో చేర్చి ఉపసంహారం చేసుకోవాలా అనే సంశయం కలుగుతున్నది. ఉపాసనా విద్యలలో కూడా హృదయస్థాన నిర్దేశం ఉన్నందు వల్ల *"హృదయం ప్రవిధ్య"* ఇత్యాది మంత్రాలను ఉపాసనకు అంగంగా చేర్చుకున్నా దోషం ఉండదని తోస్తున్నది.

**సిద్ధాంతం:**

ప్రవర్గ్య కర్మలలో చదివే శాంతి పాఠాలకు, ఉపాసనా విద్యలలో ఉపసంహారం ఉండదు. ఉపనిషత్తులో నిర్దేశించిన ఉపాసనలకు ప్రవర్గ్య కర్మలకు సంబంధం లేదు. అయితే ఎందువల్ల కొందరు ఈ విధమైన శాంతి మంత్రాలను ఉపనిషత్తులు చదివినప్పుడు కూడ చదువుతున్నారు అనే ప్రశ్నకు సమాధానం ఇదమిత్థంగా చెప్పబడదు. ఉపనిషత్తులు దూరంగా అరణ్యంలోనే చదువుకోవాలి, మిగతా ప్రవర్గ్య కర్మల అధ్యయనం అక్కడే జరిగేది, కాబట్టి ఆయా శాఖీయులలో ఇటువంటి సంప్రదాయం వచ్చి ఉండవచ్చు అనే ఊహించుకోవాలి. ఇక్కడ ఒక విషయం మాత్రం గుర్తుంచుకోవాలి.

పూర్వమీమాంసా శాస్త్రంలో యజ్ఞవిధిలో ఏ మంత్రాన్ని ఎక్కడ చేర్చుకోవాలి అని నిర్ణయించుకోడానికి ఆరు ప్రమాణాలు నిర్దేశించారు: 1. శ్రుతి, 2. లింగం, 3. వాక్యం, 4. ప్రకరణం, 5. స్థానం, 6. సమాఖ్య. అన్నింటి కన్నా బలీయమైనది శ్రుతి. అన్నింటి కన్నా దుర్బలమైనది సమాఖ్య. శాంతిమంత్రాలకు సన్నిధి సంబంధం మాత్రమే కనబడుతున్నది. ఉపాసనా విద్యలకు, యాజ్ఞిక కర్మలతో సంబంధం లేక పోవటం వలన శాంతిమంత్రాల ఉపసంహారం వేదాంతాలైన ఉపనిషత్తులలో ప్రస్తావించిన విద్యలకు అవసరం లేదు.

## 15. హాన్యధికరణమ్

## సూ: 3.3.26 హానౌ తూపాయనశబ్దశేషత్వాత్కుశాఛంద స్తుత్యుపగానవత్తదుక్తమ్

జైమిన్యాచార్యులవారు పూర్వమీమాంసలో యజ్ఞవిధిని సూచిస్తూ చెప్పిన సూత్రాన్ని అనుసరించి ఈ సూత్రాన్ని చెప్పడమైనది. సూత్రార్థం వివరణలోనే అర్థమవుతుంది.

**పూర్వపక్షి:**

ఛాందోగ్యంలో (సామవేదీయ తాండ్య శాఖీయులు పఠించే శ్రుతి) పుణ్య పాపాల విముక్తి (హానం) ఇలా వినిపిస్తున్నది: *"అశ్వ ఇవ రోమాణి విధూయపాపం, చంద్ర ఇవ రాహోర్ముఖాత్ ప్రముచ్య, ధూత్వా శరీరమకృతం కృతాత్మా బ్రహ్మలోక మభిసంభవామి"* (అశ్వం తన రోమాలను దులిపివేసుకున్నట్లు, రాహుగ్రస్తుడైన చంద్రుడు గ్రహణం తరవాత బయటపడినట్లు, పాపాలను పోగొట్టుకొని, నేను దేహం నుండి విముక్తుడనై, బ్రహ్మలోకాన్ని పొందుతాను–ఛా.ఉ 8.13.1). ముండకోపనిషత్తులో అథర్వణశాఖీయులు *"తథా విద్వాన్ నామరూపాద్విముక్తః పరాత్పరం పురుషముపైతి దివ్యమ్"* (విద్వాంసుడు నామరూపాలనుండి విముక్తుడై పరబ్రహ్మను చేరుతాడు– ము.ఉ 3.2.8) అని పఠిస్తున్నారు. అలాగే శాఠ్యాయనులు, మరణానంతరము జ్ఞాని యొక్క పుత్రులు ఆస్తిభాగాన్ని పొందుతారు, మిత్రులు పుణ్యఫలాన్ని, శత్రువులు పాప ఫలాన్ని పొందుతారు, అని ఈ విధంగా చదువుతున్నారు: *"తస్య పుత్రా దాయ ముపయంతి సుహృదః సాధుకృత్యాం, ద్విషంతః పాపకృత్యామ్"* . కౌషీతకులు కూడా ఈ విధంగానే *"సుకృత దుష్కృతే విధూనుతే, తస్యప్రియా జ్ఞాతయః సుకృత ముపయంతి, అప్రియా దుష్కృతమ్"* (విద్యావంతుడు పుణ్య–పాపాలను విధూనం చేసుకొని వదిలేస్తాడు. ప్రియమైన జ్ఞాతులు సుకృతాన్ని పొందుతారు. అప్రియమైన వారు పాపాలను పొందుతారు – కౌ. 1.4).

ఈ విధంగా వివిధ శాఖీయులు వారి వారి శ్రుతుల్లో సుకృత–దుష్కృతాలు వదులుకోవటం గురించి పఠిస్తున్నారు. అయితే వాటిలో వ్యత్యాసం కూడా కనబడుతు న్నది. కొన్ని శ్రుతి వాక్యాల్లో వదులుకోవటం (హానం) గురించే వినిపిస్తుంటే, కొన్నింటిలో హానం–ఉపాయనం (తీసుకోవటం) గురించి కూడ చెప్పబడింది. శాఖాంతర శ్రుతులలో ఇలా వినబడడం వల్ల ఎక్కడ విధూనం మాత్రమే చెప్పబడిందో అక్కడ పుత్రాదులు, జ్ఞాతులు సుకృత–దుష్కృతాలను పంచుకుంటారని అనువర్తించు కోవాలా? హానం (విడచిపెట్టటం) ప్రస్తావిస్తూ, ఉపాయనం చెప్పక పోయినా, అన్ని చోట్ల దాని యొక్క అనువృత్తి (ఉపసంహారం) ఉండాలనే తోస్తున్నది.

**సిద్ధాంతం:**

సూత్రంలో ఉపాయన శబ్దశేషత్వాత్ అని చెప్పిన కారణంగా ఉపాయ నాను వృత్తి కేవలం స్తుతి కోసం చెప్పినట్లు స్తుత్యర్థంలో గ్రహించి, ప్రాధాన్యత ఇవ్వనక్కరలేదు. ఈ సందర్భంలో ఏ విధమైన గుణోపసంహారం అవసరం ఉండదు.

*"కుశా ఛందః స్తుత్యుపగానవత్"* అని సూత్రంలో ఉపమానం చెప్పబడింది. *"కుశాః వనస్పత్యాః స్థ తా మాపాత"* అనే శ్రుతి యజ్ఞకర్మకు సంబంధించి వేదంలో వినబడుతుంది. కుశలంటే పెద్దవృక్షాల కఱ్ఱముక్కలు. అయితే, కొన్ని శాఖలవారు *"ఔదుంబరాః కుశాః"* అని మంత్రపఠనం చేస్తూ, ఔదుంబర వృక్షం యొక్క కఱ్ఱపుల్లల్నే వాడతారు. అలాగే ఛందస్సు విషయంలోను, షోడశి స్తోత్ర విషయంలోను శ్రుత్యంతర భేదం కనబడుతుంది. ఇటువంటి వ్యత్యాసం ఉన్నప్పుడు జైమిని పూర్వమీమాంసా శాస్త్రంలో ఒకశ్రుతిలో ఉన్న విశేషాలను వేరొకశ్రుతిలో అన్వయించుకోవటం న్యాయం అని భావించారు. ఈ సందర్భంలో వారు *"అపి తు వాక్య శేషత్వాత్ ఇతర పర్యుదాసః స్యాత్ప్రతిషేధే వికల్పః స్యాత్"* అని సూత్రం ప్రతిపాదించారు (జై.సూ 10.8.5). ఈ సూత్రం ప్రకారం వికల్పాన్ని ఆశ్రయించటం దోషయుక్తం. వికల్పం అష్టదోష దుష్టం అని పూర్వమీమాంసా శాస్త్రజ్ఞులు భావిస్తారు. ఈ కారణంగా, హానం ప్రసక్తి ఉన్నప్పుడు, ఉపాయనం యొక్క అన్వయం చేసుకోవటమే భావ్యము.

పూర్వపక్షి విధూన శబ్దానికి మరొకవిధంగా కూడ అర్థం చెప్పుకోవొచ్చునని సూచించటం జరిగింది. విధూనం అంటే

విడచిపెట్టటం, త్యజించటం అనే అర్థం కన్నా చాలనం–కంపింపచేయటం(ధూఞ్ కంపనే) అనే అర్థంలో గ్రహిస్తే సమన్వయం కుదురుతుందని ప్రస్తావించటం జరిగింది. ఉదాహరణకు *"ధో ధూయంతే ధ్వజాగ్రాణి"* అనే ప్రయోగం ఉంది కదా? అని సమర్థించటం జరిగింది. కాని, సుకృత– దుష్కృతాలు ధ్వజాగ్రం లాటి వస్తువులు–ద్రవ్యాలు కావు. అందువల్ల కంపన ధాత్వర్థం ఇక్కడ కుదరదు. *"అశ్వ ఇవ రోమాణి విధూయ పాపం"* అని శ్రుతిలో విన్పిస్తున్న కారణంగా పాపాలను పోగొట్టుకుని విముక్తిపొంది అనే అర్థంలోనే ఇక్కడ సమన్వయం చేసుకోవాలి. అశ్వం రోమాలు విధూనం చేసుకుంటూ (దులుపుకుంటూ), దాని శరీరానికి అంటి ఉన్న మలినాన్ని, దానితో పాటు జీర్ణమైపోయిన రోమాలను వదిలే స్తుంది. అందువల్ల పాప–పుణ్యాలను విదుల్చుకొని పరిశుద్ధంగా శరీరాన్ని వదలి వెళ్లినవాడు కృతాత్ముడు అనే అన్వయమే ఇక్కడ అనుగుణమని నిర్ణయించుకోవాలి.

# 16. సాంపరాయాధికరణమ్

## సూ: 3.3.27 సాంపరాయే తర్తవ్యాభావాత్తథా హ్యన్యే

(సాంపరాయే + తర్తవ్యాభావాత్ + తథాహి + అన్యే)

మరణ సమయంలోనే ఇక ఫలం పొందటానికి ఏమీ లేనందువల్ల, సుకృత– దుష్కృతాలను వదలిపెట్టి వెళ్లిపోతారని కొన్ని శాఖలవారు అభిప్రాయపడతారని సూత్రార్థం.

**పూర్వపక్షి:**

కౌషీతకులు పర్యంక విద్యలో ఇలా పఠిస్తున్నారు: *"స ఏతం దేవయానం పంథాన మాసాద్య అగ్నిలోక మాగచ్ఛతి"* (బ్రహ్మోపాసన చేసినవాడు దేవయాన మార్గంలో అగ్నిలోకం చేరుకుంటాడు – కౌ.ఉ 1.3) ఆ పైన *"స ఆగచ్ఛతి విరజాం నదీం తాం మనసైవాత్యేతి తత్సుకృత దుష్కృతే విధూనుతే"* అని చదువుతారు (వాడు విరజా నదిని మనస్సుతోనే దాటివేసి సుకృత–దుష్కృతాలను విడచిపెడతాడు – కౌ.ఉ 1.4).

ఈ శ్రుతి వాక్యాలను ఎలా అర్థం చేసుకోవాలి? సుకృత–దుష్కృతాల పరిత్యాగం బ్రహ్మనిలయం చేరే మార్గంలో జరుగుతుందా? లేక దేహం నుండి ప్రాణాలు పోయే సమయంలో జరుగుతుందా? సుకృత–దుష్కృతాల ప్రయోజనం బ్రహ్మమును చేరుకుంటున్న వాడికి ఏముంటుంది, అందువల్ల సుకృత–దుష్కృతాల యొక్క హానం దేహం నుండి ప్రాణం పోయేముందు ఇహలోకంలోనే జరగాలని తోస్తున్నది. తాండ్య, శాఠ్యాయన శాఖీయులు కూడా మరణసమయానికి ముందే సుకృత–దుష్కృతాల విధూనం జరుగుతుందని, వాటిని ప్రియాప్రియులకు వదలి వేయటం జరుగుతుందనే వారి వారి శాఖల శ్రుతుల్లో పఠిస్తున్నారు.

## సూ: 3.3.28 ఛందత ఉభయావిరోధాత్

విద్యానుష్ఠానం జీవించి ఉన్నప్పుడే సాధ్యమవుతుంది. అందువల్ల స్వ ఇచ్ఛానుసారం సుకృత–దుష్కృతాలను వదిలేయటం (హానం), మరణానికి పూర్వమే సాధకావస్థలో ఇక్కడే జరగాలి. మరణానంతరం ప్రయత్నం చేసే అవకాశం ఉండదు. ప్రయత్నానికి అనుగుణంగా సుకృత–దుష్కృత హానం కలుగుతుంది; అంతే కాని బ్రహ్మలోక ప్రయాణ మార్గ మధ్యంలో కాదు.

# 17. గతేరర్థవత్త్వాధికరణమ్

## సూ: 3.3.29 గతేరర్థవత్త్వముభయథాఽన్యథాహి విరోధః

(గతేః + అర్థవత్త్వమ్ + ఉభయథా అన్యథాహి విరోధః)

సగుణ బ్రహ్మోపాసనంలో దేవయానగతి నిర్దేశం ఉంటుంది, కాని జ్ఞాన మార్గంలో పొందే నిర్గుణ బ్రహ్మప్రాప్తిలో గతి నిర్దేశం నిరర్థకం, అందువల్ల గతి ఉభయత్రా వర్తించదని సూత్రార్థం.

**పూర్వపక్షి:**

కొన్ని శ్రుతివాక్యాల్లో దేవయాన మార్గం ప్రస్తావించిన సందర్భంలోనే సుకృత–దుష్కృతాల హానం గురించి విన్పిస్తున్నది. కొన్ని శ్రుతుల్లో దేవయాన మార్గ ప్రస్తావన వినబడదు. అందువల్ల సుకృత–దుష్కృతాల హానం వినబడుతున్న అన్ని ప్రదేశాలలో దేవయాన మార్గ గతినే నిర్ధారించుకోవాలా అనే సందేహం కలుగుతున్నది. సుకృత–దుష్కృతాల హానం ఉన్నదగ్గరల్లా వాటి ఉపాయనం అనువర్తిస్తుందని గత అధికరణంలో నిర్ణయించిన ప్రకారమే, హానప్రస్తావన ఉన్న దగ్గరల్లా దేవయాన మార్గ గతిని ఉపసంహారం చేసుకోవాలని తోస్తున్నది.

**సిద్ధాంతం:**

దేవయాన మార్గగతి అన్ని చోట్ల అనువర్తించదు. సగుణ బ్రహ్మోపాసకులకు ఆ మార్గ నిర్దేశం ప్రయోజకరం (సార్థక) మవుతుంది. జ్ఞానమార్గంలో నిర్గుణ బ్రహ్మ ప్రాప్తి యందు దేవయాన మార్గ గతి ప్రస్తావన నిరర్థకం. అందుకే శ్రుతిలో *"పుణ్యపాపే విధూయ నిరంజనం పరమం సామ్యముపైతి"* (ము.ఉ 3.1.3) అని వినిపిస్తున్నది. పొందదగిన పరబ్రహ్మ ఎక్కడికో వెళ్లి పొందవలసినది కాదు. దేశాంతరంలో లేదు. అందువల్ల గతినిర్దేశం నిర్గుణబ్రహ్మ విషయంలో వ్యర్థం.

## సూ: 3.3.30 ఉపపన్నస్తల్లక్షణార్థోపలబ్ధేర్లోకవత్

(ఉపపన్నః తత్‌లక్షణ + అర్థ + ఉపలబ్ధేః లోకవత్)

పర్యంక విద్యాదులు సగుణబ్రహ్మోపాసనకు నిర్దేశింపబడినవి. వాటిలో బ్రహ్మమును చేరి కొంతకాలం మంచి భోగాలను అనుభవించటం ఇత్యాది ప్రస్తావన వినబడుతుంది. అందువలన గతిని సూచించటంలో ప్రయోజనం ఉంది. నిర్గుణ బ్రహ్మము జ్ఞానమార్గంలో సాధింపబడుతుంది. అందువలన, ఈ సందర్భంలో దేవయాన మార్గం యొక్క అనువృత్తే ఉండదు. ఆప్తకాములైన జ్ఞానులు ఇక్కడే ఇహలోకంలోనే సమస్త క్లేశబీజాలను దహింప చేసుకొని, అపహతపాప్ములుగా దేహ విముక్తితోనే మోక్షం పొందుతారు. సద్యోముక్తిలో మార్గ ప్రసక్తి ఉండకపోడానికి ఇదే కారణం. ఈ విషయాన్ని రానున్న ఫలాధ్యాయంలో వివరంగా చర్చించడమైంది.

## 18. అనియమాధికరణమ్

### సూ: 3.3.31 అనియమః సర్వాసామవిరోధః శబ్దానుమానాభ్యామ్

అన్ని సగుణవిద్యల వలన దేవయాన మార్గంలో అంతిమ గతి ఉంటుందనే నియమం లేదని శ్రుతి–స్మృతి వాక్యాలు తెల్పుతున్నవని సూత్రార్థం.

**పూర్వపక్షి:**

అన్ని సగుణబ్రహ్మోపాసనా విద్యలలోను దేవయానమార్గంలో నిర్గమనం వినిపించటం లేదు. పర్యంకవిద్య, ఉపకోసలవిద్య, పంచాగ్నివిద్య, దహరవిద్య ఇటువంటి ఉపాసనా విద్యలలోనే దేవయాన మార్గగతి వినబడుతున్నది. మధువిద్య, శాండిల్యవిద్య, షోడశకలవిద్య, వైశ్వానరాదివిద్యల్లో దేవయానమార్గ నిర్దేశం లేదు. అందువల్ల దేవయాన మార్గగతి ఎక్కడ స్పష్టంగా చెప్పబడిందో ఆ విద్యలకు మాత్రమే పరిమితమా లేక అన్ని సగుణోపాసన విద్యలకు అనువర్తిస్తుందా – అని సంశయం.

**సిద్ధాంతం:**

అభ్యుదయ ఫలప్రాప్తి సగుణ విద్యలన్నింటికీ వర్తిస్తుంది కాబట్టి దేవయాన మార్గగతి, సగుణబ్రహ్మ ఉపాసనా విద్యలన్నింటికి అనువర్తిస్తుంది. *"తద్య ఇత్థం విదుః"* అనే శ్రుతి పంచాగ్ని విద్యాప్రకరణలో విన్పిస్తున్నది. అదే శ్రుతిలో *"యే చేమేఽరణ్యే శ్రద్ధాతప ఇత్యుపాసతే"* (ఛా.ఉ 5.10.1) అని కూడా బోధిస్తున్నది. అరణ్యంలో శ్రద్ధా తపస్సుల నాచరించిన విద్యావేత్తలందరికీ దేవయాన మార్గగతి ఉంటుందనే దీని తాత్పర్యం. *"విద్యయా తదారోహంతి యత్ర కామాః పరాగతాః న తత్ర దక్షిణా యంతి న అవిద్వాంసః తపస్వినః"* అనే మరో శ్రుతి వాక్యం కామక్రోధ లోభాలు బ్రహ్మలోకంలో దహించుకుపోతాయి. ఆ లోకాన్ని విద్య చేతనే పొందగలరు. కర్మిష్ఠులు, విద్య లేని తపఃశాలులు కాని అక్కడికి వెళ్లలేరు.

వాజసనేయ శాఖీయులు పంచాగ్ని విద్యాప్రకరణంలో ఇలా పఠిస్తున్నారు: *"య ఏవమేతత్ విదుః యేచామీ అరణ్యే శ్రద్ధాం సత్యముపాసతే తే అర్చిః అభిసంభవంతి"* (శ్రద్ధావంతులైన వారు సత్ రూపమైన బ్రహ్మమును ఉపాసిస్తున్నారు– బృ.ఉ 6.2.15). ఈ శ్రుతి వాక్యం వల్ల ఇతర విద్యల ఆలంబనంచేస్తున్న బ్రహ్మోపాసకు లందరికీ దేవయాన మార్గ గమనం ఉంటుందనే తెలుస్తున్నది. *"అథ యే ఏతౌ పంథానౌ న విదుః తే కీటాః పతంగా యదిదం దందశూకమ్"* (బృ.ఉ 6.2.16) అని మరో శ్రుతి (ఎవరు దేవయాన మార్గం–పితృయాన మార్గం అని రెండు మార్గాల గురించి తెలుసుకోరో, వారు అధోమార్గంలో క్రిమి–కీటకాలు, ఈగలు–దోమలు ఇత్యాది హీన జన్మలను పొందుతారని దీని అర్థం). అందువల్ల వైశ్వానరోపాసకులకు దేవయాన పితృయాన మార్గాలలోనే కాని మరేగతి ఉండదు అని విదితమౌతున్నది. అంతేకాదు స్మృతి అర్చిరాది మార్గం(శుక్లగతి) విద్యా విశేషం ఉన్న వారికి ప్రాప్తిస్తుంది. వారు తిరిగి ఇహలోకానికి రారు అని బోధిస్తున్నది: *"శుక్ల కృష్ణే గతీ హ్యేతే జగతః శాశ్వతే మతే, ఏకయా యాత్యనావృత్తిం, అన్యయాఽఽవర్తతే పునః"* (భ.గీ. 8.26). అర్చిరాది మార్గంలో వెళ్లినవారు బ్రహ్మలోకంలో ఉండి క్రమముక్తిని పొందుతారు. ధూమాది పితృయాన మార్గంలో వెళ్లిన వారు, తిరిగి మానవ జన్మ ఎత్తటానికి ఇహ లోకం వస్తారు.

## 19. యావదధికారాధికరణమ్

### సూ: 3.3.32 యావదధికారమవస్థితిరాధికారికాణామ్

ఈ ప్రకరణంలో విద్యావేత్తలు వర్తమాన దేహత్యాగానంతరము మళ్లీ జన్మ ఎత్తటమనేది ఉంటుందా అనే విషయంపై చర్చ జరిగింది.

**పూర్వపక్షి:**

బ్రహ్మవిద్యావేత్తలందరూ, కైవల్యం పొంది మళ్లీ ఇహలోకంలో జన్మనెత్తరు అని నిర్దిష్టంగా చెప్పబడదు. కారణం పురాణేతిహాసాలలో విద్యావేత్తలు, బ్రహ్మవేత్తలు కూడా మళ్లీ మరో శరీరధారణ చేసినట్లు అక్కడక్కడ చెప్పబడింది. వేదాచార్యుడు, అపాంతరతమస్సనే ఋషి కలి–ద్వాపర యుగసంధిలో కృష్ణద్వైపాయనుడిగా (వ్యాస మహర్షి) పుట్టినట్లు, బ్రహ్మ మానసపుత్రుడైన వసిష్ఠుడు, నిమిచక్రవర్తి యొక్క శాపం వలన, పూర్వదేహం పోగొట్టుకొని మళ్లీ మిత్రా–వరుణులకు బ్రహ్మాదేశానుసారం జన్మించినట్లు, అలాగే భృగువు–బ్రహ్మదేవుని మరో మానసపుత్రుడు, మళ్లీ వరుణ యజ్ఞంలో పుట్టినట్లు పురాణాలలో చెప్పబడింది. సనత్కుమారుడే మళ్లీ స్కందుడుగా జన్మ ఎత్తినట్లు శ్రుతిలో కూడా వినబడుతున్నది. దక్షుడు, నారదుడు ఇత్యాది బహు విద్యాసంపన్నులు, ఎన్నో జన్మలు పొందినట్లు కూడ పురాణాదుల్లో ప్రస్తావించటం జరిగింది. యోగశక్తి వల్ల కూడ కొందరు పూర్వదేహం ఉంటుండగా మరోదేహం పొందినట్లు వేదమంత్రాలలోను, అర్థవాద భాగాలలోను వినిపిస్తున్నది. అందువల్ల బ్రహ్మవిద్యా ప్రాప్తి, పాక్షికంగానే మోక్షహేతువని గ్రహించాలా? అసలు సంపత్ విద్యాసాధన మోక్షాన్నే ప్రసాదించదా అనే సంశయం కలుగుతున్నది.

**సిద్ధాంతం:**

సూర్య భగవానుడు వెయ్యి యుగాల వరకు ఈ జగత్తుపై తన అధికారాన్ని, బాధ్యతలను నిర్వర్తించి, ఆ తరవాత ఉదయాస్తమానములు లేకుండా కైవల్యం పొందుతాడని శ్రుతి ఇలా వినిపిస్తున్నది: *"అథ తతః ఊర్ధ్వ ఉదేత్య న ఏవ ఉదేతా న అస్తమేతా ఏకల ఏవ మధ్యే స్థాతా"* (ఛా.ఉ 3.11.1). బ్రహ్మవేత్తల విషయంలోశ్రుతి వాక్యాలు ఇలా ఉన్నాయి: *"తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యేఽథ సంపత్స్యే"* (ప్రారబ్ధ భోగం క్షీణించిన తరువాత మోక్షం పొందుతాడు –ఛా.ఉ 6.14.2). ఇదేవిధంగా అపాంతరతమస్సు మొదలగు బ్రహ్మజ్ఞానులు, సర్వేశ్వరుని యొక్క ఇచ్ఛ కనుగుణంగా ఆయా అధికారాలు పొంది ఆ తరువాత ముక్తులవుతారని నిర్ణయించుకోవాలి. ఈ సందర్భంలో కొందరు ఆధికారులని, కొందరు జాతిస్మరులని వివరించబడింది.

ఆధికారులు స్వతంత్రులు. పూర్వజన్మలోని నామాదికం ఉన్నాదేహాభిమానం ఇత్యాదులు ఉండవు. జాతిస్మరులకు పూర్వదేహం, పేరు, గుర్తులు అన్నీ పోతాయి. పరతంత్రులు, కాని గతజన్మ అనుభవాల జ్ఞాపకం ఉంటుంది. సులభ అనే బ్రహ్మవాదిని జనకునితో ఆత్మసంబంధమైన చర్చ చెయ్యాలనే ఇచ్ఛతో తన దేహం విడచిపెట్టి, జనకుని దేహంలో ప్రవేశించి చర్చ జరిపి తదనంతరం మళ్లీ తన దేహంలోకి ప్రవేశించిందనే ఆఖ్యాయిక ఉంది. ఇక్కడ సులభ అనే వ్యక్తి మారలేదు.

ఈ దేహాన్ని ఏ కర్మఫలం వల్ల ధరించటమైందో, ఆ కర్మఫలం నిర్విశేషంగా పోయేవరకు మరో జన్మ, మరో కర్మ ఫలంగా రాదు. కర్మఫల బీజనాశనం అయేవరకు జన్మ రాహిత్యం ఉండదు. అయితే, జ్ఞాన ప్రాప్తివల్ల సర్వ కర్మబీజాలూ దహించుకు పోతాయి కాబట్టి జన్మరాహిత్యం కలగాలి.

శ్రుతి, స్మస్మృతివాక్యాలు కైవల్యం పొందినవారికి జన్మ–మృత్యువు ఉండవని స్పష్టం చేస్తున్నాయి. *"జ్ఞానాదేవ తు కైవల్యం"* కాబట్టి ఆత్మజ్ఞానికి మోక్షప్రాప్తే ఉంటుంది. *"భిద్యతే హృదయగ్రంథి శ్ఛిద్యంతే సర్వసంశయాః క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే"* (ఆత్మజ్ఞానం కల్గిన వెంటనే సర్వగ్రంధులూ విడిపోతాయి, అన్ని సంశయాలూ పోతాయి, అన్ని కర్మలూ నశిస్తాయి –ము.ఉ 2.2.8) అలాగేమరో ఛాందోగ్యశ్రుతి *"స్మస్మృతిలంభే సర్వగ్రంథీనాం విప్రమోక్షః"* అని విన్పిస్తున్నది (ఛా.ఉ 7.26.2). భగవద్గీతలో దీనినే ఇలా బోధించటం జరిగింది: *"యథైధాంసి సమిద్ధోఽగ్నిః భస్మసాత్*

*కురుతేఽర్జున, జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్ కురుతే తథా"* (మండుతున్న అగ్ని, కర్రలను కాల్చివేసినట్లు, జ్ఞానాగ్ని సమస్త కర్మలనూ భస్మం చేస్తుంది – భ.గీ 4.37). కాలిపోయిన విత్తనాలు మళ్లీ ఎలా ఉద్భవించవో, అలాగే క్లేశాలు దగ్ధమైన తరవాత మళ్లీ శరీర ధారణ ఉండదు. *"బీజా న్యగ్న్యుపదగ్ధాని న రోహంతి యథా పునః, జ్ఞానదగ్ధైః తథాక్లేశైః న ఆత్మా సంపద్యతే పునః"* .

దేవతలకూ, ఋషులకు, మనుష్యులకూ జ్ఞానం వల్ల మోక్షసిద్ధి కలుగు తుందనే శ్రుతి బోధిస్తున్నది: *"తద్యో యో దేవానాం ప్రత్యభుధ్యత స ఏవ తదభవత్తథర్షీణాం తథా మనుష్యాణామ్"* (బృ.ఉ 1.4.10). కొంతమంది మహర్షులు సంపత్ప్రాప్తి ఫలంగా, ఇతర జ్ఞానసాధనలో ఆసక్తులైతే మళ్లీ వారి కోరిక తీరే వరకు ఆ విధమైన జన్మ పొందటానికి ఆధికారిక పురుషులై ఉండాలి. వారి అధికారం పూర్తి అయిన తరువాత హిరణ్యగర్భుని చేరి, మహాప్రళయ సమయంలో వానితో కూడా పరబ్రహ్మను చేరి మోక్షం పొందుతారని స్మృతి వాక్యం *"బ్రహ్మణా సహ తే సర్వే సంప్రాప్తే ప్రతిసంచరే, పరస్యాంతే కృతాత్మనః ప్రవిశంతి పరం పదమ్"* .

స్వర్గఫలం కనబడనిది. కాని జ్ఞాన ఫలం అనుభవారూఢమైనది. *"తద్ధైతత్ పశ్యన్ ఋషిః వామదేవః ప్రతిపేదేఽహం మనురభవం సూర్యశ్చ"* అని శ్రుతి విని పిస్తున్నది (బృ.ఉ 1.4.10). సమ్యగ్దర్శనం కలిగిన వెంటనే దానికి ఫలమైనబ్రహ్మత్వాన్నే పొందుతాడు. ( *"బ్రహ్మవిత్ బ్రహ్మైవ భవతి"* ). అందువల్ల బ్రహ్మవేత్తకు శాశ్వత కైవల్య సిద్ధి ప్రాప్తిస్తుందనే శ్రుతులు నిర్ధారిస్తున్నవి. దీనిలో సంశయమునకు తావులేదు.

## 20. అక్షరధ్యధికరణమ్

## సూ: 3.3.33 అక్షరధియాం త్వవరోధః సామాన్యతద్భావాభ్యా మౌపసదవత్తదుక్తమ్

(అక్షరధియాం + తు + అవరోధః సామాన్యతద్భావాభ్యాం + ఉపసదవత్ తదుక్తమ్)

**పూర్వపక్షి:**

వాజసనేయ బృహదారణ్యక శ్రుతి ప్రతిషేధరూపాలైన విశేషణాలతో ఇలా వినబడుతున్నది: *"ఏతద్వై తదక్షరం గార్గి బ్రాహ్మణా అభివదంతి అస్థూలం అనణు అహ్రస్వం అదీర్ఘం అలోహితం అస్నేహమ్"* (బృ.ఉ 3.8.8). అలాగే అథర్వణీయ ముండకోపనిషత్తులో *"అథ పరా యయా తదక్షర మధిగమ్యతే, యత్తత్ అద్రేశ్యం అగ్రాహ్యం అగోత్రం అవర్ణమ్"* (ము.ఉ 1.1.5, 1.1.6.) అని వినబడుతున్నది. అక్షరమైన బ్రహ్మను ఇలా విశేషణాలతో నిరాకరించి చెబుతున్న శ్రుతులు మరికొన్ని స్థానాలలో కూడా వినిపిస్తున్నవి. అందువల్ల అక్షరుడైన బ్రహ్మకు నిషేధగుణాలను అన్ని చోట్ల ఉపసంహారం చేసుకోవాలా, లేక అవి ఏయే ప్రదేశాలలో వినిపిస్తున్నాయో అక్కడ మాత్రమే గ్రహించాలా అనే సందేహం కలుగుతున్నది.

**సిద్ధాంతం:**

శ్రుతులు వేరు వేరు స్థానాలలో వినబడుతుండడం వలన, నిషేధ ప్రతిపాదనలు కూడా అన్ని చోట్ల అనువర్తిస్తాయి. బ్రహ్మతత్త్వమే అన్నిచోట్ల ప్రతిపాద్యము కాబట్టి సామాన్య తద్భావరీత్య, సర్వత్ర బ్రహ్మ యొక్క నిషేధ ప్రతిపాదనలూ ఉపసంహారం చేసుకోవాలి. ఇంతకు ముందు *"ఆనందాదయః ప్రధానస్య"* అనే సూత్రంలో (బ్ర.సూ 3.3.11) విధిరూపాలైన ఆనందరూపత్వం, విజ్ఞానఘనత్వం ఇత్యాది ధర్మాలను అన్ని స్థానాలలోను స్వీకరించాలని నిర్ణయించ డమైంది. అదే విధంగా ప్రతిషేధ రూపాలైన విశేషణాలనూ అనువర్తించుకోవాలి.

క్రతువిధిలో కూడా ఒకచోట చెప్పబడిన అంగాలకు వేరొక చోట చెప్పిన ప్రధానంతో (అంగితో కూడా) ఉపసంహారం జరుగుతుంది. సూత్రంలో 'ఔపసదవత్' అనే పదం, ఈ ప్రమాణానికి సంబంధించినది. అదే ఇక్కడ ఉదహరించబడినది.

# 21. ఇయదధికరణమ్

## సూ: 3.3.34 ఇయదామననాత్

(ఇయత్ + ఆమననాత్)

**పూర్వపక్షి:**

*"ద్వాసుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే, తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి అనశ్నన్నన్యోఽభిచాకశీతి"* అనే మంత్రాన్ని అథర్వణీయులు ముండకోపనిషత్తులోను (ము.ఉ 3.1.1), కృష్ణయజుర్వేదీయ శ్వేతాశ్వతరులూ (శ్వే.ఉ 4.6) అధ్యాత్మ ప్రకరణంలో ఒకే విధంగా పఠిస్తున్నారు. అలాగే కృష్ణయజుర్వేదీయులు కఠోపనిషత్తులో మరో మంత్రాన్ని ఇలా చదువుతున్నారు: *"ఋతం పిబంతౌ సుకృతస్య లోకే గుహాం ప్రవిష్టౌ పరమే పరార్ధే, ఛాయాతపౌ బ్రహ్మవిదో వదంతి పంచాగ్న యో, యే చ త్రిణాచికేతాః"* (క.ఉ 3.1) ఇక్కడ ప్రతిపాదింపబడిన ఆత్మవిద్యలో ఏకత్వం ఉందా? లేక రెండూ భిన్నములా?

'ద్వాసుపర్ణా' అనే మంత్రంలో ఒకనికి భోక్తృత్వం మరొకరికి అభోక్తృత్వం (అనశ్నన్) అని వినబడుతున్నది. 'ఋతం పిబంతౌ' అనే మంత్రంలో ఇరువురికీ భోక్తృత్వం ఉన్నట్లు చెప్పబడింది. వేద్యంలో భేదమున్నప్పుడు విద్యలు వేరు కావాలి కదా! అనే సందేహం కలుగుతున్నది.

**సిద్ధాంతం:**

ఇక్కడ విద్యా ఏకత్వమే కాని భిన్నం లేదు. రెండు మంత్రాలలోనూ పరమాత్మ యొక్క పరిమాణం ఇంత అని కొలవబడదు (ఇయత్తా అపరిచ్ఛిన్నమైనది). వేద్యమైన ఆత్మరూపం ఒక్కటే అని ప్రతిపాదింపబడుతున్నది. ఈ రెండు మంత్రాల లోను ఒకణ్ణి జీవుడుగాను, మరొకణ్ణి పరమేశ్వరునిగాను (ద్వాసుపర్ణా–ఒకే గూటిలో రెండు పక్షులు అని) నిర్దేశించబడింది. పరమాత్మకు ఆకలి–దప్పులు లేవని *"అనశ్నన్ అభిచాకశీతి"* అని సూచించడమైంది. అలాగే *"జుష్టం యదా పశ్యతి అన్యమీశం అస్య మహిమానమ్"* అనే మంత్రం (శ్వే.ఉ 4.7) పరమాత్మ ప్రతిపాదననే విన్పిస్తున్నది. 'ఋతౌ పిబంతౌ' అనే మంత్రంలో జీవాత్మ – పరమాత్మ ఒకే ఉపాధిలో ఉంటున్న సహచర్యం వల్ల పిబంతౌ, అని ఆరోపిస్తూ ఇద్దరూ అనుభవిస్తున్నట్లు (ఛత్రిన్యాయాన్ని అనుసరించి) చెప్పడమైంది.

ఉపక్రమంలో *"అన్యత్ర ధర్మాత్ అన్యత్ర అధర్మాత్"* (క.ఉ 2.14) అని ఉండడం వల్ల, వాక్యశేషంలో *"యః సేతురీజానానాం అక్షరం బ్రహ్మ యత్పరమ్"* (క.ఉ 3–2) అని వినిపిస్తున్నందున, ఇక్కడ పరమేశ్వర నిర్దేశం తప్ప మరొకటి కాదని గ్రహించాలి.

ముండకోపనిషత్తులోను, కఠోపనిషత్తులోను, శ్వేతాశ్వతర ఉపనిషత్తులోను పరమాత్మ విద్యయే ప్రతిపాదించబడింది. అందువల్ల, జీవేశ్వర అభిన్నత్వాన్ని, తాదాత్మ్యాన్ని, అన్ని స్థానాలలోను ఒకే రీతిలో బోధించడమైంది. ఈ విషయాన్నేముందు *"గుహాం ప్రవిష్టావాత్మానౌ హి"* అనే సూత్రం (బ్ర.సూ 1.2.11) లో చర్చించడమైనది.

## 22. అంతరత్వాధికరణమ్

### సూ: 3.3.35 అంతరా భూతగ్రామవత్స్వాత్మనః

(అంతరా + భూతగ్రామవత్ + స్వ + ఆత్మనః)

(పూర్వ మంత్రం నుంచి ఆమననాత్ అనే పదం ఈ సూత్రంలో కూడా అనువర్తిస్తుంది) సర్వాంతరమని చెప్పడం వలన పంచభూతాలతో పాటు స్వ ఆత్మకూ ఏకత్వం ఉందని సూత్రార్థం.

**పూర్వపక్షి:**

వాజసనేయ బృహదారణ్యకోపనిషత్తులో *"యః సాక్షాత్ అపరోక్షాత్ బ్రహ్మ య ఆత్మా సర్వాంతరః"* అనే శ్రుతివాక్యం రెండు స్థానాలలో వినబడుతున్నది. ఉషస్తి–యాజ్ఞవల్క్య సంవాదంలోను (బృ.ఉ 3.4.1), మళ్లీ కహోల–యాజ్ఞవల్క్య సంవాదంలోనూ బోధింపబడింది. అందువల్ల విద్యా భేదం ఉందనే సందేహం కలుగు తున్నది. విద్యా ఏకత్వం ఉంటే ఒకే విషయంపై రెండు పర్యాయాలు చర్చ ఎందుకు జరుగుతుంది? యాజ్ఞిక కర్మలలో ఆవృత్తి ఉంటే కర్మ భేదం ఉన్నట్లు అంగీకరింప బడుతుంది కదా?

యాజ్ఞవల్క్య–ఋత్విక్కులు సంవాదం ఏ సందర్భంలో జరిగిందో, ఆ బ్రాహ్మణంలో ప్రస్తావించిన విషయాలను సంక్షిప్తంగా వివరిస్తే ఇక్కడ చర్చనీయాంశ మైన బ్రహ్మవిద్యలో ఏకత్వం ఉందా లేదా అనే విషయం అర్థమవుతుంది.

జనకుడనే మహారాజు పెద్ద యజ్ఞంచేసి కురు–పాంచాల దేశాలలో ఉండే విద్వాంసులను ఆహ్వానించి, వెయ్యి గోవుల పాదాలకు, కొమ్ములకు బంగారం కూడా చేర్చి, మీలో అతి విశిష్టుడైన బ్రహ్మవేత్త వచ్చి ఈ గోవులను, వాటితో పాటు బంగారాన్ని తీసుకొని వెళ్లవచ్చు అని ప్రకటిస్తాడు. యాజ్ఞవల్క్యుడు దానికి సన్నద్ధుడౌతాడు. అక్కడ ఉన్న ఆస్థాన ఋత్విక్కులు, మేము అడిగిన ప్రశ్నలకు సమాధానమిచ్చి నీకు ఉన్న జ్ఞానాన్ని నిరూపించుకొని ఈ గోవులను తీసుకొని వెళ్ళమని, ఒక్కొక్కరూ ప్రశ్నలను అడగటం మొదలుపెడతారు.

ఉషస్తి అనే ఋత్విక్కు అడిగిన ప్రశ్న: *"యః సాక్షాత్ అపరోక్షాత్ బ్రహ్మ య ఆత్మా సర్వాంతరః తం మే వ్యాచక్ష్వ"* (సమీపంలో ఉండేది ప్రత్యక్షంగా ఉన్న ఏ పరబ్రహ్మము సర్వాంతరము అని అంటున్నావో, నాలో ఉన్న ఆ ప్రత్యగాత్మ యొక్క స్వరూపము నాకు స్పష్టంగా చెప్పు – బృ.ఉ 3.4.1). దీనికి సమాధానంగా యాజ్ఞ వల్క్యుడు *"యః ప్రాణేన ప్రాణితి స త ఆత్మా సర్వాంతరః"* (ప్రాణ వాయువు చేత ప్రాణ వ్యాపారము చేస్తున్నాదో అదే నీ దేహంలో సమస్తమునకు లోపల ఉన్న ఆత్మ స్వరూపము) అని చెప్తాడు. ఆ తరవాత కహోలుడనే ఋత్విక్కు *"యదేవ సాక్షాత్ అపరోక్షాత్ బ్రహ్మ య ఆత్మా సర్వాంతరః తం మే వ్యాచక్ష్వ"* అని ప్రశ్నించగా *"యో ఽశనాయా పిపాసే శోకం మోహం జరాం మృత్యు మత్యేతి"* (క్షుత్ పిపాసలకు, శోక మోహాలకు జరా మృత్యువులకు అతీతమై అన్నింటికన్న లోపల ఉండేది ఆత్మ) అని బోధిస్తాడు (బృ.ఉ 3.5.1).

పంచభూత సమూహాత్మకమైన ఈ దేహంలో పృథివి కంటె ఉదకం లోపల ఉంటుంది, ఉదకం కంటె తేజస్సు లోపల ఉంటుంది, వీటికి ఆపేక్షికమైన అంతరత్వం ఉన్నా, ముఖ్యమైన సర్వాంతరత్వం ఒక్క పరమాత్మకే ఉందని ఆత్మవిద్యా బోధనలోని సారాంశం. *"ఏకో దేవః సర్వ భూతేషు గూఢః సర్వవ్యాపీ సర్వ భూతాంతరాత్మా"* అని మరో శ్రుతి కూడా వినిపిస్తున్నది (సమస్త భూత సముదాయంలోను ఒకే ఆత్మ గూఢంగా వ్యాపించి ఉంది – శ్వే.ఉ 6.11). వేద్యమైనది ఆత్మతత్త్వము. అందువల్ల ఇక్కడ బ్రహ్మవిద్యయే బోధింపబడింది.

### సూ: 3.3.36 అన్యథా భేదానుపత్తిరితి చేన్నోపదేశాంతరవత్

విద్యాభేదం లేకపోతే, రెండు పర్యాయములు అదే ప్రశ్నపై చర్చ (శ్రుతిలో అదే ఆమ్నానం) ఎందుకు ఉంటుంది అనే

ప్రశ్నకు ఈ సూత్రంలో సమాధానం ఇవ్వబడింది.

సామవేదీయ తాండ్య శాఖీయులు ఛాందోగ్యోపనిషత్తులో "స ఆత్మా తత్త్వమసి" అని శ్వేతకేతువుకు ఆత్మబోధ తొమ్మిది పర్యాయములు పఠిస్తారు. అక్కడ ఏ విద్యాభేదం లేదుకదా! *"భూయ ఏవ మా భగవాన్ విజ్ఞాపయతు"* (పూజ్యుడా! ఈ ఆత్మ విషయమే నాకు మళ్లీ వివరించండి) అని ఉపసంహారంలో వినబడడం వల్ల, మళ్లీ మళ్లీ శిష్యునికి వేరు వేరు దృష్టాంతాలతో ఆ పరమాత్మ, నువ్వు వేరు కాదు అని బోధింపబడింది. యాజ్ఞవల్క్య సంవాదంలో కూడా 'అతో–న్యదార్తమ్' అని ఉపక్రమోపసంహారాలలో ఆత్మతత్త్వమే వినిపిస్తున్నది. అదీకాక "యదేవ సాక్షాత్ అపరోక్షాత్ బ్రహ్మ" అనే రెండవ ప్రశ్నలో 'యదేవ' అనే శబ్దప్రయోగం పూర్వప్రశ్నకు సంబంధించినది, దాని వివరణే కోరుతున్నట్లు స్పష్టం చేస్తున్నది.

ఈ ప్రకరణంలో ఉన్న బ్రాహ్మణాలన్నింటిలోను (బృహదారణ్యకంలో పంచమాధ్యాయంలో తొమ్మిది బ్రాహ్మణాలు ఉన్నవి) బ్రహ్మవిద్యయే బోధింపబడింది. విద్యా ఏకత్వమే కాని భిన్నత్వం లేదు.

## 23. వ్యతిహారాధికరణమ్

## సూ: 3.3.37 వ్యతిహారో విశింషంతి హీతరవత్

(వ్యతిహారః + విశింషంతి హి + ఇతరవత్)

సత్యకామత్వం ఇత్యాది ఇతర గుణాలలో చెప్పినట్లు విశేషించి చెప్పడం వల్ల వ్యతిహారాన్ని గ్రహించాలని సూత్రార్థం.

**పూర్వపక్షి:**

ఋగ్వేదీయ ఐతరేయ ఆరణ్యకంలో ఆదిత్యపురుషుని ధ్యానిస్తూ *"తద్యో ఽహం సోఽసౌ యోఽసౌ సోఽహం"* అని పఠిస్తారు (నేనే ఆ సూర్యదేవుణ్ణి ఆ సూర్యదేవుడే నేను, అనగా నేనే అతడు–అతడే నేను – ఐ.ఆ. 2.2.4–6.). అదే విధంగా జాబాలులు కూడా ఇలా చదువుతున్నారు: *"త్వం వా అహమస్మి భగవో దేవతేఽహం వై త్వమసి"* . ఇక్కడ జీవేశ్వరులను పరస్పరం స్థానం మార్చి (వ్యతిహారం చేసి) చెబుతున్నారు. నేనే–నువ్వు అనే శబ్దంలో జీవుడు విశేషణం, ఈశ్వరుడు విశేష్యం అయితే, నువ్వే – నేను అనే శబ్దంలో ఈశ్వరుడు విశేషణం, జీవుడు విశేష్యం అవుతున్నారు. దీని భావం జీవేశ్వరులలో ఏకత్వం లేనట్టే కదా? అదీకాక ఈశ్వరుడు సంసారాత్ముడని భావిస్తే, అసంసారి అయిన ఈశ్వరుడికి, సంసారిత్వం కట్టబెట్టినట్లు అవుతుంది కదా?

**సిద్ధాంతం:**

ఇక్కడ వ్యతిహారం ఏకత్వాన్ని దృఢం చెయ్యడానికే చెప్పబడినట్లు గ్రహించాలి. సర్వాత్మత్వం ఇత్యాదులు ధ్యానంలో దృఢీకరణకు ఏ విధంగా చెప్ప బడ్డాయో, అదే విధంగా *"త్వం అహమస్మి – అహం త్వమసి"* అని విశేషించి చెప్ప బడుతున్నది. వచనానికి ఉన్న ప్రామాణ్యాన్ని బట్టి రెండువిధాలైన ధ్యానం ఉత్కృష్ట మవుతుంది. జీవేశ్వరుల అభిన్నత్వం దృఢీకరింపబడుతుంది, దానితో సహ సత్య కామత్వం ఇత్యాది ఈశ్వర గుణాలను తనలో నిల్పుకొని ధ్యానం చేసే ప్రయోజనం కూడ సమకూరుతుంది. అందువల్ల, వ్యతిహారంతో ధ్యానించటమే తగినది.

# 24. సత్యాద్యధికరణమ్

## సూ: 3.3.38 సైవ హి సత్యాదయః

సత్యాది ధర్మాలు చెప్పటం వల్ల సత్యవిద్య, బ్రహ్మవిద్య ఒకటే అని సూత్రార్థం.

**పూర్వపక్షి:**

బృహదారణ్యకోపనిషత్తులో వాజసనేయులు *"స యో హ ఏతం మహద్యక్షం ప్రథమజం వేద సత్యం బ్రహ్మేతి జయతి ఇమాన్ లోకాన్"* అని పఠిస్తారు. అన్నింటి కన్నా ముందు ఆవిర్భవించిన హిరణ్యగర్భుని సత్యం బ్రహ్మ అని ఉపాసించేవాడు అన్ని లోకాలను జయిస్తాడు (బృ.ఉ 5.4.1). ఈ ఉపాసనకు అంగంగా సత్యనామ అక్షరోపాసనను నిర్దేశిస్తూ 'సత్యమ్' అనేది స+త+యమ్ అనే మూడు అక్షరాల కలయిక అని వివరించబడింది. ఆతరవాత *"తద్యత్ సత్యమసౌ స ఆదిత్యో య ఏష ఏతస్మిన్ మండలే పురుషో యశ్చాయం దక్షిణే-క్షన్ పురుషః"* (సద్రూపమైన హిరణ్యగర్భుడే ఆదిత్యునిలో ఉన్నాడు, ఆదిత్యునిలో ఉన్న సద్రూపమే ఈ కుడికంటిలో నున్న పురుషుడు – బృ.ఉ 5–2–2).

*"స యో హ ఏతన్మహద్యక్షం"* ఇత్యాది వాక్యాలలో బోధించిన సత్య విద్య, *"తద్యత్ తత్ సత్యమసౌ ఆదిత్యః"* అనే వాక్యాలతో బోధించిన సత్య విద్య వేరువేరు అని తోస్తున్నది. కారణం ముందు వాక్యంలో వినబడుతున్న సత్య విద్యకు *"జయతి ఇమాన్ లోకాన్"* అనే ఫలమే చెప్పబడింది. తదనంతరం వినబడున్న వాక్యాల్లో *"హంతి పాప్మానం జహాతి చ య ఏవం వేద"* (ఇలా ఎవడు తెలుసుకుంటాడో అతడు పాపాలన్నీ నాశనం చేసుకుంటాడు) అని చెప్పబడింది అందువల్ల విద్యా భేదం ఉందనే అనిపిస్తున్నది.

**సిద్ధాంతం:**

ఇక్కడ ఉపాస్యము సద్రూపమైన బ్రహ్మపదార్థము. అందువల్ల రెండు వాక్యాలలోను సత్యవిద్యయే బోధింపబడింది. విద్యాభేదం లేదు. స్థాన విశేషాన్ని బట్టి ఆదిత్య పురుషోపాసనకు అంగంగా అహః అనే ఒక గుహ్యనామం (ఉపనిషద్ నామం), అక్షిపురుషోపాసకు అంగంగా 'అహమ్' అనే మరోనామం ప్రతిపాదించినట్లు ముందు సంబంధాధికరణంలో 'న వా విశేషాత్' అనే సూత్రంలో (బ్ర.సూ 3.3.21) వివరించడమైంది. *"హంతి పాప్మానమ్"* అనే ఫలసూచన ఈ అంగాలకు వర్తిస్తుంది కాని, ప్రధానమైన సత్యవిద్యకు వర్తించదు.

కొందరు వ్యాఖ్యాతలు ఛాందోగ్యోపనిషత్తులో విన్పిస్తున్న *"అథ య ఏషో ఽన్తరాదిత్యే హిరణ్మయః పురుషో దృశ్యతే"* (ఛా.ఉ 1.6.6) అనే శ్రుతిలోను *"అథ య ఏషో అంతరక్షిణి పురుషో దృశ్యతే"* (ఛా.ఉ 4.15.1) అనే వాక్యాలను, పైన ఉదహరించిన *"తద్యత్ తత్సత్య మసౌ స ఆదిత్యః"* అనే బృహదారణ్యక శృతితో కలిపి ఉపసంహారం చేసుకోవాలని అభిప్రాయపడుతున్నారు. ఇది సమంజసం కాదని భగవత్పాదులువారు నిర్ధారించారు. ఉపక్రమోపసంహారాలలో ఛాందోగ్యంలో ప్రస్తావించినది ఉద్గీథవిద్య, దానిలో సత్యాది గుణాలు ప్రస్తావింపబడలేదు. అందువల్ల ఎక్కడ చెప్పిన గుణాలను, అక్కడనే గ్రహించటం యుక్తమని భాష్యకారుల అభిమతం.

# 25. కామాద్యధికరణమ్

## సూ: 3.3.39 కామాదీతరత్ర తత్ర చాయతనాదిభ్యః

(కామాది + ఇతరత్ర + తత్ర చ + ఆయతనాదిభ్యః)

సత్యకామత్వం ఇత్యాది గుణాలు మరోస్థానంలో కూడా చెప్పబడ్డాయి కాబట్టి అక్కడ కూడా వాటిని ఉపసంహారం చేసుకోవాలని సూత్రార్థం.

**సంశయం:**

ఛాందోగ్యంలో *"అథ యదిదమస్మిన్ బ్రహ్మపురే దహరం పుండరీకం వేశ్మ దహరోఽస్మిన్ అంతరాకాశః"* (ఛా.ఉ 8.1.1) అని ఉపక్రమించి *"ఏష ఆత్మా అపహత పాప్మా విజరః, విమృత్యుః, విశోకః, విజిఘత్సోఽపిపాసః సత్యకామః, సత్యసంకల్పః"* అని తదనంతరం పఠిస్తున్నారు (ఛా.ఉ 8.1.5). వాజసనేయులు కొన్ని వాక్యాల భేదంతో, బృహదారణ్యకోపనిషత్తులో ఇలా చదువుతున్నారు: *"స వా ఏష మహానజ ఆత్మా యోఽయం విజ్ఞానమయః ప్రాణేషు య ఏషోఽన్త ర్హృదయ ఆకాశః తస్మిన్ శేతే సర్వస్య వశీ"* (బృ.ఉ 4.4.22). ఈ రెండింటిలో విద్యా ఏకత్వమూ పరస్పర సంబంధమూ ఉందా అనే సందేహం కలుగుతున్నది.

**సమాధానం:**

రెండూ బ్రహ్మ ఆయతనాన్నే ప్రస్తావిస్తున్నవి. *"దహర ఉత్తరేభ్యః"* అనే సూత్రంలో (బ్ర.సూ 1.3.14) ఆకాశ నిర్దేశం రెండు స్థానాలలోను (హృదయాకాశం లోనూ, మహదాకాశంలోనూ) బ్రహ్మమునకే వర్తిస్తుందని నిర్ణయింపబడింది. అందువల్ల ఆయతనాదుల సామ్యం పూర్తిగా ఉంది. అయితే, ఈ రెండు శ్రుతులలో కొంత తేడా (విశేషం) గోచరిస్తున్నది. ఛాందోగ్య శ్రుతి సగుణ బ్రహ్మోపాసనను బోధిస్తున్నది *"అథ య ఇహ ఆత్మానం అనువిద్య వ్రజంతి ఏతాంశ్చ సత్యాన్ కామాన్"* అనే దాని వెంటనే వస్తున్న మంత్రం (ఛా.ఉ 8.1.6) ఆత్మ వలే సత్యకామాది గుణాలను కూడా వేద్యములు తెలుసుకోవలసినవి అని ఉపదేశిస్తున్నది. అందువల్ల, ఛాందోగ్య శ్రుతిలో కార్యబ్రహ్మ (హిరణ్యగర్భ) ఉపదేశమని గ్రహించవలసి వస్తుంది.

బృహదారణ్యకంలో వినిపిస్తున్న శ్రుతుల ఉపక్రమ–ఉపసంహారాలను పరిశీలిస్తే అవి నిర్గుణ పరబ్రహ్మ యొక్క ఉపదేశాన్నే ప్రస్తావిస్తున్నవి. *"అథ ఊర్ధ్వం విమోక్షాయ బ్రూహి"* అని మోక్షం కాంక్షిస్తున్న వానినుద్దేశిస్తూ, వెనువెంటనే *"అసంగో హ్యయం పురుషః"* (బృ.ఉ 4.3.14, 4.3.15) అని వినబడుతున్నది. ఈ ప్రస్తావనకు ముందే *"స ఏష నేతి నేతి ఆత్మా"* (బృ.ఉ 3.9.26) అనే శ్రుతిలో కారణబ్రహ్మ విశిష్టత్వాన్నే చెప్పడమైంది. అందువల్ల బృహదారణ్యకంలో నిర్గుణబ్రహ్మ నిర్దేశమే స్పష్టంగా ఉంది. అయితే, నిర్గుణబ్రహ్మ అయినా, సగుణబ్రహ్మ అయినా, బ్రహ్మ పదార్థము–బ్రహ్మము ఒక్కటే. బ్రహ్మయొక్క విభూతులనేకము ఉండవచ్చు. ఈ విభూతులను స్తుతించటం కోసం గుణోపసంహారం జరిగింది. దీని ఉద్దేశం, నిర్గుణ బ్రహ్మను గుణాలతో సహా ఉపాసించమని చెప్పటం ఎంత మాత్రం కాదు.

# 26. ఆదరాధికరణమ్

## సూ: 3.3.40 ఆదరాదలోపః

(ఇది పూర్వపక్ష సూత్రం)

ప్రాణాగ్నికి ఆదరలోపం ఉండకూడదని సూత్రార్థం.

వైశ్వానరవిద్య యొక్క ప్రస్తావన చేస్తూ ఛాందోగ్యోపనిషత్తులో *"తద్యత్ భక్తం ప్రథమ మాగచ్ఛేత్ తత్ హోమీయం, స యాం ప్రథమామాహుతిం జుహుయాత్ తాం జుహుయాత్ ప్రాణాయ స్వాహా"* (ఛా.ఉ 5.19.1) ఈ విధంగా వినబడుతున్నది (ముందుగా వచ్చే అన్నాన్ని హోమానికి ఉపయోగించవలసింది. ప్రథమాహుతి హోమం చేసే దానిని ప్రాణాయ స్వాహా అని హోమం చెయ్యాలి). ఇక్కడప్రాణాహుతుల విధి చెప్పబడింది. అయితే, ఆ తరవాత అగ్నిహోత్ర శబ్దంతో అగ్నిహోత్రమే ప్రాణాహుతి అని వివరించబడింది. *"య ఏతదేవం విద్వాన్ అగ్నిహోత్రం జుహోతి"* (ఛా.ఉ 5.24.2). అంతేకాదు, ఆకలితోనున్న పిల్లలు తల్లిని చేరినట్లు సమస్త భూతాలు అగ్నిహోత్రాన్ని చేరుతాయి అని *"యథేహ క్షుధితా బాలా మాతరం పర్యుపాసతే ఏవం సర్వాణి భూతాని అగ్నిహోత్ర ముపాసతే"* (ఛా.ఉ 5.24.5) చెప్పబడింది. అయితే భోజనం లేని రోజున, ప్రాణాగ్నిహోత్రానికి లోపం వస్తుందా? రాకపోవొచ్చు. కారణం భోజనం లేని రోజున ఉదకాన్ని అన్న ప్రతినిధి రూపంలో ఉపయోగించవచ్చు. యజ్ఞకర్మలో ఈ విధమైన పయోద్రవ్యాలు ముఖ్యమైన హోమద్రవ్యాలకు బదులుగా వాడవచ్చునని జైమిని సూత్రం *"గుణలోపేన ముఖ్యస్య"* అని ఉంది. అందువల్ల ప్రతినిధిగా ఉదకాలను ఉపయోగించుకొని నిత్యప్రాణాగ్నిహోత్రాన్ని నిర్వర్తించుకోవచ్చు.

పూర్వపక్ష సూత్రానికి సమాధానంగా క్రింద సూత్రం చెప్పబడింది.

## సూ: 3.3.41 ఉపస్థితేఽతస్తద్వచనాత్

ఉపస్థితమైన భోజన ద్రవ్యాన్ని ఉపయోగించే ప్రాణాగ్నిహోత్రం నిర్వర్తించా లని సూత్రార్థం.

వైశ్వానరోపాసకులకు అతిథుల కన్నా ముందు వారు భోజనం చెయ్యాలనే విధివాక్యం జాబాలశ్రుతిలో *"పూర్వోఽతిథిభ్యోఽశ్నీయాత్"* అని వినబడుతున్నది. అందువల్ల ఆ శాఖీయులు అతిథి భోజనానికి ముందు వారే భోజనం చేస్తారు. అంతే కాని ఈ విధి అందరి విషయంలోను వర్తించదు. జాబాల శాఖీయులు పాటించే నిత్యాగ్నిహోత్ర విధ్యుక్త ధర్మాలు, మిగతావారు నిత్యం చేసుకొనే ప్రాణాగ్నిహోమంలో వర్తించవు. భోజన సమయంలోనే ప్రాణాగ్నిహోమం చెయ్యవలసి ఉంటుంది. భోజనం లేని రోజు ప్రాణాగ్ని హోమానికి లోపము జరిగినట్లు నిశ్చయించుకోవాలి.

# 27. తన్నిర్ధారణాధికరణమ్

## సూ: 3.3.42 తన్నిర్ధారణానియమస్తద్దృష్టేః పృథగ్ఘ్యప్రతిబంధః ఫలమ్

కర్మాంగముల నాశ్రయించిన ఉపాసనలకు ఫలము అనిత్యమని సూత్రార్థం.

**పూర్వపక్షి:**

కర్మాంగాలకు సంబంధించిన *"ఓమిత్యేదక్షరం ఉద్గీథముపాసీత"* (ఛా.ఉ 1.1.1) అని వినిపిస్తున్న ఉపాసన విద్యలు ఉన్నాయి. అవి యజ్ఞములలో చేసే పర్ణమయీ ఇత్యాది కర్మాంగాల వలె నిత్యములా, లేక గోదోహనాది కర్మాంగాల వలె అనిత్యములా అనే సంశయం కలుగుతున్నది.

కర్మాంగాలుగా ఉండే విద్యలకు ఫలశ్రుతి *"ఆపయితా హ వై కామానాం భవతి"* (ఛా.ఉ 1.1.7) అని వర్తమాన రూపంలో చెప్పటం వల్ల, వీటిని అర్థవాదులుగా గ్రహించవలసి వస్తుంది. ప్రకరణంలో వినబడకపోయినా, ఈ ఉపాసనలు పర్ణమయీ ఇత్యాది కర్మాంగాల వలె నిత్యములనే తోస్తున్నది.

**సిద్ధాంతం:**

ఉద్గీథం ఇత్యాది కర్మాంగాలు నిత్యంగా నియమింపబడవు. కొంతమంది ఋత్విక్కులు (ఇత్యాది శ్రోత్రియులు) మంత్రం తెలిసినా, ఏదేవత ఆహ్వానం జరుగుతున్నదో దాని పూర్తి పరిజ్ఞానం లేకుండానే యాజ్ఞిక కర్మలు చేస్తూ ఉంటారు. అట్టివారి ప్రస్తావనే ఛాందోగ్యోపనిషత్తులో దేవాసురుల ఉద్గీథసాధన సందర్భంలో ఇలా చెప్పబడింది: *"తేన ఉభౌ కురుతో యశ్చ ఏతదేవం వేద యశ్చ న వేద"* (ఛా.ఉ 1.1.10). అక్షరస్వరూప విజ్ఞానము ఉన్నవాడును, లేనివాడునూ కూడా కర్మానుష్ఠానము చేస్తున్నారు అని దీని భావం.

ఒక రాజు యజ్ఞం చేస్తున్న సమయంలో అక్కడ ఋత్విక్కులు (ప్రస్తోత, ఉద్గాత, ప్రతిహార) విషయం తెలీకుండా, యజ్ఞవిధులు నిర్వర్తిస్తుంటే అది గమనించి ఉషస్తి అనే ఋషి వారిని వారించి, తగు రీతిలో బోధించి యజ్ఞనిర్వహణ చేసినట్లు ఒక ఆఖ్యాయిక ఛాందోగ్యంలో ఉంది (అ. 1 –ఖ. 11). విద్యతోను, శ్రద్ధతోను, బుద్ధిపెట్టి కర్మ చేసిన వారికి వీర్యవత్తరమైన ఫలం లభిస్తుంది, అదిలేని కర్మానుష్ఠానము ఫలితం ఇవ్వదని దీని సారాంశం.

కర్మాంగాలకు వ్యతిరిక్తమైన ఉపాసన విద్యలన్నీ క్రియారూపములు. అందువల్ల ఫలవిశిష్టమైన ఉపాసనలుగా పరిగణింపబడతాయి.

## 28. ప్రదానాధికరణమ్

## సూ: 3.3.43 ప్రదానవదేవ తదుక్తమ్

**పూర్వపక్షి:**

బృహదారణ్యకంలో అధ్యాత్మంగా వాగాది ఇంద్రియాల కన్నా ప్రాణం శ్రేష్ఠమని, అధిదైవతంగా ఆగ్న్యాదులలో వాయువు శ్రేష్ఠమైనదని నిర్దిష్టంగా శ్రుతిలో ఇలా చెప్పబడింది: *"వదిష్యామి ఏవాహం వాక్ దధ్రే"* (బృ.ఉ 1.5.21). అదేవిధంగా ఛాందోగ్యంలో అధిదైవతంగా వాయువు అగ్న్యాదులను తనలో చేర్చుకుంటుందని (సంవర్గం) శ్రుతి వాక్యం *"వాయుర్వావ సంవర్గః"* (ఛా.ఉ 4.3.1), వాగాదులలో *"ప్రాణోవావ సంవర్గః"* (ఛా.ఉ 4.3.2) అని వినిపిస్తున్నది.

వాయు–ప్రాణాలు భిన్నమైనవి కావు. తత్త్వంలో రెండూ ఒకటే. అందువల్ల వాటిని వేరు వేరుగా భావించి ఉపాసించటం ఎందుకని సందేహం కలుగుతున్నది. అట్టి చింతనే అసమంజసం అనిపిస్తున్నది. అధిదైవతంగాను, అధ్యాత్మంగాను వాక్ – అగ్ని తత్త్వాలలో భేదం లేదని మరో శ్రుతి వింటున్నాం *"అగ్నిః వాగ్భూత్వా ముఖం ప్రావిశత్"* (ఐ.ఉ 2.4) అలాగే వాక్, మనస్సు ప్రాణములన్నీ సమానములే, అన్నీ అనంతములే అని మరో శ్రుతి విన్పిస్తున్నది *"త ఏతే సర్వ ఏవ సమాః, సర్వే ఽనంతాః"* (బృ.ఉ 1.5.13). దీనివల్ల అధ్యాత్మికమైన ప్రాణాలకు, అధిదైవికమైన సంపత్తియే స్వరూపం అని తెలుస్తున్నది. *"యః ప్రాణః స వాయుః" అలాగే "ప్రాణాద్వా ఏష ఉదేతి, ప్రాణే అస్తమేతి"* అనే శ్రుతిలో వాయువు – ప్రాణాలు సమానార్థంలో వాడబడ్డాయి (బృ.ఉ 1.5.23).

ప్రాణ–అపాన నిరోధరూపమైన ఒకేవ్రతాన్ని ఆచరించాలని మరో మంత్రం సూచిస్తున్నది: *"తస్మాదేకమేవ వ్రతం చరేత్ ప్రాణ్యా చ్చైవాపాన్యాచ్చ"* (బృ.ఉ 1.5.23). అలాగే ఛాందోగ్యంలో (సంవర్గవిద్యా ప్రకరణంలో) అగ్ని, సూర్య, దిక్, చంద్ర రూపాలైన వాక్–చక్షు– శ్రోత్ర–మనస్సులను లోకరక్షకుడైన హిరణ్యగర్భుడు (ప్రజాపతి) ఉపసంహరించాడు అని ఇలా చెప్పబడింది *"మహాత్మనః చతురోదేవ ఏకః కః స జగార భువనస్యగోపాః"* (ఛా.ఉ 4.3.6). ఉపగమనంలో ఎట్టి తేడా లేనందువల్ల, వాయువును–ప్రాణాలను వేరు వేరుగా ఉపాసన చెయ్యనక్కర లేదనే తోస్తున్నది.

**సిద్ధాంతం:**

అధిదైవతంగా వాయువు ఇత్యాదులను, అధ్యాత్మికంగా ప్రాణాదులను, విభజించి చెప్పిన కారణంగా వీటి ఉపాసన వేరు వేరుగానే జరగాలి. తత్త్వంలో భేదం లేకపోయినా, అవస్థాభేదానికి అనుగుణంగానే ధ్యానించటం ఉపయుక్తం. *"ఏకమేవ వ్రతం"* అనే శ్రుతి వాయు– ప్రాణాలకు ఒకటే వ్రతం అని సూచించదు. వాగాది ఇంద్రియముల వ్రతాన్ని నివర్తింప చేయడం ద్వారా, ప్రాణవ్రతాన్ని గ్రహించటం కోసం ఉద్దేశింపబడింది. ఉపాసనా కర్మ యొక్క విధిని ప్రస్తావిస్తూ: *"తాని మృత్యుః శ్రమో భూత్వా ఉపయేమే"* (మృత్యువు శ్రమ రూపంలో వాగాది ఇంద్రియాలను చేరి వాటిని అసమర్థులను చేసెను).

*"సైషాఽన అస్తమితా దేవతా యద్వాయుః"* (బృ.ఉ 1.5.22) అని వివరించిన తరవాత *"ఏతస్యై దేవతాయై సాయుజ్యగ్ం సలోకతాం జయతి"* (బృ.ఉ 1.5.23) అని వాయుదేవత నిర్దేశంతో ఈ శ్లోకంలో ఫలప్రస్తావన జరిగింది. *"ఏకమేవ వ్రతం చరేత్ ప్రాణ్యాచ్చైవ అపాన్యాచ్చ"* (ప్రాణ వ్యాపారమైన ఉచ్ఛ్వాస–నిఃశ్వాసాలను ఒకే వ్రతంగా చెయ్యవలెను) అని ఈ శ్లోకంలోనే వినిపిస్తున్నది.

*"తౌ వా ఏతౌ సంవర్గౌ వాయురేవ దేవేషు, ప్రాణః ప్రాణేషు"* దేవతలలో వాయువుని, ప్రాణాలలో ముఖ్యప్రాణాన్ని ఉపాసించాలని, వేరు వేరుగానేఛాందోగ్యంలో చెప్పబడింది (ఛా.ఉ 4.3.4). అలాగే, ఈ విద్యలను వేరు వేరు వర్గాలుగా చూపుతూనే ఉపసంహారం చెయ్యబడింది: *"తే వా ఏతే పంచాన్యే–పంచాన్యే దశ సంతః తత్ కృతమ్"* (వాయుదేవతాసహిత అగ్న్యాదులు ఐదూ, ముఖ్యప్రాణంతో సహ ఇతరప్రాణ వృత్తులు ఐదూ మొత్తం కలిసి పది ఉపాస్యములు – ఛా.ఉ 4.3.8).

జైమిని, పూర్వమీమాంసలో పొందుపరచని కొన్ని యజ్ఞవిధులను సంకర్ష కాండ అనే గ్రంథంలో వివరించారు. ఈ సంకర్షకాండలో మూడు పురోడాశాల ప్రదానం గూర్చి చెప్పబడింది. ఈ యజ్ఞవిధినే ఉదహరిస్తూ, ప్రాణాన్ని–వాయువుని వేరు వేరుగా ఉపాసించాలని ఇక్కడ చెప్పడమైంది. త్రిపురోడాశేష్టికి – ఉపాసన విద్యలో ఉన్న భేదాన్ని వివరంగా తెల్పడమైనది.

# 29. లింగభూయస్త్వాధికరణమ్

## సూ: 3.3.44 లింగభూయస్త్వాత్తద్ధి బలీయస్తదపి

వాజసనేయ శాఖీయులు అగ్నిరహస్యంలో *"నైవ వా ఇదమగ్రే సదాసీత్"* అని శతపథ బ్రాహ్మణంలో చదువుతున్నారు (శ.బ్రా 10.5.31) సృష్టికి పూర్వం ఇదేది సత్‌గా కాని అసత్‌గా కాని లేదు అని ఆరంభించి మనఃసృష్టిని ప్రస్తావించి ఆ మనస్సు గ్రహించిన వాటిని శ్రుతిలో ఇలా చెప్పటం జరిగింది: *"తత్ షట్ త్రింశత్ సహస్రాణి అపశ్యత్ ఆత్మనోఽగ్నీన్ అర్కాన్ మనోమయాన్ మనశ్చితః"* . అదే విధంగా వాక్చితః, ప్రాణచితః, చక్షుః చితః, శ్రోత్ర చితః, కర్మ చితః, అగ్ని చితః అని వివిధ అగ్ని రూపాలను ప్రస్తావించటం జరిగింది. దీని భావం మనస్సుతో 36, 000 పూజ్యములైన అగ్నులను సంపాదించి చూచింది.వీటి మహిమ 36, 000 ఇష్టకా చితాగ్నిమహిమతో పోల్చి చూస్తే, ఒక్కొక్క పూజనీయమైన మనశ్చితాగ్నికి ఎంతమహిమో, అంతేమహిమ ఇష్టకాచితాగ్ని అనే కర్మకు ఉంటుంది. అయితే, మనోవృత్తితో చూడగలిగేవి అసంఖ్యాక ములు. కాని మనిషి పూర్ణాయుష్షు నూరు సంవత్సరాలుగా గ్రహించి (100×360 దినాలు) అని పూర్ణ వయస్సులో ఈ అగ్నులు మనస్సుతో సంపాదింపబడుతున్నట్లు అర్థం చేసుకోవాలి. మనస్సుతో సంపాదింపబడుతున్నాయి కాబట్టి మనశ్చితాలు, అలాగే వాక్ చితాగ్ని, ప్రాణచితాగ్ని, చక్షుః చితాగ్ని శ్రోత్రచితాగ్ని, కర్మచితాగ్ని ఇలా సంపాదికాగ్నులను ఆయా ఇంద్రియవృత్తులతో కలిపి చెప్పటం జరిగింది.

**సంశయం:**

అగ్నిరహస్య శ్రుతిలో వినిపిస్తున్న మనశ్చిదాదులు క్రియాంగాలా లేక స్వతంత్రమైన ఉపాసన విద్యలా?

**సమాధానం:**

ఈ బ్రాహ్మణంలో ఉన్న లింగాలు ఎక్కువగా మనః చిదాదులు స్వతంత్రమైన విద్యారూపములనే సూచిస్తున్నాయి. లింగం బలీయమైనదని జైమిన్యాచార్యులవారూ అభిప్రాయపడ్డారు. అందువల్ల మనశ్చిదాదులను విద్యాత్మకములని ఉపాసనాపరం గానే స్వీకరించాలి. *"తద్యత్ కించ ఇమాని భూతాని మనసా సంకల్పయంతి తేషామేవ సా కృతిః"* (సమస్త ప్రాణులూ మనుస్సుతో ఏది సంకల్పించినా ఆ అగ్నుల యొక్క పనియే). అలాగే *"తాన్‌హ ఏతాన్ ఏవం విదే సర్వదా సర్వాణి భూతాని చిన్వంత్యపి స్వపతే"* (ఈ విధంగా తెలుసుకున్నవాడు, జాగ్రదవస్థలోనున్నా, నిద్రిస్తున్నా సమస్త భూతాలు వాని కోసం ఈ అగ్నులను చయనం చేస్తుంటాయి).

## సూ: 3.3.45 పూర్వవికల్పః ప్రకరణాత్స్యాత్క్రియా మానసవత్

(ఇది పూర్వపక్ష సూత్రం)

మనశ్చిదాదుల ప్రసంగం క్రియారూపమైన అగ్నియొక్క ప్రకరణంలో జరిగింది కాబట్టి, ఇది క్రియాంగమే కావాలి కాని స్వతంత్రమైన విద్యాబోధ కాదు. దీని ప్రయోజనం సంపాదికాగ్నిని స్తుతించటమే. ఈ సందర్భంలో ద్వాదశాహ క్రతువులో, ఋత్విక్కులు చేసే మానసక్రియ యొక్క దృష్టాంతం ఉదహరిస్తూ ఈ యజ్ఞకర్మలో అన్ని క్రియలూ మానసకర్మగా ధ్యానం చేస్తారు. అదే విధంగా, క్రియా ప్రకరణలో ఉండటం వలన, మనశ్చిదాదుల్లో అగ్నికల్పం క్రియాంగమే అవాలి.

## సూ: 3.3.46 అతిదేశాచ్చ

ముందు చెప్పిన సూత్రంలాగే ఇక్కడా పూర్వపక్షి యొక్క అభిప్రాయమే వ్యక్తం చెయ్యబడింది. ఇష్టకాచితాగ్ని మహిమ ఎంతో 36, 000 మనశ్చితాగ్నులలో ఒక్కొక్క దానికి అంతే మహిమ అని యాజ్ఞిక కర్మతో పోల్చటం జరిగింది (36, 000 ఇటుకలను పరచి చేసే ఇష్టకాచితాగ్ని యజ్ఞము) ఈ విధంగా వినిపిస్తున్న అతిదేశం వల్ల కూడా మనశ్చిదాగ్నులకు క్రియాసంబంధమే కనబడుతున్నది. అందువల్ల ఇవి కర్మాంగాలే కావాలి.

## సూ: 3.3.47 విద్యైవ తు నిర్ధారణాత్

'తు' ప్రత్యయం పూర్వపక్షాన్ని ఖండిస్తూ నిర్ధారిస్తున్నది. మనశ్చిదాది అగ్నులు విద్యారూపములే కాని కర్మాంగాలు కావు. *"తే హ ఏతే విద్యాచిత ఏవ అని శ్రుతి"* ఇంకా *"విద్యయా హ ఏవైత ఏవం విదశ్చితా భవంతి"* అని వినబడుతున్నది. (ఈ విధంగా తెలుసుకున్నవాని విద్య చేతనే ఇవి సమకూర్చబడతాయి – చితములౌతాయి). శ్రుతి వాక్యాలు అనింటి కన్నా బలీయమైనవి కాబట్టి ఇలా నిర్ధారింపబడుతున్నది.

## సూ: 3.3.48 దర్శనాచ్చ

మనశ్చిదాద్యగ్నులు స్వతంత్రములని నిర్ణయించటానికి, లింగము *"లింగ భూయస్త్వాత్"* అనే సూత్రంలోనే చూపబడింది.

## సూ: 3.3.49 శ్రుత్యాదిబలీయస్త్వాచ్చ న బాధః

ప్రకరణసామర్థ్యం కన్నా శ్రుతి బలీయమైనది. *"తేహ ఏతే విద్యాచిత ఏవ"* అన్నది శ్రుతి. *"సర్వదా సర్వాణి భూతాని చిణ్వంత్యపి స్వపతే"* అనేది లింగం. *"స్వపతే జాగ్రతేచ ఏవం విదే సర్వదా సర్వాణి భూతాని ఏతానగ్నీంశ్చిన్వంతి"* (అన్ని కాలాలోను, జాగ్రత్– నిద్రావస్థలలో కూడ ఈ చయనం జరుగుతునే ఉంటుందని చెప్పటం వల్ల అగ్నులు క్రియాంగాలు కావు. ఇదే విధమైన ప్రస్తావన కౌషీతకశ్రుతిలో కూడా వినిపిస్తున్నది. *"ప్రాణం తదావాచి జుహోతి, వాచం తథా పాణే జుహోతి"* ; *"ఏతే అనంతే అమృతే ఆహుతీ జాగ్రచ్చ స్వపంశ్చ సతతం జుహోతి"* (కౌ.షీ 2.5). ఆనంతములూ, అమృతములు అయిన ఈ రెండు ఆహుతులు నిరంతరమూ జాగ్రత్ – నిద్రావస్థలలో హోమం చెయ్యబడుతున్నాయి. క్రియా ప్రక్రియల్లో (ప్రయోగంలో) నిత్యత్వం ఉండదు. అదీకాక, *"ఏవం విదే"* అనే వాక్యం పురుషవిశేషం స్థాపిస్తున్నది. కాబట్టి, వాక్యప్రమాణాన్ని బట్టి ఇది స్వతంత్రమైన విద్యయే అని గ్రహించాలి.

## సూ: 3.3.50 అనుబంధాదిభ్యః ప్రజ్ఞాంతరప్రథక్త్వవద్దృష్టశ్చ తదుక్తమ్

ఇష్టకాచితాగ్నిలో 36, 000 ఇష్టకలను (ఇటికలను) పేర్చటం, వాటికి సంబంధించిన యజ్ఞ కర్మలను మనస్సులో ధ్యానంతో చెయ్యడం జరుగుతుంది. ముప్పది ఆరువేల మనోవృత్తి భేదాలను గ్రహించి వాటియందు అగ్నిత్వాన్ని గ్రహాదులను కల్పిస్తున్నారు. ఈ విధమైన పురుషపరమైన అనుబంధం కనబడుతున్నందు వల్ల కూడ స్వతంత్ర విద్యా రూపాలుగానే నిర్ధారించుకోవాలి.

36, 000 ఇష్టకాచితాగ్ని యొక్క మహిమ ఎంతో, ఒక్కొక్క మనః చితాగ్నికి అంతే మహిమ అని *"షట్త్రింశత్"* అనే శ్రుతిలో విన్పిస్తున్నది. క్రియకు సంబంధిం చిన అగ్ని మహత్మ్యంతో పోల్చి చూస్తే, జ్ఞానమయాగ్నులలో ఒక్కొక్కదానికే అంత మహిమ ఉంటుందని ఈ శ్రుతి సూచిస్తున్నది.

శాండిల్యవిద్యా ఇత్యాదివి ఏ విధంగా స్వతంత్రరూపంలో బోధింపబడ్డాయో, అదే విధంగా మనశ్చిదాదులను కర్మాంగవిద్యలకు భిన్నమైనవని తెలుసుకోవాలి.

ఇక ప్రకరణసంబంధం పరిశీలిస్తే రాజసూయ యాగానికి క్షత్రియులే అధికారులని ప్రస్తావించిన ప్రకరణంలోనే, 'అవేష్ఠి' అనే ఒక యజ్ఞానికి ద్విజు లందరూ అధికారులని చెప్పబడింది. అందువల్ల, ప్రకరణం నుండి వేరు చేసి మనశ్చిదాది విద్యలను స్వతంత్ర రూపాలుగా గ్రహించవచ్చు.

## సూ: 3.3.51 న సామాన్యాదప్యుపలబ్ధేర్మృత్యువన్నహి లోకాపత్తిః

(సామాన్యాదపి + న ఉపలబ్ధేః + మృత్యువత్ + న హి లోకాపత్తిః)

మనస్సుతో గ్రహింపబడుతున్నా మనశ్చిదాదులను క్రియాశేషములుగా పరిగణించకూడదు. ముందు ఉదహరించిన శ్రుతి వాక్యాలు ఈ విద్యలు ఉపాసకునికి పురుషార్థములుగానే వినిపిస్తున్నవి. కర్మాంగాలుగా కాదు.

ఇకపోతే, *"స వా ఏష ఏవ మృత్యుః య ఏష ఏతస్మిన్ మండలే పురుషః"* (ఈ ఆదిత్య మండలంలో ఉన్నపురుషుడే మృత్యువు), *"అగ్ని ర్వై మృత్యుః"* (అగ్నియే మృత్యువు – బృ.ఉ 3.2.10) ఇత్యాది శ్రుతుల్లో ఉన్న 'మృత్యు' శబ్ద ప్రయోగం అగ్ని – ఆదిత్య పురుషులను సూచిస్తూ ఉపయోగించినా వాటిలో సామ్యంలేదు. *"అసౌ వావ లోకో గౌతమ! అగ్నిః తస్య ఆదిత్య ఏవ సమిత్"* (ఓ గౌతమా ఈ లోకమే అగ్ని, ఆదిత్యుడే సమిధ –ఛా.ఉ 5.4.1). ఈ శ్రుతిలో కూడా ఆదిత్యుడికి, సమిధలకుసామ్యమే లేదు. అలాగే, 'మానసవత్' అనే శబ్దం మానసగ్రహంతో సామ్యాన్ని సూచిస్తున్నా, అది ఏ క్రతువుకీ సంబంధించినది కాదని సూత్రంలో స్పష్టం చెయ్యబడింది.

## సూ: 3.3.52 పరేణ చ శబ్దస్య తాద్విధ్యం భూయస్త్వాత్త్వనుబంధః

*"అయం వావ లోక ఏషోఽగ్నిశ్చితః"* ఈ విధంగా తదనంతరం ఉన్న బ్రాహ్మణంలోని శబ్దం విద్యా విధినే తెలియజేస్తున్నది. కర్మసంబంధమైనదేదీ విధింపబడలేదు. కర్మ యొక్క నింద, విద్యా ప్రశంసయే ఇక్కడ వినబడుతున్నది. *"విద్యయా తదవరోహంతి యత్ర కామాః పరాగతాః, న తత్ర దక్షిణాయంతి న అవిద్వాంస స్తపస్వినః"* . అదేవిధంగా ముందున్న బ్రాహ్మణంలో కూడా ( *"యదేతత్ మండలం తపతి"* అని వినిపిస్తున్న బ్రాహ్మణంలో) విద్యాఫలం ఉపసంహారంలో ఇలా చెప్పబడింది: *"సోఽమృతో భవతి మృత్యుర్యస్యాత్మా భవతి"* . ఈ బ్రాహ్మణంలో విద్యాప్రధానత్వం స్పష్టంగా వినబడుతున్నది. అందువల్ల, అగ్ని రహస్యంలో ప్రస్తావించిన మనశ్చిదాదులు విద్యారూపాలే కాని కర్మాంగాలు కావు.

## 30. ఐకాత్మ్యాధికరణమ్

ఈ అధికరణంలో ఆత్మ అస్తిత్వ విచారణ చెయ్యబడుతున్నది. దేహం కంటె భిన్నమైన ఆత్మ ఉందా లేదా? దేహం కన్న భిన్నమైన ఆత్మ ఉంటేనే పరలోక చింత, బంధం, మోక్షం ఇత్యాది పశ్నలు ఉత్పన్నమవుతాయి. దేహం కన్న భిన్నమైన ఆత్మ లేకపోతే బ్రహ్మబోధనకు ఆవశ్యకతే లేదు. అందువల్ల, ఆద్యంలోనే పూర్వమీమాంసా శాస్త్రంలో ఆత్మ యొక్క అస్తిత్వం చెప్పబడింది. కాని జైమిన్యాచార్యులు పరమేశ్వరుడు ఉన్నాడని ఏ సూత్రం ప్రతిపాదించలేదు, చర్చించలేదు. ఉత్తరమీమాంసా శాస్త్ర సూత్రకారులైన బాదరాయణులవారు దేహం కన్నా భిన్నమైన ఆత్మ ఉన్నదని సూత్రీకరించి దానిని క్షుణ్ణంగా పరిశీలించి, స్థాపించారు. జైమిన్యాచార్యుల పూర్వ మీమాంసా గ్రంథానికి భాష్యం వ్రాసిన శబరస్వామివారు బ్రహ్మసూత్రాలలో క్రోడీకరిం చిన (ఉత్తరమీమాంసా గ్రంథంలో) ఈ అంశాలతో ప్రభావితుడై (ఆకర్షింపబడి) దేహాతిరిక్తమైన ఆత్మగురించి వారి ప్రమాణలక్షణ గ్రంథంలో ప్రస్తావించటం జరిగింది. ఉపవర్షుడనే వేదాంతశాస్త్ర పండితుడు తమ ప్రసంగంలో ఆత్మ పరమైన చర్చ శారీరకశాస్త్రంలో ప్రస్తుతించి పూర్వమీమాంసలో ఉన్న లోపాన్ని పూరించారు.

ఇప్పుడు నాస్తికులు, అనీశ్వరులు అయిన లోకాయతికుల వాదాన్ని ఖండిస్తూ, ఆత్మ దేహం కంటె భిన్నమైనదని స్థాపించటానికి ఈ అధికరణంలో బాదరాయణులవారు చర్చ ప్రారంభిస్తున్నారు. విధిరూపాలైన ఉపాసనలు కూడా బ్రహ్మోపలబ్ధికి, ఇకపైన ప్రస్తావింపబడుతున్నవి.

## సూ: 3.3.53 ఏక ఆత్మనః శరీరే భావాత్

సుఖ చైతన్యాదులు శరీరం ఉన్నప్పుడే ఉంటాయి కాబట్టి, శరీరం కన్నా భిన్నమైన ఆత్మ లేదని కొందరు అంటున్నారని సూత్రార్థం.

**పూర్వపక్షి:**

లోకాయతికులు (చార్వాకులు) నాస్తికవాదులు. వారు ప్రత్యక్షంగా కన్పించిన దానినే నమ్ముతారు. మరే ప్రమాణాలు అంగీకరించరు. వారి మతానుసారము దేహం కంటె భిన్నమైన ఆత్మ లేదే లేదు. కారణం, దేహం ఉన్నంత వరకే చేతనత్వం, స్మస్మృతి, జ్ఞానం ఉంటున్నాయి. మృతదేహానికి చైతన్యాదులు ఉండవు. అందువల్ల దేహంతో పాటే చేతనరూపమైన ఆత్మ.

భూమి, అగ్ని, వాయువు, నీరు ఈ నాలుగు భూతాలు కంటికి కనబడేవి. జగత్తులో ఉన్న సమస్తమూ ఈ భూత చతుష్టయము నుంచే పుడుతున్నవి. మనిషి అనే శారీరుడు కూడ భూతచతుష్టయం వల్ల ఉద్భవిస్తున్నాడు. అయితే, బాహ్య రూపాలైన పృథివ్యాది భూతాలలో చైతన్యత్వం లేకపోయినా, శరీరాకార పరిణామంలో భూతమిశ్రమంలో చైతన్యం ఉద్భవించవచ్చు. కొన్ని భౌతిక మిశ్రమాలలో రంగు–రుచి మారటం ప్రత్యక్షంగానే కనబడుతున్నది.

ఏ పదార్థం ఉన్నప్పుడు ఏ గుణం ఉంటుందో, ఏ పదార్థం లేనప్పుడు ఏ గుణం పోతుందో, అదే ఆ పదార్థం యొక్క ధర్మంగా పరిగణింపబడుతుంది. ఉదాహరణకు, అగ్నికి ఉష్ణమూ ప్రకాశమనే రెండు సహజ ధర్మాలున్నవి. అగ్ని లేకపోతే ఉష్ణమూ లేదు ప్రకాశమూ లేదు. ఆత్మ ఉందనే విశ్వసించేవారు, ప్రాణం, చైతన్యం ఇత్యాదులు ఆత్మ ధర్మాలని చెప్తారు. ఇవి దేహంతో కలిసే ఉంటాయి. దేహం నుండి వేరు చెయ్యబడవు. అందువల్ల, దేహవ్యతిరిక్తమైన ఆత్మ లేదు. ఇటువంటి ఆక్షేపణలను నిశితంగా పరిశీలించి తదనంతరం పరిహరిస్తే స్థూణా–నిఖనన న్యాయం చేత దృఢంగా నిలుస్తుంది. ఈ విధాంగానే లోకాయతికుల అనాత్మవాదం ఈ క్రింది సూత్రంలో ఖండింపబడింది.

## సూ: 3.3.54 వ్యతిరేకస్తద్భావాభావిత్వాన్న తూపలబ్ధివత్

(వ్యతిరేకః + తత్ భావాభావిత్వాత్, న తు ఉపలబ్ధివత్)

దేహం కంటె భిన్నమైనదే ఆత్మ, దేహం ఉన్నంత వరకే ఆత్మ ధర్మాలు ఉంటాయి. కాబట్టి, ఆత్మ – దేహము వేరు

కావు అని వాదిస్తే, దేహం ఉన్నా కూడా ఆత్మ ధర్మాలైన శరీర చేష్టలు, చైతన్యం, స్మస్మృతి–జ్ఞానం ఇత్యాదులు మృతావస్థలో ఉండవు. దేహధర్మాలైన రూపాదులు మృతావస్థలో ఉంటాయి కదా! కనబడని ఆత్మ ధర్మాలైన చైతన్యం–స్మస్మృతి–జ్ఞానం ఇత్యాదులు దేహం పతితమైన తరవాత కూడా, దేహాంతరంలో సంచరించడానికి అవకాశం ఉంది. చైతన్యాదులు దేహధర్మాలని నిశ్చయంగా చెప్పబడదు.

చైతన్యం భూతచతుష్టయం నుంచి ఎలాపుడుతుంది? దానికి మూలమేది? ఏలా శరీరంగా పరిమాణం చెందుతుంది ఇత్యాది ప్రశ్నలకు నాస్తికవాదులైన లోకాయతికులు సమాధానం చెప్పలేదు. ఎంత సాధన చేసినా ఒక నటుడు తన భుజాల మీద ఎక్కి ఆడలేడు కదా! మరో విభిన్న శక్తిపదార్థంతోనే అది సాధ్యము.

భూతాత్మకమైనవీ – భౌతికవస్తుజాతం కూడా చైతన్యం చేత గ్రహింపబడుతు న్నాయి. ఆత్మే జ్ఞానరూపము కాబట్టి అది దేహం కన్న భిన్నమైనది కావాలి. ప్రత్యభిజ్ఞానం (గతంలో చూచింది–అనుభవించినది మళ్లీ స్మరణకు రావటం) ఆత్మ యొక్క నిత్యత్వాన్ని నిరూపిస్తున్నది. ఆత్మ అనిత్యమైతే ఈ విధమైన ఉపలబ్ధి–జ్ఞానము ఉండదు కదా! దీపం ఉన్నప్పుడే చీకట్లో వస్తువులను గ్రహించటం జరుగుతుంది. అక్కడ దీపం ఒక సాధనం మాత్రమే. మూల కారణం జ్ఞానం. అందువల్ల దేహమనే సాధనతో, జ్ఞానమనే శక్తితో వస్తువు గ్రహించబడుతున్నది. చైతన్యం దేహధర్మం కాదు, దేహానికి వ్యతిరిక్తమైనది. స్వప్నంలో కర్మాంగాలన్నీ వాటివాటి వృత్తులు నిర్వర్తించకపోయినా, దేహం నిశ్చలంగా ఉన్నా అనేకమైన అనుభూతులు (జ్ఞాన సంబంధ క్రియలు) జరుగుతునే ఉంటాయి. వాటి స్మస్మృతి కూడా వెంటనే పోదు. అందువల్ల దేహం కంటె భిన్నమైన ఆత్మ ఉందనే నిర్ధారించుకోవాలి.

## 31. అంగావబద్ధాధికరణమ్

## సూ: 3.3.55 అంగావబద్ధాస్తు న శాఖాసు హి ప్రతివేదమ్

**పూర్వపక్షి:**

కర్మకు అంగములైన విద్యావిధములెన్నో ఇలా చెప్పబడ్డాయి: *"ఓమిత్యేత దక్షరముద్గీథ ముపాసీత"* (ఛా.ఉ 1.1.1), *"లోకేషు పంచవిధగ్ం సామోపాసీత"* (ఛా.ఉ 2.2.1), *"ఉక్థముక్థమితి వై ప్రజా వదంతి తదిదమేవోక్థమ్"* , *"ఇయమేవ పృథివీ"* (ఐ.ఆ. 2.1.2.1), *"అయం వావ లోకః ఏషోఽగ్నిశ్చితః"* (శ.బ్రా 10.5.4.1). ఈ విధంగా అంగమైన ఓంకారం పై ప్రాణదృష్టి, పృథివీ, అగ్ని, అంతరిక్షం, ఆదిత్యుడు ద్యులోకాల యందు పంచవిధ సామము, ఉక్థమనే శస్త్రం మీద పృథివీ దృష్టి, ఇష్టకాచితమైన అగ్నియందు లోకదృష్టి ఉంచి కర్మాంగవబద్ధ ఉపాసనలు చెయ్యమని చెప్పబడింది. వేదాలలో చదివే రీతి, స్వరభేదం ఉంటుంది. అందువల్ల ఉద్గీథాదుల్లో ప్రతి వేద శాఖలో వ్యత్యాసం కనబడుతుంది. ఒక వేదంలో విధించిన ఉద్గీథాది ఉపాసనలు, మరో వేదంలో ఉన్న ఉద్గీథపరమైన ఉపాసనలకు వర్తించవనే తోస్తున్నది. ఉపాసన విధివాక్యం ఏశాఖలో ఏ విధంగా ఉంటుందో అలాగే ఉపాసన చెయ్యాలి కాని, శాఖాంతరంగా దానిని గ్రహించ కూడదనిపిస్తున్నది.

**సిద్ధాంతం:**

*"ఉద్గీథముపాసీత"* అని విశేషం లేకుండా సామాన్యంగా చెప్పడం వలన ఉద్గీథమనేది ఏ శాఖలో ఉన్నా (స్వరంలో భేదమున్నా) సకల శాఖాగతాలైన ఉద్గీథాదు లకు కర్మాంగమైన ఆ ఉపాసన ఒకేలా వర్తిస్తుంది. అంతే కాదు, సమస్త శాఖలకు సంబంధించిన ఉద్గీథత్వంలో భేదం ఉండదు కదా!

## సూ: 3.3.56 మంత్రాదివద్వాఽవిరోధః

మంత్రాలను, కర్మలను శాఖ భేదం లేకుండా అందరు శాఖీయులు స్వీకరిం చటం వైదిక విధుల్లో పరిపాటే, కర్మవిధానము, ద్రవ్యములు, గుణాలు, ఒక శాఖవారు మరోశాఖ నుండి గ్రహించి యజ్ఞకర్మ నిర్వర్తించుకోవటం సామవేదీయులలోను, యజుర్వేదీయులలోను, ఋగ్వేదీయులలోను, అథర్వులలోను సామాన్యంగా జరుగుతుందని కొన్ని ఉదాహరణలు ఇలా ఉన్నాయి: అశ్మదాన మంత్రం, పంచప్రయాజాల హోమం, అగ్నిష్టోమీయంలో పశు ఆలభనం, బహ్వృచులు పఠించే ఋక్కులు ఇత్యాదులు. అందువల్ల, ఆశ్రయాలైన కర్మాంగాలను అనువర్తించినట్లు, కర్మాంగావబద్ధ ఉపాసనలను సర్వత్ర అనువృత్తి చేసుకోవాలి.

## 32. భూమజ్యాయస్త్వాధికరణమ్

## సూ: 3.3.57 భూమ్నః క్రతువజ్జ్యాయస్త్వం తథాహి దర్శయతి

**పూర్వపక్షి:**

ఛాందోగ్యోపనిషత్తులో అశ్వపతి అనే రాజువద్ద వైశ్వానరోపాసనా విద్యను నేర్చుకొనటానికి ప్రాచీనశాలుడు, సత్యయజ్ఞుడు, ఇంద్రద్యుమ్నుడు, జనుడు, బుడిలుడు అనే శ్రోత్రియులు ఉద్దాలకుడనే పండితునితో సహా వెళ్లారు. రాజు వాళ్లను వారివారి ఉపాసనా దేవతలెవరో చెప్పమంటాడు. ఈ ఆఖ్యాయికలో సమిష్టి (సమస్త) వైశ్వానరో పాసన, వ్యస్తోపాసన (వేరు వేరు దేవతలను, అవయవభావంతో ఉపాసన చేయటం) కూడా ఉపదేశింపబడినట్లు శ్రుతిలో ఈ విధంగా వినిపిస్తున్నది: *"ఔపమన్యవ కం త్వం ఆత్మాన ముపాస్సే"* (ఔపమన్యా! నువ్వు దేనిని ఆత్మగా ఉపాసిస్తున్నావు).దానికి ఉపమన్యుని కుమారుడైన ప్రాచీనశాలుడు: *"దివమేవ భగవో రాజన్నితి హోవాచ"* – *"ఏష వై సుతేజా ఆత్మా వైశ్వానరో యం త్వం ఆత్మాన ముపాస్సే"* (ఓ రాజా! నేను ద్యులోకాన్ని ఆత్మస్వరూపంగా ఉపాసిస్తున్నాను – దానికి మంచి తేజస్సు గల దేనిని నువ్వు ఆత్మగా గ్రహించి ఉపాసిస్తున్నావో అదే వైశ్వానరుడు అని రాజు బదులిస్తాడు). ఇదే విధంగా సత్యయజ్ఞుడు మిగతావారూ, వారి వారి ఉపాసనా దేవతలను వివరించగా, అశ్వపతిరాజు సమస్త వైశ్వానరోపాసన యొక్క ఉపదేశం ఇలా చేస్తాడు: "తస్య హ వా ఏతస్యాత్మనో వైశ్వానరస్య మూర్ధైవ సుతేజాశ్చక్షుర్విశ్వరూపః, ప్రాణం పృథగ్వర్మాత్మా, సందేహో బహులో బస్తిరేవ రయిః పృథివ్యేవ పాదౌ" (వైశ్వానరునకు ద్యులోకమే శిరస్సు, సూర్యుడే నేత్రములు, సర్వత్రా వ్యాపించిన వాయువే ప్రాణము, ఆకాశమే దేహమధ్యభాగము, ఉదకములే మూత్ర పిండము, పాదములే పృథివి – ఛా.ఉ 5–18–2).

ఇక్కడ వ్యస్తోపాసన – సమస్తోపాసన అశ్వపతిరాజు వాక్యాల్లో రెండూ వినబడుతున్నాయి. వ్యస్తోపాసన యుక్తమా? సమస్తోపాసన యుక్తమా అనే సందేహం కలుగుతున్నది. ప్రాచీనశీలుడూ మిగతా వారు, వారి యొక్క ఉపాసనా దేవతలను చెప్పిన సందర్భంలో రాజు ప్రతీ అవయవరూపమైన వ్యస్తోపాసనకు వేరు వేరు ఫలం సూచించినందు వల్ల వ్యస్తోపాసనలే ఉపయుక్తమన్నట్లు తోస్తున్నది. ప్రతీ అవయోపాసనలోను విడిగా 'ఉపాస్సే' అనే క్రియాపదం కూడా వాడబడింది.

**సిద్ధాంతం:**

వ్యస్తోపాసన కన్నా సమస్తోపాసనే గొప్పది. దర్శపూర్ణమాసాది క్రతువుల్లో అన్ని అంగాలతో కూడిన ప్రధానం యొక్క ప్రయోగమే చెప్పబడుతున్నది. అలాగే, *"భూమైవ జ్యాయాన్"* అని సమస్త వైశ్వానరోపాసన మిక్కిలి శ్రేష్ఠమని తెలియజేస్తున్నది. అశ్వపతిరాజు వ్యస్తోపాసన యొక్క నింద ఇలా చేస్తాడు: *"మూర్ధాతే వ్యపతిష్యత్ యన్మాం న ఆగమిష్యః"* (నువ్వు నావద్దకు వచ్చి ఉండకపోతే నే తల పడిపోయి ఉండేది – ఛా.ఉ 5.12.2). ఈ విధంగా ప్రాచీనశాలుడికి మిగతా వారందరికీ వ్యస్తోపాసన యొక్క ఫలమహత్తును *"స సర్వేషు లోకేషు, సర్వేషు భూతేషు, సర్వేషు ఆత్మసు అన్న మత్తి"* (ఛా.ఉ 5.18.1) అనే శ్రుతి వాక్యాల్లో, భూమారూపమైన పరమాత్మ ఫల ప్రాప్తిని ప్రస్తావించటం జరిగింది. అందువల్ల సమస్తోపాసన, అవయవోపాసన కన్నా శ్రేష్ఠమైన ఫలాన్ని చేకూరుస్తుందని నిస్సందేహంగా చెప్పవచ్చును.

## 33. శబ్దాదిభేదాధికరణమ్

## సూ: 3.3.58 నానా శబ్దాదిభేదాత్

**పూర్వపక్షి:**

ఇంతకుముందు అధికరణంలో ఫలం వేరు వేరుగా వినిపిస్తున్నా వివిధ అంగములను ఉపాసించటం కన్నా సమగ్రస్వరూప ఉపాసన ఉత్తమమని నిర్ణయించ బడింది. విద్యకు ఏది వేద్యంగా బోధింపబడుతుందో అదే ఉపాస్యము. వేద్యం భిన్నమైతే విద్య కూడా భిన్నమవుతుంది. *"మనోమయః ప్రాణ శరీరః"* , *"కం బ్రహ్మ, ఖం బ్రహ్మ"* , *"సత్యకామ సత్యసంకల్పః"* ఇత్యాది శ్రుతులన్నింటిలో ఈశ్వరుడే వేద్యంగా నిర్దేశింప బడుతున్నాడు. అలాగే మరికొన్ని స్థానాలలో *"ప్రాణో వావ సంవర్గః, ప్రాణోవావ జ్యేష్ఠశ్చ శ్రేష్ఠశ్చ"* , *"ప్రాణోహి పితా ప్రాణో మాతా"* అని ప్రాణం వేద్యంగా చెప్పబడింది. శబ్దాదుల్లో భేదం ఉండటంవల్ల విద్యాభేదం, ఫలభేదం ఉంటుందనే సంశయం కలుగుతున్నది. అంతేకాదు, విద్యోపాసనకు పరిపూర్ణత్వం సిద్ధించాలంటే అన్ని శాఖలలోను విన్పిస్తున్న గుణవిధులను సమగ్రంగా ఉపసంహరించుకోవలసి ఉంటుందని కూడా అనిపిస్తున్నది.

**సిద్ధాంతం:**

గుణభేదం ఉన్నప్పుడు కర్మలో భిన్నత్వం ఉన్నట్లే, శబ్దభేదం ఉన్నప్పుడు వేద్యం ఒకటే అయినా, విద్యా భేదాన్ని అంగీకరించాలి. కర్మవిధిలో 'యజతి', 'దదాతి', 'జుహోతి' ఇత్యాది పదాలు కర్మభేదాన్ని నిర్దేశిస్తున్నవి. అందువల్ల 'వేద', 'ఉపాసీత', 'స క్రతుం కుర్వీత' ఇత్యాది శబ్దాల్లో భేదం ఉంది.

ఉపాస్యం (వేద్యం) ఈశ్వరుడే అయినా ప్రకరణ—ప్రకరణకు వేరు వేరు గుణాలు చెప్పబడ్డాయి. అలాగే ప్రాణం ఒక్కటే అయినా, ప్రాణాలతో పాటు చెప్పిన గుణాలు భిన్నంగా ఉంటున్నవి. వివిధ ప్రకరణలలో చెప్పిన గుణాలను ఒక దగ్గర చేర్చుకొని ఉపసంహారం చేసుకోవడం ఉపాసకునికి శక్యంకాదు. అందువల్ల శబ్దభేద దృష్ట్యా, ఉపాసన భేదాన్ని అంగీకరించటమే యుక్తం. అప్పుడు, ఏ సందర్భంలో చెప్పిన గుణాలు, ఆ సందర్భంలో చెప్పబడిన విద్యావిధికి సంబంధించిన గుణవిధులు కూడా అవుతాయి.

## 34. వికల్పాధికరణమ్

## సూ: 3.3.59 వికల్పోఽవిశిష్టఫలత్వాత్

అన్నీ సంపద్విద్యలే; ఏదో ఫలాన్ని ఆశించి చేసిన ఉపాసనలే, కాబట్టి ఉపాస ననుసరించి ఫలం లభిస్తుంది. ఒక విద్యలో అధికారం ఉన్నవానికి మరో విద్యలో అధికారం లేదని ఎక్కడా చెప్పలేదు. స్వర్గాది భోగాలను సమకూర్చే కామ్య కర్మలు (యజ్ఞ యాగాదులు) తప్పక చెయ్యాలనే నియమం లేదు. ఎవరు స్వర్గఫలాన్ని కోరుకుంటే వారే ఆ కామ్యకర్మను తలపెడతారు. అలాగే కామ్యవిద్యలకు వికల్పము తప్ప సముచ్చయనియమం (తప్పక చెయ్యాలి అనే నియమం) లేదు. శాండిల్యవిద్యలో శ్రుతి ఇలా విన్పిస్తున్నది: *"యస్య స్యాదద్ధా న విచికిత్సాస్తి"* (నిశ్చయజ్ఞానంతో ఉపాసన చేసినవారికి నా ఐశ్వర్యం లభిస్తుంది – ఛా.ఉ 3.14.4). *"దేవో భూత్వా దేవానప్యేతి య ఏవం విద్వాన్ ఏతదుపాస్తే"* (ప్రాణోపాసకుడు ఇక్కడనే దైవ స్వరూపుడై, మరణానంతరము దేవతలనే పొందుతాడు – బృ.ఉ 4.1.2) అలాగే భగవద్గీతలో *"యం యం వాపి స్మరన్ భావం త్యజంత్యంతే కలేవరమ్, తం తమేవైతి కౌంతేయ! సదా తద్భావభావితః"* (అర్జునా! మనుష్యుడు ఏ ఏ భావనలు స్మరిస్తూ దేహత్యాగం చేస్తాడో, అదేభావన మనస్సులో ఉన్నందువల్ల మళ్లీ జన్మలో దానినే పొందుతాడు – భ.గీ 8.6). అందువల్ల ఫలభేదం లేని విద్యలలో ఏదో ఒకదాన్ని గ్రహించి, ఉపాస్యమైన దానిని పొందేవరకు అదే ధ్యానంతో ఉండాలి. ఫలంలో భేదం లేని కారణంగా కామ్యవిద్యలకు యథాకామ్యం చేసుకునే వికల్పం ఉంది.

## 35. కామ్యాధికరణమ్

### సూ: 3.3.60 కామ్యాస్తు యథాకామం సముచ్చీయేరన్న వా పూర్వహేత్వభావాత్

వికల్ప హేతువు ఏదీ లేదని పూర్వసూత్రంలో 'అవిశిష్టఫలత్వాత్' అని చెప్పిన దానికి ఈ సూత్రంలో ప్రత్యుదాహరణం చెయ్యబడుతున్నది.

శ్రుతిలో కామ్యవిద్యలకు ఫలితం ఇలా విన్పిస్తున్నది: *"స య ఏతమేవ వాయుం దిశాం వత్సం వేద న పుత్రరోదం రోదితి"* (ఎవడైతే వాయుదేవతను, దిక్కుల యొక్క సంతాన రూపముగా పుత్రులను భావన చేసి ఉపాసన చేయునో వానికి పుత్రరోదనము కలుగదు – ఛా.ఉ 3.15.2). అలాగే *"స యో నామ బ్రహ్మేతి ఉపాస్తే యావన్నామ్నో గతం తత్రాస్య యథా కామచారో భవతి"* (ఎవడైతే తన నామస్వరూపాన్ని బ్రహ్మగా ఉపాసిస్తాడో ఆ పేరు వాక్కు వ్యాపించి ఉన్నంత వరకు అతడు స్వతంత్రగా సంచరించేవాడు అవుతాడు – ఛా.ఉ 7.1.5). స్వర్గఫలం కంటికి కనబడదు. అలాగే కామ్యవిద్యలలో ఫలం అదృష్టం (కనబడనిది). అందువల్ల, ఈ విధమైన ఉపాసనలను అపేక్ష ఉంటే చేయవచ్చు, లేకపోతే చేయనవసరం లేదు.

## 36. యథాశ్రయభావాధికరణమ్

### సూ: 3.3.61 అంగేషు యథాశ్రయభావః

**సంశయం:**

కర్మాంగాలైన ఉద్గీథాదులందు వాటిని ఆశ్రయించి ఉన్న వేదవిహితములైన భావనలు (ప్రత్యయాలు) మూడు వేదాలలో ఎలా విధింపబడ్డాయో, అలాగే చేసు కోవాలా లేక ఇష్టానుసారము చేసుకోవచ్చా అనే సందేహం కలుగుతున్నది?

**సమాధానం:**

కర్మాంగోపాసనలకు ఆశ్రయాలైన స్తోత్రాదులు ఎలా ఉంటాయో, అలాగే భావనలు కూడా చేసుకోవాలి.

### సూ: 3.3.62 శిష్టేశ్చ

కర్మాంగోపాసనలకు స్తోత్రాదులు మూడువేదాలలో ఏవిధంగా చెప్ప బడ్డాయో, వాటిని ఆశ్రయించి ఉన్న భావనలకు ఉపదేశరీత్యా ఏ విశేషం లేదు.

### సూ: 3.3.63 సమాహారాత్

ఋగ్వేదంలో చెప్పబడిన ఓంకార ప్రణవమూ, సామవేదంలో చెప్పబడిన ఉద్గీథమూ ఒకటే అని ఛాందోగ్యంలో *"య ఉద్గీథః స ప్రణవః, యః ప్రణవః స ఉద్గీథః"* అని స్పష్టం చేయబడింది (ఛా.ఉ 1.5.1). అందువల్ల సామవేదంలో విధించబడ్డ ఉద్గీథోపాసనకు, ఋగ్వేదంలోని ప్రణవంతో ఉద్గాత, ఋగ్వేదీయ ప్రక్రియతో హోత సరిచేసుకుంటాడు. హోతకు ప్రణవ–ఉద్గీథ ఏకత్వ జ్ఞానం ఉంటుంది. *"హోతృషదనాత్ హ ఏవాపి దురుద్గీథం అనుసమాహరతి"* అనే వాక్యంలో చెప్పబడింది (ఛా.ఉ 1.5.5).

### సూ: 3.3.64 గుణసాధారణ్యశ్రుతేశ్చ

విద్యాగుణమూ, విద్యాశ్రయమూ అయిన ఓంకారము అన్ని వేదాలకు సమానము. మూడు వేదాలలోను చెప్పబడిన కర్మ, ఓంకారముతోనే ప్రవర్తింప బడుతుంది. *"తేన ఇయం త్రయీవిద్యా వర్తతే, ఓం ఇతి ఆశ్రావయతి, ఓం ఇతి శంసతి, ఓం ఇతి ఉద్గాయతి"* (ఓంకార పూర్వకంగా అథర్వ్యుడు ఆరంభము చేస్తాడు, ఓంకారము తోనే హోతా ఋత్విక్కు, ఋక్కులు చదువుతాడు, ఓంకార పూర్వకంగానే ఉద్గాత సామగానం చేస్తాడు – ఛా.ఉ 1.1.9). అందువల్ల ధ్యేయమైన ఓంకారము అన్ని వేదాలకు సామాన్యమైనట్లు, దానిని ఆశ్రయించిన ధ్యానాదులూ సాధారణము లనే గ్రహించాలి.

### సూ: 3.3.65 న వా తత్సహభావాశ్రుతేః

(ఇది సిద్ధాంత సూత్రము)

మూడువేదాలలో చెప్పబడిన స్తోత్రాది కర్మాంగాలకు సహభావం (కలిసి ఉన్నట్లు) ఇలా శ్రుతిలో వినబడుతున్నది: *"గ్రహం వా గృహీత్వా, చమసం వోన్నీయ, స్తోత్రముపాకరోతి, స్తోత్రమనుశంసతి, ప్రస్తోతః సామ గాయ హోతరేతద్యజ"* . అయితే, ఇటువంటి సహభావం ఉపాసన విద్యలలో లేదు. ఉపాసనలు పురుషార్థములు. ఉపాసనలను స్వ ఇచ్ఛ ప్రకారము అవలంబించవచ్చు. ఇది తప్పక చెయ్యాలి అనే నియమం ఏదీ విధింపబడలేదు.

### సూ: 3.3.66 దర్శనాచ్చ

శ్రుతిలో ఉపాసనలకు సహభావంలేనట్లు తెలుస్తున్నది. కాబట్టి నియమం ఏదీ లేదు. *"ఏవంవిత్ హ వై బ్రహ్మా యజ్ఞం, యజమానం, సర్వాంశ్చర్త్విజోఽభిరక్షతి"* (ఈ విధంగా తెలుసుకొన్న బ్రహ్మా అనే ఋత్విక్కు తన విజ్ఞానం చేత యజ్ఞాన్ని, కర్మానుష్ఠానం చేస్తున్న యజమానిని, మిగతా ఋత్విక్కులను కూడా సంరక్షిస్తున్నాడు – ఛా.ఉ 4.17.10). ఈ శ్రుతి సంపద్విద్యలపై ఆకాంక్ష ఉన్న వారే ఉపాసనలను వారి వారి అభిమతానుసారము అవలంబిస్తారని సూచిస్తున్నది. సర్వప్రత్యయ ఉపసంహారం చెయ్యక తప్పదు అంటే, అందరూ (యజమాని మిగతా ఋత్విక్కులు ఇత్యాదులు) అన్ని విషయాలు తెలిసినవారే అవాలి, వాళ్లందరినీ విజ్ఞానవంతుడైన బ్రహ్మా అనే ఋత్విక్కు పరిపాలకుడై సంరక్షిస్తాడు అని చెప్పటం సంభవం కాదు.

# 3.

# సాధనాధ్యాయము – చతుర్థపాదము

## 1. పురుషార్థాధికరణమ్

### సూ: 3.4.1 పురుషార్థోఽతః శబ్దాదితి బాదరాయణః

వేదాంతవిహితమైన ఆత్మజ్ఞానం వలన, పురుషార్థాలలో పరమశ్రేష్ఠమని భావించే మోక్షం లభిస్తుందని బాదరాయణుల వారు ప్రస్తావిస్తున్నారని సూత్రార్థం.

ఉపనిషత్తులలో ప్రతిపాదించిన ఆత్మజ్ఞానం కర్మ ప్రమేయం లేకుండా స్వతంత్రంగా సిద్ధిస్తుందా లేక కర్మకు అంగంగానే కలుగుతుందా అని ఇప్పుడు పరిశీలించబడుతున్నది. బాదరాయణులవారు వేదాంతాలలో ప్రతిపాదితమైన ఆత్మ సాక్షాత్కారము స్వతంత్రంగా కర్మ యొక్క అపేక్ష లేకుండా జ్ఞానసాధన వల్ల లభిస్తుం దని, దానికి ఫలం పరమోత్కృష్టమైన మోక్షమని ప్రతిపాదిస్తున్నారు. దీనికి శ్రుతి నిదర్శనం చాలా ఉంది. *"తరతి శోకం ఆత్మవిత్"* (ఛా.ఉ 7.1.3), *"స యో హ వై తత్పరమం బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి"* (ము.ఉ 3.2.9), *"బ్రహ్మవిదాప్నోతి పరమ్"* (తై.ఉ 2.1.1), *"ఆచార్యవాన్ పురుషో వేద తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యేఽథ సంపత్స్యే"* (ఛా.ఉ 6.14.2), *"య అపహత పాప్మా"* అని ఉపక్రమంలో చెబుతూ *"స సర్వాంశ్చ లోకానాప్నోతి, సర్వాంశ్చ కామాన్ యస్తమాత్మానం అనువిద్య విజానాతి"* (ఛా.ఉ 8.7.1) అని ప్రజాపతి బోధనలో ముగిస్తున్నారు. అలాగే *"ఆత్మావా అరే! ద్రష్టవ్యః"* అని ప్రారంభించి తన భార్య మైత్రేయికి యాజ్ఞవల్క్యఋషి "ఏతావత్ అరే! ఖలు అమృతత్వమ్" అని బోధిస్తున్నారు (బృ.ఉ 4.5.15). ఈ విధంగా ఆత్మ జ్ఞానమే మోక్షప్రాప్తికి హేతువని శ్రుతులు వినిపిస్తున్నవి.

### సూ: 3.4.2 శేషత్వాత్పురుషార్థవాదో యథాన్యేష్వితి జైమినిః

ఇప్పుడు పూర్వపక్షి బాదరాయణుని ప్రస్తావనను ఆక్షేపిస్తూ ఆరు సూత్రాలను (3.4.2 నుంచి 3.4.7 వరకు) ప్రతిపాదిస్తున్నాడు.

కర్తగా పురుషుడే కర్మలకు అంగముగా వ్యవహరిస్తున్నాడు. వ్రీహ్యాది ప్రోక్షణ ఎలా యాగాదులలో కర్మ సంబంధమో, అలాగే ఆత్మకూడ కర్మకు అంగమౌతున్నది. ఆత్మజ్ఞానము వల్ల కలిగే ఫలము ఇతర కర్మలవల్ల లభించే పురుషార్థములతో సమానమని జైమిన్యాచార్యులవారు అభిప్రాయపడుతున్నారు. దానికి కొన్ని కర్మ ప్రక్రియలో జరిగే విధానాలను ఉదహరించారు: *"యస్య పర్ణమయీ జుహూర్భవతి న స పాపం శ్లోకం శృణోతి"* అలాగే *"యత్ప్రయాజానుయాజా ఇజ్యంతే*

*వర్మవా ఏతద్యజ్ఞస్య క్రియతే, వర్మ యజమానస్య భ్రాతృవ్యాభిభూత్యై"* . సిద్ధాంతి ఈ వాదన సరైనది కాదు, కారణం లౌకిక కర్మకూ వైదిక కర్మకూ కూడా కర్త ఒక్కడే అవుతాడు. కామ్యకర్మల వల్ల మోక్షం లభించదని ప్రత్యుత్తరం ఇస్తాడు.

మళ్లీ పూర్వపక్షి, దేహం కంటె వ్యతిరిక్తమైన ఆత్మఉందనే జ్ఞానం ఉండడం వల్లే, మరణానంతరం పొందే ఫలాన్నాశించే వైదిక కర్మలకుపక్రమిస్తారని ఆక్షేపిస్తాడు. దానికి సిద్ధాంతి సమాధానం: కర్మాచరణకు (ప్రవృత్తికి), వేదాంత విహితమైన నివృత్తి ఎలా అంగం అవుతుంది? పూర్వపక్షి మళ్లీ ఆక్షేపిస్తున్నాడు: పతి ప్రియుడౌతాడు, భార్య ప్రియమైనది అవుతుంది, ఇత్యాది ఉపనిషద్వాక్యాలు ప్రయోగించి ఆత్మనే ధ్యానించు కోవాలి అని బోధించటం కనబడుతున్నది కదా? అందువల్ల, అపహతపాప్మత్వం ఇత్యాది విశేషణాలు స్తుతి కోసం తప్ప మరే ప్రయోజనం కోసం కావనే తోస్తున్నది. అదీకాక, అసంసారియైన బ్రహ్మమే జగత్కారణం అని ముందు స్పష్టం చేసారు కదా మళ్లీ ఈ చర్చ ప్రయోజనం ఏమిటి?

**సిద్ధాంతి:**

వేదాంత విహితమైన ఆత్మ జ్ఞానం యొక్క ఫలాన్ని నిరూపించటానికే ఇక్కడ ప్రయత్నం జరుగుతున్నది. సంసారియైన శారీరుని ఆత్మ యొక్క పారమార్థిక స్వరూపమే అసంసారియైన పరమేశ్వరుడు. ఈ విషయాన్ని స్థిరంగా స్థూణానిఖనన న్యాయం చేత ఆత్మజ్ఞాన సాధకులలో నిలపడం కోసం చర్చ కొనసాగించబడుతున్నది.

## సూ: 3.4.3 ఆచారదర్శనాత్

(పూర్వపక్ష సూత్రం)

జ్ఞానులు–విద్వాంసులు కూడా కర్మ ఆచరిస్తారు. కాబట్టి, బ్రహ్మవిద్య కర్మాంగమే అవుతుందని సూత్రార్థం.

బ్రహ్మవేత్త అయిన జనక మహారాజు యజ్ఞాన్ని నిర్వహించినట్లు, ఉద్దాలకాది శ్రోత్రియులు, ఆత్మజ్ఞానమున్న ఋషులు భార్యాపుత్రుల సంబంధం విడవకుండా గృహస్థాశ్రమంలో ఉన్నట్లు ఉపనిషత్తుల్లో నిదర్శనం ఉంది. కేవలం జ్ఞానం వల్లే మోక్షం సిద్ధిస్తే వారంతా శ్రమతో వైదిక కర్మలు ఎందుకు చేస్తారు?

## సూ: 3.4.4 తచ్ఛ్రుతేః

(పూర్వపక్ష సూత్రం)

*"యదేవ విద్యయాకరోతి శ్రద్ధయా ఉపనిషదా తదేవ వీర్యవత్తరం భవతి"* (ఛా.ఉ 1.1.10), ఈ శ్రుతి, విద్య కర్మకు శేషము, దానిలో ఒక భాగమనే సూచిస్తున్నది. అందువల్ల కేవలం విద్య ఒక్కటే మోక్షానికి హేతువు కాదు. విద్యతో పాటు కర్మ (యజ్ఞ యాగాదులు, అనుష్ఠానం ఇత్యాదులు) కూడా ఉండాలి.

## సూ: 3.4.5 సమన్వారంభణాత్

(పూర్వపక్ష సూత్రం)

విద్యాకర్మలు పరలోకం వెళ్తున్న వారిని వెంబడించే ఉంటాయి అని శ్రుతి ఇలా వినిపిస్తున్నది: *"తం విద్యా కర్మణీ సమన్వారభేతే"* (బృ.ఉ 4.2.2). అందువల్ల విద్యకు స్వతంత్రంగా మోక్షాన్ని ప్రసాదించే సామర్థ్యం లేదు.

## సూ: 3.4.6 తద్వతో విధానాత్

(పూర్వపక్ష సూత్రం)

గురుసేవ, వేదాధ్యయనం చేసి ఆ తరవాత గృహస్థాశ్రమాన్ని స్వీకరించి, నిత్యకర్మలు నిర్వహించి, పవిత్రమైన ప్రదేశంలో స్వాధ్యాయం చేసుకునే వారికి బ్రహ్మలోక ప్రాప్తి కలుగుతుందని శ్రుతి ఇలా విన్పిస్తున్నది: *"ఆచార్య కులాత్ వేద*

*మధీత్య యథావిధానం గురోః కర్మాతిశేషేణ అభిసమావృత్య కుటుంబే శుచౌదేశే స్వాధ్యాయమధీయానః"* (ఛా.ఉ 8.15.1). వేదార్థ జ్ఞానమున్న వానికే కర్మకు అధికారం ఉన్నట్లు ఇక్కడ విదితమవుతున్నది. ప్రత్యక్షంగా కనబడేదే వేదాధ్యయనానికి ఫలం, కాబట్టి వేదాధ్యయనాదులు పురుషార్థసిద్ధి (అర్థావబోధ) వరకు చెయ్యాలనే కదా ఇక్కడ నిర్ణయింపబడుతున్నది?

## సూ: 3.4.7 నియమాచ్చ

(పూర్వపక్ష సూత్రం)

ఈశావాస్యోపనిషత్తులో *"కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేచ్ఛతగ్ం సమాః, ఏవం త్వయి నాన్యథేతో–స్తి న కర్మ లిప్యతే నరే"* (ఈ.ఉ 2) అని వినిపిస్తున్నది. అలాగే మరోశ్రుతి *"ఏతద్వై జరా మర్యం సత్రం యదగ్నిహోత్రం జరయావాహ్యేవ అస్మాన్ముచ్యతే"* అని బోధిస్తున్నది (శత.బ్రా. 12.4.1.1.) కర్మలు నిర్వర్తించటం వల్ల శతాయుష్షు ఉంటుందనీ, అగ్నిహోత్రాది కర్మల వల్ల జరా–మరణాలు ఉండవనీ ఈ ఉపనిషద్వాక్యాలు బోధిస్తున్నవి. అందువల్ల విద్య కర్మ యొక్క శేషమే అవాలి.

పై ఆరు పూర్వపక్ష సూత్రాలకు సమాధానమిస్తూ ఈ క్రింది తొమ్మిది సూత్రాలు ప్రతిపాదించబడ్డాయి.

## సూ: 3.4.8 అధికోపదేశాత్తు బాదరాయణస్యైవం తద్దర్శనాత్

కర్త, భోక్త, సంసారి అయిన శారీరుడి గురించే ఎక్కువ ప్రస్తావన వేదాంతా లలో, ఉంటే ఫలశ్రుతి అర్థవాదం అనే వాదనకు ఆస్కారం ఉండేది. కాని ఉపనిషత్తు లన్నింటిలోను కర్తృత్వాది సంసారధర్మాలు లేనివాడు, అపహత పాప్మాది విశేష గుణములన్న పరమాత్మ యొక్క ప్రస్తావనే ఎక్కువగా కనబడుతున్నది. పరమాత్మ యొక్క జ్ఞానం కర్మలను ప్రేరేపించదు. పైపెచ్చు, నివృత్తిమార్గం కర్మల యొక్క ప్రయోజనమే వ్యర్థం అని బోధిస్తుంది. ఆ విషయం మళ్లీ రాబోయే (బ్ర.సూ 3.4.16) సూత్రంలో నిర్దిష్టంగా ప్రస్తావింపబడుతున్నది.

బాదరాయణులవారు *"పురుషార్థోఽతః శబ్దాత్"* అనే సూత్రంలో (బ్ర.సూ 3.4.1.) ప్రతిపాదించినదే నిర్వివాదంగా నిలుస్తుంది. పలు శ్రుతులు శారీరుని కన్నా పరమాత్మ యొక్క విశిష్టతను, శక్తిని, ఆధిక్యతను ఇలా విన్పిస్తున్నవి: *"యః సర్వజ్ఞః సర్వవిత్"* (ము.ఉ 1.1.9), *"భీషాస్మాద్వాతః పవతే, భీషోదేతి సూర్యః"* (తై.ఉ 2.8.1), *"మహద్భయం వజ్రముద్యతమ్"* (క.ఉ 6.2), *"ఏతస్యవా అక్షరస్య ప్రశాసనే గార్గి"* (బృ.ఉ 3.8.9), *"తదైక్షత బహు స్యాం ప్రజాయేయేతి, తత్తేజోఽసృజత"* (ఛా.ఉ 6.2.3).

ఇక ఆత్మయే వేద్యంగా ప్రియాప్రియాది వచనాలతో శారీరక విశేషాలతోను చెప్పబడిన శ్రుతులు కూడా జీవేశ్వర అభిన్నత్వాన్ని సూచించడానికే నిర్దేశింపబడ్డాయి. *"అస్య మహతో భూతస్య నిఃశ్వసిత మేతత్ యత్ ఋగ్వేదః"* (బృ.ఉ 3.5.1), *"పరం జ్యోతిరుపసంపద్య స్వేన రూపేణ అభినిష్పద్యతే స ఉత్తమః పురుషః"* (ఛా.ఉ 8.12.3).

*"తత్త్వమసి"* (ఛా.ఉ 6.8.7), *"నాన్యదతోఽస్తి ద్రష్ట్ర"* (బృ.ఉ 3.8.11) ఇత్యాది శ్రుతులు పరమాత్మయే శారీరుని యొక్క పారమార్థిక రూపం అని భోదిస్తున్నవి. శరీరోపాధి వల్ల శారీరత్వం ప్రాప్తించినా తత్త్వతః శారీరుడు–పరమాత్మ యొక్క స్వరూపమని ముందు కూడా చాలా స్థానాలలో ప్రస్తావించటం జరిగింది.

## సూ: 3.4.9 తుల్యం తు దర్శనమ్

విద్య కర్మశేషం కాదు, అయినా కర్మాచరణ అతి సామాన్యంగా జరుగుతూ ఉంటుంది. అయితే కర్మను పరిత్యజించిన విద్యావంతులూ లేకపోలేదు. *"కిమర్థా వయం యక్ష్యామహే"* (ఏ ప్రయోజనాన్ని ఆశించి మనం యాగాలు చెయ్యాలి?). అలాగే కొంతమంది విద్వాంసులు అగ్నిహోత్రం చెయ్యడం మానేస్తారు అని మరో శ్రుతి వినిపిస్తున్నది: *"ఏతద్ధ స్మ వై తత్పూర్వే విద్వాంసోఽగ్నిహోత్రం న జుహవాం చక్రిరే"* (కౌ.ఉ 2.5). ఆత్మను తెలుసుకున్నవారు పుత్రైషణ, విత్తైషణ,

లోకైషణ విడిచి భిక్షాచర్యం చేస్తున్నారని మరో శ్రుతి సూచిస్తున్నది (బృ.ఉ 3.5.1). యాజ్ఞవల్క్యఋషి గృహస్థాశ్రమం వదలి అమృతత్వం కోసం సన్యాసాశ్రమం స్వీకరించినట్లు ఛాందోగ్యంలో చెప్పబడింది. వైశ్వానరవిద్య ఆత్మతత్త్వం ఉపదేశించటానికే ఉద్దేశింప బడింది కాని కర్మాంగంగా కాదు అని కూడా గ్రహించాలి.

## సూ: 3.4.10 అసార్వత్రికీ

*"యదేవ విద్యయా కరోతి"* అని ఉదహరించిన శ్రుతి (సూ. 3.4.4) అన్ని చోట్ల అన్వయించబడదు. ఉద్గీథోపాసనకు మాత్రమే వర్తిస్తుందని *"ఓ మిత్యేతదక్షర ముద్గీథ ముపాసీత"* అనే వాక్య సంబంధాన్ని బట్టి తెలుస్తున్నది.

## సూ: 3.4.11 విభాగః శతవత్

ఇక్కడ *"తం విద్యా కర్మణీ సమన్వారభేతే"* అని శ్రుతివాక్యాన్ని ఉదహరించి పూర్వపక్షి చేసిన ఆక్షేపణ తిరస్కరింపబడుతున్నది. విద్య ముముక్షువుని, కర్మ సంసారిని వెంబడిస్తాయని సూత్రకారులు నిర్ధారిస్తున్నారు. ఒక వందరూపాయలను చెరి సగం చేసి ఇద్దరికి పంచిన రీతిలో కూడ ఈ శ్రుతిని అన్వయించుకోవొచ్చు, విద్య–కర్మ రెండూ సంసారినే అనుసరించాలి, కాబట్టి 'సమన్వారభేతే' అనే వచనాన్ని అవిభాగం వల్ల కూడా అన్వయించుకోవడం కుదురుతుంది.

## సూ: 3.4.12 అధ్యయనమాత్రవతః

*"ఆచార్యకులాద్వేదమధీత్య"* అనే శ్రుతిని ఉదహరిస్తూ చేసిన ఆక్షేపణకు, ఈ సూత్రంలో సమాధానం ఇవ్వబడుతున్నది. పై శ్రుతిలో అధ్యయనం గురించి మాత్రమే వినిపిస్తున్నది. అంటే వేదాధ్యయనం లేకపోతే కర్మానుష్ఠానం విధింపబడ లేదని స్పష్టమవుతున్నది. ఉపనిషద్విహితమైన ఆత్మజ్ఞాన సాధనకు విధ్యుక్త కర్మ లేదు. కర్మసంబంధమైన జ్ఞానం కర్మలనాచరించే వారికి ఉండాలి. నివృత్తిమార్గంలో పోయేవారికి, ఆత్మజ్ఞానం కోరుకునే ముముక్షువులకు కర్మాచరణ విధి ఏమీ లేదు.

## సూ: 3.4.13 నావిశేషాత్

*"కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేత్"* అనే ఈశావాస్యోపనిషత్ శ్రుతిని ఉదహరించి చేసిన ఆక్షేపణ (సూ. 3.4.7) ఇప్పుడు తిరస్కరింపబడుతున్నది. ఈ శ్రుతిలో విద్వాంసుడు కర్మాచరణ చెయ్యాలని ఏ నియమమూ విధింపబడలేదు. సాధారణరూపంలోనే (అవిశేషంగానే) కర్మలు ఆచరిస్తూ నూరుసంవత్సరాలు జీవించ వచ్చు అని సూచింపబడింది.

## సూ: 3.4.14 స్తుతయేఽనుమతిర్వా

విద్యావేత్త యావజ్జీవితమూ కర్మ ఆచరిస్తున్నా, ఆ కర్మ అతని విద్యా సామర్థ్యం వలన స్పృశించదు అని కూడ *"న కర్మ లిప్యతే నరే"* అనే పైన ఉదహరిం చిన శ్రుతిలో వాక్యాన్ని అన్వయించుకోవొచ్చు. ఇక్కడ విద్యాస్తుతి కోసమే కర్మమార్గం యొక్క సూచన (అనుజ్ఞ) ఉన్నట్లు తెలుస్తున్నది.

## సూ: 3.4.15 కామకారేణ చైకే

కొందరు విద్వాంసులు విద్యాఫలాన్ని తెలుసుకొని, వారే సంతానాది కోరికలు వ్యర్థమని నిర్ణయించుకుంటారు. *"ఏతద్ధ స్మ వై తత్ పూర్వే విద్వాంసః ప్రజాం న కామయంతే కిం ప్రజయా కరిష్యామో యేషాం నోఽయమాత్మాయంలోకః"* (బృ.ఉ 4.4–22). విద్యాఫలం మోక్షరూపంలో వెంటనే ప్రాప్తిస్తుంది. యజ్ఞ యాగాది కర్మఫలంలాగ కాలాంతరంలో

లభించే (అదృష్ట) ఫలం కాదు. అందువల్ల విద్య, కర్మ యొక్క శేషమనికాని, జ్ఞానార్జనతో కలిగిన ఫలం మిథ్య అని (నిజం కాదని) చెప్పబడదు.

## సూ: 3.4.16 ఉపమర్దం చ

అవిద్యాకృతమైన సంసారం నుండి (జగత్తు నుండి) విద్యా సామర్థ్యం చేత బయటపడవచ్చు. ఉపనిషద్విహిత ఆత్మజ్ఞానం పొందాలనే కోరిక వల్ల కర్మాధికారమే పోతుంది. అందువల్ల విద్య కర్మశేషం కాదు, స్వతంత్రమైనది.

## సూ: 3–4–17 ఊర్ధ్వరేతఃసు చ శబ్దే హి

సన్యాసులు (ఊర్ధ్వరేతస్కులు) ఆత్మరూపమైన బ్రహ్మసంస్థనే కోరుకుంటారు. *"త్రయోధర్మ స్కంధాః"* అని బ్రహ్మచర్య–గృహస్థ వానప్రస్థాశ్రమాలు సూచింపబడ్డాయి. వీటిలో ఉంటున్న వారికే కర్మ ప్రధానమైనది. బ్రహ్మలోకాన్ని కోరుకున్నవారు సన్యాసాశ్రమం స్వీకరిస్తారు *"ఏతమేవ ప్రవ్రాజినో లోకమిచ్ఛంతః ప్రవ్రజంతి"* (బృ.ఉ 4.4.22) తపోనిష్ఠులు, శ్రద్ధ కలిగినవారు అరణ్యవాసం చేస్తారు. *"యేచ ఇమేరణ్యే శ్రద్ధా తప ఇత్యుపాసతే"* (ఛా.ఉ 5.10.1). అలాగే *"తపః శ్రద్ధే యే హ్యుపవసంత్య రణ్యే"* అని మరో శ్రుతి వినిపిస్తున్నది (ము.ఉ 4.4.22).

అయితే, బ్రహ్మచర్యాశ్రమం నుంచే సన్యాసాశ్రమాన్ని గ్రహించే అధికారం ఉన్నదని, మరో శ్రుతి *"బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేత్"* (జా.ఉ 4) సూచిస్తున్నది. ఋషి– దేవ–పితృ ఋణాలను తీర్చుకున్నా, తీర్చుకోక పోయినా సన్యాసాశ్రమ స్వీకారానికి అర్హత ఉంది. ఈ కారణం వల్ల కూడా విద్య కర్మశేషం కాదని ఏ సందేహం లేకుండా చెప్పవచ్చును.

## 2. పరామర్శాధికరణమ్

## సూ: 3.4.18 పరామర్శం జైమినిరచోదనా చాపవదతి హి

**ఆక్షేపణ:**

ముందు అధికరణంలో సూత్రకారులు త్రయో ధర్మస్కంధాః అనే ఛాందోగ్య శ్రుతిని ఉదహరిస్తూ ఆశ్రమ ధర్మవ్యవస్థ యొక్క ప్రస్తావనను ఇక్కడ ఆక్షేపించటం జరిగింది.

జైమిన్యాచార్యులవారు ఊర్ధ్వరేతసాశ్రమాన్ని (సన్యాస ఆశ్రమాన్ని) వేద విరుద్ధమని భావిస్తున్నారు. త్రివిధ ఆశ్రమ వ్యవస్థలు ఇలా చెప్పబడ్డాయి: *"యజ్ఞోఽధ్యయనం దాన మితి ప్రథమం, తప ఏవ ద్వితీయో బ్రహ్మచర్య ఆచార్య కులవాసీ తృతీయోఽత్యంతం ఆత్మానం ఆచార్యకులేఽవసాదయన్ సర్వే ఏతే పుణ్యలోకా భవంతి బ్రహ్మసంస్థోఽమృతత్వం ఏతి"* (ఉత్తమ ధర్మము మూడు విధములుగా ఆచరింపబడుతుంది: మొదటిది యజ్ఞయాగాదులు చెయ్యటం, వేదములను చదవటం, యథోచితదానము చెయ్యటం ఇది గృహస్థునకు సంబంధించినది; రెండవది వానప్రస్థా శ్రమమునకు సంబంధించిన తపోనిష్ఠ, మూడవది గురువునాశ్రయించి వారి ఇంటి వద్ద నైష్ఠిక బ్రహ్మచారులు నియమంగా చేసే అధ్యయనం – ఛా.ఉ 2.23.1). ఇక్కడ మూడు వ్యవస్థలే చెప్పబడ్డాయి.అందువల్ల, సన్యాసాశ్రమం స్వీకరించేవారుబ్రహ్మసంస్థ పొంది, మిగతావారు పుణ్యలోకాలు పొందుతారు అని చెప్పడమే శాస్త్రవిరుద్ధం, కారణం నాల్గవ ఆశ్రమ వ్యవస్థ కేవలం పరామర్శగా (పరిశీలనాప్రాయంగా) మాత్రమే వినిపిస్తున్నది. వేదంలో ఎక్కడా సన్యాసాశ్రమ విధివచనాలు లేవని పూర్వపక్షి ఆక్షేపణ.

శ్రుతిలో పరామర్శ మాత్రంగానే సూచించబడ్డా సన్యాసఆశ్రమ వ్యవస్థలో నున్న నాలుగు భేదాలు, అలాగే గృహస్థులలోను, వానప్రస్థులలోను, బ్రహ్మచారుల లోను నాల్గేసి విభాగాలు ఉన్నాయని స్మస్మృతిసంప్రదాయంలో ఉంది. సన్యాసాశ్రమం స్వీకరించే వారిని నాలుగు విభాగాలలో ఈ విధంగా గుర్తిస్తారు: 1. కుటీచకులు, 2. బహూదకులు, 3. హంసలు, మరియు 4. పరమహంసలు.

త్రివిధ ధర్మస్కంధాల ప్రస్తావనలో గృహస్థులతో పాటు, సన్యాసాశ్రమవాసుల ప్రస్తావనే లేదు. కేవలం అగ్నిహోత్రాది కర్మలు చేసుకొనే గృహస్థులు మాత్రమే ప్రథమ వర్గంలో సూచింపబడ్డారు. అంతేకాదు, కొన్ని శ్రుతులు ఆశ్రమాంతరాన్నే నిందిస్తున్నాయని ఇలా ఉదహరించటం జరిగింది: *"వీరహా వా ఏషదేవానాం యో ఽగ్నిముద్వాసయతే"* (అగ్నికి ఉద్వాసన పలికినవాడు దేవసంతానాన్ని చంపిన వాడౌతాడు – తై.సం. 1.5.2). తైత్తిరీయోపనిషత్తులో బ్రహ్మచర్యం తరవాత గృహస్థుడవై సంతానాన్ని పొందు అనే బోధింపబడింది. *"ఆచార్యాయ ప్రియం ధనమాహృత్య ప్రజాతంతుం మా వ్యవచ్ఛేత్సీః"* (తై.ఉ 1.11.1). అలాగే *"నాపుత్రస్యలోకోఽస్తీతి తత్సర్వే పశవో విదుః"* (పుత్రుని లేనివానికి గతే లేదని అందరికీ విదితమే).

ఇకపోతే, *"యేచ ఇమేఽరణ్యే శ్రద్ధా తప ఇత్యుపాసతే"* అనే ఛాందోగ్య శ్రుతి, *"తపః శ్రద్ధే యే హ్యుప వసంత్యరణ్యే"* అనే ముండకోపనిషత్తులోని వాక్యము, దేవయాన మార్గంలో పోయేవారి నుద్దేశించి చెప్పినవి. ఆశ్రమధర్మ ప్రస్తావన ఆ శ్రుతి వాక్యాలలో లేదు. అలాగే, వానప్రస్థులకు విధింపబడ్డ *"తప ఏవద్వితీయమ్"* అనే వాక్యంలో కూడా సన్యాసాశ్రమ వాసుల యొక్క ప్రసంగం లేదు. *"బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేత్"* అనే జాబాల శ్రుతి, శాస్త్రాన్ని పరిశీలించి చెప్పబడలేదు. అందువల్ల సన్యాస ఆశ్రమ వ్యవస్థయే శాస్త్ర విరుద్ధమని పూర్వపక్షి వాదన.

## సూ: 3.4.19 అనుష్ఠేయం బాదరాయణః సామ్యశ్రుతేః

బాదరాయుణులవారు గృహస్థాశ్రమం కూడా సన్యాసాశ్రమముతో కలిసి వినబడుతున్నందు వల్ల సన్యాసాశ్రమమూ అనుష్ఠేయమైనదే అని భావించవచ్చునని అభిప్రాయపడుతున్నారు.

*"త్రయోధర్మస్కంధాః"* అనే శ్రుతిలో గృహస్థాశ్రమ ప్రస్తావన సన్యాసాశ్ర మంతో సామ్యత్వం వల్ల ఒకవిభాగంలో చెప్పబడిందికాని, ఆశ్రమాంతరము శ్రుతి విరుద్ధం అని బాదరాయణులవారు అంగీకరించరు. శాస్త్రాంతరం వల్ల కొన్ని శ్రౌతకర్మలు ఎలాగ్రహించబడుతున్నాయో, అలాగే ఆశ్రమాంతరం (సన్యాసాశ్రమం) అనువదింపబడుతుంది. సన్యాస ఆశ్రమధర్మం, శాస్త్రవిరుద్ధం కాదు, అది కూడా తక్కిన వర్ణాశ్రమాదుల్లా విధేయమే అని గ్రహించవల్సి ఉంది.

యజ్ఞాది గౌణాలతో గృహస్థాశ్రమం యొక్క ధర్మాలు చెప్పబడ్డాయి. బ్రహ్మచారుల యొక్క ప్రస్తావన స్పష్టంగా ఉంది. తపః ప్రధానమైన వానప్రస్థానం కంటె భిన్నమైనది మరో వ్యవస్థ ఏదీలేదు. అందువల్ల కేవలం పరామర్శతో జరిగినా, సన్యాసఆశ్రమ విధానం శాస్త్రవిరుద్ధం ఎంత మాత్రమూ కాదు.

## సూ: 3.4.20 విధిర్వా ధారణవత్

సన్యాసఆశ్రమ వ్యవస్థను విధ్యుక్త ధర్మమనే గ్రహించాలి. కొన్ని కర్మ విధానాలను జైమిని *"విధిస్తు ధారణేఽపూర్వత్వాత్"* అని శేషప్రకరణంలో సూత్రీకరించారు. అదే విధంగా ఆశ్రమ పరామర్శ శ్రుతిని విధిరూపంలోనే గ్రహించ వచ్చు. ఆశ్రమాంతరం (సన్యాసం) పరిశీలన చేయబడిందని అమృతత్వం–బ్రహ్మసంస్థ విధేయమనే అంగీకరించాలి. అయితే, గృహస్థుడా, వానప్రస్థుడా, బ్రహ్మచారా, పరివ్రాజకుడా వీరిలో ఎవరు బ్రహ్మసంస్థకు అధికారి అనే ప్రశ్నవస్తుంది. ముందు ఉదహరించిన *"త్రయోధర్మ స్కంధాః"* అనే శ్రుతి ప్రకారము ఒక శ్రేణికి చెందిన వారికే బ్రహ్మసంస్థ, మిగతా వారందరికి పుణ్యలోకగతి అని విన్పిస్తున్నది. నాలుగు ఆశ్రమ వ్యవస్థలలో, ఇంద్రియ సంయమాది గుణాలతో పరివ్రాజకత్వం స్వీకరించిన పరివ్రాట్టు శాశ్వతంగా బ్రహ్మయందుండే బ్రహ్మసంస్థకు అర్హుడని నిశ్చయించుకోవాలి. శమదమాది సంపత్తులతో బ్రహ్మనిష్ఠత్వమే పరివ్రాజకులకు నిర్దేశించిన ధర్మం. అట్టి ధర్మాచారపరులైన పరివ్రాజకులే బ్రహ్మసంస్థను పొందగలరు.

సన్యాసాశ్రమం పరమశ్రేష్ఠమైనదని బోధిస్తున్న శ్రుతులు చాల ఉన్నాయి. *"న్యాస ఇతి బ్రహ్మ, బ్రహ్మ హి పరః పరోహి బ్రహ్మ తాని వా ఏతాన్యవరాణి తపాంసి న్యాస ఏవాత్యరేచయత్"* (సన్యాసమే బ్రహ్మ హిరణ్యగర్భ శ్రేష్ఠుడు సన్యాసమే శ్రేష్ఠ మైనది, మిగతా తపస్సులకు అంత శ్రేష్ఠత్వం లేదు – మహా.నారా.ఉ 78). *"వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థాః సన్యాస యోగాద్యతయః శుద్ధ సత్త్వాః"* (సన్యాసం స్వీకరించిన యతులు శుద్ధ అంతఃకరణ కలవారు, వేదాంత విజ్ఞానం చేత సూక్ష్మదర్శకులు అవుతారు – ము.ఉ 3.26). భగవద్గీతలో కూడా ఈ విధమైన ఉపదేశం కనిపిస్తున్నది: *"తద్బుద్ధయః, తదాత్మా, తన్నిష్ఠాః తత్పరాయణాః"* (భ.గీ. 5.17) బ్రహ్మయందు మనస్సు నిలుపుకున్నవారు, బ్రహ్మనిష్ఠులు, బ్రహ్మను పొందుతారనే దీని తాత్పర్యం.

*"బ్రహ్మచర్యం పరిసమాప్య గృహీ భవేత్, గృహీ భూత్వా వనీ భవేత్, వనీ భూత్వా ప్రవ్రజేత్, యది వా ఇతరథా బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేత్, గృహాద్వా, వనాద్వా"* ఈ జాబాలశ్రుతి ప్రత్యక్షంగా సన్యాసాశ్రమాన్ని విధిస్తున్నది (జా.ఉ 4). అదే శ్రుతి, గోదానాది వేదవిహిత వ్రతాలు చేసినా, చేయకపోయినా, అగ్నిహోత్రాదులు చేయక పోయినా సన్యాసాశ్రమానికి అర్హుడనే బోధిస్తున్నది.

## 3. స్తుతిమాత్రాధికరణమ్

## సూ: 3.4.21 స్తుతిమాత్రముపాదానాదితి చేన్నాపూర్వత్వాత్

**సంశయం:**

కొన్ని శ్రుతి వాక్యాలు కర్మాంగాలైన ఉద్గీథాదులనుద్దేశించి ఇలా వినబడుతు న్నవి: *"స ఏష రసానాం రసతమః పరమః పరార్ధ్యోఽష్టమో యదుద్గీథః"* (ఛా.ఉ 1.1.3), *"ఇయమేవ ఋుక్, అగ్నిఃసామ"* (ఛా.ఉ 1.6.1), 'అయం వావ లోక ఏషోఽగ్నిశ్చితః" (శత.బ్రా 10.5.4.1.), *"తదిదమేవ ఉక్థం ఇయమేవ పృథివీ"* (ఐ.ఆ 2.1.2.1.) ఇవి ఉద్గీథాదుల స్తుతి కోసం చెప్పబడుతున్నాయా లేక ఉపాసనా విధులుగా చెప్పబడు తున్నాయా?

కర్మకు సంబంధించినంత వరకు *"ఇయమేవ జుహూరాదిత్యః, కూర్మః స్వర్గో లోకః ఆహవనీయః"* ఇటువంటి జుహ్వాది శ్రుతి వాక్యాలు స్తుతి కోసమే ఉపయోగించ బడుతున్నాయి. వాటికి మరేమీ ప్రయోజనం లేదు. పైన ఉపనిషత్తుల్లోని శ్రుతివాక్యాలు స్తుత్యర్థములా లేక ఉపాసనా విధిని ప్రస్తావిస్తున్న విధ్యర్థములా?

**సమాధానం:**

ఈ శ్రుతులన్నీ అపూర్వములు. ముందు చెప్పినవి కావు. క్రొత్తగా వినిపిస్తున్నవే. కాబట్టి వీటిని ఉపాసన విధిస్తున్న విధ్యర్థములుగానే గ్రహించాలి.

## సూ: 3.4.22 భావశబ్దాచ్చ

*"ఉద్గీథముపాసీత"* (ఛా.ఉ 1.1.1), *"సామోపాసీత"* (ఛా.ఉ 2.2.1) ఈ విధంగా వినిపిస్తున్న శబ్దాలన్నీ విధి వాచకములే. కుర్యాత్, క్రియత, కర్తవ్యమ్, భవేత్, స్యాత్ అనే ఈ ఐదూ విధివాచకాలుగా మీమాంసకులు నిర్ధారిస్తారు. అదీకాక *"ఆపయితా హ వై కామానాం భవతి"* (ఛా.ఉ 1.1.7), *"ఏష హి ఏవ కామా గానస్యేష్టే"* (ఛా.ఉ 1.7.9). ఇలా ఉపాసన విధికి ఫలశ్రుతి కూడా వినబడడం వల్ల ఉద్గీథాది శ్రుతులు ఉపాసన విధినే నిర్దేశిస్తున్నాయి.

## 4. పారిప్లవాధికరణమ్

### సూ: 3.4.23 పారిప్లవార్థా ఇతి చేన్న విశేషితత్వాత్

ఆఖ్యాయికల (కథల) రూపంలో చెప్పినవి కూడా విశేషములతో వినిపిస్తు న్నందున ప్రయోజనమున్నవే అని సూత్రార్థం.

**సంశయం:**

ఆఖ్యానాలు వేద సాంప్రదాయమే. రాజసూయ యాగంలో రాజులు, వారి కుటుంబసభ్యులకు అధ్వర్యుడు వినిపించే కథలను పారిప్లవం అంటారు. ఉపనిషత్తుల్లో కూడ చాలా సందర్భాలలో కథల రూపంలో బోధన జరుగుతుంది. ఉదాహరణకు కొన్ని ఇలా విన్పిస్తున్నవి.

*"అథ హ యాజ్ఞవల్క్యస్య ద్వే భార్యే బభూవతుః మైత్రేయీ, కాత్యాయనీచ"* (యాజ్ఞవల్క్యునికి ఇద్దరు భార్యలు మైత్రేయీ మరియు కాత్యాయనీ –బృ.ఉ 4.5.1). *"ప్రతర్దనో వై దైవోదాసి రింద్రస్య ప్రియం ధామోపజగామ"* (దివోదాసుని కుమారుడైన ప్రతర్దనుడు ఇంద్రకొలువుని చేరుకున్నాడు). *"జానశ్రుతిః హ పౌత్రాయణః శ్రద్ధదేయో బహుదాయీ బహుపాక్య ఆస"* (జానశ్రతి అనే వాడు గొప్ప శ్రద్ధాళువు దాత, అన్నదానాలు చేసేవాడు – ఛా.ఉ 4.1.1). ఈ విధమైన పారిప్లవ సంప్రదాయంలో చెప్పిన కథలకు విద్యాప్రయోజనం ఉంటుందా, లేక కాలయాపనకే ఉపయోగింప బడుతున్నవా?

**సమాధానం:**

విశేషించి చెప్పడం వల్ల ఉపాఖ్యానాలకు విద్యా ప్రయోజనం ఉంది. ఆఖ్యాన శ్రుతులు నిష్ప్రయోజక ప్రసంగాలు కావు.

### సూ: 3.4.24 తథా చైకవాక్యతోపబంధాత్

విద్యాబోధనలో ఏకవాక్యత కల్పించటానికే ఆఖ్యాయిక ప్రయోగం ఉద్దేశించ బడినది. పాఠకుల్లో శ్రద్ధ కల్పించటం కోసం, బోధనావిషయం సరళం చేయటానికి ఈ ప్రక్రియ ఉపయోగిస్తుంది. మైత్రేయీ బ్రాహ్మణంలో *"ఆత్మావా అరే! ద్రష్టవ్యః"* అని వినిపిస్తున్న ఆత్మబోధనలో ఏకవాక్యత్వం స్పష్టంగా గ్రహించవచ్చు. అలాగే ప్రతర్దన–ఇంద్ర ఆఖ్యాయిక, 'ప్రాణోఽస్మి ప్రజ్ఞాతా', ప్రాణవిద్యా ఏకత్వాన్ని, జానశ్రుతి కథలో *"వాయుర్వావసంవర్గః"* అనే వాక్యం విద్యతో ఏకవాక్యత్వాన్నే చూపిస్తున్నవి.

# 5. అగ్నీంధనాద్యధికరణమ్

## సూ: 3.4.25 అత ఏవ చాగ్నీంధనాద్యనపేక్షా

సూత్రకారులు విద్యా స్వాతంత్ర్యాన్ని ముందు అధికరణములలో స్థాపించి ఇక్కడ పురుషార్థాధికరణంలో ప్రస్తావించిన *"పురుషార్థోఽతః శబ్దాత్"* అనే సూత్రానికి (బ్ర.సూ 3–4–1) ఫలనిర్ధారణ చేస్తున్నారు.

విద్య పురుషార్థహేతువు కాబట్టి అగ్న్యాది క్రియలతో ఆశ్రమవ్యవస్థకు సంబంధించిన కర్మలేవి చెయ్యనవసరం లేకుండా (వాటి అపేక్ష లేకుండా) ఫలం లభిస్తుందని ఈ చర్చ ఉపసంహారం చేస్తున్నారు. ఇకపైన క్రొత్త విషయాలపై చర్చ కొనసాగుతుంది.

## 6. సర్వాపేక్షాధికరణమ్

### సూ: 3.4.26 సర్వాపేక్షా చ యజ్ఞాదిశ్రుతేరశ్వవత్

విద్యకు ఆశ్రమ కర్మాదుల అపేక్ష పూర్తిగా ఉండదా, లేక కొంత ఉంటుందా అనే విషయంపై ఇప్పుడు చర్చ జరుగుతున్నది.

క్రిందటి అధికరణంలో విద్యకు, అగ్నిహోత్రాది ఆశ్రమవ్యవస్థకు చెందిన కర్మల అపేక్ష ఉండదని చెప్పబడింది. మరి ఇక్కడ 'సర్వాపేక్షా' అన్నింటి అపేక్షా ఉంటుందని సూచిస్తే అది పరస్పర విరుద్ధంగా లేదా అని ఆక్షేపణ చెయ్యబడింది. దానికి సూత్రకారులు విద్య జ్ఞానోత్పత్తికి దోహదం చేస్తుంది, అందువల్ల జ్ఞాన సాధనకు కొంతవరకు ఆశ్రమ ధర్మాలకు ఉద్దేశించిన కర్మలను అపేక్షించవచ్చు. కాని విద్యోత్పత్తి తరవాత ఫలసిద్ధి కోసం ఎటువంటి కర్మలను అపేక్షించదని స్పష్టం చేస్తున్నారు.

*"తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషంతి యజ్ఞేన, దానేన తపసా ఽనాశకేన"* (వేదాధ్యయనం చేత, యజ్ఞం చేత, దానంతోను, నాశరహితమైన ఈ ఆత్మను తెలుసుకోవాలనే ఇచ్ఛతో బ్రాహ్మణులు ఉన్నారు – బృ.ఉ 4.4.22). ఈ శ్రుతి యజ్ఞాది కర్మలు, తపస్సు, విద్యా ప్రాప్తికి సాధనములని తెలియజేస్తున్నది. అలాగే, మరో శ్రుతి ఇలా వినిపిస్తున్నది: *"అథ యద్యజ్ఞ ఇత్యాచక్షతే బ్రహ్మచర్య మేవ తత్"* (ఏది యజ్ఞమని భావిస్తున్నారో అదే బ్రహ్మచర్యము – ఛా.ఉ 8.5.1). ఈ ఉపనిషద్వాక్యాలు బ్రహ్మచర్యం, యజ్ఞాది మిగతా వైదిక కర్మలూ విద్యా సాధనకు ఉపయుక్తములని సూచిస్తున్నవి.

కఠోపనిషత్తులోని శ్రుతి కూడా బ్రహ్మచర్యం, తపస్సు ఇత్యాదులు విద్యా సాధనాలనే బోధిస్తున్నది: *"సర్వే వేదా యత్పదమామనంతి, తపాంసి సర్వాణి చ యద్వదంతి, యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి తత్తేపదం సంగ్రహేణ బ్రవీమి"* (అన్ని వేదాలు ఏ స్థానాన్ని నిర్దేశిస్తున్నాయో, సమస్తమైన తపస్సులు దేనిని పొంద టానికి సాధనములని చెబుతున్నాయో, దేని కోసం బ్రహ్మచర్యం ఆచరిస్తున్నారో ఆ స్థానాన్ని గురించి నీకు సంగ్రహంగా చెప్తున్నాను – క.ఉ 2–15).

జ్ఞానోత్పత్తి కొరకే ఆశ్రమవ్యవస్థలలో ప్రతిపాదించిన కర్మల యొక్క ప్రయోజనం ఉంటుందని చెప్పడానికి సూత్రంలో 'అశ్వవత్' అనే పదం వాడబడింది. అశ్వాలను వాటి యోగ్యతను దృష్టిలో ఉంచుకొని రథాలను నడిపించటానికి ఎలా సాధనంగా ఉపయోగించుకుంటారో, అలాగే జ్ఞానోత్పత్తికి మాత్రమే కర్మలను అపేక్షిస్తారు (కోరుకుంటారు). ఫలసిద్ధికి వాటి అపేక్ష ఉండదు.

### సూ: 3.4.27 శమదమాద్యుపేతః స్యాత్తథాపి తు తద్విధే స్తదంగతయా తేషామవశ్యానుష్ఠేయత్వాత్

విద్యకు అంగంగా వాటిని విధించటం వలన శమదమాదులు తప్పక అనుష్ఠింప దగినవి కాబట్టి ముముక్షువు శమదమాది సంపత్తులను కలిగి ఉండాలని సూత్రార్థం.

*"యజ్ఞేన వివిదిషంతి"* (యజ్ఞమును కోరుకుంటున్నారు) అనే శ్రుతి విధి రూపమైనది కాదు; అనువాద రూపంలో ప్రస్తావించబడింది. దాని ప్రయోజనము విద్యా స్తుతియే. *"తస్మాదేవంవిత్ శాంతో, దాంత, ఉపరతః తితిక్షుః సమాహితోభూత్వా ఆత్మన్యేవాత్మానం పశ్యతి"* (శమాది షట్‌సంపత్తులతో ఆత్మజ్ఞానాన్ని ముముక్షువు ఆకాంక్షిస్తున్నాడు – బృ.ఉ 4.4.23). మాధ్యందినులు ఈ శ్రుతినే 'పశ్యేత్' అని విధిరూపంలో పఠిస్తారు. అందువల్ల, వైదిక కర్మలపై ఇచ్ఛ లేకపోయినా, ముముక్షువు శమ, దమాదులను తప్పక అలవరచుకోవాలనే శ్రుతి వాక్యాలు సూచిస్తున్నవి.

# 7. సర్వాన్నానుమత్యధికరణమ్

## సూ: 3.4.28 సర్వాన్నానుమతిశ్చ ప్రాణాత్యయే తద్దర్శనాత్

**పూర్వపక్షి:**

ప్రాణసంవాద సందర్భంలో ఛాందోగ్య శ్రుతి ఇలా విన్పిస్తున్నది: *"న హ వా ఏవంవిది కించన అనన్నం భవతి"* [సర్వమూ ప్రాణానికి అన్నమని తెలుసుకున్న వానికి అన్నం కానిదేదీ (తినకూడనిదేదీ) ఉండదు – ఛా.ఉ 5.2.1 ]. అలాగే, బృహదా రణ్యకంలో కూడా వినబడుతున్నది: *"న హ వా అస్య అనన్నం జగ్ధం భవతి, న అనన్నం పరిగృహీతమ్"* (ప్రాణాలను నిలుపుకోడానికి తినకూడనిదని గాని, తీసుకోకూడనిదని గాని లేదు – బృ.ఉ 6.1.14). శమదమాది నియమముల రీతిలో, సర్వం అన్నంగా తీసుకోవచ్చు అనే శ్రుతి వచనం విద్యా విధిగా స్వీకరించాలా లేక కేవలం స్తుతిరూపంలో అర్థం చేసుకోవాలా అనే సందేహం కలుగుతున్నది.

ప్రాణవిద్యకు ఒక అంగంగా ఉండడం వల్ల దీనిని విధిరూపంలో అన్వయించుకొని ఇది తినవచ్చు, ఇది తినకూడదు అనే భావనను వదలుకోవాలి. ప్రాణరక్షణార్థం ఏదీ తప్పు లేదని భావించి అన్నింటిని అన్నంగా స్వీకరించవచ్చు. అయితే అన్న–పానీయాల విషయంలో సామాన్యంగా శాస్త్రంలో చెప్పినదానికిది విరుద్ధము కాదా, అనే ప్రశ్న ఉత్పన్నమవుతుంది. కాని, దానిని అన్ని సమయాలలోను పాటించే అవసరం ఉండదు. వామదేవుని సామోపాసనా విద్యలో *"న కంచన స్త్రియం పరిహరేత్"* అని వినబడుతున్నది (ఛా.ఉ 2.13.2). శాస్త్రంలో సామాన్యంగా చెప్పిన కట్టుబాట్లు, నియమ విధులు ఈ శ్రుతికి విరుద్ధమైనా విశేషంగా చెప్పినప్పుడు ఆ బోధన (సామాన్య శాస్త్రాన్ని అధిగమించి) గ్రహించవలసి ఉంటుంది కదా?

**సిద్ధాంతం:**

ఇక్కడ శ్రుతిలో ప్రాణాన్ని నిలబెట్టుకోవడం కోసం సర్వమూ అన్నమే అని వర్తమాన ధాతువును ఉపయోగించి (న అనన్నం భవతి) చెప్పబడింది. అందువల్ల విధి కాదు. అదీకాక, శునకాదులు తిన్నది కూడా ప్రాణానికి అన్నమనే వాక్యాన్ని, ఆ జాతికది ప్రాణమును రక్షించుకునే అన్నము, అనే భావంతో అర్థం చేసుకోవాలి. మనుష్య శరీరంలో ఉన్నవాళ్లు మనుషులు ఏది అన్నంగా తింటారో, అదే మనుష్య ప్రాణాన్ని నిలిపే యోగ్యత కలిగి ఉంటుంది. అయితే, ప్రాణాలు పోయే ఆపద వచ్చినప్పుడు సర్వం భక్షణీయమవుతుంది. ఈ విషయాన్నే సూత్రకారులు *"సర్వాన్నానుమతిశ్చ ప్రాణాత్యయే"* అని సూత్రంలో వివరిస్తున్నారు.

కురుదేశం ప్రకృతి వైపరీత్యాల వల్ల దుర్భిక్ష పరిస్థితిలో ఉన్న సమయంలో, ప్రాణాన్ని నిలబెట్టుకోడానికి గత్యంతరం లేక ఉచ్ఛిష్టాన్నం భుజించిన ఉషస్తి అనే విద్యావేత్త యొక్క పరిస్థితిని ఛాందోగ్యంలో శ్రుతి ఇలా వినిపిస్తున్నది: *"న వా అజీవిష్యం ఇమాన్ అఖాదన్నితి, కామోమ ఉదపానం"* (ఛా.ఉ 1.10.4). సామాన్య పరిస్థితులలో నియమాలు పాటిస్తూ ఉండాలి. కాని, అత్యవసర పరిస్థితుల్లో ఉచ్ఛిష్ట మైనది కూడా 'అనన్నం' కాదు అని దీని తాత్పర్యం.

## సూ: సూ: 3.4.29 అబాధాచ్చ

*"ఆహారశుద్ధౌ సత్త్వశుద్ధిః"* అనే వాక్యం ఆహారనియమం అంతఃకరణ శుద్ధికి పాటించాలనే బోధిస్తున్నది. అందువల్ల ఆహార పానీయాల్లో నియమం ఏ విధంగానూ శాస్త్రవిరుద్ధం కాదు.

## సూ: 3.4.30 అపి చ స్మర్యతే

మనుస్మృతి వాక్యం ప్రాణాపాయస్థితిలో విద్వాంసునకు, అవిద్వాంసునకు ఒకే ధర్మం ఆహార విషయంలో వర్తిస్తుంది. ఆపత్కాల ధర్మం, సామాన్య పరిస్థితులలో ఆచరించే ధర్మం కాదు. *"జీవితాత్యయమాపన్నో యోఽన్నమత్తి యతస్తతః, లిప్యతే న స పాపేన పద్మపత్రమివాంభసా"* (మ.స్మృ 10.104). గౌతమ ధర్మసూత్రాలు, బ్రాహ్మణులు

ఎప్పుడూ మద్యపానం చెయ్యకూడదు. సురాపానం చేసేవారు పురుగులుగా పుడతారు, అలాగే నిషిద్ధ భోజనం చేసేవారూ పురుగులవుతారు, అని చెప్తున్నవి.

## సూ: 3–4–31 శబ్దశ్చాతోఽకామకారే

భోజనాదులలో నియమమే కాని స్వేచ్ఛ లేదనే శ్రుతివాక్యాలు బోధిస్తున్నవి. ఛాందోగ్యంలో ముందు ఉదహరించిన *"ఏవంవిది కించన అనన్నం భవతి"* అనే వాక్యాన్ని అర్థవాద రూపంలోనే గాని విధిరూపంలో గ్రహించకూడదు. అప్పుడే నిషిద్ధ వస్తువులు తప్పక త్యజించాలి అని చెప్పటం కుదురుతుంది.

## 8. ఆశ్రమకర్మాధికరణమ్

### సూ: 3.4.32 విహితత్వాచ్చాశ్రమకర్మాపి

**సంశయం:**

విద్యాప్రాప్తికి జ్ఞానార్జనకు కర్మలు సాధనాలైన పక్షంలో విద్య యొక్క అపేక్ష లేనివారు, ఆశ్రమధర్మాలలో విధించిన కర్మలను అనుష్ఠించాలా? అనుష్ఠించనవసరం లేదా అనే సందేహం కలుగుతున్నది. జ్ఞానార్జనతో ఎటువంటి మోక్ష కాంక్ష లేనివాళ్లకు నిత్యకర్మల అనుష్ఠేయం అవసరం ఉండకూడదు, కారణం ఈ కర్మలు అనిత్య కర్మలుగా, ప్రయోజన రహితములే అవుతాయి కదా!

**సమాధానం:**

మోక్ష కాంక్ష ఉన్నా లేకపోయినా, ఏ ఆశ్రమవాసికైనా (ఏ ఆశ్రమ వ్యవస్థలో ఉన్నా) నిత్యకర్మలు కర్తవ్యములే అవుతాయి. *"యావజ్జీవ మగ్నిహోత్రం జుహోతి"* ఇత్యాది వాక్యాలు, నిత్యకర్మలను అనుసరిస్తూ ఉండాలనే బోధిస్తున్నవి.

### సూ: 3.4.33 సహకారిత్వేన చ

జ్ఞానము విధిరూపమైనది కాదు. ఎవరు విద్య యొక్క ప్రయోజనాన్ని గుర్తిస్తారో వారే దాని సాధన చేస్తారు. స్వర్గఫలం దర్శపూర్ణమాస ఇష్టి ద్వారా పొందాలని ఇచ్ఛ ఉన్నవారు ప్రయాజాది కర్మలు చేస్తారు. అయితే, విద్య విషయంలో సహకరించే అంగంగా ఏ కర్మలూ లేవు. కేవలం జ్ఞాన సాధనమే నిర్దేశింపబడింది. జ్ఞానోత్పత్తికి ఆశ్రమ విహిత కర్మలు సాధనములుగా ఉపయోగిస్తాయి అని చెప్పిన దానిని, విద్యకు అది అంగమని, సహకారి అని అర్థం చేసుకోకూడదు. అగ్నిహోత్రాది కర్మలలో ఆచరించే వ్యక్తికి, ఆ కర్మకు ఉండే సంబంధం నిత్యమైనది. కాని దాని ఫలం విద్య కానే కాదు, ఇహ–పర భోగాల ఆకాంక్ష. *"తమేతం వేదాను వచనేన"* అనే ముందు ఉదహరించిన శ్రుతివాక్యంలో బోధింపబడినది, నాశరహితమైన ఆత్మను తెలుసు కోవాలనే ఇచ్ఛ. జ్ఞానాన్ని ఆకాంక్షించే ముముక్షువులు ఏషణత్రయాలను వదులుకున్న వారు కావాలి.

### సూ: 3.4.34 సర్వథాపి త ఏవోభయలింగాత్

శ్రుతివాక్యాలు, స్మస్మృతివాక్యాలు కూడ అగ్నిహోత్రాది నిత్యకర్మలు అనుష్ఠింప దగినవనే సూచిస్తున్నవి. ఆశ్రమధర్మానికి సంబంధించిన కర్మఫలం వేరు, నిత్యకర్మల యొక్క ఫలం వేరని, వేరు వేరుగా ఎక్కడా ప్రస్తావింపబడలేదు. యాజ్ఞిక కర్మలలోనే నిత్యకర్మకు వేరైన అగ్నిహోత్రకర్మ *"మాసమగ్ని హోత్రం జుహ్వతి"* అని విశిష్టకర్మ చెప్పబడింది.

*"అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః"* అనే గీతా శ్లోకం (భ.గీ 6.1) కర్మఫలాన్ని ఆశించకుండా కర్తవ్యకర్మలను ఆచరించేవాడే నిజమైన సన్యాసి, యోగి అని బోధిస్తున్నది.

### సూ: 3.4.35 అనభిభవం చ దర్శయతి

బ్రహ్మచర్యం వల్ల రాగద్వేషాలకు అతీతుడౌతాడని శ్రుతి ఇలా విన్పిస్తున్నది: *"ఏష హ్యాత్మా న నశ్యతి యం బ్రహ్మచర్యేణానువిందతే"* (బ్రహ్మచర్యంతో తమ ఆత్మస్వరూపం తెలుసుకున్నవారు బ్రహ్మలోక ప్రాప్తితో నాశరహితమైన పారమార్థిక ఆత్మస్వరూపమును పొందుతారు – ఛా.ఉ 8.5.3).

ఈ విధంగా వేదవిహిత నిత్యకర్మానుష్ఠానము చేత శుద్ధాంతఃకరణతో ఫలాపేక్ష లేకపోవుట చేత పరమాత్మను తెలుసుకునే ఇచ్ఛతోనే ఉంటారని ముందు ఉదహరించిన శ్రుతి వాక్యం *"తమేత వేదాను వచనేన బ్రాహ్మణా వివిదిషంతి"*

(బృ.ఉ 4.4.22) విశదీకరిస్తున్నదని గ్రహించవచ్చు.

## 9. విధురాధికరణమ్

## సూ: 3.4.36 అంతరా చాపి తు తద్దృష్టేః

**సంశయం:**

ఆశ్రమవ్యవస్థలో దేనికీ చెందని భార్యా వియోగం చెందినవారు (విధురులు), ద్రవ్యాది సంపదలు లేనివారు ఉంటారు. వారు విద్యాప్రాప్తికి అర్హులా? అర్హులు కారా అనే సంశయం కలుగుతున్నది.

**సమాధానం:**

గృహస్థులు, వానప్రస్థులు ఇత్యాది ఆశ్రమవ్యవస్థకు చెందని మధ్యస్థితిలో ఉన్నవారికి కూడా విద్యాధికారం ఉంది. ఉపనిషత్తులో రైక్వుడు విధురుడైన గొప్పజ్ఞాని బ్రహ్మవేత్త అని చెప్పబడింది. అతని వృత్తాంతము ఛాందోగ్యంలో జానశ్రుతికి ఉపదేశించిన సంవర్గ విద్యలో వినిపిస్తుంది. అలాగే వాచక్నవి అనేవాని గురించి కూడ శ్రుతిలో చెప్పబడింది.

## సూ: 3.4.37 అపి చ స్మర్యతే

భారతంలో సంవర్తుడనే మహాయోగి నగ్నంగా తిరిగేవాడనే ప్రస్తావన ఉంది. ఇతడు ఏ ఆశ్రమధర్మానికి చెందకపోయినా మహాయోగి, జ్ఞానసాధకుడు అని చెప్పబడింది.

## సూ: 3.4.38 విశేషానుగ్రహశ్చ

రైక్వుడు ఇత్యాది వ్యక్తులు విద్యావేత్తలు ఎలా అయేరో, వారికి జ్ఞానసిద్ధి ఎలా కలిగిందో ఇప్పుడు ప్రస్తావిస్తున్నారు.

విద్యా సాధన ఏకాగ్రత, చిత్తశుద్ధితో నియమంగా ఉపవాసాదులు, జపము, దేవతారాధన చేసిన ప్రతీవ్యక్తి సాధించవచ్చునని గ్రహించవచ్చు. మనుస్మస్మృతి జప సాధనతో విద్యాప్రాప్తి సిద్ధిస్తుందని తెలియజేస్తున్నది (మ.స్మస్మృ 2.8.7). అలాగే భగవద్గీత *“అనేక జన్మ సంసిద్ధః తతో యాంతి పరాంగతిమ్”* అని బోధిస్తున్నది (కర్మయోగి అనేక జన్మల సంస్కారమువల్ల ఈ జన్మలో పాపరహితుడై బ్రహ్మసంస్థను పొందుతాడు – భ.గీ. 6.45). జ్ఞానసాధనకు ప్రతిషేధము ఏదీ లేదు. అందువల్ల ముముక్షువు, శ్రవణ ధ్యానాదులతో విద్యా సాధన చేసి బ్రహ్మవేత్త అవడానికి ఏ ప్రతిరోధమూ ఉండదు.

## సూ: 3.4.39 అతస్త్వితరజ్జ్యాయో లింగాచ్చ

(అతః+ఇతరత్+జ్యాయః లింగాచ్చ)

ఏ ఆశ్రమవ్యవస్థకు చెందకుండా మధ్యలో ఉండే కన్నా ఏదో ఒక ఆశ్రమ ధర్మాన్ని స్వీకరిస్తే దాని వల్ల మంచి విద్యా ప్రాప్తి ఉంటుందని శ్రుతి, స్మస్మృతి వాక్యాలు సూచిస్తున్నవి. *“తేన ఏతి బ్రహ్మవిత్ పుణ్యకృత్ తేజసశ్చ”* (పుణ్యం చేసిన బ్రహ్మవేత్త శుద్ధసత్త్వం గలవాడై బ్రహ్మసంస్థను పొందుతాడు – బృ.ఉ 4.4.9).

*“అనాశ్రమీ న తిష్ఠేత దినమేకమపి ద్విజః”* (ఒక రోజు కూడా ద్విజుడు అనాశ్రమిగా ఉండకూడదు). *“సంవత్సరమనాశ్రమీ స్థిత్వా కృచ్ఛ్రమేకం చరేత్”* (అనాశ్రమిగా ఉన్నవాడు సంవత్సరకాలం కృచ్ఛ్రవ్రతం చేసుకోవాలి).

## 10. తద్భూతాధికరణమ్

### సూ: 3.4.40 తద్భూతస్య తు నాతద్భావో జైమినేరపి నియమాతద్రూపాభావేభ్యః

సన్యాసాశ్రమ స్వీకారం చేసిన ఊర్ధ్వరేతస్కులకు ఆశ్రమవ్యవస్థలో ప్రత్యేక స్థానం ఉందని స్థాపించటమైనది. అందులో సందేహములేదు. అయితే ఊర్ధ్వరేతస్కు లైన సన్యాసాశ్రమవాసులు ఏ కారణం చేతనైనా మళ్లీ గృహస్థులుగా మారి కుటుంబ వ్యవస్థలోకి వస్తే, వారికి విద్యాఫలము ఉత్తమగతి ఉంటుందా అనే సంశయం కలుగుతున్నది.

**సమాధానం:**

సన్యాసాశ్రమం నుండి ప్రచ్యుతుడై తిరిగి గృహస్థుడైనవానికి ఏవిధమైన విద్యాఫలప్రాప్తి లభించదు. *"అత్యంతమాత్మానమాచార్యకులేఽవసాదయన్"* (ఛా.ఉ 2.23.1) అనే శ్రుతి వాక్యం, అలాగే మరో వాక్యం *"అరణ్య మియాదితి పదం తతో న పునరేయాదిత్యుపనిషత్"* (పరివ్రజించిన తరవాత తిరిగి రాకూడదనే ఉపనిషదు పదేశము) *"ఆచార్యేణాభ్యనుజ్ఞాతః చతుర్ణాం ఏకమాశ్రమమ్, ఆవిమోక్షాచ్ఛరీరస్య సోఽను తిష్ఠేద్యథావిధి"* (గురువు యొక్క అనుమతి పొంది నాలుగు ఆశ్రమాలలో ఒక దానిని స్వీకరించి మరణపర్యంతం శాస్త్రంలో విధించినప్రకారము అనుష్ఠించాలి). ఇట్టి నియమాలకు కట్టుబడి ఉండటమే సన్యాసాశ్రమ ధర్మము. భగవద్గీత కూడా ఇదే ఉపదేశిస్తున్నది. *"శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్ స్వధర్మే నిధనం శ్రేయః"* (బాగుగా ఆచరించిన పరధర్మం కన్నా సరిగ్గా ఆచరించకపోయినా స్వధర్మమే ఉత్తమమైనది. స్వధర్మాచరణతో మరణించటమే శ్రేయస్కరము –భ.గీ 3.35).

శాస్త్రోక్తమైన నియమాలు పాటించటమే ధర్మం ఈ విషయంలో జైమిన్యా చార్యుల వారికి, సూత్రకారులైన బాదరాయణుల వారికి ఏకాభిప్రాయం ఉందని సూత్రంలోని 'జైమినేరపి' అనే పదం స్పష్టం చేస్తున్నది.

## 11. అధికారికాధికరణమ్

### సూ: 3.4.41 న చాధికారికమపి పతనానుమానాత్తదయోగాత్

**సంశయం:**

నైష్ఠికబ్రహ్మచారి (బృహన్ బ్రహ్మచారి) ఆజన్మాంతం బ్రహ్మచారిగా ఉంటా ననే శపథం పట్టినవాడు, వ్రతభంగనానికి ప్రాయశ్చిత్తం చేసుకుంటే విద్యాఫలం దక్కుతుందా?

**సమాధానం:**

నైష్ఠిక బ్రహ్మచారి, వ్యభిచరిస్తే ప్రాయశ్చిత్తం లేదు. జైమిన్యాచార్యులవారి అభిప్రాయం పూర్వమీమాంసలో (జై.సూ. 6.8.11) ఇలా ఉంది: *"ఆరూఢో నైష్ఠికం ధర్మం యస్తు ప్రచ్యవతే పునః, ప్రాయశ్చిత్తం న పశ్యామి యేన శుధ్యేత్స ఆత్మహా"* (నైష్ఠిక ధర్మాన్ని స్వీకరించి, చ్యుతుడైన వాడు ఆత్మఘాతకుడు. వానికి ప్రాయశ్చిత్తము లేదు).

గృహస్థాశ్రమం ఇంకా స్వీకరించని ఆచార్యకులంలో విద్యనభ్యసిస్తున్న బ్రహ్మచారి పొరపాటున నియమాన్ని అతిక్రమిస్తే, వానికే గార్ధభాన్ని యజ్ఞపశువుగా చేసి, ఆలంభనం చేసే ప్రాయశ్చిత్త కర్మ సూచింపబడింది: *"బ్రహ్మచర్య వికీర్ణీ నైరృతం గార్ధభమాలభేత"* . ఈ సంస్కారక్రియ నైష్ఠికి బ్రహ్మచారులకు వర్తించదు.

### సూ: 3.4.42 ఉపపూర్వ మపి త్వేకే భావమశనవత్తదుక్తమ్

కొందరు శిష్టులు మాత్రం బ్రహ్మచారుల విషయంలో గురుభార్యా సంపర్కం ఇత్యాది ఐదు నియమాతిక్రమాలే మహాపాతకాలని శాస్త్రం చెప్తున్నది, మిగతావన్నీ ఉపపాతకాలే (అన్నపానీయాలలో వ్రత భంగంలాగ) అని భావిస్తారు. ధర్మశాస్త్రం బ్రహ్మచర్య వికీర్ణీ అని సామాన్యంగా చెప్తున్నది కాని నైష్ఠిక బ్రహ్మచారా ఇతర విధమైన బ్రహ్మచారా అని స్పష్టంగా లేని కారణంగా ప్రాయశ్చిత్త సంస్కారం అంగీకరించ వచ్చునని అభిప్రాయపడుతున్నారు. దీనిని భగవత్పాదులవారు అంగీకరించలేదు.

(స్మస్మృతి బ్రహ్మచారులలో నాలుగు అవాంతర భేదాలను కల్పిస్తున్నది: 1. గాయత్రుడు, 2. బ్రాహ్మడు, 3. ప్రాజాపత్యుడు, 4. బృహన్ లేక నైష్ఠికుడు).

## 12. బహిరధికరణమ్

### సూ: 3.4.43 బహిస్తూభయథాపి స్మృతేరాచారాచ్చ

ఊర్ధ్వరేతస్కులు తమ సన్యాసాశ్రమం నుండి పతితులవడం మహాపాతక మైనా, ఉపపాతకమైనా, శిష్టులు వారిని వెలి వెయ్యాలి. అలాంటి భ్రష్టులను, యజ్ఞ అధ్యయనాది క్రియలకు కాని, వివాహాది కార్యములకు కాని ఆహ్వానించకూడదు. వారిని బహిష్కరించాలి. వారికి ప్రాయశ్చిత్తము లేదు.

# 13. స్వామ్యధికరణమ్

## సూ: 3.4.44 స్వామినః ఫలశ్రుతేరిత్యాత్రేయః

ఇక్కడ ప్రసంగవశం చేత క్రత్వంగాలకు సంబంధించిన ఉపాసనల యొక్క ఫలితం గురించి చెప్పబడుతున్నది.

క్రత్వంగాలకు సంబంధించిన ఉపాసనాదులు యజమాని చెయ్యాలా లేక యజ్ఞాన్ని నిర్వహించే ఋత్విక్కులు చెయ్యాలా? ఎవరికి వాటి ఫలితం లభిస్తుందనే సంశయం కలుగుతున్నది.

**సమాధానం:**

ఆత్రేయుడనే ఋషి అంగోపాసనలలో కర్తృత్వం యజమానిదనే నిశ్చయిస్తు న్నాడు. శ్రుతివాక్యాలు ఇలా విన్నిస్తున్నవి: *"వర్షతి హాస్మై వర్షయతి హ య ఏతదేవం విద్వాన్ వృష్టౌ పంచవిధం సామోపాసీత"* (పంచవిధ సామయందు వృష్టిని ధ్యానం చేసినవాడు వర్షిస్తాడు, వాని కొరకు వర్షింపజేస్తాడు – ఛా.ఉ 2.3.2). అలాగే *"వర్షతి అస్మై య ఉపాస్తే"* (ఎవరు ఉపాసిస్తారో వాని కోసం వర్షిస్తుంది). మరో శ్రుతి *"ఆత్మనే వా యజమానాయ వా యం కామం కామయతే తమాగాయతి"* (బృ.ఉ 1.3.28). అందువల్ల, యజమానికే ఫలితం లభిస్తుంది.

## సూ: 3.4.45 ఆర్త్విజ్యమిత్యౌడులోమిస్తస్మై హి పరిక్రీయతే

ఔడులోమి కర్మాంగోపాసనలు ఋత్విక్కు చెయ్యవలసినవనే భావిస్తున్నాడు. సాంగమైన కర్మ చెయ్యటానికి యజమాని, ఋత్విక్కుని నియమించి అతనికి ధనం ఇస్తాడు. అయితే ఫలం క్రత్వధికారికి మాత్రమే చెందుతుంది. ఋత్విక్కు పరుని కొరకే కర్మ చేస్తాడు కాబట్టి వానికి ఫలసంబంధం ఉండదు.

## సూ: 3.4.46 శ్రుతేశ్చ

*"యాం వై కాంచన యజ్ఞే ఋత్విజ ఆశిషమాశాసత ఇతి యజమానాయైవ తమాశాసత ఇతి హోవాచ"* ...తస్మాదు హైవం విదుద్గాతా బ్రూయాత్ కం తే కామం ఆగాయాని" (యజ్ఞంలో ఏ కోరికను కోరినా అది యజమాని కోరికే అవుతుంది. అందువల్ల ఉద్గాత యజమానిని మీ కోరిక ఏదో చెప్పండి, దానిని సామగానం ద్వారా సాధిస్తాను అని అడుగుతాడు – ఛా.ఉ 1.7.8, 1.7.9). అంగోపాసనలు ఋత్విక్కులు చేసినా, వాటి ఫలం యజమానికే ప్రాప్తిస్తుందని శ్రుతివాక్యాలు నిర్ధారిస్తున్నాయి.

## 14. సహకార్యంతరవిధ్యధికరణమ్

### సూ: 3.4.47 సహకార్యంతరవిధిః పక్షేణ తృతీయం తద్వతో విధ్యాదివత్

ఇప్పుడు సన్యాసాశ్రమానికి సంబంధించిన ధర్మం విచారించబడుతున్నది.

**సంశయం:**

బృహదారణ్యకంలో శ్రుతి ఇలా విన్పిస్తున్నది: *“తస్మాత్ బ్రాహ్మణః పాండిత్యం నిర్విద్య బాల్యేన తిష్ఠాసేత్ బాల్యంచ పాండిత్యంచ నిర్విద్య అథ మునిః అమౌనంచ, మౌనంచ నిర్విద్య అథ బ్రాహ్మణః”* (ఆత్మజ్ఞానంతో పూర్వం బ్రహ్మవేత్తలుసన్యాసాశ్రమం స్వీకరించి భిక్షాచర్యం చేసేవారు. అలాగే ఇప్పుడూ చిత్తశుద్ధితోను, జ్ఞానసాధనతో నిశ్శేషంగా ఆత్మను తెలుసుకొని శ్రవణ మననాదుల యొక్క బలం సంపాదించి, ఆ తరవాత శ్రవణ మనన నిదిధ్యాసలతో బ్రహ్మసాక్షాత్కారం పొందగలడు –బృ.ఉ 3.5.1).

ఊర్ధ్వరేతస్కులకు ఈ శ్రుతిలో మౌనం విధించబడుతున్నాదా లేదా అనే సందేహం కలుగుతున్నది.

**సమాధానం:**

*“మననాత్ మునిః”* అందువల్ల మునిశబ్దానికి జ్ఞానాతిశయం అని గ్రహించ వలసి ఉంటుంది. భగవద్గీతలో *“మునీనామప్యహం వ్యాసః”* (మునులలో నేనే వ్యాసుణ్ణి) అని కృష్ణ భగవానుడు చెబుతున్నాడు. ప్రకరణ సందర్భంగా ఇక్కడ సన్యాసాశ్రమం స్వీకరించిన పరివ్రాజకుల యొక్క ధర్మం విచారించబడుతున్నది. *“ఆత్మానం విదిత్వా పుత్రాది ఏషణాభ్యో వ్యుత్థాయ అథ భిక్షాచర్యం చరంతి”* అని అదే మంత్రం ముందుభాగంలో వినబడుతున్నది (బృ.ఉ 3.5.1). *“అథ మునిః”* అనే ఈ శ్రుతిభాగం, విధిప్రధానం విధ్యంతం కాకపోయినా, మౌనం విధించబడుతు న్నట్లే గ్రహించాలి. దీనినే సూత్రంలో క్రతువుల్లో పాటించే విధానాన్ని సూచిస్తూ ‘విద్యాదివత్’ అని చెప్పడమైనది.

### సూ: 3.4.48 కృత్స్నభావాత్తు గృహిణోపసంహారః

పైన ఉదహరించిన బృహదారణ్యక శ్రుతిలో (బృ.ఉ 3.5.1) ఆత్మజ్ఞాన బలంతో సన్యాసాశ్రమ ప్రస్తావన ఉంటుండగా, ఛాందోగ్యశ్రుతిలో *“అభిసమావృత్య కుటుంబే”* అనే చోట గృహస్థునితో ఉపసంహారం ఎందుకు చేయబడింది? ఇక్కడ గృహస్థాశ్రమం కన్నా సన్యాసాశ్రమం గొప్పదని కనబడుతున్నది కదా?

గృహస్థాశ్రమం ఉత్తమమైనదని విశేషంగా ఛాందోగ్యశ్రుతిలో చెప్పబడు తున్నది. కారణం, ఇతర ఆశ్రమకర్మలు గృహస్థు పాటిస్తూ, ఆచారవ్యవహారాదుల్లో చాల సంయమనంతో ఉండడం భావ్యం. అందువల్ల గృహస్థాశ్రమవాసి (గృహమేధి)తో ఉపసంహారం చెయ్యటంలో వైరుధ్యం లేదు.

### సూ: 3.4.49 మౌనవదితరేషామప్యుపదేశాత్

సన్యాసము, గార్హస్థ్యమూ శ్రుతి సమ్మతాలైనట్లే వానప్రస్థ, ఆచార్య కులాశ్రమాలు (బ్రహ్మచర్యం) శ్రుతి సమ్మతాలే. నాలుగు ఆశ్రమాలలో ఉన్నవారిని సమాన గౌరవంతో (తుల్యభావంతో) ఆదరించాలనే శ్రుతులు బోధిస్తున్నవి.

# 15. అనావిష్కారాధికరణమ్

## సూ: 3.4.50 అనావిష్కుర్వన్నన్వయాత్

**సంశయం:**

ముందు అధికరణంలో మౌనశబ్దం జ్ఞానాతిశయాన్ని సూచిస్తుందని నిర్ణయించడమైనది. అదే శ్రుతిలో *"బాల్యేన తిష్ఠాసేత్"* అనే పదం కూడా ఇలా వినబడుతున్నది: *"తస్మాత్ బ్రాహ్మణః పాండిత్యం నిర్విద్య బాల్యేన తిష్ఠాసేత్"* (బృ.ఉ 3.5.1). *"బాల్యస్య భావః వా కర్మవా బాల్యమితి"* , అనే అర్థం చెప్పుకుంటే బాలుడిలా కట్టుబాట్లు నియమం లేకుండా, ఎలా ఇష్టమైతే అలా ప్రవర్తించటం అనే గ్రహించవలసి వస్తుంది. అప్పుడు, సన్యాసాశ్రమం స్వీకరించిన వారు స్వేచ్ఛగా తిరగడం, అన్న పానీయాలలోను మిగతా వ్యవహారం లోను, బాలుడిలా ప్రవర్తించవచ్చు అనే ఇక్కడ అన్వయించుకోవలసి వస్తుంది. అది యుక్తమా?

**సమాధానం:**

'బాల్య' శబ్దానికి ఎట్టి అడ్డంకులు లేకుండా స్వేచ్ఛగా ప్రవర్తించటం అనే అర్థం ఇక్కడ అన్వయించుకోవటం తగదు. సన్యాసాశ్రమం స్వీకరించిన యతులు ప్రధానంగా జ్ఞానసాధన దమ శమాది నియమాలతో చేసుకుంటూ ధర్మరక్షణ కోసం శ్రమించాలి. ఇది బాల భావంతో, బాల్య చేష్ఠలతో జరగదు. దంభం, దర్పం, స్వాభిమానం ఇత్యాది గుణాలు ఏవీ లేకుండా నిర్మలము, ప్రశాంతము అయిన మనస్సుతో వ్యవహరించటమే ఇక్కడ బాల్యభావన అనేపదాన్ని అన్వయించుకోవాలి. స్మస్మృతివాక్యాలు దీనినే నిర్ధారిస్తున్నవి: *"యం న సంతం, న చాసంతం, నాశ్రుతం న బహు శ్రుతమ్ న సువృత్తం, న దుర్వృత్తం వేద కశ్చిత్, స బ్రాహ్మణః"* (ఎవని విషయంలో మంచివాడని గాని, చెడ్డవాడని గాని, విద్యఉన్నవాడని గాని, విద్యలేని వాడని గాని, సన్మార్గుడని గాని, దుర్మార్గుడని గాని, ప్రకటితము కాదో అతనే బ్రహ్మమును తెలుసుకున్నవాడు). "గూఢ ధర్మాశితో విద్వానజ్ఞాతచరితం చరేత్, అంధవత్ జడవచ్చాపి మూకవచ్చ మహీం చరేత్" (శ్రేష్ఠమైన ధర్మాన్ని ఆచరించి విద్వాంసుడై ఎవరికీ తెలియని విధంగా ప్రవర్తించాలి. అంధుడు, మూగవాడు వ్యవహరించినట్లు తనపనిలో తాను నిమగ్నుడై భూమి మీద సంచరించాలి). అందువల్ల పరివ్రాజకుడు మౌనాది గుణాలే కాదు, అహంకార రహితమైన నిర్మల చిత్తాన్ని ప్రదర్శిస్తూ నడచుకోవాలనే ఈ శ్రుతి, స్మస్మృతివాక్యాలు స్పష్టం చేస్తున్నవి.

# 16. ఐహికాధికరణమ్

## సూ: 3.4.51 ఐహికమప్యప్రస్తుతప్రతిబంధే తద్దర్శనాత్

**సంశయం:**

సర్వాపేక్షాధికరణంలో ప్రతిపాదించిన *"సర్వాపేక్షా చ యజ్ఞాదిశ్రుతే రశ్వ వత్"* (బ్ర.సూ 3.4.26) అనే సూత్రం మొదలుకొని ఇంతవరకు ఆత్మజ్ఞానం పొందాలనే ఇచ్ఛ ఉన్నవారు వేదాధ్యయనం, తపోదాన మనన ధ్యానాది సాధనాలతో దానిని సాధించగలరని సూచించడమైంది. అయితే, ఆత్మజ్ఞానం ఈ జన్మలోనే లభిస్తుందా లేక మరో జన్మలో లభిస్తుందా అనే సంశయం కలుగుతున్నది. శ్రవణ–మనన ధ్యానాది సాధన, ఈ జన్మలోనే బహుశ్రమతో చేయవలసిన పని. అందువల్ల విద్యోత్పత్తి ఈ జన్మలోనే కలిగి దాని ఫలితం కూడా లభించాలి కదా?

**సమాధానం:**

ఈ జన్మలోనే విద్యోత్పత్తి (జ్ఞానోదయం) జరుగుతుంది. పూర్వజన్మలోని ఏదైనా కర్మశేషం వలన విద్యాసాధనకు ఏ అవరోధాలు లేకపోతే, ఈ జన్మలోనే విద్యోత్పత్తి కలిగి ఆత్మజ్ఞానం సిద్ధించాలి. కర్మాంతరం చేత ప్రతిబంధం వస్తే మరో జన్మలో జ్ఞానోత్పత్తి కలుగుతుంది. ఏ కర్మకు ఎప్పుడు, ఫలసిద్ధి కలుగుతుందో నిర్దిష్టంగా చెప్పబడదు. శాస్త్రం, ఇప్పుడు ఇక్కడ ఈ వ్యవధిలో కర్మఫలం పొంద బడుతుందని దేశకాల నిమిత్తాలను నిర్ణయించదు. కర్మఫలం, జ్ఞానఫలం ఉంటుందనే బోధిస్తుంది.

సాధన సామర్థ్యం వలన ఒక అతీంద్రియమైన శక్తి కర్మఫలితంగా ఆవిర్భవిస్తుంది. అయితే, ఇతరకర్మల అవిరోధం లేకపోతే వెంటనే ఫలం అనుభవ యోగ్య మౌతుంది. మరొక కర్మ యొక్క ఫలితంగా అవరోధం సంభవిస్తే, విద్యోత్పత్తి, తత్ ఫలం మరో జన్మవరకు ఆగవచ్చు.

ఇచ్ఛకు ప్రతిబంధమేమీ లేదు. శ్రవణాదుల ద్వారా విద్యోత్పత్తి కలగాలంటే ప్రతిబంధాలన్నీ తొలగిపోవాలి. కఠోపనిషత్తులో మృత్యుదేవత ఆత్మబోధ చేసేముందు నచికేతునితో అన్నటువంటి మాటలు శ్రుతిలో ఇలా ఉన్నవి: *"శ్రవణాయాపి బహుభిః యో న లభ్యః, శృణ్వంతోఽపి బహవో యం న విద్యుః । ఆశ్చర్యోఽస్య వక్తా కుశలోఽస్య లబ్ధా ఆశ్చర్యో జ్ఞాతా కుశలానుశిష్టః"* (లోకంలో చాలా మందికి ఆత్మ గురించి వినే అవకాశముండదు. విన్నా దాని తత్త్వాన్ని తెలుసుకోలేరు. ఆత్మ గురించి బోధించే వారు చాల అరుదుగా ఉంటారు. కుశలుడైన ఆచార్యుని వద్ద నేర్చుకొన్నవారు గ్రహించేవారు చాలా అరుదుగా కనబడతారు – క.ఉ 2.7).

వామదేవుడు తల్లి గర్భంలో ఉంటుండగానే బ్రహ్మభావం పొందినట్లు (బ్రహ్మజ్ఞాని అయినట్లు) శ్రుతి వల్ల తెలుస్తున్నది. అలాగే భగవద్గీతలోని ఉపదేశం కూడ బోధిస్తున్నది: *"అప్రాప్య యోగ సంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి"* (కృష్ణా! భగవత్ సాక్షాత్కారము పొందకుండానే మరణించిన సాధకునికి గతి ఏది? - భ.గీ 6.37) అని అర్జునుడి అడిగిన ప్రశ్నకు కృష్ణ భగవానుడు ఇలా సమాధానమిచ్చేదు: *"పార్థ నైవేహ నాముత్ర వినాశస్తస్య విద్యతే న హి కల్యాణకృత్ కశ్చిత్ దుర్గతిం తాత గచ్ఛతి"* (పార్థా! ఆత్మదర్శనం చేసుకోవాలనుకునే సాధకునికి ఈ లోకంలో కాని పరలోకంలోకాని దుర్గతి ఉండదు – భ.గీ. 6.40)

*"తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదేహికమ్"* (పూర్వదేహంలో సాధించిన బుద్ధి సంయోగం పొందుతాడు – భ.గీ. 6.43). "అనేక జన్మ సంసిద్ధః తతో యాతి పరాం గతిమ్" (అనేక జన్మల సంస్కార ప్రభావమువల్ల ఈ జన్మలోనే సిద్ధిని పొంది, వెంటనే పరమ పదాన్ని పొందుతాడు – భ.గీ. 6.45). అందువల్ల మోక్షప్రాప్తి అనే ఆత్మజ్ఞాన ఫలం ఈ జన్మలో లభిస్తుందా వచ్చే జన్మలో లభిస్తుందా అనేది ప్రతిబంధ క్షయాన్ని బట్టి ఉంటుందని గ్రహించాలి.

## 17. ముక్తిఫలాధికరణమ్

## సూ: 3.4.52 ఏవం ముక్తిఫలానియమస్తదవస్థావధృతేస్తదవస్థావధృతేః

**సంశయం:**

ముముక్షువులు చేపట్టిన జ్ఞానసాధన యొక్క సామర్థ్యం వల్ల ఈ జన్మలో గాని, పరజన్మలో గాని దాని ఫలం పొందవచ్చునని గత అధికరణంలో చెప్పడమైంది. అయితే, ముక్తిఫలం (మోక్షం) విషయంలో కూడా ఈ విధమైన విశేష ప్రతినియమం ఏమైనా ఉంటుందా అనే సందేహం కలుగుతున్నది.

**సమాధానం:**

ముక్తిఫలం – బ్రహ్మప్రాప్తి, జన్మరాహిత్యమే కదా! బ్రహ్మకు అనేక ఆకారాలు లేవు. బ్రహ్మ పదార్థం ఒక్కటే. దీనినే ఉపనిషద్వాక్యాలు ఇలా బోధిస్తున్నవి: *"అస్థూల మనణు"* (బృ.ఉ 3.8.8), *"స ఏష నేతినేతి ఆత్మా"* (బృ.ఉ 3.9.26), *"యత్ర నాన్యత్ పశ్యతి"* (ఛా.ఉ 7.24.1), *"బహ్మైవ ఇదమమృతం పురస్తాత్"* (ము.ఉ 2.2.11), *"ఇదం సర్వం యదయమాత్మా"* (బృ.ఉ 2.4.6), *"స వా ఏష మహానజ ఆత్మాఽజరో ఽమరోఽమృతోఽభయో బ్రహ్మ"* (బృ.ఉ 4.4.25), *"యత్రతు అస్య సర్వ మాత్మైవాభూత్ తత్ కేన కం పశ్యేత్"* (బృ.ఉ 4.5.15).

ఉపాసన విద్యలు, వాటి సాధనాలు ఎన్నో ఉండబట్టి వాటి ఫలంలో కూడా భేదం ఉండవచ్చు. కాని జ్ఞానంతో సాధించింది బంధవిముక్తి, కాబట్టి ఫలం మోక్ష ప్రాప్తమొక్కటే. *"మనోమయః ప్రాణశరీరః"* ఇత్యాది సగుణ బ్రహ్మోపాసనలలో నైతే *"తం యథా యథోపాసతే తదేవ భవతి"* (దానిని ఏయే విధంగా ఉపాసిస్తే అదే వారికి లభ్యమవుతుంది). నిర్గుణబ్రహ్మ కేవలం జ్ఞానసాధనతో పొందబడుతుంది. అందువల్ల పరబ్రహ్మ సాక్షాత్కారంలో ఎక్కువ తక్కువ అనే ఫలభేదం ఉండదు. ఆత్మ దర్శనంతో ముముక్షువులు కోరేది బంధవిముక్తి, జన్మరాహిత్యము. అదే అమృతత్వం; అది ఆత్మజ్ఞానంతోనే సాధించబడుతుంది.

సూత్రంలో *"తదవస్థావధృతేః"* అనే ద్విరుక్తి అధ్యాయ సమాప్తిని సూచిస్తున్నది.

# 4.

# ఫలాధ్యాయము : ప్రథమపాదము



నాల్గవ అధ్యాయ ప్రథమపాదంలో జ్ఞానసాధన వల్ల ఉపాసనావిద్యల వల్ల వచ్చే ఫలం ఏ విధంగా సమకూరుతుందో చర్చించబడింది. ఫల ప్రాప్తితో ముడిపడి ఉన్న అర్చిరాది మార్గాలలో సాధకుని బ్రహ్మలోక గమనము, పుణ్య–పాప కర్మల ప్రక్షాళనతో అట్టి వానికి జీవన్ముక్తి ఏ విధంగా లభిస్తుందో కూడా సూచింపబడింది.

## 1. ఆవృత్త్యధికరణమ్

## సూ: 4.1.1 ఆవృత్తిరసకృదుపదేశాత్

**పూర్వపక్షి:**

*"ఆత్మావా అరే! ద్రష్టవ్యః, శ్రోతవ్యో, మంతవ్యః నిదిధ్యాసితవ్యః"* (బృ.ఉ 4.5.6), *"తమేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత"* (బృ.ఉ 4.4.21), *"సోఽన్వేష్టవ్యః స విజ్ఞాసితవ్యః"* (ఛా.ఉ 8.7.1), ఇటువంటి బోధనలతో చెప్పిన ఆత్మతత్త్వ విషయాలను పునఃపునః మనన ధ్యానాదులతో ఆవృత్తి చేసుకోవాలా? లేక ఒక పర్యాయము దానిని గ్రహించి బుద్ధినుపయోగించి స్థిరీకరించుకుంటే సరిపోతుందా? యజ్ఞయాగాలేవీ పదేపదే చెయ్యనవసరం లేదు కదా! ప్రయాజాది హోమాలు కూడా ఒక పర్యాయం చేస్తే ఫలం లభ్యమవుతుందనే శ్రుతుల వలన తెలుస్తున్నది. వాటిని ఆవృత్తి చెయ్యాలని శాస్త్రంలో ఎక్కడా విధించినట్లు లేదు. అందువల్ల శ్రవణ మననాదులు ఉపాసనా విద్యలకు, జ్ఞాన ప్రాప్తికి పదే పదే ఆవృత్తి చెయ్యనవసరం లేదని తోస్తున్నది.

**సిద్ధాంతం:**

*"శ్రోతవ్యో, మంతవ్యో నిదిధ్యాసితవ్యః"* అని పలుమార్లు వక్కాణించి ఉప దేశించటం వలన, ఆత్మతత్త్వం బుద్ధిగ్రాహ్యమై, ఆత్మసాక్షాత్కారముతో బ్రహ్మజ్ఞానము కలుగునంత వరకు ధ్యానమననాదులు చేసుకుంటూనే ఉండాలి. ఆవృత్తి యొక్క పర్యవసానం ఆత్మ–బ్రహ్మసాక్షాత్కారమే. అందువల్ల ఒకమారు విని దాని మననం లేకుండా వదిలేస్తే దాని ఫలితం ఉండదు. యజ్ఞకర్మలో బియ్యం దంపి, పిండి చేసి పురోడాశంలాంటి పదార్థాలు చెయ్యాలంటే, బియ్యాన్ని పిండి అయే వరకు దంప వలసిందే. అలా మెత్తగా దంచిన తరువాత పురోడాశాదులు హోమం చెయ్యాలి కదా! అదే విధంగా ఆత్మతత్త్వం గురించి మనస్సుకు పట్టే వరకు మననం–ధ్యానం చేసుకోవాలి. ఎట్టి సేవా కార్యక్రమమైనా ఒక రోజుపని కాదు కదా! జీవితాంతం ఆ మనోభావన ఉంటేనే ఫలప్రాప్తి కలుగుతుందని తెలుసుకోవాలి.

వేద–ఉపాస్య అనే పదాలు సమానార్థంలో ప్రయోగింపబడతాయి. ఉదాహరణకు *"భాతి చ తపతి చ కీర్త్యా యశసా బ్రహ్మవర్చసేన య ఏవం వేద"* (ఛా.ఉ 3.18.3) అనే వాక్యంలో ఉన్న 'వేద' శబ్దం, *"మనో బ్రహ్మేత్యుపాసీత"* (ఛా.ఉ 3.18.1) అనే వాక్యంలో 'ఉపాసీత' అనే పదం ఒకే అర్థంలో ఉపయోగింపబడ్డాయి. విద్– ఉపాస్ ధాతువులను వేదాంత శ్రుతులలో పర్యాయపదాలుగా వాడినట్లు తెలుస్తున్నది.

## సూ: 4.1.2 లింగాచ్చ

ఉద్గీథోపాసన సందర్భంలో *"ఆదిత్య ఉద్గీథః"* (ఛా.ఉ 1.5.1) అనే శబ్దాన్ని ఒకమారు మననం–ధ్యానం చేయటం

వలన ఒక కుమారుడే కలుగుతాడు కాబట్టి *"రశ్మీంస్త్వం పర్యావర్తయాత్"* (ఛా.ఉ 1.5.2) కిరణాలను వేరు వేరుగా ధ్యానిస్తే బహుపుత్ర ప్రాప్తి కలుగుతుందని ఉపదేశించబడింది. లింగసూచకమైన ఈ శ్రుతి వచనాన్ని బట్టి కూడా ఆవృత్తి వలన ఎక్కువ ఫలం లభిస్తుందని గ్రహించవచ్చు.

సగుణోపాసనలో ప్రత్యయాల (మంత్ర శబ్దాల) ఆవృత్తి అవసరం ఉంటే ఉండవచ్చు కాని, నిర్గుణబ్రహ్మ, జ్ఞానార్జనతో పొందవలసిన ఫలం, అందువల్ల పునఃపునః నిత్యధ్యాన కర్మ చెయ్యవలసిన పని ఉండదని పూర్వపక్షి ఆక్షేపణ. అది తెలుసుకునే వారి ప్రజ్ఞ, మేధా శక్తిపై ఆధారపడి ఉంటుంది. సూక్ష్మగ్రాహి అయిన సాధకునికి 'తత్త్వమసి' అనే ఉపదేశం పలు దృష్టాంతాలతో మళ్లీ మళ్లీ చెప్పనక్కర లేకపోవొచ్చు. కాని, సామాన్య సాధకులకు, మనస్సుకు బాగా పట్టే వరకు వారు అహం భావం వదలి ఆత్మతత్త్వాన్ని, తత్ పదార్థ లక్షణాన్ని తెలుసుకునే వరకు ఆవృత్తి అనివార్యము.

వేద మంత్రాలు సాధకుడు శ్రద్ధగా మననం ఆవృత్తి చేస్తే కాని అవి బుద్ధిలో స్థిరంగా ఉండి, ఎలా ఉచ్చారణలో తప్పులు లేకుండా పఠింపబడవో, అలాగే జ్ఞానకర్మకు పదేపదే ధ్యాన మననాదులు అవసరం. అయితే, అది బుద్ధికుశలత, శ్రద్ధ అనే వాటిపై ఆధారపడి ఉంటుందనేది నిర్వివాదమనే అంగీకరించాలి.

నిర్గుణ బ్రహ్మతత్త్వం క్లిష్టమైనది, సూక్ష్మమైనది. *"సత్యం జ్ఞాన మనంతం"* అనే బ్రహ్మలక్షణాలను ఆకళించుకొని, 'తత్' పదార్థాన్ని 'త్వమ్' పదార్థంతో సమన్వయించుకొని 'తత్త్వమసి', 'ఏకమేవాద్వితీయం' అనే ఆచార్యుని బోధనను, స్థిరంగా బుద్ధిలో నిలబెట్టుకొనే శక్తి–సామర్థ్యాలున్న జ్ఞాన సాధకునికి, ఫలసిద్ధి శీఘ్రంగా రావొచ్చు. మేధావులకు సంశయాలు ఉండవు. వారికి గ్రహణశక్తి కూడా ఉంటుంది. కాబట్టి ప్రతిబంధకాలు నామ మాత్రంగానే ఉంటాయి. అటువంటి ధీమంతులకు ఆవృత్తి పునఃపునః అవసరం ఉండదు.

ఆవృత్తి అంటే తత్త్వమసి–తత్త్వమసి–తత్త్వమసి అనే వాక్యాలను పదేపదే ఉచ్చరించటం కాదు. ఆ వాక్యాలకు అతీతంగా ఉండే పరమాత్మ ధర్మాలను తనయొక్క ఆత్మధర్మాలతో సమన్వయించుకోటానికి ఉద్దేశింపబడినది. అదే జ్ఞాన సముపార్జన. ఈ విషయం తెలుసుకొని, బ్రహ్మపదార్థంపై చిత్తాన్ని లగ్నం చేసుకొని తత్ సాధనతో ఆత్మ దర్శనము చేసుకోవాలని ఏకైక లక్ష్యాన్ని పెట్టుకోవాలి. ఆత్మజ్ఞానమే బ్రహ్మజ్ఞానము. అందుకే నిశ్చల చిత్తంతో, మనన ధ్యానాదులతో ఆత్మాన్వేషణ చేసుకోవాలని నిర్దేశింప బడింది. నిరంతర ఆత్మాన్వేషణ ఫలరూపమే జ్ఞానప్రాప్తి. అట్టి జ్ఞానసిద్ధియే కైవల్యము.

## 2. ఆత్మత్వోపాసనాధికరణమ్

## సూ: 4.1.3 ఆత్మేతి తూపగచ్ఛంతి గ్రాహయంతి చ

నా కన్నా పరమాత్మ భిన్నమా లేక నేనూ–పరమాత్మ ఒకే పదార్థమా?అనే సందేహం సామాన్యంగా వస్తూంటుంది. దానినే ఇక్కడ చర్చించడమైనది. ప్రత్యగాత్మ –పరమాత్మ భిన్నము కావు. జీవేశ్వరుల ఏకత్వం అంగీకరించి స్వఆత్మనే పరమాత్మగా ఉపదేశించాలి, అదే శ్రుతులు గ్రహించమని బోధిస్తున్నాయని సూత్రార్థం.

**పూర్వపక్షి:**

నేను (అహం శబ్దం) పరమేశ్వరుడు (తత్ శబ్దం) ఒకటే ఎలా అవుతాయి? పరమాత్మ అన్యమైతేనే తత్ అనే శబ్ద ప్రయోగం కుదురుతుంది కదా? పరమాత్మ అపహత పాప్మాది గుణములుకల శుద్ధ స్వరూపము. జీవుడు పుణ్య పాపాలను కూడగట్టుకుని ఉన్నవాడు. ఈ ఇద్దరూ వేరు వేరు ధర్మాలు కలవారు. వారి ఏకత్వ దృష్టి ఎలా సాధ్యమవుతుంది? ఈశ్వరుడికి సంసారిత్వం–ప్రాపంచిక విషయాలపై వ్యామోహం ఉంటే ఈశ్వరుడే కాడు. పరమాత్మ అసంసారి. అందువల్ల *"అహం బ్రహ్మాస్మి"* అనే ధ్యాన మననాదుల కన్నా, *"మత్ స్వామీ ఈశ్వరః"* అనే ధ్యానం సమంజసమని తోస్తున్నది.

**సిద్ధాంతం:**

పరమాత్మ–ఆత్మ ఒకే ధర్మాలున్న సద్రూపములు. జీవేశ్వరులు అభిన్నమనే గ్రహించాలి. జాబాలోపనిషత్తులో శ్రుతి ఇలా వినబడుతున్నది: *"త్వం వా అహమస్మి భగవో దేవతేఽహం వై త్వమసి భగవో దేవతే"* (జా.ఉ 2.2.4). అలాగే *"తద్యోహం, సోఽసౌ, యోఽసౌ సోఽహమ్"* అని ఐతరేయారణ్యకంలో వినిపిస్తున్నది (ఐ.ఆ. 2.2.46). *"అహం బ్రహ్మాస్మి"* అనే మహావాక్యం బృహదారణ్యకంలో విన్పిస్తు న్నది (బృ.ఉ 1.4.10). అదే ఉపనిషత్తులో *"ఏష త ఆత్మా సర్వాంతరః, ఏష త ఆత్మా అంతర్యామీ అమృతః"* అని జీవుడులో అంతర్యామిగా ఉన్నది పరమాత్మ అని స్పష్టం చేస్తున్నవి. ఛాందోగ్యంలో *"తత్ సత్యం స ఆత్మా తత్త్వమసి"* ఆ సత్ పదార్థమే నీవు అని బోధింపబడింది.

ఇక్కడ ప్రతీక దృష్టి లేదు. సాలగ్రామం విష్ణుప్రతీకగా ఉపాసనకోసము నిర్దేశింపబడింది. ఆత్మజ్ఞాన సాధనకు జీవ–ఈశ్వర ఏకత్వదృష్టి మాత్రమే ప్రతిపాదింప బడింది. భేదదృష్టితో చూస్తే *"మృత్యోః స మృత్యుమాప్నోతి య ఇహ నానా ఇవ పశ్యతి"* (కఠ.ఉ 2.4.11) అనే శ్రుతిననుసరించి జన్మరాహిత్యమే సిద్ధించదు. ఇదే మరో శ్రుతిలో కూడా ఇలా వినబడుతున్నది: *"సర్వం తం పరాదాద్యో–న్యత్రాత్మనః సర్వం వేద"* (బృ.ఉ 4.5.7).

జీవుడు (చిన్మాత్రుడు) అవిద్యాప్రభావం వలన ఆత్మతత్త్వాన్ని తెలుసుకోలేని స్థితిలో ఉంటాడు, ఆత్మధర్మాలు అవగతం అయిన వెంటనే జ్ఞానప్రాప్తితో అవిద్య తొలగిపోయి బ్రహ్మసాక్షాత్కారమైనట్లే. అద్వితీయ భావన కలుగుతుంది. *"యత్ర తు అస్య సర్వ మాత్మైవాభూత్, తత్ కేన కం పశ్యేత్"* (బృ.ఉ 2.4.14), *"అత్ర పితాఽపితా భవతి", "వేదా అవేదాః"* ఇటువంటి శ్రుతులన్నీ ప్రబోధానంతరం సంసారి లక్షణాలు (మోహం – కోరికలు ఇత్యాదివి) పోయి, శరీరంపై అభిమానం నశిస్తుందని పలుకుతున్నాయి. అహం భావం (నాది–నావాళ్లు అనే మమకారం) పోయినప్పుడు, శరీరపతనానికి సముఖుడై ఆత్మ ఏకత్వ సిద్ధికి ఎదురు చూడడమే తప్ప మరో ధ్యాస ఉండదు.

### 3. ప్రతీకాధికరణమ్

## సూ: 4.1.4 న ప్రతీకే న హి సః

**పూర్వపక్షి:**

ఆధ్యాత్మ సంబంధమైన ధ్యానము నందు మనస్సును బ్రహ్మముగా ఆవలంబనము చేసుకోవాలని, అధిదేవతా విషయంలో ఆకాశాన్ని బ్రహ్మముగా భావించి ఉపాసించాలి అని చెప్పబడింది. అయితే, ఛాందోగ్యంలో *"ఆదిత్యో బ్రహ్మేతి ఆదేశః"* (ఛా.ఉ 3.19.1), *"స యో నామ బ్రహ్మేత్యుపాస్తే"* (ఛా.ఉ 7.1.5) అని ప్రతీకోపాసనల గురించి చెప్పబడింది. ప్రతీకోపాసనల విషయంలో ప్రతీకలను ఆత్మదృష్టితో ఉపాసించాలా అక్కరలేదా అనే సందేహం కలగుతున్నది. ప్రతీకోపాసనలు కూడా ఆత్మావలంబనంతో, అంటే ప్రతీక తన ఆత్మ అని భావించి ఉపాసించటమే యుక్తమని తోస్తున్నది. కారణం, ముందు బ్రహ్మమును ఆత్మపరంగానే గ్రహించి ధ్యాన మననాదులు చెయ్యమని చెప్పబడింది. శ్రుతులు కూడా *"అహం బ్రహ్మాస్మి"* అనే భావన రావాలని చెబుతున్నాయి. ప్రతీకలన్నీ బ్రహ్మ వికారస్వరూపములు, పరమేశ్వరుణ్ణి హృదయంలో నిలబెట్టుకోటానికి ఉపకరించే సాధనలే. అందువల్ల ప్రతీకను కూడా ఆత్మగానే భావించి ఉపాసన చెయ్యాలి అనే అనిపిస్తున్నది.

**సిద్ధాంతం:**

ఏ ప్రతీక కూడా ఆత్మగా గ్రహించబడదు. ప్రతీకలు నామ–రూపములతో స్వీకరించే వస్తువులు. వాటిని బ్రహ్మదృష్టితో ఆత్మాన్వయంతో గ్రహించటం కుదరదు. కర్తృత్వ – భోక్తృత్వాదులు లేనిది పరమాత్మ. అందువల్ల ప్రతీకలపై సంసారికి వర్తించే కర్తృత్వాది ధర్మాలను ఆరోపించటం కుదరదు. ఉపాసకునకు, ప్రతీకకు భేదం ఉంది కాబట్టి ప్రతీకను అహం అనే భావనతో గ్రహించబడదు.

# 4. బ్రహ్మదృష్ట్యధికరణమ్

## సూ: 4.1.5 బ్రహ్మదృష్టిరుత్కర్షాత్

**పూర్వపక్షి:**

*"ఆదిత్యోబ్రహ్మ", "ప్రాణో బ్రహ్మ", "విద్యుద్బ్రహ్మ"* ఇటువంటి శ్రుతివాక్యాలు ఆదిత్యుడే బ్రహ్మ, ప్రాణమే బ్రహ్మ, విద్యుత్తే బ్రహ్మ అని బ్రహ్మపరంగా సమానాధి కరణంలో, ఒకే విభక్తిలో చెబుతున్నవి. అంటే, అవే బ్రహ్మస్వరూపములు బ్రహ్మ వివర్తములు అనే బోధిస్తున్నవి. కాని అవి ప్రతీకలుగా (భిన్నములుగా) చెప్పబడలేదు. అయితే జగత్తులో కనబడే వన్నీ బ్రహ్మవికారములే కదా! మరి వేటిని బ్రహ్మదృష్టి నివేశించి తీసుకోవాలి, వేటిని బ్రహ్మదృష్టితో స్వీకరించకూడదు అనే సందేహం వస్తుంది. అదీకాక, బ్రహ్మను ఆదిత్యదృష్టితో గ్రహించాలా, ఆదిత్యుణ్ణి బ్రహ్మగా గ్రహించాలా అనే ప్రశ్న కూడా ఉత్పన్నమవుతుంది. ఆదిత్యాదులందు బ్రహ్మదృష్టి ఉపాసనకు కుదరదనే తోస్తున్నది.

**సిద్ధాంతం:**

ఆదిత్యాదులయందు అంత కంటె ఉత్కృష్టమైన బ్రహ్మమును అధ్యసించే ఉపాసన చెయ్యటం శ్రేయస్కరము. లౌకికన్యాయ దృష్ట్యా భృత్యుడైన క్షత్తాను (రథ చోదకుణ్ణి) రాజులా ఉన్నాడని ప్రశంసించటం యుక్తం కాని, రాజుని క్షత్తాలా ఉన్నాడు అనటం అమర్యాద కదా? అందువల్ల ఆదిత్యుణ్ణి బ్రహ్మగా ఆలంబనం చేసుకోవటం సమంజసం. మహద్రూపము, సర్వాధ్యక్షుడు అయిన పరబ్రహ్మను ఆదిత్యదృష్టితో గ్రహించటం చిన్నచూపే అవుతుంది. అదీకాక ముందుపేర్కొన్న శ్రుతిలో (గత అధికరణంలో) *"బ్రహ్మ ఇతి ఉపాసీత"* , *"బ్రహ్మ ఇతి ఆదేశః"* , *"బ్రహ్మ ఇతి ఉపాస్తే"* అని స్పష్టంగా బ్రహ్మ వలే అంటే బ్రహ్మ అనే భావనతో ప్రతీకలు మొదలగు వాటి విషయంలో చెప్పబడింది. ఈ అధికరణంలో ఉదహరించిన ఆదిత్యాదుల విషయంలో 'ఇతి' శబ్ద ప్రయోగం లేదు. వాక్యశేషంలో కూడా *"స య ఏతమేవం విద్వానాదిత్యం బ్రహ్మేపాస్తే"* (ఛా.ఉ 3.19.4), అలాగే *"యో వాచం బ్రహ్మేపాస్తే"* (ఛా.ఉ 7.2.2) ఇలా ఆదిత్యుని, వాక్‌ను ద్వితీయా విభక్తిలో కర్మస్థానంలో చెప్పడమైనది. అంటే ఆదిత్యునే ఉపాస్యముగా స్వీకరించి, ఆ తేజోమయమైన స్వరూపాన్నే ఉపాసించడం వలన ప్రతిఫలం సర్వాధ్యక్షుడైన పరమేశ్వరుని వలన లభిస్తుందని గ్రహించవలస. ఉంటుంది. ఈ విషయాన్ని మూడవ అధ్యాయంలో ముందు *"ఫలమత ఉపపత్తేః"* అనే సూత్రంలో (బ్ర.సూ 3.2.38) లో వివరించడమైనది.

# 5. ఆదిత్యాదిమత్యధికరణమ్

## సూ: 4.1.6 ఆదిత్యాదిమతయశ్చాంగ ఉపపత్తేః

**పూర్వపక్షి:**

ఛాందోగ్యోపనిషత్తులో సామవేదీయ ఉద్గీథ విద్యా ప్రస్తావన జరిగింది. అందు సామవేద అంగాలైన హింకార, ప్రస్తావ, ఉద్గీథ, ప్రతిహార, నిధనం, అనే ఐదు అంశాలతో సామవేద ఉపాసన చెయ్యాలని చెప్పబడింది. వేటిని ఏ అంశంతో ఉపాసించాలో సూచిస్తూ శ్రుతిలో ఇలా వినబడుతున్నది: *"య ఏవాసౌ తపతి తముద్గీథ ముపాసీత"* (తపిస్తున్న ఆదిత్యుణ్ణి ఉద్గీథంగా ఉపాసించాలి –ఛా.ఉ 1.3.1), *"లోకేషు పంచవిధం సామోపాసీత"* (పృథివీ, అగ్ని, అంతరిక్షం, ద్యు, ఆదిత్య లోకాల విషయంలో ఐదు అంశాలతో సామను ఉపాసించాలి – ఛా.ఉ 2.2.1), *"వాచి సప్తవిధగ్ం సామోపాసీత"* (వాక్కునందు పైన చెప్పిన ఐదు అంశాలకు మరో రెండు, ఆది–ఉపద్రవం అనేవి చేర్చి సామను ఉపాసించాలి – ఛా.ఉ 2.8.1), *"ఇయమేవ ఋక్ అగ్నిః సామ"* (ఈ పృథివీ యే ఋక్, అగ్నియే సామ – ఛా.ఉ 1.6.1). ఇలా అంగాలతో చెప్పిన ఉపాసన విధులలో ఆదిత్యాదులందు ఉద్గీథ దృష్టా, లేక ఉద్గీథాదులందు ఆదిత్య దృష్ట్యా, దేనిపై ఏది ఆలంబనం చేసి ఉపాసన చెయ్యాలి అనే సందేహం కలుగుతున్నది. అయితే, అంగములు ఆదిత్యాదులకు, పృథివ్యాదులకు లేవు; కాబట్టి వాటిపై ఉద్గీథాది అంగములను స్థిరీకరించి (నిలిపి) ఉపాసన చేయటం వలనే ఫలసిద్ధి కలుగుతుందని తోస్తున్నది.

**సిద్ధాంతం:**

ఇక్కడ ఉద్గీథాదులు సామ అంశములుగా చెప్పబడ్డాయి. కాబట్టి వాటికే ప్రాధాన్యతనిచ్చి ఉద్గీథాదులనే ఉపాస్యములుగా గ్రహించాలి.ఉద్గీథాదులు కర్మాంగాలు. ఆదిత్యాదులు బాహ్యపదార్థాలు. అందువలన, కర్మాంగాలయందే ఆదిత్యాది దృష్టితో ఉపాసన చెయ్యాలి. ఆదిత్యాది దేవతలు స్వతంత్రంగా ఫలాత్మకములు, కాబట్టి కర్మ రూపాలైన ఉద్గీథగానం మొదలగు అంశముల కన్నా వాటికి ఉత్కర్ (శ్రేష్ఠత)ఉంటుంది. అందుకే శ్రుతులలో ఆదిత్యాది ప్రాప్తికి వాటి స్వతంత్ర ఉపాసన ఫలితమిస్తుందని చెప్పబడింది. అయితే ఉపాసించదగినది ఉద్గీథమే అని చెప్పిన సందర్భంలో *"ఓమిత్యేతదక్షరం ఉద్గీథం ఉపాసీత"* (ఛా.ఉ 1.1.1) అని ప్రకరణంలో ఉపక్రమించి, తదనంతరం *"ఖలు ఏతస్య ఏవాక్షరస్య ఉపవ్యాఖ్యానం భవతి"* (ఛా.ఉ 1.1.10) అని ఉపసంహారం చెయ్యబడింది. ఇదే మంత్రంలో *"యదేవ విద్యయా కరోతి శ్రద్ధయా ఉపనిషదా తదేవ వీర్యవత్తరం భవతి"* అని కూడా స్పష్టం చెయ్యబడింది. అంటే, ఎవడు విద్యతోను, శ్రద్ధతోను ఉపాసన కర్మ చేస్తున్నాడో వానికి శ్రేష్ఠమైన ఫలసిద్ధి ఉంటుందని గ్రహించాలి. అందువల్ల, పరమాత్మ ప్రాప్తికి ఉద్గీథశబ్ద నిర్దేశమైన ఓంకారమును ఉపాసన చెయ్యవలసిందని బోధింపబడినట్లు తెలుసుకోవాలి.

ఇకపోతే పృథివ్యగ్నులు ఋక్–సామలని చెప్పటం, పృథివిని పవిత్రమైన ఋక్ గాను, అగ్నిని పవిత్రమైన సామగాను భావించాలి అని సూచించడానికే ఉద్దేశింపబడినట్లు అర్థం చేసుకోవాలి. అలాగే *"లోకేషు పంచవిధగ్ం సామోపాసీత"* అనే వాక్యం కూడా, ఉపాసన లోకాల గురించికాదు, సామోపాసన గురించి ఉద్దేశింప బడింది. అందువల్ల, సామ యొక్క పంచవిధాలైన హింకార, ప్రస్తావ, ఉద్గీథాదుల యందే, లోకాలను అధ్యసించి ఉపాసన చెయ్యవలెనని చెప్పడమైనది.

## 6. ఆసీనాధికరణమ్

### సూ: 4.1.7 ఆసీనః సంభవాత్

యజ్ఞ యాగాది కర్మలన్నీ కూర్చొనే చేస్తారు. అలాగే సమ్యగ్దర్శన విషయంలో కూడా ధ్యానం కూర్చొనే చేయబడుతుంది. ఉపాసనా సంబంధమైనది కేవలం మనస్సుకే పరిమితమైనది కాబట్టి, ఉపాసనలు ఏ అవస్థలోనైనా, అంటే నిలబడి గాని, పడుకొని గాని చేసుకోవచ్చునా? ఏమైనా నియమం ఉందా?

మనస్సులో జ్ఞానప్రవాహాన్ని నిర్విఘ్నంగా నడిపించటమే ఉపాసన. అందు వల్ల ఎటువంటి అడ్డంకులూ లేకుండా, ఆ ప్రవాహాన్ని మనస్సులో ప్రశాంతంగా ఉంచుకోవాలి. దేహానికి అలసట, నిద్రావేశము లేనప్పుడే అటువంటి ప్రశాంతత కుదురుతుంది. అందువల్ల ఉపాసన స్థిరంగా కూర్చొనే చెయ్యాలి.

### సూ: 4.1.8 ధ్యానాచ్చ

ధ్యానమంటే స్థిరబుద్ధితో ఒక విషయంపై దృష్టి లగ్నం చేసి, చంచలత్వం లేకుండా లక్ష్యం సాధించటమే కదా! ఎట్టి జపానికైనా స్థిరత్వం అనివార్యం. అందువల్ల ఉపాసన కూర్చొనే చెయ్యాలి.

### సూ: 4.1.9 అచలత్వం చాపేక్ష్య

*"ధ్యాయతీవ పృథివీ"* (పృథివీ ధ్యానిస్తున్నట్లు ఉంది) అంటే నిశ్చలంగా పృథివీ ఉందనే భావన వ్యక్తమవుతున్నది. అందువల్ల ధ్యానాది కర్మలలో చలనం లేకుండా స్థిరంగా ఉండటం అవసరం. స్థిరత్వం లేకపోతే తదేక భావన, ధ్యానము కుదరవు.

### సూ: 4.1.10 స్మరంతి చ

స్మృతిలోను *"శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసనమాత్మనః"* (భ.గీ. 6.11) అని అధ్యయనాది కర్మలు, ధ్యానము శుచిగా ఉన్న ప్రదేశంలో ఆసనాన్ని ప్రతిష్ఠిం చుకొని, ఇటూ అటూ దృష్టి మళ్లించకుండా, నిశ్చలంగా చేసుకోవాలనే చెప్పడమైనది. యోగాభ్యాసము కూడా పద్మాసనాదుల పైనే చెయ్యాలని చెప్పబడింది.

# 7. ఏకాగ్రతాధికరణమ్

## సూ: 4.1.11 యత్రైకాగ్రతా తత్రావిశేషాత్

కొన్ని వైదిక కర్మలకు దిక్కులు, కాలాల నిర్దేశము అలాగే ప్రతిషేధముకూడా విధించబడ్డాయి. ఉపాసనలకు సంబంధించి అటువంటి నియమాలేమైనా ఉన్నాయా?

ఉపాసనల కొరకైతే అట్టి నియమాలు సూచింపబడలేదు. కాని ఏకాగ్రతకు ఎక్కడ భంగమువాటిల్లదో, మనస్సుకు ఎక్కడ అనుకూలంగా ఉంటుందో అక్కడ ధ్యానాది కర్మలు చేసుకోవాలని సూచిస్తూ శ్రుతిలో ఇలా వినబడుతున్నది: *"సమే శుచౌ శర్కరా వహ్ని వాలుకా వివర్జితే శబ్ద జలాశ్రయాదిభిః; మనోనుకూలే న తు చక్షు పీడనే గుహానివాతాశ్రయణే ప్రయోజయేత్"* (శ్వే.ఉ 2.10). ఎత్తుపల్లాలు లేని శుభ్రమైన స్థలాన్ని గులకరాళ్లు, ఇసుక లేకుండా సుఖంగా కూర్చొనటానికి ఎంచుకొని. అక్కడ నిప్పు వల్ల, నీరు వల్ల, విపరీతమైన గాలి, శబ్దము క్రిమికీటకాదుల వల్ల శరీరానికి ఇబ్బంది లేనట్లు చూసుకొని ధ్యాన మననాదులు చేసుకోవాలి. ఎక్కడ మనస్సు అనుకూలత, ప్రశాంతత ఉంటే అక్కడ ఏకాగ్రత కుదిరి, నిర్విఘ్నంగా ఉపాసన కార్యక్రమం జరుగుతుందనే దీని భావము.

## 8. ఆప్రాయణాధికరణమ్

## సూ: 4.1.12 ఆప్రాయణాత్తత్రాపి హి దృష్టమ్

**పూర్వపక్షి:**

ఈ అధ్యాయ మొదటి అధికరణంలో ఉపాసన జ్ఞానఫలానికి, నిత్యం ధ్యాన మననాదులతో ఆవృత్తి చేసుకోవటం అవసరం అని చెప్పబడింది. సమ్యక్ దర్శనానికి నిరంతరధ్యానము ఆత్మ దర్శనము కలిగే వరకు చేసుకోవాలని సూచించటం కూడా యుక్తమే. అయితే ఉపాసనలు ఒక నిర్దిష్ట ఉద్దేశంతో చేయబడతాయి. అందువల్ల, అన్ని ఉపాసనలూ మరణ పర్యంతం చేయాలా? లేకపోతే, కొంతకాలం ఆవృత్తి చేసుకొని విరమించవచ్చా అనే సందేహం కలుగుతున్నది.

**సిద్ధాంతం:**

జ్ఞానరూపమైన ఉపాసనలు కూడా జీవితకాలమూ ఆవృత్తి చేసుకొంటూనే ఉండాలి. కారణం అవసాన దశలో ఉండే మనోభావాలపైనే, మరణానంతరము వచ్చే అదృష్టఫలం ఆధారపడి ఉంటుంది. జన్మరాహిత్యము కోరుకునే ముముక్షువునకు అదే ధ్యాస చివరవరకూ ఉండాలి. శ్రుతిలో *"స విజ్ఞానో భవతి స విజ్ఞానమేవాన్వవ క్రామతి"* (ప్రాణము–విజ్ఞానము కలిసే ఉంటాయి. కాబట్టి ప్రాణం పోతున్నప్పుడు దానిననుసరించే జ్ఞానము పోతుంది – బృ.ఉ 4.4.2) అని వినబడుతున్నది. అలాగే *"యచ్చిత్తః తేనైష ప్రాణమాయాతి, ప్రాణః తేజసా యుక్తః సహాత్మనా యథా సంకల్పితం లోకం నయతి"* అని కూడ విన్పడుతున్నది. (జీవికి మరణానంతరము ఏ లోకానికి వెళ్లాలనే సంకల్పం మనోవాంఛ ఉంటుందో అక్కడికే జీవుణ్ణి తీసికొని వెళ్లటానికి ప్రాణం మనస్సులో విలీనం అవుతుంది – ప్ర.ఉ 3.10). తదనంతరం, మనస్సు తేజస్సుతో కలసి (ఉదాన వాయువుతో) జీవుడు యొక్క కోర్కె సఫలీకృతం చేస్తుంది. ఇక్కడ వివరణ కోసం ఒక దృష్టాంతం (ఉదాహరణ) కూడా ఇవ్వబడింది. గడ్డిని–ఆకుల్ని కొరుక్కుతినే తృణజలూకా(జలగలాంటి క్రిమి) ఎలాగైతే మరో ఆశ్రయం (రెమ్మ) పట్టు దొరికే వరకు తను స్థిరంగా ఉన్న ఆశ్రయాన్ని వదలదో, అదే విధంగా జీవుడు తనకు ప్రియమైన (నచ్చిన) ఉపాధి దొరికే వరకు తన శరీరాన్ని వదిలివెళ్లడు.

అవసానదశ అంతిమఘడియల్లో ఎట్టి భావనలతో జీవుడు ఉంటాడో అదే ఫలస్వరూపం దక్కుతుందని శ్రుతిలోను, స్మృతిలోను విన్పిస్తున్నది. *"స యావత్ క్రతు రస్మాల్లోకాత్ ప్రైతి"* – శ.బ్రా 10.6.3 (ఉపాసకుడు ఏ సంకల్పంతో ఈ లోకాన్ని విడచి వెళ్లిపోతున్నాడో అదే పొందుతాడు). *"యం యం వాపి స్మరన్ భావం త్యజంత్యంతే కలేవరం, తం తమేవైతి కౌంతేయ! సదా తద్భావభావితః"* (ఓ అర్జునా! ఈ కళేబరాన్ని ఏ ఏ భావనలతో వ్యక్తి వదలిపెడుతున్నాడో, ఆ కోరికే నెరవేరుతుంది.– భ.గీ 8.6). అందువల్ల 'ప్రాయణకాలే మనసా–చలేన' అనే శ్లోకంలో మరణ సమయంలో మనస్సును ఏదో విధంగా వశం చేసుకొని పరమాత్మను తలచుకుంటూ పోవాలని భగవద్గీతలో చెప్పబడింది (భ.గీ. 8.10). ఛాందోగ్యోపనిషత్తులో మరణాసన్నదశలో 'అక్షితమసి' (నాశనములేని వాడవు), 'అచ్యుతమసి' (నిత్య స్వరూపుడవు), 'ప్రాణ సంశ్రితమసి' (ప్రాణమనే సూక్ష్మరూపుడవు) అనే మూడు మంత్రాలను భగవదపేక్షతో స్మరిస్తూ పోవాలని చెప్పబడింది. అందువల్ల మోక్షగాములు జీవితాంతం జన్మరాహిత్యం కోసం పరమాత్మ చింతనలోనే ఉండాలి.

## 9. తదధిగమాధికరణమ్

### సూ: 4.1.13 తదధిగమ ఉత్తరపూర్వాఘయోరశ్లేషవినాశౌ తద్వ్యపదేశాత్

(తదధిగమే+ఉత్తరపూర్వ అఘయోః అశ్లేషవినాశౌ తత్ వ్యపదేశాత్)

ఇంతవరకు జ్ఞానసాధన విధివిధానాల చర్చ జరిగింది. ఇకపైన బ్రహ్మవిద్యా ఫలాన్ని గురించి వివరంగా చెప్పటం జరగనున్నది.

**పూర్వపక్షి:**

బ్రహ్మవిద్యా ఫలం ఎప్పుడు లభిస్తుంది. జీవితంలో ఏవో కొన్ని పాప– పుణ్యాలు ప్రాప్తిస్తూ ఉంటాయి కదా! వాటి క్షయము ఎప్పుడు జరుగుతుంది? గౌతమ ధర్మసూత్రాలలో *"నహి కర్మ క్షీయతే"* పాపకర్మ అయినా, పుణ్యకర్మ అయినా అనుభవించవలసినదే, కర్మకు క్షయము లేదు అని సూచిస్తున్నది (గౌ.ధ.సూ 19.5). కొన్ని కర్మలయితే ప్రాయశ్చిత్తం కోసం ఏదో ఒక నిర్దిష్ట దోష నివృత్తికి ప్రత్యేకించి చెప్పబడ్డాయి. ఎప్పుడైనా ఒక మారు చేసే అట్టి నైమిత్తిక కర్మల ఫలితం పరిమితంగా ఉంటుంది. కర్మక్షయం అంటూ ఉండకపోతే బ్రహ్మజ్ఞానం కలిగినా జన్మరాహిత్యము ఉండదు. అప్పుడు, మోక్షసాధన బ్రహ్మజ్ఞాన ఫలము వృథా అవుతుంది కదా అనే సంశయం కలుగుతున్నది.

**సిద్ధాంతం:**

ఆత్మదర్శనమే బ్రహ్మజ్ఞాన ఫలప్రాప్తి. అది సిద్ధించిన వెంటనే అంతవరకు చేసిన పాపఫలం నశిస్తుంది. అంటే పాపాలు మరి ఏవి మిగిలి ఉండవు. కొత్త పుణ్యాలు ఏవి అంటవు. *"యథా పుష్కరపలాశ ఆపో న శ్లిష్యంత ఏవమేవం విది పాపంకర్మ న శ్లిష్యతే"* (తామరాకుపై నీటి బొట్టు అంటనట్లు బ్రహ్మజ్ఞానికి ఏ పాపమూ అంటదు – ఛా.ఉ 4.14.2). అలాగే మరో శ్రుతి *"తద్యాథా ఇషికాతూల మగ్నౌ ప్రోతం ప్రదూయేత ఏవం హ అస్య సర్వే పాప్మానః ప్రదూయంతే"* (దూది అగ్నిలోపడి బూడిద అయినట్లే బ్రహ్మవేత్త పాపాలన్నీ నశిస్తాయి –ఛా.ఉ 5.24.3). *"భిద్యతే హృదయ గ్రంథిః ఛిద్యంతే సర్వసంశయాః క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్ దృష్టే పరావరే"* (ము.ఉ 2.2.9) అని మరో శ్రుతిలో వినబడుతున్నది. ఆత్మజ్ఞానమునకు పూర్వము కలిగిన కర్మఫలము, జన్మాంతరములోని సంచిత కర్మల ఫలము, జ్ఞాన ప్రాప్తి తరవాత చేసిన కర్మఫలమూ కూడా పూర్తిగా నశించి బ్రహ్మలోక ప్రాప్తి కలుగుతుంది).

నిర్గుణ బ్రహ్మోపాసన దోషక్షయం కోసం, పీడాదుల నుంచి ఉపశమనం కోసం ఉద్దేశించింది కాదు. నిరంతర జ్ఞాన అన్వేషణతో శాశ్వత ఫలమైన మోక్షప్రాప్తికి ఉద్దేశింపబడినది. సగుణబ్రహ్మోపాసనలో అయితే, కొన్ని ఉపాసన విద్యలు ఐశ్వర్య సిద్ధికి నిర్దేశింపబడ్డాయి. వాటి వల్ల పాప నివృత్తి, ఐశ్వర్యసిద్ధీ కూడా కలుగవచ్చు కాని సద్యోముక్తి లేదు. పాపకర్మ క్షయం అయ్యే వరకు వాటిని అనుభవించక తప్పదు. అదీకాక, బ్రహ్మజ్ఞాని మున్ముందు ఉపలబ్ధమయే ఫలాన్ని ఆశించి ఏ కర్మ చెయ్యడు. అతనికి కర్తృత్వాపేక్ష ఉండదు. తాదాప్యం కోసం బ్రహ్మజిజ్ఞాసి, ఇంతకు పూర్వం కర్తగా గాని, భోక్తగా గాని ఉండలేదు, ఇప్పుడూ లేను, ఇక భవిష్యత్తులోను ఉండను అనే భావనతో ఉంటాడు. అందువల్ల బ్రహ్మజ్ఞానం కలిగిన వెంటనే మోక్షప్రాప్తి కలుగుతుంది.

## 10. ఇతరాసంశ్లేషాధికరణమ్

### సూ: 4.1.14 ఇతరస్యాప్యేవమసంశ్లేషః పాతే తు

(ఇతరస్యాపి ఏవం అసంశ్లేషః పాతే తు)

శరీర పాతంతోనే పుణ్యపాపాలు పూర్తిగా నశించి మోక్షం ప్రాప్తిస్తుందని సూత్రార్థం.

పాపం నశించినట్లే పుణ్యఫలం కూడా బ్రహ్మజ్ఞానికి సవిశేషం లేకుండా పూర్తిగా నశిస్తుంది. *"ఉభే ఉ హ ఏవ ఏష ఏతే తరతి"* (పాప పుణ్యాలు రెండింటి వల్ల విముక్తుడై, సంసారసాగరాన్ని దాటి పరమాగతిని పొందుతాడు – బృ.ఉ 4.4.22). పుణ్యకర్మ శేషమున్నా జన్మ తప్పదు, కాబట్టి మోక్షప్రాప్తికి పుణ్యఫలం కూడా పూర్తిగా క్షయమవ్వాలి. అందుకే శ్రుతిలో *"క్షీయంతే చాస్యకర్మాణి"* అని పాప పుణ్య కర్మలు రెండూ అనే అర్థంలో సామాన్యంగా అన్ని కర్మలూ అనే సూచింపబడింది. అందువల్ల కర్మక్షయం అంటే దుష్కృత–సుకృత రెండింటి యొక్క ఫలమూ అని గ్రహించాలి. *"నైనం సేతు మహోరాత్రే తరతః న జరా న మృత్యుః నశోకో న సుకృతం న దుష్కృతం సర్వే పాప్మనో–తో నివర్తంతే"* అని శ్రుతి (ఛా.ఉ 8.4.1). బ్రహ్మలోకం చేరినవాడు, పుణ్య పాపాలను రెండింటిని పోగొట్టుకొని శరీరపాతం తోనే మోక్షం పొందుతాడు అని దీని వల్ల తెలుస్తున్నది.

సూత్రంలో చివర *"పాతే తు"* అని 'తు' శబ్ద ప్రయోగం తప్పకుండా అనే అర్థంలో ఆత్మదర్శనంతో పాపపుణ్యాల క్షయం అయ్యి, వెన్వెంటనే బ్రహ్మవేత్త మోక్షం పొందుతాడని నిర్ధారిస్తూ తెలియజేస్తున్నది.

## 11. అనారబ్ధాధికరణమ్

### సూ: 4.1.15 అనారబ్ధకార్యే ఏవ తు పూర్వే తదవధేః

పూర్వకర్మలు అంటే జన్మాంతరంలో చేసిన కర్మల యొక్క ఫలశేషం ఉండి పోతే దానికి శరీరపాతమే అవధిగా చెప్పబడిందని సూత్రార్థం.

జ్ఞానం వలన సుకృత–దుష్కృతాలు రెండూ నశిస్తాయని ముందు చెప్ప బడింది. అయితే జన్మాంతరంలో (పూర్వ జన్మలలో) కలిగిన పాపపుణ్యాల వల్ల వచ్చే ఫలితమేనా, ఇంకా అనుభవించకుండా ఉండిపోయిన కర్మఫలితము కూడా నశిస్తుందా అనే సందేహం కలుగుతున్నది.

జన్మాంతరంలో సంచితమైనవి (కూడబెట్టుకున్న పాప–పుణ్యాల ఫలం), ఈ జన్మలో జ్ఞానప్రాప్తికి ముందు ఆర్జించిన కర్మఫలం, ఆత్మదర్శనంతో క్షీణిస్తాయి. కాని, ఏ కర్మఫలం వల్ల ఈ జన్మ వచ్చిందో దానిలో కొంత అనుభవించి, కొంత ఇంకా అనుభవించటానికి శేషంగా ఉండిపోతే, దాని భోగం పూర్తిగా అయితేనే గాని శరీర పాతము కాదు. అంటే, జ్ఞానం కలిగిన వెంటనే శరీరపాతమై బ్రహ్మలోక ప్రాప్తికావాలి. అలా జరగకుండా శరీరపాతానికి నిరీక్షిస్తే కర్మఫల భోగం పూర్తి కాలేదని తెలుసు కోవాలి. అయితే ఎట్టి బీజములకైనా అగ్ని సంపర్కం వల్ల వాటి బీజాంకుర శక్తి నశిస్తుంది కదా, మరి బ్రహ్మజ్ఞానికి ఆత్మసాక్షాత్కారముతో సర్వ పాపపుణ్యాలు నిశ్శేషంగా నశించాలి కదా అనే ప్రశ్న వస్తుంది. ఈ జన్మలో చేసిన పుణ్యం వలనో, జన్మాంతరంలో చేసిన సుకృతం వలనో జ్ఞానోత్పత్తికి దోహదమైంది. అయితే కొన్ని కర్మల ఫలశేషం అనుభవింపబడకుండా ఉండిపోతుంది. ఎలాగంటే కుమ్మరి వాని పని పూర్తి కాకుండా చక్రం మధ్యలో ఆపకుండా తిరుగుతునే ఉండాలి. మధ్యలో దాని గతికి ప్రతిబంధకం రాకూడదు. అలాగే కొన్ని కర్మల ఫలభోగం అయ్యే వరకు శరీరపాతం కాదు. మిథ్యాజ్ఞానం పోతుంది. ఆత్మశుద్ధి జరుగుతుంది. స్థిత ప్రజ్ఞుడైనా కొంతకాలం శరీరపాతానికి నిరీక్షించవలసి ఉంటుంది. బ్రహ్మవేత్త జీవన్ముక్తుడుగా శరీరధారణ చేస్తూ ఆరబ్ధకర్మల అనుభవం పూర్తి అయ్యే వరకు ఉంటాడు.

# 12. అగ్నిహోత్రాద్యధికరణమ్

## సూ: 4.1.16 అగ్నిహోత్రాది తు తత్కార్యాయైవ తద్దర్శనాత్

నిత్యాగ్నిహోత్రం ఇత్యాది వైదికకర్మల పుణ్యఫలం కూడా ఆత్మదర్శనంతో పూర్తిగా నశించిపోతుందా అనే సందేహం కలుగుతుంది. దానికి సమాధానం ఇలా చెప్పబడింది.

అగ్నిహోత్రాది పుణ్యకర్మలు, ఆత్మాన్వేషణకు బ్రహ్మ జిజ్ఞాసికి సాధన సామగ్రిగా ఉపయోగిస్తాయి. వాటి వల్ల శ్రద్ధ ఇత్యాది సాధన సంపత్తులు ప్రాప్త మౌతాయి. అట్టి కర్మలు మోక్షప్రదానం చెయ్యవు కాని శ్రేయోమార్గ గమనానికి ఉపకరిస్తాయి. జ్ఞానకర్మలు విలక్షణమైనవి. వాటికి ఒకే కార్యం ఉండదు. ఎలాగంటే విషం లాంటి పదార్థాలను మరో వస్తువుతో కలిపి ఔషధంగా కూడా వాడడం జరుగుతుందో, అలాగే ఎట్టి కర్మ అయినా జ్ఞానసంయుక్తమైతే మోక్షం అనే కార్యం సిద్ధిస్తుంది. కర్మ ఫలితం వృధా కాదు. దూరం నుంచి (పరోక్షంగా) ఉపకరిస్తుంది. అందువల్ల అగ్నిహోత్రాది కర్మలు మోక్షమార్గంలో సాధనకు తోడ్పడతాయి.

జ్ఞానోదయానికి పూర్వం ముముక్షువుకు కార్య ఏకత్వం ఉంటుంది. కాని జ్ఞానోదయానంతరం బ్రహ్మవేత్తకు ఎట్టి వైదికకర్మ ప్రమేయం ఉండదు, కాబట్టి అగ్నిహోత్రాదుల నుండి విరమించటం జరుగుతుంది. అయితే, సగుణబ్రహ్మోపాసనకు కర్తృత్వం ఉంటుంది కాబట్టి అగ్నిహోత్రాది కర్మల నుండి నిష్క్రమణ ఉండదు. ఫలాపేక్షలేని కర్మలకు విద్యాప్రాప్తితో ఎట్టి విరోధము ఉండదు; ఉపయోగకరమైన సంబంధమే కుదురుతుంది.

## సూ: 4.1.17 అతోఽన్యాపి హ్యేకేషాముభయోః

కొందరు వైదిక శాఖీయులు *"తస్య పుత్రా దాయముపయంతి, సుహృదః సాధుకృత్యాం ద్విషంతః పాపకృత్యామ్"* (కౌ.ఉ 1.4) అని విశ్వసిస్తారు. దీని భావన ఎవరైనా మంచి కర్మ చేస్తే దాని ఫలితం వారి పుత్రులకు, శ్రేయోభిలాషులకు దక్కుతుంది, దుష్కర్మ ఫలితం వారి శత్రువులకు సంక్రమిస్తుందని కదా? అగ్నిహోత్రాది కర్మల విషయంలో ఇది వర్తిస్తుందా అని సంశయం.

కామ్యకర్మలు అంటే ఫలాపేక్షతో చేసిన కర్మలు ఏవీ విద్వాంసులైన మోక్ష గాములకు ఉపకరించవు. ఈ విషయంలో జైమిన్యాచార్యుల వారికి బాదరాయణుల వారికి ఎట్టి అభిప్రాయ భేదమూ లేదు. బ్రహ్మవేత్తకు పుణ్య—పాపాల సంస్పర్శ ఉండదని ముందుగానే సూచించడమైనది (బ్ర.సూ. 4.1.14).

## 13. విద్యాజ్ఞాన సాధనత్వాధికరణమ్

## సూ: 4.1.18 యదేవ విద్యయేతి హి

విద్యా సహితమైన కర్మయే వీర్యవత్తరమైనదని సూత్రార్థం.

**పూర్వపక్షి:**

ఇంతక ముందు నిత్యాగ్నిహోత్రాది వైదికకర్మలు అంతఃకరణ శుద్ధికి, శ్రద్ధ ఇత్యాది సాధన సంపత్తులు సమకూర్చి, ముముక్షువునకు బ్రహ్మవిద్యప్రాప్తి యందు ఉపకరిస్తాయని చెప్పడం జరిగింది. అయితే, కొన్ని వైదికకర్మలు, విజ్ఞాన సంపత్తి ఉన్నవారే చెయ్యాలని శ్రుతిలో వినబడుతున్నది: *"య ఏవం విద్వాన్ జుహోతి"* , *"య ఏవం విద్వాన్ యజతి", "య ఏవం విద్వాన్ శంసతి", "య ఏవం విద్వాన్ గాయతి", "తస్మాదేవం విదమేవ బ్రహ్మాణం కుర్వీత నానేవం విదమ్"* (ఛా.ఉ 4.17.10). మరికొన్ని అనుష్ఠాన–ఉపాసన కర్మలు విద్యాసంయుక్తము కానివని వినబడుతున్నది *"తేన ఉభౌ కురుతే యశ్చ ఏతదేవం వేద యశ్చనవేద"* (ఛా.ఉ 1.1.10.

*"తమేత మాత్మానం యజ్ఞేన వివిదషంతి"* అని విశేషం లేకుండా యజ్ఞ కర్మలు విద్యారహితములు అని వినిపిస్తున్నది. అందువల్ల విద్యాసంయుక్తమైన వైదిక కర్మలు, విశిష్టమైనవే బ్రహ్మవిద్యకు ఉపకరిస్తాయి కాని మిగతా కామ్యకర్మలు బ్రహ్మవిద్యలో ఎట్టి ప్రయోజనము లేనివని తోస్తున్నది. శ్రుతిలో *"యదహరేవ జుహోతి తదహః పునర్మృత్యుముపజయతి ఏవం విద్వాన్"* అని, స్మృతిలో *"బుద్ధ్యాయుక్తో యయా పార్థ కర్మబంధం ప్రహాస్యసి"* (భ.గీ 2.39), *"దూరేణ హ్యవరం కర్మ బుద్ధి యోగాత్ ధనంజయ"* (భ.గీ 2.49) అని చెప్పబడింది.

**సిద్ధాంతం:**

విద్యా వివేకము లేనివాని కన్నా విద్వాంసుడు విశిష్టతను కలిగి ఉంటాడని అందరికి తెలిసిన విషయమే. అయినా యజ్ఞయాగాది కామ్యకర్మలు వ్యర్థములని చెప్పలేము. విద్యా సంయుక్తమైన అగ్నిహోత్రాది వైదికకర్మలు, బ్రహ్మజ్ఞాన ప్రాప్తికి ఆత్మ సాక్షాత్కారము చేసుకోటానికి చాల ఉపకరిస్తాయని చెప్పటం వలన అవి శ్రేష్ఠతమములని అంగీకరించాలి. విద్యారహితములైన కామ్యకర్మలు వీర్యవత్తులైతే, విద్యా సంయుక్త వైదికకర్మలు వీర్యవత్తరములు – వాటికన్న కొంచం ఎక్కువ శ్రేయ స్కరములు–ఉపయుక్తములు అనే ఈ శ్రుతులలో విన్పిస్తున్నది. అయితే బ్రహ్మవిద్యా ప్రాప్తికి శ్రవణ, మనన, నిదిధ్యాసలు నిత్యమూ అవసరము. అట్టి జ్ఞాన సాధనయే బ్రహ్మాధిగమనానికి కారణమై మోక్షాన్ని ప్రసాదిస్తుంది.

## 14. ఇతరక్షపణాధికరణమ్

### సూ: 4.1.19 భోగేన త్వితరే క్షపయిత్వా సంపద్యతే

ఏ కర్మ ఫలాన్ని పూర్తిగా అనుభవించలేదో (అనారబ్ధ కర్మఫలశేషం ఏదైతే ఉండిపోయిందో) దానిని అనుభవించి ఆ శేషాన్ని నశింపజేసుకొని, ఆ తరవాతే ఆత్మజ్ఞాని దేహపాతం పొందవలసి వస్తుంది. *"తస్య తావదేవ చిరం యావ న్నమోక్ష్యే ఽథ సంపత్స్యే"* (ఛా.ఉ 6.14.2), అలాగే *"బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి"* బ్రహ్మగమనము, అమృతత్త్వసిద్ధి దేహపతనంతోనే కలుగుతుంది. అప్పటికి కర్మక్షయము పూర్తిగా అయ్యి, కొత్త కర్మల భోగం మరేమి ఉండదని గ్రహించాలి.

# *4.*

# ఫలాధ్యాయము : ద్వితీయపాదము



## 1. వాగధికరణమ్

### సూ: 4.2.1 వాఙ్మనసి దర్శనాచ్ఛబ్దాచ్చ

ఈ పాదంలో అపరవిద్య ఫలప్రదమై మరణానంతరం బ్రహ్మవేత్త ఏ క్రమంలో దేవయాన మార్గంలో బ్రహ్మలోకం చేరుకుంటాడో చెప్పబడుతున్నది.

**పూర్వపక్షి:**

ఛాందోగ్యంలో మరణంలో ఉత్క్రాంతిక్రమం (జీవుడు శరీరం విడచి వెళ్లి పోయే క్రమం) వివరిస్తూ శ్రుతి ఇలా విన్పిస్తున్నది: *"అస్య సోమ్య! పురుషస్య ప్రయతో వాఙ్మనసి సంపద్యతే, మనః ప్రాణే, ప్రాణః తేజసి, తేజః పరస్యాం దేవతాయామ్"* (ఓ సోమ్యా! జీవుడు శరీరం విడిచే సమయంలో వాక్కు మనసులో కలసిపోతుంది. మనస్సు ప్రాణంలో కలసిపోతుంది. ప్రాణం తేజస్సులో, తేజస్సు పరమాత్మలో కలసి పోతుంది – ఛా.ఉ 6.8.6). ఇక్కడ సందేహం: వాక్కు మనస్సులో కలసిపోతుంది అంటే కేవలం మాటలాడడం అనే వ్యాపారం పోతుందా? లేక మాట్లాడే శక్తినిచ్చే వాక్ ఇంద్రియమే మనస్సులో లీనమయిపోతుందా? శ్రుత్యనుసారం వాగింద్రియానికే ప్రాధాన్యత ఇచ్చి, అదే మనస్సుతో కలసిపోతుందని అర్థం చేసుకోవాలి. ఇలా స్పష్టంగా వినబడడం వల్ల లాక్షణికంగా వాక్ వ్యాపారం పోతుందని చెప్పుకోవటం యుక్తం కాదని తోస్తున్నది.

**సిద్ధాంతం:**

వాగ్వృత్తి మనస్సులో లీనమవుతుందనే గ్రహించాలి. అయితే, వాక్ అంటే వాగ్వృత్తి ఎలా అవుతుందనే సందేహం కలుగుతుంది. ఇదే పాదంలో ముందు వస్తున్న *"అవిభాగోవచనాత్"* అనే సూత్రంలో (బ్ర.సూ 4.2.16) తత్త్వవేత్త యొక్క ఇంద్రియాలు స్వరూపలయం (పరమాత్మలో కలసిపోతాయి) అని చెప్పడమైనది. అందువల్ల వాక్ మాత్రమే పోతుంది అనే అభిప్రాయం సరైనదికాదు. అయితే తత్త్వ వేత్తలు కాని సామాన్య వ్యక్తుల విషయంలో ఒక రీతిగాను, తత్త్వవేత్తల విషయంలో మరోలాగ, వేరే సూత్రంతో చెప్పడం ఎందుకు అనే సందేహం వస్తుంది.

ప్రస్తుతం చెప్పదలచిన విషయం: వాగ్వృత్తి, మనోవృత్తి పోక పూర్వమే పోతుంది అని గ్రహించాలి. అంటే, మనస్సు పని చేస్తూ ఉన్నా వాక్ వ్యాపారం పోతుంది. ఎందువలనంటే, వాగింద్రియం మనస్సులో కలియటం కంటికి కనబడదు. వాక్

ద్వారానే తెలుసుకోవాలి. అందువల్ల ఈ విషయం గ్రహించడానికి వీలుగా శ్రుతిలో ఆవిధంగా చెప్పబడింది. అయితే, వాక్ మనస్సు నుండి పుడుతున్నదని చెప్పటానికి ప్రమాణము లేనప్పుడు, మనస్సులో లయం అయి శాంతిస్తుందని ఎలా చెప్పడం కుదురుతుందని పూర్వపక్షి ప్రశ్న. దానికి సమాధానం ఇలా చెప్పబడింది: పృథివీ వికారాలు కట్టెలు, ఇంధనాలు ఇత్యాదులు. వాటివల్ల మండటం అనే కార్యం (తేజో వ్యాపారం) జరుగుతున్నది. అవి నీరు అనే మరో పదార్థం వల్ల చల్లారుతు న్నాయి (శాంతిస్తున్నాయి). అందువల్ల ఒక పదార్థం యొక్క ఆవిర్భావ తిరోభావ వృత్తులు (వ్యాపారం) మరో పదార్థం వల్ల కూడా జరగవచ్చునని గ్రహించవచ్చు. వాక్ మనస్సు యొక్క ప్రకృతి (దానిలోంచి పుట్టింది) కాకపోయినా దానిలో లీనమయి, శాంతించటం అనేది కుదురుతుంది.

## సూ: 4.2.2 అత ఏవ చ సర్వాణ్యను

వాక్ విషయంలో చెప్పినట్లే మిగతా ఇంద్రియాల యొక్క వ్యాపారం మనస్సును చేరుకుంటుంది. అంటే వాక్కుపోయిన రీతిలోనే మనస్సు పని చేస్తుండగా చక్షురాది ఇంద్రియాల వ్యాపారం పోతుంది. *"తస్మాదుపశాంత తేజాః, పునర్భవ మింద్రియై ర్మనసి సంపద్యమానైః"* (ప్ర.ఉ 3.9). ఈ శ్రుతి వల్ల, శాంతించిన తేజస్సుతో, మనస్సును చేరిన ఇంద్రియాలతో, ఈ దేహం నుండి సూక్ష్మావస్థలో జీవుడు నిష్క్రమిస్తాడు అని గ్రహించవచ్చు.

## 2. మనోధికరణమ్

## సూ: 4.2.3 తన్మనః ప్రాణ ఉత్తరాత్

బాహ్యేంద్రియముల యొక్క వ్యాపారాలన్నింటినీ మనస్సు తీసుకొని ప్రాణంలో లీనమౌతుందని తరవాత వచ్చిన వాక్యం ద్వారా తెలుస్తున్నదని సూత్రార్థం.

**పూర్వపక్షి:**

వాఙ్మనసి అనే వాక్యంలో వాక్ వ్యాపారం మనస్సులో కలిసిపోతుందని చెప్పడమైనది. అటుపైన 'మనఃప్రాణే' అని శ్రుతిలో వినబడడం వల్ల, మనస్సుయొక్క వ్యాపారం (మనస్సు యొక్క వృత్తిమత్ సంపత్తి) ప్రాణంలో లీనమవుతుందనే గ్రహించా లని తోస్తున్నది. *"అన్నమయం హి సోమ్య! మనః ఆపో మయః ప్రాణః"* (ఛా.ఉ 6.5.4) అనే శ్రుతిననుసరించి మనస్సు అన్నం వల్ల పుట్టినదని, ప్రాణం నీటి నుండి పుట్టినదని తెలుస్తున్నది. అదీకాక 'ఆపశ్చాన్నమసృజంత' (అన్నము నీరు నుండి ఉద్భవించింది) అని కూడా శ్రుతిలో వినబడుతున్నది. ఇందువల్ల ప్రాణవ్యాపారంలో మనస్సు విలీన మవుతున్నదని అర్థం చేసుకోవాలి.

**సిద్ధాంతం:**

సుషుప్తి (గాఢనిద్ర) సమయంలోను, మరణాసన్న సమయంలోను ఊపిరి తిరుగుతుండగా (ఉచ్ఛ్వాస–నిశ్వాసలు జరుగుతున్నా) మనోవృత్తులన్నీ ఉపశమించటం (ఆగిపోవటం) గమనిస్తున్నాం. అందువల్ల మనస్సు ప్రాణంలో విలీనంకాదు. మనో వృత్తి (మనో వ్యాపారం) ప్రాణంలో చేరి లయం అవుతుంది, మనఃస్వరూపము కాదు అని తెలుసుకోవాలి. ముందు సూత్రంలో బాహ్యేంద్రియాలుకావు, వాటి వ్యాపారాలే మనస్సులో లీనమవుతాయి అని ఏవిధంగా చెప్పబడిందో, అదేవిధంగా 'మనః ప్రాణః' అనే వాక్యాన్ని కూడా మనో వ్యాపారమే ప్రాణంలో విలీన మవుతుందని గ్రహించాలి.

## 3. అధ్యక్షాధికరణమ్

### సూ: 4.2.4 సోఽధ్యక్షే తదుపగమాదిభ్యః

వాక్ మనస్సు నుండి పుట్టలేదు కాబట్టి వాగ్వ్యాపారమే మనస్సులో లీన మవుతుంది అని చెప్పినట్లే, అన్ని ఇంద్రియాల యొక్క వ్యాపారము మాత్రమే మనస్సులో విలీనమవుతుందనే చెప్పబడింది. ఇప్పుడు ప్రాణం తేజస్సులో లీన మవటం గురించి విశదీకరింప బడుతున్నది.

ప్రాణాలకు ఆయతనం శరీరం. శరీరాధ్యక్షుడైన విజ్ఞానాత్మ యందే కర్మ ఫలాలు, పూర్వవాసనలు నిలచిఉంటాయి. అందువల్ల ప్రాణవృత్తి జీవప్రధానం అని చెప్పబడింది. *"ఏవమేవ ఇమం ఆత్మాన మంతకాలే సర్వే ప్రాణా అభిసమాయంతి, యత్ర ఏతత్ ఊర్ధ్వోచ్ఛ్వాసీ భవతి"* అని శ్రుతి వచనం (బృ.ఉ 4.3.38). *"తం ఉత్క్రామంతం ప్రాణోఽనూత్క్రామతి"* (ఈ లోకం విడచి పరలోకానికి వెళ్తున్న జీవుడుయొక్క అంతకాలంలో, ఇతర ఇంద్రియ వృత్తులతో కలసి సర్వమునకు అధికారి అయిన దేహమందున్న ప్రాణము వదలి వెళ్లిపోతుంది – బృ.ఉ 4.4.2). *"స విజ్ఞానో భవతి"* అని పైన ఉదహరించిన శ్రుతిలోనే వినబడడం వల్ల, ప్రాణంతో విశేష విజ్ఞానము కలిసే ఉంటుంది అని తెలుసుకోవాలి. ఆ ప్రాణమే తేజోరూపమైన విజ్ఞానమయాత్మ. అందువల్ల శరీర ఉత్క్రమణ వ్యవహారంలో సర్వేంద్రియాలకూ అధ్యక్షుడైన విజ్ఞానమయాత్మ ప్రధానమైనదని గుర్తించవలసి ఉంటుంది.

### సూ: 4.2.5 భూతేషు తచ్ఛ్రుతేః

*"ప్రాణః తేజసి"* అనే శ్రుతిని బట్టి, జీవుడు తేజః సహితాలైన పంచభూతాల యొక్క అపంచీకృత రూపంలో (సూక్ష్మరూపం) ఉంటాడని తెలుస్తున్నది.సూక్ష్మభూతాలే ఈ దేహానికి బీజరూపాలు. ప్రాణంతో కూడుకొని ఉన్న శరీరాధ్యక్షుడు తేజస్సుతో పాటు ఇతర భూతాలతో ముడిపడే ఉంటాడు. అందువలన ప్రాణములతో కలసిన అధ్యక్షుడు, తేజస్సుతో కలసి అక్కడ నుండి పరదేవత (పరమాత్మ) ను చేరుకుంటాడు అనే విశదీకరణ లౌకిక దృష్టాంతంతో కూడా కుదురుతుంది. ఒక ప్రయాణికుడు విజయవాడ నుంచి కాంచీపురం వెళ్లి అక్కడ నుండి కన్యాకుమారి వెళ్తున్నప్పుడు విజయవాడ నుంచి కన్యాకుమారి వెళ్తున్నాడని కూడా చెప్పవచ్చు. అందువల్ల *"ప్రాణః తేజసి తేజః పరస్యాం దేవతాయామ్"* అని చెప్పటం సమంజసమే.

### సూ: 4.2.6 నైకస్మిన్‌దర్శయతో హి

(న ఏకస్మిన్ దర్శయతః హి)

ఒక్క తేజస్సు నందే జీవుడుండడని శ్రుతులు చూపుతున్నాయి. *"ఆపః పురుష, వచః"* (ఛా.ఉ 5.3.3), *"త్ర్యాత్మకత్వాత్తు భూయస్త్వాత్"* అనే సూత్రంలో ముందు. విషయం ప్రస్తావించబడింది (బ్ర.సూ 3.1.2). *"పృథివీమయ, ఆపోమయో, వాయు మయ, ఆకాశమయ స్తేజోమయః"* (బృ.ఉ 4.4.5), అలాగే మనుస్మృతిలో *"అణ్వ్యో మాత్రా–వినాశిన్యో దశార్ధానాంతు యాః స్మృతాః; తాభిః సార్ధమిదం సర్వం సంభవ త్యనుపూర్వశః"* (మ.స్మృ 1.27) శరీరం పృథివ్యాది భూతాలతో కూడుకొని ఉన్నది.ఈ పంచభూతాలు సూక్ష్మరూపంలో మోక్షము వరకు అంటే బ్రహ్మైక్యము వరకు నాశనము లేనివి కాబట్టి, జన్మరాహిత్యం వరకు సూక్ష్మాంశాలతోనే ఈ శరీరం ఉద్భవిస్తూంటుంది.

*"క్వాయం తదా పురుషో భవతి"* అని యాజ్ఞవల్క్య–ఆర్తభాగుల సంవాదంలో, బృహదారణ్యకోపనిషత్తులో వినబడుతున్నది. శరీర పతనం సమయంలో జీవాత్మ ఎక్కడ ఉంటాడని ఆర్తభాగుడు ప్రశ్నిస్తాడు. దానికి సమాధానంగా కర్మయే జీవాత్మకు ఆశ్రయమని ఇలా చెప్పబడింది: *"తౌ హ యదూచతుః కర్మ హైవ తదూచతుః అథహ యత్ ప్రశంసతుః కర్మహైవ తత్ప్రశంసతుః"* (బృ.ఉ 3.2.13) కర్మ అని ఈ శ్రుతిలో వినబడుతున్నది కదా. భూతాలని మీరు ఎలా

ప్రతిపాదిస్తున్నారు అని పూర్వపక్షి ప్రశ్న. సమాధానంగా అప్పుడు ఇలా చెప్పబడింది: గ్రహాలు—అతిగ్రహాలు అని ఏవైతే ఆ సందర్భంలో ప్రస్తావింపబడ్డాయో అవే ఇంద్రియాలు—కోరికలు (విషయా). అదే జీవుణ్ణి బంధించి కర్మకు నిమిత్తకారణం అవుతుంది. భూతాలు శరీరానికి ఉపాదానకారణం. అందువల్ల భూతాశ్రయప్రస్తావనే పైన చెయ్యబడింది. అదే ముందు సూత్రంలో (4.2.5) కూడా చెప్పబడింది.

## 4. ఆసృత్యుపక్రమాధికరణమ్

## సూ: 4.2.7 సమానా చాసృత్యుపక్రమాదమృతత్వం చానుపోష్య

**పూర్వపక్షి:**

ఉత్క్రమణక్రమం దేవయానమార్గ ప్రారంభం వరకు అందరికీ సమానమే అయితే, దహరవిద్యాది ఉపాసనలు చేసే విద్వాంసులకు సగుణబ్రహ్మము గమనానికి విశేషమార్గ ప్రయాణము, మిగతా జనసామాన్యానికి(అవిద్వాంసకులకు) వేరేమార్గము అని ముందు ప్రకరణంలో చెప్పబడింది. జీవుని కర్మను బట్టి జన్మ ప్రాప్తమవ్వాలికాబట్టి భూతాశ్రయంతోనే ఉత్క్రాంతి ఉంటుంది. అయితే, బ్రహ్మోపాసన చేసిన ఉపాసకులు విద్యావేత్తలు వారికి పునర్జన్మ ఉండదు, అమృతత్వ సిద్ధి కలుగుతుందని ముందు ప్రకరణంలో చెప్పబడింది. అందువల్ల భూతాశ్రయ ఉత్క్రాంతి జన సామాన్యులకే వర్తించాలి. ఉపాసనలు చేసే విద్వాంసులకు ఉత్క్రాంతిలో భేదమేమీ చెప్పలేదు కదా?

శ్వేతకేతువునకు చేసిన ఆత్మబోధలో *"యత్రైతత్ పురుషః స్వపితి నామ"* (ఎప్పుడైతే ఈ పురుషుడు నిద్రించాలని అనుకుంటున్నాడో – ఛా.ఉ 6.8.1) *"ఆశిశిషతి నామ"* (తినాలని అనుకుంటున్నాడో – ఛా.ఉ 6.8.3) *"పిపాసతి నామ"* (త్రాగాలను కుంటున్నాడో – ఛా.ఉ 6.8.5) అని సర్వసామాన్యంగా అందరికి వర్తించే సాధారణ విషయాలే అక్కడ చెప్పబడ్డాయి. అంతేకాని, అవి ఉపాసనా సాధకులకు (విద్వాంసు లకు) నిర్దేశించి చెప్పినవికావు. అదే విధంగా, ఉత్క్రాంతి జనసామాన్యమైనదిగా *"పురుషస్య ప్రియతో వాఙ్మనసి సంపద్యతే, మనఃప్రాణే, ప్రాణస్తేజసి, తేజః పరస్యాం దేవతాయామ్"* (ఛా.ఉ 6.8.6) అని చెప్పటం జరిగింది. ఈ శ్రుతి పరదేవతలో లీన మవుతున్నది నీ ఆత్మ అదే నువ్వు అని శ్వేతకేతువునకు బోధించటానికి ఉద్దేశింప బడింది. అదీకాక, *"న తస్య ప్రాణా ఉత్క్రామంతి"* (బృ.ఉ 4.4.6). అనే శ్రుతివాక్యంలో విద్వాంసునకు ప్రాణఉత్క్రాంతి నిషేధింపబడింది.

**సిద్ధాంతం:**

విద్వాంసులకు–అవిద్వాంసులకు దేవయాన మార్గం (ఉపసృతి) ప్రారంభం వరకు ఉత్క్రాంతి సమానంగానే ఉంటుంది. అవిద్వాంసుడు దేహప్రాప్తికి బీజాలైన సూక్ష్మభూతాలను ఆశ్రయించి కర్మప్రలోభంతో సంసార వలయంలో పడతాడు. విద్వాంసుడు జ్ఞానోపార్జనతో మోక్షసాధన చేస్తూ మూర్ధన్యనాడి ద్వారాన్ని ఆశ్రయి స్తాడు. ఇదే విషయాన్ని *"ఆసృత్యుపక్రమాత్"* అని సూత్రంలో చెప్పబడింది. (మూర్ధన్య నాడినే బ్రహ్మ కవాటము అని కూడా అంటారు).

అమృతత్వానికై దేశాంతరము వెళ్లవలసిన ఆవశ్యకత లేదు. అది ఆపేక్షికం. సుదీర్ఘ ఆయుస్సు బ్రహ్మలోక నివాసము సగుణ విద్యల ఉపాసనతో సాధించవచ్చు.

సృత్యుపక్రమం భూతాశ్రయత్వం సగుణబ్రహ్మోపాసకులైన విద్వాంసులకు ఉంటాయి. ఆశ్రయం లేకపోతే ప్రాణాలకు గమనమే కుదరదు.

## 5. సంసారవ్యపదేశాధికరణమ్

### సూ: 4.2.8 తదాఽపీతేః సంసారవ్యవదేశాత్

సంసారమోక్షం వరకు భూతాల సూక్ష్మరూపం ఉంటుందని సూత్రార్థం.

*"తేజః పరస్యాం దేవతాయామ్"* అని సూచించిన సందర్భంలో మరణ కాలంలో ఇంద్రియ సముదాయంతోను, ఇతర భూతాలతోను కూడుకొని ఉన్న తేజస్సు, పరదేవతలో లీనమవుతుంది అని చెప్పబడింది. ఈ సంపత్తి ఏ విధానమైనదో ఇక్కడ చర్చింపబడుతున్నది.

**సిద్ధాంతం:**

సర్వేంద్రియాలకు ఆధారమైన తేజస్సు భూతాల యొక్క సూక్ష్మరూపంలో సంసారమోక్ష పర్యంతం (అంటే బ్రహ్మలో విలీనం అయేవరకు) ఉంటుంది. ఇదే సూచిస్తూ శ్రుతిలో ఇలా వినబడుతున్నది: *"యోని మన్యే ప్రపద్యంతే శరీరత్వాయ దేహినః, స్థాణుమన్యే-నుసంయంతి యథా కర్మ యథా శ్రుతమ్"* (కర్మను, విద్యా ప్రాప్తిని అనుసరించి శరీరోపాధికోసం మరో జన్మను పొందవలసి ఉంటుంది. ఇలా స్థావర జంగముల రూపంలో జీవులకు జనన–మరణాలతో సంసారం అనే సంబంధం ఉండనే ఉంటుంది – క.ఉ 5.7). అలా సంసార సంబంధం లేకపోతే మరణించిన ప్రతి సంసారి, బ్రహ్మలో లీనమయి బ్రహ్మయే అయిపోవాలి. అందువల్ల తేజో రూపమైన జీవాత్మ, ఆ పరమాత్మ యొక్క ప్రకృతి అయినా (తత్ప్రకృతత్వం కలదైనా) సుషుప్తిలో జరిగే ప్రళయంలాగే, మరణానంతరం లోను సంసార బీజం సశేషంగానే ఉంటుంది.

### సూ: 4.2.9 సూక్ష్మం ప్రమాణతశ్చ తథోపలబ్ధేః

ఈ శరీరం విడిచి మరో ఉపాధినాశ్రయించటానికి పోతున్న తేజస్సు స్వరూపం వల్ల, ప్రమాణం చేత కూడా సూక్ష్మంగా ఉంటుంది. దాని నిష్క్రమణ నాడులు–రంధ్రాల ద్వారా జరగటం వలన అది సూక్ష్మాతి–సూక్ష్మమని తెలుస్తున్నది. అది స్వచ్ఛమైనది కాబట్టి నిష్క్రమణ మార్గంలో ఎట్టి అడ్డంకులు ఉన్నట్లు కనబడదు. దేహం నుండి ప్రాణం పైకి పోవటం ప్రక్కనున్న వారి కంటికీ కనబడదు.

### సూ: 4.2.10 నోపమర్దేనాతః

సూక్ష్మంగా ఉండటం వల్ల దేహాది బాధలు స్థూలశరీరాన్ని పీడించినా, సూక్ష్మశరీరం నలిగి నశించటం ఉండదు.

### సూ: 4.2.11 అస్యైవ చోపపత్తేరేష ఊష్మా

శరీరాన్ని తాకితే ఏ వేడి తగులుతుందో అది ఈ సూక్ష్మ శరీరానిదే. అందువల్ల మరణించిన తరువాత దేహం, దేహ గుణాలైన రూపాదులు ఉన్నా. ఉష్ణత ఉండదు. *"ఉష్ణ ఏవైష జీవిష్యన్ శీతో మరిష్యన్"* అన్నది శ్రుతి వాక్యం (జీవించి ఉండగా వేడిగా ఉండి, మరణించినప్పుడు ఈ శరీరం చల్లగా ఉంటుంది). అందువల్ల, స్థూల శరీరం కంటె భిన్నమైన సూక్ష్మశరీరానికే ఉష్ణత్వం అని గ్రహించాలి.

## 6. ప్రతిషేధాధికరణమ్

### సూ: 4.2.12 ప్రతిషేధాదితి చేన్న శారీరాత్

(ఇది పూర్వపక్ష సూత్రము)

నిర్గుణ బ్రహ్మ సాక్షాత్కారం చేసుకున్న ఆత్మ జ్ఞానులకు పరిపూర్ణ మోక్షప్రాప్తి కారణంగా గతి, ఉత్క్రమణ ఉండదని *"అమృతత్వం చానుపోష్య"* అని విశేషించి సూ: 4.2.7 లో చెప్పబడింది. కాని పూర్వపక్షి దానినే ప్రశ్నిస్తూ అడుగుతున్నాడు: *"అథా కామయ మనో, యో-కామో నిష్కామ, ఆప్తకామ, ఆత్మకామో భవతి న తస్య ప్రాణా ఉత్క్రామంతి బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి"* (హృ.ఉ 4.4.6). ఈ శ్రుతిలో ఎవడైతే ఏమీ కోరడో, కోరికలు లేనివాడో, వాసనారూపంలో కూడా కామం, ఆకాంక్ష లేనివాడో, పరమానందాన్ని అనుభవించాడో వాని ప్రాణాలు ఉత్క్రమించవు బ్రహ్మ స్వరూపుడైన అతడు బ్రహ్మమునే పొందుతాడు అని వినిపిస్తున్న మాట నిజమే. కాని మరో శాఖలో (మాధ్యందినులు) న *"తస్మాత్ ప్రాణా ఉత్క్రామంతి"* (వాని నుండి ప్రాణాలు ఉత్క్రమించవు అని ఇదే శ్రుతిని పఠిస్తున్నారు).

*"తస్మాత్ ప్రాణాః"* అని పంచమీ విభక్తిలో ఉన్నందు వల్ల పరిపూర్ణ మోక్షంలో దేహి (శరీరీ) సంబంధం అవుతుందికాని దేహసంబంధము కాదు. అందువల్ల దేహం నుండి ఉత్క్రమిస్తున్న ప్రాణాలు జీవునితోనే (దేహితోనే) ఉంటాయి అని అర్థం చెప్పుకోవాలి. ఈ పూర్వపక్ష సూత్రానికి ప్రత్యుత్తరం సూత్రకారులు ఇలా ఇస్తున్నారు:

### సూ: 4.2.13 స్పష్టోహ్యేకేషామ్

ఉపాసకులైన విద్వాంసులకు దేహం నుండి ఉత్క్రమణ లేదని సిద్ధాంతం. కాణ్వ శాఖీయులు *"న తస్య ప్రాణా ఉత్క్రామంతి"* అని పఠిస్తుంటే, మాధ్యందినులు దానినే *"న తస్మాత్ ప్రాణా ఉత్క్రామంతి"* అని పఠించటం జరుగుతున్నది. ఇది శాఖాంతర శ్రుతి వ్యత్యాసం. పై రెండు శ్రుతి వాక్యాల యందు ఉన్న అర్థాన్నే గ్రహిస్తూ దేహం నుండి ప్రాణోత్క్రమణ (దేహాపాదానక ఉత్క్రాంతి) అని సమన్వ యించుకోవాలి.

ఆర్తభాగుడు, యజ్ఞవల్క్యుని *"యత్రాయం పురుషో మ్రియత ఉదస్మాత్ ప్రాణాః క్రామంత్యాహో"* (బృ.ఉ 3.2.11) అని ప్రశ్నిస్తే, యాజ్ఞవల్క్యుడు *"నేతి నేతి హోవాచ"* అని చెప్పినట్లు స్పష్టంగా శ్రుతిలో వినిపిస్తున్నది. ఆర్తభాగుడు మరి ఈ పురుషుడు మరణించడు కదా? అనే సందేహం వెలిబుచ్చితే, యాజ్ఞవల్క్యుడు *"అత్రైవ సమవలీయంతే"* (అక్కడే అతని ప్రాణాలు విలీనమవుతాయి) అని చెప్పిన తరవాత *"సః ఉచ్ఛ్వయతి, ఆధ్మాయతి, ఆధ్మాతో మృతః శేతే"* (ఆ శరీరం ఉబ్బిపోతుంది. శబ్దము కూడా అయి వాడు దీర్ఘనిద్రలోకి పోతాడు –బృ.ఉ 4.4.2). అందువల్ల ప్రాణోత్క్రమణం దేహం నుండే అని గ్రహించాలి. అంతేకాదు, మరో మంత్రంలో *"చక్షుషో వా మూర్ధ్నో వాన్యేభ్యో వా శరీర దేశేభ్యస్తముత్క్రామంతం ప్రాణో–నూత్క్రామతి, ప్రాణమ నూత్క్రామంతం సర్వేప్రాణా అనూత్క్రామంతి"* (నేత్రం నుండిగాని శిరస్సునుండిగాని, ఇతర శరీర ద్వారాల నుండి గాని ఉత్క్రమిస్తున్న సందర్భం లోనే ప్రాణాలన్నీ ఆశరీరం విడిచి వెళ్లిపోతాయి –బృ.ఉ 4.4.2). ఈ విధంగా కోరికలున్న పురుషుడు నిష్క్రమిస్తాడు. ఆ తరవాత *"అథ అకామయమానః"* (ఇక ఎట్టి కోరికలు లేని వాడు) అని బ్రహ్మవేత్త విషయంలో ఉత్క్రమణ ఉండదు *"అత్ర బ్రహ్మ సమశ్నుతే"* (బ్రహ్మమును ఇక్కడనే పొందుతాడు) అని చెప్పబడింది. అందువల్ల బ్రహ్మవేత్త సర్వకర్మలను నాశనంచేసుకొని గత్యుత్క్రాంతులు లేకుండా పరబ్రహ్మములో విలీనమవుతున్నాడని గ్రహించాలి.

### సూ: 4.2.14 స్మర్యతే చ

మహాభారతంలోను బ్రహ్మజ్ఞానికి గత్యుత్క్రాంతులు లేకుండా మోక్షప్రాప్తి కలుగుతుందని ఈ విధంగా చెప్పబడింది: *"సర్వభూతాత్మ భూతస్య సమ్యగ్భూతాని పశ్యతః; దేవా అపి మార్గే ముహ్యంతి అపదస్య పదైషిణః"* (సర్వభూతములకు ఆత్మ

యైనవాడు, సర్వప్రాణులనూ బ్రహ్మ స్వరూపములుగా భావించి ఏకత్వంతో చూచే వాడూ అయిన గంతవ్యస్థానము లేని బ్రహ్మజ్ఞాని మార్గమునే కోరుకునే, దేవతలు కూడా మోహపడతారు మ.భా.శాంతి 239.23).

మోక్షమును ఆకాంక్షిస్తూ వ్యాసపుత్రుడైన శుకుడు వాయువు కన్నా శీఘ్రంగా పోయి యోగబలం చేత తన శరీరాన్ని వదలి సర్వభూతాలలో లీనమయ్యాడు అని కూడా అదే పర్వంలో చెప్పబడింది (మ.భా.శాంతి 333.20).

గతిని విశదీకరించే మరికొన్ని శ్రుతులు రాబోయే పాదంలో బ్ర.సూ 4.3.7 లో చర్చించడమైనది.

## 7. వాగాదిలయాధికరణమ్

## సూ: 4.2.15 తాని పరే తథా హ్యాహ

ఇంద్రియాదులు పరబ్రహ్మ యందే విలీనమవుతాయని శ్రుతి వల్ల తెలుస్తున్నాదని సూత్రార్థం

*"ఏవమేవాస్య పరిద్రష్టురిమాః షోడశ కలాః పురుషాయణాః పురుషం ప్రాప్యాస్తం గచ్ఛంతి"* (ప్ర.ఉ 6.5). ఈ శ్రుతి సర్వత్ర పరమాత్మనే చూచే జ్ఞానియొక్క షోడశకళలూ ఆ పరబ్రహ్మను పొంది అందులోనే లీనమవుతాయి అని చెబుతున్నది. పంచకర్మేంద్రియాలు, పాంచజ్ఞానేంద్రియాలూ, మనస్సు, పంచ భూతన్మాత్రలు, పంచవాయువులు షోడశకళలని చెప్తారు. అవి సృష్టి–స్థితి–లయల కారకుడైన బ్రహ్మ నుండి జీవుడు పొందే సంపత్తులు. తత్త్వవేత్త యొక్క షోడశకళల సముదాయమూ మోక్షప్రాప్తితో బ్రహ్మలోనే విలీనమవుతాయి. కొందరు వ్యాఖ్యాతలు, పదిహేను కళలని పృథివీ జనితములైన మనస్సును, పంచ జ్ఞానేంద్రియాలను కలిపి చెప్తారు. అందులో దోషం లేదు.

# 8. అవిభాగాధికరణమ్

## సూ: 4.2.16 అవిభాగో వచనాత్

విద్యావేత్త యొక్క షోడశకళల ప్రలయం బ్రహ్మలో నిర్విశేషంగా ఉంటుందా లేక ఏమైనా శేషంతో జరుగుతుందా? శ్రుతిలో విలీనం పూర్తిగా అయిపోతుందనే ఇలా వినిపిస్తున్నది: *"భిద్యతే తాసాం నామ రూపే పురుష ఇత్యేవం ప్రోచ్యతే స ఏషో -కలో-మృతో భవతి"* (ప్ర.ఉ 6.5) నామ—రూపములు భిన్నమయి కేవలం పురుషుడనే అంటారు. అప్పుడు అకలుడు (కళావిహీనుడు) జన్మరాహిత్యాన్ని పొందుతాడు. జ్ఞాని, ప్రళయంలో షోడశ కళల శక్తినీ దగ్ధం చేసుకుంటాడు.

## 9. తదోకోధికరణమ్

## సూ: 4.2.17 తదోకోగ్రజ్వలనం తత్ప్రకాశితద్వారో విద్యాసామర్థ్యాత్తచ్ఛేషగత్యనుస్మృతియోగాచ్చ హార్దానుగ్రహీతః శతాధికయా

జీవుని ఆయతనమైన హృదయస్థానములో పైనున్న నాడి చివర నుండి ప్రాణం పోయే సమయంలో కలిగే జ్వలనం వలన బ్రహ్మనాడి ప్రకాశవంతమవుతుంది. దహరాది సగుణోపాసనల సామర్థ్యం వల్ల హృదయంలోనున్న బ్రహ్మానుగ్రహంకలిగి, నూటఒకటవదైన బ్రహ్మనాడి ద్వారా ఉత్క్రమణ జరుగుతుంది అని సూత్రార్థం.

ఇంతకు ముందు హృదయస్థానము వరకు విద్వాంసులకు అవిద్వాంసులకు ప్రాణోత్క్రమణ సమానమే అని చెప్పబడింది. ఇప్పుడు హృదయ స్థానము నుండి ఉత్క్రమణ మార్గము వివరించబడుతున్నది.

**పూర్వపక్షి:**

*"స ఏతాః తేజోమాత్రాః సమభ్యాదదానో హృదయమేవ అను అవక్రామతి"* (తేజోమాత్రల రూపంలో ఇంద్రియాలనన్నింటిని గ్రహించి హృదయాన్ని చేరుకుం టుంది – బృ.ఉ 4.4.1). *"తస్య హైతస్య హృదయస్యాగ్రం ప్రద్యోతతే తేన ప్రద్యోతేనైష ఆత్మా నిష్క్రామతి చక్షుషో వా మూర్ధ్నోవాన్యేభ్యో వా శరీరదేశేభ్యః"* (హృదయాగ్రం ప్రద్యోతం వల్ల ఆత్మ, నేత్రం నుండి గాని, శిరస్సు నుండి గాని, మూర్ధ్ని ఇతర శరీర రంధ్రాల నుండి గాని వెళ్లిపోతుంది –బృ.ఉ 4.4.2). ఈ విషయం ముందు సూత్రం లోనూ (4.2.13) చెప్పబడింది. అయితే ఈ శ్రుతిలో విద్వాంసునకూ అవిద్వాంసునకూ ఒకే విధమైన నిష్క్రమణ ఉంటుందనే సూచిస్తున్నది. ఏ విధమైన వ్యత్యాసమునూ చూపలేదు.

**సిద్ధాంతం:**

హృదయ ప్రద్యోతనమూ దానివల్ల నాడీ కవాటము ప్రకాశింపబడటమూ అందరికీ సమానమైనా, విద్యాసామర్థ్యం వల్ల మూర్ధస్థానం నుంచే ఉపాసకులైన విద్వాంసులు నిష్క్రమిస్తారు. ఇతరులు ఇతరస్థానాలనుంచి నిర్గమిస్తారు. విద్వాంసులు ఇతరుల వలె ఏదో ఒక స్థానం నుంచి నిర్గమిస్తే విద్యోపాసనలు వ్యర్థమై ఉత్కృష్. లోకాన్ని పొందరు. దహరాది విద్యా ఉపాసకులు వారి విద్యాసంబంధితమైన ఆయతన స్థానాన్ని ధ్యానం చేస్తారు. *"తచ్ఛేషగత్యనుస్మృతి యోగాత్"* అని ఇదే సూత్రంలో చెప్ప బడింది. విద్వాంసుడు ఈ మార్గంలో ప్రయాణిస్తూ నూటఒకటవ మూర్ధన్యనాడి ద్వారా నిష్క్రమిస్తాడు. అవిద్వాంసులైన ఇతరులు ఇతరప్రదేశములనుండి నిష్క్రమిస్తారు.

ఛాందోగ్యంలో హృదయనాడి ద్వారా సూర్యరశ్మిరూప మార్గోపాసనను ప్రస్తావించిన శ్రుతి ఇలా వినబడుతున్నది. *"శతంచ ఏకాచ హృదయస్య నాడ్యః తాసాం మూర్ధానం అభినిఃసృతా ఏకా, తయా ఊర్ధ్వమాయన్ అమృతత్వమేతి, విష్వంగన్యాః ఉత్క్రమణే భవంతి"* (హృదయానికి సంబంధించి ముఖ్యంగా నూటఒక నాడులు ఉన్నాయి. వాటిలో ఒకటి శిరస్సు వైపు మీది భాగానికి వెళ్తుంది. దానిద్వారా నిష్క్రమించే వాడు అమృతత్వం పొందుతాడు – ఛా.ఉ 8.6.6). మిగిలిన నాడులుసమస్త దిక్కుల నుండి అన్ని ప్రదేశాలకు వ్యాపించి జీవి నిష్క్రమించడానికి ఉపయోగ పడతాయి. అందువల్ల ఉపాసనా సంపత్తి కలిగిన విద్వాంసులు మూర్ధన్య నాడి ద్వారానే నిష్క్రమిస్తారు అని గ్రహించాలి.

# 10. రశ్మ్యధికరణమ్

## సూ: 4.2.18 రశ్మ్యనుసారీ

ఛాందోగ్యోపనిషత్తులో దహరవిద్యా ఉపాసన సగుణబ్రహ్మ ప్రాప్తికి ప్రతిపాదించబడింది. ఆ సందర్భంలో శ్రుతి *"అథ యదిదమస్మిన్ బ్రహ్మపురే దహర పుండరీకం వేశ్మ"* (ఛా.ఉ 8.1.1) అని ప్రారంభించి హృదయనాడులకు సూర్య రశ్ములకు ఉన్న సంబంధాన్ని వివరిస్తూ తరవాత *"అథ యత్రైతత్ శరీరాత్ ఉత్క్రామతి అథైతరేవ రశ్మిభిః ఊర్ధ్వమాక్రమతే"* (ఈ శరీరం నుండి ఉత్క్రమించే సమయంలో సూర్యరశ్మల ద్వారా పైకి వెళ్లిపోతాడు). *"త యోర్ధ్వమాయన్నమృతత్వమేతి"* (అలా పైకి వెళ్లినవాడు అమృతత్వం పొందుతాడు). అంటే నూట ఒకటవ బ్రహ్మనాడి ద్వారా రశ్మలను అనుసరించి నిష్క్రమిస్తాడు అని అర్థం చెప్పుకుంటే, పగలు మరణించినా రాత్రి మరణించినా ఒకే మార్గంలో నిష్క్రమణ గతి ఉంటుందా అనే సందేహం కలుగుతుంది. అయితే ఏ విశేషమూ శ్రుతిలో నిర్ణయాత్మకంగా లేనందు వల్ల రశ్మల ననుసరించి నిష్క్రమిస్తేనే అమృతత్వసిద్ధి అని నిర్ణయించుకోవలస. వస్తుంది. అయితే స్మృతి వచనాలు కూడా భిన్నంగా ఉన్నాయి అనే సందేహానికి క్రింది సూత్రంలో సమాధానం చెప్పడమైనది.

## సూ: 4.2.19 నిశి నేతి చేన్న సంబంధస్య యావద్దేహభావిత్వాద్దర్శయతి చ

రాత్రిపూట రశ్మల సంబంధం ఉండదు అన్నట్లైతే, అది కాదు దేహం ఉన్నంత వరకు రశ్మి సంబంధం ఉంటుందని సూత్రార్థం.

పగటిపూట నాడులకు రశ్మి సంబంధం ఉంటుంది కాబట్టి పగలు మరణించినవాడు రశ్మల ద్వారా నిష్క్రమించి అమృతత్వం పొందవచ్చు కాని, రాత్రి మరణించిన వాడు రశ్మల ద్వారా ఎలా నిష్క్రమించటం జరుగుతుంది అనే ప్రశ్న ఉచితం కాదు. నాడీ–రశ్మల సంపర్కం దేహం ఉన్నంతవరకు ఉంటుంది. *"అముష్మా దాదిత్యాత్ ప్రతాయంతే తా ఆసు నాడీషు సృప్తా ఆభ్యో నాడీభ్యః ప్రతాయంతే తేముష్మిన్నాదిత్యే సృప్తాః"* (ఛా.ఉ 8.6.2). ఈ శ్రుతి, నాడులు ఆదిత్యుని నుండి విస్తరి స్తాయి, వాటికి నాడులతో సంబంధం ఉంటుంది, నాడుల ద్వారా వ్యాపించి ఆదిత్యునితో సంపర్కం కలుగజేస్తాయి అని సూచిస్తున్నది. రాత్రి సమయంలో కూడా వేసవి కాలంలో ఉష్ణత బాగా తెలుస్తుంది, కాబట్టి రాత్రిపూట రశ్మలు ప్రసరిస్తూనే ఉంటాయని గ్రహించవచ్చు *"అహరేవైతద్రాత్రౌ దధాతి"* (రాత్రి యందు ఉష్ణత సూర్యుడి వలనే కలుగుతున్నది. అదీకాక *"స యావత్ క్షిప్యేన్మనస్తావదాదిత్యం గచ్ఛతి"* అన్నది శ్రుతి వచనం (ఛా.ఉ 8.6.5) అంటే మనస్సులో ఆలోచన మెదిలినంత త్వరగా ఉపాసకుడు ఆదిత్యుణ్ణి చేరుకుంటాడు. అందువల్ల, రాత్రి–పగలు అనే విశేషం లేకుండా రశ్మల ద్వారా గతి, నిష్క్రమణ జరుగుతుంది.

### 11. దక్షిణాయనాధికరణమ్

### సూ: 4.2.20 అతశ్చాయనేఽపి దక్షిణే

విద్వాంసుడు ఉపాసన ఫలాన్ని దక్షిణాయణంలో మరణించినా పొందు తాడని సూత్రార్థం.

మృత్యువుకి కాలనిర్ణయం లేదు. అందువల్ల విద్యావేత్త దక్షిణాయణంలో మరణించినా విద్యాఫలం పొందుతాడు. మహాభారతంలో భీష్ముడు మరణం కోసం ఉత్తరాయణం కోసం నిరీక్షించాడు అని చెప్పబడింది. అందువల్ల ఉత్తరాయణంలో మరణిస్తే అది శ్రేష్ఠమని, దక్షిణాయణంలో మరణము ఉత్కృష్టఫలాన్ని ఇవ్వదు అనే భావన ఉంది. ఈ విధమైన ఆలోచన సరైనది కాదని చెప్పటానికే ఈ సూత్రం ఉద్దేశించబడింది. భీష్ముడికి స్వేచ్ఛామరణం పొందే వరం ఇవ్వబడింది. ఆ వరం తీర్చుకోటానికి భీష్ముడు ఉత్తరాయణం వరకు నిరీక్షించాడు. *"ఆపూర్యమాణ పక్షాత్ యాన్ షట్ ఉదఙ్గేతి మాసాన్"* అనే ఛాందోగ్య శ్రుతిలో ఉత్తరాయణంలో మరణం అపేక్షించదగినది అనే వినబడుతున్నది కదా? ఈ సంశయం *"అతివాహికాస్తల్లింగాత్"* అనే సూత్రంలో (బ్ర.సూ. 4.3.4) ముందు వివరంగా చర్చించబడింది.

భగవద్గీతలో కూడా *"యత్రకాలే త్వనా వృత్తి మావృత్తించైవ యోగినః, ప్రయాతా యాంతి తం కాలం వక్ష్యామి భరతర్షభ"* అనే స్మృతి వచనం ఉంది (ఓ భరతశ్రేష్ఠా! దేహత్యాగము చేసిన కర్మయోగులు ఏ మార్గంలో పోతే తిరిగి ఇహలోకముకు రాని గతిని పొందుతారో, ఏ మార్గంలో పోతే తిరిగి రావలసి వస్తుందో ఆ రెండు మార్గములను వివరిస్తాను – భ.గీ 8.23). ఈ శ్లోకంలో ఒక మార్గంలో పోయిన వారికి పునర్జన్మ ఉంటుందనే కదా అర్థం?

### సూ: 4.2.21 యోగినః ప్రతిచ స్మర్యతే స్మార్తే చైతే

పగలు–రాత్రి, ఉత్తరాయణం–దక్షిణాయణం అనే కాల విశేషాలను సూచిస్తూ యోగులకు లభించే ఫలము యొక్క వివరణ స్మృతిలో చెప్పబడింది. కాని, అవి శ్రుతిలో వినబడవు. వాటికి శ్రుతి ప్రామాణ్యం లేదు. శ్రుతిలో వినిపించే విద్యా విజ్ఞానములకు కాల విశేషాదులు వర్తించవు.

*"అగ్నిర్జ్యోతి రహః శుక్లః షణ్మాసా ఉత్తరాయణమ్"* అని *"ధూమోరాత్రిస్తథా కృష్ణః షణ్మాసా దక్షిణాయణమ్"* అని భగవద్గీతలోను గతి ప్రస్తావన ఉందికదా? (భ.గీ 8.24, 8.25)

ఈ విధంగా ఉత్తర–దక్షిణాయన కాలంలో మరణం సంభవిస్తే దాని ఫలం వేరేగా ఉంటుందని స్మృతిలో ఉంటే, అదే విధంగా దేవయాన–పితృయాన మార్గాలలో నిర్గమఫలం వేరే ఉంటుందని శ్రుతిలో కూడా వినబడుతున్నది కదా? అని పూర్వపక్షి ప్రశ్నిస్తే దానికి సమాధానం ఇలా చెప్పబడింది.

స్మృతిలో చెప్పబడిన అగ్ని మొదలగు దేవతలు, అతివాహిక దేవతలుగా (దాటించే సహాయకులుగా) వారి వారి లోకాలకు, మరణానంతరం విద్యావేత్తలై. ఉపాసకులను తీసుకొని వెళ్తారు అని సమన్వయించుకుంటే స్మృతిలో చెప్పినదీ, శ్రుతిలో వినిపిస్తున్న దానికి ఎట్టి వ్యత్యాసమూ లేదు.

# *4.*

# ఫలాధ్యాయము : తృతీయపాదము



### 1. అర్చిరాద్యధికరణమ్

## సూ: 4.3.1 అర్చిరాదినా తత్ప్రథితేః

అర్చిరాది మార్గము శ్రేష్ఠమైనదని చెప్పటం వల్ల ఆ మార్గంలోనే సగుణ బ్రహ్మోపాసకులు మరణానంతరం ప్రయాణిస్తారని సూత్రార్థం.

**పూర్వపక్షి:**

మరణానంతరం పోయే మార్గ ప్రారంభం వరకు ఉత్క్రాంతి గతి అందరికి సమానంగా ఉంటుందని ముందు చెప్పబడింది. అయితే, శ్రుతి వాక్యాల్లో వేరు వేరు మార్గాల ద్వారా ఉపాసకులైన విద్యావేత్తలు మరణానంతరం ప్రయాణం చేసి, వేరు వేరు దేవతా లోకాలను చేరుకుంటారని వినబడుతున్నది. *"అథైతైరేవ రశ్మిభిః ఊర్ధ్వ ఆక్రమతే"* అని ఒక శ్రుతిలోను (ఛా.ఉ 8.6.5), *"తేఽర్చిష మభిసంభవంతి అర్చిషో ఽహః"* అని మరో శ్రుతిలోను (బృ.ఉ 6.6.2), ఇంకా *"స ఏతం దేవయానం పంథాన మాసాద్యాగ్నిలోక మాగచ్ఛతి"* (కౌ. 13), *"యదావై పురుషోఽస్మాల్లోకాత్ ప్రైతి, స వాయు మాగచ్ఛతి"* అని బృహదారణ్యకంలోని (బృ.ఉ 5.10.1), ముండకోప నిషత్తులో *"సూర్య ద్వారేణ తే విరజాః ప్రయాంతి"* (ము.ఉ 1.2.11) అని వినబడుతు న్నది. ఈ మార్గాలన్నీ ఒక దానితో మరొకదానికి సంపర్కమూ–సంబంధమూ లేనివా? లేక ఒకే మార్గం అలా విశేషాలతో సూచింపబడిందా అనే సందేహ. కలుగుతున్నది. వేరు వేరు దేవతా ఉపాసనాంగాలు వేరు వేరు అవటం వల్ల భిన్న భిన్న మార్గాలు ఉండవచ్చని తోస్తున్నది. అయితే, రశ్మల ద్వారా నిష్క్రమించేవారికి అర్చిరాది మార్గాలలో గతి (ప్రయాణం) ఉండదు. అదీకాక, ఇన్ని మార్గాలలో ప్రయాణిస్తే ఆలోచన మెదిలినంత శీఘ్రంగా ఎలా వెళ్లటం కుదురుతుంది?

**సిద్ధాంతం:**

సగుణ బ్రహ్మోపాసకులందరూ అర్చిరాది మార్గంలోనే బ్రహ్మలోకం చేరు కుంటారు. ఆ మార్గమే విద్యావేత్తలైన ఉపాసకులందరికీ నిర్దేశించబడింది. పంచాగ్ని విద్యా ప్రకరణంలో *"యే చామీ అరణ్యే శ్రద్ధాం సత్య ముపాసతే"* అని బృహదారణ్య కోపనిషత్తులోను (బృ.ఉ 6.2.15) వినబడుతున్నది. అన్ని ఉపాసనా విద్యలకూ గమ్య స్థానము ఒక్కటే. ఉపాసనా ప్రక్రియా భేదం, విద్యాసాధనం వేరు కావొచ్చును. విద్యాభేదం ఉన్నా ఒకటే మార్గం అని గుర్తించటం వల్ల, ప్రాప్తిస్థానం ఒకటే అవటం వల్ల గతి ఒకటే అవుతుంది. ఈ విషయమే శ్రుతిలో ఇలా విన్పిస్తున్నది. *"తేషు బ్రహ్మలోకేషు పరాః పరావతో వసంతి"* (బృ.ఉ 6.2.15). దీని అర్థం ఆ బ్రహ్మలోకంలో దీర్ఘాయువును కలిగిన హిరణ్యగర్భుని–కార్య బ్రహ్మను చేరి సుదీర్ఘకాలం ఉంటారు. *"సా యా బ్రహ్మణో జితిర్యావ్యష్టిస్తాం జితిం జయతి తాం వ్యష్టిం వ్యశ్నుతే"* (సర్వత్రా జయం ఉన్నదీ, సర్వవ్యాప్తి అయిన కార్య బ్రహ్మను పొందుతారు – కౌషీ 1.4) అలాగే, *"తద్య ఏవైతం బ్రహ్మలోకం బ్రహ్మచర్యేణానువిందతి"* (ఛా.ఉ 8.4.3).

ఈ విధంగా అన్ని శ్రుతులలోను బ్రహ్మవిద్యా ఉపాసకులు బ్రహ్మలోక ప్రాప్తిని ఫలంగా పొందుతారని చెప్పటం వల్ల వారందరూ సగుణబ్రహ్మ నిలయమైన బ్రహ్మలోకాన్నే చేరుకుంటారు. రశ్మల ద్వారా మాత్రమే అని ఏ గతి నిర్దేశము ('అథైతై రేవ రశ్మిభిః') ఛాందోగ్యంలో (ఛా.ఉ 8.6.5) చెయ్యబడిందో అది అర్చిరాది మార్గంలో బ్రహ్మలోకాన్ని అతి శీఘ్రంగా చేరుకోవడమే అని అర్థం చేసుకోవాలి.రశ్మల ద్వారా సూచించిన గతి నిర్దేశంలోనూ అర్చిరాది గమనాపేక్ష ఉన్నదనే గ్రహించాలి.

దేవయాన మార్గానికి అర్చిరాది మార్గాలు పర్వాలు (మార్గ మధ్యంలో విడుదులు లాంటివి) అని కూడా ప్రస్తావించటం జరిగింది. అయితే, దేవయానం – పితృయానం అనే రెండు మార్గాలే కాకుండా, మరో మార్గ ప్రస్తావన కూడా శ్రుతిలో వినబడుతున్నది. ఈ మూడవ మార్గంలో ప్రయాణించేవారు నిష్ఠా నియమం లేని అవివేకులు; వారికి అధోలోకాలే గతి. వారు నికృష్టమైన జన్మనెత్తి క్రిమికీటకాల రూపంలో పుడుతూ–చస్తూ ఉంటారని చెప్పబడింది. *"అథైతయోః పథోర్నకతరేణచ న తానీమానీ క్షుద్రాణ్యసకృదావర్తీని భూతాని భవంతి జాయస్వ మ్రియస్వేతి ఏతత్ తృతీయ స్థానం"* (ఛా.ఉ 5.10.8).

## 2. వాయ్వధికరణమ్

### సూ: 4.3.2 వాయుమబ్దాదవిశేషవిశేషాభ్యామ్

వాయువుని సంవత్సర దేవతకు–ఆదిత్యునకు మధ్యను చేర్చుకొని గతిని నిశ్చయించుకోవాలని సూత్రార్థం.

కౌషితకంలో *"స ఏతం దేవయానం పంథాన మాపద్య అగ్నిలోకం ఆగచ్ఛతి, స వాయులోకం, స వరుణ లోకం, స ఇంద్రలోకం, స ప్రజాపతిలోకం, స బ్రహ్మ లోకం"* అని దేవయాన మార్గంలో బ్రహ్మలోకం చేరే క్రమం చెప్పబడింది. (కౌషీ 1.3). అగ్నిలోకమన్నా, అర్చిలోకమన్నా ఒక్కటే కాబట్టి సందేహం రాదు. అయితే ఈ క్రమంలో వాయులోకం ఎక్కడ ఉంటుంది? దేవయాన మార్గాన్ని వివరిస్తూ *"తేఽర్చిష మేవాభిసంభవంతి, అర్చిషోఽహః, అహ్న ఆపూర్యమాణ పక్షం, ఆపూర్యమాణ పక్షాద్యాన్ షడుదంగేతి మాసాంస్తాన్ మాసేభ్యః సంవత్సరం సంవత్సరా దాదిత్యమ్"* అని గమనక్రమం ఛాందోగ్యంలో చెప్పబడింది (ఛా.ఉ 5.10.1, 5.10.2).

ఈ సందర్భంలో సంవత్సరదేవత తరవాత ఆదిత్యుని చేరటానికి పూర్వము, వాయుదేవత నుపక్రమించి ప్రయాణం కొనసాగుతుందని నిశ్చయించుకోవాలి. శ్రుతిలో అవిశేష–విశేషాలు అంటే ఏది ముందు–ఏది వెనుక అని స్పష్టంగా లేకపోవటం వల్ల, మరో శ్రుతిని ఆశ్రయించి ఇలా నిశ్చయించుకోవటం యుక్తము. కౌషీతకంలో ఉన్న 'వాయులోకమ్' అనే శబ్దం, బృహదారణ్యకంలో ఉన్న *"యదా వై పురుషోఽస్మాల్లోకాత్ ప్రైతి స వాయుమాగచ్ఛతి, తస్మై స తత్ర విజిహీతే యథా రథ చక్రస్య ఖం తేన స ఊర్ధ్వమాక్రమతే స ఆదిత్యమాగచ్ఛతి"* (బృ.ఉ 5.10.1) శ్రుతితో కలిపి క్రమాన్ని నిశ్చయించుకోవలసి ఉంది. బృహదారణ్యకశ్రుతి ననుసరించి ఈ దేహం నుండి ఉత్క్రమించిన ఈ పురుషుడు వాయులోకం చేరుకుంటాడు. వాయు దేవత వానికి రథ చక్రం వంటి ఛిద్రం చేసి, అవకాశం కల్పిస్తే దాని ద్వారా ఆదిత్య లోకం చేరుకుంటాడు. ఈ క్రమాన్ని అనుసరించి, సంవత్సరదేవత, తరువాత వాయ. లోకం, ఆ తరవాత ఆదిత్యుని (అగ్ని) లోకం చేరుకోవటం జరుగుతుందని నిర్ణయిం చడమైనది. అయితే, ఛాందోగ్యశ్రుతిలోను–వాజసనేయ బృహదారణ్యక శ్రుతిలోను వ్యత్యాసం కనబడుతున్నది. ఛాందోగ్యశ్రుతిలో దేవలోక ప్రసక్తిలేదు. వాజసనేయ శ్రుతిలో సంవత్సర ప్రసక్తి లేదు. మాససంబంధాన్ని బట్టి సంవత్సరానికి ముందు దానిని చేర్చి, ఆ తరవాత దేవలోకం, తరువాత వాయులోకం, తరవాత ఆదిత్యాది లోకాల క్రమంలో దేవయాన మార్గం వివరించడమైనది.

## 3. తడిదధికరణమ్

### సూ: 4.3.3 తడితోఽధి వరుణః సంబంధాత్

మెరుపుల తరవాత వరుణుడు వస్తాడని సూత్రార్థం

*"ఆదిత్యాచ్చంద్రమసం చంద్రమసో విద్యుతమ్"* అని శ్రుతి (ఛా.ఉ 4.15.5). విద్యుత్–మెరుపులు (తడిత్) వస్తే వర్షసూచన. *"విద్యోతతే స్తనయతి వర్షిష్యతి"* (మెరుపులు, మేఘగర్జన తరవాత వర్షం వస్తుంది – ఛా.ఉ 7.11.1) నీటికి వరుణుడు అధిపతి. అందువల్ల నిష్క్రమణ గతిక్రమంలో వరుణదేవత తరవాత ఇంద్రుడు, ప్రజాపతి వస్తారు. అయితే, వాయువుతో మొదలైన అర్చిరాది క్రమంలో విద్యుత్తే చివరది. ఆ తరవాత ప్రారంభమవుతున్న దేవలోక మార్గంలో, మొదట వరుణదేవుని ప్రస్తావించడమైనది.

## 4. అతివాహికాధికరణమ్

### సూ: 4.3.4 అతివాహికాస్తల్లింగాత్

అర్చిరాదులు మార్గమధ్యంలో సహాయకులుగా ఉపకరించే అతివాహకులని సూచింపబడుతున్నదని సూత్రార్థం.

**పూర్వపక్షి:**

ఒక ప్రదేశం నుంచి మరోప్రదేశం వెళ్తున్న వ్యక్తికి, మార్గమధ్యంలో కొన్ని గుర్తులు చెప్పటం సామాన్యంగా లౌకిక వ్యవహారంలో జరుగుతుంది. అయితే, ఈ గుర్తులు ఎట్టి ఫలభోగానికి ఉద్దేశించినవి కావు. కాని ఆ ప్రదేశాలలో కొంతకాలం బసచేసి మళ్లీ ప్రయాణం కొనసాగిస్తే, అవి భోగాలకు ఉపకరమైన స్థానాలుగా (లోకాలుగా) అర్థం చేసుకోవచ్చు. శ్రుతిలో *"అగ్నిలోక మాగచ్ఛతి"* (కౌ 1.3) అలాగే *"మనుష్యలోకః పితృలోకో, దేవలోకః"* (బృ.ఉ 1.5.16) అని లోకశబ్దాన్ని కలిపి వినబడుతున్నది. 'అహో రాత్రేషు తే లోకేషు సజ్జంతే' అని బ్రాహ్మణభాగంలో కూడా వినబడుతున్నందు వల్ల, ఈ లోకాలు జీవులకు వాసయోగ్యమైన భోగస్థానములనే తోస్తున్నది. అందువల్ల చేతనాత్మలైన ఏదోరూపంలో మానవులో, దేవతలో ఎవరో ఈ బ్రహ్మలోక ప్రయాణీకులకు దారి చూపిస్తూ వారిగమనాన్ని సులభతరం చేస్తునట్లు భావించాలి. అర్చిరాదులకు చేతనత్వం లేదు కాబట్టి వాటికి అతివాహికత్వం కుదరదు.

**సిద్ధాంతం:**

అర్చిరాది మార్గంలో సూచించిన వాయు–విద్యుతాదులు అతివాహకులనే శ్రుతి మూలకంగా తెలుస్తున్నది: *"చంద్రమసో విద్యుతం, తత్పురుషో–మానవః స ఏతాన్ బ్రహ్మగమయతి"* అని స్పష్టంగా వినబడుతున్నది (ఛా.ఉ 4.15.5). అనగా చంద్రలోకం నుంచి విద్యుల్లోకానికి తీసుకొని వెళ్లగా అక్కడ నుంచి ఒక మనుష్యుడు కాని పురుషుడు ('అమానవః' అంటే దేవతామూర్తి కావచ్చు) విద్యావేత్తలైన ఉపాసకులను బ్రహ్మ వద్దకు చేరుస్తాడు. గమయతి అనే శబ్దంతో అతివాహకత్వం స్పష్టం అవుతున్నది.

### సూ: 4.3.5 ఉభయవ్యామోహాత్తత్సిద్ధేః

అర్చిరాది మార్గంలో బ్రహ్మలోకానికి వెళ్తున్న విద్యావేత్తలు దేహేంద్రియ సముదాయం లేకుండా, ఒక పిండరూపంలో ఉన్నందు వల్ల వారికి సహాయార్థం అర్చిరాదుల అభిమానులు, దేవతామూర్తి విశేషంతో అతివాహకులుగా వస్తారని చెప్పబడింది. లోక వ్యవహారంలో కూడా ఏ కారణం చేతనైనా శరీరంలో దృఢత్వం లేకపోతే, గమనానికి మరొకరి సహాయం పొందవలసి వస్తున్నది కదా! అందువల్ల అర్చిరాది మార్గంలో స్థిరంగా ఉండే దేవతలు వారికి సహాయకులుగా వ్యవహరిస్తారు.

ఇంద్రియ సముదాయం స్వస్థితిలో లేక పిండరూపంలో (ముద్దగా) మారటం వల్ల అవి వారి ఆధీనంలో ఉండవు. అందువల్ల వాయువు యొక్క ఆధిపత్యం ఉన్న లోకాన్ని చేరుకొన్న విద్యావేత్తను వాయువు ముందుకు నడిపిస్తాడు. అలాగే అగ్ని అధిపతిగా ఉండే లోకం దాటేవరకు అగ్నిముందుకు నడిపిస్తాడు అని అర్థం చేసుకోవలసి వస్తుంది.

### సూ: 4.3.6 విద్యుతేనైవ తతస్తచ్ఛ్రుతేః

విద్యుత్తు తరవాత అమానవ పురుషుడు వరుణ–ఇంద్రాది లోకాలు దాటించి బ్రహ్మను చేరుస్తాడు అని శ్రుతిలో వినబడుతున్నది. *"తాన్ విద్యుతాత్ పురుషో–మానవః స ఏత్య బ్రహ్మలోకం గమయతి"* (బృ.ఉ 6.2.15). ఈ శ్రుతిద్వారా వరుణాది దేవతలు సగుణబ్రహ్మోపాసకులైన విద్యావేత్తలను, ఎట్టి అడ్డంకులు లేకుండా బ్రహ్మపర్యంతం గమనంలో సహకరిస్తారు అని తెలుస్తున్నది. అయితే, విద్యుత్మార్గం దగ్గర నుండే *"అమానవః"* అనే శబ్దం వినబడుతున్నది. అంతకన్నా ముందు ప్రస్తావిం చిన అర్చిరాది మార్గ ప్రారంభంలో సహాయకులుగా ఉండే అతివాహకులు మానవ స్వరూపులు కాదు

వారు కూడా దేవతాత్మలనే భావించవలసి వస్తుంది. కాని, ఇది నిర్దిష్టంగా చెప్పటానికి శ్రుతిలో స్పష్టత లేదు.

## 5. కార్యాధికరణమ్

### సూ: 4.3.7 కార్యం బాదరిరస్య గత్యుపపత్తేః

కార్యబ్రహ్మ విషయంలోనే గతి ప్రస్తావన కుదురుతుంది కాబట్టి సగుణ బ్రహ్మమునే చేరుస్తారు అని బాదరి అభిప్రాయపడుతున్నారని సూత్రార్థం.

*"ఏతాన్ బ్రహ్మగమయతి"* అని ఉపాసకులైన విద్యావేత్తలనుద్దేశించి చెప్పింది ఏ బ్రహ్మ దగ్గరికి తీసుకొని వెళ్తున్నారో స్పష్టంగా లేదు. సగుణబ్రహ్మ లేక నిర్గుణబ్రహ్మ అనే సంశయం కల్గుతుంది. అయితే గమయతి అనే శబ్దంవల్ల సగుణరూపమైన అపర బ్రహ్మనే చేరుస్తారు అని బాదరిఋషి అభిప్రాయం వ్యక్తం చేసారు. నిర్గుణబ్రహ్మ సర్వ గతః, సర్వవ్యాపీ, సగుణబ్రహ్మ ఒక లోకానికి(ప్రదేశానికి) పరిమితమైనపరపురుషుడు. అదీకాక, సగుణబ్రహ్మ ఆ లోకానికి వెళ్లే వాళ్లందరికీ ప్రత్యగాత్మ.అందువల్ల పరబ్రహ్మ మైన నిర్గుణబ్రహ్మ విషయంలో గంతవ్యం, గంతృత్వం, గమనం అనే ప్రసక్తే ఉండదు.

### సూ: 4.3.8 విశేషితత్వాచ్చ

*"బ్రహ్మలోకాన్ గమయతి తే తేషు బ్రహ్మలోకేషు పరాః పరావతో వసంతి"* (బృ.ఉ 6.2.13) అనే శ్రుతిలో పంచాగ్నివిద్యను తెలుసుకున్నవారు, 'బ్రహ్మలోకేషు' అని బహువచనంలో చెప్పటంవల్ల అది పరబ్రహ్మ పరంగా చెప్పలేదు. అవస్థాభేదాలు అపరబ్రహ్మకే వర్తిస్తాయి. లోకం అని కార్యరూపమైన వికారానికి సంబంధించినట్ల. శ్రుతిలో వినబడడం వల్ల, ఈ గమనం అపరబ్రహ్మ పర్యంతం అనే అర్థం అవుతున్నది. దీనికి భిన్నంగా *"బ్రహ్మైవ లోక ఏష స్మామ్రాట్"* అని యాజ్ఞవల్క్య దు–జనక మహా రాజుకి ఆత్మతత్త్వాన్ని బోధించిన శ్రుతిలో పరబ్రహ్మమైన లోకము అని గౌణార్థంలో సర్వాత్మభావ లక్షణాన్ని చెప్పడం జరిగింది. అందువల్ల ఉపాసకులను తీసుకొని వెళ్లటం (నయనం) అనేది కార్యబ్రహ్మలోకమనే అర్థం చేసుకోవాలి.

### సూ: 4.3.9 సామీప్యాత్తు తద్వ్యపదేశః

ఈ సూత్రంలో 'తు' శబ్దంతో పూర్వపక్షి సంశయ నివృత్తి చేస్తున్నట్లు గ్రహించాలి. అపరబ్రహ్మ–పరబ్రహ్మ యొక్క మాయాస్వరూపం. సమీపంగా జగత్కార్య నిర్వహణార్థం ఉండేది కాబట్టి 'బ్రహ్మ' శబ్ద ప్రయోగంలో తప్పు లేదు. పరబ్రహ్మ సద్రూపంలో సమస్త భూతాలలోను ఉపాధిమూలంగా కార్యధర్మాలను నిర్వర్తిస్తుంది. అందువల్ల ఉపాసనా విద్యలో అపరబ్రహ్మనే–బ్రహ్మగా సూచిస్తారు.

**సంశయం:**

పరబ్రహ్మకు తప్ప మరెవ్వరికీ నిత్యత్వం లేదు. అందువల్ల కార్యబ్రహ్మను చేరినవాడు తిరిగి ఇహలోకం రాడు అని చెప్పటం ఎలా కుదురుతుంది? దేవయాన మార్గంలో పోయినవారికి పునరావర్తంలేదు అని పలుశ్రుతులు ఇలా సూచిస్తున్నాయి: *"ఏతేన ప్రతిపద్యమానా ఇమం మానవమావర్తం నావర్తంతే"* (ఛా.ఉ 4.15.6), *"తేషామిహ న పునరావృత్తి రస్తి"* (బృ.ఉ 6.1.18), *"తయోర్ధ్వమాయన్ అమృతత్వమేతి"* (ఛా.ఉ 8.6.6, క.ఠ 6.16). ఈ సందేహం క్రింది సూత్రంలో నివృత్తి చేయబడింది.

### సూ: 4.3.10 కార్యాత్యయే తదధ్యక్షేణ సహాతః పరమభిధానాత్

యుగాంతంలో మహాప్రళయం వచ్చినప్పుడు కార్యబ్రహ్మ లోకానికి అధ్యక్షుడైన హిరణ్యగర్భునితో సహా అక్కడ ఉన్నవారందరూ అంత కన్నా శ్రేష్ఠమైన పరబ్రహ్మ పదాన్ని పొందుతారు.

అదే పరమపదసోపానమైన నిర్గుణబ్రహ్మము. అందువల్ల, వారికి క్రమముక్తి ద్వారా అమృతత్వం సిద్ధించి పునరావృత్తి ఉండదని శ్రుతులు తెలియజేస్తున్నవి.

## సూ: 4.3.11 స్మృతేశ్చ

స్మృతిలో కూడా మహాప్రళయంలో హిరణ్యగర్భునితో సహా జగత్తు కారణ బ్రహ్మలో విలీనమవుతుందని సూచింపబడింది. *"బ్రహ్మణా సహ తే సర్వే సంప్రాప్త. ప్రతి సంచరే పరస్యాంతే కృతాత్మనః ప్రవిశంతి పరంపదమ్"* (బ్రహ్మజ్ఞానులు మాత్రము పరమాగతిని పొందుతారు. మహాప్రళయంలోనే విద్యా ఉపాసకులు కార్య బ్రహ్మతో సహా పరమపదం చేరుకుంటారు).

ఈ తరవాత కొన్ని పూర్వపక్ష సూత్రాలు ప్రతిపాదింపబడుతున్నాయి. అయితే, ముందు ప్రస్తావించిన ఐదు సూత్రాలూ (సూ. 4.3.7 నుంచి 4.3.11 వరకు) పూర్వపక్ష సూత్రాలని, ఈ తరవాత వస్తున్న మూడు సూత్రాలూ (4.3.12 నుంచి 4.3.15) సిద్ధాంత సూత్రాలని కొందరు వ్యాఖ్యాతలు అభిప్రాయం వ్యక్తం చేసారు. కాని భగవత్పాదులు, వారి శాంకరభాష్యంలో వీరి వాదనతో ఏకీభవించలేదు. వారు పూర్వపక్ష సూత్రాలుగానే వీటిని చర్చించారు.

## సూ: 4.3.12 పరం జైమినిర్ముఖ్యత్వాత్

విద్యాసాధకులకు కార్యబ్రహ్మ గమనము, జ్ఞానసాధకులకు కారణబ్రహ్మ విలీనంతో కైవల్యప్రాప్తి అని ఎలా స్థిరీకరించారు? దీనికి సమాధానంగానే ఈపూర్వపక్ష సూత్రాలను ప్రస్తావించటం జరిగింది.

జైమిన్యాచార్యులవారు *"స ఏతాన్ బ్రహ్మ గమయతి"* అనే శ్రుత్యాధారంగా, అతివాహకులు పరబ్రహ్మనే చేరుస్తారు అని అభిప్రాయపడ్డారు. బ్రహ్మశబ్దానికి పరబ్రహ్మ అన్నదే ముఖ్యార్థం. కార్యబ్రహ్మ అన్నది కేవలం గౌణార్థమే అవుతుంది. సర్వత్ర విదితమైన ముఖ్యార్థానే స్వీకరించాలి.

## సూ: 4.3.13 దర్శనాచ్చ

*"త యోర్ధ్వమాయాన్నమృతత్వమేతి"* (ఛా.ఉ 8.6.6, క.ఉ 6.1.6) అని పరబ్రహ్మ విలీనంతో మోక్షసిద్ధిని సూచిస్తున్నది. అమృతత్వం కార్యబ్రహ్మ గమనంతో ప్రాప్తించదు. *"అథయత్ర అన్యత్పశ్యతి తదల్పం తన్మర్త్యమ్"* అని వినిపిస్తున్న శ్రుతి (ఛా.ఉ 7.24.1), *"అన్యత్ర ధర్మాత్ అన్యత్ర అధర్మాత్"* (క.ఠ 2.14) అనే శ్రుతి కూడా అద్వితీయమైన పరబ్రహ్మ ప్రాప్తినే స్థిరీకరిస్తున్నవి.

## సూ: 4.3.14 న చ కార్యే ప్రతిపత్త్యభిసంధిః

*"ప్రజాపతేః సభాం వేశ్మ ప్రపద్యే"* అనే ఛాందోగ్యశ్రుతి (ఛా.ఉ 8.14.1) పరబ్రహ్మ నిలయాన్నే చేరటం సూచిస్తున్నది కాని అనిత్యమైన కార్యబ్రహ్మను కాదు.

అలాగే *"నామరూప యోర్నిర్వహితా తే యదంతరా తత్ బ్రహ్మ"* (ఛా.ఉ 8.11.1), *"యశోఽహం భవామి బ్రాహ్మణానామ్"* (ఛా.ఉ 8.14.1), *"తదపరాజితా పూర్బ్రహ్మణః ప్రభువిమితం హిరణ్మయమ్"* (ఛా.ఉ 8.4.3) అనే ఛాందోగ్యశ్రుతులు, *"న తస్య ప్రతిమాస్తి యస్య నామ మహద్యశః"* అనే శ్వేతాశ్వతర శ్రుతి (శ్వే.ఉ 4.19) విలక్షణమైన పరబ్రహ్మ గతినే విద్యోపాసకులకూ, బ్రహ్మవేత్తలకూ ఒకే విధంగా సూచిస్తున్నవి.

ఈ విధంగా ప్రస్తావించిన పై మూడు పూర్వపక్ష సూత్రాలను ఐదు సిద్ధాంత సూత్రాలతో (సూ. 4.3.7 నుంచి 4.3.11) ఖండించటమైనది.

**భాష్యకారుల విశదీకరణ:**

పరబ్రహ్మ నిత్యమూ, సర్వగతమూ, సర్వాంతరమూ, సర్వాత్మకమూ అని శ్రుతి వాక్యాలు స్పష్టం చేస్తున్నవి. *"ఆకాశవత్ సర్వగతశ్చ నిత్యః"* , *"యత్ సాక్షాత్ అపరోక్షాత్ బ్రహ్మ"* (బృ.ఉ 3.4.1), *"య ఆత్మా సర్వాంతరః"* , *"ఆత్మైవేదం సర్వమ్"* (ఛా.ఉ 7.25.2), *"బ్రహ్మైవేదం విశ్వమిదం సర్వం వరిష్ఠమ్"* (ము.ఉ 2.2.11) అందువల్ల గంతవ్యం – ఎక్కడికో పోయి పొందేది అంటూ ఉండదు. పరమాత్మ సర్వశక్తులతో కూడినదే అయినా, అందుసమస్త విశేషాలు, వికారములు నిషేధింపబడ్డాయి. *"నిష్కలం, నిష్క్రియం, శాంతం, నిరవద్యం, నిరంజనమ్"* (శ్వే.ఉ 6.19), *"అస్థూల మనణ్వ హ్రస్వమదీర్ఘమ్"* (బృ.ఉ 3.8.8), *"స బాహ్యాంతరో హ్యజః"* (బృ.ఉ 2.1.2), *"స వా ఏష మహానజ ఆత్మాఽజరోఽమరోఽమృతోఽభయో బ్రహ్మ"* (బృ.ఉ 1.4.25), *"స ఏష నేతి నేతి ఆత్మా"* (బృ.ఉ 2.9.26) ఇలా పరబ్రహ్మ యొక్క లక్షణా లను చెప్పడమైనది. త్రికాలాలలో నాశనములేని పరమాత్మ జగదుత్పత్తి–స్థితి –లయములకు కారణమైనటువంటిది. అందువల్ల సద్రూపమైన బ్రహ్మ ఒక్కటే సత్యము. తద్వికారములుగా జగత్తులో కార్యరూపములో ఉన్న సమస్తమూ అనిత్యమని మృత్ – ఘటాది దృష్టాంతములతో చెప్పడమైనది.

ఆత్మజ్ఞాని, అందరిలో ఉన్న ఆత్మ ఒక్కటే అని, అది శుద్ధమైనదీ, నిత్య మైనదని తెలుసుకుంటాడు. వానికింక సంశయాలేవీ ఉండవు. ఆకాంక్ష ఏదీ ఉండదు. భయం అంత కన్నా ఉండదు. అందువల్ల అతడు ఆప్తకాముడై, పురుషార్థములలో పొందవలసినదేదీ లేకుండా బ్రహ్మానందాన్ని అనుభవిస్తాడు. *"తత్ర కో మోహః కః శోక ఏకత్వ మనుపశ్యతః"* (ఈ.ఉ 7), *"అభయం వై జనక ప్రాప్తో–సి"* (బృ.ఉ 4.2.4), *"విద్వాన్నబిభేతి కుతశ్చన"* (తై.ఉ 2.9.1) ఇత్యాది శ్రుతులు మోహాతీతము. భయాతీతము అయిన సమ్యక్ జ్ఞానస్థితినే నిర్ధారిస్తున్నవి. *"న తస్య ప్రాణా ఉత్క్రామంతి బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి"* (బృ.ఉ 4.4.6) అనే శ్రుతి, ఆత్మ సాక్షాత్కారము పొందిన బ్రహ్మవేత్తకు గంతవ్యం–గమయిత్వం ఉండవనే పలుకుతున్నాయి.

**మీమాంసకుల వాదన:**

జీవుడు–బ్రహ్మ వేరైతేనే గతి అన్నది ఉండాలి. తాదాత్మ్ (అభేద)మైతే ఎవరికీ గంతవ్యత్వం ఉండదు. బ్రహ్మ నిరవయవి అంటే భాగాలు–అవయవాలు లేని మహా శక్తి. అందువల్ల జీవి, బ్రహ్మకు అంగం కాలేదు. జీవుడు బ్రహ్మకన్న భిన్నుడైతే, జీవుడు అణుపరిమాణం కలవాడైనా, మధ్యమపరిమాణం కలవాడైనా సర్వవ్యాపి అయినా కావాలి. ఇవేవి జీవుడి విషయంలో కుదరవు. అదీకాక, 'తత్త్వమసి' ఆ బ్రహ్మమే నీవు అనే బోధనకు విరుద్ధమవుతుంది. *"జీవో బ్రహ్మైవ"* అనే వాదన అంగీకరిస్తే జీవుడు సహజంగా సంసార ధర్మాలను ఎలా పొందుతాడు? అసంసారే కావాలి కదా?

మోక్షంకోరే పురుషుడు, ఇలా ప్రవర్తించాలి, వ్యవహరించాలి అని ఏ శాస్త్రం ఉద్బోధించలేదు. ప్రతిషిద్ధకర్మలు నరకప్రాప్తి లేకుండా చేస్తాయి. కామ్యకర్మలు స్వర్గాన్ని ప్రసాదిస్తాయి. నిత్య నైమిత్తిక కర్మలవలన పాప–పుణ్యాలు నశించి దేహాంతరంలో మిగిలేవేవీ ఉండవు. అందువల్ల, దేహపతనంతో స్వస్వరూప స్థితియైన కైవల్యం ప్రాప్తించాలి. జ్ఞాన సాధన, ఆత్మాన్వేషణం, బ్రహ్మైకత్వం అనే బోధనలు నిరాధారము లనే భావించవచ్చు.

**శంకర భగవత్పాదుల వారి ప్రత్యుత్తరం:**

సంసారం కర్మ వల్ల కలుగుతుంది. నిమిత్తమైన కర్మ లేకపోతే సంసారమే లేదు. బుద్ధిజనితమైన సంసార బంధనానికి, నిమిత్తము లేదు అని తెలుసుకోవటం అతి కష్టమైనది; ఊహకందని విషయం. అందువల్ల ప్రతి ప్రాణికి ఇతర జన్మలలో ప్రాప్తించిన కర్మఫలం అవిశేషంగా అనుభవించటం కుదరదు. ఈ జన్మలో ఉపభోగం కాని కర్మలఫలం, మరోజన్మలో మరో దేహంతో అనుభవించవలసి వస్తుంది. శ్రుతి దీనినే *"తద్య ఇహ రమణీయ చరణాః అభ్యాశో హ యత్తే రమణీయాం యోని మాపద్యేరన్.....అథ య ఇహ కపూయ చరణా అభ్యాశో హ యత్తే కాపూయాం యోని మాపద్యేరన్ శ్వయోనిం వా సూకరయోనిం వా చండాలయోనిం వా"* (ఛా. 5.10.7) అని వినిపిస్తున్నది. గౌతమ సూత్రాలలో *"కర్మణః శేషేణ"* (గౌ.సూ 11.29) అనిచెప్పటం జరిగింది. పూర్వసుకృతం హేతువై మరో మంచి జన్మరావొచ్చు, అలాగే పాపం కూడా కర్మ వల్ల పూర్తిగా దహిస్తుందని చెప్పబడదు.

నిత్య – నైమిత్తిక కర్మలకు అనుష్ఠానాన్ని అనుసరించి, మరికొన్ని ఫలాలు కూడా పొందవచ్చు. ఆపస్తంబుడు దీనినే *"తద్యథా౽మ్రే ఫలార్థే నిర్మితే ఛాయాగంధావ నూత్పద్యేతే ఏవం ధర్మం చర్యమాణ మర్థా అనూత్పద్యంతే"* (పండ్ల కోసం చెట్లునాటితే నీడ, సువాసన వచ్చినట్లు, ధర్మం ఆచరిస్తే మరికొన్ని మంచి లాభాలు చేకూరుతాయి).

కర్తృత్వ భోక్తృత్వాదులు స్వభావ సిద్ధంగా జీవులలో ఉన్నా శక్తి రూపంలో అవి అనర్థాలు కావు. వాటి వలన కలిగే ఫలమే (కార్యమే) అనర్థకం. అందువల్ల, శక్తి వలన కలిగే కార్యాన్ని జ్ఞానోపార్జనతో నివారించవచ్చు. విద్యాప్రాప్తివల్ల లభించే బ్రహ్మాత్మత్వం, ఆత్మ – పరమాత్మ ఏకత్వ భావన లేనప్పుడు మోక్షాకాంక్షే ఉండదు. *"నాన్యః పంథా విద్యతే౽యనాయ"* అనే శ్రుతి కూడా *"జ్ఞానాదేవ తు కైవల్యం"* అని నిర్ధారిస్తున్నది.

జీవుడు–పరమాత్మ కన్నా అభిన్నుడైతే జీవుడు చేసే లౌకిక వ్యాపారాలు ఎలా సాగుతాయి? దీనికి సమాధానం: మెలుకువ రాక పూర్వం స్వప్నావస్థలో పొందే అనుభవాల రీతిలో, జ్ఞానసిద్ధికి పూర్వం లోక వ్యవహారానికి లోపం ఉండదు. *"యత్ర హి ద్వైతమివ భవతి తదితర ఇతరం పశ్యతి"* (బృ.ఉ 2.4.14). అజ్ఞానావస్థలోనే తన ఆత్మ వేరు – పరమాత్మ వేరు అనే భావన ఉంటుంది. ఆత్మదర్శనం తరువాత 'సో౽హం' అనే భావన వస్తుంది. *"యత్ర తు అస్య సర్వ మాత్మైవాభూత్ తత్కేన కం పశ్యేత్"* (బృ.ఉ 2.4.14). అందువల్ల, బ్రహ్మవేత్తకు వేరే పొందదగినదేదీ ఉండదు. కాబట్టి ఏ విధమైన గతి నిర్దేశం చెయ్యబడదు.

గతి ప్రస్తావన, వైశ్వానర, పంచాగ్ని, పర్యంక విద్యాది సాధకులకు వర్తిస్తుంది. *"ప్రాణో బ్రహ్మ"* , *"కం బ్రహ్మ ఖం బ్రహ్మ"* (ఛా.ఉ 4.10.5) ఇత్యాది వివర్త రూపాలలో బ్రహ్మోపాసన చేసిన విద్యావేత్తలకు సగుణబ్రహ్మ ప్రాప్తే ఉంటుంది. *"అథ యదిదమస్మిన్ బ్రహ్మపురే దహరం పుండరీకం వేశ్మ"* (ఛా.ఉ 8.1.1) అనే శ్రుతి కూడా సగుణబ్రహ్మోపాసన నిర్దేశమే సూచిస్తున్నది.

ఇకపోతే, నిర్గుణ నిష్క్రియాది లక్షణాలతో చెప్పబడ్డ పరబ్రహ్మ, ఆత్మాన్వేషణ, ఆత్మజ్ఞానముతోనే సాక్షాత్కారమవుతుంది. ఇందులో గతి ప్రస్తావన లేదు. అవిద్యా ప్రభావితములైన దేహాభిమానము, కర్మప్రేరిత అనిత్య భోగములపై మోహము పూర్తిగా నశించి నామ–రూపాల ప్రళయం ద్వారా బ్రహ్మవేత్తలకు జన్మ రాహిత్య ప్రస్తావనే జరిగింది. *"బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి"* అని నిర్ణయాత్మకంగా చెప్పబడింది.

**సగుణ బ్రహ్మ–నిర్గుణ బ్రహ్మ ప్రసక్తి:**

కార్యబ్రహ్మ (సగుణబ్రహ్మ), కారణబ్రహ్మ (నిర్గుణ పరబ్రహ్మ) అని వేరు వేరుగా రెండు బ్రహ్మములు ఉన్నట్లు ఈ చర్చ వల్ల సూచింపబడుతున్నది. కాని, బ్రహ్మము అద్వితీయము, జగత్కారణానికి ఆ సద్రూపమే మూలము అని బోధిస్తూ, మళ్లీ ఈ సగుణబ్రహ్మ ప్రస్తావన సమంజసమా? ఈ ప్రశ్నకు భాష్యకారులు ఇలా సమాధానం ఇచ్చారు:

సన్మూలం ఒక్కటే. అదే పరబ్రహ్మము. అసంసారి, నిష్క్రియమైన పరమాత్మ వల్ల, జగద్వ్యాపారము జరగదు. నామ–రూపాదులతో ఉపాధి భేదము కల్పించి జగత్కార్య కర్తగా అపరబ్రహ్మ వ్యవహరించటం జరుగుతుంది. పరబ్రహ్మ మాయా రూపమే అపరబ్రహ్మ. అపరబ్రహ్మ సగుణోపేతము. కర్మప్రేరిత జన్మను ప్రాణులకు ప్రసాదించి, జగదైశ్వర్య స్వరూప ఫలాన్ని ఇచ్చే విభూతికల శక్తిమయుడు సగుణబ్రహ్మ. సంసారులతోను ప్రపంచంతోను అవినాభావ సంబంధమున్న సగుణబ్రహ్మ, సాపేక్ష గల విద్యోపాసకులకు గమ్యస్థానము.

## 6. అప్రతీకాలంబనాధికరణమ్

### సూ: 4.3.15 అప్రతీకాలంబనాన్నయతీతి బాదరాయణ ఉభయథాఽదోషాత్తత్క్రతుశ్చ

(అప్రతీకాలంబనాత్ + నయతీతి బాదరాయణ ఉభయథా అదోషాత్ + తత్ + క్రతుశ్చ)

ప్రతీకోపాసనలు చేసే వారు బ్రహ్మలోకం చేర్చబడరు. కార్యబ్రహ్మోపాసకులు మాత్రమే బ్రహ్మలోకం చేరుకుంటారని సూత్రార్థం.

సగుణ బ్రహ్మోపాసకు లనందరినీ అమానవ పురుషుడు బ్రహ్మలోకం చేరుస్తాడా, లేక కొందరినే చేరుస్తాడా అన్నదే సందేహంగా ఉంది. ఉపాసకులందరికి కార్యబ్రహ్మలోకానికే గతి ఉంటుందని ముందు *“అనియమః సర్వాసామ్”* అనే సూత్రంలో (బ్ర.సూ 3.3.31) చెప్పబడింది. అయితే ప్రతీకోపాసకులను తప్ప మిగతా వికారోపాసకులనందరినీ బ్రహ్మలోకానికి అమానవ పురుషుడు తీసుకొని వెళ్తాడని బాదరాయణుడు భావిస్తున్నాడు. *“తం యథా యథోపాసతే తదేవ భవతి”* అని శ్రుతి వాక్యం (బ్రహ్మను ఎలా ఉపాసిస్తే అదే పొందుతారు). బ్రహ్మక్రతువులు – బ్రహ్మనుపాసించిన వారు బ్రహ్మ యొక్క విభూతి (సంపత్తు) పొందుతారనే అర్థం చేసుకోవాలి. పంచాగ్నివిద్యా బోధన సందర్భంలో *“ఏతాన్ బ్రహ్మగమయతి”* అని *“తద్య ఇత్థం విదుః యే చామీ అరణ్యే శ్రద్ధా తప ఇత్యుపాసతే తేఽర్చిషమేవాభి సంభవంతి”* అని చెప్పబడింది. అయితే ఈ శ్రుతి వాక్యాలలో *“తద్య ఇత్థం విదుః”* (ఛా.ఉ 5.10.1) అనేది పంచాగ్నివిద్యా సాధకులకు, ఆ తరవాత *“యేచామీ అరణ్యే శ్రద్ధాం సత్యముపాసతే”* (బృ.ఉ 6.2.15) అని సూచించింది, మిగతా బ్రహ్మోపాసకు లకు అని గమనించాలి. వీరందరికీ *“ఏతాన్ బ్రహ్మ గమయతి”* అనే శబ్దం వర్తిస్తుంది. అందువల్ల, ప్రతీకోపాసన చేసే వారికి మాత్రము బ్రహ్మలోక గమనం ఉండదని నిర్ధారించబడింది.

### సూ: 4.3.16 విశేషంచ దర్శయతి

నామాది ప్రతీకోపాసనలలో ప్రాధాన్యం ప్రతీకంపైన, పేరుపైన ఉంటుంది. ఛాందోగ్యంలో సనత్కుమారుడు, నారదుడికి ఆత్మ తత్త్వాన్ని బోధించిన ప్రకరణంలో ఫల విశేషాలను వివరిస్తూ *“యావన్నామ్నోగతం తత్రాస్య కామచారో భవతి”* (ఛా.ఉ 7.1.5) అని చెప్పి, *“వాగ్వావ నామ్నో భూయసీ”* (పేరు కన్నా వాక్ గొప్పది). *“యావత్ వాచో గతం తత్రాస్య యథాకామచారో భవతి”* (వాక్కు చేరినంత వరకూ స్వేచ్ఛా సంచారం కలవాడౌతాడు). ఆ తరవాత *“మనో వావ వాచో భూయః”* (మనస్సు వాక్ కంటె గొప్పది – ఛా.ఉ 7.3.1). ఈ విధంగా ఫలవిశేషాలను ఒక క్రమంలో చెప్పడమైనది. ఈ శ్రుతి, ప్రతీకోపాసన చేసే ఆరాధకులకూ, మిగతా వికారోపాసకులకు సమానమైన ఫలప్రాప్తి ఉండదని స్పష్టం చేస్తున్నది.

# *4.*

# ఫలాధ్యాయము : చతుర్థపాదము



## 1. సంపద్యావిర్భావాధికరణమ్

### సూ: 4.4.1 సంపద్యావిర్భావః స్వేనశబ్దాత్

స్వప్రకాశమైన ఆత్మను దర్శించుకొని ఆత్మమాత్రంగానే ఆవిర్భవిస్తాడని సూత్రార్థం.

**సంశయం:**

*"ఏవమేవ ఏష సంప్రసాదో-స్మాచ్ఛరీరాత్ సముత్థాయ పరం జ్యోతి రుపసంపద్య స్వేన రూపేణ అభినిష్పద్యతే"* (ఛా.ఉ 8.12.3) అని శ్రుతిలో వినిపిస్తున్నది. అంటే ఈ శరీరాన్ని వదిలిపెట్టి వెళ్లిన ఆత్మజ్ఞాని దేవలోకాలలో ఉండే వారిలా ఏదో ఒక విశేష రూపంతో ఉంటాడా? లేక ఆత్మస్వరూపంతోనే ఉంటాడా? అనే సందేహం కలుగుతున్నది.

మోక్షం అనేది కూడా ఒక ఫలమే కాబట్టి కొత్తగా చేరిన భోగప్రదేశంలో మళ్లీ పుడుతున్నట్లు 'అభినిష్పద్యతే' అని శబ్దం వినబడడం వల్ల మరో రూపంతో ఉద్భవించాలని అర్థం చేసుకోవాలి. అయితే పూర్వావస్థలో ఉండే స్వరూపంతోనే (స్వేన రూపేణ) అని సూచింపబడుతున్నది. అందువల్ల ఏదో ఒక విశేష సంబంధం తోనే ఆత్మజ్ఞాని ఆ లోకంలో ఉండాలని తోస్తున్నది.

**సమాధానం:**

'స్వేన రూపేణ' అని స్పష్టంగా శ్రుతిలో ఉన్న కారణంగా తన స్వ స్వరూపం తోనే ఆవిర్భావమవుతుంది అని నిర్ణయించుకోవాలి. ఆత్మధర్మం పూర్వావస్థలో ఎలా ఉంటుందో, అదే ధర్మంతో కలియటం సిద్ధిస్తుంది కాని మరో రూపంలో కొత్తగా ఆవిర్భవించటం ఉండదు.

శరీరపతనానికి ముందు, శరీరపతనం తరవాత స్వరూప భేదం — విశేషం లేకపోతే మరి మోక్షఫలం ఏమిటి అనే ప్రశ్నకు సమాధానం క్రింది సూత్రంలో చెప్పబడింది.

## సూ: 4.4.2 ముక్తః ప్రతిజ్ఞానాత్

ఆత్మజ్ఞాని మరణానంతరము ముక్తుడవుతాడని శ్రుతిలో ప్రతిజ్ఞ చెయ్య బడింది. దాని ప్రకారం శరీరపతనంతో అన్ని బంధాల నుండి విముక్తుడై, శుద్ధాత్మ స్వరూపంతోనే భాసిస్తుంటాడు.

వివేకి కాని పురుషుడు, జాగ్రదవస్థలో శరీరేంద్రియ ధర్మాలను తన ఆత్మపై ఆరోపించుకుంటూ ఉంటాడు. దీనినే *"అంథో భవతి"* అని ఛాందోగ్యంలో (ఛా.ఉ 8.9.2) చెప్పబడింది. అలాగే, స్వప్నావస్థలో తను నిర్మించుకొన్న ప్రపంచంలో సుఖ– దుఃఖాలను అనుభవిస్తుంటాడు ('అపి రోదతీవ' అని చెప్పబడింది). సుషుప్త్యవస్థలో వినాశ స్థితిలో ఉన్నరీతిలో ఉంటాడు. ఈ అవస్థాత్రయాలకు అతీతుడై ఆత్మజ్ఞాని ముక్తుడవుతాడు. ఇదే విషయాన్ని *"ఏతం త్వేవ తే భూయో-ను వ్యాఖ్యాస్యామి"* అని ఛాందోగ్యంలో ప్రజాపతి దేవేంద్రుడికి ప్రతిజ్ఞ చేస్తాడు. జాగ్రత్–స్వప్న–సుషుప్త్య వస్థలకు అతీతమైన ఆత్మగురించి వివరించినదే *"అశరీరం వావ సంతం న ప్రియాప్రియే స్పృశతః"* (ఆత్మ జ్ఞానము వలన శరీరమందు అభిమానము నశించిన శేషరూపమైన ఆత్మకు ఇష్టానిష్టములు ఉండవు – ఛా.ఉ 8.12.1). ఈ ప్రకరణంలో ఉపసంహరిస్తూ *"స్వేన రూపేణ నిష్పద్యతే –స ఉత్తమః పురుషః"* అని శ్రుతి వినిపి స్తున్నది (ఛా.ఉ 8.12.2, 8.12.3). బ్రహ్మవేత్త స్వస్వరూపంతోనే ముక్తి పొందుతాడు.

*"య ఆత్మా అపహతపాప్మా"* (ఈ ఆత్మ పాపములు లేనిది, శుద్ధమైనది) అని ఆత్మ ధర్మాలను ముందే ప్రకరణ ప్రారంభంలో చెప్పడమైనది (ఛా.ఉ 8.7.1). ఆత్మదర్శనమే అమృతత్వ సిద్ధి.

## సూ: 4.4.3 ఆత్మా ప్రకరణాత్

*"పరం జ్యోతి రుపసంపద్య"* అని కార్యరూపమైన జ్యోతిని ఆత్మజ్ఞాని చేరుకు న్నట్లు శ్రుతిలో వినబడుతున్నది. అందువల్ల, ముక్తి కల్గిందని ఎలా చెప్పగలం? అగ్ని సంబంధమైన జ్యోతిః ఇత్యాదులు వికార రూపములు వాటికి నాశనం ఉంటుంది కదా? ఈ సందేహం నిరాధారం. *"య ఆత్మా అపహత పాప్మా విజరో విమృత్యుః"* అని ఆత్మకు జరా– మరణములు లేవని చెప్పిన సందర్భంలోనే 'పరం జ్యోతి' శబ్దం విన్పిస్తున్నది. అందువల్ల, భౌతికమైన అగ్నిని కాక, జ్యోతిః శబ్దాన్ని ఆత్మగాను, పరంజ్యోతిని పరమాత్మగాను గ్రహించాలి. *"తద్దేవా జ్యోతిషాం జ్యోతిః"* అని పరమాత్మ నుద్దేశిస్తూ

శ్రుతిలో చెప్పబడింది (బృ.ఉ 4.4.16). ఈ విషయం "జ్యోతిర్దర్శనాత్" అనే సూత్రంలో (బ్ర.సూ 1.3.40) విస్తారంగా చర్చింపబడింది.

## 2. అవిభాగేన దృష్టత్వాధికరణమ్

### సూ: 4.4.4 అవిభాగేన దృష్టత్వాత్

పరబ్రహ్మలో ఐక్యమై విభాగం లేకుండా ఉంటాడని సూత్రార్థం.

స్వస్వరూపంతో పరంజ్యోతిని పొందిన పురుషుడు (ఆత్మజ్ఞాని) పరమాత్మకు దగ్గరగా చేరి వేరేగా ఉంటాడని *"స తత్ర పర్యేతి"* అనే శ్రుతి (ఛా.ఉ 8.12.3) సూచిస్తున్నది. అయితే, ముక్తుడైన ఈ పురుషుడు పరమాత్మకు చేరికలో ఉంటాడా, పరమాత్మతో అవిభక్తంగా కలిసిపోతాడా?

ముక్తుడు పరబ్రహ్మలో విలీనమయి అవిభక్తంగా కలిసి పోతాడనే శ్రుతులు నిర్ధారిస్తున్నవి. *"తత్త్వమసి"* (ఛా.ఉ 6.8.7), *"అహం బ్రహ్మాస్మి"* (బృ.ఉ 1.4.10), *"యత్ర నాన్యత్ పశ్యతి"* (ఛా.ఉ 7.24.1), *"న తు తద్ద్వితీయమస్తి తతో-న్య ద్విభక్తం యత్పశ్యేత్"* (బృ.ఉ 4.3.23) అని ఆత్మైకత్వాన్నే సూచిస్తున్నవి. ఆత్మసాక్షాత్కారం చేసుకోటానికి తత్త్వజ్ఞాని ఈ విధంగా తనలో ఉన్న పరమాత్మనే ధ్యానించుకోవటం వలన, ఆ ఫలితమే పొంది బ్రహ్మైక్యత కల్గుతుంది. కఠోపనిషత్తులో నచికేతునికి చేసిన ఆత్మబోధనలో *"యథోదకం శుద్ధే శుద్ధమాసిక్తం తాదృగేవ భవతి ఏవం మునేర్విజానత ఆత్మాభవతి గౌతమ"* అని శ్రుతి వినిపిస్తున్నది (క. 2.1.15). పరిశుద్ధ మైన నీటిలో పరిశుద్ధమైన నీరు కలిస్తే పరిశుద్ధంగానే ఎలా ఉంటుందో అలాగ. బ్రహ్మవేత్త అయిన జ్ఞాని యొక్క ఆత్మ కూడా నిర్మలంగా ఉంటుంది. ఏ విధంగా సముద్రంలో కలిసిపోయిన నదులు, తమ నామ–రూపాలను కోల్పోయి విలీనమై పోతాయో, అదే విధంగా పరమాత్మలో ముక్తాత్మలు అవిభాగంగా ఐక్యమవుతాయి.

తులనాత్మక నిర్దేశం కోసం, అభిన్నమైన ఆత్మస్వరూపంలో భేదం ఆరోపిస్తూ *"స భగవః కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి స్వే మహిమ్ని"* (ఛా.ఉ 7.24.1), *"ఆత్మరతి రాత్మక్రీడః"* (ఛా.ఉ 7.25.2) ఇత్యాది శ్రుతుల్లో ఆత్మ యొక్క ఔన్నత్యాన్ని, సంపత్తునూ వివరంగా విశదీకరించటానికి బోధింపబడింది.

## 3. బ్రాహ్మాధికరణమ్

### సూ: 4.4.5 బ్రాహ్మేణ జైమినిరుపన్యాసాదిభ్యః

ముక్తుడైన పురుషుడు బ్రహ్మకు సంబంధించిన ఆత్మరూపంతోనే కలిసి పోతాడని శ్రుతిలో వినబడుతున్నట్లు జైమిన్యాచార్యుల వారు కూడా అభిప్రాయ పడుతున్నారని సూత్రార్థం.

పరబ్రహ్మకు సంబంధించినవి అపహతపాప్మత్వం (ఆత్మ నిర్మలత్వం), సత్య సంకల్పము, సత్య కామాది గుణములు. బ్రహ్మములో విలీనమైన ముక్తాత్మకు సర్వజ్ఞత ఇత్యాది పరమాత్మ ధర్మాలు సంప్రాప్తమవుతాయని జైమిన్యాచార్యులు అభిప్రాయ పడ్డారు. ఆత్మస్వరూపాన్ని నిర్దేశిస్తూ 'అపహతపాప్మా', 'సత్యకామః, సత్యసంకల్పః' అని శ్రుతిలో విన్పించిన విధంగానే ఉపన్యసించటం జరిగింది. అదే విధంగా సర్వజ్ఞుడు, సర్వేశ్వరుడు అని పరబ్రహ్మ యొక్క నిర్దేశము జరిగింది.

### సూ: 4.4.6 చితితన్మాత్రేణ తదాత్మకత్వాదిత్యౌడులోమిః

చిన్మాత్ర రూపంలో ముక్తుడు పరమాత్మను పొందుతున్నాడు కాబట్టి చిదాత్మకం అని ఔడులోమిఋషి కూడా అభిప్రాయపడుతున్నాడు. చైతన్యమే ఆత్మ యొక్క అసలు స్వరూపం. పాప్మాది గుణాలు సద్రూపమైన బ్రహ్మలో ఉండజాలవు అని బోధించే ఉద్దేశ్యంతో *"అపహతపాప్మా, సత్య సంకల్పః"* ఇత్యాది వర్ణనలు. *"ఏవం వా అరే!–యమాత్మానంతరో–బాహ్యః కృత్స్నః ప్రజ్ఞానఘన ఏవ"* (బృ.ఉ 4.5.10) ఇత్యాది శ్రుతులు ఆత్మయొక్క చైతన్యమాత్ర స్వరూపాన్ని స్థిరీకరిస్తున్నాయని గ్రహించాలి.

సత్యసంకల్పం ఇత్యాదివి ఉపాధిసంబంధంతో వస్తు స్వరూపం వల్ల వచ్చే ధర్మాలు. చైతన్యం ఆత్మకున్న మూలధర్మం. అనేక ఆకారాలు–వికారాలు బ్రహ్మకు నిషేధమని ముందు *"న స్థానతో–పి పరస్యోభయలిఙ్గం సర్వత్ర హి"* అనే సూత్రంలో (బ్ర.సూ 3.2.11) చెప్పబడింది. అందువల్ల ఆత్మరతి, ఆత్మక్రీడ ఇత్యాది వర్ణనలు స్తుతి కోసం చేసినవే. వాటిని ముఖ్యార్థంలో గ్రహించకూడదు. ముక్తుడైన జ్ఞాని పరమేశ్వరుని సకల సంపత్తులతో బ్రహ్మానందం పొంది ప్రసన్నుడౌతాడు అని తెలియజెయ్యటమే ఈ శబ్దాల ముఖ్యోద్దేశమని గ్రహించాలి. ఈ విధంగా అమృతత్వం పొందిన ముక్తాత్మ, చైతన్య రూపంతో అభిన్నంగానే ఉంటాడని ఔడులోమి అభిప్రాయపడ్డారు.

### సూ: 4.4.7 ఏవమప్యుపన్యాసాత్పూర్వభావాదవిరోధం బాదరాయణః

(ఏవమపి ఉపన్యాసాత్ + పూర్వభావాత్ + అవిరోధం బాధరాయణః)

పారమార్థికమైన చైతన్య స్వరూపాన్ని అంగీకరిస్తూ వ్యవహార దృష్టితో బ్రహ్మ సంబంధమైన ఐశ్వర్యరూపాన్ని నిరాకరించలేదు కాబట్టి ఎట్టి విరోధం లేదని బాదరాయణులవారి అభిప్రాయం.

నిర్విశేష చిదాత్మకు వ్యావహారికమైన సత్యసంకల్ప, సత్యకామాదిగుణాలకు, బ్రహ్మలోకంలో అనుభవించే ఐశ్వర్యాదులకూ ఎట్టి విరోధం ఉండదనే బాదరాయణుల వారి మతము.

## 4. సంకల్పాధికరణమ్

### సూ: 4.4.8 సంకల్పాదేవ తు తచ్ఛ్రుతేః

**పూర్వపక్షి:**

హృదయంలోపల దహరాకాశంలో ఉన్న బ్రహ్మస్వరూపాన్ని ధ్యానిస్తూ చేసిన ఉపాసన ఫలితంగా సగుణబ్రహ్మలోక ప్రాప్తిని పొందుతారని దహరవిద్యా ప్రకరణంలో చెప్పబడింది. ఆ సందర్భంలో *"స యది పితృలోక కామో భవతి సంకల్పాదేవ అస్య పితరః సముత్తిష్ఠంతి"* అని శ్రుతిలో వినబడుతున్నది (ఛా.ఉ 8.2.1). దహర విద్యో పాసకులకు కేవలం సంకల్పం వల్లే పితృలోకంలో ఉండే పితరులు లేచివచ్చి వారికి పితృలోక భోగములను ప్రసాదిస్తారు అని సూచిస్తున్నది. ముక్తుడైన ఆత్మజ్ఞాని కూడా కేవలం సంకల్పంతోనే పిత్రాదులను దర్శించుకోవటం, మిగతా సంపత్తులన. పొందటం జరుగుతుందా అనే సందేహం కలుగుతున్నది. సామాన్యంగా ఏదైనా ఫలసిద్ధి కావాలంటే సంకల్పంతోపాటు దానికితగిన సాధనసామగ్రిని సమకూర్చు కోవాలి, దానికి తగిన పురుషప్రయత్నం చెయ్యాలి కదా? ఏ విధమైన హేతువు, నిమిత్తం లేకుండా కేవలం సంకల్పంతో పిత్రాదుల లోకాలకు వెళ్లటం కుదురు తుందా (సాధ్యపడుతుందా)?

**సిద్ధాంతం:**

సంకల్పం వల్లే ఉపాసకులకు – ముక్తులకు పితృలోక దర్శనాదుల వంటి సంపత్తు ప్రాప్తమవుతుంది. సామాన్యజనుల సంకల్పానికి ముక్తులైన బ్రహ్మలోక వాసులకు చాలా తేడా ఉందికదా! ముక్తుడైన పురుషుడికి బ్రహ్మైశ్వర్య ప్రాప్తి ఉంటుంది కాబట్టి స్వేచ్ఛా సంచారాదులు సిద్ధిస్తాయి.

### సూ: 4.4.9 అత ఏవ చానన్యాధిపతిః

ముక్తునకు మరో అధిపతి ఉండదు. ఈ విషయంలో శ్రుతి ఇలా వినబడు తున్నది: *"అథ హ ఇహాత్మాన మనువిద్య వ్రజంతి ఏతాంశ్చ సత్యాన్ కామాం తేషాం సర్వేషులోకేషు కామచారో భవతి"* (ఛా.ఉ 8.1.6). దహరవిద్యోపాసన చేసి ప్రత్యగాత్మను తెలుసుకొని బ్రహ్మలోక ప్రాప్తిని పొందిన వారికి, సత్యకామాది ఐశ్వర్యములతో అన్ని లోకాలలోను స్వేచ్ఛాసంచారం, యథేచ్ఛగా తిరిగే సంపత్తు లభిస్తుంది.

## 5. అభావాధికరణమ్

### సూ: 4.4.10 అభావం బాదరిరాహ హ్యేవమ్

(బాదరిః అభావం ఏవం ఆహహి)

బాదరి కూడా ముక్తులకు శరీరేంద్రియాలు ఉండవనే చెబుతున్నాడని సూత్రార్థం.

సగుణబ్రహ్మోపాసకులకు శరీరాదులతో రూపం ఉంటుందా అనే సందేహ నివృత్తికి ఈ సూత్రం చెప్పబడింది. బాదరి, ఉపాసకులైన విద్యావేత్తలకు బ్రహ్మలోక గమనంతో శరీరేంద్రియాలు ఏవీ ఉండవనే అభిప్రాయపడుతున్నారు. మనస్సుతోనే బ్రహ్మలోకంలో అన్ని భోగాలు అనుభవిస్తారని శ్రుతిలో ఇలా వినబడుతున్నది. *"మనసా ఏతాన్ కామాన్ పశ్యన్ రమతే"* ; *"య ఏతే బ్రహ్మలోకే"* (ఛా.ఉ 8.12.5–6). అందువల్ల ముక్తులకు శరీరేంద్రియాలు ఉండవనే గ్రహించాలి.

### సూ: 4.4.11 భావం జైమినిర్వికల్పామననాత్

జైమిన్యాచార్యులవారు శ్రుతి వచనాల్లో ఏదీ నిర్ధారించకుండా వేరు వేరు వికల్పాలతో వినబడడం వల్ల ముక్తుడైన పురుషుడికి మనస్సుతో పాటు శరీరేంద్రియా లతో రూపం ఉండవచ్చునని భావిస్తున్నారు. *"స ఏకధా భవతి, త్రిధా భవతి"* (అతడు ఒక్కడైనా కావొచ్చు, ముగ్గురిలా కూడ ఉండవచ్చు – ఛా.ఉ 7.26.2). ఈ శ్రుతిని ఆధారం చేసుకొని జైమిని బ్రహ్మలోకం పొందినవారు శరీర భేదంతో ఎన్నో రూపాలు ధరించవచ్చని అభిప్రాయపడుతున్నారు. (ఈ శ్రుతి భూమావిద్య – నిర్గుణబ్రహ్మ ప్రకరణకు సంబంధించినది. దీనిని సగుణోపాసన విద్యాఫలితంగా బ్రహ్మలోకం ప్రాప్తించిన వారికి కూడా వర్తిస్తుందనే భావనతో ఇక్కడ చర్చించటం జరిగింది.

### సూ: 4.4.12 ద్వాదశాహవదుభయవిధం బాదరాయణోఽతః

బాదరాయణులవారు శరీరం ఉంటుంది–ఉండదు అని రెండు విధాల శ్రుతులలో వినబడడం వల్ల ద్వాదశాహ క్రతువులో చెప్పిన వికల్పాల రీతిలో (ఈ క్రతువులో ఋత్విక్కులు పదిహేడుగురు కన్నా ఎక్కువ గాని, ఇరవైనల్గురికి మించకుండా గాని అనే వికల్పం చెప్పబడింది) ముక్తులకు అశరీరత్వం–సశరీరత్వం రెండూ అంగీ కరించవచ్చు. సంకల్పాలు విచిత్రంగా ఉండే అవకాశం ఉంది. శరీరం కావాలను కుంటే ఏదో రూపం ధరించవచ్చు, అక్కర్లేదనుకుంటే అశరీరులుగా వ్యవహరించవచ్చు. స్వేచ్ఛాసంచారం ఉంటుంది కాబట్టి సంకల్పాన్ని బట్టి ఉభయవిధత్వం కుదురుతుందని బాదరాయణుల వారి యొక్క అభిప్రాయం.

### సూ: 4.4.13 తన్వభావే సంధ్యవదుపపత్తేః

శరీరేంద్రియాలు లేకపోయినా స్వప్నావస్థలో దృశ్యానుభూతి కలుగుతుంది. పిత్రాదులు ఎందరో జ్ఞానరూపంలో దర్శన మవుతుంటారు. అదే విధంగా మోక్షప్రాప్తి కలిగిన వారు, స్వేచ్ఛాగమనాదులు అశరీరులుగా అనుభవించవచ్చు.

### సూ: 4.4.14 భావే జాగ్రద్వత్

శరీరేంద్రియాలు ఉంటే జాగ్రదవస్థలో వారి వారి రూపాల్లో జీవితులైన పిత్రాదులు ఎలా కనబడుతుంటారో, అదే విధంగా ముక్తునకు అట్టి ఐశ్వర్యం పొందే అవకాశం కలుగుతుంది.

# 6. ప్రదీపాధికరణమ్

## సూ: 4.4.15 ప్రదీపవదావేశస్తథా హి దర్శయతి

దీపం వలె దేహాంతరములలోకి కూడా ప్రవేశం ఉంటుందనే శ్రుతి సూచిస్తున్నదని సూత్రార్థం.

**పూర్వపక్షి:**

*"భావం జైమినిర్వికల్పమనవాత్"* అని ముందు చెప్పిన సూత్రంలో (4.4.11) ముక్తుడైన పురుషునికి శరీరేంద్రియాలతో బహురూపత్వం ఉండవచ్చని చెప్పబడింది. అయితే, శరీరంతో పాటే మనస్సు–అంతఃకరణ ఉండాలి. వేరేగా ఉండబడవు. చైతన్యం సర్వవ్యాపి. అంతఃకరణతో అవిచ్ఛన్నంగా ఉండే ఆత్మకూడ ఉపాధిరూపమైన ఆ శరీరంతోనే ఉండాలి. ఇతర శరీరాలను సృజించుకున్నా వాటిల్లో ముక్తుని యొక్క మనస్సు, దానితో పాటు ఆత్మ ఉండడానికి ఆస్కారంలేదు. అందువల్ల మిగతా శరీరాలు కొయ్యబొమ్మల లాగ ఆత్మ, చైతన్యం లేకుండానే ఉండాలి.

**సిద్ధాంతం:**

దీపం ఒక్కటే అయినా, ఆ దీపం ఎన్నో దీపాలను వెలిగించే శక్తి కలిగి ఉంటుంది. ముక్తుడైన విద్యావేత్త ఒక్కడే అయినా, బ్రహ్మగమనంతో ఐశ్వర్యశక్తిని పొందిన మూలంగా అనేకత్వాన్ని పొందుతాడు. దీనినే శ్రుతిలో *"ఏకధా భవతి, త్రిధా భవతి, పంచధా భవతి, సప్తధా భవతి, నవధా భవతి"* (ఛా.ఉ 7.26.2) అని సూచించడమైనది. అందువల్ల ముక్తునికి తను సృజించుకొన్న అన్ని శరీరాలను ప్రదీప్తం చేసే సంపత్తు వస్తుందనే గృహించాలి. ఆత్మ లేని శరీరాలకు చైతన్యం ఉండదు. అయితే, మనస్సు ఆత్మ నుంచి వేరు చెయ్యబడదు. అందువల్ల ముక్తుడు తన మనస్సును – ఆత్మను అనువర్తించే మిగతా సృజించుకున్న శరీరాలను కూడా చైతన్యవంతం చేస్తాడు. ఉపాధిభేదంతో ఉండే మిగతా శరీరాలకు తనే అధిష్ఠాతగా వ్యవహరిస్తాడు. యోగశాస్త్రంలో ఈ ప్రక్రియనే యోగసాధన ద్వారా యోగులు విభిన్న శరీరాలను ధరించే శక్తిని పొందగలరని సూచింపబడింది.

## సూ: 4.4.16 స్వాప్యయసంపత్త్యోరన్యతరాపేక్షమావిష్కృతం హి

భేద విజ్ఞాన పూర్వకమైన విజ్ఞాన విశేషం ఏదీ ఉండదనే *"తత్ కేన కం విజానీయాత్"* , *"సలిల ఏకోద్రష్టా–ద్వైతో భవతి"* , *"న తు తత్ ద్వితీయమస్తి"* ఇత్యాది శ్రుతులు బోధిస్తున్నాయి. కాబట్టి ముక్తుడు అనేక శరీరాలలో ప్రవేశించటం ఎలా జరుగుతుంది? దీనికి సమాధానంగా ఈ సూత్రం చెప్పబడింది.

సుషుప్త్యవస్థకు – శరీరపతనాంతరము పొందే కైవల్యావస్థకు చాలా వ్యత్యాసం ఉంది. కొన్ని శ్రుతులు సుషుప్త్యవస్థలో జరిగే శరీర వ్యాపారాదుల్ని సూచిస్తున్నవి. *"స్వమపీతో భవతి, తస్మాదేనం స్వపితీత్యాచక్షతే"* (ఛా.ఉ 6.8.1), అలాగే *"యత్ర సుప్తో న కంచన కామం కామయతే, న కంచన స్వప్నం పశ్యతి"* (బృ.ఉ 4.3.19, ము.ఉ 5). వీటి ననుసరించి సుషుప్తిలో విశేష విజ్ఞానం ఉండదు. అది యథార్థమైన ముక్తి కాదు, గౌణమైన ముక్తి మాత్రమే. కారణం, సుషుప్తిలో బ్రహ్మైకత్వం పొందినట్లే ఉంటుంది. అది నిత్యమైనది కాదు.

కైవల్యసిద్ధిలో పొందిన అవస్థ వేరు. ఈ స్థితిలో సగుణ విద్యాసాధన యొక్క ఫలం లభించి ఎటువంటి బంధము లేకుండా యాథార్థముక్తి పొందటం జరుగు తుంది. దీనినే శ్రుతిలో *"బ్రహ్మైవసన్ బ్రహ్మాప్యేతి"* (బృ.ఉ 4.4.6) అని *"ఏతేభ్యో భూతేభ్యః సముత్థాయ తాన్యేవాను వినశ్యతి న ప్రేత్య సంజ్ఞాస్తి"* (బ్ర.ఉ 2.4.12) అని చెప్పబడింది. ఈ విధమైన ఐశ్వర్యము కైవల్యసిద్ధిని పొందిన వారికే లభిస్తుంది. అందువల్ల ప్రకరణ సందర్భంగా ఏది సుషుప్త్యవస్థలో అనుభవించే శారీరిక–మానసిక స్థితి, ఏది పారమార్థికమైన మోక్షావస్థలో పొందిన సంపత్తు అనే విషయాన్ని గ్రహించ వలసి ఉంటుంది.

## 7. జగద్వ్యాయపారాధికరణమ్

## సూ: 4.4.17 జగద్వ్యాపారవర్జం ప్రకరణాదసంనిహితత్వాచ్చ

(జగద్వ్యాపార వర్జం ప్రకరణాత్ అసంనిహితత్వాత్ చ)

జగత్ సృష్టి ఇత్యాది వ్యాపారం తప్ప మిగిలిన సంపత్తులు ముక్తులకు లభిస్తాయి. పరబ్రహ్మ అధీనంలోనే సృష్ట్యాది కార్యక్రమాలు జరుగుతాయి. దానితో ముక్తులకు ఎట్టిసంబంధం ఉండదని సూత్రార్థం.

సగుణోపాసనా ఫలంగా ముక్తులకు సమనస్కులుగా బ్రహ్మలోక గమనం ఉంటుందని చెప్పడమైంది. అయితే, ఇట్టిఫలం వల్ల ఎట్టి అడ్డంకులూలేని ఐశ్వర్యం లభిస్తుందా? లేక కొంత పరిమితమైన సంపత్తే ఉంటుందా? *"ఆప్నోతి స్వారాజ్యమ్"* (తై.ఉ 1.6), *"సర్వేఽస్మై దేవా బలిమావహంతి"* (తై.ఉ 1.5), *"తేషాం సర్వేషు లోకేషు కామచారో భవతి"* (ఛా.ఉ 8.1.6) అని శ్రుతి వాక్యాల్లో వినిపిస్తున్నది. అంటే బ్రహ్మ వేత్తకు అడ్డూ ఆపూ లేని నిరంకుశమైన ఐశ్వర్యమే ప్రాప్తించాలనే తోస్తున్నది.

ఈ సూత్రంలో ముక్తులకు సృష్ట్యాది నిర్వహణలో ఎట్టి సంబంధమూ ఉండదు. తత్ సంపత్తు పరబ్రహ్మ నియంత్రణలోనే జరుగుతుందని స్పష్టం చేయ బడింది. బ్రహ్మగమనంతో అణిమాద్యైశ్వర్య సిద్ధి బ్రహ్మోపాసకులకు కలిగే అవకాశం ఉంది. కాని, జగద్వ్యాపారంలో పరమేశ్వరునికి మాత్రమే ఎట్టి అవధులూ లేని సంపత్తూ, అధికారం ఉంటుంది.

సృష్టి–స్థితి–లయములకు పరమేశ్వరుడొక్కడే కారణరూపము. అతడే నిత్యుడూ – వేదశబ్ద వేద్యుడు అని చెప్పబడింది. మిగతా బ్రహ్మలోకవాసులైనముక్తులు, పరమేశ్వరుణ్ణి ఉపాసన ద్వారానో, ఆత్మాన్వేషణ ద్వారా జ్ఞానసాధన ద్వారానో పొందిన వారు. వారికి అణిమాద్యష్టసిద్ధులూ లభ్యమయినా, సృష్టికార్యంలో ఎట్టి ప్రమేయం (సంబంధం) ఉండదు. ముక్తులు సమనస్కులు – మనస్సు పెట్టి ఆలోచించే సామర్థ్యం కలిగినవారు. అయితే, వారి ఆలోచనలో ఏకత్వం ఉండకపోవచ్చు–వైరుధ్యం కూడా ఉండవచ్చు. అందువల్ల పరమేశ్వర సంకల్పానుసారమే జగద్వ్యాపారము సాగుతుంది. ముక్తులకు ఈ విషయంలో ఎట్టి సంబంధమూ ఉండదు.

## సూ: 4.4.18 ప్రత్యక్షోపదేశాదితి చేన్నాధికారికమండలస్థోక్తేః

(ప్రత్యక్షోపదేశాదితిచేత్ న ఆధికారికమండలస్థ ఉక్తేః)

శ్రుతిలో ప్రత్యక్షంగా ఎట్టి అడ్డంకులూలేని ఐశ్వర్యం లభిస్తుందని వినిపిస్తు న్నది. అంతే కాదు, అది ఆధికారిక సూర్యమండలంలో ఉన్న వానిని గురించి మాత్రమే చెప్పినదని సూత్రార్థం.

*"ఆప్నోతి స్వారాజ్యమ్"* అనే శ్రుతిలో బ్రహ్మవేత్త యొక్క ఐశ్వర్యం నిరంకుశ మైనది అని వినబడుతున్నది కదా, మరి అట్టి ఐశ్వర్యం పరిమితమైనదని ఎలా సమర్థించబడుతుంది? దీనికి సమాధానంగా ఇక్కడ చెప్పబడుతున్నది.

*"ఆప్నోతి స్వారాజ్యమ్"* అనే వాక్యం వివిధ ఆధికారిక మండలాలలో ఉండే అధికారుల గురించి చెప్పినది. సూర్యుడు ఆదిత్య మండలానికి అధిపతి. ఇటువంటి విశేష స్థానాలలో పరమేశ్వరాధీనమైన స్వారాజ్యప్రాప్తి గురించే ఆ సందర్భంలో ప్రస్తావించటం జరిగింది. అలా చెప్పిన వెంటనే *"ఆప్నోతి మనసస్పతిమ్"* అని వినబడుతున్నది. *"తత్సవితుర్వరేణ్యమ్ భర్గో దేవస్య ధీమహి ధియో యో నః ప్రచోదయాత్"* అనే గాయత్రీ మంత్రాన్ననుసరించి సూర్యమండలంలో ఉన్న పరమాత్మ అనే అర్థం చేసుకోవాలి. అందరి మనస్సులకు అధిపతియైన అనాదియైన ఈశ్వరుణ్ణి ఇట్టి దేవతోపాసన వలన పొందవచ్చుననే ఈ శ్రుతి సూచిస్తున్నది. అంతే కాని నిరంకుశమైన స్వారాజ్యం లభిస్తుందని కాదు. అదేవిధంగా *"వాక్పతి శ్చక్షుష్పతిః శ్రోత్రపతిర్విజ్ఞానపతిశ్చ భవతి"* (తై.ఉ 1.6) అని వినిపిస్తున్న శ్రుతిని ఆయా స్థానాలలో ఉపాసకుడు పొందే ఐశ్వర్యం పరమేశ్వరునిపై ఆధారపడే ఉంటుందని సమన్వయించు కోవాలి.

## సూ: 4.4.19 వికారావర్తి చ తథా హి స్థితిమాహ

నిత్యసిద్ధమైన పరమేశ్వరుడు వికారస్వరూపంలో ఆదిత్యాది మండలాల లోనే కాక, వికారములకు అతీతంగా (నిర్వికార స్థితిలో) తన ఉనికిని కనబరుస్తూ ఉంటాడు. *“తావానస్య మహిమా తతో జ్యాయాంశ్చ పురుషః, పాదో–స్య సర్వా భూతాని, త్రిపాదస్యాంమృతం దివి”* (ఈ సృష్టియందు పరమేశ్వరుని మహిమలో ఒకపాదం – ఒక వంతు మాత్రమే, ఈ జగత్తులో ఉంది, మిగతా మూడువంతులు స్వప్రకాశపరమాత్మలోనే ఉన్నది – ఛా.ఉ 3.11.6). అనగా సగుణరూపంలో, ఈ జగత్తులో ఒక భాగం, మూడు భాగాలు నిర్వికార స్వరూపంలో (నిర్గుణ స్థితిలోను) ఉన్నట్లు సూచిస్తున్నది. వికారరూపంలో ఉన్న ఆలంబనాలను ఎంచుకొని, వాటి ఉపాసనలు చేసిన సాధకులు సగుణరూపాన్నే పొందుతారు. వారు నిర్గుణ – నిర్వికార రూపాన్ని పొందరు.

## సూ: 4.4.20 దర్శయతశ్చైవం ప్రత్యక్షానుమానే

శ్రుతి వాక్యాలు, స్మృతి వాక్యాలూ పరమాత్మ–పరంజ్యోతిస్సు వికారాతీత మైనదనే పల్కుతున్నవి. *“న తత్ర సూర్యోభాతి న చంద్రతారకం న ఇమా విద్యుతో భాంతి కుతోఽయ మగ్నిః”* అని కఠోపనిషత్తు (క.ఉ 5.15), ముండకోపనిషత్త. (ము.ఉ 2.2.10), శ్వేతాశ్వతరోపనిషత్తు (శ్వే.ఉ 6.14) కూడా పరమాత్మ నిలయమైన దివ్యలోకంలో సూర్యచంద్రులు, నక్షత్రాలు, విద్యుత్తే భాసించనప్పుడు, అగ్నిప్రభావం ఎలా ఉంటుంది? పరమేశ్వరుడే స్వయంప్రకాశమైన తేజోరూపం. ఇదే విషయాన్ని భగవద్గీతలోను చెప్పడమైనది. *“న తత్ భాసయతే సూర్యో న శశాంకో న పావకః”* (ఆ పరంధామమును సూర్యుడుగాని, చంద్రుడుగాని, అగ్నిగాని ప్రకాశింపజేయలేవ. –భ.గీ 15.6).

## సూ: 4.4.21 భోగమాత్రసామ్యలింగాచ్చ

కార్యబ్రహ్మోపాసకులకు నిరంకుశమైన ఐశ్వర్యం ప్రాప్తించదని గౌణ రూపంలో మరికొన్ని శ్రుతులు సూచిస్తున్నవి. హిరణ్యగర్భుడు బ్రహ్మలోకం చేరిన విద్యోపాసకునితో ఇలా అంటున్నాడు: “తమాహ ఆపో వై ఖలు మీయంతే లోకో సౌ” (అమృతరూపమైన ఈ నీరు, ఈ లోకం నేను అనుభవిస్తున్నట్టే నువ్వుకూడ అనుభవించు – కౌ.ఉ 16). “స యథైతాం దేవతాం సర్వాణి భూతాని అవంతి ఏవం హ ఏవం విదం సర్వాణి భూతాని అవంతి” [ఈ దేవతను (సగుణ బ్రహ్మను) సమస్త భూతాలు ఏ విధంగా సేవిస్తాయో, ఆ దేవతోపాసన చేసిన వానిని కూడా అదేవిధంగా సేవిస్తాయి – బృ.ఉ 1.5.20 ]. “తేనో ఏతస్యై దేవతాయై సాయుజ్యం సలోకతాం జయతి” (సగుణబ్రహ్మ యొక్క సహయోగాన్ని, సలోకత్వాన్ని కూడా ఉపాసకుడు జయిస్తాడు – బృ.ఉ 1.5.23).

**ప్రశ్న:** సగుణ బ్రహ్మోపాసకులకు ప్రాప్తిస్తున్న ఐశ్వర్యం పరిమితము, అనిత్యము అని కూడా ఈ శ్రుతి వాక్యాలవల్ల అవగతం అవుతున్నది. వారికి పునరావృత్తి కూడా ఉండవచ్చు. దీని కన్నా గొప్పదైనదీ, నిరతిశయమైనదీ, శాశ్వత మైనదీ మరో ఉత్కృష్టమైన ప్రస్థానం ఏదైనా ఉందా? ఈ ప్రశ్నకు సమాధానంగా సూత్రకారులైన బాదరాయణులవారు ఈ క్రింది విధంగా విశదీకరించారు:

## సూ: 4.4.22 అనావృత్తిః శబ్దాదనావృత్తిః శబ్దాత్

పరమేశ్వరుని దివ్యధామం ఏది? ఎవరు అక్కడకు ఎలా చేరుకుంటారు? నాడులు → రశ్ములు → అర్చిరాది మార్గంలో మధ్యను వచ్చే వాయువు – చంద్రుడు ఇత్యాది దేవలోకాలు – తరవాత వచ్చే దేవయాన మార్గంలో అమానవ పురుషుడి సహాయంతో బ్రహ్మలోకం చేరుకుంటారని, ఆ బ్రహ్మలోకంలో అరము, ణ్యము అనే రెండు సముద్రాలు → ఆ తరువాత ప్రకాశిస్తున్న ద్యులోకంలో ఐర – మదీయ మనే మత్తు కలిగించే సరస్సులు → అమృతాన్ని కురిపించే అశ్వత్థ వృక్షం → బ్రహ్మ యొక్క అపరాజితమనే పేరుగల పట్టణం → అందులో ఈశ్వరనిర్మితమైన బంగారుగృహమే పరంధామ మని వేదభాగాలలో వర్ణించడమైంది. ఈ బ్రహ్మలోకం పొందిన వారికి పునరావృత్తిలేదు.

*“తయోర్ధ్వమాయన్ అమృతత్వమేతి”* (ఛా.ఉ 8.6.6, క.ఉ 2.3.16), “తేషాం న పునరావృత్తిః” (బృ.ఉ 6.2.15), “ఏతేన ప్రతిపద్యమానా ఇమం మానవ మావర్తం న ఆవర్తంతే” (ఛా.ఉ 4.15.5), *“బ్రహ్మ లోక మభిసంపద్యతే, న చ పునరావర్తతే”* (ఛా.ఉ 8.15.1). ఉపాసన విద్యల ఫలితంగా కార్యబ్రహ్మను చేరుకున్న వారికి పునరావృత్తి లేదని ఈ విధంగా శ్రుతులు నిర్ధారిస్తున్నవి. అయితే వారికి క్రమముక్తి తప్ప నిత్యసిద్ధ అమృతత్వం (సద్యోముక్తి) ఉండదనే గ్రహించాలి. ఈ విషయం *“కార్యాత్యయే తదధ్యక్షేణ సహాతః పరమభిధానాత్”* అనే సూత్రంలో (బ్ర.సూ 4.3.10) విశదీకరించడమైనది.

జ్ఞానసాధనతో సమ్యక్‌దర్శన సామర్థ్యం పొందిన బ్రహ్మవేత్తలకు (నిత్యసిద్ధ నిర్వాణపరాయణులకు) అనావృత్తి ప్రశ్నే ఉండదు. వారు అఖండాత్మ జ్ఞానసిద్ధితో నిర్విశేషంగా బంధాలన్నీ నశించగా పరబ్రహ్మములో లీనమయి కైవల్యం పొందుతారు. అదే శ్రేష్ఠతమమయిన పారమార్థిక ఫలము.

అనావృత్తిః శబ్దాత్ అనావృతిః శబ్దాత్ అని సూత్రాన్ని రెండుమాట్లు చెప్పటం శాస్త్ర పరిసమాప్తిని సూచిస్తుంది.

**ఓం తత్ సత్**

# Footnotes

★ నామరూపములతో ఉన్న అనిత్య స్వరూపము – 'శారీరుడు'. ప్రాణి రూపంలో ఉన్న అంతర్బాహ్యేంద్రియాలను చైతన్యవంతము చేసే శక్తియే – 'శరీరీ'. అదే చిదాత్మ లేదా ప్రత్యగాత్మ.